


# దర్శనీయ మహా దే(వ-వి)నాయక ఆలయాలు




గబ్బిట దుర్గాప్రసాద్

# Table of Contents

## అపూర్వ విషయం



సాహితీ బంధువులకు శ్రీ వినాయక చవితి శుభాకాంక్షలు. సరసభారతి బ్లాగ్ ఏర్పరచి దశాబ్ద కాలం దాటింది. అంతకు ముందు,ఈ కాలం లోనూ నేను రాసిన రచనలన్నీ ఒక చోటుకు చేర్చాలని మా రెండవ అబ్బాయి శర్మ తపన పడుతూ, వాడి ఉద్యోగ ధర్మాన్ని నిర్వహిస్తూ ఈ పనికి సుమారు ఆరునెలలముందు శ్రీకారం చుట్టాడు. ఎప్పటికప్పుడు నాకు పురోగతి తెలియజేస్తూ, గొప్ప విజన్ తో ముందుకు సాగుతూ మొట్టమొదటి సారిగా నారచనలు డిజిటల్ గా మార్చి, "సమస్త భక్త శిఖామణులు " శీర్షిక తో సుమారు 700 పేజీల దేశ భక్తులు, దైవభక్తులు, రాజ్యభక్తులైన మంత్రులు మొదలైన వారి గురించి నేను రాసినవన్నీ క్రోడీకరించి 75వ భారత స్వాతంత్ర్య దినోత్సవ పుణ్య సమయం లో ఆన్ లైన్ లో నాతొ అవిష్కరింప జేశాడు. వాడి దీక్షకు కృషికి విజన్ కు అభినందనలు. ఎదో రాసుకొంటూ పోవటమేకానీ, దానికింత ప్రశస్తి ఉంటుందని నాకెన్నడూ అని పించలేదు. ఇదంతా చూశాక, తప్పులు దిద్దే సమయం లో కొన్ని అసలు నేనే రాశానా అనే అనుమానం వచ్చిన సందర్భాలు కూడా ఉన్నాయి. మా వాడిని అడిగితె "నువ్వే రాశావు నాన్నా "అని జ్ఞాపకం చేశాడు. ఇది నా సాహిత్యజీవితం లో ఒక మైలు రాయి.

ఇంతటి తో ఆగలేదు. నేను వివిధ రామాయణ, భారత, భాగవత,వేద ఉపనిషత్తులు మొదలైన వాటిపై విశ్లేషణ రూపంగా రాసినవన్నీ ఒక చోటికి చేర్చి డిజిటల్ రూపమిచ్చి రెండవ భాగం గా సుమారు 450 పేజీల "వేద, ఇతిహాస, తాత్విక రచనల విశ్లేషణ"గా నామకరణం చేసి విద్యా ప్రదాత శ్రీ వినాయకుని పుట్టినరోజు శ్రీ వినాయక చవితి నాడు నాచేత ఆవిష్కరింప జేస్తున్నందుకు మహదానందంగా ఉంది. ఎన్ని సార్లు తప్పుల జల్లెడ పట్టినా, కొన్ని కంటికి కనిపించకుండా దూసుకు పోతూనే ఉన్నాయి. థ,ఠ,ఢ వంటి అక్షరాలు స్పష్టంగా రాయటానికి జంత్రిక ను నాకు ఎప్పటికప్పుడు అందించి, వేగ వంతంగా రాయటానికి తోడ్పడుతున్న మా మనవడు చి. భువన్ కు ఆశీరభినందనలు. ఇంతటి అక్షర వారాసి ని చూస్తుంటే అద్భుతమని పిస్తోంది. ఇంకా కొన్ని భాగాలు వీలువెంట డిజిటలైజ్ చేసి, వేర్వేరు శీర్షికలతో ఆవిష్కరిస్తాము. ఇదంతా మా తలిదండ్రుల ఆశీర్వాదాలు, మా ఇలవేల్పు శ్రీ సువర్చలాన్జనేయస్వామి దీవెనలు, శ్రీ సరస్వతీ మాత కరుణా కటాక్షమే అని సవినయంగా మనవి చేస్తూ, మా శ్రీమతి, మాకుటుంబ సభ్యులు అందిస్తున్న ప్రోత్సాహానికి, సాహితీ బంధుల ఆదరాభిమానాలకు అభినందనలు తెలియ జేస్తున్నాను.

గబ్బిట దుర్గాప్రసాద్ 10.09.2021

ఉయ్యూరు

## ఒక్క నిమిషం

కాలం తో పాటు సాంకేతిక మారింది. ఇంతకు ముందు తెలిసినవి అన్నీ పుస్తకం లో రాసుకొని, సమావేశాలలో అందరికి వినిపించటం అనేది అలవాటు గా జరిగేది. 2010 లో సరసభారతి ఉయ్యూరు లో ఒక సాంస్కృతిక సంస్థ గా ప్రారంభం అయ్యి సాహితీ సభలు, ఉగాది కవి సమ్మేళనం, సమావేశాలు స్థానిక గ్రంథాలయాలలో, దేవాలయాలలో జరిగేవి. సరసభారతి చిన్న పత్రిక గా రూపుదిదుకొంది.

సహజం గా సైన్స్ టచర్ అవ్వటం వల్ల ప్రతిదీ నా అవసరాలకు మేరకు నేర్చుకోవటం బాగా అలవాటు.. ఈ వయసులో కంప్యూటర్ నేర్చుకొనటం, తెలుగు లో టైపు చేయటం, నోట్స్ తయారు చెయ్యటం ఈమెయిలు రాయటం. సమాధానాలు రాయటం నేర్చుకోన్నవి. బహుశా మా తరం వాళ్ళకంటే ముందుగా కంప్యూటర్ నేర్చుకుని ఇమెయిల్ ద్వారా సాహితీ రచనలు పంపటం ప్రారంభం అయ్యింది ఈ ప్రయాణం. ఇమెయిల్ తెలుగు లో రాసినవి స్కాన్ చేసి. బంధువులకు, మిత్రులకు పంపటం అలవాటు అయ్యింది.

అప్పుడే ప్రసిద్ధ వ్యక్తులు బ్లాగ్ ద్వారా తమ రచనలను, ఆలోచనలను పంచుతున్నారు. పిల్లలు బ్లాగ్ పెడితే అందులో ఇంగ్లీష్ లో రాయటం. తెలుగు వి స్కాన్ చేసిపెట్టటం. ఇది ఒక మెట్టు. సాహితీ బంధు గ్రూప్ తయారుచేసి. సాహితీ మిత్రులకు పంపటం మలి మెట్టు.తెలుగు లో రాయాలంటే సాఫ్ట్వేర్, కీబోర్డ్ ఉండాలి ఎందుకో అది కష్టం గా అనిపించింది. అప్పుడే గూగుల్ యూనికోడ్ తో తెలుగు లో రావాలటం. చాలా బాగా ఉండటం. ఇంగ్లీష్ లో కొడితే తెలుగు లో రావటం అది ఇమెయిల్ లో, బ్లాగ్ లో చేరటం. జరిగింది మొరొక మెట్టు. రోజుకు ఒకటి, లేదా రెండు పోస్ట్స్ తో ప్రారంభం అయ్యి. ఒక అలవాటు గా మారి రోజుకు పది.. డజన్ల వరకూ వెళ్ళింది. బ్లాగ్ ప్రారంభం అయ్యిన తరువాత గ్రామీణ ప్రాంతం నుంచి తెలుగు లో ఉసూల గూడు (బ్లాగ్స్) కూడా రాస్తారు అని ప్రపంచానికి తెలిసింది. తెలుగు బ్లాగర్స్ అందరికి సరసభారతి బాగా పరిచయం. కూడలి ద్వారా దేశ విదేశాల తెలుగు వారికీ బ్లాగ్ చేరింది.

ఉదయం వార్తా పత్రికలలో వచ్చే అంశాలతో ప్రారంభం అయ్యి, సాయంత్రం ఒక పుస్తకం, కవి మీద సమీక్ష సాయంత్రం కొన్ని సార్లు రాత్రి పొద్దు పోయేవరకూ రచనలు జరిగేవి. దాదాపు 10-12 గంటలు నోట్స్ రాసుకోవటం. టైపు చెయ్యటం, ఫొటోస్ కాలేక్ట్ చెయ్యటం. ఇమెయిల్ ఇవ్వటం ఇలా... సోషల్ మీడియా విస్తరించి బ్లాగ్ లో రాసింది ఆటోమేటిక గా ఫేస్బుక్, ట్విట్టర్ మొదలైన వాటికి వెళ్ళటం. ప్రపంచమంతా తెలియటం జరిగింది ఇది మరొక్క మెట్టు. అమెరికా ప్రయాణం లో పరిచయం లేని వాళ్ళు కూడా గుర్తు పట్టి బ్లాగ్ గురించి గొప్పగా చెప్పటం విశేష అనుభూతి. బ్లాగ్ లో సాహిత్యం, పుస్తక విశ్లేషణ, సభలు. ప్రయాణాలు. రాజకీయాల, దేవాలయములు, సినిమా, నా దారి. సరసభారతి సమావేశాలు... ఇలా జీవితం లో మనకు తారసపడే ప్రతి అంశం మీద రాయటం అవి సోషల్ మీడియా లో చేరటం జరిగిపోయేవి. టైపింగ్ లో కొన్ని తప్పులు దొర్లినా మంచి మనసుతో దానిని అర్థం చేసుకొని బ్లాగ్ కి సహకరించిన వారి అందరికి ధన్యవాదాలు.

లాభాపేక్ష, వ్యాపార దృష్టి లేకుండా రాసినవి, సేకరించినవి భావి తరాలకు తెలియాలనేదే ఈ ప్రయత్నం. పుస్తకాలలో నిక్షిప్తమైన వి ఈ తరం, రేపటి తరాలకు అందించటమే ఆశయం. వికీపీడియా కూడా తమ రిఫరెన్స్ కోసం సరభారతి పోస్ట్స్ లంకె వెయ్యట జరుగుతోంది.ప్రపంచం మొబైల్స్ లోకి మారినప్పుడు అందరూ బ్లాగ్స్ ఆపేసినా సరసభారతి కొనసాగించటం విశేషం. వాట్సాప్ లో కూడా మిత్రులకు గ్రూప్ తయారుచేసి పోస్ట్ పంపటం ప్రారంభం.గత రెండు సంవత్సరాలుగా చాలా సౌకర్యం గా ఉండటం తో రోజు ఉదయం పది గంటలకు లైవ్ ప్రోగ్రాం చెయ్యటం అలవాటుగా మారింది. సరసభారతి బ్లాగ్ లో రాసి పుస్తకం రూపం లో వచ్చినవి దాదాపు. 40. అంచెలంచలు గా ఎదుగుతూ పదివేల పోస్ట్స్ కు నేను రాసినవి చేరాయి. ముద్రితం కానివి దాదాపు 500 వ్యాసాలు. పదివేల పేజీలు, యాభై లక్షల పదాలు, రెండు కోట్ల అక్షరాలూ. వీటిని సేకరించి తప్పులు సరి దిద్ది క్రమ పరిచి **అంకాత్మక** (డిజిటల్) పుస్తకాలు గా ఆవిష్కరించి మీకు అందించే ప్రయత్నమే ఇది.

ఇంతక ముందు రాసిన 'సిద్ధ యోగి పుంగవులు' పుస్తకం లో 35 మంది ప్రసిద్ధ సిద్ధులను దర్శించటం జరిగింది.
సరసభారతి మొదటి ప్రయత్నం గా **సమస్త భక్త శిఖామణులు** మనకు తెలియని 200 మందిని దర్శించటం జరుగుతోంది. కొందరి జీవిత చరిత్రలు, ప్రసిద్దుల చరిత్ర కాకుండా వారి సందేశాలు, జీవిత గమ్యాలు రాయటం జరిగింది.75 వ స్వాతంత్ర దినోత్సవ సందర్భం గా 15-08-2021 అందిచటం జరిగింది.
వినాయక చవితి కానుకగా 10-09-2021 అందిస్తున్న రెండో అంకాత్మక (డిజిటల్) పుస్తకం. ఇది పురాణ, ఇతిహాస, వేద, ఉపనిషత్ విషయాల మీద వివిధ రచయితలు రాసిన పుస్తకాలు చదివి అప్పటికప్పుడు సరసభారతి బ్లాగ్ లో రాసిన సమీక్ష సమాహారం

మూడవ పుస్తకం : శ్రీ ప్లవ నామ సంవత్సరం దసరా 15-10-2021 శుక్రవారం "దర్శనీయ మహాదే(వ-వి)నాయక ఆలయాలు" ఆవిష్కరణ

# గ్రంథకర్త పరిచయం

## దర్శనీయ మహాదే(వ-వి)నాయక ఆలయాలు



| | |
|---|---|
| **పేరు** | **గబ్బిట దుర్గాప్రసాద్** |
| **జననం** | **27-6-1940 ఉయ్యూరు కృష్ణాజిల్లా** |
| **తలిదండ్రులు** | **గబ్బిట భవానమ్మ, మృత్యుంజయ శాస్త్రి** |
| **భార్య** | **ప్రభావతి** |
| **విద్య** | **ఎం ఏ, తెలుగు, బి.ఎస్ సి. బి.ఎడ్.** |
| **ఉద్యోగం** | **ఫిజకల్ సైన్స్ టీచర్, పదానోపాధ్యాయుడు -కృష్ణా జిల్లా పరిషత్ (1963-1998)** |
| సంతానం | గబ్బిట మృత్యుంజయ శాస్త్రి, సమత సంకల్ప్, భువన్ సాయి తేజ<br>లక్ష్మీ నరసింహ శర్మ, ఇందిర శ్రీ హర్ష సాయి, హర్షి తాంజని<br>నాగ గోపాల కృష్ణ మూర్తి, రాణి గౌతమ శ్రీ చరణ్, రమ్య<br>వెంకట రమణ, మహేశ్వరి<br>కోమలి విజయలక్ష్మి, సాంబావధాని శ్రీకేత్, ఆశుతోష్, పీయూష్ |
| స్వీయ రచనలు | 1 ఆంద్ర వేద శాస్త్ర విద్యాలంకారులు 2 జనపేమన 3 దర్శనీయ దేవాలయాలు 4 శ్రీ హనుమత్ కథా నిధి 5 శ్రీ ఆంజనేయ స్వామి మహాత్మ్యం 6 సిద్ధ యోగిపుంగవులు 7 మహిళా మాణిక్యాలు 8 పూర్వాంగ్ల కవుల ముచ్చట్లు 9 దర్శనీయ దైవ క్షేత్రాలు 10 గీర్వాణ కవుల కవితా గీర్వాణం (3 భాగాలు) 13 దర్శనీయ ఆంజనేయ దేవాలయాలు (2భాగాలు) 15 కేమోటాలాజి పిత డా.కొలాచల సీతారామయ్య 16 దైవ చిత్తం 17 బ్రహ్మశ్రీ మద్దులపల్లి' శాస్త్రి గారి శతజయంతి కరదీపిక 18 ఆధునిక ప్రపంచ నిర్మాతలు - జీవితాలలో చీకటి వెలుగులు 19 షార్లెట్ సాహితీ మైత్రీ బంధం 20 అణుశాస్త్ర వేత్త డా.ఆకునూరి వెంకట రామయ్య 21 ప్రయోగాత్మక కాంతి శాస్త్ర పరిశోధన పిత డా పుచ్చా వెంకటేశ్వర్లు 22 ఊసుల్లో ఉయ్యూరు 23 సోమనాథ్ నుంచి కాశీ విశ్వనాథ్ దాకా 24 ఆధునిక ఆంద్ర శాస్త్ర రత్న మాణిక్యాలు 25 వ్యాఖ్యాన చక్రవర్తి కోలాచలం మల్లినాథ సూరి 26 విదేశీ సంస్కృత విద్వాంసులు. |
| సంపాదకత్వం | సరసభారతి ప్రచురించిన పుస్తకాలు 1 జ్యోతిస్సంశ్లేషణం 2 ఉయ్యూరు ఊసులు 3 నవకవితా వసంతం 4 మా అక్కయ్య 5 "ఆదిత్య "హృదయం" 6 త్యాగి పే"రెడీలు" 7 శ్రీరామవాణి 8 మా అన్నయ్య 9 శ్రీ సువర్చలా వాయు నందన శతకం 10 శ్రీ సువర్చలా మారుతి శతకం 11 శ్రీ సువర్చలేశ్వర శతకం 12 వసుధైక కుటుంబం 13 Nuclear Scientist Dr.Akunuri Ramayya 14 సాహితీ స్రవంతి (సాహితీ మండలి తరపున |
| అంకాత్మక | 1 సమస్త భక్త శిఖామణులు 2. వేద, ఇతిహాస, తాత్విక రచనల విశ్లేషణ 3. దర్శనీయ మహాదే(వ-వి)నాయక ఆలయాలు |

## కృష్ణా జిల్లా

# 1 శ్రీ మల్లికార్జున దేవాలయం విజయవాడ



కృష్ణా జిల్లా విజయవాడలో పవిత్ర కృష్ణా నదీ తీరం లో ఇంద్రకీలాద్రి పై కొలువున్న శ్రీ మల్లికార్జున దేవాలయం సుప్రసిద్ధమైనది, దేవతల కోరిక లనుసరించి దుర్గా దేవి మహిషాసుర మర్దిని రూపం లో ఈ కొండపై వెలసింది, స్వర్ణ కాంతులతో వెలిగే అమ్మవారిని కనకదుర్గ గా ఆరాధిస్తారు, ఇక్కడే అమ్మవారి సమక్షం లో పరమేశ్వరుని కూడా కొలువుండేట్లు చేయాలని బ్రహ్మ దేవుడు సంకల్పించి ఇక్కడ శతాశ్వ మేధ యాగాన్ని చేశాడు,. మహా శివుడు బ్రాహ్మ భక్తికి సంతోషించి జ్యోతిర్లింగ స్వరూపునిగా ప్రత్యక్షమై దర్శన మిచ్చాడు, ఈ జ్యోతిర్లింగాన్ని బ్రహ్మ మల్లికా పుష్పాలతో భక్తిగా పూజించాడు, కనుక ఈ జ్యోతిర్లింగానికి మల్లికార్జునుడు అని మల్లేశుడు.అని పేరు,, బ్రహ్మ నిశ్చల భక్తికి ప్రీతి చెంది బ్రాహ్మలోకానికి అధిపతిని చేశాడు పరమేశ్వరుడు. ఈ కొండమీడనే బ్రహ్మ దుర్గా మల్లెశ్వరస్వాముల పవిత్ర కళ్యాణ మహోత్సవాన్ని మొదటి సారిగా జరిపించాడు, అప్పటినుంచి ఆ సంప్రదాయం ఇప్పటిదాకా కొనసాగుతూనే ఉంది,

శ్రీ కనకదుర్గ వెలసిన స్థలానికి ఉత్తరం గా కొంచెం దిగువ భాగం లో మల్లికార్జున స్వామి వెలిశాడు, బ్రహ్మేన్ద్రాది దేవతాలందరూ ఇక్కడి మల్లికార్జున స్వామిని అర్చించారు, కలియుగం లో అగస్త్యమహర్షి ఇక్కడికి వచ్చి స్వామిని దర్శించి మల్లేశునికి "జయ సేనుడు "అనే పేరుతొ అర్చన చేశాడని ఐతిహ్యం, కాలప్రభావం లో మల్లేశ జ్యోతిర్లింగం అంతర్నిహితమైంది, అప్పుడు శ్రీ ఆది శంకరాచార్య స్వామి ఇప్పుడున్న చోటనే మల్లేశ్వర లింగాన్ని మళ్ళీ ప్రతిష్టించారు, మల్లికార్జునుడు మహా మహిమాన్వితుడైనా ఈ క్షేత్రం కనకదుర్గా క్షేత్రం గానే పేరు పొందింది, లేడీస్ ఫస్ట్

మాత్రమె కాకుండా ఫాస్ట్ కూడా కదా, దేవుళ్ళకైనా ఇది తప్పదు.దేవాలయం ఎత్తైన గోపురం తోఉంటుంది, ఆద్దాల భవనం ఇక్కడిప్రత్యేకత, శివరాత్రి దసరా ఉత్సవాలు, మాఘమాసం లో కళ్యాణ మహోత్సవాలు చూడ దగినవి, అమ్మవారి తెప్పోత్సవం కమనీయం రమణీయం, ఈ ఆలయం నుండి విజయవాడ పట్టణశోభ దర్శించవచ్చు. రైల్వే బ్రిడ్జిలు, కృష్ణానదీ ప్రవాహ సోయగాలు కను విందు చేస్తాయి,

ఇంద్ర కీలాద్రి పై కనకదుర్గా దేవి వెలసిన తర్వాత సతీ వియోగాన్ని భరించలేని సదాశివుడు ఇక్కడికొచ్చి అమ్మవారికి ఉత్తరాన కింద భాగం లో వెలిశాడని మరో కద ఉన్నది, కనుక ఈ క్షేత్రం శ్రీ దుర్గా మల్లేశ్వర క్షేత్రమైంది, అమ్మవారి మహిమలతో బాటు అయ్యవారి మహిమలూ బాగా ప్రచారం లో ఉన్నాయి, ఈ మహిమాన్విత విషయాల శాసనాలు కూడా లభిస్తున్నాయి, అందులో "పల్లకేతు భూపాలుడు "వేయించిన శాసనం లో మల్లేశ్వరమహిమలను తెలియ జేసే రెండు సంఘటనలున్నాయి,

ద్వాపర యుగం లో అర్జునుడు పాశు పతాస్త్రం కోసం ఇక్కడ ఇంద్రకీలాద్రిపై తపస్సు చేశాడని, త్రిసంధ్యలలోక్రిష్ణవేణీ నదీ స్నానం చేసి స్వామిని అర్చించాడని, దానికి పార్వతీ పరమేశ్వరులు తృప్తి చెంది ప్రత్యక్షమై పార్ధునికి "విజయుడు "అనే సార్ధక నామం అనుగ్రహించారని కధనం, అందుకే ఇది "విజయ వాటిక "అయింది తర్వాతవిజయవాడ అయింది, శివుడు పాండవ మధ్యముని శౌర్య పరాక్రమాలను కిరాత వేషం లో పరీక్షించి, మెచ్చి పాశుపతాస్త్రం "ప్రసాదించాడు, కృతజ్ఞతగా కిరీటి ఇంద్రకీలాద్రి దక్షిణ భాగం లో ఒక శివలింగాన్ని ప్రతిష్టించి పూజించాడు అదే "విజయేశ్వర స్వామి "గా ప్రసిద్ధి చెందింది, విజయేశ్వర స్వామి చెంత ఉన్న అమ్మవారు "బ్రహ్మ స్త్రీశ్వరీ దేవి ", ఇక్కడ మాఘ మాసం లోచేసే " అరుణ పారాయణ ".కు భక్తులు విశేష సంఖ్యలో హాజరౌతారు,

## 2 శ్రీదుర్గా నాగేశ్వర స్వామి దేవాలయం పెదకళ్ళేపల్లి

కృష్ణా జిల్లా మోపిదేవి మండలం పెదకళ్ళేపల్లి లో పవిత్ర క్రిష్ణానదీ తీరాన శ్రీ నాగేశ్వర స్వామి దేవాలయం ఉంది, చల్లపల్లికి 10కిలోమీటర్లు, మచిలీపట్నానికి 30కిలో మీటర్ల దూరం, కదళీపురం లేక కదళీ క్షేత్రం అంటారు దీనికీ కాశీ కి చాలా పోలికలు ఉండటం చేత దక్షిణ కాశి అనికూడా అంటారు, కృష్ణానది ఇక్కడ కాశీలో గంగానది లాగా ఉత్తర వాహిని, అక్కడ ఉన్న కాల భైరవుడు ఇక్కడా ఉన్నాడు, ఇక్కడి క్షేత్ర పాలకుడు మదన గోపాలుడు,

ఈ ఆలయాన్ని క్రీ శ.1292లో సోమ శివా చార్యుడు అనే భక్తుడు నిర్మించాడు, అప్పటి నుండి నిత్య కల్యాణం పచ్చ తోరణం గా అభి వృద్ధి చెందుతోంది, అయన విగ్రహం కూడా ఉన్నది, తర్వాత చల్లపల్లి జమీందారులు దీని పోశాకులుగా ఉన్నారు,, కడలి అంటే సముద్రానికి దగ్గరగా ఉన్న పల్లె కనుక కడలి పల్లె అనేవారు. అదే కళ్ళేపల్లి అయింది, స్థానిక అతిహ్యం ప్రకారం ఎనిమిది మంది సర్ప రాజులు విధి వశాన శాపగ్రస్తులై, శాప విముక్తికోసం నాలుగు వైపులా కదళీ వనాలు అంటే అరటి తోటలు పెంచి శివుడిని నిశ్చలభక్తితో పూజించారు, వారి భక్తికి మెచ్చి ప్రత్యక్షమైన పరమ శివుడు కదళీ వనాల మధ్య తనను పూజించారు కనుక ఈ క్షేత్రం "కదళీ పురం "పేరు తో పిలువబడు తుందని అనుగ్రహించాడు, ఆలయానికి దక్షిణాన "నాగ కుండం "అనే సరస్సు ఉన్నది, పుణ్య తీర్ధాలన్నీ దీనిలో కలసి ఉండటం చేత దీనికి "పరికర్ని కా తీర్ధం "అనే పేరొచ్చింది, స్వామి స్వయంభు, స్పాటిక లింగం, అయిదు అంతస్తుల రాజ గోపురం ఉన్నది, స్వామి గర్భాలయం లో పల్లం లోనే ఉంటాడు, స్వామిని పైకి లేపి ప్రతిష్ట



చేద్దామని ప్రయత్నిస్తే అడుగున పెను శిలా వేదిక ఉండటం తో ఆ ప్రయత్నం విరమించారు, అమ్మవారు దుర్గాదేవి, అమ్మవారిని "సిద్దేశ్వరి"అంటారు, కోరిన కోర్కెలు తీర్చే దుర్గా నాగేశ్వర స్వామి ఈ ప్రాంత జనుల అభీష్ట దైవం,

ఆలయం దక్షిణ భాగాన రెండు మీటర్ల ఎత్తున ఉన్న శిలాస్తంభాన్ని "సత్య స్థంభం "అంటారు, దీనిపై "బుద్ధం శరణం గచ్చామి సంఘం శరణం గచ్చామి ధమ్మం శరణం గచ్చామి "అని రాయ బడి ఉంది, ఈ స్థంభం మొదట్లో క్షేత్ర రూపుడైన కర్కోటక సర్ప రాజు ప్రతిస్తింప బడి ఉంటాడు, ఈ స్థంభం చుట్టూప్రదక్షినం చేసి నిలుచున్నా వారి నోటి నుండి అసత్యం వెలువడదు అని విశ్వాసం, దీని వెనుక ఒక కద ఉంది, పూర్వం వైశ్య సోదరులు డబ్బుకోసం తగాదా పడ్డారు, అందులో ఒకాయన ఒక కర్రలో తను సోదరుడి నుంచి దోచుకొన్న విలువైన వజ్రాలు రత్నాలు మొదలైనవి దాచి తాను నేరం చేయలేదని బుకాయించాడు, అప్పుడు రెండవ వాడు అతన్ని ఇక్కడికి తీసుకొచ్చి అబద్ధం ఆడలేదని శపథం చేయమన్నాడు, వాడు చేశాడు, ఇంతలో ఆ సత్య స్థంభం ఒరిగి వాడికర్ర మీద పడి కర్ర విరిగి అందులో దాచిన విలువైనవన్నీ బయట పడ్డాయి. అప్పటినుంచి ఎవరూ అక్కడ నిల్చుని అబద్ధం చెప్పరు, దీనికి ప్రదక్షిణ చేసిన తర్వాతే శ్రీ నాగేశ్వర స్వామిని దర్శిస్తారు, ఆలయం గోడలపై పంచముఖ గణేశ్వరుడు సింహాసనం పై కూర్చున్న భంగిమలో కనిపించి ఆశ్చర్య పరుస్తాడు, ఇది అరుదైన విగ్రహం గా భావిస్తారు,

ఆలయం లో అమ్మవారివి, అయ్యవారివి ఉత్సవాలను ఘనంగా నిర్వహిస్తారు, మహాశివరాత్రి నాడు స్వామి వారి కల్యాణోత్సవం రదోత్సవంకన్నుల పండువుగా నిర్వహిస్తారు, అప్పుడు వెలిగించే ఇక్కడి జగజ్జ్యోతి విశేషమైనది,. ఉత్తరాన శ్రీ చంద్ర మౌళీశ్వరస్వామి ఆలయం ఉన్నది, ఓంకార సమేత చంద్ర మౌళీశ్వర స్వామిస్వామి అంతరాలయం లో ఎడమవైపు పార్వతీ అమ్మవారు కుడివైపు భద్రకాళీ సమేత వీరభద్ర స్వామి, నందీశ్వరుడు దర్శన మిస్తారు, కొత్తగా రామ లింగేశ్వార,మల్లీశ్వరాలయాలు నిర్మించారు,

పెదకళ్ళేపల్లి లో మహామహులు జన్మించారు, త్యాగరాజ స్వామి పరంపరకు చెందిన శ్రీ పారుపల్లి రామకృష్ణయ్యపంతులు గారు సుసర్ల దక్షిణా మూర్తి శాస్త్రి గారు , వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, వేటూరి సుందర రామ మూర్తి గారు, సినీ సంగీత దర్శకుడు సుసర్ల దక్షిణా మూర్తి గారు ఇక్కడి వారే, దీనికి దగ్గరలో టేకుపల్లిలో ప్రముఖ గాయక సంగీత దర్శకులు శ్రీ ఘంట సాల వెంకటేశ్వర రావు జన్మించారు, ఇది కళలకునిలయం, ఎనిమిది రామాయలున్న క్షేత్రం

## 3 అభినవ శ్రీ శైలం శ్రీ అగస్త్యేశ్వర దేవాలయం కపిళేశ్వర పురం

కృష్ణాజిల్లాలోఉయ్యూరు కు సమీపం లో పమిడి ముక్కలమండలం లో కపిళేశ్వరపురం లో దాదాపు వెయ్యేళ్ల క్రితం నిర్మించిన శ్రీ అగస్త్యేశ్వరదేవాలయం ఉన్నది, అగస్త్య మహాముని ప్రతిష్టించిన లింగం కనుక ఆపేరు వచ్చింది, సుమారు 150 ఏళ్ళ క్రితం వర్షాభావం తో ఎన్నో ఏళ్ళు అల్లల్లాడి, తాగునీటికి సాగు నీటికి దిక్కు లేని పరిస్తితి ఏర్పడింది, అప్పుడు పెడన వాసి బసవన్నఅనే శివ భక్తుడు నియమంగా నిష్టతో ''రుద్రమాలిక ''చదువగా వర్షం విపరీతంగావారం రోజులు పడినట్లు ప్రతీతి, అప్పటినుండి ఆలయానికి విశేష ప్రాదాన్య లభించింది ఈ రుద్రమాలిక శ్లోకాలు ఆలయ గోడలపై శిలాక్షరాలుగా చెక్క బడి ఉన్నాయి, ఆలయానికి దేవతా సర్పం ఒకటి ఎప్పుడూ వచ్చి పోతుందని ప్రతీతి, అందుకే నాగుల చవితి రోజున భక్తులు అశేషంగా వచ్చి పుట్టలోపాలు పోసి స్వామిని దర్శించుకొని వెడతారు, పశ్చిమ గోదావరిజిల్లా మొగల్తూరు జమీందార్లు ఆలయం అభి వృద్ధి కి కృషి చేసినట్లు చారిత్రిక ఆధారాలున్నాయి, సింగ రాజు అంబయ్య ఆలయ ఉత్సవాలను ఘనం గానిర్వహించేవారు.



ఆలయ ప్రాగణం లో అగస్తేశ్వర వీర భద్ర, గంగా పార్వతీ దేవాలయాలున్నాయి, ఉపాలయాలలో వల్లీ దేవసేనాసమేతశ్రీ సుబ్రహ్మనఎశ్వరుడు కూడా కొలుపై ఉంటాడు,. చాలాకాలం నిరాదరణకు కు గురైన ఈ దేవాలయం 1980నుండి గాడిన పడి మళ్ళీ అభి వృద్ధి వేగ వంతమైంది, శివరాత్రి, ముక్కోటి ఏకాదశులను ఘనం గా నిర్వహిస్తారు,, "అభినవ శ్రీశైలం ''అనే పేరున్న ఆలయం, ఈ గ్రామస్తులు శ్రీ కొల్లిపర సూరయ్యగారు శాసన సభ్యునిగా గెలుపొందిన నిజాయితీ గల వృద్ధ తరం నాయకులు, అలాగే శ్రీ అగస్త్య రాజు రాఘువ రావు ఉయ్యూరు కే సి పి లో ఇంజనీర్ గా పని చేసి, మంటాడలో శ్రీ వెంకటేశ్వర ఆలయం (పాతది ) నిర్మించారు, వీరిద్దరూ కవి సామ్రాట్ విశ్వనాధ సత్యనారాయణగారికి ఆప్త మిత్రులు, విశ్వనాధ తరచుగా ఇక్కడికి వచ్చి వెళ్ళేవారు,

# 4 శ్రీ రామ లింగేశ్వర స్వామి దేవాలయం ఎనమల కుదురు

కృష్ణా జిల్లాలో విజయవాడకు దగ్గర కృష్ణా నదీ తీరం లో కరకట్ట కు ఆనుకొని ఉన్న యనమల కుదురు గ్రామంలో "ముని గిరి "అనే 612అడుగుల ఎత్తైన కొండ పై శ్రీ రామ లింగేశ్వరస్వామి స్వయంభు గా వెలిశాడు, ఈ గ్రామం బెజవాడ బెంజ్ సర్కిల్ కు చాలా దగ్గర, పటమట సెంటర్ నంచి కూడా బస్ సౌకర్యం ఉంది, త్రేతాయుగం లో శ్రీరాముడు సీతాలక్ష్మణ సమేతం గా ఇక్కడికి వచ్చి స్వామి సేవలో పాల్గొన్నాడని స్థల పురాణం తెలియ జేస్తోంది కొండమీదికి ఆలలో చేరుకోవచ్చు.



పరశురాముడు క్షత్రియ సంహారం చేసి, ప్రాయశ్చిత్తం చేసుకో దలచి, అనేక క్షేత్ర సందర్శన చేస్తూ ఈ మునిగిరి కి చేరాడు, ఇక్కడ అప్పటికే తపస్సు చేస్తున్న మునులను చూశాడు, వారికి ఏ ఇబ్బందీ లేకుండా రక్షిస్తున్నాడు, స్వయంభు ప్రతిస్తితుడైన శ్రీ రామేశ్వర లింగాన్ని పునః ప్రతిష్ట చేసి స్వామిని అర్చించాడు, కొండపై నుడి కింద కృష్ణా నదీ తీరం వరకు వరుసగా 101శివలింగాలను ప్రతిస్ట చేశాడు, కొంతకాలానికి అవి కాల గర్భం లో కలిసిపోయాయి, ఇంద్ర కీలాద్రి, మునిగిరి, రుష్యశృంగం, గరుడాద్రి, వేదాద్రి మొదలైన పర్వత శ్రేణులు కృష్ణానదీ ప్రవాహం వలన విడి పోయాయి, అప్పుడు కృష్ణకు దక్షిణాన ఈ మునిగిరి ఏర్పడింది, ఇక్కడి శ్రీరామ లింగం వాయు లింగం, ఈ వాయులింగాన్నే పరశురాముడు మళ్ళీ ప్రతిష్టించి ఉంటాడని భావన, కాకతి రాజులు, చాళుక్యులు రెడ్డి రాజులు విజయ నగర పాలకులు ఇక్కడికి వచ్చి స్వామి సేవలో పునీతులైనారు, ఎందరో మహర్షులు మహా మునులు దర్శించి తరించిన క్షేత్రం ఎనమల కుదురు,.

వెయ్యి మంది మునులు ఇక్కడ తపస్సు చేశారని ప్రతీతి, కనుక దీనికి "వేయి మునుల కుదురు "అనే పేరొచ్చింది, అదే కాలక్రమంలో రూపాంతరం చెంది ఎనమల కుదురు అయింది, ఇక్కడవాయులింగ రామలింగేశ్వరుడు "అష్టముఖ పానవట్టం "పై దర్శనమివ్వటం ఒక ప్రత్యేకత, స్వామికి ఎడమ వైపు ఉపాలయం లో శ్రీ పార్వతీ అమ్మవారు ఉంటుంది, ఆలయ ప్రాంగణం లో విఘ్నేశ్వర, ,సుబ్రహ్మణ్య స్వాములున్నారు. ఆలయ అంతర్భాగమంతా వివిధ దేవతా మూర్తులతో శోభాయ మానంగా కనిపిస్తుంది, 1983లో ధర్మకర్త శ్రీ ధనేకుల శివన్నారాయణ ఆధ్వర్యం లో శ్రీ శృంగేరి పీఠాది పతి జగద్గురువులు శ్రీ భారతీతీర్ధ స్వామి వారి చేతుల మీదుగా ఆలయ శిఖర ప్రతిస్ట జరిపించారు, ఆలయ ప్రాంగణం లో కలిసి ఉన్న రావి, వేప దేవతా వృక్షాలను శ్రీ లక్ష్మీ నారాయణ స్వరూపులుగా భావిస్తారు, ఈ రెండు కలిసిన చోట వేదిక పై "నాగ శిలలు" దర్శన మిస్తాయి, సంతానం కోసం ఇక్కడ మొక్కుకుంటారు, నిరంతర నాగ దేవతా సంచారం ఉన్న పవిత్ర క్షేత్రం ఎనమల కుదురు శివుని నక్షత్రం అయిన ఆర్ద్రా నక్షత్రం రోజున స్వామికి

మహన్యాస పూర్వక మహా కుంభాభి షేకం చేస్తారు, అన్న దానం నిర్వహిస్తారు మహా శివరాత్రి పర్వ దినాన పెద్దఎత్తున "జాతర "జరుగు తుంది, విద్యుత్ అలంకార పూర్వకమైన ప్రభలతో పెద్ద ఊరేగింపు చేస్తారు

## 5 బాల పార్వతీ సమేత శ్రీ జలదీశ్వర స్వామి దేవాలయం ఘంటసాల

కృష్ణాజిల్లా కొదాలికి దగ్గరలోను మచిలీపట్నానికి సుమారు 50కిలో మీటర్ల దూరం లోను ఘంటసాల గ్రామం ఉన్నది, ఇక్కడ బాలపార్వతీ సమేత శ్రీ జలదీశ్వరాలయం చారిత్రిక ప్రసిద్ధి చెందింది, అతి ప్రాచీన శివాలయాలలో ఒకటి, అగస్త్య ముని ప్రతిస్తితం, ఇది క్రీ శ.రెండు, లేక మూడవ శతాబ్దాలకు పూర్వం లోనే ఉందని అని ప్రముఖ పురాతత్వ వేత్త డా.శ్రీ, డి.కన్నబాబు చెప్పారు, ఆంధ్ర ప్రదేశ్ లో నాలుగవ అతి ప్రాచీన దేవాలయం, శివలింగం చిత్తూరు జిల్లా గుడిమల్లం లోని లింగాన్ని,అమరావతి, ద్రాక్షారం లింగాలను కొంతవరకు పోలి ఉంటుంది. ఆలయం తూర్పుముఖంగా ఉంటుంది, ఒకే పాను వట్టం పై శ్రీ జలదీశ్వర స్వామి శ్రీ బాల పార్వతీ దేవి కొలుపై ఉండటం గొప్ప ప్రత్యేకత, ప్రపంచం లో ఏ శివాలయం లోను శివపార్వతులు ఒకే పానువట్టంపై ఉండటంఅనేది లేనే లేదు, ఈ పానువట్టం ఏక రాతి శిల.దీనికి నాలుగు మూలలా నాలుగు కాళ్ళు ఉండి దానిపై వట్టం నిలిచి ఉంటుంది, ఇది భూమిని తాకక పోవటం మరో విశేషం, ఆలయ గోపురం "గజ పుస్టాకారం "లో ఉండటం మరో ప్రత్యేకత, అంటే మూడు శిఖరాలుగా గోపురం ఉంటుంది, ఇలాంటి గోపురమే తంజావూర్ బృహదీశ్వరాలయ గోపురంకూడా, ఇది మరో విశేషం, నందీశ్వరుని విగ్రహం అత్యంత సౌందర్య విలసితం గా ఉండటం మరొక వింత, ద్వాదశ జ్యోతిర్లింగ దర్శనం చేస్తే ఎలాంటి ఫలితం లభిస్తుందో, జలదీశ్వర లింగాన్ని దర్శించినా అదే ఫలితం కలుగుతుంది, స్వామి అభిషేక తీర్ధం సర్వ వ్యాధి నివారణం అని భక్తుల నమ్మకం.



అమ్మవారు శ్రీ బాల పార్వతీ దేవి ముందు శ్రీ చక్రం ప్రతిష్టితమైంది, ఇదీ విశేషమే, దీనికే అర్చన జరుగుతుంది, ఆలయ ప్రాంగణం లోని నవ గ్రహ మండపం లో నవగ్రహాలు వారి దేవేరులతో సహా కొలువు తీరి ఉంటారు, ఉపాలయం లో శ్రీ వల్లీదేవసేనా సమేత సుబ్రహ్మణ్యేశ్వర స్వామి ప్రతిష్టితులై ఉంటారు, ఆలయానికి ఒక ప్రక్క పెద్ద నాగుపాము పుట్ట ఉంది, దీనికి భక్తులు అత్యంత భక్తీ శ్రద్ధలతో పూజలు చేస్తారు, అంతరాలయ ద్వారానికి పైన శ్రీ ఆది శంకరాచార్య విగ్రహం ఉంది, స్వామి ద్వార పాలకులుగా ఎడమ వైపు

కాల భైరవుడు కుడివైపు నరసింహ స్వామి ఉంటారు, ఇదీ మరో విశేషమే, దేవీ నవరాత్రులు కార్తీక మాసోత్సవాలు శివరాత్రి మహా వైభవం గా నిర్వహిస్తారు, శివరాత్రి నాడు జరిగే శ్రీ జలదీశ్వర బాల పార్వతీ దేవి అమ్మవార్ల కల్యాణోత్సవం తనివి తీరా చూసి భక్తులు తరిస్తారు,

ఒకప్పుడు ఘంటసాల ఓడ రేవు పట్టణం, నాణాలు ముద్రించేవారు అందుకే ఇది "టంక సాల ".కాలక్రమం లో ఘంట సాల అయింది, బౌద్ధ క్షేత్రాలలో ఒకటిగా పేరు పొందింది, చారిత్రాత్మక ప్రసిద్ధి చెందినఇక్కడ పురాతత్వ శాస్త్ర వేత్తలు త్రవ్వకాలు జరిపి ఎన్నో బౌద్ధ మత స్తూపాలను వెలికి తీశారు, 18౭౦ -71లో అలేక్సాండర్ రీ నూటపన్నెండు అడుగుల చుట్టుకొలత, 23 అడుగుల ఎత్తు ఉన్న స్తూపాన్ని త్రవ్వి తీశాడు, 1920-21త్రవ్వకాలలో శిల్పశిదిలాలెన్నో లభించాయి దీనిని బట్టి ఘంటసాల నుండి రోమ్ నగరానికి వాణిజ్య వ్యాపారాలు జరిగేవని, ఇది అత్యంత ప్రసిద్ధి చెందిన సాంస్కృతిక కేంద్రమని తెలిసింది, త్రవ్వకాలలో హిందూ శిలాఫలకాలూ దొరికాయి, కనుక ఈ రెండుమతాలు సఖ్యం గా ఇక్కడ వర్ధిల్లాయని భావిస్తారు, క్రీస్తు శకం రెండు మూడు శతాబ్దాలకు చెందినా ఎన్నో శిధిలాలు ఇప్పటికీ దొరుకుతూనే ఉన్నాయి, త్రవ్వకాలలో లభించిన బౌద్ధ మహా చైత్యం చాలా విశేష మైనది, నిర్మాణం మహత్తరమైంది, శాతవాహనుల నాటి ఆకృతులను పోలి ఉండటం ప్రత్యేకత, గానుగ సున్నం తో అతి ధ్రుఢంగా కట్టిన కట్టడం, ధర్మ చక్రం చిన్న స్తూపం కూడా ఉన్నాయి, గౌతమ బుద్ధుని జన్మను తెలియ జేసే పద్మాలు చెక్కిన శిలలు దొరికాయి, తామరపూలమధ్య ఉన్న కలశమూ ఆశ్చర్య పరుస్తుంది, బుద్ధుని అస్తికలున్న భారిన కూడా దొరికింది,

ఘంటసాల వాస్తవ్యులు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య రాజకీయ పితామహులు ఎందరికో గురువు, మార్గ దర్శి, స్వాతంత్ర్య సమరయోధులు, శాసన మండలి చైర్మన్ గా పని చేశారు, బహు గ్రంధ కర్త, భారత ప్రభుత్వం చేత "పద్మ భూషణ్ "గౌరవాన్ని, ఆంధ్ర విశ్వ విద్యాలయం నుండి "కళా ప్రపూర్ణ "బిరుదాన్ని పొందారు" రైతుపెద్ద "బ్రహ్మయ్యగారు,

## 6 శ్రీ రాజ రాజేశ్వరీ రామలింగేశ్వరాలయం మచిలీ పట్నం

400 సంవత్సరాల పైగా చరిత్రకలిగిన దేవాలయం మచిలీపట్నం శ్రీ రాజరాజేశ్వరీ రామ లింగేశ్వరాలయం, శిధిలమైన ఆలయాన్ని 18వ శతాబ్దం లో రాబర్ట్ సన్అనే ఆంగ్లేయుడు పునరుద్ధరించాడు, 1841లో ఒక గంటను కూడా స్వామికి కానుకగా అందజేశాడు, ఆలయ ముఖ ద్వారం రెండు అంతస్తులతో ఉంటుంది, గార్భాలయం లో రామలింగేశ్వర విగ్రహం, ద్వారానికి ఇరువైపులా ద్వారపాలకులు, ఎదురుగా నందీశ్వరుడు ఉంటారు గర్భాలయానికి దగ్గరలోనే శ్రీ రాజ రాజేశ్వరీ దేవి కిరీట దారిణియై సర్వాలంకార శోభితగా కొలువై ఉంటుంది.



నిత్యం లలితా సహస్రనామ , లింగాష్టక పారాయణ జరుగుతుంది, ఆలయ ప్రాంగణం లో శ్రీ లక్ష్మీ నరసింహ స్వామి, శ్రీ దేవీ భూదేవీసమేత శ్రీ వెంకటేశ్వర స్వామి, 18మెట్లతోపంచలోహ శ్రీ అయ్యప్ప స్వామి ఉన్నారు, హరిహరులమధ్య అయ్యప్ప దర్శనం మనోహరం గా ఉంటుంది.



దేవతా వృక్షాలైన రాగి వేప మానులు కలిసి ఉంటాయి, దీని దగ్గర నాగ ప్రతిమ దర్శన మిస్తుంది, నవగ్రహ, కళ్యాణ మండపాలున్నాయి మహాశివరాత్రి దసరా, కార్తీకమాసం మహా వైభవం గా చేస్తారు శని త్రయోదశినాడూ విశేషంగా భక్తులు స్వామిని దర్శిస్తారు, మాఘమాసం లో మూడు రోజులు కళ్యాణ ఉత్సవాలు చేస్తారు, ఏకాదశి రోజు శ్రీ రాఘవేంద్ర స్వామి, శ్రీ హనుమత్ జయంతి ఘనంగా నిర్వహిస్తారు.

## 7 నరకాసురోత్తారం జరిగిన ప్రుద్వీశ్వరాలయ నడకుదురు

కృష్ణా జిల్లా చల్లపల్లికి దగ్గరున్న నడకుదురు లో కృష్ణానదీ తీరం లో శ్రీ పృద్వీశ్వరాలయం బహు ప్రాచీనాలయం ద్వాపర యుగం నాటికే ఇక్కడ పరమేశ్వరుడు పృద్వీశ్వరుడిగాస్వయంభు గా వెలిశాడు, స్పటిక లింగం గా కనిపించి భ్రూమధ్యమం బొటన ప్రేలు పట్టే రంధ్రం లింగానికి ఉండటం ప్రత్యేకత, ఇక్కడ నరకాసురుడు "ద్విముఖుడు "అనే బ్రాహ్మణుడిని సంహరించి, పాప పరిహారం కోసం ఈ పృద్వీశ్వరునికి పూజలు చేశాడు ఒకప్పుడు చాలా ఎత్తుగా ఉండే ఆలయం ఇప్పుడు కొంత భూమిలోకి దిగిపోయింది, ఆలయం పశ్చిమాభిముఖంగా ఉండటం ఇక్కడ విశేషం, అమ్మవారు బాలా త్రిపుర సుందరి,. ఒకప్పుడు దీనికి "నరకోత్తారక క్షేత్రం "అని పేరు అదే నడకుదురు అయింది, శ్రీకృష్ణుడు సత్యభామా సమేతం గా నరకాసురుడిని సంహరించిన తర్వాత ఇక్కడికి వచ్చి ఇక్కడ వెలసిన శ్రీ లక్ష్మీ నారాయనులను పూజించాడు.





దేవ వనం నుంచి "పాటలీ వృక్షాలు "తెచ్చి నడకుదురులో నాటాడు, శ్రీకృష్ణుని చేత పూజ లందడుకొన్న లక్ష్మీనారాయణ విగ్రహాలు ఇక్కడి "కార్తీక వనం లో ఉన్న గుడి "లో చూడవచ్చు, పాటలీ వృక్షాలున్న ఏకైక క్షేత్రం నడకుదురు. ఈ వృక్షాలను వేరొక చోట పాతితే బతకలేదు. కార్తీకం లో పాటలీ వృక్షాలు పూస్తాయి. పాటలీ పుష్పాలతోనే స్వామికి పూజ చేస్తారు, లలితాదేవినామాలలో "పాటలీ కుసుమ ప్రియే "అనేది ఉన్నది, సంతానం లేనివారు పృద్వీశ్వర లింగ దర్శనం చేస్తే సంతాన ప్రాప్తి కలుగుతుందని ప్రగాఢ విశ్వాసం, వందలాది ఉసిరి చెట్లున్నవనం ఉంది. ఇందులో కార్తీక వనభోజనాలు చేస్తారు, అరుదైన పాటలీ వృక్షాలు, సంతానాన్నిచ్చే పృద్వీశ్వరుడు, ఆమ్ల వనం ఇక్కడి ప్రత్యేకతలు,

## 8 చరిత్రాతీత సంగమేశ్వర దేవాలయం నాగాయలంక

కృష్ణాజిల్లా నాగాయలంక మండలం భావ దేవరపల్లి కి పది కిలోమీటర్ల దూరం లో సంగమేశ్వర గ్రామం లో శ్రీ సంగమేశ్వర దేవాలయం ఉంది, అతి ప్రాచీన దేవాలయం, ఎవరు ఎప్పుడు కట్టారో చరిత్ర తెలియదు.



ప్రతియేటా మహాశివరాత్రి తర్వాత 15రోజులపాటు సూర్య కిరణాలు సంగమేశ్వరునిపై పడటం మహా గొప్ప విషయం అంటే ఉషోదయ సూర్య కిరణాలతో స్వామికి అభిషేకం జరుగుతుందన్న మాట, దీన్ని దర్శించటానికి వేలాదిగా భక్తులు చేరుకొంటారు. చూసి మహానందాన్ని అనుభూతిని పొందుతారు, ఇలాగే ఒరిస్సాలోని కోణార్క దేవాలయం లోనూ జరుగుతుంది. అరసవిల్లిలోమాత్రం మాఘ శుద్ధ సప్తమి అంటే రథ సప్తమినాడు మాత్రమె సూర్యనారాయణ మూర్తిపై సూర్య కిరణ ప్రసారం జరుగు తుంది, ఇక్కడ మాత్రం పక్షం రోజులు జరగటం చాలా అరుదైన విషయం విశేషం, శివరాత్రి నుండి 15 రోజులపాటు విశేష అభిషేకాలు, పూ జలునిర్వహిస్తారు

## 9 శ్రీ రామ లింగేశ్వరాలయం బలివే

కృష్ణా, పశ్చిమ గోదావరి జిల్లా సరిహద్దు ప్రాంతం లో తమ్మిలేరు ప్రక్కన బలివే గ్రామం లో శ్రీ రామ లింగేశ్వర స్వామి కొలుపై ఉన్నాడు, చాలా ప్రాచీన ఆలయం గా భావిస్తారు, విజయవాడనుండి 80,ఏలూరు నుంచి 25కిలో మీటర్లలో బలివే ఉంది, పశ్చిమాభిముఖాలయం, రావణ సంహారం తర్వాత శ్రీరాముడు బ్రహ్మ హత్యా దోషాన్ని పోగొట్టుకోవటానికి శివలింగ ప్రతిష్టాన చేస్తూ ఇక్కడికి వచ్చి బలేరామస్వామి బలివే లో శ్రీ రామ లింగేశ్వర లింగ ప్రతిష్ట చేశాడు, దీన్ని "బలే రామ క్షేత్రం "అని కూడా అంటారు, ఈ గ్రామ పరిసరాలలో 101శివలింగాలు ప్రతిష్టింపబడ్డాయి.



చాలాభాగం కాలగర్భం లో కలిసిపోయి కొన్ని మిగిలాయి, వీటిలో "మృత్యు మల్లేశ్వర దేవాలయం "ప్రసిద్ధమైనది దీన్ని "తాతయ్య గుడి "అంటారు, ఫిబ్రవరి మార్చినెలలో బలిపే ఉత్సవాలు ఘనం గా జరుగుతాయి, కల్యాణోత్సవం బ్రహ్మాండంగా నిర్వహిస్తారు, జాతర జరుగుతుంది, కళ్యాణ మూర్తులు రథోత్సవం లో పాల్గొని తాతయ్య గుడి దర్శనానికి వెళ్ళడం తో ఉత్సవాలు పరి సమాప్తి చెందుతాయి, శివరాత్రికి అనేక జిల్లాలనుండి భక్తులు బలిపే చేరి స్వామి దర్శనం తో కళ్యాణ వేడుకలతో పులకించి పోతారు.

## 10 సగర చక్రవర్తి పూజించిన శ్రీసకలేశ్వర స్వామి దేవాలయం మోపిదేవి

కృష్ణా జిల్లాలో ప్రసిద్ధ సుబ్రహ్మణ్య క్షేత్రమైన మోపిదేవిలో అతి ప్రాచీన శ్రీ సకలేశ్వర స్వామి దేవాలయం ఉన్నది స్వయంభు లింగం, సగర చక్రవర్తి ఈ స్వామిని అర్చించాడని ఐతిహ్యం సగరేశ్వరుడే సకలేశ్వరుడుగా కాల క్రమం లో మారాడు, 1873లో కృష్ణా నదికివచ్చిన వరదలలో మోపిదేవి కొట్టుకుపోగా ఈ శివలింగం బయట పడింది.



దీనిని చల్లపల్లి జమీందార్ అడుసు మిల్లి గంగ భొట్లు ప్రతిష్ట చేసి ఆలయ నిర్మాణం చేశాడు, భూమిలో ఈ శివలింగం ఎంత లోతుకు ఉన్నదో ఎవరూ కని పెట్ట లేక పోయారు, సకలేశ్వర స్వామి సుబ్రహ్మణ్య క్షేత్ర పాలకుడు నిత్యాభిషేకాలు అమ్మవారికి కుంకుమార్చన ఉంటాయి కార్తీక మాసం లో విశేషం గా అభిషేకాలు కార్తీక దీపాలు ఆకాశ దీపాలు, లక్ష పత్రీ పూజలు ఘనం గా చేస్తారు, మాఘ పూర్ణిమ నుండి మూడు రోజులు స్వామి వారి కల్యాణోత్సవాలునిర్వహిస్తారు

కృష్ణాజిల్లా ముక్త్యాల దగ్గర కోటి లింగ క్షేత్రం లో పశుపతి నాద దేవాలయం ఈ మధ్యనే కట్టారు,

గుంటూరు జిల్లా

## 11 శ్రీఅగస్త్యేశ్వర స్వామి దేవాలయం నంది వెలుగు

గుంటూరు జిల్లా తెనాలి దగ్గర నంది వెలుగు లో అగస్త్య మహర్షి కాశీ ని వదలి ఉండలేని దుఖాన్ని పోగొట్టుకోవటానికి అడుగడుగునా శివలింగాలు ప్రతిష్టిం చాడట, ఇక్కడి లింగాన్నీ ఆ మహర్షియే ప్రతిష్టిం చాడు, నంది వెలుగుకు చారిత్రక ప్రాధాన్యం చాలా ఉన్నది, కాలగర్భం లో ఆలయం చుట్టూ దట్టమైన అరణ్యాలు పెరగటం తో జనసంచారం లేక వేలుగుపోయి చీకటి ఆవ రించింది,



చాళుక్యుల పాలన లో శివ భక్తుడైన విష్ణు వర్ధన మహా రాజు ఈ అరణ్య ప్రాంతానికి వచ్చినపుడు ఈశ్వరుడు ప్రత్యక్షమైనాడు, శివుని సేవలో తరించాలని రాజు స్వామికి నిత్యార్చన చేయాలని సంకల్పించాడు, అమూల్యమైన రత్న మాణిక్యాలను ఆలయం లో ఉన్న వినాయకుని బొజ్జలో, నందీశ్వరుని కొమ్ములలో నిక్షిప్తం చేయించాడు, వినాయకుని బోజ్జలోని రాత్నాలనుంది వెలువడే కాంతి పుంజాలు నందీశ్వరుని శృంగాలపై పడి పరావర్తనం చెంది, మూల విరాట్టు పాదాలపై పడి వింత శోభను కలిగిస్తుంది, నందికొమ్ములలో నుంచి ఈ దివ్య కాంతి రావటం వలన గ్రామానికి "నంది వెలుగు" అని పేరొచ్చింది,

కొంతకాలానికి ఈ రహస్యం తెలిసిన ఒక మంత్రగాడు ఇక్కడికొచ్చి వినాయక బొజ్జలో నంది కొమ్ములలో ఉన్న అమూల్య రత్నమాణిక్యాలను దోచుకు పోయాడు, మూల విరాట్టుకు ఒక వైపున పార్వతీ అమ్మవారు,ఎదురుగా జ్యోతిర్నంది,ఒక ప్రక్క జ్యోతిర్గణపతి, మరో వైపు శ్రీ ఆంజనేయ స్వామి ఉన్నారు, శ్రీ కనక దుర్గంమవారు, రమా సహిత సత్యనారాయణ స్వామి నటరాజ చండీశ్వరుడు, కాలభైరవ, నవగ్రహాలు ఆది శంకరాచార్య విగ్రహాలున్నాయి, శ్రీ కంఠ శివాచార్యుల విగ్రహమూ ఉండటం ప్రత్యేకత,.

## 12 శ్రీ జలపాలేశ్వర స్వామి దేవాలయం వేములూరి పాడు



గుంటూరుకు 18 కిలోమీటర్ల దూరం లో నరసరావు పేట కు వెళ్ళే మార్గం లో వేములూరి పాడు గ్రామం ఉన్నది, చోళ రాజులు ఈ భాగాన్ని పాలిస్తూ ఒక రోజు సైన్య సమేతంగా ఇక్కడికి, అర్ధ రాత్రి సమయం లో చేరుకొన్నారు, గుడారాలు వేసుకొని ఉన్నారు, కాని త్రాగటానికి చుక్క నీరు కూడా లభించలేదు, వెంటనే నీటికోసం బావి త్రవ్వించాడు రాజు. అయినా నీరు పడలేదు, చేసేది లేక ఇక తన వాళ్ళ కాదని ఇష్టదైవం శివుడిని ఆర్తిగా రాజు ప్రార్ధించాడు, స్వామి అనుగ్రహం తో బావి స్వచ్ఛ జలం తో నిండిపోయింది, రాజు జపాలేశ్వర స్వామిగా శివ లింగాన్ని, పార్వతీ దేవి విగ్రహాన్ని ప్రతిష్టించాడు, జలాన్ని శిరసున ధరించి తన అధీనం లో సర్వసృష్టిని చేసి లయకారుడై న భోళాశంకరుడు భక్తుల కోర్కెలను తీరుస్తున్నాడు,.

ఇక్కడ శివ రాత్రి ఉత్సవాలు పెద్ద ఎత్తున నిర్వహిస్తారు, ఆలయ వాయవ్య భాగం లో రాజులకాలం నాటి నీటి తోట్టెలు బొడ్రాయి ఉండేవి, ఎడమవైపు శిలాశాసనం ఉంది, 1875 లో "దియాబలూరు పాడు "అనే ఈ వేము లూరు పాడు గ్రామం శ్రీ జలపాలేశ్వర స్వామి ఆలయ

పునర్నిర్మాణాన్ని శ్రీ వత్స రాఘవ శర్మ గారు చేసినట్లు శాసనం కనిపిస్తుంది, వీరి వంశం వారే అప్పటినుంచీ ఇప్పటిదాకా అర్చకులుగా ఉన్నారు,

## 13 రాయలకాలపు శ్రీ సోమేశ్వరాలయం రాయపూడి





శ్రీకృష్ణ దేవరాయల కాలం నాటి శ్రీగంగా పార్వతీ సమేత సోమేశ్వరాలయం అతి పురాతనాలయం, అనుబంధంగా శ్రీ వీరభద్ర స్వామి ఆలయమూ ఉంది, ఇది కాకతీయులకాలం నాటిది, ఆకాలపు ధ్వజ స్థంభం శిలాశాసనం కనిపిస్తాయి సోమేశ్వరాలయం వద్ద రాయల కాలపు శాసనాలను చూడచ్చు, రాయలవారు సైన్య సమేతంగా ఇక్కడ ఒక నెల రోజులు పైనే విడిది చేశారు కనుక దీనికి ''రా య పూడి ''అనే పేరొచ్చింది, ఆలయం శిదిలమైతే శివక్షేత్రంస్థాపకులు శ్రీ శివ స్వామి పునః ప్రతిష్ట చేసి నిర్మించారు,

## 14 అత్రిముని ప్రతిష్టిత శ్రీ సంగమేశ్వరాలయం సంగం జాగర్ల మూడి

సంగం జాగర్ల మూడిలో అతి ప్రాచీన సంగమేశ్వరాలయం ఉంది. , అత్రి మహాముని ఇక్కడ చాలా కాలం తపస్సు చేశాడు, స్వామి లింగాన్ని ప్రతిష్టించి ఆలయ నిర్మాణం చేశాడు, ఆలయం శిధిలం కాగా 17వశతాబ్దపు వెలమ రాజులు మళ్ళీ నిర్మించారు, విశాలమైన ఆవరణలో ఈ ఆలయం ఉంటుంది, మానసిక ప్రశాంతికి నిలయంగా ఉండటం దీని ప్రత్యేకత, ప్రాంగణం నుంచి ఆలయ ప్రవేశం చేస్తుంటే ముందుగా నందీశ్వర దర్శనం కలుగుతుంది,



తూర్పు ముఖంగా ఉన్న ఈ ఆలయం లో గర్భాలయం లో శ్రీ సంగమేశ్వర స్వామి కొలువై ఉంటాడు, కుడివైపు విఘ్నే శ్వరుడు ఎడమవైపు కాశీ విశ్వేశ్వరుడు ఉంటారు,

తూర్పు ప్రాకారానికి దగ్గరలో పెద్ద సత్రం ఆఫీసు ఉంటాయి.ఉత్తరాన నాగ ప్రతిమలు, కాలభైరవ విగ్రహం యాగా శాల, ఉన్నాయి, దక్షిణాన కళ్యాణ మండపం వీరభద్ర, పార్వతీదేవి, పాప వినాశాలయాలుంటాయి,

## 15 శ్రీ గంగా భ్రమరాంబా సమేత మల్లేశ్వరా స్వామి దేవాలయం పెదకాకాని

అష్టాదశ శక్తులలో ఒకరైన శ్రీ భ్రమరాంబా దేవి, ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఒకరైన శ్రీ మల్లికార్జున స్వామి



ఇద్దరూ కొలుపై ఉండటం కాకాని విశిష్టత, శ్రీశైల స్థలపురాణం లో కాకాని ప్రసక్తి ఉంది ఒకసిద్ధుని భక్తీ తాత్పర్యాలకు మెచ్చి శివుడు ఇక్కడ స్వయంభు గా వెలిశాడు మరకత లింగం ఇది,. భరద్వాజ మహర్షి ఈస్వామి మహిమను గుర్తించి వచ్చి అర్చించాడు, యజ్ఞం చేయ సంకల్పించి మహర్షిగానాన్ని ఆహ్వానించి యజ్ఞశాల నిర్మించాడు, యజ్ఞం నిర్విఘ్నం గా సాగుతోంది దేవతా ప్రీతి బాగా జరిగింది ఇంతలో ఒక కాకి ఇక్కడికి వచ్చి యజ్న ఆహుతులను తినటం ప్రారంభించింది, యజ్ఞం అపవిత్రం అయి పోతుందని భరద్వాజ మహర్షి దాన్ని వారించే ప్రయత్నం చేశాడు, అప్పుడాకాకి మనుష్య భాషలో "నేను కాకాసురుడిని, బ్రహ్మ కోసం తపస్సు చేసి మెప్పించి దేవతల కిచ్చే హవిర్భాగాన్ని తినే వరాన్ని పొందాను, అందుకే వచ్చి తింటున్నాను నువ్వు నిర్విఘ్నంగా యజ్ఞం పూర్తి చేసే సమయం దగ్గర కొచ్చింది, సమస్త నదీ జలాలతో శ్రీ మల్లేశ్వర స్వామికి అభి షేకం చేసి అభిషేక జలాన్ని నా మీద చల్లు, అప్పుడు నాకు శాప విమోచనం జరుగుతుంది "అని చెప్పింది కాకం చెప్పినట్లే భరద్వాజ మహర్షి చేయగా కాకి తెల్లని రంగులోకి మారి మానస సరోవరానికి యెగిరి వెళ్ళింది, ఇలాంటి మహా మహిమాన్విత లింగాన్ని మల్లె పూలతో మహర్షి అర్చించాడు అందుకే మల్లేశుడయ్యాడు, ఆ పక్షి,మానస సరోవరం నుండి ఆకాశ మార్గం లో ఎగురుతూ తమిళనాడు లోని పక్షి తీర్దానికి వెళ్లి సర్వేశ్వర దర్శనం చేసి, బలిని స్వీకరించి మళ్ళీ వెళ్లి పోతూ ఈకాకాని మల్లేశుని దర్శనం చేసుకొంటుంది,



ఆలయ తూర్పు భాగాన భరద్వాజుడు త్రవ్వించిన బావి ఉంది, మహర్షులందరూ సకల తీర్ధ పవిత్ర జలాలను తెచ్చి ఇందులో ఉంచారు, భరద్వాజ మహర్షి యజ్ఞ ద్రవ్యాలను కూడా ఇందులో వదిలాడు, అందుకే దీనికి"యజ్ఞాల బావి "అనే పేరొచ్చింది 1440లో శ్రీకృష్ణ దేవరాయలు సందర్శించి మంత్రి "రెంటూరి చిత్తరుసు" సలహాతో ఆలయ పునర్నిర్మాణానికి దనం సమర్పించాడు, ఇక్కడ రాహు కేతు గ్రహ పూజ నిర్వహిస్తే, ఆగ్రహ పీడ తొలగి పోతుంది, నాగేంద్ర పీఠం లోనూ నాగ దోష నివారణకు పూజలు చేస్తారు, భక్తులు పొంగళ్ళు వండి నైవేద్యం పెడతారు, ఆలయం లో సకల శుభకార్యాలు నిర్వహించుకొనే సదుపాయం ఉంది, శివరాత్రి, శ్రావణ కార్తీకమాసం రోజులలో వేలాది భక్తులు సందర్శిస్తారు, స్వామి కళ్యాణమూ వైభవం గా నిర్వ హిస్తారు, "కోరిన కోర్కెలు తీర్చే దేవుడు – కాకాని మల్లేశుడు "

## 16 చాళుక్య భీముడు కట్టించిన శ్రీ భీమేశ్వరాలయం చేబ్రోలు




గుంటూరు –చీరాల రోడ్డులో పొన్నూరు దగ్గర చేబ్రోలు గ్రామం లో క్రీ శ.892లో చాళుక్య భీమరాజు కట్టించిన అతి ప్రాచీన శ్రీభీమేశ్వరాలయం మహా ప్రసిద్ధి చెందింది, రాజు పేరుతొ భీమేశ్వరాలయం అనేపేరొచ్చింది, ఒకప్పుడు ఇక్కడ బౌద్ధ చైత్యం ఉండేది, దాన్నే

భీమరాజు భీమేశ్వరాలయం గా మార్చాడని చరిత్రకారులు భావించారు, విశాలమైన ఆవరణ, దాని లోపల ప్రా కారం, మధ్యలో భీమేశ్వరాలయం ఉన్నాయి, ఆలయం లో ఒకే గర్భ గ్రహం ఉంది గర్భాలయానికి ఈశాన్యం లో చిన్నగుడిలో అమ్మవారు శ్రీబాలాత్రిపురసుందరీదేవి కొలుపై ఉంటుంది, ఈ రెండు ఆలయాలను కలుపుతూ పెద్ద మండపం ఉంది, ఆలయాలకు ప్రదక్షిణ చేయటానికి చుట్టూ మార్గం ఉన్నది. పెద్ద మండపం లో నందీశ్వరుడు, నందినిదాటి ముందుకు వెడితే ఒక వేదిక, దానికి దిగువన మరొక చిన్న నంది కనిపిస్తాయి దీనికిదగ్గరలో చేబ్రోలు వాసులు కారుమంచి కిస్టయ్యసోదరులు 1930లో ప్రతిష్టిం చిన ధ్వజ స్థంభం ఉంది, ఆలయ గోపురం చాళుక్యుల కళా సంపన్నంగా కనులవిందు చేస్తుంది, నిత్య పూజలతో బాటు శివరాత్రికార్తీకమాసం నవరాత్రులలో విశేష పూజలు అభిషేకాలు నిర్వహిస్తారు.

## 17 కోనేటి మధ్యలో చతుర్ముఖ బ్రహ్మేశ్వరాలయం చేబ్రోలు




గుంటూరు జిల్లా చేబ్రోలు లో ఎన్నో విశిష్టతలు, విశేషాలు కలిగిన కోనేటి మధ్యలో నిర్మింపబడిన చతుర్ముఖ బ్రహ్మేశ్వరాలయం ఉన్నది, అమరావతి రాజు రాజా వాసి రెడ్డి వేంకటాద్రి నాయుడి కాలం లో దోపిడీ దొంగలు కొంతకాలం వీర విజ్రుంభణ చేసి భీభత్సం సృష్టించారు, దొంగలను దారిలోకి తీసుకు రావటానికి నాయుడు వారు స్వచ్ఛందంగా లొంగిపోయి జన జీవితం లో కలిసిపోతే వారికి ఎటు వంటి కీడూ తలపెట్టనని "అన్నం మీద ప్రమాణం" చేసి ప్రకటించాడు, రాజు మాటలు నమ్మి దొంగలు లొంగిపోయారు, కాని రాజు అన్నమాట నిల బెట్టు కో కుండా వాళ్ళను చంపించేశాడు, ఆ తర్వాత ఆయన అన్నం తింటుంటే అది రక్తం తో తడిసి కని పించేదినం. లోపలి వేల్లెదికాదు, శుష్కించి పోయాడు, అప్పుడు విజ్ఞులను సంప్రదించాడు, వారు " పర బ్రహ్మ స్వరూపం లాంటి అన్నం పై ప్రమాణం చేసి దొంగలకు హాని కలిగించనని చెప్పి వధించటం వలన వచ్చిన ప్రమాదం ఇది అన్నారు. దోషం పోవటానికి బ్రహ్మ దేవుడికి ఆలయం నిర్మించాలి "అని సూచించారు,




సలహా బాగానే ఉంది కానిశివుడి శాపం వలన బ్రహ్మకు ఆలయం ఎక్కడా ఎవరూ కట్టరు కదా అనే సందేహం వచ్చింది, కనుక ఉపాయాంతరంగా బ్రహ్మతో కలిపి శివాలయం కడితే ఒకే అనుకున్నారు, కనుక ఒక కోనేటి మధ్యలో కమల గర్భుడైన చతుర్ముఖ బ్రహ్మను శిల్పించి పైన శివ లింగాకృతి వచ్చేట్లు చేసి ప్రతిష్టిం చారు,. మళ్ళీ చిక్కొకటి వచ్చింది, ఆగమ శాస్త్ర ప్రకారం శివాలయానికి ఎదురుగాను, విష్ణ్వాలలయానికి వెనక ఏ ఆలయం ఉండరాదు, ఈ చిక్కు ముడి విడదీయటానికే కోనేటి మధ్యలో ఆలయం నిర్మించి ఏ దోషం లేకుండా చేసి సంత్రుప్తిచెందారు, అయినా అనుమానం పోలేదు, తూర్పున చంద్ర మౌళీశ్వర స్వామిని, పడమరసహస్ర లింగేశ్వరస్వామిని, ఉత్తరంలో వేణుగోపాల స్వామిని, దక్షిణాన రంగనాధ స్వాములను,నాలుగు వైపులా అమ్మవారిశక్తిపీఠాలను ప్రతిష్టించి "హమ్మయ్యా" అనుకొన్నారు, అంటేఅష్ట దిగ్బంధం చేశారన్న మాట, బ్రహ్మకు అర్చన అర్హత లేదు కనుక ఈశ్వరార్చనే బ్రహ్మార్చన అవుతుంది, ఈశ్వరాభిషేకమే బ్రహ్మకు చేసే అభిషేక మవుతుంది, కోనేటి మధ్య ఉన్న ఆలయ సందర్శన కోసం ఒక వంతెన నిర్మించారు, బ్రహ్మగారి నాలుగు ముఖాలు నాలుగు వైపులా చూస్తూ ఉన్నట్లు శిల్పించారు, తూర్పు పడమరలలోశివాలయాలు, ఉత్తర దక్షిణాలలోవిష్ణు ఆలయాలు, నాలుగు మూలల శక్తి ఆలయాలు ఉండటం ఈ ఆలయ ప్రత్యేకత, అన్ని సమయాలలో ప్రత్యేకపూజలు అభిషేకాలూ ఉత్సవాలతో ఆలయం నిత్య కల్యాణం పచ్చ తోరణం గా ఉంటుంది. తప్పక దర్శించి తరించాల్సిన క్షేత్రం చతుర్ముఖ బ్రహ్మలయం.

## 18 శ్రీ గంగా పార్వతీ సమేత నాగేశ్వరాలయం చేబ్రోలు

గుంటూరు జిల్లా పొన్నూరు కు వెళ్ళేదారిలో చేబ్రోలు గ్రామం ఉంది, దీని పూర్వపుపేరు "తామ్రపురి, ఇక్కడ గంగా పార్వతీ సమేత శ్రీ నాగేశ్వర స్వామి విశిష్ట దైవం, 1213లో కాకతి గణపతి ప్రభువు బావమరది, గజ సైన్యాధ్యక్షుడు, జాయప సేనానికి దానం చేశాడు, తూర్పు చాళుక్య భీముడు పొన్నూరులో శ్రీ భీమేశ్వరాలయం నిర్మించి శైవానికి ప్రభావం కలిగించాడు, 14వ శతాబ్దం లో గ్రామ పెద్దలు మూర్తెన్న,కంటన్న అనే సోదరులు లు ఆలయాన్ని పునరుద్ధ రించినట్లు ఆలయ శాసనం తెలియ జేస్తోంది,



అయిదు అంతస్తుల గాలి గోపురం ఇక్కడప్రత్యేకత, చుట్టుప్రక్కల చాలా దేవాలయ గోపురాలకంటే పెద్దది, తూర్పు ముఖ ఆలయం, గర్భాలయ, అంతరాలయ, ముఖ మండపాలున్నాయి, గర్భాలయం లో శ్రీ నాగేశ్వరస్వామి ఉంటాడు, అంతరాలయం ఎడమ వైపు శ్రీ పార్వతీ దేవి, కుడివైపు గంగా మల్లేశ్వరుడు ప్రతిష్టింప బడ్డారు, మండపం లో నందీశ్వరుడు గంభీరంగా కనిపిస్తాడు, ప్రాంగణం లో ఒక వైపు నవగ్రహ మండపం ఉంది, బయట రాజ గోపురానికి కుడి వైపు అయిదు అడుగుల ఎత్తు,ఆరుఅడుగుల పొడవు ఉన్న మరో నందీశ్వరుడు దర్శన మిస్తాడు, మండపం ఎర్ర ఇసుక తో నిర్మించ బడింది, మండపం లోని నంది కూడా యెర్ర ఏక శిలా విగ్రహమే, ఈ నంది వీపు మెడ, నుదురు దగ్గర చక్కని నగిషీలు,జాలరి పని ముచ్చట గొలుపుతాయి, అన్ని రకాల ఉత్సవాలను ఘనం గా నిర్వహిస్తారు,

## 19 ఉభయ రామ లింగ క్షేత్రం చిలుమూరు





తెనాలి తాలూకా చిలుమూరు లో త్రేతాయుగం లో శ్రీరాముడు ప్రతిష్టించిన ఉభయ రామ లింగ క్షేత్రం ప్రసిద్ధమైనది, రావణ వధానంతరం సీతారాములు పుష్పక విమానం లో విహరిస్తూ ఈ ప్రాంతపు అందాలకు మురిసి పోయి ఇక్కడ దిగారు. పూజించటానికి ఆలయం ఏదీ కనిపించలేదు, అందుకనిగుంటూరు జిల్లా కృష్ణానదీ తీరం లో చిలుమూరు లోను, మరొకటి, కృష్ణకు అవతలి ఒడ్డున ఉన్న కృష్ణా జిల్లాలోని కృష్ణానదీ తీరం లో ఐలూరు లోను శివలింగాలను ప్రతిష్టించారు, అందుకని వీటికి "ఉభయ రామేశ్వర క్షేత్రాలని" లని శ్రీరాముడే నామ కారణం చేశాడు,, ఇక్కడేకొన్ని రోజులు ఉండి శివార్చన చేశారని ఐతిహ్యం, ఆలయ సమీపాన శ్రీ వేణుగోపాల స్వామి ఆలయమూ ఉంది, ఉభయ రామ క్షేత్రాలలో శివరాత్రికి గొప్ప తిరుణాల జరుగుతుంది, అన్న సమారాధన, శివ పార్వతీ కల్యాణం ఘనంగా నిర్వహిస్తారు, వేలాది భక్తులు వచ్చి కృష్ణానదిలో పవిత్ర స్నానాలు చేసి స్వామిని దర్శించి పునీతులౌతారు,

## 20 శ్రీ చౌడేశ్వరాలయం నిడుబ్రోలు



పొన్నూరు దారిలో ఉన్న నిడుబ్రోలులో గంగా పార్వతీ సమేత శ్రీ చౌడేశ్వరదేవాలయం అత్యంత ప్రాచీనమైనది, చోళ రాజులలో ప్రముఖుడు రాజేంద్రచోళుని మనుమడు త్రిభువన చక్ర వర్తి 1054లో నిర్మించాడు, గర్భాలయం లో శ్రీ చౌడేశ్వర స్వామి కొలువై ఉంటారు, అంతరాలయం కుడివైపు పార్వతీదేవి, ఎడమవైపు వీరభద్ర,భద్ర

కాళి ఉంటారు మండపం లో కుడి భాగాన వినాయకుడు, మధ్యలో నందీశ్వరుడు, ధ్వజ స్తంభం దర్శన మిస్తారు, ఆలయ ఆవరణలో ఉన్న మరొక ఆలయం లో రాజ్య లక్ష్మీ సమేత శ్రీకేశవ స్వామి ఉంటారు, ఎదురుగా గరుడాళ్వారు, ఆంజనేయస్వామి ధ్వజ స్తంభానికి సమీపం లో ప్రతిష్టితులై ఉంటారు, శివకేశవులకు భేదం లేదని తెలియ జెప్పేటట్లు ఆలయం నిర్మింప బడటం విశేషం, చౌడేశ్వరాలయ గోపుర శిఖరం తంజావూర్ బృహదీశ్వరాలయ గోపుర శిఖరానికి సరి సమానంగా ఉండటం ఇక్కడి ప్రత్యేకత, శివ కేశవులకు చెందిన సమస్త ఉత్సవాలను ఆలయం లో పెద్ద ఎత్తున నిర్వహిస్తారు.



## 21 శ్రీ అగస్త్యేశ్వర స్వామి దేవాలయం గుంటూరు

గుంటూరు ఆర్. టి, సి.బస్ స్టాండ్ దగ్గరలోఉన్న గంగా పార్వతీసమేత శ్రీఅగస్త్యేశ్వరాలయం అతి ప్రాచీనాలయం, అగస్త్య ముని ప్రతిష్టితం, దక్షిణ దేశ యాత్ర చేస్తూ అగస్త్య మహర్షి అనేక శివలింగాలను ప్రతిష్టిస్తూ ఇక్కడికి వచ్చి "ఓగేరు"సమీపం లో ఈ శివలింగాన్ని ప్రతిష్టించాడు, అందుకే ఆయన పేరుతొ పిలువ బడుతోంది, చాళుక్య చక్ర వర్తుల సామంత రాజులైన" పరిచ్చేద వంశస్తులు" గుంటూరు ను రాజధానిగా చేసుకొని పాలించారు, 12 వశతాబ్దిలో "పరిచ్చేదిపండయ రాజు " ఈఆలయాన్ని నిర్మించినట్లు శాసనాలున్నాయి,



స్వాగత ద్వారం పై శివ పార్వతి గణపతి కుమార స్వామి విగ్రహాలున్నాయి, ప్రధాన ఆలయ గోపురం పై వివిధ భంగిమలలో శివ స్వరూపాలుండటం ప్రత్యేకత, మండపం పై

భాగాన శివ పార్వతీ కళ్యాణ ఘట్టాలు చెక్కబడినాయి, ప్రధానాలయ ధ్వజ స్తంభం "పద్మాకారం "లో ఉండటం మరోవిశేషం, గర్భాలయ ముఖ మండపానికి ఎదురుగా ప్రత్యేక మండపం లో నందీశ్వరుడుంటాడు, చాళుక్య శిల్ప కళ అద్భుతం అని పిస్తుంది, ఆలయం లో పార్వతీ అమ్మవారికి ప్రత్యేకాలయం ఉన్నది, ముఖ మండపం లో ఎడమవైపు కుమారస్వామి, ప్రక్కగా గంగా పార్వతీసమేత అగస్త్యేశ్వర స్వామి మహా తేజం తో దర్శన మిస్తారు, పార్వతీఅమ్మవారు సర్వాలంకారశోభిత, ఆలయం లో ఉన్న స్వామివారి కళ్యాణ మండపం ను 1779లో" చెవిడి కొండ్ల రాములు" అనే భక్తుడు కట్టించాడు, , శుక్రవారంనాడు, , కార్తీక, ఆశ్వయుజ మాసాలలో విశేష అభిషేకాలు, కుంకుమ పూజలు జరుగుతాయి, ఆలయ నాగ శిలాశాసనాన్ని బట్టి ఆలయ ప్రాచీనత అర్ధమవుతుంది, దీన్ని" పండయ రాజు" వేయించాడు,

కళ్యాణ మండపానికి దగ్గరలో మరొక శివాలయం –శ్రీఏకాంబరేశ్వర ఆలయం ఉండటం మరొకవిశేషం, పాన వట్టంపై శివలింగం" పంచ ఫణి"తో మకర తోరణ శోభితంగా ఉంటుంది, ఏకాంబరేశ్వర సన్నిధిలో శ్రీ కామాక్షి అమ్మవారి సన్నిధి ఉంది, శంకరాచార్య, కుమారస్వామి, వీరభద్ర స్వామి మొదలైనచాలా మంది దేవతలు దర్శన మిస్తారు,

## 22 శిబిచక్రవర్తి లింగాకృతిపొందిన శ్రీ కపోతేశ్వర దేవాలయం చేజెర్ల



గుంటూరు జిల్లా నకరి కల్లు మండలం లో నరసరావు పేటకు 30కి.మీ దూరం కో ఉన్న చేజర్ల గ్రామం లో పురాతన శ్రీ కపోతేశ్వరాలయం ఉంది, దాన శీలం లో ప్రసిద్ధు డైన శిబి చక్రవర్తి ఇక్కడ లింగ రూపం లో వెలసిన పవిత్ర క్షేత్రం, కాశ్మీరప్రభువైన శిబి చక్రవర్తి పెద్ద తమ్ముడు "మేఘాడంబురుడు",రెండవ తమ్ముడు "జీమూత వాహనుడు "తీర్ధ యాత్రలు చేస్తూ ఈ ప్రదేశానికి వచ్చి, ఇక్కడి పర్వత గుహలో తపస్సు చేస్తూ దేహాలు చాలించి లింగాకారు లైవెలిశారు, ఈ విషయం తెలిసిన శిబి తానూ కూడా సోదరులలాగే ముక్తి పొందాలని చేజెర్ల చేరాడు, ఇక్కడ నూరు యాగాలు చేశాసు, శిబి దానశీలతను పరీక్షించాలని దేవతలు భావించిబ్రహ్మ, శివుడు పావురం, కిరాత రూపాలుధరించి శిబిని చేరారు, కిరాత బాణానికి కాలికి దెబ్బతగిలిన కపోతం శిబిని చేరి శరణు కోరింది, అభయమిచ్చాడు శిబి చక్ర వర్తి, ఇంతలో కిరాతుడు వచ్చి తాను వేటాడిన పావురం తనదే నని దాన్ని తనకివ్వాలని పేచీపెట్టాడు, శరణు కోరిందాన్ని ఇవ్వలేనని పావురం బరువుతో



సమానమైన తన శరీర మాంసాన్ని దానికి బదులుగాకోసి ఇస్తానన్నాడు శిబి, సరేనన్నాడు కిరాతుడు, ఒక త్రాసు తెప్పించి ఒక వైపు పావురాన్ని పెట్టి, మరో వైపు తన శరీరం నుండి కోసిన మాంస ఖండాలను పెట్టి తూచాడు, యెంత మాంసమైనా పావురం బరువుకు సరి తూగలేదు, ఇదేదో దైవ మాయ అనిపించింది, చివరికి తన తల నరికి త్రాసు లో పెట్ట బోయాడు, అప్పుడు శివ, బ్రాహ్మలు త్యక్షమై అతడ్ని పరీక్షించ టానికి చేసిన ప్రయత్నం ఇది అని వివరించి శిబి దాన శీలతకు మెచ్చి వరం కోరుకొమ్మన్నారు, తాను శివలింగాకృతి దాల్చే యోగం ప్రసాదించ మన్నాడు శిభి, సరేనన్నారు. కపోతాన్ని రక్షించి శివుని మెప్పించి లింగాకృతి దాల్చిన శివుడుక పోతేశ్వరుడైనాడు, దీనికి దాఖలాలుగా లింగం పైకత్తి గాట్లు కనిపిస్తాయి,, శిబి దేహం నుండి తీసిన మాంసానికి ఇవి ఆనవాళ్ళు, లింగం పైభాగాన రెండువైపులా రెండు బిలాలు కనిపిస్తాయి, కుడి రంధ్రం లో ఒక బిందెడు నీరు పడుతుంది, ఎడమ వైపు బిలం లో యెంత నీరు పోసినా నిండక పోవటం ఆశ్చర్య మేస్తుంది, అభిషేక జాలం ఇందులోనుండి ఎక్కడికో ప్రవహించి వెళ్ళిపోతుంది, ఇక్కడి నందీశ్వరుడు కపోతేశ్వరలింగాన్ని కుడి కంటితో వీక్షిస్తున్నట్లు ఉండటం సాధారణానికి భిన్నంగా ఉంటుంది, ఇదొక వింత,



గ్రామానికి వాయవ్యం లో కపోతేశ్వరాలయం తూర్పు ముఖం గా ఉంది, ఆలయం చతుర్భుజాకారం తో విశాలమైన ఆవరణ లో ఉంది, ఆవరణ చుట్టూ రెండు ప్రాకారాలున్నాయి, అన్ని దిశల్లో దేవతామూర్తులకు చిన్న చిన్న మందిరాలున్నాయి, 9అడుగుల ఎత్తున ఉన్న సహస్ర లింగాకార మూర్తి విశేషం ఆకర్షణ , నైరుతిలో సప్త మాత్రుకల దేవాలయం ఉంది. మల్లికా పుష్కరిణిలో పవిత్ర స్నానాలు చేస్తారు, ప్రవేశ గోపురానికి ఎదురుగా చిన్నమండపం ధ్వజ స్థంభం ఉన్నాయి, రెండు రాతి పలకలపై ఒక్కొక్కదానిమీద వెయ్యేసి లింగాలు ఉండటం మరో ప్రత్యేకత, పాలరాతి ఫలకం పై పద్మ హస్తుడైన సూర్య భగవానుడు దర్శన మిస్తాడు, గర్భ గృహానికి రెండు వైపులా,మూడేసి రాతి స్తంభాలపై రాతి దూలాల కప్పు ఉంది. చదరపు వేదికపైన ఉన్న కపోతేశ్వర లింగం తలలేని శిబి చక్రవర్తి శరీరాకృతి గా అనిపిస్తుంది



శ్రీ కృష్ణ దేవరాయలు రెండు శిలా శాసనాలు ఇక్కడ వేయించాడు, రాయలు కొండవీడును జయించి వచ్చి స్వామికి 360 ఎకరాలభూమిని దానం ఇచ్చిన శాసనం ఉంది, మంత్రులు తిమ్మరుసు,కొండ మరుసయ్య పేర్లమీద తిమ్మ సముద్రం, కొండసముద్రం అనే రెండు చెరువులున్నాయి, నిత్యార్చనలు విశేషార్చనలు జరుగుతూనే ఉంటాయి, దసరా కార్తీక మాసాలలో ఏకాదశీ పర్వ దినాలలో శివరాత్రికి సంక్రాంతికి బ్రహ్మోత్సవాలు జ్వాలా తోరణాలతో ఆలయం శోభాయమానం గా ఉంటుంది, స్వామి వారల ఊరేగింపు ఉంటుంది,

ఆలయం గజ పృష్ఠ ఆకారం(ఏనుగు వెనుక భాగం ) లో ఉండటంఒక ప్రత్యేకత, విమానం పావురం గూడు ఆకారం లో ఉండటం మరో విశేషం, కపోతేశ్వరునిపై పొన్నూరు సంస్కృతకళాశాల రిటైర్డ్ ప్రిన్సిపాల్ శ్రీ తూములూరు శ్రీ దక్షిణామూర్తి శాస్త్రి గారు "కపోతేశ్వర శతకం "రాశారు

## 23 స్థూపాకార గోపురమున్న శ్రీ మల్లేశ్వరాలయం గుంటూరు

గుంటూరు రామచంద్రాగ్రహారం లో నల్ల చెరువు దగ్గర విశాల ప్రాంగణం లో వదాన్యులైన శ్రీ పన్నాల పరదేశి సోమయాజి గారు 1762 లో గంగా భ్రమరాంబా సమేత శ్రీ మల్లేశ్వర స్వామి ఆలయాన్ని నిర్మించారు, ఆలయ రాజ గోపురం స్థూపాకారం లో అయిదు అంతస్తులతో ఉండటం చాలా విశేషం, నగిషీలు చాలా విలక్షణం గా ఉండి చూపరులను ఆకర్షిస్తాయి, గోపురంపై శిలాశాసనాలు, శిల్పాలు ప్రత్యేకత, గోపురం స్వర్ణ కాంతులతో మెరుస్తూ ఉండటం మరొక ప్రత్యేకత, ఆలయ ధ్వజస్తంభం సంపూర్ణ కవచాలంకృతం గా ఉండి, పైన శివ పార్వతులు ఆనంద నృత్యం చేస్తున్న భంగిమ తో,బ్రహ్మ విష్ణులు వాయిద్యాలు వాయిస్తూ, సప్త ఋషులు, నవగ్రహాలు, అష్ట దిక్పాలకులు, పంచ పాలకులు శివ గణాలతో అత్యంత మనోహరం గా సకల దేవతా గణ దర్శనం గా సమస్త మునిగణ పరి వేష్టి తంగా అత్యంత విశేషంగా కనిపిస్తుంది, ఆసియా ఖండం లో హైందవ దేవాలయాలలో మరెక్కడా ఇలాటి ధ్వజ స్తంభం లేసే లేదని పురా వస్తు శాఖ పేర్కొన బడిన అరుదిన విశేష ధ్వజ స్తంభం ఇది, చూసి తీరవలసిందే,



ఆలయ ముఖ మండపం పైన శివపార్వతులు భక్త కన్నప్ప, భక్త మార్కండేయ వృత్తాంత శిల్పాలున్నాయి, గర్భాలయం లో పాన వట్టం పై శ్రీ మల్లేశ్వర స్వామి లింగాకారం లో దర్శన మిస్తాడు, ఈ ఆలయ నిర్మాణం గురించి ఒక గాధ ప్రచారం లో ఉంది, నిర్మాత పరదేశి సోమయాజులు గొప్ప మంత్రం శాస్త్ర వేత్త మహా శివ భక్తుడు, ఒకసారి యాత్రలకి వెళ్లి ఒక కీకారణ్యం లో దారి తెలియక ఇరుక్కుపోయాడు, అకస్మాత్తుగా ఒక పులి ఆయన పై దాడి చేసింది, తన మంత్రం బలం తో మనో బలం తో దాన్ని చంపేశాడు, పులి హత్యా దోష పరిహారం కోసం ఆ అరణ్యం లోనే పులి చనిపోయిన చోటే కొన్ని రోజులు యజ్ఞ యాగాలు నిర్వహించాడు, శివలింగాన్ని నందీశ్వరుడిని ప్రతిష్టించి పూజించాడు, ఆ శివలింగమే మల్లేశ్వర లింగమని స్థానిక కధనం. అదే ఇప్పుడు మనం చెప్పుకొన్న మల్లేశ్వర దేవాలయం, ఆలయ సమీపం లో భద్రకాళీ సమేత శ్రీ వీర భద్ర స్వామి సన్నిధి గణేశ మందిరం, వల్లీ దేవసేనా సమేత శ్రీ సుబ్రహ్మణ్య స్వామి సన్నిదులున్నాయి, ఆలయ సమీపం లో పెద్ద పాము పుట్ట, దానికి దగ్గరలో భారీ ఏకశిలా నాగ విగ్రహం ఉన్నాయి, దీనినే సుబ్రహ్మణ్య ఆకృతిగా భావించి భక్తులు పూజలు చేస్తారు,

శ్రీ రాముడు జన్మించిన అయోధ్యలో చెక్కించిన శ్రీ కోదండ రామ స్వామి,సీతా లక్ష్మణ విగ్రహాలను తెప్పించి ఇక్కడ ప్రతిష్టించి గుడికట్టి కోదండ రామాలయం గా పూజలు చేస్తున్నారు, ఇవికాక శ్రీ ప్రసన్నాంజనేయ, శ్రీ ఆది శంకరా చార్య

మందిరాలున్నాయి, వైశాఖ మాసం లో శుద్ధ షష్టి నుండి బహుళ షష్టి వరకు 16 రోజులు బ్రహ్మోత్సవాలు నిర్వహిస్తారు, సీతారామ కల్యాణం, శరన్నవ రాత్రులు శివరాత్రి కార్తీక మాస విశేషార్చనలు అభిషేకాలు శ్రీ హనుమజ్జయంతి, శ్రీ శంకర జయంతి ఘనం గా చేస్తారు.

## 24 శ్రీ లింగోద్భవ స్వామి దేవాలయం చందోలు



గుంటూరు జిల్లా చందోలు లో అరుదైన శ్రీ లింగోద్భవ స్వామి దేవాలయం ఉన్నది, ఇది 1073 లో నిర్మింపబడిన అతి ప్రాచీన దేవాలయంగా వినుతి కెక్కింది, బ్రహ్మ, విష్ణువు తమలో ఎవరు గొప్ప అని వాదు లాడుకొన్నారు, అప్పుడు వారిద్దరి మధ్య మహా తేజో విరాజమాన మైన లింగ రూపం లో శివుడు వెలిశాడ ని పురాణ కధనం, ఇక్కడే లింగోద్భవ శివుడు ఉద్భ వించాడని.స్థల పురాణం వివరిస్తోంది,

తూర్పు ముఖంగా ఉన్న ఆలయం లో గర్భ, అంతర, ముఖాలయాలున్నాయి, గర్భాలయం లో లింగోద్భవ శివలింగం ఉంటుంది, మండపం లో ఎడమ వైపు పార్వతీ అమ్మవారు, కుడివైపు వీర భద్ర స్వామి కొలువై ఉంటారు, ఈశాన్యం లో మహిషాసుర మర్దిని అమ్మవారు ఇతర దేవతలు ఉన్నారు, ధ్వజస్తంభానికి దగ్గరలో 11అడుగుల ఎత్తు,నాలుగున్నర అడుగుల వెడల్పు ఉన్న నల్ల రాతి మహా శివలింగం దర్శన మిస్తుంది. ఇదే అసలైన లింగోద్భవ లింగం, ఈ మహా లింగం పైభాగాన పురాణకధలో చెప్పినట్లు " హంస రూపం లో బ్రహ్మ",కిందిభాగాన వరాహ రూపం లో విష్ణు రూపాలు కనిపిస్తాయి, 1806లో అమరావతి ప్రభువు రాజా వాసి రెడ్డి వెంకటాద్రి నాయుడు ఈ లింగోద్భవ మహా



శివ లింగాన్ని ఇక్కడి నుంచి తరలించి చేబ్రోలు లో ప్రతిష్టించాలని సంకల్పించి దీన్ని కదిలించటానికి యెంత ప్రయత్నించినా సాధ్యం కాలేదు, చివరికి ఆ ప్రయత్నాన్ని విరమించుకొన్నాడు, నిత్యార్చనలు అభిషేకాలు ఉంటాయి, దసరా, సంక్రాంతి కార్తీకాలలో, మహా శివరాత్రి రోజున ఉత్సవాలు రంగ రంగ వైభవం గా నిర్వ హిస్తారు,



చందోలు అనగానే మనకు చప్పున జ్ఞాపకం వచ్చేది చందోలు మహర్షి బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రిగారు, ఆయన మహా విద్వాంసులు, శ్రీ బాలా త్రిపురసుందరీ అమ్మవారి అనుష్టాన పరులు, మహా మంత్ర వేత్త, బహు గ్రంధ కర్త, సాక్షాత్తు కంచి పరమాచార్యుల వారి అభిమాన పాత్రులు, నిత్యాన్న దానం తో, వశ్య వాక్కు తో వేలాది భక్తజనులపై ప్రభావం ఉన్నవారు, వారి దౌహిత్రుడు శ్రీ చెరువు సత్యనారాయణ శాస్త్రి గారు తాతగారి వద్దనే పెరిగి విద్య నేర్చి మహా సంస్కృతాంధ్ర కవి పండితులైనారు, సంస్కృతం లో సంపూర్ణ శతావధానం చేసి చరిత్ర సృష్టించారు, వీరు ఎనిమిదవ ఏటనే "శ్రీ లింగోద్భవ వృత్త మాలికా స్తుతి కావ్యం "రాసి "బాలకవి" అనిపించుకొన్న తాతకు తగిన మనవడు,

## 25 శ్రీ అమృతేశ్వరాలయం అమృతలూరు



గుంటూరు జిల్లా అమృతలూరులో శ్రీ అమృతేశ్వరాలయం అతి ప్రాచీనాలయం,. ఒకప్పుడు దట్టమైన అడివిగా ఉన్న ఈ ప్రాంతం లో ఆవులను మేతకోసం గోపాలురు తోలుకు వచేవారు, ఆలమందలో ఒక ఆవు కాపలావాడి కన్ను కప్పేసి దూరంగా ఉన్న పుట్ట దగ్గరకు వెళ్లి, పుట్టలో పాలు పితికి వచ్చేది, ఇంటికి వచ్చాక యజమాని పాలుపితికితే అసలు పాలు ఉండేవికావు, అనుమానం వచ్చి కాపరిని యజమాని అడిగితె తెలియదని చెప్పాడు స్వయంగా యజమానే ఒక రోజు ఆవులమంద వెంట అరణ్యానికి వెళ్ళాడు, రోజు లాగానే ఆవు పుట్టలో పాలు పితకటం చూశాడు, చేతి లోని దుడ్డు కర్రతో పుట్టపై విపరీతంగా బాది పారేశాడు, అప్పుడు పుట్టలో ఉన్న శివలింగం రక్తం కారుతూ

కనిపించింది, శివలింగాన్ని చూసి ఆశ్చర్య పోయిన యజమాని శివుడిని తాను తెలియక చేసిన తప్పును కాయమని వేడాడు, భోళా శంకరుడు కృపా దృష్టితో ప్రాయశ్చిత్తంగా అక్కడ తనకొక ఆలయాన్ని కట్టమని చెప్పాడు,. శివుని ఆజ్ఞకు బద్ధుడై శివాలయం కట్టించి ఆపుట్టలోని లింగాన్నే ప్రతిష్టించాడు, అమృతం లాంటి ఆవుపాలు త్రాగిన ఆశివుడు అప్పటి నుండి ''అమృత లింగేశ్వరుడు ''గా, ఆగ్రామం అమృత లూరు గా ప్రసిద్ధమైనాయి,

తూర్పు ముఖంగా ఉండే ఈ ఆలయం చాలా విశాలమైన ఆవరణలో గర్భాలయం అంతరాలయం ముఖ మండపాలతో వర్ధిల్లింది, గర్భాలయం లో అమృతేశ్వరుడు కొలువై ఉండగా, అంతరాలయం లో ఎడమ వైపు శ్రీ బాలా త్రిపుర సుందరీ దేవి దర్శన మిస్తుంది, మండపం లో నందీశ్వరుడు విరాజమానమై ఉంటాడు, నవగ్రహాలతో ఒక మండపమూ ఉంది,

ఆవు యజమాని దుడ్డు కర్రతో కొట్టటం వలన తగిలిన దెబ్బలు శివలింగం పై గుంటలుగా కనిపిస్తాయి, అభిషేక జలం వీటిలో నిలిచి పోతుంది, అర్చకులు గుడ్డ తో తుడిచి నపుడు ఆ గుంటలలో నుంచి గాయం తగిలి నప్పుడు వచ్చే టటు వంటి వాసన రావటం విడ్డూరంగా ఉంటుంది, నిత్యార్చనాభిషేకాలుఉంటాయి, నవరాత్రి, ఆరుద్ర, సంక్రాంతి ఉత్సవాలు బాగా చేస్తారు, ఫాల్గుణ పౌర్ణమి నాడు స్వామి వారల కళ్యాణ మహోత్సవం వైభవో పేతం గా విశేషంగా చేస్తారు.



## 26 శ్రీ ఉత్తరేశ్వరాలయం పెద్ద కొదమ గుండ్ల

గుంటూరు జిల్లా పలనాడులో కారెం పూడికి ఎనిమిది కిలో మీటర్ల దూరం లోపెద్ద కొదమ గుండ్ల గ్రామంలో శ్రీ ఉత్తరేశ్వరాలయం ఉన్నది, 11 42లో పలనాటి సీమను పాలిచిన అనుగు రాజు పెంపుడు కొడుకు ''ఉత్తరుడు

"పల్నాటి యుద్ధం లో మరణించాడు, అతని జ్ఞాపకార్థం రాజు శ్రీ ఉత్తరేశ్వరాలయం "నిర్మించాడు, స్వామి ఇక్కడ ఉత్తర ముఖంగా దర్శనమివ్వటం ప్రత్యేకత, స్వామికి ఎదురుగా గర్భాలయం లో శ్రీ శంకర స్వామి ఆత్మ లింగం ప్రతిష్టిత మైంది, అమ్మవారు పార్వతీదేవి, భద్రకాళీ సమేత శ్రీ వీరభాద్రాలయం కూడా ఉన్నది, ఈ నాలుగు ఆలయాలను కలుపుతూ 12 స్తంభాల మండపం ఉంది, కొన్ని ఉత్సవాలు మాత్రమె ఇక్కడ చేస్తారు.

## 27 ద్రైద అమరలింగేశ్వరాలయం గుత్తికొండ బిలం



గుంటూరు జిల్లా పిడుగు రాళ్ళకు 25 కిలో మీటర్ల దూరం లో ఉన్న గుత్తికొండ లో ఒక మహా బిలం ఉంది, చుట్టూ పర్వతాలు మధ్యలో బిల సముదాయాలు కంటికి విందు గా ఉంటాయి, ఈ బిలం ప్రకృతి సిద్ధంగా ఏర్పడినది, బిలం ప్రధాన మార్గం నుంచి లోపలి వెడితే చీకటిలో కొలువై ఉన్న "చీకటి మల్లయ్య "దర్శన మిస్తాడు, కటిక చీకటి కన్ను పొడుచుకున్నా వెలుతురూ కాన రాదు, అలాంటి చీకటిలో విద్యుద్దీప కాంతి తోడ్పాటుతో ముందుకు వెడితే నీటి కొలను వస్తుంది, రూపాయ నాణెం కింద పడేసినా కనిపించేంత అచ్చమైన స్వచ్చమైన జలం అందులో ఉంది ఆశ్చర్య పరుస్తుంది, భక్తులు ఈ స్వచ్చ జల కోనేటిలో పవిత్ర స్నానాలు చేసి, ప్రధాన బిలం గుండా ముందుకు వెళ్లి స్వామిని దర్శిస్తారు. దారిలో 101 బిలాలున్నాయని చెబుతారు, ఇంకా ముందుకు వెడితే గరళం సేవించిన శివుని విగ్రహం కనిపిస్తుందని అంటారు,





ఈ బిలానికి ద్వాపర యుగానికి చెందిన చరిత్ర ఉంది,. కాలయవున రాక్షస సంహారం కోసం శ్రీ కృష్ణుడు ఈ బిలం లో ప్రవేశించాడు, అక్కడ మహా తపస్సాదనలో మునిగి ఉన్న "ముచి కుంద మహర్షి" పై కృష్ణుడు తన ఉత్తరీయం కప్పి ముదుకు వెళ్లి దాక్కుంటాడు, కృష్ణుని వెతుక్కుంటూ వచ్చిన కాలయవండు ముచి కుందమని దగ్గరకు రాగానే ఉత్తరీయం చూసి కృష్ణుడే అనుకోని తపో భంగం కలిగిస్తాడు, ముని కోపం తో తీక్షణంగా చూడగానే కాలయవనుడు మాడి మసి ఐ పోతాడు, వాడి మరణం ముని చేతిలో ఉందని కృష్ణుడు ఈ మాయో పాయం పన్ని లోక కంటకుడైన వాడిని సంహరింప జేసి లోక కల్యాణం చేశాడు, , అందుకే కాలయవన సంహారిణేనమః ""ముచి కుంద వరదాయనమః "అనే నామాలు కృష్ణ అష్తోత్తరం లో చేరాయి,

గురజాలకు 15 కిలోమీటర్లలో కృష్ణానదీ తీరాన స్వయంభువుగా గుహలో వెలసిన శ్రీ అమర లింగేశ్వర స్వామి ఉన్నాడు. ఇదీ చీకటి గుహాయే, దీపాల వెలుగుతో సరంగ మార్గం గుండా 40౦ మీటర్లు అడిచి వెళ్లి అమరేశ్వరుని దర్శించాలి, పల్నాటి యుద్ధం అయిపోయిన తర్వాత బ్రహ్మ నాయుడు ఈ బిలం లోకే ప్రవేశించాడని చారిత్రిక కధనం, కష్టపడినా తప్పక దర్శించాల్సిన క్షేత్రాలివి

## 28 స్వయంభు శ్రీ మూల స్థానేశ్వ రాలయం నాదెండ్ల

గుంటూరు-చెన్నై మార్గం లో గుంటూరుకు 35 కిలోమీటర్లలో నాదెండ్ల ఉంది,, గ్రామ మధ్య లో శ్రీ స్థానేశ్వర



స్వామి ఆలయం పురాతనమై విశిష్టత కలిగి ఉంది, ద్వాపర యుగం తర్వాత ఈ స్వామితో బాటు లలితా త్రిపురసుందరి మార్కండేయ మహర్షులను ప్రతిష్టించారు, ఆలయం ముందు స్థూపాకృతి లో పంచకలశాలతో నాలుగు అంతస్తులతో రాజగోపురం ఉన్నది, గోపురం పై శివలీలలు, అనేక దేవీ దేవతా విగ్రహాలు, శక్తి స్వరూపాలు చెక్కారు,. ప్రాంగణం లో నందీశ్వరుడున్నాడు ధ్వజస్తంభం ఉన్నది,

గర్భాలయం అనబడే కైలాస మండపం లో పాన వట్టం పై మూల స్థాన లింగేశ్వర స్వామి దర్శన మిస్తాడు, అభిముఖంగా నందీశ్వరుడున్నాడు, నిత్యపూజలు విశేషార్చనలు కళ్యాణోత్సవాలు, రదోత్సవాలతో ఆలయం ఎప్పుడూ శోభాయమానంగా ఉంటుంది, సర్వాలంకార భూషిత గా, చతుర్భుజాలతో శ్రీ లలితా పరా భట్టారిక దివ్య దర్శనం



అనుభావైక్ వేద్యం, అమ్మవారి పాద పీఠంవద్ద" శ్రీ చక్రం "ఉండటం పరమ విశేషం, క్షేత్రపాలకుడు శ్రీ వీరభద్ర స్వామి.

## 29 శ్రీ గోవర్ధనేశ్వర దేవాలయం నాదెండ్ల



ఒకప్పుడు నంద వంశ రాజుల పాలనలో నాదెండ్ల ఉదేదని, అప్పుడు దానిపేరు "నందపురమని" కాలక్రమాన అదే నాదెండ్ల గా మారిందని చారిత్రిక కధనం, ఇక్కడ నంద వంశ కులదీపకుడు శ్రీమన్నారాయణ మూర్తి శ్రీ గోవర్ధనేశ్వరుడిగా శ్రీ చెన్నకేశుడి గా విరాజిల్లుతున్నాడు, కొండవీటి రెడ్డి రాజులకాలం లో మహా వైభవం గా వర్ధిల్లింది, కొండపై గోవర్ధన స్వామి గ్రామం లో కేశవస్వామి ఆలయాలున్నాయి, మూడు అంతస్తుల రాజగోపురమున్నది, క్షేత్ర పాలకుడు శ్రీ ఆంజనేయ స్వామి

గోవర్ధనస్వామి ఆలయానికి కి కుడివైపు, రాజ గోపురం దగ్గర శ్రీ కేశవ స్వామి ఆలయం ఉన్నది, జయ విజయులు ద్వారపాలకులు, కేశి అనే రాక్షసిని సంహరించటం వలన విష్ణువుకు కేశవుడు అనే పేరొచ్చింది, స్వామికి ఇరువైపులా శ్రీదేవి భూదేవి ఉంటారు, ముక్కోటి, శ్రీక్రిష్ణాస్టమి వైభవం గా చేస్తారు,

ఇక్కడి ఆంజనేయస్వామి స్వయంభు రాతి గుట్టలలో వెలిశాడు, ఆ రాతికొండ తో సహా తెచ్చి 1924 లో ప్రతిష్టించారు, హనుమజ్జయంతిని మహా విశేషంగా నిర్వహిస్తారు,



## 30 పరీక్షలలో ఉత్తీర్ణత నిచ్చే శ్రీ అగస్త్యేశ్వర స్వామి ఆలయం వంగిపురం

గుంటూరు జిల్లా ప్రత్తిపాడు మండలం లో వంగిపురం ఉంది, ఇక్కడ గంగా పార్వతీ సహిత శ్రీ అగస్త్యేశ్వరాలయం ప్రాచీనమైనది,



11 వ శతాబ్ది లో చోళ రాజులు నిర్మించిన ఆలయం, అగస్త్య మహా ముని ప్రతిష్టిత లింగం, చోళ రాజులు గర్భాలయ నిర్మాణం చేశారని శాసనాలలో ఉంది, సుమారు 1,0 oo ఏళ్ళ కిందట శ్రీ వల్లూరు ఆనందయ్యగారు ఇప్పుడున్న ఆలయాన్ని నిర్మించారని గోపుర శాశనం తెలియ జేస్తోంది, గర్భాలయం లో లింగ రూప శివుడికి చేసే ప్రత్యేక అలంకరణ తో కైలాసనాధుడు విగ్రహ రూపం లో ఉనట్లు కని పించటం ఇక్కడి గొప్ప విశేషం, గణేశ, పార్వతీ దేవి విగ్రహాలున్నాయి, ముఖ మండపం లో శ్రీ కాళికాదేవి శ్రీ వీరభద్రస్వామి దర్శన మిస్తారు, పరీక్షలు రాసే వారందరూ ఈ ఆలయ సందర్శన చేసి పూజిస్తే ఘన విజయాలు సాధిస్తారనే నమ్మకం బాగా ఉంది, స్వామి వివాహ వేడుకలను ఘ నంగా నిర్వహిస్తారు,

ప్రకాశం జిల్లా

# 31 అష్ట శివలింగ క్షేత్రం భైరవ కోన




నెల్లూరు –ప్రకాశం జిల్లాల సరిహద్దు లో కొత్తపల్లి గ్రామానికి అయిదు కిలోమీటర్ల దూరం లో ఉన్న భైరవ కోన గుహాలయం జగత్ ప్రసిద్ధమైనది, అపర అమరనాధ క్షేత్రంగా ప్రఖ్యాతమైంది, ఆదిదంపతులైన పార్వతీ పరమేశ్వరులు భైరవ కోన గుహ లో ఉండేవారని, , ఈ ప్రాంతంలోని ప్రకృతి దృశ్యాలు వారికి





మహదానందం కలిగించాయని, అందుకే మధ్యప్రదేశ్ లోని అమరానాద్ శివలింగాన్ని పోలిన శివలింగాన్ని భైరవ కోన గుహాలయం లో ప్రవేశ పెట్టి వెళ్ళారని కధనం, కనుక దీనికి అపర అమరనాధ క్షేత్రం అనే పేరొచ్చింది,. సుమారు రెండువందలయాభై

కిలోమీటర్లలో విస్తరించిన నల్లమలారణ్యం లో భైరవ కోన ఉంది, ఇక్కడ ఎక్కడ చూసినా శివలింగ రూపాలే దర్శనమివ్వటం పరమాశ్చర్యం, దీనికి మించి ఒకే కొండపై ఎనిమిది శివాలయాలు చెక్కి ఉండటం మరీ ఆశ్చర్యం, ఇక్కడి దుర్గాంబ ఆలయం లో కార్తీక పౌర్ణమి రోజున అమ్మవారిపై చంద్ర కిరణాలు పడటం మహా విశేషం, చూసి తరించటానికి వేలాది భక్తులు భైరవ కోన చేరుకొంటారు,



మహా శివరాత్రి రోజున ప్రక్కనే ఉన్న జలపాతపు కోనేటిలో పవిత్ర స్నానాలు చేసి, ఒకే కొండపై ఉన్న ఎనిమిది శివాలయాలను సందర్శించి పుణ్యం మూట కట్టుకొంటారు, ఇందులో ఏడు దేవాలయాలు తూర్పుముఖం గా ఒక్క దేవాలయం ఉత్తర ముఖంగా ఉండటం మరో విశేషం, ఈ ఎనిమిది ఆలయాల గర్భాలయాలు వరండాలు స్తంభాలు అన్నీ కూడా ఆ కొండ రాయి లోనే మలచటం మరీ వింత, శివలింగాలను మాత్రమే గ్రానైట్ శిలతో చెక్కి ప్రతిష్ట చేశారు,

ఈ గుహాలయాలలో ఉన్న ప్రధాన దైవాన్ని "భర్గేశ్వరుడు "అంటారు, అందుకే ఈ క్షేత్రాన్ని బైరవ క్షేత్రం గా బైరవ కోనగా పిలుస్తారు, క్షేత్ర పాలకుడు కాల బైరవుడు,. ఒకప్పుడు ఈ ప్రాంతాన్ని కాలబైరవ చక్రవర్తి పాలిచాడని అంటారు, దీనికి సాక్షీభూతంగా ఇక్కడ కోటల ఆనవాళ్ళు చాలా కనిపిస్తాయి,. ఈ గుహాలయాలలోని శివలింగాలు ప్రసిద్ధ శివాలయ లింగాలను పోలి ఉండటం ఒక విశేషమేకాడు ఈ లింగాలను ఆ లింగాల పేర్లతో పిలవటమూ మరో విశేషం, మధ్య ప్రదేశ్ అమర నాద లింగమైన "శాశినాగ లింగం ",మేరుపర్వతం లోని "రుద్రలింగం ",కాశీలోని విశ్వేశ్వర లింగం, తిరుమలగిరులలోని "నగరికేశ్వర లింగం ",భర్గేశ్వర లింగం, రామేశ్వరం లోని "రామ లింగే శ్వర లింగం "శ్రీ శైల "మల్లికార్జున లింగం "మంద పర్వతం లోని "పక్ష ఘాత లింగం ",మొదలైన పేర్లతో ఇక్కడి లింగాలను పిలిచి, కొలుస్తారు,





.ఉత్తర మఖం గా ఉన్న మొదటి శివాయం ఎదురుగా



నందీశ్వరుడు ఉంటాడు, ద్వారపాలకులు "తలపాగాలు "ధరించి ఉండటం కొత్త విషయం, ఈ గుహలలో ఏడవ గుహ అత్యంత సుందరంగా ఉంటుందని చెబుతారు, ఎనిమిదవ గుహాలయం లో శివ లింగం తో బాటు, బ్రహ్మ, విష్ణు విగ్రహాలు కూడా చెక్కబడి ఉండటం వింతలలో వింత అవటమేకాడు శివ కేశవ అభేదానికి తార్కాణ, త్రిమూర్తులు ఒకే చోట కొలుపై ఉన్న అపూర్వ క్షేత్రం భైవర కోన,

ఆలయ నిర్మాణం క్రీ శ.6 00 -30 ప్రాంతం లో రాజా మహేంద్ర వర్మ కాలం లో ప్రారంభించి ఉంటారని చారిత్రిక కధనం, ఈ ప్రాంతం లో అనేక గుండాలూ, దోనెలు చూడాటానికి ముచ్చటగా ఉంటాయి, అందులో సోమనాధ, పాల, కాళింగ దోనలు, పార్వతి , కాముని, సరస్వతి, త్రివేణి, పాచిక గుండాలను తప్పక చూడాల్సిందే, అడవి మార్గం కనుక కస్టపడి నడిచే వెళ్లి చూడాలి,

## 32 జనమేజయ ప్రతిష్టిత శ్రీ రామ లింగేశ్వరాలయం సత్యవోలు



ప్రకాశం జిల్లా గిద్ద లూరు కు సుమారు



పది కిలో మీటర్ల దూరం లో సత్య వోలు గ్రామం లో పాండవ అభిమన్యుని మనుమడు, పరీక్షిత్తు కుమారుడు జనమేజయ చక్ర వర్తి ప్రతిష్టించిన శ్రీ రామ లింగ ఆలయం అతి ప్రాచీనతరమైనది, ప్రసిద్ధమైనది, తరువాత చాళుక్య రాజులు దేవాలయ నిర్మాణం చేశారు, 6 వ శతాబ్దికి చెందిన బాదామి చాలుక్యులకాలం లో ఆలయం నిర్మింపబడింది, చాలా ఎత్తైన ఆలయం, ఆలయ శిల్ప నిర్మాణం మహా నంది దేవాలయ నిర్మాణాన్ని పోలి ఉంటుంది, మహానంది ఆలయాన్నీ చాలుక్యులే నిర్మించారు, ఇక్కడ చాళుక్య శైలిలో భీమేశ్వర, రామ లింగేశ్వరాలయాలు ప్రసిద్ధమైనవి, వీటిని జాతీయ వార సత్వ సంపదగా ప్రభుత్వం గుర్తించటం విశేషం, గర్భ గుడి గోడల గూళ్ళలో ఈశ్వరువిగ్రహం లింగోద్భవ మూర్తి, దుర్గా దేవి ప్రతిమలున్నాయి,



గర్భ గుడి మధ్య లో శ్రీ రామ లింగేశ్వర లింగం ఉంటుంది, ఆలయ శిఖరంపై ఉన్న కలశం కనుల విందు చేస్తుంది, పెద్ద మండపం, దక్షిణాన చతుర్భుజ దేవతా మూర్తి, మధ్యలో నటరాజ విగ్రహం ఉంటాయి,

ఆలయ ప్రాంగణం లో 6 దేవాలయాలున్నాయి, వీటిలో పెద్దది భీమేశ్వరాలయం, ముఖద్వారం తూర్పుదిశలో ఉన్నా మిగిలిన మూడు వైపులనుంచీ ఆలయానికి వచ్చే ద్వారాలు ఉండటం మరొక విశేషం, మహా శివరాత్రి నాడు కార్తీకమాసం లోను భక్తులు విశేష సంఖ్యలో దర్శిస్తారు,

## 33 సంతాన ప్రదాత పాలంకేశ్వర స్వామి పాలుట్ల



ప్రకాశం జిల్లా యెర్ర గొండపాలెం నుంచి యాభై కిలోమీటర్లలో నల్లమల అడవుల్లో అతి ప్రాచీన శ్రీ పాలంకేశ్వరాలయం ఉంది, ఆలయ సమీపం లో 10౦ అడుగుల ఎత్తునుంచి కిందపడే జలపాతం పరవశం కలిగిస్తుంది, గంగ గా పిలువబడే దీనిలో పుణ్య స్నానాలు చేసి స్వామిని దర్శిస్తారు, ఇది గిరిజన ప్రాంతం కనుక ఇక్కడి కాళికా అమ్మవారిని పుట్టలమ్మగా భావించి పూజిస్తారు, సంతానం లేని దంపతులు ఉపవాసం ఉండి, కొండ చరియలపై నుండి పంచ లింగాల పై జారిపడే నీటి బిందువులకోసం దోసిలి పడతారు, ఆ దోసిలిలో నీటి బిందువులు పడితే సంతాన ప్రాప్తి కలుగుతుందని నమ్ముతారు, ఈ విధంగా సంతానం పొందినవారు మళ్ళీ ఈ క్షేత్రానికి వచ్చి స్వామి పేరు కలిసివచ్చేట్లు నామకరణం చేసి, పుట్టు వెంట్రుకలను ఇక్కడే తీర్చుకొనే సంప్రదాయం ఉంది, పాలంకేశ్వరాలయం ఒక పెద్ద కొండ చరియ కింద ఒదిగి ఉన్నట్లుగా అతి సహజంగా ఉండటం పరమాద్భుతం. దీని కింద కనీసం అయిదు వేల మంది భక్తులు ఉండే వీలుంటుంది, ఇక్కడి వీరభద్రస్వామి విషయం స్కాంద పురాణం లో వర్ణించ బడి ఉన్నది,



తొలి ఏకాదశి ద్వాదశి రోజుల్లో పెద్ద ఎత్తున శ్రీ పాలంకేశ్వరతిరునాళ్ళు జరుగుతంది, అధిక సంఖ్యలో భక్తులు పాల్గొంటారు, అడవిలో సుమారు ఎని మిది కిలో మీటర్లు నడిచి ఆలయం చేరుకొంటారు, ముందు కృష్ణానది ఒడ్డునున్న '' ఆలాటం కోట ''కు చేరి రాత్రి అక్కడే ఉండి,

మర్నాడు ఏకాదశి ఉదయాన పవిత్ర క్రష్ణా స్నానం చేసి, నడిచి పాలక తీర్ధం చేరి పాలంకేశ్వరుని దర్శించి పూజిస్తారు,

## 34 శ్రీరామ ప్రతిష్టిత శ్రీ రామ లింగేశ్వరాలయం అద్దంకి



గుండ్లకమ్మ నదీ తీరాన అద్దంకిలో మహా మహిమాన్వితమైన పురాతనమైన శ్రీరామ ప్రతిష్టిత శ్రీ రామ లింగేశ్వరాలయం ఉంది, ఇక్కడికి అగస్త్యమహాముని వచ్చి సందర్శించినట్లు పురాణ కధనం, 1324 -1434 కాలం లో ప్రోలయ వేమా రెడ్డి అద్దంకిని రాజధానిగా చేసుకొని ఆంధ్ర దేశాన్ని పాలించాడు, కవిత్రయం లోని ఎర్రాప్రగడ ఇక్కడివాడే ఈ ఆస్థానకవే, రెడ్డిరాజులకాలం లో సాహిత్యం సంస్కృతీ విశేషంగా వర్ధిల్లింది అని వామన భట్టు రచనలలో ఉంది, ఇక్కడి అమ్మవారు పార్వతీ దేవి, నటరాజస్వామి వీర భద్రుడూ కొలువు తీరి ఉంటారు, బయట నిలు వెత్తు ఆంజనేయస్వామి దర్శన మిస్తాడు, ఈయనకు తూర్పున వినాయకుడు, యక్షిణులు, శిధిల శాసనాలు ఉన్నాయి. బ్రహ్మ వైవర్తన పురాణం లో బ్రహ్మ కుండీ నదీ తీరాన అద్దంకి, చక్రాయణ, నృసింహ పురాలున్నాయని వర్ణింప బడింది, కనుక అద్దంకి చరిత్రాతీత ప్రాచీననగరం, రెడ్డిరాజులు, విజయనగర ప్రభువుల కాలం లో అన్నిరంగాలలోనూ విశేషమైన అభివృద్ధి చెందింది, అద్దడు, అంకి అనే ఇద్దరు వడ్డె కులం వారు తమ రాజుగారి కోట నిలవడానికి కోసం, ప్రాణలను సమర్పించుకొన్నారు. అందుకే ఈ ప్రాంతానికి అద్దంకి అని పేరు వచ్చింది

## 35 "కొల మానిక" లింగంగా మారిన శ్రీ మల్లేశ్వర స్వామి మణికేశ్వరం



ప్రకాశం జిల్లా అద్దంకి మండలం మణికేశ్వరం అనే ఊరిలో గంగా భ్రమరాంబా సమేత శ్రీ మల్లేశ్వరస్వామి దేవాలయం పురాణ ప్రసిద్ధమైనది, ఎన్నో వందల ఏళ్ళుగా వర్ధిల్లిన ఆలయం, దీనిపై అనేక గాధలు శైవ పురాణాలలో ఉన్నాయి, మానిక తో ఉప్పు కొలిచి అమ్మే ఒక వ్యాపార శివ భక్తుడు ఒక శివ రాత్రి నాడు శివపూజకు శివ లింగం దొరకక, తనదగ్గరున్న "మానిక "నే శివలింగం గా భావించి బోర్లించి, విబూదితో అలంకరించి భక్తితో పూజించాడు, అతని భక్తికి ఆ మానికయే శివలింగం గా మారింది, అప్పటి నుంచి ఆ లింగమూర్తిని "మానిక ఈశ్వరుడు "అనే వారు. అదే కాలక్రమం లో మాణిక్యేశ్వరలింగం గా ఆ క్షేత్రం మణికేశ్వరం గా ప్రసిద్ధి చెందింది, అదే మల్లేశ్వరం అయింది, అగస్త్య మహర్షి ఈ లింగాన్ని ప్రతిష్టించినట్లు కధనం, ఇక్కడ విశేషం ఒకటి ఉంది, కొండ, కొండకింద ఈ దేవాలయం, ప్రక్కన గుండ్ల కమ్మ (గుండీ నది )జీవనది, ఒడ్డున శ్మశాన వాటిక ఉన్నాయి, ఇన్ని విశేషాలు ఉండటం తో "దక్షిణ కాశి "గా ప్రసిద్ధి చెందింది, ఆలయ నిర్మాణం 1202 లో జరిగినట్లు ఆధారాలున్నాయి, మొదట్లో ఈ గ్రామం పేరు "బుద్దం పూడి "అనీ, శ్రీ



మహా మండలేశ్వర "చోడ దేవ మహా రాజు " కాలం నాటిదని భావిస్తారు, కార్తీక, మాసం, శివ రాత్రి పర్వ దినాలలో మహా వైభవం గా ఉత్సవాలు నిర్వహిస్తారు,

## 36 శ్రీలింగోద్భవ దేవాలయం చదలవాడ



ఒంగోలు మండలం లో ఉన్న చదలవాడ గ్రామం లో శ్రీ లింగోద్భవ దేవాలయం చాల పురాతనాలయం, పూర్వం "చతుర్వాటిక అని పిలువా బడిన గ్రామమే 'చదలవాడ అయింది, కాకతి గణపతి దేవునికాలం లో పురుషోత్తముడు అనే రాజు అమ్మన బ్రోలు సీమలో ఉన్న పోతవరం గ్రామాన్ని ఈ ఆలయానికి దానం చేసినట్లు శాసనాధారం ఉన్నది, కానీ దీనికి చాలా కాలం పూర్వమే ఆలయం ఉన్నట్లు స్థానిక కధనం, కనుక చరిత్రాతీతమైన ఆలయం, తూర్పుముఖంగా ఉన్న ఈ ఆలయం లో గర్భాలయం లో శ్రీ లింగోద్భవ స్వామి దర్శన మిస్తాడు, వినాయకుడు మొదలైన దేవతా గణం అందరూ ఉన్నారు, గోపురంపై శిల్పకళ కనువిందు చేస్తుంది, ఎత్తైన ధ్వజస్తంభం ఆకర్షణీయం, నిత్యపూజాభిషేకాలు, ప్రత్యేక ఉత్సవాలు బాగా నిర్వహిస్తారు,



## 37 శ్రీ నగరేశ్వరాలయం పొదిలి

ప్రకాశం జిల్లా పొదిలిమండలం పొదిలి పట్టణం లో శ్రీ నగరేశ్వరాలయం కూడా చాలా ప్రాచీనమైనదే, దీనితోబాటు ఇక్కడ పంచ శివ లింగ క్షేత్రాలున్నాయి, పూర్వం దీనికి "పంచ కోవెలల పొదిలి "అనే పేరు ఉండేది, అదే పొదిలి అయింది, సుమారు మూడు ఎకరాల విస్తీర్ణం లో అయిదు శివాలయాలున్నాయి, పార్వతీ సహిత శ్రీ కైలాస నాద స్వామి, త్రిపుర సుందరీ సమేత శ్రీ భీమేశ్వర స్వామి, శ్యామలా సహిత నగరేశ్వర స్వామి ఆలయాలతో బాటు నిర్మంహేశ్వర, మల్లనాద ఆలయాలున్నాయి, కృష్ణ దేవరాయల సామంత రాజు ఎల్లరాజు పెదకొండమ రాజు ఇక్కడ దక్షిణ దిశలో "నిమ్మవ్వ గుడి "కట్టించాడు, ఇందులోదూడమల్లన్న విగ్రహమూ ఉంది, పోదిలి పట్టణానికి తూర్పున నగరేశ్వరాలయం ఉంది, 16 వ శతాబ్దం లో ఢిల్లీ రాజు ఆలీ ఆదిల్షా ఈ ఆలయాన్ని కూల్చేసి అక్కడే మసీదు కట్టాడు, కాలక్రమంలో గ్రామ వైశ్యులు కలిసికట్టుగా మళ్ళీ శ్రీ నగరేశ్వరాలయంను నిర్మహేశ్వరాలయ ప్రాంగణం లో నిర్మించారు, ఆలయ పరిధిలో పుష్పగిరి పీఠాధిపతిశ్రీ ఉద్దండ నరసింహ భూపతి గారి జీవ సమాధి ఉన్నది, నగరేశ్వరాలయం లో అన్ని రకాల పూజా అభిషేకాలు నిర్వహిస్తారు పండుగ, పర్వ దినాలలో ఉత్సవాలు చేస్తారు,

## 38 రాక్షస ప్రతిష్ఠిత శ్రీ మోక్ష రామ లింగేశ్వర క్షేత్రం రామ తీర్థం

త్రేతా యుగం లో ఈ ప్రాంతమంతా దట్టమైన దండకారణ్యం, రావణాసురుని ఏలుబడిలో ఉండేది, అప్పుడు రాక్షసులు ఇక్కడ శివ లింగాన్ని ప్రతిష్టించి పూజించారు, రామ రావణ యుద్ధం లో రావణ వధ తర్వాత శ్రీ రాముడు బ్రహ్మ హత్యా దోష నివారణకు శివలింగాలను వీలైన చోట్ల ప్రతిష్టించాడు, అప్పుడు ఇక్కడికి వచ్చి



స్వామిని దర్శించి ఒక కోనేరును ఆలయం వెనుకభాగం లో త్రవ్వించాడు, ఇదే "రామ తీర్థం "గా ప్రసిద్ధి చెందింది, రాక్షస పీడ తొలగి మునులు హాయిగా మళ్ళీ ఇక్కడ తపస్సు చేస్తూ యజ్ఞ యాగాదులు నిర్వహించారు, రామ తీర్థం లోని మట్టిని నుదుట ధరిస్తే, అది విభూతిలాగా తెల్లగా మారిపోవటం విశేషం, ఇప్పటికీ ఈ మహాత్మ్యం జరుగుతూనే ఉంది.

ఒంగోలు నుండి శ్రీశైలం పోయే దారిలో ఒంగోలుకు 25 కిలోమీటర్ల లో రామ తీర్థం ఉంది ఇక్కడి శివుడిని "మోక్ష రామ లింగేశ్వరుడు "అంటారు, అమ్మవారు పార్వతీ దేవి దక్షిణ ముఖంగా ఉంటుంది, శివరాత్రికి కార్తీకమాసం లోను భక్తుల రద్దీ అనూహ్యం. కల్యాణం జరుగుతుంది, ఈశాన్యం లో గంగాదేవి ఆలయం ఉంది, చైత్ర పౌర్ణమినాడు గంగ జాతర పెద్ద ఎత్తున జరుగుతుంది.



## 39 స్వయంభు శ్రీ ముక్తేశ్వరాలయం మోక్ష గుండం



ప్రకాశం జిల్లా మోక్ష గుండం లో తూర్పు కనుమల లోయలలో స్వయంభు శ్రీ ముక్తేశ్వరాలయం ప్రాచీనాతి ప్రాచీనాలయం, తండ్రి జమదగ్ని మహర్షి ఆజ్ఞను శిరస్సున



దాల్చి తల్లి రేణుకా దేవి ని సంహరించాడు పరశురాముడు, ఆ పాప పరిహారం కోసం శివాలయాలను సందర్శిస్తూ వీలైన చోట్ల లింగ ప్రతిష్ట చేశాడ్రు భార్గవ రాముడైన పరశురాముడు, ఆ సందర్భం లో ఇక్కడికి కూడా వచ్చి శ్రీ ముక్తేశ్వర సేవలో పునీతుడై ముక్తిని పొందటం చేత దీనికి ముక్తేశ్వర క్షేత్రం అనే పేరొచ్చిందని స్థానిక పౌరాణిక కధనం, గర్భ గృహం లో ఉన్న శివలింగాన్ని వసిష్ట మహర్షి ప్రతిష్టించాడని విశ్వాసం, సీతారాములు ఇక్కడికి వచ్చి స్వామి దర్శనం చేసి ఇక్కడ త్రాగటానికి నీరు లభించ నందువల్ల, రాముడు బాణం తో

నేలను చేదించి, పాతాళ జలం ఉప్పొంగి భూమి పైకి వచ్చేట్లు చేశాడు, ఈనీటి ధారతో ఏర్పడిన జలాశయాన్ని "శ్రీరామ కోనేరు "అంటారు, ఈ కోనేటి పవిత్ర స్నానం చేస్తే మోక్షం ఖాయం అని భక్తుల అచంచల విశ్వాసం, అందుకే ఇది "మోక్ష గుండం "అయింది అనే కధనమూ ఉంది,. అన్నిరోజులు, ప్రత్యేక ఉత్సవాలలు ఘనం గా నిర్వహిస్తారు,

## 40 ఒక దెబ్బకు 108 సార్లు ఓంకారం ధ్వనించే ఘంట ఉన్న శ్రీ రామలింగేశ్వరాలయం సంతరావూరు



ప్రకాశం జిల్లా చిన గంజాం మండలం లో వారానికి ఒక సారి సంత జరిగే రావూరు ను సంత రావూరు అంటారు, ఇక్కడి శ్రీ పార్వతీ పరమేశ్వర రామ లింగేశ్వరాలయం అతి ప్రాచీనమైనది, ఆలయం బకింగ్ హాం కాలువ ఒడ్డున ఉంది, ఆలయ గర్భాలయ ఘంట కు ఒక ప్రత్యేకత ఉంది, ఒకసారి లాగి ఘంటను మ్రోగిస్తే ఏకం గా 108సార్లు అందులో నుంచి ఓంకార నాదం వచ్చి వొడలు గగుర్పొడుస్తుంది, ఇదీ ఇక్కడి విశేషం, కాశీ లోని శ్రీ విశ్వనాదాలయం లోని ఘంటకూ ఈ ప్రత్యేకత ఉంది, మళ్ళీ ఇక్కడే అలా వినిపిస్తుంది, ఈ రెండు విశిష్ట ఘంటలను ఒకే వ్యక్తీ తయారు చేసినవేనని భావిస్తారు,

12వ శతాబ్ది లో చోళ రాజు పరిపాలనాకాలం లో ఎన్నో దేవాలయాలను నిర్మించాడు సంత రావూరు శివలింగాన్నీ ఆరాజే ప్రతిష్ట చేసి నిర్మించాడు, ఇక్కడి శివలింగం స్వయం భు,. ఆలయం లో రెండు నందులు ఉండటం మరో విశేషం, గర్భ గుడిలో వెలిగించిన దీపం బయటి నుంచి కూడా చూడ గలగటం మరో ప్రత్యేకత, ఇది ఆ నాటి శిల్ప కళా మర్మజ్ఞాతకు గొప్ప ఉదాహరణ,

ఆలయ శిలాశాసనం పై ఒక చారిత్రిక గాధ చెక్క బడింది, అమ్మవారి విగ్రహాన్ని ఇద్దరు శిల్పులు చెక్కారు,, ఒక శిల్పి రాజు అనుమతి తో అమ్మవారి విగ్రహాన్ని ఒక మహిళను చూస్తూ చెక్కాడు, విగ్రహం పూర్తీ అయ్యేవరకు తలుపులు తీయవద్దని శిల్పి కోరాడు, యాభై రోజులు అయింది అసలు శిల్పులు చెక్కుతున్నారా బతికే ఉన్నారా అని అనుమానం రాజు కు వచ్చింది, బలవంతంగా తలుపులు తెరిచి చూదమని ఆదేశించాడు, అంతే తలుపులు తెరిచే సరికి ఆ ఇద్దరు శిల్పులు చనిపోయి కని పించారు, అప్పటికి విగ్రహం పాదాల వరకే చెక్క బడింది, అప్పుడు చోళ రాజు మరొక శిల్పితో అమ్మవారి విగ్రహం చెక్కించి ప్రతిష్టించాడు, ఇది మరో వింత విశేషం విచిత్రం,

## 41 శ్రీ కనక సురభేశ్వరాలయం తురిమెళ్ళ



ప్రకాశం జిల్లా కంభం మండలం లోని తురిమేళ్ళ గ్రామం లో అరుదైన ప్రాచీన శ్రీ కనక సురభేశ్వరాలయం ఉన్నది, ఇక్కడ జమదగ్ని మహర్షి తపస్సు చేసినందువలన ఈ కోనను జమదగ్ని కోన అని ఈ క్షేత్రాన్ని జమదగ్ని క్షేత్రమనీ అంటారు, ఆలయం త్రేతాయుగం నాటిదని పౌరాణిక కధనం, ఇక్కడ జమదగ్ని ఆశ్రమం ఉండేది, ఇక్కడ శ్రీ పాపేశ్వరా స్వామి ఆలయానికి తూర్పున ఉన్న నంది విగ్రహానికి ఒక కద ప్రచారం లో ఉంది,

ఒక యజమాని కోపం తో తో ఒక ఎద్దును విపరీతంగా కొట్టగా కాలు విరిగి కుంటుకుంటూ, గుండ్లకమ్మ నదిని ఈదు కొంటూ వచ్చి ఈ ఆలయం బయట అలసట తీర్చుకొని శిలగా మారి పోయింది, అదే ఇప్పుడు అక్కడున్న నంది

సురభేశ్వర కోన ను పాలించిన రాష్ట్ర కూట, చోళ చాళుక్య, కాకతీయ, విజయనగర రాజులు వేయించిన శిలా శాసనాలున్నాయి, ఇక్కడి ఆలయ శిల్ప కళా శోభ వర్ణనాతీతం, గుండ్లకమ్మ వరదలలో, కొంత ప్రభుత్వ అలక్ష్యం వలన కొన్ని దేవాలయాలు శిధిలమైపోయాయి, కొన్ని కొట్టుకు పోయాయి, కొన్ని దొంగల పాలయ్యాయి, ఇప్పుడు ప్రజలలో చలనం వచ్చి పూనుకొని శ్రద్ధ వహించి కాపాడుకొంటున్నారు, కొత్తవాటిని ఏర్పాటు చేస్తున్నారు, ఇక్కడి కోన లోని "పాప నాశన" మందిరానికి దగ్గరలో ఉన్న అనేక శివ లింగాల సముదాయాన్ని "కోటి లింగాల గుట్ట "అంటారు, విజయనగర రాజు హరిహరరాయలు గోహత్యా పాతకం పోగొట్టుకోవటానికి ఈ క్షేత్రానికి వచ్చి స్వామిని దర్శించి "పాప వినాశనం "అనే మందిరాన్ని నిర్మించి అందులో శివలింగ ప్రతిష్ట చేసి కొన్ని రోజులు ఇక్కడే ఉండి,పూజ అభిషేకాలు భక్తీ శ్రద్ధలతో చేసి పాప విముక్తడయ్యాడని చారిత్రిక కధనం, అన్ని రోజులలో పూజలు జరుగుతాయి పండుగ పర్వ దినాలలో విశేశార్చనలున్నాయి '

## 42 అగస్త్య ప్రతిష్టిత గంగా పార్వతీ సమేత శ్రీ రామ లింగేశ్వరాలయం నరసింగోలు



అగస్త్య మహర్షి వాతాపి ఇల్వలుడు అనే ఇద్దరు రాక్షసులను సంహరించి ప్రజల బాధలకు విముక్తి కల్గించాడు, ఈ రాక్షఅ సంహార దోష నివారణకోసం పాలేటి నదీ తీరాన తపస్సు చేశాడు, శివుడు మెచ్చి ప్రత్యక్షమై శివలింగం ప్రతిస్తించమని ఆదేశిస్తే "శ్రీ రామ లింగేశ్వర లింగం "ప్రతిష్టించి పూజించాడు. ఆ తర్వాత సర్వ పాప ప్రక్షాళన కోసం జీవుల, ఆయుర్దాయం పెరగటం కోసం శ్రీ శనైశ్చర స్వామిని నరసింగోలు గ్రామం లో ప్రతిస్టించాడని పురాణ కధనం,

కాలక్రమం లో ఆలయం జీర్ణమైతే 1991లో జీర్ణోద్ధరణ చేశారు, ఉన్నతమైన ధ్వజ స్థంభం కుమార స్వామి మొదలైన విగ్రహ ప్రతిష్ట చేశాడు శనివారం తైలాభిషేకం ఉంటుంది, రామలింగేశ్వరాలయం లో అమ్మవారు పార్వతీ దేవి అమ్మవారిని నిమ్మకాయలతో పూజించటం ఇక్కడ ప్రత్యేకత, అమ్మవారి ముందు శ్రీ చక్రం ఉంది, దీనికి నిత్యం కుంకుమ పూజ చేస్తారు నవరాత్రులలో ప్రత్యేక అలంకరణలు పూజలు ఉత్సవాలు జరుపుతారు, ఆలయ ఈశాన్య భాగంలో ఉన్న "అశ్వత్థ నారాయణ వృక్షం "ఏంతో ప్రాదాన్యతను పొందింది, వీటికింద నాగుల జంట ప్రతిష్టితమై ఉన్నాయి,

నెల్లూరు జిల్లా

## 43 మూల స్థానేశ్వరాలయం నెల్లూరు



నెల్లూరు జిల్లా నెల్లూరు లో అత్యంత పురాతన శ్రీ స్థానేశ్వర శివాలయం ఉంది, ఆంధ్ర రాజు ముక్కంటి రాజు గారు దీన్ని నిర్మించారని ఒక కధనం, ఆ రాజుకు 1400లో కలలో పరమ శివుడు కనిపించి తాను ఒక ఉసిరి చెట్టు మూలం లో ఉన్నానని వెలుపలకు తీసి ఆలయం కట్టించమని చెప్పాడు, రాజు ఉసిరి చెట్టును గుర్తించి,దాని మూలం లో లింగా కృతి కనిపిస్తే దాన్ని ప్రతిష్టించి ఆలయ నిర్మాణం చేశాడు, కనుక ఈ ఆలయం ఉసిరి చెట్టు మూలం లో ఏర్పడింది, ఉసిరికి తమిళం లో "నెల్లి "అని పేరు ఈ ప్రాంతం పై తమిళ ప్రభావం ఉండటం చేత ఇది నెల్లూరు అయింది, మనుమ సిద్ధి రాజులు రాజ గోపురం నిర్మించారు, తిక్కన కవి ఈ స్వామిని దర్శించిన తర్వాతే మహా భారత రచన ప్రారంభించాడని స్థానిక కధనం, నిత్య ధూప దీప నైవేద్యాలు పండుగలలో ఉత్సవాలు బాగానే చేస్తారు,

నెల్లూరు కు 10కిలోమీటర్లలో మూలాపేటలో మరొక  మూలస్థానేశ్వరాలయం ఉంది

## 44 శ్రీ కామాక్షీ సహిత సంగమేశ్వరాలయం సంగం



నెల్లూరుకు సుమారు ముప్పై కిలో మీటర్ల దూరం లో పెన్నానదిలో, బొగ్గేరు, బీరాపేరు నదులు కలిసే ప్రదేశాన్ని సంగం అంటారు, ఇక్కడ పరశురామ ప్రతిష్టిత శ్రీకామాక్షీ సంగమేశ్వరాలయం ప్రసిద్ధమైనది, ఈ ఆలయం లోని నంది ఒకటిన్నర మీటర్ల ఎత్తు ఉండి చూపరులకు పరమ ఆకర్షణీయంగా ఉంటుంది, ఆలయనిర్మాణం ఎవరు ఎప్పుడు చేశారో తెలియనిప్రాచీనాలయం, ఏప్రిల్ నెలలో సంగమేశ్వర బ్రహ్మోత్సవాలు బ్రహ్మాండంగా చేస్తారు.

## 45 సైకతలింగ రామలింగేశ్వరా లయం రామ తీర్థం



నెల్లూరుకు సుమారు 35 కిలోమీటర్లలో విడవ లూరు మండలం లో రామ తీర్థం ఉంది, ఇక్కడ సముద్ర తీరం లో శ్రీకామాక్షీ సమేత రామలింగేశ్వరాలయం బహు పురాతనాలయం,. రావణ వధ తర్వాత శ్రీరాముడు సీతా దేవితో ఇక్కడికి వచ్చాడని సాయం సమయం లో శివార్చన సమయం కావటం తో ఎక్కడా శివలింగం దొరకక పొతే ఇసుక (సైకత)తో శివలింగం ప్రతిష్టించి అర్చించాడని ప్రతీతి, అందుకే దీన్ని శ్రీ రామలింగేశ్వరాలయం అంటారు, రాముడు కాలుపెట్టిన పుణ్య ప్రదేశం కనుక ''రామ తీర్థం ''అయింది, పల్లవ రాజులకాలం లో అర్ధ లింగా కార శిఖరం తో ఆలయాన్ని అపూర్వంగా నిర్మించారు, కాలక్రమం లో శిదిలమైతే ఈ మధ్యనే జీర్ణోద్ధర చేశారు, జ్యేష్ట బహుళ సప్తమి నుండి అమావాస్య వరకు 9 రోజులు బ్రహ్మోత్సవాలను న భూతో అన్నట్లు చేస్తారు, ఈ అమావాస్య నాడు సముద్ర స్నానం సర్వ పాపహరం, విపరీతమైన రద్దీ ఉన్న క్షేత్రం రామతీర్థం,.



## 46 భక్త కోటేశ్వర స్వామి బత్తినయ్య కోన



చిత్తూరు జిల్లా కాళహస్తి కి దగ్గరలో బత్తినయ్య కొనలో శ్రీ కోటేశ్వర క్షేత్రం ఉంది. దీనికి విచిత్రమైన స్థల పురాణం కూడా ఉన్నది. బత్తినయ్య అనే ఒక మహా పురుషుడు ఇక్కడి ధనికొండ పై తపస్సు చేశాడు. తర్వాత తిరుమల వెళ్లి బాలాజీ ని దర్శించి కాళహస్తి చేరి అక్కడున్న అగస్త్యేశ్వర పర్వతాలను మూడే మూడు అంగలలో దాటి కొండ గుహ చేరాడు . దీనికి సాక్ష్యం గా ముసలిపేడు అనే ఊరి చెరువు గట్టున ఒకపాడం, మొనగాడి గుంట అనే ప్రదేశం లో రెండవ పాదం, కొండ గుహ వద్ద మూడవ పాదం ముద్రలు ఇప్పటికీ కనిపిస్తున్నాయి. వీటిని భక్తులు భక్తితో ఇప్పటికీ పూజిస్తూ ఉంటారు. బత్తినయ్య స్వామి ఆ కొండ గుహ లో తపస్సులో లీనమైపోయాడు. ఆయన చుట్టూ విపరీతంగా పుట్ట చెట్లు పెరిగాయి. .కొన్ని యుగాలు ఇలా గడిచాయి. ఒక సారి ఒక ఏనాది దంపతులు తేనే, దుంపల సేకరణకు ఇక్కడికి వచ్చి ఆ గుహలోనే కొద్దికాలం ఉన్నారు. ఒక రోజు విపరీతంగా వర్షం కురిసి బయటికి వెళ్ళే వీలు కాలేదు. గుహలో ఉన్న పుట్ట త్రవ్వితే ఏదైనా ఆహారం దొరుకు తుందేమోనని గడ్డ పార తో త్రవ్వటం ప్రారంభించారు. పార దెబ్బ బత్తినయ్య తలకు తగిలి రక్తం కారింది. పారతో కొట్టిన ఏనాది వాడి కళ్ళు పోయాయి. అప్పుడు పుట్టలో ఎవరో మహాను భావుడు ఉండి ఉంటాడని గ్రహించి తాము తెలియక చేసిన తప్పును మన్నించమని వేడుకొన్నారు ఆయనకు దయ కలిగి మన్నించ గానే కంటి చూపు వచ్చింది. మరీ ఆశ్చర్య పోయారు. అప్పుడు పుట్టలో ఉన్న బత్తినయ్య స్వామి తాను కలియుగం లో భక్త కోటేశ్వరుడిగా లింగ రూపం లో వెలుస్తానని, ఈవిషయం కొండదిగి ఊర్లో జనానికి చెప్పమని ఆదేశించాడు. .అది అంతా కీకారణ్యం కొండ దిగి మళ్ళీ పైకి రావటం ఎవరి తరమూకాదని ఏనాది దంపతులు విన్న వించారు. అప్పుడు బత్తినయ్య స్వామి "భక్తులు ఎడ్ల బండ్లలో కొండ దిగువ వరకు వచ్చి, అక్కడ ఎడ్లను వదిలిపెడితే అవి సరాసరి నా






సన్నిధికే చేరుతాయి. ఎడ్ల వెనుక భక్తులు కొండ ఎక్కి రావచ్చు "అని ఉపాయం చెప్పాడు. ఏనాది దంపతులు కొండదిగి ఊర్లోకి వెళ్లి జరిగినదంతా ప్రజలకు వివరించి చెప్పారు అంతే జనం తండోప తండాలుగా బళ్ళలో కొండ దిగువకు వచ్చి, ఎడ్లను వదిలేశారు. అవి ఎక్కే మార్గం ద్వారా అనుసరించి కొండపైకి స్వామి సన్నిధి చేరారు. అక్కడ స్వామిని పూజించారు. వృద్ధ ఏనాది దంపతులు కొండమీదే ఉండి భక్త కోటేశ్వర స్వామి సేవలో, పూజలో ధన్యమై ఆయనలో లీనమైపోయారు. వారి శిలాప్రతిమలు అక్కడేర్పడ్డాయి. .భక్త కోటేశ్వర లింగ దర్శనానికి వచ్చే వారు ముందుగా వృద్ధ దంపతుల శిలా విగ్రహాలను దర్శించి పూజించి ఆ తర్వాతే భక్త కోటేశ్వర స్వామిని దర్శించాలని బత్తినయ్య స్వామి నియమం పెట్టాడు. అప్పటినుంచి అలానే చేస్తున్నారు భక్తులు. ప్రతి సోమవారం భక్తుల రద్దీ బాగా ఎక్కువగా ఉంటుంది.

## 47 అర్ధ నారీశ్వర దేవాలయం విరూపాక్ష పురం



కాళహస్తి దగ్గర తొట్టంబేడు మండలం విరూపాక్ష పురం స్వర్ణ ముఖి నది ఒడ్డున లో పురాతన శ్రీ అర్ధనారీశ్వర దేవాలయం ఉంది. దీనికి సంబంధించిన స్థల చరిత్ర కూడా ఉంది. పూర్వం అవం తనగరం లో విజయ, శుభగ అనే దంపతులు ఉండేవారు. విజయుడికి శివ భక్తిఎక్కువ. ఒకసారి ఈ దంపతులు మార్కండేయ మహర్షిని దర్శించి ఆయన సలహా మేరకు కాళహస్తి వచ్చి ప్రసూనాంబా సమేత శ్రీ కాళహస్తీశ్వర స్వామి దర్శనం చేసి పూజించారు. ఒక రోజు కలలో శివుడు ప్రత్యక్షమై స్వర్ణ ముఖీ తీరం లో ఉన్న శ్రీ అర్ధనారీశ్వర స్వామి ని దర్శించి పూజించి తరించమని చెప్పాడు. విజయుడు భార్యాసమేతంగా మర్నాడే కాలి నడకన బయల్దేరి ఇక్కడి "పాప విచ్చేద క్షేత్రం "చేరి స్వామిని నిష్ఠగా కొలిచాడు. .భార్య సుభగ ప్రతి రోజు 108శివలింగాలను బంక మట్టి తో చేసి శివార్చన చేసేది. దంపతుల అనన్య భక్తికి మెచ్చి కాళహస్తీశ్వర స్వామి శ్రావణ పౌర్ణమినాడు దర్శనమిచ్చాడు. స్వామిని అనేక విధాల కీర్తించారు. ప్రీతి చెంది విజయుడు పూజిస్తున్న శివలింగం లో తానూ, పార్వతీ దేవి సదా నిలిచి ఉంటామని, ఆ రోజు నుంచి ఈ లింగాన్ని "సుభగాంబ సమేత శ్రీ విజయేశ్వర స్వామి "అని పిలుస్తారని, భక్తుల కోర్కెలను తీరుస్తానని వరమిచ్చాడు. ఇక్కడ చేసిన దానం తపస్సు యజ్ఞం శ్రీ కాళహస్తి లో చేసిన వాటివల్ల వచ్చే ఫలితంతో సమానంగా ఉంటాయని అభయ మిచ్చాడు. తర్వాత విజయ సుభగ దంపతులను తనలో ఐక్యం చేసుకొన్నాడు కాళహస్తీశ్వర స్వామి ఇదే ఇప్పుడు మనం చెప్పుకొంటున్న అర్ధనారీశ్వర దేవాలయం.

ఈ ఆలయం తూర్పు ముఖంగా ఉండిగర్భాలయం లో "సుభగాంబా సమేత శ్రీ విజయేశ్వర స్వామి గా స్వయంభు లింగం ఉన్నది. ఈ లింగానికి రెండు ముఖాలు ఉండటం ఒక విశేషం. శివుని భాగం తెల్లగా ఉంటె, రెండవ భాగమైన దేవీ భాగం పసుపు రంగులో ఉండటం అంతకంటే ఆశ్చర్య పరుస్తుంది. శుక్ర, సోమవారాల్లో విశేషంగా భక్తులు వస్తారు. ఏకాదశి కృత్తికా నక్షత్రం సూర్య, చంద్ర గ్రహణాలలో శివరాత్రి కార్తీక పర్వ దినాలలో విశేష పూజలు అభిషేకాలు ఉత్సవాలు ఉంటాయి.

## 48 శ్రీ కపిలేశ్వరస్వామి ఆలయం కపిల తీర్థం



చిత్తూర్ జిల్లా తిరుపతి బస్ స్టాండ్ నుండి కొండపైకి వెళ్ళేదారిలో సుమారు ఒకటిన్నర కిలోమీటర్లలో కపిల తీర్థం ఉన్నది, ఈ ఆలయం కొండపైనున్న ఏడుకొండల వాడి ఆలయం కంటే కొండ దిగువన ఉన్న ఆలయాలన్నిటికంటే కూడా చాలా ప్రాచీనమైనదని చరిత్రకారుల నిర్ణయం, చూడటానికి చాలా చిన్న ఆలయం గా ఉంటుందికాని కాని లోపలి వెళ్లి చూస్తె చాలా పెద్దవిశాలమైన ఆలయం, కొండ కింద ఒక కొండకు ఆనుకొని ఉంటుంది. కొండమీదనుండి జలం కింద ఉన్న కోనేటిలోకి నిరంతరం పడుతూ ఉంది, స్నానానికి అనువుగా ఉంటుంది, తిరుపతికి ఉత్తరాన ఈశాన్యం లో శ్రీ వెంకటాచలం మొదట్లో ఒక కోనేరుంది దీన్లోకి వచ్చే నీరు పైన జలపాతం నుండి వచ్చేదే, ఈ కోనేటికి తూర్పున



ఒక గహాలయం, ఆ ఆలయం లో కపిల మహర్షి ప్రతిష్టించిన శివలింగం ఉంది. అందుకే దీనికి కపిల తీర్థం అనే పేరొచ్చింది. శ్రీ వెంకటేశ్వరస్వామి స్వయం గా కావాలని గరుత్మంతుడిని దేవలోకానికి పంపి తెప్పించుకొన్న క్రీడాద్రి మొదట్లో ఉన్నది అంటే ఈ క్షేత్రం శివ కేశవ అభేదానికి నిలు వెత్తు సాక్ష్యం, కపిలేశ్వర ప్రాంగణం లో శ్రీ వేణు గోపాల స్వామి ఆలయం ఉండటం మరీ విశేషం, శ్రీ వెంకటేశ్వర కొండ గుహలో వెలసిన కపిలేశ్వరుడు సాక్షాత్తు స్వయంభు గా భావిస్తారు, అనేక పురాణాలలో కపిలతీర్ధ ప్రస్తావన ఉంది,

వేంకటాచల మహాత్మ్యం లో, ఇతిహాసాలలోను కపిలక్షేత్ర ప్రశస్తి కనిపిస్తుంది, తమిళభక్తులు కపిల తీర్ధాన్ని ఆళ్వారు తీర్ధం అంటారు, ఆలయానికి తూర్పున పెద్ద నందీశ్వర విగ్రహం చూపరులను యిట్టె ఆకర్షిస్తుంది,



కపిలేశ్వరలింగం ఆలయం లో పశ్చిమంగా ప్రతిష్టింప బడింది,. బంగారుపూత ధ్వజ స్థంభం, బలిపీఠం ఉన్నాయి. స్వామికి ఎడమవైపు అమ్మవారు మీనాక్షీ దేవి ప్రతిష్టింప బడింది, శివాగమ విధానం లో అర్చన జరుగుతుంది, శ్రీ వేణుగోపాలస్వామి రుక్మిణీ సత్యభామలతోను, ఎదురుగా వేదికపై శ్రీ లక్ష్మీనారాయణ స్వామి దర్శన మిస్తారు,

కపిలతీర్ధలయాభి వృద్ధికి విజయ నగర రాజులు సాళువ నరసింహ దేవా రాయలు, కృష్ణ దేవరాయలు ఆయన అల్లుడు అళియ రామ రాజు భూరి దానాలు చేశారు, కార్తీక పౌర్ణమినాడు మధ్యాహ్నం 12 గంటలకు మూడు లోకాలలో ఉన్న సకల పవిత్ర తీర్ధాలు కీ కపిల తీర్ధం లో కలిసిపోతాయని పురాణ కధనం, ఈ కలయిక రెండు గంటల వరకు ఉంటుంది, అప్పుడు స్నానం చేస్తే ముక్తి లభిస్తుందని విశ్వాసం, పితృదేవతలకు ఏనాడూ పిండం పెట్టని వారు అప్పుడు ఇక్కడ పెడితే అప్పటిదాకా పెట్టని పాపం తొలగి పోతుంది అని నమ్మకం,

మహా శివరాత్రికి కార్తీక పౌర్ణమికి, కృత్తికా నక్షత్రం నాడు, వినాయక చవితినాడు భక్త జన సందోహం అనంతం గా ఉంటుంది, ఫిబ్రవరి లో కపిలేశ్వర బ్రహ్మోత్సవం 9 రోజులు జరుగుతుంది, హంస మొదలైన వాహనాలమీద శివపార్వతులను ఊరేగిస్తారు కళ్యాణ మహోత్సవం వైభవం గా చేస్తారు,

## 49 శివ శయన క్షేత్రం సురుట పల్లి

తిరుపతికి సుమారు 75 కిలోమీటర్లలో నాగులాపురం మండలం లో సురుట పల్లి గ్రామం లో సర్వమంగళా సమేత శ్రీ పల్లి కొండేశ్వర స్వామి దేవాలయం ఉంది, పాల సముద్రాన్ని మంధర పర్వతాన్ని కవ్వం గా వాసుకి త్రాడుగా చేసి దేవ దానవులు చిలకి నప్పుడు ఏర్పడిన భయంకర కాల కూటవిషం వెలువడి లోకాలన్నిటినీ భయ పెడుతుంటే శివుడు ఆహాలా హలాన్ని భక్షించాడు, అది ఆయన కడుపు లోకి పోతెలోకాలన్నీ దహించుకు పోతాయని భయ పడి పార్వతీ దేవి సలహాతో కంఠంలోనే నిల్పి గరళ కంఠుడనిపించుకొన్నాడు, అక్కడ కమిలి నీలంగా మారటం చేత నీల కంఠడనే పేరొచ్చింది, లోకాలను కాపాడిన పార్వతీ దేవి సర్వ మంగళ అయింది, విషప్రభావం తో శివుడికి మైకం వచ్చి ఈ క్షేత్రం లో కొద్ది సేపు విశ్రమించాడు, శివుడు శయనించిన క్షేత్రం కనుక దీనికి "శివ శయన క్షేత్రం "అనే పేరొచ్చింది "కాలకూటా సన క్షేత్రం "అనీ అంటారు, విషం మత్తులో పార్వతీ దేవి ఒడిలో తలపెట్టుకొని పడుకున్న శివుడి విగ్రహం, ,కామ ధేనువు, కల్ప వృక్షం, తో బాటు బ్రహ్మ, విష్ణు దేవేంద్రాదులు మహర్షులు యక్ష కిన్నెరులు గంధర్వాదులు లోకోపకారం చేసిన శివుని ప్రార్ధిస్తున్నట్లుఉన్న రూపాలు కనిపిస్తాయి, పడుకొని కనిపిస్తాడు కనుక" పల్లి కొండేశ్వరుడు"అని తమిళులు పిలుస్తారు తమిళం లో "పల్లి కొండ "అంటే పడుకొని ఉన్నాడు అని అర్ధం, దీనికే వాల్మీకి క్షేత్రం అనే పేరూ ఉంది, భారత దేశం మొత్తం మీద విగ్రహ రూపం లో శివుడు పూజలు అందుకొనే క్షేత్రం ఇదొక్కటే, మిగతా అన్ని చోట్లా లింగానికే అర్చన, అదీ ఇక్కడి మహా విశేషం, ఇక్కడున్న దాంపత్య దక్షిణామూర్తి స్వామికి అభిషేకం చేసి పూజిస్తే దాంపత్యం లో ఉన్న కలహాలు పోయి సుఖ దాంపత్యం సిద్ధిస్తుంది, పెళ్ళికాని వారు దర్శిస్తే అతి త్వరలో





వివాహం అవుతుంది, ఆనారోగ్య వంతులు ఆరోగ్యం పొందుతారు, ఈ ఆలయాన్ని విజయ నగర రాజులకాలం లో శ్రీ విద్యా రణ్య స్వామి నిర్మించారని స్థానిక కథనం.

## 50 తిరుమల బాలాజీ పెళ్లి కొచ్చి ఇక్కడే తిష్ట వేసిన శివుని ఆలయం కైలాస కోన



చిత్తూరు జిల్లా కైలాస కోన ప్రకుతి అందాలకు మనసు పరవ శిస్తుంది, ఇక్కడ పర్వతాగ్రం నుండి మహా వేగం తో కిందికి దూకే జలపాతం ఆహ్లాదాన్నిస్తుంది, దీనిప్రక్కనే ఒకగుహాలయం అందులో శివ లింగం దానికెదురుగా నందివిగ్రహం ఉన్నాయి, వీరభద్రస్వామి కామాక్షీ అమ్మవారు, ఆదిశంకరాచార్య విగ్రహాలూ ముచ్చట గా ఉంటాయి, ఈ ఆలయానికో చరిత్ర ఉంది, పూర్వం నారాయణ వనం లో శ్రీ పద్మావతీ వెంకటేశ్వర స్వామి వారల కళ్యాణ మహోత్సవానికి కైలాసం నుండి వచ్చిన శివ పార్వతులకు ఈ ప్రకృతి అందాలు నచ్చి ఇక్కడే కొంతకాలం ఉండి పోయారట, అందుకనే దీనికి "కైలాస కోన "అనే పేరొచ్చిందని స్థల పురాణం, ఎత్తైన పర్వత ప్రాంతం లో ఆలయం ఉండటం వలన నిత్య పూజలు జరుగవు, కొన్ని ప్రత్యేక ఉత్సవ సమయాలలోనే అర్చకులు వచ్చి పూజ అభిషేకం చేస్తారు



## 51 నంది ముఖం నుండి నిరంతరం నీరు వచ్చే మొగిలీశ్వరాలయం మొగిలి

చిత్తూరు జిల్లా పలమనేరు దగ్గరున్న మొగిలి గ్రామం లో అత్యంత ప్రాచీన శివాలయం ఉంది, ఎవరు ఎప్పుడు ఎందుకు నిర్మించారో చరిత్రకు ఎక్కలేదు, కాని విశేషమైన ఆలయం, ఆలయం లో శివలింగానికి ఎదురుగా ఉన్న అందమైన నంది ముఖం నుండి నిరంతరం నీరు ప్రవిస్తూ ఉంటుంది, అంత గొప్పగా విశిష్టంగా ఆలయ నిర్మాణం చేయబడింది, నీరు నందిముఖం లోకి ఎక్కడి నుంచి వస్తోందో ఎవరికీ తెలియదు, పరిశోధకులకు కూడా" మొగిలి" నంది ముఖం లోకి వచ్చే నీరు" మొదలు" ఎక్కడో ఇంతవరకు క్లూ దొరక లేదు. ఆ రోజుల్లో ఈ ఆలయ నిర్మాణ శిల్పుల చాకచక్యానికి గొప్ప ఉదాహరణగా నిలిచి పోయింది మొగిలి ఆలయం, నిత్యార్చనలు విశేషార్చనలు ఉత్సవాలు ఘనం గా జరుగుతాయి



రాజరాజ శేఖరచోళ రాజు 991 లో పునర్నిర్మించాడు మహా విష్ణువు క్షేత్రపాలకుడు, బ్రహ్మ, విష్ణు ఎవరు గొప్ప అనే స్పర్ధలో శివుని శాపాలు పొందారు. మొగిలి అబద్ధం సాక్ష్యం చెప్పటం వలన పూజార్హం కాదని శాపం పొందింది,

పూర్వం మొగిలప్ప అనే వాడు మొదలిపొదలలో ఒక ఆవు పాలు పిండటం చూశాడు అమ్మవారు పాలు తీసుకోవటం కనిపించింది మొగిలిఅప్ప ఎవరికీ ఈ విషయం చెప్పనని అమ్మవారికి వాగ్దానం చేస్తాడు భార్య ఆరాతీస్తే చెప్పక పొతే చస్తానని ఒట్టేస్తే అప్పుడు చెప్పి తలపగిలి చనిపోతాడు భార్య సహగమనం చేస్తుంది ఉన్డుకె మొగిలీశ్వరుదని పేరు, కుజ దోషాలకు ఇక్కడ పూజ చేస్తారు, ఇక్కడి త్రిశూల తీర్ధం ప్రసిద్ధం శ్రీకృష్ణుడు ప్రార్ధిస్తే శివుడు భూమిలో త్రిశూలం గుచ్చి భూగర్భ జలాన్ని పైకి తెప్పించిన క్షేత్రం, శ్రీ కైవారం తాత గారు ఇక్కడ సిద్ధిపొందారు ఆయన సమాధి ఇక్కడే ఉంది,. కులోత్తుంగ చోళుడు ప్రతిష్టిం చైనా శివలింగం ఉంది సప్తమాత్రుకలున్న ఆలయం ఇది

కడప జిల్లా

## 52 గయతో సమానమైన శ్రీ త్రిదేశ్వరాలయ క్షేత్రం అత్తిరాల



కడప జిల్లా రాజం పేట – నెల్లూరు దారిలో రాజంపేటకు సుమారు అయిదు కిలోమీటర్లలో అత్తిరాల గ్రామం లో వెలసిన కామాక్షీ, శ్రీ త్రిదేశ్వర స్వామిఆలయాలు బహు మహిమాన్వితమైనవని ప్రసిద్ధి పొందాయి, అతిప్రాచీనాలయాలుగా గుర్తింపు పొందాయి, బీహార్ లోని గయా క్షేత్రం ఎంత ప్రాధాన్యత కలిగి ఉందొ ఈ త్రిదేశ్వర క్షేత్రమూ అంతే ప్రాధాన్యతను పొందింది, ఆలయం కొండపైన ఉంటుంది కొండకింద పరశురామాలయం ఉంది, ప్రక్కనే "శ్రీ గదాధర స్వామి "ఉన్నాడు, ఇది విష్ణ్వాలయం, ఈ రెండు ఆలయాలపైన ఉన్న నృత్య భంగిమల శిల్పాలు రమణీయం, మట్లి రాజులకాలం లోజీవించిన "ఏకా తాతయ్య "అనే భక్తుని విగ్రహం కూడా ఉంది. తలకాయ నొప్పి తో బాధ పడేవారు తమ తలను ఈ తాతయ్య విగ్రహానికేసి నెమ్మదిగా కొట్టుకొంటే తలనొప్పి యిట్టె మాయమవుతుందని విశ్వాసం, జీవిత భాగస్వామిని కోల్పోయినవారు ఏడాది లోపు వచ్చి ఈ క్షేత్ర దర్శనం చేయటం రివాజు, స్త్రీలు కామాక్షీ అమ్మవారిని తప్పక దర్శిస్తారు, కొండపై ఉన్న "జ్యోతి స్తభం "దగ్గర

శివరాత్రికి జ్యోతులు వెలిగిస్తారు, మాఘమాసం లో ఉత్సవాలు వైభవం గా జరుగుతాయి. శివరాత్రికి భక్తుల సంఖ్య అశేషం, కార్తీకం లోనూ అంతే.ఇక్కడ శివరాత్రి జాతరకు అన్ని ప్రాంతాలనుండి జనం అధిక సంఖ్యలో హాజరై మొక్కులు చెల్లిస్తారు

## 53 చోళ రాజులు నిర్మించిన తొలి శివాలయం శ్రీ అగస్త్యేశ్వరాలయం ప్రొద్దుటూరు

కడపకు సుమారు యాభై కిలోమీటర్లలో ప్రొద్దుటూరు ఉంది ఇక్కడి శ్రీ అగస్త్యేశ్వరాలయం. కాలానికి అతీతమైనదని భావన, అగస్త్య మహర్షి ప్రతిష్టించిన లింగం కనుక అగస్త్యేశ్వరాలయం గా ప్రసిద్ధి చెందింది అమ్మవారు శ్రీ రాజ రాజేశ్వరీ దేవి, మహా శివ భక్తులైన చోళ రాజులు, మొట్టమొదటి సారిగా నంది చోళ మహారాజు నిర్మించిన శివాలయం అగస్త్యేస్స్వరాలయం, 11వ శాతాబ్దినాటికే ఈ ఆలయ ప్రాభవం ప్రసిద్ధమైంది,



120అడుగులపోడవు, 140 అడుగుల వెడల్పు తో ఎత్తైన ప్రాకారాలతో నాలుగు వైపులా గాలి గోపురాలతో ఆలయం విరాజిల్లుతున్నది, ఆలయం లో వెలసిన శ్రీ వీరభద్ర స్వామి ఎనిమిది ముఖాలతో, కాళ్ళ కింద పొట్టేలు తల (దక్షుని తల )కలిగి దర్శనమివ్వటం అపూర్వమైన విషయం, ప్రతి గోపురంపైనా అయిదు బంగారు కళాశాలు ఉండటం మరో విశేషం, 1494లో విజయనగర ప్రభువు సాల్వ నరసింహా రాయల సైన్యాధికారి నరసానాయకుడు ఈ ఆలయాభి వృద్ధి చేశాడు, శతాధిక గ్రంధ కర్త బహుభాషా పండితులు శ్రీ పుట్టపర్తి నారాయణా చార్యులుగారు ఈ అగస్త్యేశ్వర స్వామి సన్నిధానంలోనే తమ "శివతాండవం "కావ్యం రచించి స్వామికి వినిపించి ధన్యులయ్యారు, ఈస్వామియే వారికి ఈ రచనకు ప్రేరణ, ఆచార్యుల వారు నిత్యం

స్వామి ఆలయం లో 101 సార్లు ప్రదక్షిణ చేస్తూ శివతాండవ కావ్యాన్ని అమోఘంగా రచించారు, అన్ని సమయాలలో ఆలయం లో పూజాదికాలు చేస్తారు,



ఆలయ ప్రాంగణం లో శ్రీ రామాలయం,అందులో అంజలి బద్ధుడైన లక్ష్మణ స్వామి, కింద సేవకునిగా కూర్చున్న ఆంజనేయ స్వామి ప్రత్యేక శిలతో మెరిసే వినాయకుడు, కుమారస్వామి ఉంటారు, నాగినుల విగ్రహాలుంటాయి, భీమేశ్వర, సుందరేశ్వారులు కొలుపై ఉంటారు, 18 మెట్లతో అయ్యప్పస్వామి సన్నిధి ఉంది వైశాఖ శుద్ధసప్తమి నుండి అగస్త్యేశ్వర స్వామి కళ్యాణోత్సవాలు పెద్ద ఎత్తున చేస్తారు, రధోత్సవం నిర్వహిస్తారు., దసరా ఉత్సవాలు బ్రహ్మోత్సవాలు వైభావగా చేస్తారు, కోటి కుంకుమార్చన ఇక్కడి ప్రత్యేకత,




## 54 శ్రీ వైద్య నాదేశ్వరాలయం పుష్పగిరి

కడప జిల్లా పుష్పగిరి లో పినాకినీ నదీ తీరాన శ్రీ వైద్య నాదేశ్వర దేవాలయం పురాతనాలయమే, ఆయుర్వేద స్వరూపుడైన ధన్వంతరి మహర్షి పుష్పగిరిలో శివునికి

తపస్సు చేశాడు, శివుడు ఆయనకు "వైద్య నాధుడు "గా దర్శనమిచ్చి ఆయుర్వేద వైద్యాన్ని ప్రచారం చేసి వన ఔషధుల రహస్యాలను ప్రజలకు తెలియ జేయమని ఆదేశించాడు, ధన్వంతరి స్వామిని తనకోసం ఇక్కడే కొలువై ఉండమని ప్రార్ధించాడు, అప్పుడు పరమేశ్వరుడు లింగ రూపం దాల్చగా ధన్వంతరి దాన్ని ప్రతిష్ఠించి శ్రీ వైద్య నాదేశ్వరుడు "అని నామకరణం చేసి పూజించి తరించాడు, శ్రీ శంకరాచార్యులవారు ఇక్కడే శ్రీ చక్రాన్ని ప్రతిష్టించారు, తర్వాతకాలం లో ధన్వంతరి మహర్షి విగ్రహ స్థాపన కూడా జరిగింది, ఈ ఆవరణలోనే త్రికూటేశ్వర, ఉమామహేశ్వర, భీమేశ్వరాలయాలను నిర్మించారు, చైత్ర బహుళ త్రయోదశి నుండి 9రోజులు పుష్పగిరి తిరునాళ్ళు వైభవం గా జరుగుతాయి,

## 55 సంగమేశ్వర దేవాలయం అనిమెల



కడప నుండి 50 కి మీ దూరం లో ఉన్న ఈ క్షేత్రం మూడు నదుల సంగమ స్థానం లో నిర్మించబడిధీ. 14 వ శతాబ్దం లో నిర్మించినట్లు ఆదారాలు చేబుతునంయి. విజయనగర రాజుల కాలం లో నిర్మించిన ఈ దేవాలయం అందమైన శిల్పకళ కనబడుతుంది.




దేవాలయం లో శివ, గణేష్, నటరాజ స్వామి, రామ, ఆంజనేయ స్వామి విగ్రహాలు ఉంటాయి.

నిజమైన మూర్తులల కనిపిస్తాయి.

56 ముక్తి రామేశ్వరం ప్రొద్దుటూరు



కడప జిల్లా ప్రొద్దుటూరు పట్టణం లోని పినాకిని నది తీరాన గల ప్రసిద్ధ క్షేత్రం ముక్తి రామేశ్వరం. ఈ క్షేత్రం లో శ్రీ రాములవారు ప్రతిష్టించిన శివలింగం ఉండటం వలన

ఈ ప్రాంతానికి రామేశ్వరమని, మర్జలరుపన గల రావణుని శ్రీ రాముడు బాణాల చేత వాదించి ముక్తి లబించడం వలన ఈ ప్రాంతానికి ముక్తి రామేశ్వరం అని పేరు వచ్చింది అని చెబుతారు.

రావణ వధ అనంతరం తనకు అపదితమైన బ్రహ్మహత్య దోషనివరణకు రాముడు ఈ ప్రాంతం లోని శివలింగాన్ని ప్రతిష్టించాడు అని చెబుతారు.

57 మల్లెంకొందేస్వర స్వామి దేవాలయం మల్లెంకొండ

దట్టమైన అడువలలో గుట్ట పైన వెలసిన మల్లంకొందేస్వర స్వామి దేవాలయం కడప జిల్లా గోపవరం మండల కేంద్రం లో గల బద్వేల్ తాలుకాలో ఉంది. దట్టమైన అడవిలో చుట్టూ కొండల మద్య వెలసిన మల్లన్న క్షేత్రం ఎంతో రమణీయంగా, ప్రసాంతంగా ఉంటుంది.



***** శివాలయం నిత్యపూజకోన

కడప జిల్లా సిద్ధవటం మండల కేంద్రం లో కడప నుండి 33 కి మీ దూరం లో నిత్యపూజకోన లో వెలసిన శివాలయం ఇది. మహాశివరాత్రి కి ఇక్కా ఉత్సవాలు నిర్వహించాబడుతాయి.

*** నారద ముని ప్రతిష్టిత శ్రీ సౌమ్య నాదాలయం నందలూరు

కడప జిల్లా నందలూరు మండలం లో తిరుపతి దారిలో కడపకు 40కిలోమీటర్లలో నందలూరు లో అతి ప్రాచీన శ్రీ నారద మహర్షి ప్రతిష్టించిన శ్రీ సౌమ్యనాద ఆలయం ఉన్నది, 12ఎకరాల సువిశాల స్థలం లో ఆలయం ను 11వ శతాబ్దపు కులోత్తుంగ చోళ మహా రాజు చేత నిర్మించ బడింది, 12 శతాబ్దం లో కాకతి ప్రతాప రుద్ర చక్రవర్తి స్వామిని దర్శించి గాలిగోపురం నిర్మించాడు, తర్వాత పాండ్య, విజయ నగర, పొత్తపినాడు మట్లి రాజులు ఆలయాభి వృద్ధికి విశేషంగా తోడ్పడ్డారు, నందలూరును పూర్వం నిరంద నూరు, నిరంత నూరు, నెలంద లూరు అని పిలిచేవారు, ఆలయ ప్రాంగణం లో శ్రీ యోగ నరసింహ, ఆంజనేయ విఘ్నేశ్వర విగ్రహాలున్నాయి ఆలయం గోడలమీద మత్స్య, సింహ అర్ధ చంద్రాకారపు చిహ్నాలు కనిపిస్తాయి, గర్భాలయం ముందు పైకప్పుపై" చేప బొమ్మ "ఉండటం ఇక్కడ ప్రత్యేకత, సృష్టి అంతమయ్యే ముందు వచ్చే జలప్రళయం లో నీరు ఈ ఆలయం లోని పైకప్పు పైఉన్న ఈ చేప బొమ్మను తాకగానే ఆ చేప సజీవమై ఆ నీటిలో కలిసి పోతుందని స్థానిక కధనం, ఆలయం యెర్ర రాతి నిర్మాణం, సౌమ్య నాదుడినే" చొక్క నాధుడు "అంటారు, నన్నయ, తాళ్ళపాక అన్నమాచార్య ఈ స్వామిని దర్శించి తరించారు, కోరిన కోర్కెలు తీర్చే దేవుని గా సౌమ్యనాధుడు ప్రసిద్ధి చెందటం తో నిత్యం విపరీతమైన రద్దీ ఉంటుంది,



గర్భాలయం లోని సౌమ్యనాద స్వామి విగ్రహం 6అడుగుల ఎత్తులో ఉండివక్షస్తలంపై శ్రీ మహా లక్ష్మి, యజ్ఞోపవీతాలు ఆభరణాలతో వెలిగిపోతూ ఉంటాడు, అభయ హస్తం తో స్వామి దర్శన మిస్తాడు, గర్భ గుడిలో దీపం లేకపోయినాముఖ ద్వారం నుండి చూస్తె స్వామి దేదీప్యమానంగా కనిపించటం ఇక్కడి మరొక విశేషం,. స్వామికి కుడివైపు ఆంజనేయ స్వామి చొక్క నాధుని సేవలో ఉన్నట్లుగా కనిపిస్తాడు, శ్రవణా నక్షత్రం రోజున ప్రతినెలా "ఊంజల్ సేవ "నిర్వహిస్తారు, పది రోజులపాటు బ్రహ్మోత్సవాలు మహా వైభవం గా చేస్తారు,

## కర్నూల్ జిల్లా

# 58 శ్రీ పానికేశ్వర స్వామి ఆలయం పాణ్యం



చాలా కాలం క్రితం ఆ భూమిని పాణ్యం రాజు విష్ణు వర్ధన్ పరిపాలించాడు. పంటలు మరియు గ్రామస్తులు నాశనం అటవీ జంతువులు. గ్రామస్థులను కాపాడటానికి రాజు అడవిలో అడవి జంతువులను వెంటడించాడు. రాజు నిద్రలో ఉన్నప్పుడు అతని చేతులు అతని కుమార్తె యొక్క ఛాతీపై పడ్డాయి. తన పాపంగా తనని తాను ఎదుర్కోవడమే కాక, తన కుమార్తె మరియు ప్రజలు అభ్యంతరం చెప్పినప్పటికీ తన రెండు చేతులను కట్ చేశాడు. అప్పుడు రాజు నిర్ణయించుకుంది మరియు పాముల స్థానంలో ఉంచాడు. స్వయంచాలకంగా తన చేతులు కనిపించింది. అతను పాణికేశ్వర స్వామి (పాని మీదుగా చేతులు) పేరుతో ఒక ఆలయాన్ని నిర్మించాడు, ఈ దేవతపై రాజుకు రెండు చేతులు తిరిగి ఇవ్వబడ్డాయి. భక్తులు ప్రధాన పండుగలుగా కార్తీకమసం మరియు శివరాత్రి జరుపుకుంటారు. వారు ప్రతి సంవత్సరం కళ్యాణ ఉత్సవలు గొప్పగా జరుపుకుంటారు.



## 59 శ్రీ బుగ్గ రామలింగేశ్వరం స్వామి ఆలయం కాల్వబుగ్గ

కర్నూలు నుండి 32 కిలోమీటర్ల దూరంలో ఉన్న ఓర్వకల్ మండల్లో NH-18 లో పురాతన ఆలయం శ్రీ బుగ్గ రమేశ్వర స్వామి ఉంది. నేచర్ స్ప్రింగ్ లు, కొండ వరుసలు ఈ ఆలయ ప్రధాన ఆకర్షణలు. ఈ ఆలయ సముదాయంలో ఐదు లింగాలు ఉన్నాయి. 1983 లో కాంచీ కామకోటి పీఠం శ్రీ జయేంద్ర సరస్వతి ఈ ఆలయంలో శ్రీ బ్రమరంభ దేవి పుణ్యక్షేత్రాన్ని ప్రారంభించారు. పచ్చని కొబ్బరి మరియు ఆలివ్ చెట్లు మరియు మొక్కలు పూర్తిగా కొండలు మరియు

ప్రవాహం వరుస యాత్రికులు మరియు పర్యాటకులను ఆకర్షిస్తాయి. శివరాత్రి, కార్తికమాసం, బ్రహ్మోత్సవాలు ప్రధాన పండుగలుగా భక్తులు జరుపుకుంటారు.

### 60 శ్రీ ఓంకారస్వర స్వామి ఆలయం బండి ఆత్మకూరు



శ్రీ సిద్దేస్వర స్వామి ఆలయం భారతదేశంలోని ఆంధ్రప్రదేశ్లోని ఓంకారంలో ఉన్న శివ దేవాలయం. శ్రీ ఓంకారేశ్వర ఆలయం నంద్యాల నుండి 14 కిలోమీటర్ల దూరంలో ఉంది, ఇది మందమైన నల్లమల్లై అడవుల మధ్య ఉంది. ఇతర ప్రధాన దృశ్యాలు నవా నంది దేవాలయాలు అంటే సూర్య నంది, కృష్ణ నంది మరియు గరుడ నంది. నిర్మలమైన పరిసరాలతో కలుపుతూ శాశ్వత నీటి ప్రవాహం నుండి నీటిని నిత్యం ప్రవహించే ప్రవాహం. దూర 0 లోని భక్తులు పవిత్ర మునకపోయినా వదిలిపెట్టరు.

## 61 మహానందీశ్వర దేవాలయం మహా నంది



కర్నూలు జిల్లా నంద్యాలకు 15 కిలోమీటర్లలో మహానంది వద్ద శ్రీ మహా నందీశ్వరాలయం ప్రాచీనమైనది పురాణ ప్రసిద్ధమైనది పూర్వనామం పెరుతిమ్మాపురం కాని దీని చుట్టూ పదిహేను కిలోమీటర్ల పరిధిలో నవ నందులున్నాయికనుక మహా నంది అయింది వీటిలో ఇక్కడి ఆలయమే పెద్దది కనుకనూ మహానంది

అయింది, ప్రముఖ శైవ క్షేత్రంఅమ్మ వారు కామేశ్వరీదేవి, బాదామి చాలుక్యుడు విజయాదిత్యునికాలం లో 690-696 ఈఆలయ0 నిర్మించబడింది, నన్దిరాజులు



కట్టించిన ఆలయం అనే భావమూ ఉంది నల్లమల క్షేత్రం లో ఉన్న ఈ ఆలయ శివలింగం ఎత్తుగా కాకుండా పైన కొంచె0 వెడల్పుగా ఉండటం విశేషం, దీనికి ఒక కద ఉంది, ఒక ఆవు పుట్టలో ఉన్న ఈ స్వామికి పాలుపిండుతుంటే చూసి యజమాని ఆవునుకోట్టగా అది కంగారుపడి పుట్టలోని శివలింగాన్ని తొక్కిందని అందుకే పైన సొట్ట వచ్చిందని అంటారు ఉఅవు గిట్ట ల గుర్తులు ఇప్పటికీ లింగంపై కనిపించటం మరో విశేషం

శుద్ధ స్పటిక నీరు ఇక్కడి చిన్న కోనేటిలో ప్రవహించటం మహా నంది ప్రత్యేకత. ప్రధాన ఆలయ ముఖ ద్వారానికిగోపురానికి మధ్య ఉన్న పుష్కరిణి లోకి నీరు ఎక్కడి నుంచి వస్తు0దో కాని గోముఖం నుండి అనంతజలరాశిగా అన్నికాలాల్లోనుబయటికి ప్రవహిస్తుంది , ప్రధాన ఆలయం శివ లింగం కింద అయిదు నీటిఊట లున్నయి లింగం కింద నిరంతరం నీరు ఊరుతూ ఉంటుంది, ఈనీరు పుష్కరినిలోనే మనకు కనిపిస్తుంది ఇంకెక్కడా నీటి జాడ కనిపించదు గొపురమ్ ముందున్న రెండు గుండాలద్వార బయటికి పారుతుంది అందు పుష్కరిణిలో నీరు ఎప్పుడూ ఒకే లెవెల్ లో ఉంటుంది, ఇది సుమారు ఆరు అడుగుల లోతుంటుంది కింద ఏ చిన్న పిన్నీసు వేసినా ఆ నీటిలో స్వచ్చంగా కనిపించటం ఈ నీటి విశేషం దీనిలో స్నానం చేస్తుంటే మన శరీరం దేవతా శరీరం లాగా గొప్ప అనుభూతి నిస్తుంది ఆలయమ్ లోపలున్న బావులలోని నీరూ ఇలానే ఉండటం మరో ప్రత్యేకత, ఇదంతా ఈశ్వర మహిమగా భావిస్తారు, ఈ నీటి ఉనికి కనిపెట్టటానికి ఇప్పటిదాకా ప్రయత్నాలు జరిగినాయి కాని ఫలించలేదు, బయటికి ప్రవహించే ఈ నీరు మూడు వేల ఎకరాల సాగుకు తోడ్పడుతోంది అందుకే నిరంతర సస్య శ్యామలం గా ప్రదేశం ఉంటుంది

పూర్వం కృత యుగం లో శిలాద మహర్షి పుత్రులకోసం ఇక్కడ తపస్సు చేస్తే శివుడు ఇద్దరుకుమారుల్ని ప్రసాదించాడు అందులో పెద్దవాడు నంది, చిన్నవాడు పర్వతుడు, పుట్టుక తోనే ఇద్దరిలో సహజ శివ భక్తీ కుదిరింది, నంది శివునికోసం తపస్సు చేస్తే ప్రత్యక్షమై వరం కోరుకోమంటే తాను ఈశ్వర వాహనం గా ఉండే వరం కోరాడు, ఇచ్చాడు,. నంది తపస్సు చేసిన క్షేత్రం కనుక మహా నంది గా ఈ ప్రాంతమంతా నంది

మండలం గా ప్రసిద్ధి చెందింది నంది పరమేశ్వరుడిని ఇక్కడే కొలువై అనుగ్రహించమని కోరగా స్వయం భువు గా పరమ శివుడు మహా నందిలో వెలిశాడు.



గర్భాలయం లో స్వామి వారు నందీశ్వర, కామేశ్వరీ అమ్మవారు దర్శన మిస్తారు ఆ లయానికి తూర్పున రామాలయం ఉంది దక్షిణం లో విఘ్నేశ్వరాలయం ఉంటుంది, ఇక్కదికి వచ్చిన భక్తులు పవిత్ర పుష్కరిణీ స్నానం చేసి మహానందీశ్వర కామేశ్వరీ లను విఘ్నేశ్వర శ్రీరాములను దర్శిస్తారు, ఇక్కద అయిదు బుగ్గలు శ్రీశైలదార, నరసింహ ధార, దైవదార, నందిదార, కైలాస ధారా లనుండి నీరు ప్రవిస్తుంది, ఇక్కద బ్రహ్మ విష్ణు రుద్ర గుండాలు(పుష్కరిణులు )న్నా యి.శ్రీ శంకరాచార్యులవారు అమ్మవారి ముందు శ్రీ చక్ర ప్రతిష్ట చేశారు అన్ని రోజుల్లోనూ భక్తజనం రద్దీ ఉంటుంది చక్కని పరవశించే ప్రకృతి ఎత్తైన కొండలు, నిరంతర జలధార, పచ్చని పంటపొలాలు, ముక్తినిచ్చే మహా నందీశ్వరుడు, పుష్కరిణి స్నానుభవం జీవితం లో మరచి పోలేము '

## 62 నవ నంది క్షేత్రాలు మహానంది

మహానంది క్షేత్రం చుట్టూ నవ నంది క్షేత్రాలున్నాయి, కార్తీక సోమవారం నాడు నవనంది క్షేత్ర దర్శనం సర్వ పుణ్య ఫలం సకల దోషహరం,. నందన మహారాజులు 14వశతాబ్దం లో వీటిని నిర్మించారు,



**1-ప్రధమ నందీశ్వరాలయం** -నంద్యాలకు నైరుతిలో చామకాల్వ ఒడ్డున ప్రధమ నందీశ్వరాలయం ఉంది బ్రహ్మకోరికపై శివుడు ఇక్కడ ఈ పేరున వెలిశాడు కార్తీకమాసం నెల రోజులూ సాయంకాలపు సూర్య కిరణాలు నందీస్వర స్వామిపై ప్రసరించటం ఇక్కడి విశేషం,

**2-నాగ నందీశ్వరాలయం** -నంద్యాలఆంజనేయ దేవాలయం లో నాగ నందివిగ్రహం ఉంది గరుత్మ0 తుడి ధాటికి తట్టుకోలేని నాగులు అభయం కోసం శివుని గూర్చి తపస్సు చేసిన ప్రదేశం వారిని స్వామీ కాపాడిన క్షేత్రం అందుకే స్వామి నాగ నందీశ్వరుడు





..

**3-సోమనందీశ్వరాలయం** - నంద్యాలకు తూర్పున ఆత్మకూరు బస్టాండ్ దగ్గర ఈ ఆయం ఉంది చంద్రుడు శివునికోసం తపస్సు చేసిన చోటు, కనుక సోమనందీశ్వరుడిగా వెలిశాడు,



**4-శివ నంది** -మహా నందికి ఉత్తరాన 10 కిలో మీటర్లలో ఆత్మకూరు మండలం కడమల కాల్వ లో శివనందీశ్వరాలయం ఉంది, మి గిలిన వాటికంటే పెద్దది,

**5-సూర్య నందీశ్వరాలయం** -మహానందికి సుమారు 10 కిమీ లో తమ్మడ పల్లి లో సూర్య నందీశ్వరాలయం ఉన్నది, శివుని కోసం సూర్యుడు తపస్సు చేసిన ప్రదేశం రోజు భానుని ప్రభాత కిరణాలు ఈస్వామిపై పడటం విశేషం



**6-విష్ణు (కృష్ణ )నంది** -మహా నందికి ఉత్తరాన 4 కిమీ లలో విష్ణు నందీశ్వరాలయం కనిపిస్తుంది పరమేశ్వరునికోసం విష్ణుమూర్తి తపస్సు ఇక్కడే చేశాడు, ఇక్కడి పాల రాతి నందివిగ్రహం ముచ్చటగా ఉంటుంది





.

7-మహా నందీశ్వరాలయం -నంద వంశ రాజుకు శివుడు కలలో కనిపించి తానూ మహా నందిలోనేకాక ఇంకా ఎనిమిది ప్రదేశాలలో ఉన్నానని అక్కడ



ఆలయాలు కట్టి వృద్ధి చేయమని ఆదేశించాడు మహానందీశ్వరుడు స్వయంభు లింగం, ఇక్కడి కోనేటి లో నీరు వేసవిలో చల్లగా శీతాకాలం లో వెచ్చగా ఉండటం గొప్ప విశేషం

**8-**వినాయక నందీశ్వరాలయం -మహానందిలో కోనేటి ఒడ్డున ఉన్న



దేవాలయమే వినాయక నందీశ్వరాలయం, వినాయకుడు తండ్రికోసం తపస్సు చేసి మెప్పించి ఇక్కడ వె లిసేట్లు చేసిన ప్రదేశం

**9-**గరుడ నందీశ్వరాలయం -వినాయక నంది క్షేత్ర ప్రారంభం లోనే గరుడ నందీశ్వరాలయం ఉన్నది, తల్లికోరికపై



అమృతం తేవటానికి దేవ లోకానికి వెళ్లేముందు వినతా సుతుడైన గరుత్మంతుడు కార్య సిద్ధికోసం తపస్సు చేసిన చోటు గరుదుని కోరిక తీర్చి గరుడే శ్వరునిగా వెలిశాడు శివుడు

కార్తీక మాసం ఈ నవ నందుల దర్శనానికి లక్షలాది భక్తజనం వచ్చి దర్శించి తరిస్తారు,

## 63 శ్రీ ఉమామహేశ్వరాలయం యాగంటి

కర్నూలుకు 70కి.మీలో బనగానపల్లి మండలం బనగానపల్లికి సుమారు 15.కి మీ లో ఎర్రమల కొండల్లో యాగంటి క్షేత్రం లో స్వయంభు శ్రీ ఉమామహెశ్వరస్వామి కొలుపై ఉంటాడు, గొప్ప శైవ క్షేత్రాలలో ఒకటి, ఇక్కడే ఆదిదంపతులు శివపార్వతులు





ఒకే శిలలో దర్శనమివ్వటం విశేషం, 15వ శతాబ్దపు విజయ నగర రాజు హరిహర బుక్కరాయలు ఆలయాన్ని నిర్మించాడు, శివాలయం అయినా ఇది వైష్ణవ సంప్రదాయం లో నిర్మించబడటం మరో వింత.దీనికొక కద ఉంది, ఒకప్పుడు అగస్త్య మహర్షి ఇక్కడికి వచ్చి తపస్సు చేశాడు, ఇక్కడ మహర్షి శ్రీ వేంకటేశ్వరాలయం నిర్మించాలని భావించాడు,. వెంకటేశ్వర శిలా విగ్రహం చెక్కించాడు, కాని స్వామి బొటన వ్రేలి గోరు విరిగిపోయింది.ప్రతిస్ట కు పనికి రాలేదు, మహర్షి చాలా చింతాక్రాంతుడై శివునికై తీవ్రతపస్సు చేశాడు, చుట్టూ అరణ్యప్రాంతం అవటం తో కాకులు విపరీతం గా రొద చేసి ఆయనకు తపో భంగం కలిగించాయి, మునికి కోపం వచ్చి ఆ ప్రాంతం లో కాకులు ఇక సంచరించరాదని శపించాడు, అప్పటి నుంచి ఇక్కడ కాకి వాలితే ఒట్టు, మిగిలిన పక్షుల కిలకిలారావాలు వినిపిస్తాయి, కాని కాకుల "కావు కావు "లు వినిపించవు,



అగస్త్య మహర్షి తపస్సుకు మెచ్చి శివుడు ప్రత్యక్షమైతే జరిగన దాన్ని ఆయనకు తెలియ జేశాడు, అప్పుడు శివుడు వెంకటేశ్వర విగ్రహం గురించి ఇక చింతించ వద్దని తాను ఉమా సమేతం గా ఏక శిలపై

-వెలిసి భక్త సంరక్షణ చేస్తానని వరమిచ్చాడు శివుడిని చూసిన ఆనందం తో మహర్షి "నే గంటి "(నేను చూశాను )నే గంటి అని పాడుకొంటూ ఆనంద నృత్యం చేశాడు. అందుకని ఈ క్షేత్రాన్ని "నేగంటి "అన్నారు కాలక్రమం లో అది 'యాగంటి "అయింది, ద్వాపర యుగ పాండవులు ఈ క్షేత్ర దర్శనం చేశారని చాళుక్య విజయనగర రాజులు ఆలయనిర్మాణాలు కొన్ని చేశారని చారిత్రిక కధనం, గుత్తి రాజులు గాలి గోపురాన్ని అద్భుతం గా నిర్మించారు, ఆలయప్రవేశం లోనే పెద్ద కోనేరు కనిపిస్తుంది, దీని నిర్మాణమే విచిత్రం, ఎర్రకనుమల నుండి ఔషధీ జలం ఇందులోకి చేరుతుంది. దీనిలో స్నానించి నా నీరు త్రాగినా సకల రోగాలు పోతాయి. కోనేరు చుట్టూ 52రాతి స్తంభాలతో ప్రాకారం గోడలు ఉంటాయి. కోనేరుమధ్య లో నాలుగు స్తంభాల మండపం లో లో పెద్ద నందీశ్వరుడు దర్శన మిస్తాడు. ఇది దాటితే




దీపస్తంభం, గాలిగోపురం తర్వాత ధ్వజస్థంభం – ఉంటాయి, గర్భాలయం ఎదురుగా ద్రుష్టి మండపం లో శివలింగం, దీనికి వెనుక పలురీతుల శిల్ప శిలలు కనిపిస్తాయి, ఈశాన్యం లో నందీశ్వర మండపం, ఎడమ వైపు వినాయక స్వామి కుడివైపు వీరభద్ర స్వామి దర్శన మిస్తారు, దగ్గరలో సుబ్రహ్మణ్యేశ్వర , మార్కండేయ విగ్రహాలున్నాయి, కార్తీకమాసం లో, శివ రాత్రి ఉత్సవాలకు లక్షలాది భక్తులు వస్తారు, క్షేత్రపాలకుడు వీరభద్ర స్వామి విగ్రహం 7 అడుగుల ఎత్తుగా ప్రసన్న వదనం తోనాలుగు భుజాలతో ఆయుధాలతో ఉండటం ఇక్కడి ప్రత్యేకత,



యాగంటి బసవన్న కు ఒక ప్రత్యేకత ఉంది, ఆలయం ఎదుటి మండపం లో ఉన్న పెద్ద నంది విగ్రహాన్ని యాగంటి నంది అంటారు, 15అడుగుల పొడవు, 8అడుగుల వెడల్పు, 8అడుగుల ఎత్తు ఉన్న "స్వయంభు నందీశ్వరుడు ".ఈ నందీశ్వరుని దేశ వ్యాప్త ప్రచారం బాగా ఉంది, దీనికొక కదఉంది, పూర్వం ఉమామహేశ్వరాలయానికి ఎదురుగా ఒక పెద్ద పొడవైన శిల ఉండేది, దాన్ని పగల గొట్టించే ప్రయత్నం ఎన్ని సార్లు చేసినా మళ్ళీ ఆ శిలా అలానే ఉండేది, చివరికి శివుని స్మరించి ఆ రాయికి నమస్కరిస్తే ఆ రాయి శాంతించి నంది ఆకారం దాల్చింది, కనుక యాగంటి నందీశ్వరుడు స్వయంభు, ఈ నంది ప్రతి ఏడాదీ పెరుగుతూ ఉండతమాశ్చర్య కరమైన విషయం, ఈ విషయాన్ని పురావస్తు శాఖ కూడా ధృవీకరించింది, శ్రీ విరాట్ పోతులూరి వీర బ్రహ్మేశ్వర స్వామి కాలజ్ఞానం లో "యాగంటి బసవన్న అంతకంతకు పెరిగి కలియుగాంతమున రంకె వేసే నయా 'అని 'తత్త్వం చెప్పారు,



## 64 శ్రీ రుద్ర కోటేశ్వరాలయం రుద్ర కోడూరు

కర్నూలుకు సుమారు 80కి.మీ ఉన్న ఆత్మకూరుకు 20కి, మీ లో నంద్యాల దారిలో నల్లకాలువ గ్రామం దాటి సుమారు 15కిలోమీటర్లు అడవిలో ప్రయాణం చేస్తే రుద్ర కోడేరు వస్తుంది, ఇక్కడే శ్రీ రుద్ర కోటేశ్వరాలయం ఉన్నది, పురాతనాలయం, దీని దగ్గరలో కోడూరు అనే చెంచు గూడెం ఉంది, ఈక్షేత్ర ప్రస్తావన పద్మ పురాణం లో ఉండటం విశేషం, ఇక్కడ పుణ్య స్నానం చేసి శ్రీ రుద్ర కోటేశ్వర



స్వామిని దర్శిస్తే పునర్జన్మ ఉండదని మోక్షం పొందుతారని ఆ పురాణం లో ఉంది, శ్రీరాముడు సప్తర్షులు సందర్శించిన ఆలయం,



దట్టమైన అడవీ ప్రాంతంగా ఉన్న ఈ ప్రదేశం లో పూర్వకాలం లో ఓ పశువులకాపరికి పుట్టలో ఉన్న స్వామి కలలో కన్పించి తనకొక ఆలయాన్ని కట్టమని కోరాడు, కాపరి ప్రజల సహాయంతో పుట్ట త్రవ్వగా స్వయంభు లింగం కనిపిస్తే ప్రతిష్టించి చిన్న గుడికట్టి నిత్య పూజలు నిర్వహించారు, ఈ ఆలయ సమీప కొండపై ఉన్న కల్ప వృక్షం పై శివ పార్వతులు కొలువై ఉంటారని భక్తుల అచంచల విశ్వాసం, తర్వాతకాలం లో ఆలయం విస్తరించింది, గర్భాలయం అంతరాలయం ముఖ మండపం ఉన్నాయి, గర్భాలయం లో యెర్ర రాయిశ్రీ రుద్ర కోటేశ్వర లింగం దర్శనమిస్తుంది. తర్వాతకాలం లో పాన వట్టం ఏర్పాటు చేశారు, ఎడమవైపు రుద్రాణి దేవి ఉంటారు, దేవి పై చేతులలో త్రిశూలం,ఢమరుకం, కింది చేతులలో అభయ హస్తం వర ముద్ర ఉండటం మరో విశేషం, కుడివైపు నాలుగు చేతుల వీరభద్ర స్వామి నల్ల రాతి విగ్రహం, విల్లు అంబు, ఖడ్గం, డాలు ధరించి సర్వాలంకార శోభతం గా ఉంటుంది భద్రస్వామికి పడగ విప్పిన నాగ శిరస్సు ఛత్రంగా ఉండటం అరుదైన విశేషం, ఇలా వీరభద్రుడికి నాగచ్ఛత్రం ఎక్కడా లేదు, ఇక్కడే ప్రత్యేకత,

స్వామికి ఎదురుగా నందీశ్వరుడు ప్రతిష్టితమైనాడు. గర్భ గుడికి ఎడమవైపు లక్ష్మణ సమేత సీతా రామ విగ్రహాలు ఉండటమూ విచిత్రమే, దీనికి ఎడమవైపు శ్రీ ఆంజనేయస్వామి కొలువై ఉంటాడు, ప్రధానాలయానికి కుడివైపు నవగ్రహ విగ్రహాలున్నాయి, ఎడమ వైపు పెద్ద పుట్ట దానికొక మండపం ఉన్నాయి, ఇక్కడనాగేంద్ర పూజ చేస్తారు, ఆలయ ఈశాన్య భాగం లో ఉన్న ప్రాచీన వృక్షాన్ని కల్ప వృక్షం గా భావించి పూజిస్తారు, ఈ వృక్షానికి ప్రదక్షిణాలు చేస్తే కోరికలు తీరుతాయి, ఆలయానికి ఎదురుగా ఉన్న రెండు కోనేరులలో నీరు అన్నికాలాల్లోను పుష్కలంగా ఉంటుంది, మహానంది నీరు లాగా అతి స్వచ్ఛంగా స్ఫాటిక జలంలా ఉండటం మరో విశేషం, నిత్యపూజలు ఉత్సవాలు జాతరలు ఎప్పుడూ జరుగుతాయి,

## పశ్చిమ గోదావరి జిల్లా

# 65 పార్వతీ కుమారస్వాములతోవిగ్రహ రూప దర్శనమిచ్చే శక్తీశ్వరాలయం యనమదుర్రు



పశ్చిమ గోదావరిజిల్లా భీమవరానికి సుమారు నాలుగు కిలోమీటర్ల దూరం లో ఉన్న యనమదుర్రు గ్రామం లో స్వయంభు శ్రీ శక్తీశ్వరాలయం ఉంది, ఈ ఆలయం లో శివుడు పార్వతీ దేవితో, ఒడిలో కుమార స్వామితో విగ్రహ రూపం లో దర్శన మివ్వటం ప్రత్యేకత, ఏక పీఠంపై పార్వతీ పరమేశ్వరులుండటం, ఇదంతా ఏక పెద్ద శిలగా భూగర్భం నుంచి చొచ్చుకొని రావటం మరో గొప్ప విశేషం,. శక్తీశ్వర స్వామి శీర్షాసనం లో తపో నిష్ట తో ఉండటం మరింత ఆశ్చర్యకర మహా ద్భుతం, జటాజూటం, నుదుట విభూతి రేఖలు, నాగాభరణలు స్వామి విగ్రహం లో స్పష్టంగా దర్శనమవటం పరమాద్భుతం,

ఈ క్షేత్ర పురాణ కధనం ప్రకారం శంబరాసురుడిని సంహరించే శక్తి యముడికి చాలక శివుని ప్రార్ధిస్తాడు, అప్పుడు రుద్రుడు యోగ నిద్రలో ఉంటాడు, అమ్మవారు పార్వతీ దేవి తన శక్తిని వరంగా యమునికిచ్చి ఆయన బలాన్ని పెంచింది, ఆ శక్తితో యముడు శంబరాసుర వధ చేశాడు, యమధర్మ రాజు కోరికపై శివుడు శీర్షాసనం లో, అమ్మవారితో సహా వెలిశాడు, ఆలయానికి తూర్పున ''శక్తి గుండం ''అనే చెరువు ఉంది కాశీగంగా ఇందులో అంతర్వాహినిగా కలుస్తుందని విశ్వాసం, ఈచెరువును త్రావ్వినపుడు సర్పాకారం లో ఉన్న ఆరు అడుగుల పెద్ద శిల లభించింది, దీన్ని సుబ్రహ్మణ్య స్వామి గా భావించి ప్రతిష్టించి



పూజిస్తున్నారు, శక్తి గుండం నీరే స్వామికి అభిషేకానికి పూజాదులకు ఉప యోగిస్తారు, ఒక సారి ఈ చెరువును శుభ్ర పరచటానికి నీటిని వాడటం ఆపేసి, ప్రక్కన ఇంకొక చెరువు త్రవ్వి ఆనీటిని స్వామి ప్రసాదాల తయారుకు ఉపయోగిస్తే ఉడక లేదట, అప్పుడు శక్తి గుండం లో చిన్న చెలమ తీసి ఆ నీటిని వాడితే వెంటనే ఉడికింది, కనుక స్వామికి వినియోగించే జలాన్ని అంతటినీ ఈ శక్తి గుండం నుంచే వాడుతున్నారు శివరాత్రి నాడు శివ పార్వతీ కల్యాణం , తెప్పోత్సవం వైభవంగా చేస్తారు శరన్నవ రాత్రులు కార్తీక మాసాలలో విశేష అర్చనలు అభిషేకాలు, లక్ష పత్రీ పూజా కుంకుమ పూజా ఉంటాయి సుబ్రహ్మణ్య షష్టికి అఖండ అన్న సమారాధన చేస్తారు,

## 66 శ్రీ ఉమా రామేశ్వరాలయం ఆచంట



పాలకొల్లుకు సుమారు ఎనిమిది కిలో మీటర్లలో గౌతమీ –వశిష్ట నదుల మధ్య వశిష్ట కు పడమటి తీరాన ఆచంట గ్రామం లో శ్రీ ఉమా రామ లింగేశ్వర స్వామి కొలువై ఉన్నాడు, ప్రాచీనాలయం,. చోళ రాజులు, లేక చాళుక్య రాజులు ఆలయాన్ని నిర్మించారని భావిస్తారు, శివుడు ఒక స్త్రీ చన్ను రూపం లో భక్తులకు దర్శనమిచ్చిన క్షేత్రం ఇది, తర్వాత ఉమా రామ లింగేశ్వర స్వామిగా పిలువ బడ్డాడు

తారకాసుర వధ అయిన తర్వాత శివపార్వతులు కేళీ విలాసం లో మునిగి తేలుతుండగా, ఆ సమయం లో ఒక ముని దంపతులు శివ సాయుజ్యం కోసం కైలాసం వెళ్ళగా కంటపడింది, శివుడు గమనించి ఆ దంపతులను బాల బాలికలను చేసి బ్రహ్మ చర్యం పాటిస్తే కొద్దికాలం లోనే సాయుజ్యం లభిస్తుందని చెప్పాడు. కానీ విధివశాత్తు తమిళదేశం లో తిరు వల్లూరు గ్రామం లో బ్రాహ్మణుడి ఇంట పుష్ప సుందరుడు, ,ఒడయ నంబి పేరుతోనూ,,తర్వాత మార్తాండ పురం లో కళా వంతుల ఇంట్లో పుష్ప సుందరి, పరమ నాచి అనే పేరుతో పుట్టారు, శాప విమోచనం తర్వాత



తీర్థ యాత్రలు చేస్తూపరమ నాచి ఉన్న మార్తాండ పురం వెళ్ళాడు, ఆమె నాట్య ప్రదర్శనతో అలరిస్తూ ఉండేది, శివ సంకల్పం తో ఇద్దరూ దంపతులై ఈశ్వర సేవ భక్తిగా చేస్తున్నారు, ఏది చేసినా శివార్పనంగా చేసేవాడు ఒడయనంబి, ప్రతిదీ శివ రూపంగా కనిపించేది,

తీర్ధయాత్రలు చేస్తూ మార్తాండ పురం అనే ఆచంట చేరాడు, .ఫలపుష్పాలతో ఉన్న ఈ కోనసీమ ఏంటో బాగా నచ్చింది, ఒక శివరాత్రి నాడు ఓడయనంబి,శివ పూజకు లింగం దొరకక నిద్రిస్తున్న భార్య చన్ను నే శివలింగం గా భావించి పూజించి శివుని మెప్పించాడు, పరమేశ్వరుడు పరమనాచి స్తనాగ్రంపై లింగా కృతిలో



దర్శన మిచ్చాడు, అతనికోరికపై అక్కడే వెలిశాడు. చన్ను మొన మీద లింగా కృతిగా శివుడు వెలసిన క్షేత్రం కనుక ఆచంట అయింది, మార్తాండపురమే ఇప్పుడు ఆచంట పురం, శివ రాత్రినాడు ఆచంటేశ్వరుని "లింగోద్భవ సమయం "లో దర్శిస్తేసకల శుభాలు సౌభాగ్యం లభించి శివసాయుజ్యం కలుగు తుంది, గర్భాలయం లో స్వామి ఎడమవైపు అమ్మవారు పార్వతీ దేవి దర్శన మిస్తారు ప్రాకారం లో ఇంకా చాలా మంది దేవీ దేవతలుంటారు,

## 67 శ్రీ నత్తా రామేశ్వరాలయం నత్తా రామేశ్వరం



పాలకొల్లుకు సుమారు 20కి మీ లో నాటతా రామేశ్వరాలయం ఉంది, ఇక్కడి లింగానికి ఒక ప్రత్యేకత ఉంది, స్వామి లింగాకారం శిలా రూపం లో ఉండదు. సముద్ర తీరం లో దొరికే నత్త గవ్వలతో, శంఖాలతో చేయ బడి ఉంటుంది అందుకే నత్తా రామేశ్వరుడు అనే పేరొచ్చింది,. స్థలపురాణం ప్రకారం రావణ వధ తర్వాత




సీతా రాములు వీలైన చోట్ల శివ లింగ ప్రతిష్ట చేస్తూ ఇక్కడికొచ్చారు, కైలాసైకి వెళ్లి భాణలింగాన్ని తీసుకొని రమ్మని హనుమను పంపారు, ముహూర్త సమయానికి రాలేక పోతే సీతాదేవి సముద్ర తీరం లో దొరికిన నత్త గుల్లలు శంఖాలు,

ఇసుకతో కలిపి లింగాన్ని తయారు చేస్తే ముహూర్త సమయం లో శ్రీ రాముడు ప్రతిష్టించాడు, దీనికే నత్తారామేశ్వర లింగం అనే పేరు, సంస్కృతం లో "శంభూక రామేశ్వర లింగం "అంటారు, అన్ని రకాల పూజలు మహా వైభవోపేతం గా చేస్తారు,

## 68 శ్రీ ఉమా వాసుకి రవి సోమేశ్వర క్షేత్రం జుత్తిగ



తణుకు కు పదికిలో మీటర్లలో జుత్తిగ గ్రామం లో ఈ ఆలయం ఉంది, పురాణకాలానికి చెందింది దూతికా పురం జుత్తిగ అయింది వాయు పురాణం లో దీని ప్రశస్తి ఉంది, ఇక్కడ ఉత్తర వాహినిగా గోస్తనీ నది ప్రవహించటం విశేషం. సూర్య చంద్ర వాసుకి లు ప్రతిష్టించిన విశేష లింగం ఇది, రావణుడు, వాసుకు సూర్య చంద్రులను పరాభవిన్చేవాడు వాసుకి కర్కోటకుడు తక్షకుడు ధనుంజయుడు అనే సర్పాలతో తన రధాన్ని లాగించేవాడు, వీరందరూ రావణ బాధ భరించ లేక గోస్తనీ తీరం చేరి ఈ శివ లింగాన్ని ప్రతిష్టించి పూజించారు, అందుకే ఇది శ్రీ ఉమా వాసుకు రవి సోమేశ్వరాలయం అయింది, గోస్తనీ నది బస్తరుజిల్లా దేనుపర్వతం లో పుట్టి నాలుగు పాయలుగా చీలి ఒకపాయ ఇక్కడ ఉత్తరవాహిని అయింది,



ఆలయం లో దక్షిణ ముఖంగా పార్వతీదేవి ఎడమ వైపు భద్రకాళీ వీరభద్రులు, ముఖ మండపం లో శ్రీ అవిసిరమ్మ, శ్రీ శారదాదేవి కుమారస్వామి విగ్రహాలున్నాయి వాయవ్యం లో శ్రీ లక్ష్మి జనార్దన స్వామి, ఈ శాన్యం లో సూర్య దేవుడు, కాలభైరవుడు, ఆగ్నేయం లో గణపతి నైరుతిలో దుర్గా దేవి దర్శన మిస్తారు, అన్ని రోజుల్లోనూ విశేష పూజలు జరిగే క్షేత్రం, స్మార్తా గమ విధానం లో పూజాదికాలు నిర్వహిస్తారు,

## తూర్పు గోదావరి జిల్లా

# 69 శ్రీ ఉమా కమండలేశ్వరాలయం ర్యాలి




తూర్పుగోదావరి జిల్లా రావులపాలెం కు సుమారు 15కిలో మీటర్లలో ఉన్న ర్యాలి గ్రామం లో ఉన్న శ్రీ ఉమాకమండలేశ్వర స్వామి ఆలయం బహు ప్రాచీనమైనది, ఆలయ నిర్మాత వివరాలేవీ తెలియదు, స్థల పురాణాన్ననుసరించి బ్రహ్మ దేవుడు ఈ ఆలయాన్ని నిర్మించాడు, ఆలయం పడమర ముఖం గా ఉండటం విశేషం, ఇలా పడమరముఖ శివాలయం దాదాపు మరెక్కడా లేదు అరుదైన ఆలయం,

పూర్వం బ్రహ్మదేవుడు ఇక్కడి వశిష్ట నదీ తీరానికి వచ్చి వసిష్ట గుండం వద్ద తపస్సు చేశాడు కనుక ఈ ప్రాంతాన్ని బ్రహ్మ మండలం అంటారు, బ్రహ్మ తన కమండలం మీదు శివలింగాన్ని ప్రతిష్టించి పూజించాడు కనుక బ్రహ్మ కమండలమైంది. అదే ఉమా కమండలేశ్వర లింగం గా ఆలయంగా మారింది '

ర్యాలి అంటే జగన్మోహినీకేశవాలయం ఆలయం గుర్తుకొస్తుంది జగన్మోహిని అందానికి పరవశుడైన బ్రహ్మ కేశవ ఆలయం ఎదుట తన కమండలంనుండి ఒక లింగాన్ని సృష్టించి ప్రతిష్టించాడు, అందుకు కూడా కమందలేశ్వరుడనే పేరొచ్చింది, ఈ లింగానికి కింద పాన వట్టం ఉండక పోవటం మరో విశేషం,. అభిషేక జలం లింగం కిందనుండి భూమిలోకి వెళ్ళిపోతుంది, ఎక్కడికి వెడుతుందో ఎవరికీ ఎరుక లేదు, లింగం తో పాటు పార్వతీ రూపమైన ఉమా దేవిని కూడా ప్రతిష్టించారు, ఈ స్వామికి ఎదురుగా కేశవవ స్వామి ఉండటం ఇక్కడి మరో ముఖ్య ప్రత్యేకత, కేశవ స్వామి క్షేత్రపాలకుడు ఈ

ఉమా లింగ స్వామి, అన్ని వేళలలో విశేష పూజలు జరుగుతాయి, జగన్మోహినీ కేశవ స్వామి ఆలయానికి ఉన్నంత ప్రాధాన్యం దీనికి రాక పోవటం శోచనీయం, విష్ణువు ఖరీదైన దేవుడు శివుడు విబూది ప్రియుడు అవటమే కారణమేమో ?

## 70 శ్రీ సారంగ ధరేశ్వరాలయం రాజమండ్రి




రాజ రాజ నరేంద్రుని కుమారుడు సారంగ ధరుడు, సకల విద్యా పారంగతుడు ధర్మ వేత్త శీలవంతుడు. ఆతను చిత్రాంగి ప్రేమించుకొన్నారు. విధి వశాన చిత్రాంగి రాజుకు రెండవ భార్య అయింది, ఆమెకు సారంగునిపై వలపు పోలేదు, తనను చేబట్టమని కోరితే ఆమె తనకు తల్లితో సమానమని చెప్పాడు, రాజు వేటకు వెళ్ళినప్పుడు జరిగిన ఘటనలోప్రతీకారం గా సారంగునిపై నసేరం మోపింది చిత్రాంగి. వృద్ధ రాజు నమ్మి శిక్షగా అతని కాళ్ళు చేతులు నరికించి బహిష్కరించాడు, అటువైపు వెడుతున్న మీన నాదుడనే సాధువు ఈ విషయం తెలుసు కొని తన మంత్రం శక్తి చేత కాళ్ళు చేతులు వచ్చేట్లు చేశాడు, మీన నాధుని గురువుగా స్వీకరించి సారంగ ధరుడు తపో దీక్ష వహించి ఈ ఈప్రాంతం లో ఒక శివలింగాన్ని ప్రతిష్టించి పూజించాడు సారంగధరుడు ప్రతిష్టించిన లింగం కనుక సారంగ ధరేశ్వర లింగం గా ప్రసిద్ధి చెందింది, 1976లో నూతన ఆలయ నిర్మాణం చేశారు, అమ్మవారు శ్రీ బాలా త్రిపుర సుందరీ దేవి,. నిత్య పూజలు అభిషేకాలు ఉత్సవాలు ఘనంగా జరుగుతాయి,




## 71 సోమేశ్వర స్వామి సిద్ధి జనార్ధన స్వామి ఆలయాలు కోటి పల్లి

కోటి పల్లి గోదారిలో స్నానం చేస్తే కోటి ఫలితాలొస్తాయి కనుక కోటిఫలి అనే పేరొచ్చి కాలక్రమం లో కోటిపల్లి అయింది, ఆలయం లో శ్రీ రాజ రాజేశ్వరీ సహిత సోమేశ్వర స్వామి దర్శన మిస్తారు, ఇక్కడే శ్రీ దేవీ భూదేవీ

సమేత సిద్ధి జనార్దన స్వామి కొలువై ఉండటం మహా విశేషం, శివకేశవ దర్శనం ఏక కాలం లో జరగటం మహా అదృష్టం, కోటి తీర్ధం గా ప్రసిద్ధి,



సోమేశ్వర లింగాన్ని చంద్రుడు ప్రతిష్టించాడు తన పాపాలు పోగొట్టుకోవటానికి ఇంద్రుడు కోటేశ్వర లింగ ప్రతిష్ట చేశాడు జనార్దన శీ భూదేవులను ఇంద్ర, చంద్ర, కశ్యపులు ప్రతిష్టించారు, గోదావరి ఒడ్డునే ఈ ఆలయాలు ఉండటం గొప్ప విషయం, నదిని ఇటు వైపు ప్రవహింప జేసినవాడు గౌతమమహర్షి కనుక గౌతమి అనే పేరు, ఇక్కడే నాగ లింగ, భోగ లింగాలయాలూ ఉన్నాయి, కోటి తీర్ధ జలాలనే తెచ్చి అభిషేకానికి ఉపయోగిస్తారు, పవళింపు సేవతో సహా స్వాములకు అన్ని సేవలూ జరుగుతాయి, ఆలయానికి ఎదురుగా ఉన్న చెరువును సోమ గుండం అంటారు, దసరా కార్తీక ఉత్సవాలు వైభవం గా నిర్వహిస్తారు, శివరాత్రి నాడు ఇసుక వేస్తె రాలనంత భక్తజనం ఉంటారు. ద్రాక్షారం చుట్టూ ఉండే అస్టసోమేశ్వరాలయాలలో కోటి పల్లి ముఖ్యమైనది,



సోమేశ్వరలింగం భూమికి నాలుగు అంగుళాలు ఎత్తు మాత్రమే ఉన్న లింగం అయితే యమా పవర్ ఫుల్, ఆలయానికి వెనక చిన్నగదిలో చంద్ర ప్రతిష్టిత లింగం ఉంది, చంద్ర ప్రతిష్టిత లింగాన్ని సోమేశ్వరలింగమని ఇంద్ర ప్రతిష్టితమైనదానికి కోటేశ్వర లింగమని పిలుస్తారు, గర్భ గుడి రెండు భాగాలుగా ఉండటం ఇక్కడి విశేషం, ఒకభాగం లో సోమేశ్వరుడు, మరోభాగం లో విష్ణు మూర్తి ఉండటంమరో వింత, రెండిటికీ ఒకే శిఖరం ఉండటం మరో అపూర్వం, శివ కేశవులకు ఒకే ధ్వజ స్థంభం ఒకే శిఖరం ఉండటమూ ఆశ్చర్యం.

భక్తులు గోదారి స్నానం చేసిముందుగా కోటేశ్వర స్వామిని తర్వాత చాయా సోమేశ్వర స్వామిని, చివరికి సిద్ధి జనార్దన స్వామిని దర్శించటం రివాజు, కోటి గోదానాలు, కోటి కన్యాదానాలు, వంద అశ్వ మేదాలు, మూడు కోట్ల శివ లింగ ప్రతిష్టచేస్తే ఎలాంటి ఫలితం వస్తుందో కోటిపల్లి క్షేత్ర గోదావరీ స్నానం అంతటి ఫలితాన్నిస్తుందని స్థలపురాణం, ఉదయం బ్రాహ్మీ ముహూర్తం లో పవిత్ర గోదావరి స్నానం చేసి వినాయక ,కోటేశ్వర సోమేశ్వర జనార్దన దర్శనం వరుసగా చేసి పూజిస్తే శివ సాయుజ్యమే, పునర్జన్మ ఉండనే ఉండదు,




బలి చక్ర వర్తి బారి నుండి రక్షించమని దేవతలు, కశ్యప మహర్షితోకలిసి కోటిపల్లి లోతపస్సు చేస్తున్న విష్ణుమూర్తిని ప్రార్ధించారు, అనుగ్రహించి కశ్యప ప్రజాపతిభార్య అదితి గర్భం లో వామనుడుగా జన్మించాడు కేశవుడు, బలి నుండి మూడడుగుల భూమిని దానంగా పొంది పాతాళానికి పంపి మళ్ళీ ఇక్కడికే వచ్చి తపస్సులో మునిగిపోయాడు నారాయణుడు,. వామన జన్మ కోటి పల్లిలోనే జరిగింది,

అహల్యను, గౌతముని కోడి వేషం లో మోసగించిన ఇంద్రుడు గౌతమ శాపం తో ఒళ్ళంతా సహస్ర యోనులుగా మారిపోగా ఇక్కడికొచ్చి గౌతమీ స్నానం చేసి శుద్ధుడై సిద్ధి జనార్దానుని పూజించి, అయన సమీపం లోనే ఇంద్రుడు కోటీశ్వరలింగాన్ని ప్రతిస్టించాడు, అప్పుడు అతని శరీరంపై ఉన్న యోనులు నేత్రాలుగా మారి సహస్ర నేత్రుడయ్యాడు,

చంద్రుడు గురు పత్ని తార తో పొందు సుఖం పొంది, శాపం వలన సహజ సిద్ధ వెన్నెల ఛాయ కోల్పోయి క్షయ వ్యాధి గ్రస్తుడయ్యాడు, ఇక్కడికొచ్చివిష్ణువు కై తపస్సు చేసి ఆయన ఇచ్చిన హితం తో గోదావరీ స్నానం తో పునీతుడై సిద్ధి జనార్దనుని సేవించి, ఉమా సోమేశ్వర లింగ ప్రతిష్ట చేసి పోగొట్టుకున్న చాయను తిరిగి పొందాడు, అందుకే చాయా సోమేశ్వర లింగమని, ఈ క్షేత్రాన్ని సోమ క్షేత్రమని అంటారు, కోటిపల్లి తిరునాళ్ళు చాలా ప్రసిద్ధమైనవి సినిమా షూటింగ్ లకు చాలా అనువైన అందమైన ప్రదేశం, బాపు విశ్వనాద్ వంశీ మొదలైన దర్శకులు గోదావరి అందాన్ని సెల్యులాయిడ్ పై ఆరబోశారు,

## 72 శ్రీ ఉమా "కొప్పు " లింగేశ్వర స్వామి పలి వెల



తూ గో జి కొత్త పేట మండలం లో పలివెల గ్రామం లో నెత్తి మీద కొప్పు ఉన్న లింగాన్నే ఉమా కొప్పులింగేశ్వర స్వామి అంటారు అగస్త్య ప్రతిష్టితం. దీనికి ఉన్నకధ . ఒకానొక కాలంలో ఆలయ పూజారి వేశ్యా వ్యసనం లో ఉండేవాడు. ప్రతి రోజు ఆముక్త మాల్యదలాగా వేశ్య తలలో పెట్టుకొన్న పూల మాలలనే దేవుడికి వేసేవాడు. ఒక సారి రాజుగారు గుడికి వస్తే స్వామి వారి కి అలంకరించిన పుష్ప మాలను ఇచ్చాడు. అందులో ఒక స్త్రీ శిరోజాలు కనిపించాయి రాజుకు. ఈ విషయమై పూజారిని నిలదీస్తే మన స్వామి లింగానికి ఉన్న కొప్పు లో ఉండే వెంట్రుకలే అవి బుకాయించి కావాలంటే మర్నాడు ఉదయం రాగానే నిర్మాల్యాన్ని చూపిస్తాను అన్నాడు. సరే నని రాజు వెళ్ళిపోయాడు. పూజారికి అబద్ధం ఆడినందుకు ప్రాణ సంకటంగా ఉంది. తనతప్పును రాజు గమనిస్తే ఉరి ఖాయం అనుకోని తెల్ల వార్లూ శివుని ప్రార్ధిస్తూ తల లింగానికేసి కొట్టుకొంటూ పశ్చాత్తాప హృదయం తో ప్రార్ధించాడు. బోళా శంకరుడు దయ తలిచి తనలింగం పైభాగాన కొప్పు దానికి శిరోజాలు సృష్టించి భక్తుడిని కాపాడాడు. మర్నాడు



రాజు రావటం సామి శిరసున శిరోజాలు గమనించటం పూజారిని అనుమానించి నందుకు మన్నించమని కోరడం జరిగింది. పూజారినీ రాజును భక్త వత్సలుడు మన్నించి దీవించాడు. అప్పటినుడి "కొప్పు లింగేశ్వర స్వామి "గా ప్రసిద్ధుడయ్యాడు



ఈ ఆలయప్రదేశం తూర్పున కౌసికి, దక్షిణాన సాంఖ్యాయని, ఉత్తరాన మాండవి, పల్వలఅనే అంతర్వాహిని గా నదుల మధ్య ఉంది. వర్షాకాలం లో వశిష్ట, కౌసికి నదులకు వరదలు వచినప్పుడు గర్భాలయం లో నీరు విపరీతంగా నిండటం చేత అంతర్వాహిని అయిన పల్వలనదిని కూడా చూడ వచ్చు. గర్భాలయ శివ లింగానికి ముందువైపు పై భాగం లో చతురస్రా కారం లో కొంతభాగం ముందు పొడుచుకు వచ్చినట్లు కనిపిస్తుంది. దీన్నే "కొప్పు "అంటారు. అందుకే కొప్పు లింగేశ్వరుడు. అమ్మవారు ఉమా రూపం లో పార్వతీ దేవి. సాధారణం గా అయ్యవారికి ఎడమ వైపు ఆలయం లో ఉండల్సిన అమ్మవారు ఏకంగా గర్భ గుడిలోనే స్వామి లింగంప్రక్కనే ఒకే పీఠంపై కొలువై ఉండటంవిశేషం అరుదు కూడా. అందుకే శ్రీ ఉమా కొప్పు లింగేశ్వర స్వామి అయ్యాడు. .కుమారస్వామి గణనాధుడు కూడా ఉన్నారు. శివకుటుంబంఅంతాఒక్క చోటే గర్భాలయం లో ప్రతిష్టింప బడటం మరీ ఆశ్చర్యకర విషయం

74 శ్రీ కుక్కుటేశ్వరాలయం పిఠాపురం




శక్తి పీఠాలలోఒకటైన పీఠికాపురమే పిఠాపురం. అతి ప్రాచీనాలయం. 1186లో చోళ రాజు మూడవ గొంక రాజు భార్య జయాంబిక ఈ ఆలయానికి తొమ్మిది ఖండాల (నవ ఖండ )భూభాగాన్ని దానం ఇచ్చింది. 1433లో వాసిరెడ్డి పోతినీడు రాజు అమ్మవారి కుంకుమార్చన కోసం మండపం కట్టించి తాటి తోట ఏర్పాటు చేసినట్లు శాసనాలున్నాయి.

స్థల పురాణం ప్రకారం గయుడు అనే రాజు "పురుహూతికా శక్తి "ని ఉపాసించి ధర్మబద్ధంగా రాజ్యమేలాడు. యజ్న హవిర్భాగం పొందే అర్హతనూ సాధించాడు. ఇంద్ర పదవికి ఎసరు పెడతాడేమో నని,అతని ప్రాభవాన్ని తగ్గించమని ఇంద్రుడు త్రిమూర్తులను చేరి పాహిమాం అన్నాడు. వాళ్ళుఅభయమిచ్చి బ్రాహ్మణ వేషం లో రాజు



దగ్గరకు వచ్చి తామొక అపూర్వ యజ్ఞం చేయ సంకల్పించామని, ఆ యజ్ఞాన్ని భరించే శక్తి భూమికి లేదని గయుడే తమను ఆదుకోవాలని కోరారు. సరేనన్నాడు రాజు. .వారికోరిక మేరకు గయుడు తన శరీరాన్ని విస్తృతంగా పెంచి, తన శరీరం యెంత భారమైనా మోస్తుందని భరిస్తుందని హామీ ఇచ్చి దానిపై వాళ్ళను యజ్ఞం చేసుకోమన్నాడు. యజ్న సమయం లో శరీరం కదల్చరాదని,కదిల్చితే గయుడికే ప్రమాదమని అని వాళ్ళు కిరికిరి పెట్టారు. సరేనన్నాడు

వెంటనే త్రిమూర్తులు గయుని శరీరం పై యజ్ఞం ప్రారంభించారు. అగ్ని జ్వాలలు యెంత బాధిస్తున్నా సహిస్తూ ఓర్పు తో కదలకుండా అలాగే ఉన్నాడు గయుడు. గయుని స్తిర చిత్తానికి వాళ్ళు ఆశ్చర్య పోయాడు. అయితే ఆతను కదలక పోతే తాము వచ్చిన పని నెరవేరదని గ్రహించి, ఏదోఒక ఉపాయం తో అతన్ని కదిల్చే ప్రయత్నం చేయాలనుకొన్నారు. శివుడు కోడి రూపం ధరించి "కొక్కొరోకో "అని కూశాడు. .కోడికూత విని తెల్లవారిందేమోనని గయుడు భావించి కాస్త ఊపిరి పీల్చుకొన్నాడు. దీనితో శరీరం కదిలింది రాజు అన్న మాట తప్పాడనిబ్రాహ్మణ వేష త్రిమూర్తులు కోపించి యజ్ఞం పూర్తికాక ముందే శరీరాన్ని కదిలించాడు యజ్న భంగం అయిందని కనుక శరీరాన్ని మూడుముక్కలుగా చేసే శిక్ష అనుభావవించాల్సిందేనన్నారు.



అప్పుడు గయుడికి బల్బు వెలిగి వచ్చిన వారెవరో తెలిసి తన శరీరం వారి యజ్ఞానికి ఉపయోగ పడినందుకు సంతోషంగా ఉందని ఏశిక్షకైనా సిద్ధమేనని అన్నాడు. తన శరీర భాగాలు పడిన చోట ఏర్పడే పుణ్య క్షేత్రాలకు వారు క్షేత్ర పాలకులుగా ఉండాలని వేడుకొన్నాడు. వారు అంగీకరించారు. త్రిమూర్తుల శాపం వలన గయుని శరీరం మూడు భాగాలై మూడు చోట్ల పడింది. శిరస్సు బీహార్ లోని గయ లో పడింది కనుక శిరో గయ అయింది. నాభి భాగం జాజి పురం లో పడి నాభి గయ అయింది. మూడవ భాగమైన పాదాలున్న భాగం పురుహూతిక లో పడిపాద గయ అయింది. అంటే పిఠాపురం పాద గయ  అన్న మాట. ఇక్కడే శివుడు కోడి ఆకారపు లింగమై "కుక్కుటేశ్వర లింగమై పూజలందు కొంటున్నాడు



గర్భాలయం లో శ్రీ కుక్కుటేశ్వర లింగం, ఆవరణ ఆలయం లో అమ్మవారు రాజ రాజేశ్వరీ దేవి  ఉంటారు. కాలభైరవుడు, వినాయక కుమారస్వామి, శంకరాచార్య, దక్షిణా మూర్తి, విష్ణు పాదాలు మొదలైన దేవీ దేవతలా విగ్రహాలెన్నో ఉన్నాయి. ఆలయం ముందున్న కొలను ను పాదతీర్ధ మంటారు ఇందులో స్నానించి ముందు నందీశ్వర దర్శనం చేసి అనుమతిపొంది శ్రీ కుక్కుటేశ్వర దర్శనం చేయాలి. ఆలయం లో పురుహూతికా దేవి ఆలయమూ ఉంది. ఇది గొప్ప శక్తి పీఠం..నవరాత్రి శివరాత్రి కార్తీక మాస ఉత్సవాలు ఘనం గా జరుగుతాయి శివరాత్రికి కల్యాణం ఉత్సవాలు చేస్తారు.

## 75 కపోతేశ్వరాలయం కడలి




జగ్గం పేట కు దగ్గరలో ఉన్న కడలి గ్రామం లో శ్రీ కపోతేశ్వరాలయం ప్రాచీన ప్రసిద్ధాలయం..స్వామి స్వయంభు. ఈ ఆలయానికి ఒక చరిత్ర ఉంది. పూర్వం ఒక వేటకాడు పెద్ద వర్షం రోజున అడవిలో పక్షుల వేటకు వచ్చాడు. ఆరోజుఒక్క పక్షి కూడా కనబడలేదు. ఆకలి నకనక లాడుతోంది, వణుకుతూపూర్తిగా తడిసిపోయి ఒక చెట్టు కిందికి చేరాడు. చెట్టు మీద ఉన్న ఆడ పావురం, అడవికి మేతకి వెళ్ళిననభార్త రాక కోసంఎదురు చూస్తోంది. కింద చలి ఆకలి తో అలమటిస్తున్న తమ అతిధి అయిన వేటకాడిని చూసి జాలితో తనశారీరం అగ్నికి ఆహుతిచేసి వాడికి



ఆహారమవ్వాలనినిర్నయించుకోంది. వెంటనే ఎండిన పుల్లలు ఏరుకొచ్చి,తన చెట్టు కింద మంట వేసితన గూటి తో సహా అగ్నిలో పడి కాలిపోయింది. . ఇంతలో మగ పావురం కూడా వచ్చి విషయం తెలుసుకొని తానూ అగ్నిలో దూకి ప్రాణం అర్పించింది. ఇది చూసిన వాడు తన ప్రాణాలు నిలపటానికి ఆ పావురజంట చేసిన త్యాగానికి ఆశ్చర్య పడి వారి త్యాగానికి జోహార్లర్పించాడు. తనవేట తమకం ఇంతటి అనర్ధాన్ని కలిగించినందుకు కన్నీరు మున్నీరుగా విలపించాడు. పక్షుల జీవితాలు ఉత్తమమైనవని, తనది నిరర్ధక జీవితమని గ్రహించి వాడుకూడా పెద్ద పెద్ద కట్టెలు తెచ్చి పేర్చిఆ మంట పెంచి దానిలో తానుకూడా ఆహుతి అయ్యాడు.



పావురం జంట చేసిన త్యాగానికి పరమేశ్వరుడు మెచ్చి, వాటికి ముక్తిని ప్రసాదించ టానికి ప్రత్యక్షమయ్యాడు. అవి ముందుగా వేటకాడికి మోక్షం ప్రసాదించమని వేడాయి. కాలకంఠుడు కరిగిపోయిముగ్గురికీ మోక్షం ఇచ్చాడు. పావురాల జంట కోరికపై శివుడు అక్కడే కపోతేశ్వర స్వయంభు లింగం గా వెలిసి కపోతేశ్వర స్వామిగా ప్రఖ్యాతి చెందాడు. ఆలయ గర్బ గుడి లో కపోతేశ్వర లింగం పై భాగాన రెండు పావురాలు, ,మండపం లో నంది వెనుక వేటకాడు కూడా కనిపిస్తాడు. అమ్మవారు పార్వతీ దేవి. వీరభద్ర కుమారా స్వామి గణపతి కనక వల్లి బాలా త్రిపుర సుందరి కాలభైరవ, నవ గ్రహాలూ మొదలైన వారందరూ ఉంటారు. అన్ని సమయాలలో ఉత్సవాలు, ఊరేగింపులు పూజలు జరుగుతాయి.

## 76 క్షణ ముక్తేశ్వరాలయం ముక్తేశ్వరం



అమలాపురానికి 12కి మీ దూరం లో, రాజ మండ్రి కి 60కి మీ దూరం లో, ముక్తేశ్వర క్షేత్రం ఉన్నది, ఇక్కడ ఒక్క క్షణం గడిపినా ముక్తి లభిస్తుంది కనుక క్షణ ముక్తేశ్వరం అంటారు. కోటి పల్లినుంచి లాంచీలలోనూ వెళ్ళ వచ్చు.గౌతమీ నదీ తీర క్షేత్రం ఇది, అత్యంత పురాతనాలయం, రావణ వధ తర్వాత ఆ బ్రహ్మ హత్యా పాపం పోగొట్టుకోవటానికి శ్రీ రాముడు ఎన్నో చోట్ల శివలింగ ప్రతిష్ట చేశాడు, ఒక సారి ఈ ముక్తేశ్వరం మీదుగా పుష్పక విమానం లో వెడుతుంటే ఇక్కడికి రాగానే విమానం ఆగి పోయింది, అక్కడ దిగి నడుచు కుంటూ వెడితే ఒక పెద్ద పుట్ట కనిపించింది దానిలో ఒక దివ్య జ్యోతిర్లింగం మిరు మిట్లు గొలిపే కాంతితో దర్శన మిచ్చింది, దానికి దగ్గరలో" శ్రమణి "అనే తాపసి ధ్యానం లో కనిపించింది, రాముడు ఆమెను సమీపించగానే ఆమె కళ్ళు తెరిచి పురుషోత్తముడైన శ్రీ రామ దర్శనం చేత తనకు శాప విమోచనమైందని తెలిపింది, పుట్టలోని జ్యోతిర్లింగం వద్ద రాముడు పంచాక్షరి జపించాడు, వెంటనే పరమేశ్వరుడు దానినుండి ప్రత్యక్షమయ్యాడు, తాపసి శ్రమణి శివ దర్శనం తో జ్యోతిర్లింగం లో ఐక్యమై పోయింది,



శ్రీ రాముని కోర్కపై శివుడు ఇక్కడ జ్యోతిర్లింగం గా వెలిశాడు, ఒక్కక్షణ దర్శన భాగ్యం వలన శ్రమణికి మోక్షమిచ్చిన జ్యోతిర్లింగం కనుక అది క్షణ ముక్తేశ్వర క్షేత్రమయింది, శ్రీరాముడు ఈ లింగ ప్రతిష్ట చేసి బ్రహ్మ హత్యా పాతకం నుండి విముక్తడయ్యాడు, కనుక ఆలయం త్రేతా యుగానికి చెందినది, సప్తమహర్షులు ఇక్కడ కొచ్చి స్వామిని అర్చించారు, క్షేత్రపాలకుడు కేశవ స్వామి, శ్రావణ ఆశ్వయుజ కార్తీక మాసాలలో, శివరాత్రికి విశేషం గా పూజలు అభిషేకాలు ఉత్సవాలు జరుగుతాయి,

## విశాఖ పట్నం జిల్లా

# 77 శ్రీ గోలింగేశ్వరాలయం బిక్క వోలు



విశాఖ జిల్లా విశాఖ –రాజ మండ్రి రైలు దారిలో బిక్కవోలులో శ్రీ గోలింగేశ్వరాలయం ఉన్నది. దీన్ని వేంగీ చాళుక్య రాజు కుబ్జ విష్ణు వర్ధనుడు నిర్మించాడు, దీనికి సాక్ష్యం గా స్తంభాల మీద మరు గుజ్జు రూపాలు కనిపిస్తాయి, ఇవి రాజును పోలి ఉన్న విగ్రహాలే, స్వామికి కుడివైపు రాజ రాజేశ్వరి అమ్మవారు ఉంటారు, నాలుగు నంది విగ్రహాలు ఉండటం ఇక్కడి మరో విశేషం,. ఇవి ఒక దానికంటే మరొకటి పెద్దగా ఉంటాయి, ఒక వైపు నాగేశ్వర, నందీశ్వర, విశ్వేశ్వర, రామ లింగేశ్వరులు ఉంటె రెండో వైపు గణేశ్వర,శనీశ్వర లింగాలు ఉంటాయి ఎడమ వైపు సుబ్రహ్మణ్య స్వామి, ప్రత్యేక పుట్ట ఉండటం కూడావిశేషమే, అన్ని రోజుల్లో అన్ని రకాల పూజాదికాలు జరుగుతాయి,

## 78 శ్రీ బ్రహ్మ లింగేశ్వర స్వామి దేవాలయం బలి ఘట్టం



నర్సీపట్నానికి మూడు కి.మీ దూరం లో బలిఘట్టం లో త్రిశూల పర్వతం అనే కొండమీద ఉన్న శ్రీ బ్రహ్మ లింగేశ్వరాలయం ప్రాచీనాలయం, 16వ శతాబ్ది చోళ రాజ నిర్మిత ఆలయం,. ఇక్కడి శివలింగం పడమటి ముఖం గా ఉండటం, ఉత్తరం గా వరాహ నది ప్రవహించటం ఈ క్షేత్రానికి అధిక ప్రాధాన్యత కలిగించి ''దక్షిణ కాశి 'గా 'ప్రసిద్ధమైంది, బలిచక్ర వర్తి తపస్సుకు మెచ్చి బ్రహ్మ ప్రత్యక్షమై ఆయన కోరిక మీద శివలింగాన్ని ప్రతిస్టించాడు అందుకే బ్రహ్మేశ్వర లింగం అయింది, వరాహ నది ఉత్తరావాహినే కాక విష్ణు పాదోద్భవ, కనుక క్షేత్రానికి మహిమ ఎక్కువ, హిరణ్యాక్షుడిని వెంటాడుతూ విష్ణుమూర్తి ఇక్కడికి వచ్చి అలసి పోయి కాసేపు ఇక్కడ శయనించాడు, స్వామి అభిషేకం కోసం నీరు కావాలని కోరగా వరాహ రూపం లో ఉన్న విష్ణువు ఈమార్గం గుండా ఒక నదిని ప్రవహింప జేశాడు, ఇదే వరాహ నది, మహిమాన్వితమైన దేవుడుగా బ్రహ్మ లింగేశ్వర స్వామి పేరు పొందాడు,



విజయ నగరం జిల్లా

## 79 పెరుగుతున్న శ్రీ మల్లికార్జున లింగం జయతి



విజయనగరం జిల్లా మెంటాడ మండలం జయతి లో క్రమక్రమంగా పెరుగుతున్న శ్రీ మల్లికార్జున లింగం ఉన్న దేవాలయం ఉంది, ఇది సహజ సిద్ధ శివలింగం, ఇక్కడి నాట్య భంగిమ నటరాజు 16చేతులతో, వివిదాయుదాలతో శివతాండవం చేస్తున్నట్లు దర్శనమివ్వటం అపూర్వమైన విషయం, ఆదిపరాశక్తి కూడా శూలం మొదలైన ఆయుధాలతో ఆయనతో బాటు రౌద్ర నృత్యంభీకరంగా చేస్తున్న భంగిమలో కనిపించటం ఆశ్చర్యం, స్వామి ఆలయానికి ఎదురుగా ఒకే శిరసు కలిగిన రెండు సింహాలుండటం మరో వింత, ఇదికాక విచిత్రమైన ఆకారం కల నందీశ్వరుడు కూడా



మనకు ఆశ్చర్య కారకుడౌతాడు, ఆలయానికి దగ్గరలో శిధిల వేణుగోపాల మల్లికార్జునాలయాలున్నాయి, ఈగ్రామాన్ని అనుకోని ఉన్న కొండలలో పెద్ద పెద్ద లోయలున్నాయి, వీటిని బంగారు లోయలు అంటారు, ఈవూరికి దగ్గరలో ఉన్న నీలావతి గ్రామం లో భైరవ శిఖరం 29 ఎకరాల విస్తీర్ణం లో వ్యాపించి ఉంది, ఇది బుద్ధునికాలంనాటి స్థూపం గా భావిస్తున్నారు, ఈ శిఖరం పై ఉన్న తులసి చెట్టు ఏకాలం లోను వాడి పోవక పోవటం వింతలలో వింత, శిఖరం మధ్య 15 అడుగుల లోతున్న కొలను లో నీరు ఎప్పుడూ ఎండిపోవక పోవటం మరీ ఆశ్చర్యకరమైన విషయం ఇదికాక

దుర్గా భైరవుల ఏక శిలా విగ్రహాలున్నాయి, మనసుకు ఆహ్లాదం కలిగించే చక్కని ప్రక్రుతి మధ్య ఉన్న ఈ ఆలయం మానసిక ప్రశాంతికి కేంద్రం,

శ్రీకాకుళం జిల్లా

## 80 శ్రీ ముఖ లింగేశ్వరాలయం శ్రీ ముఖ లింగం



శ్రీకాకుళం జిల్లా శ్రీకాకుళానికి వాయవ్యం 45కిలోమీటర్లలో వంశధార నదీ తీరాన శ్రీ ముఖ లింగ క్షేత్రంలో శ్రీ ముఖలింగేశ్వరాలయం ఉంది, ఆంధ్ర, ఒరిస్సా సంప్రదాయాల కాణాచి, అతి ప్రాచీనాలయం, సర్వ దేవతానిలయం. శ్రీ ముఖ లిన్గేశ్వరుడిని ఇంద్రుడితో పాటు అష్ట దిక్పాలకులు, సకల దేవతలు కలిసి ప్రతిష్టించారు, దక్షిణ కాశిగా ప్రసిద్ధం, శ్రీ ముఖ లింగేశ్వర ముఖ దర్శనమే పునర్జన్మ రాహిత్యాన్నిస్తుంది ఇక్కడి సోమేశ్వర భీమేశ్వర మధుకేశ్వరాలయాలు క్రీ శ.573లో పూర్వ గంగ వంశానికి చెందిన హస్తి వర్మ అనే రాజు నిర్మించాడని అంటారు, సోమేశ్వరాలయానికి గర్భ గుడిమాత్రమే ఉంటుంది, ముఖ మండపం లేదు, ఎత్తైన శిఖరం పై బ్రహ్మాండమైన రాతి కప్పు ఉంటుంది, అంత రాయిని పైకి ఎలా చేర్చి పెట్టారో ఆశ్చర్యం,

ఇది తూర్పు ముఖం గా ఉన్న ఆలయం, ఆలయ ముఖ ద్వారంపై ఉన్న శిల్ప విన్నాణానికి ముక్కు మీదవేలు వేసుకొంటాం, ముఖద్వారానికి రెండు వైపులా గంగాదేవితన వాహనం మొసలి పైనా యమునాదేవివాహనం తాబేలుమీడా ఉండి హస్తాలతో కలశాలు పట్టుకొని నిల్చున్నట్లు శిల్పించిన తీరు



పరమాద్భుతం.ముఖ మండపానికి ఇరు వైపులా ఏకాదశ రుద్రులు, దక్షిణద్వారం వద్ద పార్వతీపరమేశ్వరులు జూదం ఆడుతున్నట్లు ఉన్న శిల్పం నయన మనోహరాలే. ప్రధాన

గోపురం నాలుగు వైపులా యోగీశ్వరుల విగ్రహాలు సజీవంగా సాక్షాత్కరిస్తాయి శిల్పుల శిల్ప కళా దృష్టికి కైమోడ్పు ఘటించాలని పిస్తాయి,



ముఖ లింగేశ్వారాలయాన్ని మధుకేశ్వరాలయం అనీ అంటారు, ముఖ లింగేశ్వర లింగం రాతి లింగం కాదని తెలిస్తే మరీ ఆశ్చర్య పోతాం, ఒక" ఇప్ప చెట్టు "మొదలు నరికేయగాకాలక్రమంగా రాపిడికి అదే శ్రీ ముఖలింగాకారం దాల్చి మహా వైభవం గా పూజలందు కొంటోంది సంస్కృతం లో ఇప్ప చెట్టును "మధుకం "అంటారు అందుకే మధుకేశ్వరుడు అనీ అనటం. ఇది "పంచ బ్రహ్మాత్మక లింగ"మని భావిస్తారు, అమ్మవారు వారాహీ దేవి, సప్త మాతృకలలో వారాహీ దేవి ఒకరు, మిగిలిన వారు బ్రాహ్మి, మహేశ్వరి, కౌమారి, వైష్ణవి, ఇంద్రాణి, వీరందరూ పార్వతీ దేవి అవతారాలే, గర్భాలయ శివలింగం కాక ఎనిమిది వైపులా శివలింగాలు ఉండటం కూడా మరో విశేషం వరాహ, వామనావాతార, సూర్య విగ్రహాలూ ఉన్నాయి, ఆలయం లో శివ కుటుంబం అంతా కొలువు తీరి కనిపిస్తారు, సప్త జిహ్వుడైన అగ్ని దేవుడు, కాశీ అన్నపూర్ణ వీణాపాణి సరస్వతి మొదలైన విగ్రహాలను చూసి తీరాల్సిందే ఈ ఆలయం పూరీ, భువనేశ్వరాలయాలను పోలి ఉంటుంది, పదవ శతాబ్దం లో రెండవ కామార్ణవుడు అనే రాజు ముఖలింగేశ్వరాలయాన్ని నిర్మించినట్లు ఆధారాలున్నాయి, ఇతనికొడుకు అనియంక భీమ వజ్ర హస్త మహా రాజు కట్టించాడు, మహా శివ రాత్రి పర్వ దినాన మూడు రోజులు ఘనంగా ఉత్సవాలు చేస్తారు లక్షలాది భక్తులు సందర్శించి తరిస్తారు.



.

## 81 కోటికొక్క లింగం తక్కువగా ఉన్న శ్రీ భీమేశ్వరాలయం శ్రీ ముఖ లింగం




శ్రీ ముఖలింగ గ్రామంలోనే ఉన్న శ్రీ భీమేశ్వరలాయాన్ని 11వ శతాబ్దం లో కలింగ రాజులు నిర్మించారు, వేంగీ చాళుక్యరాజు విమలాదిత్యుడు నిర్మించాడు అనే కధనమూ ఉంది, వీరెవరూ కాదు ద్వాపరయుగం లో పాండవ నాయకుడు భీముడు నిర్మించాడని స్థానిక కధనం, ఆలయం లో కోటికి ఒకటి తక్కువ గా శివ లింగాలు ఉండటం తో దీనికి ప్రసిద్ధి బాగా వచ్చింది,. శిల్పకళతో ఆలయం శోభాయమానం గా ఉంటుంది, ఒకే పీఠంపై "రెండు నందులు "ఉండటం ఇక్కడి మరో ప్రత్యేక ఆకర్షణ,. ఇందులో ఒకదాన్ని తెలుగు శిల్పి రెండవ దాన్ని ఒరిస్సా శిల్పి చేక్కారట, అందుకే మొదటిదాన్ని తెలుగు నంది అని రెండవదాన్ని ఓఢ్రనంది అంటారు. అన్ని రకాల పూజాదికాలు ఉత్సవాలు జరుగుతాయి,

## 82 శ్రీ సోమేశ్వరాలయం శ్రీ ముఖ లింగం



ముఖలింగ క్షేత్రం లో పడమరగా శ్రీ సోమేశ్వరాలయం ఉంది, దీన్ని క్రీ శ 574లో గంగ వంశ రాజు హస్తి వర్మ నిర్మించాడు, 11వ శతాబ్దం లో ఒరిస్సాను జయించిన అనంత వర్మ కట్టించాడనే అభిప్రాయమూ ఉంది, వీళ్ళెవరూ కాదు సాక్షాత్తు చంద్రుడే ఆలయ నిర్మాత అందుకే సోమేశ్వరాలయము యిందని స్థానిక కధనం, తనకొచ్చిన క్షయ వ్యాధిని పోగొట్టుకోవటానికి చంద్రుడు ఇక్కడికొచ్చి శివునికోసం తపస్సు చేసి శివలింగాన్ని ప్రతిష్టించి పూజించాడని వ్యాధి నయమైందని అంటారు

## 83 శ్రీ పాతాళ సిద్దేశ్వరాలయం శ్రీ కూర్మం



శ్రీ కాకుళం జిల్లా శ్రీ కూర్మ క్షేత్రం లో శ్రీ పాతాళ సిద్దేశ్వరాలయం ఉంది, ఒక భక్తుడు శివుని కోసం తపస్సు చేసి, అనుగ్రహం పొంది సిద్ధులు సాధించాడు కనుక సిద్దేశ్వరాలయం అయింది, భక్తుని కోరికపై సీక్రెట్ గా నేమాళిగ లో ప్రతిష్టితమైనాడు, అందుకే పాతాళసిద్దేశ్వరలింగం అనీ ఆలయాన్ని పాతాళ సిద్దేశ్వరాలయం అనీ అంటారు, ఆలయానికి ఎదురుగా రెండు నందీశ్వర విగ్రహాలు ఉండటం మరో ప్రత్యేకత,. ఈ ఆవరణ లోనే మరొక పెద్ద శివ లింగం ఉంది, సిద్దేశ్వర స్వామిని దర్శించి పూజిస్తే సిద్ధులు కలుగుతాయని భక్త జన విశ్వాసం, అన్ని రకాల పూజలు ఉత్సవాలు ఇక్కడ జరుగుతాయి,

## 84 శ్రీ ఉమా హాటకేశ్వర దేవాలయం సింగుపురం



సింగుపురం సిందూరం కొండమీద శ్రీ ఉమా హాటకేశ్వరస్వామి దేవాలయం 11వ శతాబ్దిలో నిర్మించబడింది, ఇది గుహాలయం, ప్రక్కనే పవిత్ర జలాశయం ఉన్నది, అన్నికాలాల్లో నీరునిండుగా ఉండటం విశేషం, ఆలయనికో చరిత్ర ఉంది –ఒకానొకప్పుడు నారాయణప్ప అనేబ్రాహ్మణ శివ భక్తుడు శివుడికోసం తపస్సు చేస్తే ప్రత్యక్షమైతే "స్వర్ణ యోగం "ను బోధించమంటే బోధించాడు శివుడు, బంగారం తయారు చేసే విద్య నేర్చిన నారాయనప్ప బాగా సంపాదించి ఆలయాన్ని పునరుద్ధ రించి శివలింగ ప్రతిష్ట చేశాడు, బంగారానికి "హాటకం "అనేపేరు సంస్కృతం లో ఉంది. హాటక వరాన్నిచ్చాడు కనుక ఈ శివుడిని హాటకేశ్వరుడు అంటారు, అమ్మవారు ఉమాదేవిని కూడా హాటక ఉమాదేవి అంటారు, నారాయణప్ప వంశీకులే అప్పటినుంచి పూజారులుగా ఉన్నారు

ఆలయానికి ఉత్తరాన వంశ ధారా నది, దక్షిణాన నాగావళీ నదులున్నాయి, ఆలయానికి 60ఎకరాల భూమి ఉంది, కరజాడ అనే గ్రామానికి చెందిన కొండమ్మ అనే వైశ్యబాలిక ఇక్కడి ఉమాదేవి అనుగ్రహం తో జన్మించి, పెళ్లి సమయం లో జ్యోతిగా మారి ఉమా దేవి అమ్మవారిలో ఐక్యమిందని ఇతిహ్యం ఉంది, కనుక స్వామిని ఉమాకొండమ్మ హాటకేశ్వర స్వామి అనీ అంటారు, కొండమ్మ త్రిశూలస్వామి అన్నపూర్ణ (వృద్ధి కొండమ్మ )మొదలైనవారు వెలిసి పూజలు అందుకొంటున్నారు,. చైత్రమాసం లో 9రోజులు, కళ్యాణోత్సవాలు జరుగుతాయి, శుక్రవారం వంశధార నదీజలం తోచక్రస్నానం నిర్వహిస్తారు



## 85 గౌరీ మణినాగేశ్వరాలయం కల్లేపల్లి



నాగావళి నది బంగాళా ఖాతం లో కలిసే సంగమ స్థానం లో శ్రీ గౌరీ మణి నాగేశ్వరాలయం ఉంది, ఈ శివలింగాన్ని ద్వాపర యుగం లో శ్రీ కృష్ణుని అన్న బలరాముడు ప్రతిష్టించాడు, కురుక్షేత్ర యుద్ధం లో జరగ బోయే రక్తపాతాన్ని చూడలేక బలరాముడు తీర్థయాత్రలకు బయల్దేరి తిరుగుతూ ఇక్కడికి వచ్చాడు, ఇక్కడ జనానికి తాగటానికి నీళ్ళు లేవని తెలిసి ప్రక్కనే ఉన్న ఒరిస్సా రాష్ట్రం లోని కలహందిలో పరమేశ్వర కటాక్షం కోసం తపస్సు చేశాడు, శివుడి అనుగ్రహం లభించి బలరాముడు తన ఆయుధమైన నాగలితో భూమిని త్రవ్వాడు,

పుష్కలంగా భూగర్భ జలం ఉబికి పైకొచ్చింది, అదే నది గా మారి నాగావళి అయింది, మరోపేరు "లాంగుల్యా "..ఈ నాగావళి ఒడ్డున ఒకే రోజు జ్యేష్టబహుళ ఏకాదశి నాడుబలరాముడు పాయక పాడు, గుంప ,సంగం,శ్రీకాకుళం, కల్లేపల్లి అనే అయిదు చోట్లా శివలింగాలను ప్రతిష్టించాడు,. ఈపంచ క్షేత్రాలలో ఉండి స్వాములను అర్చించి అభిషేకించాడు, ఈ అయిదు క్షేత్రాలను ఒకే రోజు న సందర్శించిన వారికి పునర్జన్మ ఉండదని నమ్మకం, జ్యేష్ట బహుళ ఏకాదశినాడు శివపార్వతీ కల్యాణం చేస్తారు, బలరాముని చేత పునీతమైన క్షేత్రం లో మనం ఉన్నామన్న భావన గొప్ప అనుభూతినిస్తుంది,



జార్ఖండ్

## 86 ప్రపంచం లోనే ఎత్తైన శివలింగం శ్రీ హరిహర ధాం



జార్ఖండ్ రాష్ట్రం లో గిరిద్ లో ప్రపంచం లోనే అతి పెద్ద శివలింగం ఉన్న క్షేత్రం హరిహర్ ధాం.గ్రాండ్ ట్రంక్ రోడ్ కు మూడు కిలో మీటర్ల దూరం లో గిరిధి జిల్లాకేంద్రానికి 60కిలోమీటర్ల దూరం లో ఉత్తర చోటా నాగ పూర్ డివిజన్ లో ఉన్నది, ఒకప్పుడు ఇది బీహార్ లోని హజారీబాగ్ జిల్లాలో ఉండేది,

ఈ హరిహర క్షేత్రం లో ఉన్న శివలింగం ఎత్తు65అడుగులు, ప్రపంచం లోనే అతి

ఎత్తైన శివలింగంగా పేరు పొందింది, 25ఎకరాల విస్తీర్ణం లో నదీతీరాన విస్తరించిన ఆలయం ఇది, ఈ బృహత్తర శివలింగ నిర్మాణానికి 30ఏళ్ళు పట్టింది, ఇది గొప్ప యాత్రాస్థలమై ప్రపంచ దేశ ప్రజలను ఆకర్షిస్తోంది, శ్రావణ పౌర్ణమి నాడు లక్షలాది భక్తులు సదర్శించి పుణ్యం మూట కట్టుకొంటారు, అయిదవనాడు నాగ పంచామినీ అత్యంత వైభవంగా నిర్వహిస్తారు, అతి పవిత్ర ప్రదేశం కనుక హిందువులుతమ పిల్లల వివాహాలు ఇక్కడే చేసి తరిస్తారు,



ఈ శివాలయం క్రింద శ్రీ ఆంజనేయ స్వామి దేవాలయమూ దర్శించ దగినది గా ఉంది, అందరం ఈ హరిహర ధాంను సందర్శించి తరించాలి,

గోవా

## 83 12 వశతాబ్ది పురాతన శివాలయం గోవా



మహాదేవ శివాలయం అని పిలువబడే 12 వ శతాబ్దికి చెందిన ప్రాచీన దేవాలయం గోవా లో "తాంబ్డి సుర్లా లో ఉంది.యాదవరాజు రామచంద్రుని మంత్రి హేమాద్రి నిర్మించిన ఆలయం ఇది, ఆలయం జైన శైలీ నిర్మాణంగా ఉండటం తో అనుమానం వస్తుంది, కానీ ఈ ప్రాంతాన్ని 10 వ శతాబ్దం నుంచి 14 వ శతాబ్దం వరకు కాదంబ రాజుల పాలన లో ఉండటం వలన అనుమానానికి ఆస్కారం లేదు, "హేమాద్ పంథీ "శైలి లో ఆలయం కట్టబడింది, హేమాద్రి పంత్ ఎవరోకాదు –షిర్డీ సాయిబాబా చరిత్ర అంటే గురు చరిత్ర రాసిన హేమాద్రి పంతే, బసాల్ట్ శిలలను దక్కన్ పీఠ భూమి గుండా ఇక్కడికి మోసుకొచ్చి శిల్పులచేత చెక్కించి ఆలయం నిర్మించారు, బసాల్ట్ శిలతో కాదంబ –యాదవ శిల్ప నిర్మాణ శైలికి ఈ దేవాలయం ఒక్కటే ఆనవాలుగా చరిత్రలో మిగిలి

పోయింది, అనేక శతాబ్దాల దండ యాత్రలు, గోవా ప్రభుత్వ విచారణలకు చెక్కు చెదరకుండా నిలిచిపోయిన ఆలయం ఇది, ఇన్ని అవాంతరాలను తట్టుకొని నిలబడటానికి మరో ముఖ్య కారణం ఈ



ఆలయం సుదూరంగా కాకులు దూరని కారడవిలో కీకారరణ్య మధ్యమంలో పశ్చిమకనుమల పాద భాగాన ఉండటం,

ఈ తాంబ్డి సుర్లా మహాదేవాలయం సమీపం లోని కర్ణాటకలో ఉన్న "ఐహోల్ "దేవాలయాలను పోలి ఉండటం ఒక విశేషం, గర్భాలయం లో మహాదేవ శివలింగం ఉన్నది, అతి పురాతన కాలానికి చెందిన ఒక "నాగు బాము" చీకటిగా ఉండే గర్భ గుడిలో శాశ్వత ఆవాసం ఏర్పరచుకొని ఉన్నదని భక్తుల విశ్వాసం, గర్భాలయం తోపాటు అంతరాలయం, నాలుగు బసాల్ట్ శిలాస్తంభాలతో నిర్మించబడిన నంది మండపం కూడా ఉన్నాయి, ఈ స్తంభాలపై అందమైన ఏనుగుల శిల్పాలు, పైకప్పు పై పద్మ శోభ కను విందు చేస్తాయి, ఆలయ గోడలపై శివ విష్ణు బ్రహ్మ మూర్తులు దేవేరులతో కొలువై ఉంటారు, స్తంభాల మండపం పైకప్పు, మామూలు బూడిద రంగు ఏటవాలు స్లాబ్ లతో ఉండటం అసాధారణం అనిపిస్తుంది, ఆలయం తూర్పు ముఖంగా ఉండటం తో ఉదయ రవికిరణాలు మహాదేవ శివలింగం పై పడి కిరణాభిషేకం చేస్తున్నట్లు అనిపిస్తుంది, ఇంకో చిన్న మండపం ఉందికాని పై కప్పు శిధిలమై కూలి పోయింది,

ఆలయం మధ్యలో శివుని వాహనమైన నందీశ్వర విగ్రహం ఉంది.కాని శిరస్సు మాత్రం లేదు, కాదంబ రాజ చిహ్నం అయిన "గుర్రాన్ని తొక్కి ఉంచే ఏనుగు "ఒక స్తంభం అడుగుభాగాన ఉండటం మరొక విశేషం, ఆలయానికి అతి సమీపం లో సుర్లానది స్నానానికి అనువైన రేవులతో ఉంటుంది,

శివరాత్రినాడు అంగరంగ వైభోగం గా స్థానికులు, ఇతర ప్రదేశాలనుంచి వచ్చిన యాత్రీకులు ఉత్సవాన్ని నిర్వహిస్తారు, ఆలయం చిన్నదవటం, సాధారణ యాత్రికులకు అందుబాటులో లేకుండా కీకారణ్యం లో



ఉండటం వలన సాధారణ రోజులలో రద్దీ ఎక్కువగా ఉండదు, ఈ ఆలయం గోవా రాజధాని" పనాజీ" కి 65 కిలోమీటర్ల దూరం లో ఉన్నది, గోవా ను కర్నాటక రాష్ట్రం తో అనుసంధానం చేసే అన్మోద్ ఘాట్ పాద పీఠ భాగాన ఈ మహాదేవ శివాలయం ఉంది.

## 84 ప్రాచీన శ్రీ శాంత దుర్గ దేవాలయం గోవా



గోవాలో శివ విష్ణు దేవులను సమానం గా ఆరాధించే ప్రాచీన శాంత దుర్గ దేవాలయం ఉంది.దీనిని 1713 -1738 కాలం లో మంత్రి గా ఉన్న నరోరం రేగీ మంత్రి నిర్మించాడు, అంటే 451 ఏళ్ళ ప్రాచీన దేవాలయం అన్నమాట, మార్గశిర సుద్ధ పంచమినాడు నిర్మించినట్లు శాసనసాక్షం ఉంది, అమ్మవారు శాంత దుర్గ, భక్తులు ''శాంతేరీ" అని ఆప్యాయంగా పిలుచు కొంటారు, పురాణ కథనం ప్రకారం ఒకప్పుడు శివ విష్ణు లమధ్య భీకర యుద్ధం చాలా ఏళ్ళు జరిగింది, ఇద్దరిలో ఎవరూ వెనక్కి తగ్గటం లేదు, దేవతలు ఎలాగైనా శివ కేశవుల మధ్య పోరాటం ఆపించాలని ప్రయత్నాలు చాలా సార్లు చేసి చివరికి బ్రహ్మ దేవుడిని వెంట బెట్టుకొని పార్వతీ దేవిని దర్శించి ఎలాగోలా మధ్యవర్తిత్వం నెరపి ఆ భయంకర యుద్ధాన్ని ఆపే ప్రయత్నం చేయమని అర్ధించారు, పార్వతీదేవి అంగీకరించి శాంత దుర్గ అవతారం దాల్చి శివ కేశవులను అంటే విష్ణుమూర్తి తనకు కుడివైపున, శివుడిని తనకు ఎడమ వైపున ఉండేట్లు ఏర్పాటు చేసి వారి మధ్య సయోధ్యత సాధించి యుద్ధాన్ని సమాప్తి చేయించింది, అమ్మవారు శాంత దుర్గా దేవి రెండు చేతులలో రెండు సర్పాలు ధరించి ఉంటుంది, ఇవే శివ విష్ణువులకు ప్రతి రూపాలన్నమాట,



స్థానిక కధనం, విశ్వాసం ప్రకారం కాలోషి కి చెందిన శాంత దుర్గ అనే అమ్మాయి సాల్సేట్టీ తాలూకాలోని సంఖ్వాల్ అనే గ్రామానికి అక్కడున్న మునులను యోగులను హింసిస్తున్న కాలాంతకుడు అనే రాక్షసుడిని సంహరించటానికి వెళ్ళి వాడిని చంపి దుస్ట శిక్షణ, శిష్ట రక్షణ చేసి విజయ దుర్గ అయింది, సంఖ్వాల్ లో ఈ విజయ దుర్గ దేవత ను ప్రతిష్టించి శాంత దుర్గ, లక్ష్మీ నారాయణ విగ్రహాలను తో పాటు ఆలయం నిర్మించారు, తర్వాత పోర్చుగీస్ దండ యాత్రలో వీటిని పోండా తాలూకా కేరిం గ్రామానికి తరలించారు,

1566 లో పోర్చుగీస్ దండయాత్రలో సాల్సేట్టీ లోని కేలోషీ లేక క్వేలోసిం లో ఉన్న అసలైన దేవాలయం విధ్వంసమైంది, అమ్మవారిని కావలం అనే గ్రామానికి తరలించి అక్కడ నిత్య పూజాదికాలు కొనసాగించారు, కేలోషీలో ఉన్న అసలైన శాంత దుర్గ దేవాలయాన్ని "దేఖోల్ భాత"దేవాలయం అని పిలిచేవారు, ఇది శాంత దుర్గ సంస్థాన్ కమిటీ ఆధ్వర్యం లో నిర్వహింపబడింది,




కాని ఇప్పుడున్న శాంత దుర్గ దేవాలయాన్ని మహారాష్ట్ర సతారా పాలకుడు ఛత్రపతి సాహూ మహారాజు 1738లో నిర్మించాడు, 1723 లో సాహూ మహారాజు మంత్రి కొంకన్ లోని వెంగుర్ల తాలూకా కాచార గ్రామానికి చెందిన నరోర రేగీమంత్రి రాజు ను అర్ధించి ఈ ఆలయనిర్మాణానికి కావలసిన నిధులను మంజూరు చేయించి నూతన ఆలయాన్ని నిర్మించాడు, 1730 లో ఆలయ నిర్మాణం ప్రారంభమైంది, రేగీ మంత్రి చొరవ తో కావెలం గ్రామం ఆలయానికి స్వాధీనం చేశాడు రాజు సాహూ,

పర్వత సానువులలో పర్వత పాదాన ప్రకృతి అందాలు విరబోసిన చోట శాంత దుర్గ ఆలయం కాంప్లెక్స్ ఉంది.ప్రధాన ఆలయం, దానికి అనుబంధం గా మూడువైపులా మూడు చిన్న ఆలయాలు ఉంటాయి, గోపురాలు పిరమిడ్ ఆకారంగా ఉంటాయి, స్తంభాలు, నేల కాశ్మీర్ శిల తో నిర్మించబడ్డాయి, ఆలయం బయట విశాలమైన తటాకం, దీపస్తంభం ఉన్నాయి, యాత్రికులకు "అగ్రశాలలు "అనే వసతి

గృహాలున్నాయి, ఆలయం కాలక్రమం లో అనేకమార్పులు చెందింది కాలానికి అనుగుణంగా, సభామండపం, శిఖరాలు, రోమన్ ఆర్చ్ కిటికీలు, గ్లాస్ విండోలు కూడా ఏర్పాటు చేశారు,



శాంత దుర్గ ఆలయ దర్శనం లో "ట్రిపుల్ బెనిఫిట్" ఉంది.శాంత దుర్గా దేవి దర్శనంతో తోపాటు ఆమె హస్తాలలో సర్పరూపాలుగా ఉన్న శివ కేశవ దర్శనమూ లభించి కార్తీక యాత్ర సఫలమౌతుంది, ఈ దేవాలయం పనాజీ కి 33 కిలోమీటర్ల దూరం లో ఉంది,

## 85 శ్రీ దుర్గా శివ మందిరం వాస్కోడగామా

గోవా లో వాస్కోడగామా లో శ్రీ దుర్గా శివ మందిరం యాత్రికులను భక్తులను విశేషంగా ఆకర్షిస్తుంది, దుర్గామాత గురించి ఒక వింత కథ ప్రచారం లో ఉంది.ఒరిస్సా నుంచి ఒకతను తన తమ్ముడిని వెతుక్కుంటూ వాస్కో కు వచ్చాడట, అతని కలలో దుర్గామాత కనిపించి తనకొక మందిరం కట్టమని ఆదేశించిందట, అతడు అమ్మవారి ఆదేశాన్ని శిరసా వహించి దుర్గామాత మందిరం కట్టించాడట, తప్పిపోయిన తమ్ముడు కనిపించాడట.అప్పటి నుంచి గోవాలో వాస్కోడగామాలో ఉన్న ఈ దుర్గామాత మందిర పూజారులు ఒరిస్సా వారేనట, ఆలయం తెలుపు రంగులో ఉన్నా శిఖరం మాత్రం గులాబి రంగులో ఉండటం ప్రత్యేకత,



పోర్చుగీస్ యాత్రిక పరిశోధకుడు వాస్కోడ గామా పేరు మీద నిర్మింపబడిన ఓడ రేవు పట్టణం వాస్కోడ గామ, స్థానికులు సింపుల్ గా వాస్కో అని పిలుస్తారు, జువారి నదికి మార్మగోవా హార్బర్ కు అతి సమీపాన ఉన్నది, ఈ తీర ప్రాంత ఓడరేవు 1543లో కట్టబడి లో పోర్చుగీస్ పాలనలోకి వచ్చింది, ప్రపంచ వ్యాప్త ఎగుమతి దిగుమతులకు ఈ రేవు పట్టణం ప్రసిద్ధి చెందింది, 1685 లో ఇక్కడి కోటకు ప్రాదాన్యమేర్పడింది, మరాఠా రాజు శంభాజీ పాత గోవా పై దాడి చేయగా ప్రజలందర్నిని ఈ కోటలోకి

తరలించి భద్రత కల్పించారు, తర్వాత పోర్చుగీసు కాలనీ వారు మార్మగోవా ను రాజధాని చేసినతర్వాత ఈ కోట ను వదిలేశారు, అరేబియా సముద్రపు ఒడ్డున నిర్మింపబడిన ఈ కోట ప్రకృతి అందాలను ఆర బోస్తుంది, ప్రక్కనున్న కొండపై నిరంతరం జాలువారే జలపాతం కనువిందు చేసి యాత్రాస్థలమైంది, సదా వద్ద జవారీ నది సముద్రం లో కలిసే చోటు పరమ రామణీయకంగా ఉంటుంది,

## 86 సప్త కోటేశ్వర దేవాలయం నార్వే (గోవా )



12 వశతాబ్ది కాదంబ వంశ రాజులు నిర్మించిన సప్త కోటేశ్వరాలయం ప్రాచీనాలయాలలో ప్రసిద్ధమైనది, కాదంబరాజుమహా శివ భక్తురాలైన తన భార్య కమలాదేవికోసం కట్టించిన ఆలయం ఇది, కాదంబ రాజులు "శ్రీ సప్త కోటీశ లబ్ధ వర వీరులు "అనే బిరుదు పొందారు, ఈ బిరుదు నామం ఉన్న నాణాలు చందోర్, గోపికాపట్నం త్రవ్వకాలలో దొరికాయి, 1352లో బహమనీ సుల్తాన్ అల్లాఉద్దీన్ హసన్ గంగు కాదంబ రాజులను యుద్ధం లో ఓడించిన తర్వాత ఈ ప్రాంతం సుల్తానుల పాలనలోకి వెళ్ళి,14 ఏళ్ళు ఉన్నది, సుల్తాన్ కిరాయి సైన్యం సప్తకోటేశ్వర విగ్రహం తో అనేక దేవాలయాను ధ్వంసం చేశాయి, 1367 లో విజయనగర రాజు హరిహర రాయలు బహమనీ సుల్తాన్ ను ఓడించి గోవాను స్వాధీనం చేసుకొని మళ్ళీసప్త కోటేశ్వర దేవాలయం తో సహా దేవాలయాలను నిర్మించి పునర్వైభవం తెచ్చాడు, శాసనాధారం ప్రకారం ఈ ఆలయాన్ని మాధవ మంత్రి 14 వ శతాబ్దం లో పునర్నిర్మించాడు, మళ్ళీ 1560 లో పోర్చుగీసు దండయాత్రలోఆలయాన్ని కూల్చి చర్చ్ కట్టారు, శివలింగాన్ని అమ్ముతుండగా కొందరు హిందువులు స్వాధీన పరచుకొని నదిద్వారా బికోలిం కు తరలించారు, 16 68 లో చత్రపతిశివాజీ మహారాజ్ ఆదేశంతో సంస్థాన్ అధ్యక్షుడు శివరాం దేశాయ్ ఆధ్వర్యం లో లో నూతన దేవాలయ నిర్మాణం జరిగి ఆ విగ్రహాన్ని ఇక్కడ ప్రతిష్టించారు,

ఆలయం మొఘుల్, యురోపియన్ శైలి లో నిర్మింపబడింది, విశాలమైన హాలు దీపస్తంభం తో ముచ్చటగా ఉంటుంది, ఆలయం చుట్టుప్రక్కల శిలా గుహలు చాలా ఉన్నాయి, ఇక్కడి శిధిల జైన మఠంచూస్తే కాదంబరాజులు హిందూమతం లో చేరి సప్త కోటేశ్వర స్వామి భక్తులు కాకముునుపు



జైనమతావలంబులు అని అర్థమవుతుంది, ప్రధాన ఆలయం ముందు దీపస్తంభానికి కుడివైపు కాలభైరవ విగ్రహం, దత్తాత్రేయశిలా పాదుకలు దర్శన మిస్తాయి, దీపస్తంభానికి ముందు భూమిలో దిగబడిన రెండు పెద్ద ఎర్రరాతి స్తంభాలు కనిపిస్తాయి, ఆలయం వెనుకఉన్న రాతి గృహ నిర్మాణాలు "అగ్రశాలలు "అంటే యాత్రిక వసతి గృహాలు, ఆలయం ప్రక్కన మానవ నిర్మిత సొరంగం ఉంది.ఆలయ సమీపం లో పంచగంగ తీర్థం అనే కొలను ఉన్నది, ఇది భక్తుల స్నానానికి శివుని అభిషేక జలానికి ఉపయోగ పడుతుంది, సప్త కోటేశ్వర స్వామి కొలువైఉన్న నార్వే గ్రామం పనాజి కి 35 కిలోమీటర్ల దూరం లో ఉంది.

కర్నాటక

## 87 సుప్రసిద్ధ దత్తాత్రేయ క్షేత్రం గాణగాపురం సందర్శనం-

**యాత్రకు నేపథ్యం**



రెండు మూడేళ్ళ నుంచి హైదరాబాద్ కు 260 కిలీ మీటర్లలో కర్నాటక లో ఉన్న సుప్రసిద్ధ దత్త క్షేత్రం" గాణగాపురం "సందర్శించాలని కోరికగా ఉంది.మ పెద్దబ్బాయి శాస్త్రి వాడికి అప్పుడు దత్తభక్తుడైన శ్రీ సుదర్శన్ గారితో అయిదు సార్లు వెళ్లి దర్శించిన క్షేత్రం, కానీ ఎదోకారణం చేత బడి పనులవలన సెలవులు లేక మా కోడలు శ్రీమతి సమతకు మా వాడితో వెళ్లి చూసే అవకాశం

కలగలేదు, ఈ సారి మేము అమెరికా నుంచి వచ్చిన దగ్గర్నుంచీ వెళ్దామని అంటూ ఉంది, ఇప్పుడు అవకాశం వచ్చింది,



ఈ నెల 4 వ తేదీ శుక్రవారం కార్తీక పౌర్ణమి అవటం తో నేను ఇక్కడ మా వాళ్ళ ఇంట్లో ఉదయం మహన్యాస పూర్వక అభిషేకం చేయటం, మర్నాడు శనివారం ఉదయం 11 గంటలవరకు పౌర్ణమి ఉండటం, మా కోడలు స్కూల్ కు ఉదయం 8 గంటలకే వెళ్ళాల్సి ఉండటం తో తెల్లవారుఝామున 2-30 కే లేచి స్నాన సంధ్యాదుల అనంతరం 3-30 నుండి మహన్యాస పూర్వక రుద్రాభిషేకం దశ శాంతులు సామ్రాజ్య పట్టాభిషేకం, సహస్రనామ పూజ, బిల్వాష్టోత్తర పూజ, ఉదయం 6 గంటల వరకు చేశాను, తర్వాత మా అబ్బాయి శాస్త్రి, కోడలు సమతలు లతో 6 నుండి 8 వరకు శ్రీ రమా సహిత సత్యనారాయణ వ్రతం శాస్త్రోక్తంగా నవగ్రహాలకు అష్టోత్తర పూజ స్వామికి పురుష సూక్తం తో పంచామృతాభిషేకం, సత్యనారాయణ, అష్టోత్తర, లక్ష్మీ, తులసీ అష్టోత్తర, విష్ణు సహస్రనామ పూజ అభిషేకం, పంచ కథావిధానం తో చేయించి తర్వాత శ్రీ వేంకటేశ్వరదీపారాధన అష్టోత్తర పూజ "జెట్ స్పీడ్ "తో చేయించి అన్న మాట నిలబెట్టుకొని కోడలు స్కూల్ కు సకాలం లో వెళ్ళేట్లు చేశాం, మా శ్రీమతి ప్రసాదం, పాయసం, పులిహోర, అప్పాలు తయారు చేయగా నైవేద్యం కూడా పూర్తయింది, 10- 30కు కేటరింగ్ ఆవిడ భోజనాలు తెచ్చింది, తిన్నాం,

శనివారం స్కూల్ కు వెళ్ళక పోతే మూడు రోజులు జీతం కోత అవుతుందనే ఈ హడావిడి, ఒక వేళ ఆదివారం గాణగాపురం వెడితే సోమవారం బడికి వెళ్ళక పోయినా ఫర్వాలేదన్న ధీమా, ఇది మా గాణగాపుర క్షేత్ర సందర్శ నేపధ్యం,

అందుకని 5 వతేదీ ఆదివారం తెల్లవారు ఝామున 2-30 కే నేను లేచి స్నాదికాలు పూజ అభిషేకాదులు 4 గంటలకే పూర్తి చేసి రెడీ అయ్యాను, కార్ డ్రైవర్ 3-30 కే వచ్చేశాడు, మా శ్రీమతి, కోడలు, వాళ్ళమ్మగారు నలుగురం కారులో 4-15 కు గాణగాపురం బయల్దేరాం, అప్పటికే రెండు "దోసులు"కాఫీ పుచ్చుకున్నాం ", అన్నం కూర వండి, రెండు పచ్చళ్ళు, పెరుగు రెడీ చేసి వెంట తీసుకు వెళ్లాం, క్షేత్ర సందర్శనం చేసి ఇంటికి తిరిగి వచ్చేసరికి రాత్రి 10-15 అయింది, అంటే 18 గంటలలో తిరిగి వచ్చాం, అందులో 14 గంటలు కారుకే అంకితం, బయట దర్శనాలు, పూజా , భోజన

విశ్రాంతి 4 గంటలు, ఒళ్ళు పులిసిపోయింది, అమెరికా నుంచి వచ్చిన నెల లోపే ఇంత దూర ప్రయాణ యాత్ర 520 కిలో మీటర్లు చేయటం, అందునా పవిత్ర కార్తీక మాసం లో పౌర్ణమి పాడ్యమి లమధ్య చేయటం మరొక విశేషం,



మా అబ్బాయి ఆఫీస్ బాస్ శ్రీ కోదండ రాం గారు తన స్వంత కారును సర్వీస్ చేయించి, ఆయిల్ నింపించి, మా యాత్రకు అందజేస్తే, మా వాళ్ళ అపార్ట్ మెంట్ ఇంచార్జి శ్రీ రాజేంద్ర రెడ్డిగారు తమ ఆఫీస్ డ్రైవర్ ను కుదిర్చి రెడీ చేశారు, వీరిద్దరి సౌహార్దం వలన మా యాత్ర సఫలమైంది, వీరికి మా ధన్యవాదాలు, డ్రైవర్ ప్రకాష్ నెమ్మదైనవాడే. కాని కారు నడపటం లో "కత్తి." కారుకూ, మాకు ఏ ఇబ్బంది లేకుండా తీసుకు వెళ్లి, తీసుకు వచ్చాడు, మాట దక్కించాడు, కనుక అతడూ అభినందనీయుడే,

ఈరోజు పవిత్ర కార్తీక సోమవారం, ఉదయం 8 గంటలనుంచి 10-30 వరకు పూజ, మహాన్యాసపూర్వక దశశాంతి సామ్రాజ్య పట్టాభిషేక బిల్వఅష్టోత్తర, శివ అష్టోత్తర, సహస్ర నామ పూజ తో అభిషేకం పూర్తి చేశాను, తర్వాత టిఫిన్ చేసి నిన్నటి యాత్ర ఫోటోలు మీ అందరికి పంపించి ఊపిరి పీల్చుకొని, భోజనం చేసి కాసేపు విశ్రాంతి తీసుకొని మళ్ళీ మధ్యాహ్నం 3-30 కు "లాప్ టాప్ ఎక్కి" యాత్రా విశేషాలు రాయటం మొదలు పెట్టాను, ప్రయాణ విశేషాలు

హైదరాబాద్ నుండి - బొంబాయి జాతీయ రహదారి లో బిహెచ్ యిఎల్, పటాన్ చేరు, సంగారెడ్డి, జహీరా బాద్ మీదుగా 150 కిలో మీటర్ల దూరం లో ఉన్న కర్ణాటకలోని హుమ్నాబాద్ చేరి, మాణిక్ ప్రభుపురం వద్ద రోడ్డు దిగి, అక్కడినుంచి 60 కిలోమీటర్ల దూరం లో ఉన్న" కలబురిగి "అంటే గుల్బర్గా చేరి అక్కడ కామత్ హోటల్ లో ఇడ్లీ తిని, కాఫీ త్రాగాం, పత్యం వాడికి పెట్టి ఇడ్లీ లాగా , చట్నీ, సాంబారు కూడా ఉప్పు కారం లేకుండా రుచి హీనంగా ఉన్నాయి, కామత్ గురించి మాటలు "మత్ బోలో "అనిపించాయి, రేట్లు మాత్రం సూపర్, ఒళ్ళు వాచిపోయింది బిల్లుచూసి, గుల్బర్గా కు 8-00 కు చేరాం, అంటే సుమారు 4 గంటలు పట్టిందన్న మాట,

### శ్రీ దత్త దర్శనం

మళ్ళీ 8-30 కు బయల్దేరి 40 కిలోమీటర్లలో ఉన్న దత్త క్షేత్రం గాణగాపురం ఉదయం 9-45 కు చేరాం, కారు పార్క్ చేసిన చోట ఒక బ్రాహ్మణ కుర్రాడు వెంటబడ్డాడు, ఇవాళ బాగా రష్ గా ఉందని దేవాలయ దర్శనం కావటానికి చాలాసేపు పడుతుందని 11-30 గుడి మూసేస్తారని, కావాలంటే తనకు తెలిసిన శాస్త్రీజీ కి అప్పగిస్తానని ఆయన నిమిషాల మీద దర్శనం, కావాలంటే

అభిషేకం, భిక్షా వగైరా లు ఏర్పాటు చేస్తాడని తనకేమీ ఇవ్వక్కర్లేదని అన్నాడు, మాతో నడుస్తూ ఆలయం దాకా వచ్చాడు, అతను చెప్పినట్లు నిజంగానే ఆలయం భక్తులతో క్రిక్కిరిసి పోయింది, అక్కడ స్పెషల్ దర్శనం అంటూ వేరే టికెట్లు లేవట, అంతా" పాండా" లైన శాస్త్రీజీల "హవాయే" అని అర్ధమైంది, మాతో వచ్చిన కుర్రాడు ఒక శాస్త్రి గారికి మమ్మల్ని అప్పగించాడు, ఆయన బేరం మొదలు పెట్టాడు,



దర్శనానికి 11 వందలు, అభిషేకానికి 11 వందలు, భిక్ష కు 11 వందల రూపాయలు అవుతుందని చెప్పాడు, కాసేపు ఆయనతో వాదప్రతివాదాలు చేసి చివరికి మా నలుగురికి దత్త దర్శనం, పాదుకా దర్శనం కిటికీ రంధ్రాలలో నుంచి దర్శనం చేయించటానికి 11 00 రూపాయలకు" బేరం సెటిల్"చేసింది మా కోడలు, "వడ్డించే వాడు మనవాడైతే కడపంక్తిలో కూచున్నా ఇబ్బంది లేదు"అన్న సామెత రుజువై, మమ్మల్ని"దగ్గరి దొంగ ద్వారం" ద్వారా లోపలి నెట్టించి, శాస్త్రీజీ మరికొందరు శాల్తీల కోసం వెళ్లి పోయాడు, లోపలి దారి" ఇరుకు బొక్క ". ఒక్క మనిషే పడతాడు, అలాగే రెండే రెండు నిమిషాలలో ఒక కిటికీ రంధ్రం ద్వారా "మూడు బాలశిరస్సులమెడపైభాగం వరకు మాత్రమే ఉన్న "దత్తాత్రేయ స్వామి , ఆయన ముందు పాదుకలు దర్శనం చేసుకొన్నాము, ఇక్కడా ఇరుపతి లో లాగా తోసెయ్యటమే, మళ్ళీ ఇరుకు బొక్క లోనుంచి బయట పడ్డాం, అప్పటికే తెల్లవారుజామున 5 గంటలనుంచి ఆద్వారం వద్దనే నిరీక్షిస్తున్న ఒక పసిపిల్లతల్లి లోపలి పంపటం లేదని నానా శాపనార్ధాలూ పెడుతోంది, అందుకే త్యాగరాజస్వామి "చక్కని రాజ మార్గాముండగా "అన్నారు ఇక్కడ రాజమార్గం అంటే "డబ్బులతో దూరే దొంగమార్గం" అన్నమాట.ఇంత చెల్లించినా తీర్ధం కాని ప్రసాదం కానీఇప్పించలేదు శాస్త్రీజీ, ఇదంతా మనసుకు చికాకు కల్గించింది కానీ , ఇవాల్టి రష్ చూస్తే ఏదో ఆపద్బాంధవుడిలాగా, లేక సాక్షాత్తు దత్తాత్రేయ స్వామి లాగా ఆకుర్రాడు మమ్మల్ని ఫాలో అయి దర్శనం శాస్త్రి జీ ద్వారా చేయించాడేమో అని సరి పుచ్చుకొన్నా, దత్తాత్రేయ స్వామి, పాదుకలు రావి చెట్టు మొదట్లో ఉన్నాయి వృక్షం చాలా పురాతనమైనది ఆలయం వెనక భాగాన కనిపిస్తుంది,

### అభిషేకం, అష్టోత్తర పూజ

ఆలయ ప్రాంగణం లో ఒక ప్రక్క ఎత్తైన చోట ఒక మండపం ఉంది.అందులో శాస్త్రీజీలు అంటే పండాలు తలొక చోటు ఆక్రమించి అక్కడ తమ వద్ద ఉన్న శివలింగానికి అభిషేకం, వెండి దత్త పాదుకలకు పూజ చేయించి డబ్బు పిండుకొంటారు, మరొకాయన సత్యనారాయణ స్వామి వ్రతం చేయిస్తున్నాడు, ఈ సీను చూసి అక్కడే ఉన్న శ్రీ దత్తాత్రేయ స్వామి పాలరాతి విగ్రహం, శివలింగాలకు పూజ, అభిషేకం చేయాలని పించి వెంట తెచ్చుకొన్న నమక చమక పుస్తకం తో అభిషేకం చేసి- (విత్ పాంట్ అండ్ షర్ట్ ) దత్తాత్రేయ స్వామికి అష్టోత్తర పూజ చేసి మా శ్రీమతి అల్లి వెంట తెచ్చిన చామంతి పూల దండలను దత్తాత్రేయ స్వామికి మెడలో లంకరించి, సమర్పించి సంతృప్తి ఆనందం పొందాము, దత్త దర్శనం సార్ధకమయిందని భావించాం, త్రిమూర్తిస్వరూపులైన శ్రీ దత్త దర్శనం లభించటం మా అదృష్టం, "అవధూత గీత " రచించారు శ్రీ దత్తాత్రేయస్వామి,

### భిక్ష



ఇదంతా పూర్తయే సరికి 11 అయింది, ఆలయం బయటికి వచ్చి ప్రక్కనే లడ్డూ భిక్ష వేస్తున్న ఒక పుణ్య స్త్రీ, కుమార్తె లనుండి భిక్ష గ్రహించి ప్రసాదం గా తిన్నాం, ప్రతి రోజు మధ్యాహ్నం 12 గంటలకు శ్రీ దత్తాత్రేయ స్వామి ఏదో ఒక రూపం లో ఇక్కడికి వచ్చి భిక్ష గ్రహిస్తారని అందరి విశ్వాసం నమ్మకం, అందుకనే ఆలయం లో యాత్రికులు కనీసం 5 మందికి భిక్ష వేస్తారు, వారిలో ఎవరిలో నైనా దత్తస్వామి ఉంటారని నమ్మకం, కొందరు చుట్టు ప్రక్కల ఉన్న అయిదు కుటుంబాల వారి వద్ద భిక్ష స్వీకరిస్తారు, ఇదొక సంప్రదాయం. మరికొందరు శాస్త్రీజీ ల ఇళ్ళల్లో భిక్ష ఏర్పాటు చేయిస్తారు, ఇక్కడ అందరూ తెలుగు బాగానే మాట్లాడుతారు, ఇబ్బంది ఉండదు,

మా ఇంట్లో ఇంతవరకు దత్తాత్రేయ స్వామి ఫోటో లేనందున 100 రూపాయలతో ఒక ఫోటో కొన్నాం,

## భీమ అమరజా నదీ సంగమం

స్థానికులు" సంగం " అని పిలువ బడేకృష్ణానది కి ఉపనది భీమ నది, అమరజా నదిలు కలిసేప్రదేశం ఆలయానికి 3 కిలో మీటర్ల దూరం లో ఉంటే వెళ్లి చూశాం, నీరు నిండుగా ఉంది.స్నానాలు చేస్తున్నారు, పౌర్ణమి తర్వాత రోజుకనుక యాత్రికుల రద్దీ బాగా ఉంది. మేము స్నానం చేయలేదు, కాళ్ళు కడుక్కొని నీళ్ళు నెత్తిన చల్లుకొన్నాం,

## శ్రీపాద వల్లభ మహా సంస్థానం లో విశ్రాంతి



సంగం నుంచి కారులో తిరిగి వస్తూ దారిలో "శ్రీపాద వల్లభ మహా సంస్థాన్ "కొత్తగా కట్టి నిర్వహిస్తున్న విశ్రాంతి భవనం లో రెండుగదులు11-30 నుంచి –మధ్యాహ్నం 2-30 వరకు 3 గంటలకు అద్దెకు తీసుకొని దిగాం, అక్కడే మేము వెంట తెచ్చుకొన్న అన్నం కూర పచ్చళ్ళతో కమ్మగా తిన్నాం, కాసేపు విశ్రాంతి తీసుకొన్నాం, ఇక్కడ బయట భారీ శ్రీ ఆంజనేయస్వామి విగ్రహం సీతారామాంజనేయ విగ్రహాలు సరస్వతీదేవి విగ్రహం, రాజఠీవి తో గుర్రం పై ఉన్న శివాజీ మహారాజ్ విగ్రహం వగైరాలు కనుల విందు చేశాయి, వాడిన కలర్స్ కూడా చాలా ఆకర్షణీయంగా ఉన్నాయి,

## పల్లకీలో శ్రీ నృసింహ సరస్వతి మహారాజ్ పాదుకా దర్శనం

ప్రతి సంవత్సరం కార్తీక పౌర్ణమి, దానితర్వాత వచ్చే పాడ్యమి నాడు దత్తాత్రేయ స్వామి మూడవ అవతారం అయిన శ్రీ నృసింహ సరస్వతి మహారాజ్ వారి పాదుకలను పల్లకీలో ఆలయం లోను, బయటా ఊరేగింపు చేసి సంగం దగ్గరకు తీసుకు వెడతారు, మా అదృష్టం పండి ఈ రోజు మధ్యాహ్నం 2 గంటలకు పల్లకీ మేమున్న సత్రం దగ్గరకు వచ్చి రెండు నిమిషాలు ఉండి సంగం కు వెడుతుందని చెప్పారు. సిద్ధంగా ఉన్నాం, సత్రం బయట రోడ్డు మీద నీళ్ళు చల్లి ముగ్గులు వేసి, మా ఉయ్యూరు వీరమ్మతల్లి తిరునాళ్ళకు ఆడవారు బిందెలతో నీరు" వార పోసినట్లు"ఇక్కడ కూడా ఒక తెలుగు

కుటుంబం పాదుకల పల్లకీ రాగానే వార పోసింది, పాదుకా దర్శనం చేసిన భాగ్యం మాకు కలిగింది, ఎంతో అదృష్టం, పుణ్యం చేసుకొంటేనే ఈదర్శన భాగ్యం కలుగుతుందట, గాణగాపురం నుంచి సంగం దాకా వేలాది భక్తులు చెప్పులు లేకుండా నడచి ఆటోలలో కార్లలో సంగం కు పల్లకీ ముందూ వెనకా వెళ్ళటం చూశాం, పండు ముదుసలులు, చిన్నపిల్లలు మానసిక వ్యాధి గ్రస్తులు అంతా మహా భక్తి విశ్వాసాలతో వెంట వెళ్ళటం విశేషం, సంగం వద్ద మేడి(ఔదుంబ వృక్షం ) చెట్టు కిందశ్రీ నృసింహ సరస్వతీ మహారాజ్ తపస్సు, ధ్యానం తో ఉండేవారట, ఇవాళ అక్కడ వారి పాదుకలకు విశేష అర్చన చేస్తారట, ఇది కర్నాటక ప్రాంతం. ఆచారం, భక్తులు మాత్రం మహారాష్ట్ర ప్రాధాన్యత కనిపించి ఆశ్చర్యమేసింది, ఎంత మంది భక్తుల హృదయాలలో దత్తాత్రేయ స్వామి కొలువై ఉండి ప్రేరణ కలిగిస్తున్నాడో చూస్తే పరవశం కలుగు తుంది.

### దత్తాత్రేయ అవతారాలు



దత్తాత్రేయ రెండవ అవతారం అయిన తూర్పు గోదావరి జిల్లా పిఠాపురం లోని శ్రీ పాద వల్లభులు, ఈ క్షేత్రాన్ని శ్రీపాద వల్లభ క్షేత్రం అంటారు వీరికాలం-క్రీ.శ 1320 -1350, వీరితర్వాత దత్తాత్రేయ మూడవ అవతారం క్రీశ 138 o-1459 కాలం వారైనసద్గురు శ్రీ నరసింహ సరస్వతీ మహారాజ్, ఇక్కడే గాణగా పుర పీఠాధిపతులు, చతుర్ధ దత్తావతరులు శ్రీ సద్గురు మాణిక్య ప్రభు మహారాజ్, వీరికాలం 1817 -1865.వీరి తర్వాత అయిదవ దత్తాత్రేయ అవతారం స్వామి సమర్ధ అనే అక్కల్ కోట్ మహారాజ్, వీరికాలం క్రీశ 1856 - 1878, ఆరవ దత్తాత్రేయ అవతారం శ్రీ షిర్డీ సాయి బాబా గా భావిస్తారు,. కాలం 1857-1918,

### తిరుగు ప్రయాణం

రోడ్డు మీద భక్త ప్రవాహం కొంత తగ్గుముఖం పట్టగానే కారులో తిరుగు ప్రయాణం సాగించాం, దారిలో కలబురిగి అనే గుల్బర్గా లో ఉన్న శ్రీ బసవ సంస్థాన మహాదశోహ పీఠాధిపతి,శరణ బసవేశ్వర సంస్థాన్

అధ్యక్షులు పూజ్య డా. షణ్ణ బసవప్ప అప్ప గారి దేవాలయం చూసి అందులోని శివమహాదేవ దివ్య దర్శనం తో తరించాము,

అక్కడి నుండి హుమ్నా బాద్ చేరి చతుర్ద దత్తాత్రేయ అవతారులు సద్గురు శ్రీ మాణిక్య ప్రభు మహారాజ్ జీవైక్యం చెందిన క్షేత్రాన్ని సందర్శించి, మళ్ళీ హైవే మీదుగా150కిలో మీటర్లు ప్రయాణం చేసి రాత్రి 10-15 కు మల్లాపూర్ చేరాం,

గాణగాపురక్షేత్ర విశేషాలు, శరణ బసప్ప దేవాలయ, మాణిక్య ప్రభు ఆలయ విశేషాలు తరువాత వరుసగా రాస్తాను,

## గాణగాపురం క్షేత్రం



కర్నాటక గుల్బర్గా జిల్లా లో గుల్బార్గాకు 40 కిలో మీటర్ల దూరం లో గాణగాపుర దత్తాత్రేయ క్షేత్రం ఉన్నది, గాణగాపురం రైల్ స్టేషన్ కూడా ఉన్నది, అన్ని చోట్లనుండి బస్ సౌకర్యమూ ఉండటం విశేషం, గుల్బర్గా పేరు కర్ణాటకలో బాగా ప్రసిద్ధి, ఇటీవలే కర్నాటక ప్రభుత్వం గుల్బర్గా పేరును కలబురిగి గా మార్చింది, హుమ్నా బాద్ నుండి గుల్బర్గా దాకా రోడ్డుకిరువైపులా నల్లరేగడి నేల చూస్తే ఆనందం కలుగుతుంది. ఇక్కడ చెరకు, కంది విపరీతంగా పండుతాయి, ముఖ్యంగా ఈ జిల్లా కందిపంటకు ప్రసిద్ధి చెందింది, అందుకే గుల్బర్గా జిల్లాకు "కందిపప్పు జిల్లా "అని పేరొచ్చింది, అలాగే రోడ్డుకిరువైపులా" తంగేడు చెట్లు" ఎక్కువ, తంగేడు పూలు పచ్చని పసుపురంగుతో కళ్ళకు విందు చేస్తాయి, అందంగా పచ్చగా ఉన్నఅమ్మాయిని "పూచిన తంగేడు "లా ఉందని మనకవులు వర్ణించారు, ఇప్పుడు ఆంధ్ర దేశం లో తంగేడు కనిపించటం లేదు, ఫోటోలు తీశాం కందిపంటను, తంగేడు పూలను, మా కోడలు క్లాస్ లెసన్ లో తంగేడు పూల ప్రస్తావన ఉందట, అందుకని పిల్లలకు చూపించటానికి పూలు సేకరించి దాచింది,

గాణగా పుర క్షేత్రం భీమా నది తీరాన ఉన్నది, సుమారు 500 కుటుంబాలున్నాయిక్కడ, యాత్రికులకు ఉండటానికి ధర్మ సత్రాలున్నాయి, సాధారణంగా భక్తులు ఒక రోజు రాత్రి ఇక్కడ బసచేసి మర్నాడు ఉదయం సంగమ స్నానం చేసి ఆలయ దర్శనం చేస్తారు, సుమారు 80 ఏళ్ళక్రితం శ్రీ చిదానంద స్వాములవారు ఇక్కడ ఉండేవారు, ఇక్కడే శరీర త్యాగం చేశారు వారి సమాధి ఈ ఊరికి దగ్గరలో ఉన్న "ఇట్ట "గ్రామం లో ఉంది. స్వామి వారి మహాత్మ్యం విశేషం, వారి ప్రేరణలో నది ఒడ్డున

ధర్మ సత్రం కట్టించారు, ఇదికాక వద్దనపల్లి ధర్మ సత్రం, కేశవ గుత్తి సత్రం, చిదంబర సత్రం,తంతుకేశ్వరసత్రం, నరసింహ సరస్వతి గోరె సత్రం, తాపాడియా, వాసుదేవానంద సరస్వతి, శ్రీపాద వల్లభ ధర్మ సత్రాలున్నాయి,

## అర్చక వ్యవస్థ

ఇక్కడ మూడు రకాలైన అధికారాలున్న అర్చక వ్యవస్థ ఉంది.1-ఉపాధ్యాయులు –వీరు యాత్రికులను తమ ఇంటిలో ఉంచుకొని భోజన, పూజ భిక్షాదులు నిర్వహింప జేస్తారు 2-జోయినులు –వీరు యాత్రికులను సంగం కు తీసుకు వెళ్లి స్నానాదులు అవసరమైతే ఉపనయనం పెళ్ళిళ్ళు, పుట్టు వెంట్రుకలు తీయించటం దర్శనం చేయిస్తారు, గుడిలో చేసే కార్యక్రమాల సంభావనలన్నీ వీళ్ళకే చెందుతాయి, 3-సాలకరి పూజారులు –యాత్రికులకుదర్శనం,పల్లకీ, మహా పూజల ఊరేగింపు చేయిస్తారు, సంవత్సరానికి ఒక సారి వంతులు మార్చుకొంటారు,

ఇక్కడ అన్నికార్యాలు అర్చకుల పర్యవేక్షణలోనే జరుగుతాయి, వీరు" భాస్కర బ్రాహ్మణ "వంశానికి చెందినవారు, కొంత మంది భక్తులు స్వామి సేవలో నెలల తరబడి ఉండాలనుకొంటే ఈ అర్చకులే వసతి ఏర్పాటు చేస్తారు,

## శ్రీ దత్త మందిరం

ఒక అందమైన మహాద్వారం ద్వారా శ్రీ దత్త మందిరం లోకి ప్రవేశం చేయాలి, అన్ని దత్త క్షేత్రాలలో గాణగా పుర క్షేత్రం" రాజ దర్బారు"లాగా ఉంటుంది, ఈ క్షేత్రం భూత, పిశాచాదులను తొలగించే విశేష క్షేత్రంగా ప్రసిద్ధి చెందింది, ఆలయం లోనూ, బయటా వీరు ఊగిపోతూ కనిపిస్తారు.శ్రీ నృసింహ సరస్వతీ మహారాజ్ దత్తాత్రేయుల మూడవ అవతారం, వీరి మఠంవలననే ఈ క్షేత్రం విఖ్యాతి చెందింది.మఠం ప్రక్కనే దేవాలయం ఉన్నది, మఠానికితూర్పున మహాదేవ శివ,



దత్తపాదుకలు ఉంటాయి, దక్షిణం లో ఔదుంబర అంటే మేడి చెట్టు, దాని క్రింద గణపతి, శివ పార్వతి



విగ్రహాలు ఉంటాయి, పడమర రావి చెట్టు దాని చుట్టూ నాగనాధ మారుతి, తులసి బృందావనం కనిపిస్తాయి, ఈ రావి చెట్టు మీద బ్రహ్మ రాక్షసి బస చేసి నట్లు గురు చరిత్రలో ఉన్నది, ఉత్తరాన చిన్న హనుమమందిరం వినాయక విగ్రహం ఉంటాయి, మఠానికిపశ్చిమాన ఒక గూడులో ఇసుకతో చేయబడిన శ్రీ విష్ణు హర చింతామణి విగ్రహం తప్పక దర్శించాలి, ఈ విగ్రహాన్ని గాణగాపురం మఠ ప్రవేశం చేయటానికి ముందు శ్రీ నరసింహ సరస్వతీ మహారాజ్ తమ స్వహస్తాలతో 700సంవత్సరాలక్రితంస్థాపించి,తర్వాత మఠప్రవేశం చేశారు, కనుక మూడు వేళలా ఈ మూర్తికి అంటే విష్ణు,హర, గణపతికి కూడా పూజా నైవేద్యాలు చేస్తారు, నరసోబా వాడి నుండి శ్రీ నరసింహ సరస్వతీ మహారాజ్ సంగమ ప్రదేశానికి వచ్చి బస చేశారు తర్వాత రాజు ప్రార్ధన మన్నించి ఊరిలోకి వచ్చారు, అప్పుడు ఆ ప్రాంతమంతా భూత ప్రేత పిశాచాలకు ఆవాస భూమి గా ఉండేది, నరసింహ సరస్వతీ మహారాజ్ గారు ఇక్కడికి చేరుకోగానే అవన్నీ మాయమై పోయాయి, ఇక్కడే మఠంఏర్పాటు చేసుకొని 23 సంవత్సరాలున్నారు, అందుకే పిశాచాలకు ఈ క్షేత్రం అంటే హడల్, పిశాచ బాధితులు మానసిక రోగులు ఇక్కడ నిద్రించి బాధా విముక్తి పొందుతారు,




## దత్తాత్రేయ దర్శనం

గర్భ గుడి ప్రవేశానికి చిన్న దారి ఉన్నది, గర్భగుడి లో అర్చకుడు తప్ప వేరెవరికీ ప్రవేశార్హత లేదు, అక్కడున్న గవాక్షం అంటే కిటికీ లోనుంచే లోపలి శ్రీ దత్తాత్రేయ మూర్తి ని, నరసింహ సరస్వతీ మహారాజ్ స్వహస్తాలతో పెట్టిన పాదుకలను దర్శించాలి, ఈ పాదుకలను "నిర్గుణ పాదుకలు "అంటారు వీటివలననే ఈ క్షేత్రానికి

ప్రాముఖ్యత కలిగింది, ఈ పాదుకలు మొదట్లో ఏ రూపం లో ఉన్నాయో ఎవరికీ తెలియదు, ఎందరో మహాపురుషులు ఈ పాదుకా దర్శనం చేత పునీతు లయ్యారు, ఈ పాదుకలకు నీటితో అభిషేకం ఉండదు, కుంకుమ పువ్వు కస్తూరి, అష్ట గంధాలు,అత్తరు లతో లేపనం అంటే పూత పూస్తారు అంతే,

## నిత్యార్చన విధానం

ప్రతి రోజు ఉదయం 3 గంటలకే కాకడ హారతి, తర్వాత నిర్మాల్య విసర్జనం, చేసి సాలకరి పూజారి అర్చన చేస్తాడు, ముందు నరసింహా సాలగ్రామం, దక్షిణావర్త శంఖం, శివలింగాలు బాణలింగాల కు మహన్యాస పూర్వక రుద్రాభిషేకం, చేస్తారు, తర్వాత నిర్గుణ పాదుకలకు కేసరి మొదలైన సుగంధ ద్రవ్యాలతో లేపనం చేస్తారు, ఆ తర్వాత చింతామణి అనే గణపతి పూజ చేస్తారు, ఈ పూజలు పూర్తయ్యాక గుడి చుట్టూ ఉన్న గణపతి మారుతి, మేడి చెట్టు, ఆశ్వత్థ అంటే రావి చెట్టు నరసింహ సూర్యనారాయణాదిదేవతాపూజ నిర్వహిస్తారు, ఈ పూజ అంతా పూర్తి ఆయె సరికి ఉదయం 6 అవుతుంది, తర్వాత భక్తులకు హారతి తీర్థం ఇస్తారు, మధ్యాహ్నం మహా నైవేద్యం వరకు నిర్గుణ పాదుకా దర్శనం,పూజ కు అనుమతిస్తారు.మహా నైవేద్యం తర్వాత దర్శనం ఉండదు,

## మధుకరి (భిక్ష )



మహానైవేద్యం తర్వాత భక్తులంతా మధుకరి అంటే భిక్షకు బయల్దేరుతారు, ఈ భిక్ష శ్రీ దత్త సంప్రదాయంగా జరుగుతుంది, భిక్షా సమయం లో శ్రీ నరసింహా సరస్వతీ మహారాజ్ మధ్యాహ్నం 12 గంటల సమయం లో గాణగాపుర గ్రామానికి భిక్ష కోసం వస్తారని అందరి విశ్వాసం, కనుక భిక్ష ఇవ్వటం, తీసుకోవటం ఇక్కడ అనూచానంగా వస్తున్న సంప్రదాయం, దీనివలన భిక్ష విలువ పెరుగుతుందని,స్వామి అనుగ్రహం లభిస్తుందని నమ్మకం, స్వామి ఏ రూపం లో వస్తారో ఎవరికీ తెలియదు, తప్పక వస్తారు అనే విశ్వసిస్తారు,

## రాత్రి కార్యక్రమం –పల్లకీ సేవ




ప్రతి రోజూ రాత్రి 8 గంటలకు హారతి ఉంటుంది, తర్వాత స్తోత్రాలు గానం చేస్తూ గుడి చుట్టూ పూజారులు భక్తులు ప్రదక్షిణం చేస్తారు, ఆలయ ప్రాంగణం లో ఉన్న సకల దేవతా వృక్షాలకు హారతి ఇస్తూ మూడు సార్లు ప్రదక్షిణ చేస్తారు, ప్రతి గురువారం రాత్రి పల్లకీ సేవ ఉంటుంది, భక్తులకోరికపై ఏ రోజైనా కూడా పల్లకీ సేవ చేస్తారు, ముందుగా హారతి ఇచ్చి తర్వాత వస్త్రాలంకరణ చేసి, పూలతో హారాలతో పల్లకీని అలంకరించి ఉత్సవ మూర్తిని పల్లకి లో కూర్చోబెట్టి పాటలుపాడుతూ భజనలు చేస్తూ ఆలయం చుట్టూ 3 ప్రదక్షిణాలు చేసి, పల్లకీని యధాస్థానం లో ఉంచుతారు, తర్వాత ఉత్సవ మూర్తికి కర్పూర హారతి ఇస్తారు.మంత్రపుష్పం తర్వాత తీర్ధ ప్రసాద వినియోగం ఉంటుంది, తర్వాత వేద ఘోష ఉంటుంది, శ్రీ వాసుదేవానంద సరస్వతీ మహారాజ్ రచించిన "కరుణా త్రిపది "గీతాలను భక్తిగా ఆలపిస్తారు, ఆ తర్వాత శయన హారతి ఇస్తారు. దీనితోరాత్రి సేవాకార్యక్రమం పూర్తి అవుతుంది, ఇక రాత్రి 9 తర్వాత దర్శనం బంద్ అవుతుంది, త్రికాల పూజా వేళలలో "నౌబత్తు" వాద్య ఘోష తప్పని సరిగా ఉంటుంది,



గాణగాపురం లో వర్షాలు తక్కువ, ఇక్కడ వర్షాధార పంటలే అంటే జొన్న సజ్జ మాత్రమె పండిస్తారు భీమ నదికి వరదలు వచ్చినా నరసింహ వాడి,ఔదుంబరం, పాదుకలు నీటిలో మునగవు, కనుక దర్శనానికి ఇబ్బంది ఉండదు, ప్రతి రోజూ మధ్యాహ్నం 12 గంటలవరకు దర్శనం ఉంటుంది మళ్ళీ సాయంత్రం 5 నుండిరాత్రి 9 వరకు సాయం దర్శనం,

ఆలయం లో జరిగే వివిధ ఉత్సవాలు, అష్ట తీర్దాలు, నరసింహ సరస్వతీ మహారాజ్ జీవిత విశేషాలు తరువాత తెలుసుకొందాం,

## 87 గాణగాపురం ఉత్సవాలు

1 చైత్ర శుక్ల పాడ్యమి-ఉగాది నాడు -ఉదయం నిర్గుణ పాదుకలకు కుంకుమపువ్వు కస్తూరి మిశ్రిత గంధ అష్టగంధ సువాసనలేపనం, సాయంత్రం జ్యోతిష్యులచే పంచాంగ శ్రవణం, రాత్రి పల్లకీ ఊరేగింపు,
2 వైశాఖ శుక్లపంచమి-జగద్గురు శ్రీశంకరాచార్య జయంతి ఉత్సవం,
3 వైశాఖ శుక్ల చతుర్దశి-సాయంత్రం నృసింహ జయంతి మరునాడు పౌర్ణమి నాడు పారణి నిమిత్తం సాలసరి అర్చకుని ఇంట బ్రహ్మ భోజనం,
4 జ్యేష్ట శుద్ధ పాడ్యమి నుంచి దశమివరకు –దసరా వ్రత పూజలు
5 ఆశాఢ శుద్ధ పౌర్ణమి –చాతుర్మాస్య వ్రతం ప్రారంభం, సన్యాసులు రెండు నెలలు సీమోల్లంఘనం చేయరు, నిర్గుణ పాదుకలకు, యతులకు వ్యాసపూజ చేస్తారు,
6 శ్రావణ శుద్ధ పాడ్యమి నుండి అమావాస్య వరకు –ప్రతిరోజు శివలింగం, ఖడావగి లకు అభిషేకం, పూజ, హారతి తర్వాత మాధవ పత్ని స్తోత్ర పఠనం.మఠానికిమూడు ప్రదక్షిణాలు చేసిన తర్వాత తీర్ధ పంచామృత ప్రసాదాలు ఇస్తారు, నెల చివర్లో అన్నసంతర్పణం, అభిషేకం చేస్తారు, కల్లేశ్వర స్వామికి నిత్యాభిషేకం నిర్వహిస్తారు.

1 భాద్రపద శుద్ధ చవితి –గణేశ చతుర్ధి నాడు శ్రీ పాద వల్లభుల జన్మ దినోత్సవం జరుపుతారు, మధ్యాహ్నం 12 గంటలకు శొంఠి, పంచదార పంచుతారు, తర్వాత విష్ణు హర చింతామణి గణపతులకు నూతన వస్త్ర ధారణ అలంకారం మహా పూజా చేస్తారు, శుక్ల పంచమినాడు సేవ చేసే భక్తులకు భోజనం పెడతారు.

2 ఆశ్వయుజ శుక్ల దశమి –సాయంత్రం 5 గంటలకు శ్రీ దత్తమహారాజు ను ఊరేగింపు గా కల్లేశ్వర దేవాలయం లోని జమ్మి చెట్టు వద్దకు తీసుకు వెళ్లి జమ్మి పూజ చేస్తారు, మళ్ళీ ఆలయానికి తీసుకు వస్తారు.

3 ఆశ్వయుజ బహుళ ద్వాదశి –శ్రీ పాద వల్లభుల అవతార సమాప్తి ఉత్సవం, శ్రీ దత్తాత్రేయ నరహరి చౌదాపూర్ అభిషేకం, పూజ నిర్వహిస్తారు.

4 ఆశ్వయుజ బహుళ చతుర్దశి –నరక చతుర్దశి నాడు భక్తులు, అర్చకులు కలసి భజన చేస్తారు, అష్ట తీర్ధాలలో పవిత్ర స్నానాలు చేస్తారు.

5 కార్తీక పౌర్ణమి, బహుళపాడ్యమి –రెండు రోజులలో సంగమం వద్ద పెద్ద ఉత్సవం చేస్తారు, పున్నమి రోజున ఉదయం 10 గంటలకు ఉత్సవ మూర్తిని నూతన వస్త్రాలంకారంచేసి మధ్యాహ్నం 12 వరకు ఆలయం చుట్టూ ఊరేగిస్తారు, మేళ తాళాలు బాండు వగైరా వాద్యాలతో పల్లకీ ఊరేగింపు ను పోలి మేరవరకు తీసుకొని పెడతారు, తర్వాత అనంత కోటి బ్రహ్మాండ నాయకుని స్పూర్తి దాయకమైన గర్జన చేసి పల్లకిని అతి వేగం గా విశ్రాంతి కట్ట పై ఉంచుతారు, అక్కడి నుంచి ఊరేగింపు సంగమేశ్వరుని దగ్గర కొద్దిదూరం లో ఆపుతారు, పల్లకీ మోసే భక్తుల కాళ్ళపై నీళ్ళు పోసి ముత్తైదువులతో అందరికీ హారతి ఇప్పిస్తారు,. పల్లకిని సంగమం వద్ద

ఉన్న దేవాలయం లో ఉంచుతారు, అభిషేకం, మహానైవేద్యం అయ్యాక అందరకు భోజనాలు పెడతారు, ఈ రోజు అన్నదానం ఖర్చు అంతా సాలుసరి అర్చకులే భరిస్తారు, రాత్రి 9 గంటలనుండి 10 వరకు హారతి ఉత్సవం చేసి, తీర్ధ, ప్రసాదాలిచ్చి మళ్ళీ పల్లకీని ఊర్లోకి తీసుకు వెడతారు, అప్పటికి గుడిలో అంతా కాగడాలు వెలుగుతూ ఆ ప్రాంతాన్ని దివ్య కాంతులతో శోభాయమానంచేస్తాయి, భక్తులు ఆ కాగడాలు పట్టుకొని పల్లకీ చుట్టూ తిరుగుతూ ఉంటె ఆనందం, ఆశ్చర్యం తో కనులవెంట ఆనంద భాష్పాలు ధారా పాతంగా కారుతాయి, ఇది ఒక పరమ రమణీయ దృశ్యంగా భాసిస్తుంది. భక్తుల హృదయాలు ఆనంద పులకాంకితాలవుతాయి, కళ్ళల్లో ఒత్తులు వేసుకొని ఈ అనుభవం కోసమే సంవత్సరమంతా నిరీక్షిస్తారు, దేవుడున్నాడనే నమ్మకం గాఢమై విశ్వాసం పెరుగుతుంది, కాసేపు విశ్రాంతి కట్టపై ఆగి, ఊరి పొలిమేరలకు వస్తుంటే భక్తజనం పాటలు పాడుతూ భజనలు చేస్తూ తన్మయం పొందుతారు, ఇదంతా అయ్యేసరికి తెల్ల వారుజాము నాలుగు అవుతుంది, మళ్ళీ మర్నాడు పాడ్యమినాడు కూడా ఇదే విధంగా ఉత్సవం చేస్తారు, భజన చేసే వారికీ భక్తులైన యాత్రికులకు పాలు కాఫీ, టీ, తమలపాకు వక్కలు అందజేస్తారు, ఈ రెండు రోజులలో ప్రసాదంగా సజ్జ రొట్టె, గోంగూర పచ్చడి, నూనె అందజేస్తారు, వీటిని జిల్లేడు ఆకులలో పెట్టి తినటం ఆచారంగా వస్తోంది,

6 మార్గశిర శుక్ల చవితి – దత్త జన్మదినం నాడు భారీ ఊరేగింపు చేస్తారు.రధయాత్రలో కనీసం లక్ష మంది పాల్గొంటారు, మండపం లో మొసలిని దానిపై విష్ణువు ముఖవిగ్రహాన్ని పెట్టి మహాపూజ చేస్తారు, మధ్యాహ్నం 12 కు దత్తత్రేయ బాలమూర్తి ని వెండి ఉయ్యాలలో ఊపుతారు, అందరికీ బాగా కనిపించేట్లు బాగా ఎత్తులో ఉయ్యాలకడతారు, అందరికి శొంఠి,చక్కర ప్రసాదంగా ఇస్తారు,

పౌర్ణమినాడు శ్రీ దత్తో పంత్ చౌడా పూర్కర్ వారు అన్న సంతర్పణ చేస్తారు, రాత్రి పల్లకీ ఉత్సవం జరిపి, ఉత్సవమూర్తిని మఖరం లో కూర్చోపెట్టి, కీర్తన గానాదులు నిర్వహిస్తారు, ఉదయం లలితోత్సవం చేసి, మాలి ప్రసాదం పెడతారు, మరునాడు రధోత్సవం చేస్తారు,

12 పుష్య శుక్ల విదియ –మధ్యాహ్నం శ్రీ నరసింహ సరస్వతి జయంతిని అర్చకులు నిర్వహిస్తారు, మర్నాడు అన్న సంతర్పణ చేస్తారు, దత్త జయంతి ఉత్సవానికి లెక్కలేనంత మంది వచ్చి చూసి ఆనందిస్తారు

7 మాఘ శుద్ధ పాడ్యమి నుంచి పౌర్నమివరకు-దత్త నవరాత్రిఉత్సవాన్ని అర్చకులు తమ "నందా దీపాలను"తెచ్చి మఠంలో వెలిగించి శోభ చేకూరుస్తారు, పున్నమి నాడు ఉత్సవం పూర్తి అవుతుంది. ఆ రాత్రి హారతి అయ్యాక పాదుకలను మహావైభవంగా తెచ్చి గణపతి వద్ద పెడతారు, మంత్రపుష్పం అయినతర్వాతతీర్ధ ప్రసాదాలిస్తారు, ఈ కార్యక్రమం లో ఎవ్వరికీదర్శనం ఉండదు, ఈ రోజుస్వామివారు నలుగురు శిష్యులతో బయల్దేరి శ్రీశైల మల్లికార్జున సన్నిధిలో పాడ్యమినాడు అదృశ్యమయ్యారు, వారి గుర్తుగా మఠంలో ఎవరికీ తెలియనిది గుప్త రూపం లో ఉంచి వెళ్ళారు,

8 మాఘ బహుళ పాడ్యమి నుండి చతుర్థి వరకు –అన్నిటికంటే పెద్ద ఉత్సవం జరుగుతుంది, దాదాపు 3 లక్షలమంది పాల్గొంటారు, పౌర్ణమి నాడు ఉదయం 5 గంటలకు గర్భ గుడిలోని నిర్గుణ పాదుకలను శ్రీ విష్ణు హరు ల వద్దకు అంటే కూడలి ప్రదేశానికి తెచ్చి పెడతారు, తర్వాత ఎవరికీ నిర్గుణ పాద దర్శనం ఉండదు, పాడ్యమి ఉదయం పూజ తర్వాత పాదుకలను గర్భ గుడి వాకిలిలో ఉంచి, ఆ రోజు గురుపాడ్యమి ఉన్నందున నిర్గుణ పాదుకా దర్శనం మహా పవిత్రం, మహత్వ పూర్ణం, కనుక ఉదయం 6 నుండి మధ్యాహ్నం వరకు నిరంతరంగా పూజలు జరుగుతూనే ఉంటాయి, సాయంత్రం 4 గంటలకు మండపం కింద భాగం లో సన్యాసులకు పాద పూజ ఉంటుంది, అంతా పూర్తయ్యాక నది ఒడ్డున ఉన్న కేశవ దేవాలయప్రాంగణం లో భోజనాలు చేస్తారు,

9 మాఘ బహుళ విదియ –ఈ రోజు అన్నసంతర్పణం, ఖర్చు సోల్లాపురం కై.భీమ శంకర అప్పా మహారాజ్ శిష్యవర్గం భరిస్తుంది.

10 మాఘ బహుళ తదియ –అన్నసంతర్పణం ఖర్చు శ్రీ దత్తాత్రేయ శంకర పూజారిది,

11 మాఘ బహుళ చవితి-మధ్యాహ్నం 12 గంటలకు "గోపాళ కాతాఐమహారాజ్ పల్లకీ ని మహా వైభవంగా మేళ తాళాలతో నదికి స్నానానికి తీసుకు వెడతారు, చుట్టుప్రక్కల గ్రామాల ప్రజలు తండోప తండాలుగా తరలివచ్చి సంగమ స్నానం చేసి తరిస్తారు, మధ్యలో పిశాచాలు అరుస్తూ ఎగురుతూ నదిలో పడి ముక్తి పొందుతాయి, అర్చకులు భక్తులు మహారాజ్ పాదాలకు అభిషేకం చేసి అందరికి" గోపాళకళా"ప్రసాదం పంచిపెడతారు, తర్వాత భజనలు గీతాలతో పల్లకిని గుడికి తెస్తుంటే , పల్లకీ వెనుక సువాసినులు అమ్మతల్లుల్లాగా నూత్న వస్త్ర ధారణా అలంకారాలతో దీప హారతులు తీసుకు రావటం జన్మ తరించే దృశ్యం, సాయంత్రం 4 కు సమాప్తి, అన్న సంతర్పణం ఖర్చు అర్చకులు, జోషి గారు పెడతారు, ఈ నాలుగు రోజుల్లో రాత్రి హారతి ఉండదు,

మాఘ బహుళ పాడ్యమి నుంచి చవితి వరకు శ్రీ అనంత లాతూర్కర్ గారు తమ తండ్రి సంస్మరణార్ధం అటుకులు, పెరుగు మధుకరి గా వేస్తారు,

12 మాఘ బహుళ త్రయోదశి –మహాశివ రాత్రి రాత్రి 10 గంటలనుండి ఉదయం 3 వరకు నాలుగు ఝాములా పూజ చేస్తారు "మాధవ ధర్మపత్ని "అనే స్తోత్రగానం నిరాటంకంగా చేస్తూమూడు ప్రదక్షిణాలు చేస్తారు.తర్వాత మంత్రపుష్పం తీర్ధ ప్రసాదాలైనతర్వాతపూజ సమాప్తి అవుతుంది,

13 ఫాల్గుణ బహుళ పంచమి –నరసింహ సరస్వతీమహారాజ్ పూజ చేసి, కస్తూరీ మిశ్రిత కేసరి రంగును పూస్తారు,

ఇలా గాణగాపుర దత్త క్షేత్రం లో నిత్యోత్సవ పక్షోత్సవాలు పెద్ద ఎత్తున జరుగుతాయి, దాదాపు ప్రతి రాత్రీ పల్లకీ ఉత్సవం లో నగరి వాయిస్తారు, ఆ సమయం లో భూతాలూ సంచరిస్తూ "దత్తా తరింపజేయి మమ్మల్ని ఉద్ధరించు "అని అరచే ధ్వనులు చాలా పెద్దగా వినిపిస్తాయి, ఆశ్చర్యం తో పాటు భయం కలిగి ఒళ్ళు గగుర్పొడుస్తుంది, వాళ్ళు డాన్స్ చేస్తూ అరుస్తూ హల్ చల్

చేస్తారు. భయం లేకుండా అక్కడి స్తంభం ఎక్కి నాట్యం చేస్తారు, ఇదే పిశాచ నృత్యం అంటే, పసి పిల్లలు, బాలురు మగా ఆడవాళ్ళు భూత బాధకు లోనై ప్రతి రోజు ఆ సమయం లో పూనకం వచ్చి ఊగిపోతూ స్పృహ కోల్పోతారు, ఈ దృశ్యం కడుభీభత్స భయంకరంగా ఉంటుంది. భక్తులు భీతి చెందుతారు, దత్త గురువులు తామిక్కడ ఉన్నామని వారి బాధా నివారణ చేసి రుజువు చేస్తారు, నాస్తికులకు కూడా దేవునిపై నమ్మకంతప్పక కలుగుతుందని ఎందరో అనుభవం మీద తెలియ జేస్తున్నారు, మిగిలిన విషయాలు ఈ సారి,

## గాణగాపురం లో అష్ట తీర్ధములు

గాణగాపురం లోని అష్ట తీర్ధాలు చాలా పవిత్రమైనవిగా భావిస్తారు, వీటిలో స్నానం పాపహరణం,




1 షట్కుల తీర్ధం –ఇది ప్రయాగతో సమానమైన తీర్ధం, ఇక్కడ జలంధరుడు అనే రాక్షసుడు ఉండేవాడు, కోపం వస్తే దేవతల్ని చంపేవాడు, వాళ్ళను బ్రతికించ టానికి అమృతం తేవాల్సి వచ్చేది.అక్కడ నుండి అమరజా నది ప్రవహించింది.



2 నరసింహ తీర్ధం –మొదటి స్నానం ఇక్కడే చేయాలి, స్నానం తర్వాత సంగమేశ్వర దర్శనం చేసి పూజించాలి, ఇది శ్రీ శైల సందర్శన పుణ్యఫలం తో సమానం,



3 భాగీరధీ తీర్ధం –ఇక్కడి స్నానం కాశీ మణికర్ణికా తీర్ధ స్నాన ఫలం ఇస్తుంది, ఇక్కడ నాగనాధ దేవాలయం ఉంది, ఇక్కడే సాయం దేవుడు తనపైదూకబోతున్న రెండు కాలనాగులను చూశాడు,

4 పాప వినాశ తీర్థం – కుష్టు రోగ నివారణి.స్వామి వారి చెల్లెలు రత్నాబాయి కుష్టు రోగం ఇందులో స్నానం చేస్తే పోయింది,





5 కోటి తీర్థం –ఇందులో స్నానం కోటి దాన పుణ్యం,

6 రుద్ర పాద తీర్థం –ఇక్కడి విష్ణుపాదం వద్ద శ్రాద్ధ కర్మ చేసి పితృదేవతలకు విమోచనం కలిగిస్తారు



7 చక్రతీర్థం –ఇది ద్వారవతి తీర్థం లో ఉంది.ఇక్కడ అస్తికలు నిమజ్జనం చేస్తే చక్రాకారం పొందుతాయి,



8 మన్మధ తీర్థం –ఇది శ్రీ కల్లేశ్వర దేవాలయం లో ఉన్నది, ఇక్కడ స్నానం గోకర్ణ స్నానం ఫలం తో సమానం, కల్లేశ్వర పూజ మహా బలేశ్వర పూజతోసమానం,



## సంగమ తీర్థం



సంగమ తీర్థం – భీమ అమరజా నదీ సంగమం, ఇక్కడ స్నానం సకల పాపహరం, అమరజా నది పూర్వ వాహిని భీమ నది ఉత్తర వాహిని, శ్రీ నరసింహ సరస్వతులు రోజూ ఇక్కడికి వచ్చిస్నానంచేసేవారు, దీనికి సుమారు మైలుదూరం లో భాగీరధీ తీర్థం ఉంది,

సంగమం వద్ద దత్త మందిరం ఉన్నది తూర్పున ఉన్న రావి చెట్టుక్రింద నరసింహ సరస్వతి అనుష్టానం చేసేవారు, చెట్టు పడిపోవటం తో శ్రీ బాలా సాహెబా రాస్తే దేవాలయం నిర్మించి పాదుకలు, లింగ ప్రతిష్ట చేశారు, ఇక్కడ త్రిమూర్త్యాత్మక దత్త దర్శనం పొందవచ్చు,

## భస్మ లేక విభూతి కొండ




ఇక్కడికి దగ్గరలో భస్మ కొండ ఉన్నది. పరశురాముడు ఇక్కడ పెద్ద రాజ యజ్ఞం చేశాడు, ఆ యజ్ఞ భస్మంతోఈ కొండ ఏర్పడింది, యాత్రికులు కావలసినంత భస్మాన్ని అంటే విభూతిని తీసుకు వెళ్ళవచ్చు. ఎంత తీసినా తరగని విభూతి ఉంటుంది. అదీ దీని ప్రత్యేకత,



గాణగాపురం లో ముఖ్య ప్రసాదం గా ఈ భస్మాన్నే భక్తులకు అందజేస్తారు,

## ఔదుంబ వృక్షం




సంగమ క్షేత్రం లో దత్తమందిరానికి ఎదురుగా కట్ట మీద దేవాలయానికి తూర్పున "శుస్టకాష్టఔదుంబర వృక్షం "ఉన్నది, నరహరి అనే ఒక భక్తుడికి కుష్టు రోగం వచ్చి బాధ పడుతుంటే శ్రీ నరసింహ సరస్వతి అతనికి ఒక ఎండు మోదుగు పుల్లను ఇచ్చి దాన్ని భూమిలో పాతి రోజూ భక్తిగా నీళ్ళు పోసి పెంచమన్నారు, అందరూ హేళన చేసినా ఆ భక్తుడు అచంచల విశ్వాసం తో అలానే నీరు పోశాడు, కొద్దికాలం తర్వాత నరసింహ సరస్వతీమహారాజ్ అతని భక్తికి సంతోషించి తన కమండలం లోని నీటిని ఆ ఎండిన కొమ్మపై చల్లారు, అది చిగురించగానే భక్తుడు నరహరి కుష్టువ్యాధి పోయింది, 1914 లో ఈ చెట్టు వరదలలో కొట్టుకు పోతే అదే స్థలం లో మరొక మేడి చెట్టు నాటారు, ఈ చెట్టుకిందనే భక్తులు" గురు చరిత్ర"ను పారాయణం చేస్తారు, ప్రదక్షిణ నమస్కారాలు ఆచరిస్తారు,

## విశ్రాంతి కట్ట

శ్రీ నరసింహ సరస్వతులు గాణగాపురం నుండి సంగమానికి వచ్చి స్నానం, జపతపాది అనుష్టానం చేసి వెళ్ళేవారు, ఒక రైతు తన పొలం లో ఒక చోట స్వామి వారిని విశ్రాంతి తీసుకోమని కోరేవాడు, అలా విశ్రాంతి తీసుకొన్న గట్టు నే విశ్రాంతి కట్ట అంటారు.

## శ్రీ కల్లేశ్వర దేవాలయం

గాణగాపురానికి ఒక మెయిలు దూరం లో హిప్పగిరి గ్రామం లో మహా మహిమాన్విత శ్రీ కల్లేశ్వర దేవాలయం ఉన్నది, కల్లేశ్వరుడులంటే గోకర్ణం లోని శ్రీ మహా బలేశ్వర ప్రతి రూపమే, మేము హిందూపురం లో ఉండగా నాకున్న ఇద్దరు కన్నడ మిత్రులలో అన్నదమ్ములైన కల్లూరావు గుండూ



రావు ఉండేవారు, యాభై ఏళ్ళ తర్వాత అక్కడికి వెడితే నాతోపాటు చదువుకొన్న అబ్బాయి, సోమసుందరం, చలపతి, దక్షిణామూర్తి తోపాటు గుండూ రావు కూడా చనిపోయారని తెలిసింది. కల్లూరావు ఇంటికి వెడితే ఆతను బెంగుళూర్ వెళ్ళాడని భార్య చెప్పి, ఫోన్ నంబర్ ఇస్తే తర్వాత మాట్లాడాను, కల్లూరావు కు కల్లేశ్వర స్వామి పేరు పెట్టారేమో? ఇక్కడ శనిమందిరం గణపతి మందిరం ఉన్నాయి, ఇక్కడ నర కేసరి అనే మహా భక్తుడు ఉండేవాడు, అనుక్షణం కల్లేశ్వర నామ భజనలతో పులకించి పోయేవాడు అతని భక్తికి గురుమహారాజ్ సంతోషించి అతనికి కలలో దర్శనమిచ్చి అద్వైత సాక్షాత్కారం కలిగించి సర్వత్రా ఈశ్వరుడు ఉంటాడు అనే జ్ఞానం కలిగించారు,

### శ్రీ శ్రీ నరసింహ సరస్వతీ మహారాజ్



మహా పతివ్రత అనసూయా దేవి పాతివ్రత్యాన్ని పరీక్షించటానికి వచ్చిన త్రిమూర్తులను శిశువులుగా మార్చి, వారి అర్ధాంగులు వచ్చి బ్రతిమిలాడితే వారికి స్వస్వరూపాలు ప్రసాదించిన సాధ్వీమతల్లి అనసూయా దేవి, త్రిమూర్తులు ఆమెను వరం కోరుకోమనగా అత్రి మహర్షి అనసూయ దంపతులు వారిని తమకు కుమారులుగా



జన్మించమని కోరటం, వారు అంగీకరించటం తెలిసిన కథ యే, త్రిమూర్తుల అంశతో ఒక పసి పిల్లాడిని అక్కడ వదిలి అదృశ్యమయ్యారు, బ్రహ్మ రూపం లో ఉన్నవాడికి చంద్రుడు, విష్ణు రూపి దత్తాత్రేయుడు, మహేశ్వర స్వరూపి దుర్వాసుడు అని పేర్లు పెట్టారు మహర్షి దంపతులు, చంద్రుడు తల్లితో తాను చంద్ర మండలం లో ఉండి దర్శనం ఇస్తానని చెప్పి అనుమతి పొంది వెళ్ళిపోయాడు, దూర్వాసుడు తపస్సుచేసుకొంటానని తీర్ధ యాత్రలకు వెళ్ళాడు, ఈ త్రిమూర్తులు ఐక్యమై దత్తాత్రేయ స్వరూపంగా మారి అమ్మ అనసూయ కు సంతోషం కలిగించారు, ఈ దత్తాత్రేయుడే లోకోద్ధరణకు తల్లి అనుమతి పొందితీర్ధ యాత్రలు చేసి అనఘా దేవిని వివాహమాడాడు దత్తాత్రేయుని రెండవ అవతారమే శ్రీ పాద వల్లభుడని మూడవ అవతారమే శ్రీ నరసింహ సరస్వతి అని ముందే చెప్పుకొన్నాం, ఇప్పుడు శ్రీ నృసింహ సరస్వతిమహారాజ్ జీవిత విశేషాలు తెలుసుకొందాం,

క్రీశ 1378 లో మహారాష్ట్ర విదర్భ ప్రాంతం లో ''కరంజ ''గ్రామం లో అంబా భవానీ, మాధవుడు అనే దంపతులకు జన్మించిన బాలుడే నరసింహ సరస్వతి, పుట్టగానే ఓంకారం ఉచ్చరించాడు, , కారణ జన్ముడనుకొని ''నరహరి'' నామం పెట్టారు, కాని తర్వాత మాటలే రాలేదు, కంగారు పడ్డారు తలిదండ్రులు, మూగ వాడు అని అందరూ గేలి చేశారు, ఒక రోజు తల్లికి మూగ సైగ చేసి తనకు ఉపనయనం చేయమన్నాడు, మూగవాడికి ఒడుగేమిటి అన్నారు. కాని తలిదండ్రులు ఉపనయన సంస్కారం చేశారు, యజ్ఞోప వీత ధారణ జరగగానే ఆ బాలుడి నోటి నుండిఅలవోకగా చతుర్వేదాలు ధారాపాతంగా ఉచ్చరించి ఆశ్చర్య పరచాడు, తల్లికి పూర్వ జన్మ గుర్తుకు తెప్పించి ఆమె పూర్వజన్మ లో శ్రీ పాద వల్లభుల తల్లి అంబిక యేనని, తాను శ్రీ పాద వల్లభుల అవతారమే నని తెలియ జేశాడు, తల్లి అనుమతి పొంది కాశీకి వెళ్ళిపోయాడు,

కాశీలో బాల బ్రహ్మ చారిగా యోగ సమాధిలో ఉంటూ ఆశ్చర్యపరచాడు, అతడు నారాయణ అంశం ఉన్నవాడు అని అందరూ గ్రహించారు, వృద్ధ కృష్ణ సరస్వతుల వద్ద సన్యాస దీక్ష పొంది" నరసింహ సరస్వతి "దీక్షానామం తో విలసిల్లారు, గురుబోధ చేస్తూ శిష్యులకు మార్గ దర్శనం చేస్తూ, తాను పుట్టిన కరంజ గ్రామం వెళ్లి తలిదండ్రులకు దర్శనమిచ్చి భిక్ష తో జీవిస్తూ యాత్రలు చేస్తూ గోదావరీ తీరం లో సాయం దేవుని అనుగ్రహించి శిష్యుని అభ్యర్ధనపై, "గురు చరిత్ర"రచన ప్రారంభించి వైజనాత్ లో కొంతకాలం కృష్ణా తీరం లో "అవదుమ్బర "పరిసరాలలో ఏకాంత వాసం లో ధ్యానం చేసి, చాతుర్మాస దీక్ష అనంతరం మళ్ళీ బయల్దేరి కృష్ణా పంచ గంగ సంగమంచేరి అక్కడ" నర్సోబాడినరసింహ సరస్వతి"గా ప్రసిద్ధి చెంది గురు చరిత్ర పూర్తి చేశారు,

## గాణగా పుర(గంధర్వ నగర ) ప్రవేశం



నర్సో బాడిలో ఉన్నప్పుడుస్వామి వారి వయసు 46-47ఏళ్ళు, మరలా సంచారం ప్రారంభించి భీమ, అమరజా సంగమ క్షేత్రమైన గాణగా పురం వచ్చారు, ఇక్కడే 23 ఏళ్ళు స్థిరంగా గడిపారు, ఎందరికో భక్తిజ్ఞాన వైరాగ్యాలు బోధించి సన్మార్గ గాములను చేస్తూ దీర్ఘ వ్యాధులను నివారిస్తూ దత్త మహాత్మ్యాన్ని అనుభవానికి తెస్తూ పరమపురుషులుగా విరాజిల్లారు,

## అవతారసమాప్తి

ఒక రోజు శిష్యులను దగ్గరకు పిలిచి తన అవతార సమాప్తి దగ్గరలోనే ఉన్నదని,విచారం వద్దని, మనసార ధ్యానిస్తే తానెప్పుడూ అందుబాటులోనే ఉంటాననిధైర్యం చెప్పి, "ఈ సంగమ క్షేత్రం లోనే నా నిత్య కృత్యాలు జరుగుతూ ఉంటాయి, మఠంలో మధ్యాహ్నం వేళ నా భక్తుల క్షేమాన్ని చూస్తాను, ఇక్కడిఅశ్వత్థ వృక్షాన్ని, నాపాదుకలను పూజించేవారిని దర్శించేవారినీ ఎప్పుడూ నేను కనిపెట్టుకొని ఉంటాను, నేనెక్కడికీ వెళ్ళటం లేదు, గుప్త రూపం లో ఇక్కడే ఉంటాను "అని ధైర్యం చెప్పి శ్రీశైల యాత్రకు బయల్దేరారు,

శ్రీ పర్వత శ్రీశైలాన్నిచేరి, పాతాళగంగ కృష్ణానదిలో పవిత్ర స్నానం చేసి శిష్యులతో"అవతారం చాలించే సమయమైంది పుష్పాసనం సిద్ధం చేయండి "అని చెప్పి వారుసిద్ధం చేయగా అందులో సుఖాసీనులై తనవెంట ఉన్న నలుగురు శిష్యులను ప్రేమతో పలకరించి "విచారం వద్దు, నేను ఎప్పుడూ గాణగాపురం లోనేగుప్తంగా ఉంటాను, నన్ను నమ్మిన వారికి అండదండ గా ఉంటాను "అని

ఆశీస్సులందించి బహుధాన్య నామ సంవత్సర ఉత్తరాయణ పుణ్యకాల మాఘ బహుళ పాడ్యమి శుక్రవారం పుష్యమీ నక్షత్రం లో క్రీశ 1459న శ్రీ నరసింహ సరస్వతీ మహా స్వాములు పాతాళగంగ లో ఐక్యమయ్యారు, శిష్యులు కన్నీటితో విచారిస్తుంటే ఒక పడవ వాళ్ళున్న చోటుకు వచ్చింది, అందులోని వారు వీరితో "గురుదేవులు నదీ మధ్యమం లో దర్శన మిచ్చారు వారు సర్వ దేవతా గణం తో పరివేష్టించి ఉన్నారు, వారి పాదుకలు స్వర్ణమయ ప్రకాశంగా ఉన్నాయి, మిమ్మల్ని గాణగా పురం వెళ్ళమని మీ కోసం పుష్ప, ప్రసాదాలు పంపుతామని తెలియ జేయమని సెలవిచ్చారు "అని వారు చెప్పగానే నాలుగు పుష్పాలు శిష్యుల చేతులలోకి చేరాయి, వాటిని శ్రీ గురు ప్రసాదంగా కళ్ళకు అద్దుకొని స్వీకరించి గాంధర్వ పురం అని పిలువబడే గాణగా పురం చేరారు, ఈ నలుగురిలో నందిశర్మ, నరహరి కవులు, సాయం దేవుడు, సిద్ధుడు సాధకులు. గాణగా పుర క్షేత్ర విశేషాలు సమాప్తం,

## 88 శరణ బసవేశ్వర దేవాలయం –కలబురిగి (గుల్బర్గా )



కర్నాటక కలబురిగి అనే గుల్బర్గాలో శరణ బసవేశ్వర దేవాలయం ఉంది.18 వ శతాబ్ది వీర శైవ మతాచార్యులు శ్రీ బసవప్ప, ఆయన సిద్ధాంతం "దాశోహం "అంటే ఇవ్వటమే ఆర్జన, మరియు" కాయక "అంటే కర్మ చేయటమే నీవంతు ఫలితం అడిగే హక్కులేదు, ఆయన సమాధి పై శివ లింగాన్ని ప్రతిష్టించారు, ఇక్కడ జరిగే రధోత్సవం తిలకించటానికి దేశం లోని అన్నిప్రాంతాలనుండి భక్తులు వస్తారు ఆ రోజు ఆయన భోజనం చేసే వెండిపళ్ళెం-ప్రసాద భట్టాళ అందరు చూసే అవకాశం కల్పిస్తారు, ఈ రోజే ఆయనకట్టుకున్న "లింగ సజ్జిక "అంటే శివలింగం ఉన్న గంధపు భరిణ దర్శనం కూడా చేసి ధన్యులవుతారు,



పూజ్య శ్రీ డా. శరణ బసవప్ప అప్ప ఎనిమిదవ మహాదాశోహసంస్థాన్ పీఠాధి పతి విద్యా వార్ధిక్ సంఘ అధ్యక్షుడు, అఖిలభారత అనుభవ మండప ప్రెసిడెంట్ 14-11-1935 లో జన్మించారు, పుట్టగానే శివలింగం పై దృష్టిపెట్టారు, బాల్యం లోనే ఆధ్యాత్మిక అనుభూతి పొందారు, కర్నాటక ధార్వాడ్ యునివర్సిటి నుంచి పోస్ట్ గ్రాడ్యుయేట్ అయ్యాడు, ప్రొఫెసర్ కె జి షా, ప్రొఫెసర్ ముల్లటి గురువులు, వీర శైవాన్ని విశ్వ విద్యాలయం లో బోధించే ఏర్పాటు చేయాలని మనసులో ఉండేది, ఈ విషయం వైస్ చాన్సలర్ కు చెప్పగా ఒక విద్యార్ధి నుండి ఇలాంటి ఆలోచన వచ్చినందుకు మెచ్చాడు, వెంటనే ఎం ఏ ఫిలాసఫీలో దీన్ని కోర్సుగా ప్రవేశ పెట్టాడు, తండ్రి దొడ్డ బసవప్ప అనేక విద్యాలయాలను స్థాపించి విద్యా వ్యాప్తిచేశాడు,

శరణబసవప్పకు అంతర్జాతీయ విద్యా విధానం ప్రవేశ పెట్టాలని కోరిక ఉండేది, అందుకే మహా దాసోహ పీఠం వారు నానా దాసోహ 1903లో ప్రారంభించారు, శరణ బసవప్ప మహా దాశోహ యోగి అయ్యారు, మహా దాశోహతోపాటు, కాల దాశోహ,విజ్ఞాన దాశోహ, అక్షర దాశోహ భావాలనూ వ్యాప్తిచేశారు, జీవితం లో ప్రతిపని దాశోహ భావం తో చేయాలని ఉద్బోధించేవారు, మహా దాశోహ సూత్రాలు రాశారు, వీటితో దాశోహ సంస్కృతీ వ్యాప్తమైంది, వీటికి ఆంగ్ల అనువాదాలు వచ్చాయి, మదర్ తెరెసా, ఎం వి కామత్ లు వీటిని చదివి అభినందించారు, బసవప్ప విశ్వ వ్యాప్త విద్యా వర్ధక్ సంఘ్ ను ఏర్పరచారు, ధార్వాడ్ లోని కర్నాటక యూని వర్సిటి సిండికేట్ సెనేట్ మెంబర్ గా ఉన్నప్పుడు హైదరాబాద్, కర్ణాటకలలో ఇంజినీరింగ్, మెడికల్ కాలేజీ లను పెట్టటానికి నిర్ణయం తీసుకొన్నారు, గుల్బర్గా లో పోస్ట్ గ్రాడ్యుయేట్ స్టడీ సర్కిల్ ఏర్పాటుకూ ఆయనే కారకులు

అఖిలభారత మహా సభకు అధ్యక్షులై గుల్బర్గా యూని వర్సిటీ ఏర్పాటుకు నాంది పలికారు, వీరి విద్యా ఆధ్యాత్మిక సేవలకు అనేక సంస్థలు పురస్కారాలు అందజేశాయి, కర్నాటక రాష్ట్రం రాజ్యోత్సవ అవార్డ్ గుల్బర్గా యూని వర్సిటి గౌరవ డాక్టరేట్ ను మహారాష్ట్ర గోకుల్ విద్యా సంస్థ "పుణ్య శ్లోక శివ



పార్వతి ఆధ్యాత్మిక ప్రశస్తి పురస్కారం "అందజేశాయి, 12 వ శతాబ్ది శైవ శరణుల భావ వ్యాప్తికి "అనుభవ మండపం 'నిర్మించి,వీర శైవ మత స్థాపకుడు బసవన మంత్రి ఆదేశాలను అనుభవం లోకి వచ్చేటట్లుచేశారు, ఢిల్లీలోని పార్లమెంట్ ప్రాంగణం లో 9 వ నంబర్ గేటు వద్ద 14 అడుగుల బసవేశ్వరుని కాంశ్య విగ్రహాన్ని ఏర్పాటు చేయించి రాష్ట్రపతి అబుల్ కలాం గారిచే28-4-2003 న ఆవిష్కరింప జేశారు.గుల్బర్గాను విద్యా ఆధ్యాత్మిక కేంద్రంగా తీర్చిదిద్దిన ఘనత శరణ బసవప్పఅప్ప గారిదే,



వీరి తండ్రి దొడ్డ బసవప్ప మహాత్మా గాంధీ తోసన్నిహిత సంబంధం ఉన్నవారు, ఈయన నిజలింగప్ప, శంకర దయాళ్ శర్మ, యెడ్యూరప్ప, దలైలామా, జైల్ సింగ్, నోబెల్ బహుమతి గ్రహీత డా రాబర్ట్ జే ఆమన్, ఇందిరాగాంధీ, రాజీవ్ గాంధి వంటి మహా వ్యక్తులతో గాఢ పరిచయమున్నవారు,

--

## మాణిక్య ప్రభు సంస్థాన్ –హుమ్నాబాద్

### శ్రీ దత్త పరంపర

చతుర్ధ దత్తావతారులు గురుసార్వభౌమ, భక్త కల్పద్రుమ శ్రీ మాణిక్య ప్రభు సంస్థానం కర్నాటక లో మాణిక్ నగర్ –హుమ్నాబాద్ లో ఉన్నది, త్రిమూర్తి స్వరూపులైన దత్తాత్రేయులు వివిధ రూపాలలో అవతరించి భక్తులను తరింప జేశారు, వారి అవతారమాలికను తెలియ జేసే శ్లోకం –

"వందే దత్తవదూతం విధి, హరి,శివ రూపాత్మకం దేశికాద్యం –శ్రీపాద శ్రీద వాక్యం శ్రిత విపదపహం, చిద్ఘనైకం ద్వితీయం

తార్తీయం నృసింహం యతి కులతిలకం, భక్త కార్యామర ద్రుమం –వందే మాణిక్య ప్రభుం, తమ్ సకల మత గురుం శుద్ధ తత్త్వం చతుర్ధం,

సన్మార్గ నిర్దేశం చేసేవారిని దేశికులు అంటారు సద్గురువులలో సర్వ శ్రేస్టులు శ్రీ దత్తాత్రేయులు, ఆత్మోద్ధరణ మార్గం చూపించిన వారిలో ఆద్యులు, అందుకే వారు దేశికాద్యులు, శరణు అన్నవారి ఆపదలను దూరం చేసే వారు దత్తాత్రేయుల ద్వితీయ అవతారం శ్రీ శ్రీపాద వల్లభులు, యతులలో శ్రేస్టులైన నృసింహ సరస్వతి తృతీయ అవతారం, భక్తుల మనోభీష్టం తీర్చే కల్ప వృక్షం వంటివారు, సకల మతాలకు ఆదరణీయులు దత్తాత్రేయుల చతుర్ధ అవతార స్వరూపులు శ్రీ మాణిక్య ప్రభువులకు వందనం అని భావం,

## మాణిక్య ప్రభు సంస్థానం –సేవలు

స్థానికులు మాణిక్ ప్రభు అని గౌరవంగా సంభావించే మాణిక్య ప్రభువు విద్యాదానం లో, అన్నదానం లో సాటిలేని వారనిపించారు, ప్రతి రోజు వందలాది భక్తులకు అన్నప్రసాదంఅందజేస్తోంది సంస్థానం, వేద రక్షణ కోసం వేద పాఠ శాల నిర్వహిస్తోంది, 100 మంది విద్యార్థులు ఉచితంగా వేద విద్య ఇక్కడ అభ్యసిస్తున్నారు, ఇది 8 సంవత్సర కాల పరిమిత విద్య, ఇక్కడ వేద విద్యలోసుశిక్షితులైన వారు దేశ విదేశాలలో కీర్తి పొందుతున్నారు, వెనుకబడిన తరగతుల విద్యార్ధులకోసం వసతి గృహం నడుపుతున్నారు, అనాధల కోసం మాణిక్యప్రభు అనాధ శరణాలయం, అందులకోసం మాణిక్య ప్రభు అంధ విద్యాలయం బ్రెయిలీ ట్యూటర్ వంటి ఆధునిక పరికరాలతో నిర్వహిస్తున్నారు, మాణిక్య ప్రభు సంగీత విద్యాలయం లో వందలాది విద్యార్ధులు సంగీతం నేర్చి రాణిస్తున్నారు, వీటి నన్నిటిని మాణిక్య ప్రభు శిక్షణ సమితి సమర్ధ వంతంగా నిర్వహిస్తోంది,



గ్రామ స్థాయిలో కూడా విద్యార్థులకు ఆధునిక విద్య అందజేసే ఉద్దేశ్యం తో మాణిక్ పబ్లిక్ స్కూల్ అనే రెసి డేన్షియల్ విద్యాలయాన్ని శ్రీ సిద్ధ రాజ్ మాణిక్య ప్రభు మహారాజ్ 1972 లో స్థాపించారు, ఈ విద్యాలయం లో విద్య తో పాటు, సంగీతం క్రీడలు, చిత్ర లేఖనం కు కూడా ప్రాధాన్య మిస్తారు, కనుక విద్యార్ధి సర్వ తోముఖ మైన ప్రతిభ సాధనకు ఉజ్వల భవితవ్యానికి ఎంతగానో ఈ విద్యాలయం

తోడ్పడుతుంది, క్రీడాంశాలలో భాగం గా "మాణిక్య ప్రభుసరోవర్"అనే స్విమ్మింగ్ పూల్ కూడా ఏర్పాటు చేశారు, ఇన్ని సత్కార్యాలకు స్ఫూర్తి దాత శ్రీ మాణిక్య ప్రభు జీవిత విశేషాలను తెలుసుకొందాం,

## శ్రీ మాణిక్య ప్రభు మహారాజ్

నిజాంపాలనలో హైదరాబాద్-కర్నాటక ప్రాంతం లో ప్రస్తుతం కర్నాటక రాష్ట్రం లో బసవ కళ్యాణ్ తాలూకా లాడవంతి గ్రామం లో దైవ భక్తి పరాయణులైన మనోహర నాయిక్ –బయమ్మ దంపతులకు 1817 మార్గ శిర శుక్ల చతుర్దశి అంటే దత్తాత్రేయ జయంతి నాడు శ్రీ మాణిక్య ప్రభువు జన్మించారు, వీరి తలిదండ్రులకు శ్రీరామనవమి నాడు దత్తత్రేయులు స్వప్నంలో దర్శనమిచ్చి తాము వారి కుమారులుగా జన్మిస్తామని ముందే తెలియ జేశారు,

మాణిక్ గారి బాల్యం కళ్యాణ్ లో మేనమామ గారింట గడచింది, పరిసర అరణ్యాలలో మిత్రులతో ఆడుకోవటం గోవిందుడు అనే స్నేహితుడు మరణిస్తే బ్రతికించటం, సంతానం లేని భీమాబాయికి 8 గవ్వలు ఇచ్చి సంతాన ప్రాప్తి కలిగించటం బాల్య క్రీడలుగా మాణిక్ ప్రభు చేసి ఆశ్చర్య పరచారు, వీటివలన దైవాంశ సంభూతులుఅనే నమ్మకం ప్రజలలో కలిగింది, ఏ పనీ చేయకుండా తిరుగుతున్న మేనల్లుడిని మేనమామ 16 వ ఏట మందలిస్తే, గోచీ గుడ్డతో ఇల్లు వదిలి తీర్ధ, క్షేత్ర సందర్శనం చేస్తూ అనేకమంది శిష్యులకు ప్రేరణ కలిగించి ప్రసిద్ధ గురువులుగా పేరుపొందారు,

## హుమ్నాబాద్ లో సంస్థాన స్థాపన



ఒక సారి పల్లకి లో మాణిక్ ప్రభును శిష్యులు మోసుకొని వస్తూండగా హుమ్నాబాద్ దగ్గర రెండు చెట్ల మధ్య పల్లకి ఇరుక్కు పోయి ఆగి పోయింది, ఆ ప్రదేశమే తమ శాశ్వత ఆవాస క్షేత్రం గా దైవం నిర్ణయించాడని భావించి అక్కడే పర్ణశాల తయారు చేయించి ఉండిపోయారు, ఈ ప్రదేశం విరజా –గురుగంగా నదులపవిత్ర సంగమ క్షేత్రం, అప్పుడు ఘోర అరణ్యం, కారడవి, నిర్జన ప్రదేశం, ప్రభు రాకతో జనసమ్మర్దం పెరిగింది, క్రమంగా "మాణిక్ నగర్ "గా సుప్రసిద్ధ పుణ్య క్షేత్రం గా రూపు దాల్చింది.ఇక్కడే స్థిరం గా ఉన్న శ్రీ మాణిక్య ప్రభు మహారాజ్ భక్తుల మనోభీష్టాలు నెరవేరుస్తూ, అందరి అభిమానంసాధించారు, 1865 మార్గ శిర శుద్ధ ఏకాదశి –ముక్కోటి ఏకాదశి –గీతాజయంతి నాడు 48 వ ఏటనే సంజీవినీ మహా సమాధిలో లీనమయ్యారు,

ఆజన్మ బ్రహ్మ చారి అయిన మాణిక్ ప్రభు మధుకరి అంటే భిక్షాటనం చేస్తూ దానినే మహా ప్రసాదం గా భుజించేవారు, "రాజయోగి" గా కీర్తి గడించారు, వారిసంస్థాన వైభవం కనుల పండువుగా ఉండటం

చేత "రాజాధిరాజ "అని కీర్తించబడే వారు, ఎందరెందరో పండితులుకవులు కళా కారులు మాణిక్ ప్రభు దార్బార్ లో తమ విద్యను ప్రదర్శించి విశేష గౌరవ సత్కారాలు పొందేవారు, బీద ప్రజలకు, అనాధలకు లెక్కలేనంత ధనాన్ని మాణిక్ ప్రభు దానం చేశారు.

## షిర్డీ బాబా అక్కల్ కోట్ ప్రభు ల దర్శనం



మాణిక్ ప్రభు సమకాలికులే శ్రీ షిర్డీ సాయిబాబా, స్వామి సమర్ధఅనే అక్కల్ కోట మహారాజ్ మొదలైన ప్రముఖులు, వీరందరితో మాణిక్ ప్రభుకు గాఢమైన మైత్రీ బంధం ఉండేది, షిర్డీ సాయి షిర్డీ కి చేరకముందు 13 ఏళ్ళ వయసులోఫకీరు వేషం లో మాణిక్ ప్రభు దర్శనానికి వచ్చారు, ప్రభు సోదరుడు తాత్యా మహారాజ్ ద్రవ్యం ఎంత వేసినా కూడా బాబా చేతిలోని "లోటా" (డబ్బా ) నిండలేదు, సోదరుడిని మందలించి ప్రభు ఆ డబ్బాలో 5 ఖర్జూర కాయలు వేయగానే అది నిండిపోయింది, అప్పుడు బాబా తనకు ప్రభు ప్రసాదమైన అయిదు ఖర్జూర పండ్లు చాలునని వాటిని తీసుకొని లోటాను బోర్లించగా దాంట్లో ఉన్నదానికంటే ఎన్నో రెట్ల ద్రవ్యం కుప్పగా పడింది.



అక్కల్ కోట్ ప్రభు సమర్ధ కూడా మాణిక్ ప్రభు దర్శనానికి వచ్చి ఆధ్యాత్మిక చర్చలను రహస్యంగా జరిపేవారు, అక్కల్ మహారాజు తాముకూడా ఇక్కడే ఉంటామని అంటే "ఒక వృక్షం నీడన మరో వృక్షం పెరుగదు "అని చెప్పి అక్కల్ కోట్ లో స్థావరం ఏర్పాటు చేసుకోమని హితవు చెప్పారు,

## సర్వ మత సమాదరణం

"ఏకం సత్ విప్రా బహుధా వదంతి "అనే ఉపనిషత్ వాక్యం ఆధారంగా మాణిక్ ప్రభు హిందూ ముస్లిం సిఖ్ మొదలైన మతాలవారినీ సమాదరించి అందరిహృదయాలలోస్తిర స్థానం పొందారు, అన్నిమతాలవారు మాణిక్ ప్రభులో తమ ఇష్ట దైవాన్నిదర్శిన్చిఅనుభూతికి లోనయ్యేవారు,

## మహా సంస్థాన వారసులు




మాణిక్ ప్రభుఅనంతరం ఆయన సోదరుని కుమారుడు శ్రీ మనోహర మాణిక్ ప్రభు, తరువాత శ్రీ మార్తాండ మాణిక్ ప్రభుపీఠాధి పతులయ్యారు, ప్రభు సంప్రదాయాన్ని ఆ సేతు హిమాచల పర్యంతం వ్యాపింప జేశారు, పిమ్మట మార్తాండ మాణిక్ సోదరి కుమారుడు శ్రీ శంకర్ మాణిక్య ప్రభు, తర్వాత ఆయన పుత్రుడు శ్రీ సిద్ధ రాజ మాణిక్ ప్రభు పీఠాధిపతులయ్యారు, వీరంతా సంస్థానంద్వారా విద్య, ఆధ్యాత్మిక, సామాజిక సేవలు విస్తృతంగా చేశారు, సిద్ధరాజ్ 2009లో సిద్ధిపొందగా షష్టమ పీఠాధిపతిగాశ్రీ జ్ఞానరాజ్ మాణిక్ ప్రభు కొనసాగుతున్నారు, సంస్థానం సర్వతోముఖాభి వృద్ధి చెందుతోంది, జ్ఞానభాస్కరులైన వీరి తత్వ జ్ఞానానికి గుల్బర్గా యూని వర్సిటి డాక్టరేట్ బిరుదునిచ్చి సత్కరించింది,

## విశేష కార్యక్రమాలు



మా ణిక్య ప్రభు ప్రారంభించిన దాన విద్యాది దానాలు నిరంతరం అవిచ్చిన్నంగా కొనసాగుతున్నాయి, మార్తాండ మాణిక్, శంకర మాణిక్ ప్రభుల పుణ్య తిధుల రోజుఫాల్గుణ మాసం లో "వేదాంత సప్తాహం "అనే వేదాంత, సంగీత ఉత్సవం ప్రతి ఏడాది నిర్వహిస్తారు, మార్గ శిరమాసం లో వచ్చే మాణిక్ ప్రభు-దత్త జయంతిని పెద్ద ఎత్తున చేస్తారు, 5 రోజులు విశేష పూజ ఉంటుంది,, చివరి రెండు రోజులైన పౌర్ణమి పాడ్యమి, నాడు వేలాది మందిభక్తులు మాణిక్ ప్రభు సిద్ధి పొందిన సమాధిని దర్శించి పునీతులై, "భండారు ఖానా "లో అన్నప్రసాదం స్వీకరిస్తారు, దర్బార్ హాల్ లో కళాకారులుతమ విద్యను సేవా దృక్పధం తో ప్రదర్శిస్తారు,

## మాణిక్ ప్రభుసమాధి

మాణిక్ ప్రభు దివ్య సమాధి రధాకార మందిరం లో పాలరాతితో నిర్మించబడింది, ఆధ్యాత్మిక ప్రశాంతతకు చాలా తోడ్పడుతుంది,

## వసతి సౌకర్యాలు

భక్తుల, యాత్రికుల సౌకర్యం కోసం మార్తాండ విలాస్, మాణిక్ విహార్, శంకర కృప మొదలైన అతిథి గృహాలను సంస్థాన్ నిర్వహిస్తోంది, ప్రతి రోజు మధ్యాహ్నం ఒంటి గంటకు మహా ప్రసాదం అందజేస్తారు.

### మాణిక్ ప్రభు ద్విశత జయంతి



2017 మార్గ శిర శుద్ధ చతుర్దశి –దత్త జయంతికి శ్రీ మాణిక్య ప్రభు జన్మించి 200 సంవత్సరాలు అవుతున్నందున"ద్విశత జయంతి "ని భారీగా ఉత్సవాలు, వేదాంత, సంగీత సభలు నిర్వహిస్తున్నారు, అందరు తప్పక దర్శించి స్ఫూర్తి పొందాల్సిన క్షేత్రం శ్రీ మాణిక్య ప్రభు క్షేత్రం, "సంతత ధార-శివ లింగం "ను ఇక్కడ నెలకొల్పే ప్రయత్నాలు వేగవంతంగా జరుగుతున్నాయి,

### ప్రభు సంస్థాన్ కు దారేదీ ?



హైదరాబాద్ నుంచి బొంబాయి జాతీయ రహదా రిపై 160 కిలో మీటర్ల దూరం లో ఉన్న హుమ్నాబాద్ కు ఒక కిలో మీటరు దూరం లో మాణిక్ ప్రభు సంస్థాన్ ఉన్నది, బీదర్, గుల్బర్గా, సోలాపూర్ లనుంచి బస్ సౌకర్యం ఉంది. హైదరాబాద్ –ముంబాయ్ రైల్ మార్గం లో గుల్బర్గా స్టేషన్ లో దిగి, బస్ పై 65 కిలోమీటర్ల దూరం లో ఉన్న సంస్థాన్ కు చేరుకో వచ్చు,



## 89 ఇనుమును బంగారంగా మార్చే స్పర్శ లింగం గలగనాథ(కర్ణాటక)



"శ్రీవేంకటేశ గలగనాధకాదంబరి పితామహా "అని కీర్తించబడిన కవిసార్వభౌముడు శ్రీనాధుడు ఇక్కడే జీవితంలో ఎక్కువ కాలం గడిపాడు. ఇక్కడే అనేక రచనలు చేసి ప్రజలకు దగ్గరై, ప్రభువుల ప్రసన్నత పొందాడు. కర్ణాటక లో హవేరి జిల్లా లో గలగనాథ అనే చిన్నగ్రామంలో ఉన్న ఈ ఆలయాన్ని 11వ శతాబ్ది చాళుక్యరాజు నిర్మించాడు. తుంగభద్రానదీ తీరం లో ఉన్న ఈ ప్రాచీన క్షేత్రాన్ని గలగనాథ స్పర్శలింగ మహా క్షేత్రం అంటారు. ప్రపంచం లో ఏ శివాలయం లోని శివలింగానికీ లేని దివ్యశక్తులు ఇక్కడి స్పర్శలింగానికి ఉన్నాయి. ఇనుమును తీసుకొచ్చి ఈ లింగానికి తాకిస్తే బంగారంగా మారిపోతుంది. చూడటానికి తిరివిడి ఆకారం లో ఉన్న ఈ ఆలయాన్ని శిల్పులు శివ సిద్ధాంత పరంగా ఎన్నో విధాలుగా తీర్చి దిద్దారు. తుంగ భద్ర లో స్నానం, గలగలేశ్వర దర్శనం ముక్తి హేతువులని భక్తుల విశ్వాసం.

ఆలయ సభా మండపం అత్యంత విశాలమైనది కావటం తో అప్పటినుంచీ ఇప్పటిదాకా భక్తులు వెల్లువలాగా వస్తూనే ఉన్నారు. స్వామికి ఉన్న ఈ మహాత్మ్యాన్ని కాష్ చేసుకోవటానికి చుట్టు ప్రక్కల రాజులు, బయటి దేశపు రాజులు ఈ క్షేత్రం పై చాలా దాడులు చేశారు. ఆల్కెమీ అనే స్పర్శ శాస్త్ర సిద్ధాంతాన్ని ఈ లింగానికి అన్వయించారు. "ఫిలాసఫర్స్ స్టోన్"తో ఈ శివలింగాన్ని నిర్మించారని,అందుకే లింగానికి అతీత శక్తులేర్ప డి నాయని కొందరు భావిస్తారు.లింగానికున్న ప్రత్యేకతను కాపాడటానికి కొన్ని ఆయుర్వేద ఔషధాలు ఓషధుల లేపనాలు పూశారని అందుకే ఇప్పుడు అప్పటిలాగా ఇనుమును బంగారంగా మార్చే శక్తి కోల్పోయినదని చెబుతారు .

ఎందరెందరో మహాకవులు, సంగీత వేత్తలు ఈ స్వామి సన్నిధిలో రచనలు చేసి గానం చేసి స్వామి కృపకు పాత్రులలైనట్లు ఆలయ శిలాశాసనాలు తెలియ జేస్తున్నాయి. అందులో 32రాగాలలో దిట్ట అయిన ముఖారి బ్రహ్మయ్య అనే సంగీత విద్వాంసుని గురించి ప్రత్యేకంగా ఉన్నది. ఆలయం అంతా చాళుక్య శిల్పకళా జ్యోతి ప్రకాశమానంగా ఉంటుంది. గలగనాథ క్షేత్రం బెంగుళూరు నుంచి 360,హవేరికి 30కిలో మీటర్ల దూరం లో ఉంది

తెలంగాణా

## 90 గణపేశ్వరాలయం




ఖమ్మంజిల్లా కూసుమంచి మండల కేంద్రం కూసుమంచి గ్రామానికి ఉత్తరం వైపున ఊరికి సుమారు 2 కిలోమీటర్ల దూరంలో ఊరిబయటి పొలాల్లో ఈ దేవాలయం ఉంది. కాకతీయ, ముసునూరి కాలపు శివాలయాల వాస్తు పద్ధతికి నిలువెత్తు నిదర్శనంగా నిలచే రామప్పదేవాలయం వంటి నక్షత్రాకార పునాది ప్రణాళికతో అద్భుతంగా నిర్మించిన ప్రాచీన కట్టడం ఇది. ప్రాచీనతే కాకుండా నిర్మాణంలో సిమెంటు సున్నం వాడకుండా ఇంటర్ లాకింగ్ పద్ధతిని వాడటం లాంటి అదనపు ప్రత్యేకతలెన్నో ఈ దేవాలయ నిర్మాణంలో నేటికీ గమనించవచ్చు.

### చరిత్ర




దేశ రక్షణ కోసం తప్పనిసరిగా సైనా యుద్ధాలను చేయడం ఎందరో శత్రుసైనికుల ప్రాణాలను తీయడం రాజులకు తప్పనిసరి విధిగా వుండేది. అంతేకాకుండా న్యాయనిర్ణయంలోసైతం తెలిసీ తెలియక పొరపాట్లు చేసే అవకాశం వుండటంతో అటువంటి పాపపరిహారార్థం వెయ్యి శివాలయాలను కట్టిస్తానని కాకతీయ గణపతిదేవుడు మొక్కుకున్నాడట. ఈ కథనమే కాక మొదటి నుంచి కాకతీయులు జైనాన్ని వదిలి శైవంలోకి వచ్చిన తర్వాత శివాలయాల నిర్మాణం చేపడుతూ వచ్చారు. కాకతీయ ప్రతాపరుద్రుడి పాలన అంతమైన తరువాత డిల్లీ సుల్తానులు చాలా హిందు దేవాలయాలను కోటలను నాశనము గావించరు. కాకతీయుల వారసులు అయిన ముసునూరి వంశీయులు డిల్లీ సుల్తానులను ఓడించి మళ్లి ఎన్నో దేవాలయాలను కోటలను పునరుద్ధరించారు వాటిల్లో

ఈ ఆలయం ఒకటి. విలస, అన్నితల్లి, గురుజ దధితర ఎన్నో శాసనాలు వీరు చేసిన ప్రజాసేవ దేవాలయ నిర్మాణాల గురించి తెలుపుతాయి. దేవాలయం అంటే కేవలం ఆధ్యాత్మిక కేంద్రంగానే కాక ఊరుమ్మడి తత్త్వాన్ని పెంచే కేంద్రగానూ, సాంస్కృతిక కేంద్రం, బ్యాంకు, పాఠశాల, వైద్యాలయం, సలహాకేంద్రాలుగా అన్నిటికీ వాడుకునేందుకు ఊరుమ్మడి పవిత్ర ఆస్తిగా వీటి నిర్మాణం చేపట్టారు. ఆఖరుకు వరదలు వంటి పకృతి విపత్తులు సంభవించినప్పుడు తాత్కాలిక పునరావాస కేంద్రాలుగా ఈ దేవాలయాలు పనిచేసేవి. నిస్సహాయులకు పొట్టకూటికి సమకూర్చేవి. నేడు చెప్పుకుంటున్న చలి ఎండ లకు తట్టుకోలేని బడుగుల ఉపశమన కేంద్రాలుగా ఈ దేవాలయాలే పనిచేసేవి. రాజ్యపు ఖజానాను దాచుకునేందుకు, రహస్య విషయాలపై వేగులతో మంతనాలు చేసేందుకు కూట వీటిని వినియోగించేవారని చరిత్రకారులు పేర్కొంటున్నారు. మనుషులకే కాకుండా పక్షులు ఆహారం సంపాదించుకుటూ గూళ్ళు నిర్మించుకునేందుకు, చాలా రకాల చిన్న జంతువులు బ్రతికేందుకు ఇవి కేంద్రాలుగా వుండేవి. అదే పద్ధతితో కాకతీయులు రాజ్య అవసరాల కోసం, ఆధ్యాత్మిక ప్రశాంతత కోసం నిర్మించిన ఆలయాలలో ఒకానొక పురాతన చారిత్రక ఆధారమే ఈ కూసుమంచి గణపేశ్వరాలయం.



గర్భాలయం 12 అడుగుల ఎత్తు, 6.3 కైవారంతో ఏకశిలారూపంగా శివలింగం, కింద మూడు అడుగుల విస్తీర్ణంతో పానవట్టం నిర్మించబడింది. ఈ శివలింగం ఎత్తులో యావత్తు ఆసియాఖండంలోనే మూడవ స్థానంలో ఉంది.[1]

### ఇలా వెలుగులోకి వచ్చింది

కూసుమంచి గణపేశ్వరాలయం ఆవరణకు దగ్గరలో వున్న వీరగల్లులు



కాకతీయ, ముసునూరి కాలంలో ఒక వెలుగు వెలిగిన శివాలయాలు తదనంతర కాలంలో అవసాన దశకు వచ్చాయి. ధంసావంటి దాడుల వల్లనో గ్రామాలకు గ్రామాలు తరలి వెళ్ళటం వల్లనో ఈ ప్రసిద్ధ ఆలయం ఊరికి దూరమై పిచ్చిమొక్కల మధ్య మిగిలిపోయింది.అలా ఎన్నోళ్ళు మిగిలిపోయిందో. 2001 ప్రాంతంలో కూసుమంచి రక్షకభట నిలయంలో వృత్తలాధికారిగా పనిచేస్తున్న శ్రీ సాధు వీరప్రతాప్ గారి చొరవతో దేవాలయంలో మళ్ళీ దీపం వెలిగింది. గ్రామస్తుల సహకారంతో నిధులను సమకూర్చుకుని ఆలయాన్ని వెలుగులోకి తీసుకువచ్చారు. 2015 కట్టా శ్రీనివాస రావు దేవాలయం వివరాలను తెలియజేస్తూ చరిత్రకందని శైవక్షేత్రం కూసుమంచి గణపేశ్వరాలయం పేరుతో ఒక పుస్తకాన్ని వెలువరించారు. తెలంగాణా ఏర్పాటు తర్వాత చారిత్రక ప్రాముఖ్యత వున్న ఆలయాలకు నిధుల కేటాయింపులు పెరగటం దానితో పాటు వివిధ ప్రసార ప్రచార సాధనాలలో ఆలయం ప్రశస్తి నలుదిశలా వ్యాపించింది. 13 ఆర్థిక సంఘం నిధులతో ఈ ఆలయానికి ఉపాలయమైన ముక్కంటేశ్వరాలయాన్ని పునర్నిర్మాణం చేస్తున్న సందర్భంగా ఒక అమూల్యమైన శిలాశాసనం లభించింది. దీనివల్ల ఈ దేవాలయాల నిర్మాణానికి సంబంధించి ఎన్నో విలువైన సంగతులు మరింతగా వెలుగులోకి వచ్చాయి. ఆలయప్రాచీనతపై ఆధారపూర్వకమైన విశిష్టత స్వంతం అయ్యింది.

## ఆలయ శిల్పరీతి

ఈ ఆలయ శిల్పరీత ప్రాచీనమైనదే కాక అత్యంత విశిష్టమైనది కూడా ఆలయ నిర్మాణ సందర్భంలో సిమ్మెంటు సున్నం వంటి పదార్థాలతో రాళ్లను అతికించడం కాకుండా అనుసంధానం (ఇంటర్ లాకింగ్) విధానంలో పెద్దపెద్దరాళ్ళకు గాడులూ, కూసాలు పద్ధతిలో బిగింపు చేయడం ద్వారా నిర్మించారు.

## కాకతీయుల ట్రిపుల్ టి పద్ధతి

కాకతీయులు అత్యంత ఎక్కువగా అనుసరించిన ట్రిపుల్ టి అంటే టౌన్ (నగరం), టెంపుల్ (దేవాలయం) ట్యాంక్ (నీటివసతి) అనే పద్ధతి ఇక్కడ ప్రముఖంగా కనిపిస్తుంది. ఆలయానికి ఈశాన్య దిశలో గంగాదేవి చెరువు వుంటుంది. ఇది చుట్టుపక్కల పొలాలను సస్యశ్యామలం చేస్తూ ఊరికి అన్నాన్ని అందించేందుకు అనుకూలంగా వుంటుంది.

## ఉపాలయాలు

### త్రికూటాలయం



ఈ ఆవరణలో ప్రధానమైన గణపేవ్వరాలయమే కాక త్రికూటాలయ పద్ధతిలో నిర్మించిన మరోగుడి ఉత్తరదిశకు తిరిగి వుంటుంది. త్రికూటమూ అంటే మూడు గర్భగుడులు ఒకదానితో ఒకటి అనుసంధానం చేసి నిర్మించిన గుడి అని అర్ధం. దీనిలోని మూడు గర్భాలయాలలోనూ శివలింగాలే నిర్మించారు. ఈ మూడు శివలింగాలతో కలిసిన మొత్తం గుడి ప్రధాన ఆలయం వైపుగా తిరిగి వుంటుంది.

ఖమ్మం హైదరాబాదు రహదారిపై ఖమ్మం నుంచి 20 కిలోమీటర్ల దూరంలో ఈ ఊరు ఉంది. సూర్యాపేట నుంచి ఖమ్మం వైపుకి 40 కిలోమీటర్ల రావలసి వుంటుంది. హైదరాబాదు నుంచి 170 కిలోమీటర్లు, వరంగల్ నుంచి ఖమ్మం మీదుగా 130 కిలో మీటర్లు, విజయవాడనుంచి 126 కిలోమీటర్ల దూరంలోనూ వుంటుంది. భక్తరామదాసుకు పుట్టినిల్లు, ఒకప్పటి అత్యంత పురాతన నగరం, పురాతన వ్యాపార కేంద్రం, అనేక ప్రాచీన రాజ్యాలకు రాజధానిగా వ్యవహరించిన ప్రదేశం అయిన నేలకొండపల్లికి కేవలం 20 కిలోమీటర్ల దూరంలోనూ వుంటుంది. చాళుక్యవంశంలోని ఒకశాఖకు పేరునిచ్చిన ప్రాచీన రాజధాని నగరం ముదిగొండకు కూడా కేవలం 20 కిలోమీటర్ల దూరంలో ఈ కూసుమంచి ప్రాంతం వుంటుంది.

### ఉత్సవాలు - వేడుకలు

ప్రతి సంవత్సరం మహాశివరాత్రి రోజున పార్వతి, పరమేశ్వరుల కళ్యాణం జరుగుతంది. ఈ ఉత్సవానికి 50వేల నుంచి 60వేల మంది భక్తులు వస్తారు.

# 91 స్వయంభూ శంభులింగేశ్వర స్వామి దేవాలయం వరంగల్




వరంగల్ కోటలోని మహత్తర కట్టడాలలో స్వయంభూదేవాలయం ఒకటి. క్రీ.శ. 1162లో గణపతిదేవ చక్రవర్తి ఈ ఆలయాన్ని నిర్మించారు. భూభాగం నుంచి పుష్పాకారం, పైకప్పు నక్షత్ర ఆకారం పోలినట్లు రాతితో నిర్మించబడింది ఈ ఆలయం. గర్భగుడిలోని శివలింగం ఇతర దేవాలయాల్లోని శివలింగాల కన్న భిన్నంగా ఉంటుంది. ఖండములై పడివున్న చతుర్ముఖలింగము ఈ ఆలయములో మూలవిరాట్. ఇది భూమికి అతితక్కువ ఎత్తులో ఉండి పాణమట్టం గుడ్రంగా ఉంటుంది. దక్షణ ద్వారం వద్ద గల వీరభద్రస్వామి విగ్రహం ఆకర్షణగా నిలుస్తుంది. ఆలయంలో ఓ పక్క శ్రీ సీతారామలక్ష్మణ, ఆంజనేయ స్వామి విగ్రహాలు దర్శనమిస్తాయి. ఏటా శివరాత్రి మహోత్సవం సందర్భంగా నగరం నలుమూలల నుంచే కాక ఇతర ప్రాంతాల నుంచి భక్తులు అశేషంగా తరలివచ్చి ప్రత్యేక పూజులు నిర్వహిస్తారు. ప్రతి సోమవారం రుద్రాభిషేకం, అర్చనలు, కర్పూరహరతులు జరుగుతాయి. శ్రీ రామనవమి రోజు సీతారాముల కల్యాణం కూడా అంగరంగ వైభవంగా నిర్వహింపబడుతుంది.

## 92 మల్లన్న స్వామి దేవాలయం ఐనవోలు

తెలంగాణ రాష్ట్రం, వరంగల్ పట్టణ జిల్లా జిల్లా, ఐనవోలు మండలం, ఐనవోలు గ్రామంలో ఉంది.



పశ్చిమ చాళుక్య చక్రవర్తి, త్రిభువన మల్ల బిరుదాంకితుడైన ఆరవ విక్రమాదిత్యు ( క్రీ. శ. 1076-1127 ) ని మంత్రి అయిన అయ్యనదేవుడు ఈ ఆలయాన్ని కట్టించాడని అంటారు. అందుకే ఆయన పేరిట అయ్యన-ప్రోలుగా పిలువబడి కాలాంతరంలో అయినవోలు, ఐనవోలుగా పిలువబడుతున్నది. సువిశాల రాతి ప్రాంగణంలో అష్టభుజాకృతిలో 108 స్తంభాలతో నిర్మింపబడ్డ ఈ ఆలయం చాళుక్య నిర్మాణ శైలిలో కనువిందు చేస్తుంది. ఇది చాళుక్యుల నిర్మాణం అనడానికి గుర్తుగా గర్భాలయం చుట్టూ అంతర్గత ప్రదక్షిణా మార్గం ఉంది.

ఇటువంటి నిర్మాణం, చాళుక్య కాలానికే చెంది న వరంగల్లు భద్రకాళి దేవాలయంలో కనిపిస్తుంది. ఈ ఆలయానికి తూర్పు, దక్షిణ భాగాల్లో కాకతీయ కీర్తితోరణాలు ఉన్నాయి. తన తండ్రిని చంపిన దోష పరిహారార్థమై కాకతీయ రుద్రదేవుడు వీటిని నిర్మింపజేశాడు. ముందుభాగంలో సువిశాలమైన రంగ మండపం ఉంది. పూర్వకాలంలో దీనిలో దేవదాసీలు ప్రాత:కాల నృత్యం చేసేవారు. ఆలయంలో మల్లన్న (మల్లికార్జున స్వామి) యొక్క భీకరమైన విగ్రహం నాలుగు చేతులలో, ఖడ్గం, ఢమరుకం, పాన పాత్ర ధరించి కనిపిస్తుంది. ఆయనకు ఇరుప్రక్కలా భార్యలు గొల్ల కేతమ్మ, బలిజ మేడలమ్మల విగ్రహాలుంటాయి. వీటి ముందు భాగంలో అర్థ పానవట్టం పై శ్వేత శివలింగం ఉంటుంది. ఈ స్వామిని మైలారు దేవుడు, ఖండేల రాయుడు అని కూడా పిలుస్తారు.



## బ్రహ్మోత్సవాలు

స్వామివారి వార్షిక బ్రహ్మోత్సవాలు ప్రతియేటా మహాశివరాత్రి పర్వదినం సందర్భంగా జరుగుతాయి. ఇవి పాంచాహ్నిక దీక్షతో, అయిదు రోజులపాటు వరుసగా అశ్వవాహనం, నందివాహనం, పర్వతవాహనం, రావణవాహనాలను అధిరోహించి చివరిరోజున రథారూఢుడై పురవీధి సేవకు బయలుదేరుతాడు. అయిదవరోజున ప్రాతఃకాలంలో అగ్నిగుండాల కార్యక్రమం అనంతరం వసంతోత్సవాన్ని ఎంతో వైభవంగా నిర్వహించి, శ్రీ పుష్పయాగం కార్యక్రమంతో



ఉత్సవాలను ముగిస్తారు. ప్రతీ మాసశివరాత్రి రోజున మహాన్యాసపూర్వకరుద్రాభిశేకం, శాంతికల్యాణం, రుద్రహోమం జరుగుతాయి.

ప్రధానంగా మల్లన్న యాదవుల, కురుమల ఇష్టదైవం. ఇది ప్రముఖమైన జానపదుల జాతర. సంక్రాంతి పర్వదినం నుండి ఉగాది వరకు ప్రతి ఆది, బుధవారాల్లో జరుగుతుంది. 'బోనం' అనే ప్రత్యేక వంటకాన్ని కొత్త కుండలో వండి స్వామివారికి నివేదిస్తారు. అనంతరం 'ఒగ్గు పూజారులు 'గా వ్యవహరింపబడే కురుమ పూజారులు, ఢమరుకాన్ని వాయిస్తూ, నేలపై రంగురంగుల ముగ్గులనువేసి, జానపద బాణీలో స్వామివారి కథాగానాన్ని చేస్తారు. దీన్ని పట్నం వేయడం అంటారు. ఇది భక్తులు వారి శైలిలో నిర్వహించే స్వామివారి కళ్యాణం. ప్రతీ మాసశివరాత్రి రోజున నజరుపట్నం, మహాశివరాత్రి రోజున పెద్దపట్నం కార్యక్రమాలను ఒగ్గు పూజారీలు నిర్వహిస్తారు.

## 93 మల్లన్న స్వామి దేవాలయం కొమురవెల్లి




కొమురవెల్లి మల్లన్న స్వామి దేవాలయం (కొమరవెల్లి శ్రీ మల్లికార్జున స్వామి దేవాలయం) తెలంగాణ రాష్ట్రంలోని సిద్ధిపేట నుండి సికిందరాబాదుకు వెళ్ళే మార్గంలో సిద్ధిపేటకు 24 కి.మీ. ల దూరంలో ఉంది.

పూర్వం ఇక్కడ కుమారస్వామి కొంతకాలం తపస్సు చేశాడని, అందుకే ఈ ప్రాంతానికి కుమారవెల్లి అనే పేరువచ్చి, కాలక్రమేణా కొమరవెల్లి అయిందంటారు. పరమ శివుడు ఇక్కడి తన భక్తులను కాపాడటానికి వీరశైవమతారాధకులైన మాదిరాజు, మాదమ్మ అనే దంపతులకు కుమారుడై జన్మించి తన మహిమలతో భక్తులను కాపాడాడని క్షేత్ర పురాణం. తర్వాతకూడా తన భక్తుల రక్షణార్ధం ఇక్కడే కొలువుతీరాడు. భక్తులచేత ఆప్యాయంగా కొమరవెల్లి మల్లన్నగా పిలువబడే ఈ మల్లికార్జునస్వామి ఇక్కడ శివునికి సాధారణ ప్రతి రూపమైన లింగ రూపంలోకాక, గంభీర ఆకారంలో నిలువెత్తు విగ్రహంగా దర్శనమిస్తాడు. దేవేరులు యాదవ కులానికి చెందిన గొల్ల కేతమ్మ, లింగ బలిజకులానికి చెందిన మేడలమ్మ స్వామికి ఇరుపైపులా దర్శనమిస్తారు. మట్టితో చేసిన ఈ విగ్రహం సుమారు 500 సంవత్సరాల క్రితం చెయ్యబడ్డది. కాలక్రమేణా

భక్తుల రాక మొదలయ్యి, రాను రాను అధికం కావంటంతో దేవాలయంలో వున్న మండపములు విస్తరించబడ్డాయి. సత్రాలు, నూతన కట్టడాలు నెలకొల్పబడ్డాయి.

ఇక్కడ జాతర జనవరి నెలలో మకర సంక్రాంతి రోజున ప్రారంభమై ఉగాది వరకు ప్రతి ఆది-బుధ వారాలలో జరుగుతుంది. సంక్రాంతి పండుగకు ముందు కళ్యాణోత్సవం జరుగుతుంది పండుగ తరువాత వచ్చే మొదటి ఆదివారం రోజున జంటనగరాల నుండి లక్షల సంఖ్యలో యాత్రికులు వచ్చి మొక్కుబడులు చెల్లిస్తారు. వీటిని లష్కర్ బోనాలుగా పిలుస్తారు. ఎక్కువగా యాదవ భక్తులు సందర్శించే ఈ జాతరలో బోనం, పట్నం అనే విశేషమైన మొక్కుబడులుంటాయి. బోనం అంటే, అలంకరించిన కొత్త కుండలో నైవేద్యం (అన్నం) వండి స్వామివారికి



నివేదిస్తారు. ఆ పక్కనే రంగు రంగుల ముగ్గులతో అలంకరించిన ప్రదేశంలో బోనాన్ని ఉంచి స్వామివారిని కీర్తిస్తూ ఆ నైవేద్యాన్ని సమర్పిస్తారు. ఒక విధంగా ఇది స్వామి కళ్యాణమే. ఢమరుకం (జగ్గు) వాయిస్తూ, జానపద శైలిలో వారి సంప్రదాయబద్ధమైన పాటలు పాడుతూ ఈ కార్యక్రమాన్ని నిర్వహించే వారిని ఒగ్గు పూజారులుగా పిలుస్తారు. వీరు పసుపుపచ్చని అంగీలు ధరించి, చేతిలో ముగ్గుపలక, ఢమరుకం (జగ్గు) జాతర ప్రాంగణంలో కనువిందు చేస్తారు.జాతర చివరలో కామదహనం (హోళీ) పండుగకు ముందు పెద్ద పట్నం అనే కార్యక్రమాన్ని నిర్వహిస్తారు.వందల సంఖ్యలో ఒగ్గు పూజారులు, విశాలమైన ముగ్గులను వేసి వాటి మధ్యన స్వామిని ఆవాహన చేసి సామూహికంగా జగ్గులు వాయిస్తూ దేవుణ్ణి కీర్తిస్తారు. వీర శైవ (బలిజ) పూజారులు, వీరభద్రుణ్ణి, భద్రకాళిని పూజించి, సాంప్రదాయబద్ధమైన పూజలు జరిపి, రాత్రివేళ చతురస్రంగా ఏర్పరిచిన స్థలంలో టన్నులకొద్దీ కర్రలను పేర్చి, మంత్రబద్ధంగా అగ్ని ప్రతిష్ఠ చేస్తారు. తెల్లవారు జాములో ఆ కర్రలన్నీ చంద్రనిప్పులుగా మారుతాయి.వాటిని విశాలంగా నేర్చి, కణ కణ మండే నిప్పుల

మధ్యనుండి మూడు సార్లు స్వామివారి ఉత్సవ విగ్రహాలతో దాటి వెళ్ళుతారు. వందల సంఖ్యలో భక్తులు కూడా దాటుతారు. దీనిని అగ్నిగుండాలు అని పిలుస్తారు.



మల్లికార్జునస్వామి ఆలయం ప్రాంగణంలో శ్రీ రేణుకాచార్య ఉపాలయం వున్నది. శ్రీ రేణుకాచార్య వీరశైవ మత స్థాపకులు, ప్రచారకులు. ఈ ఆలయానికి 20కి.మీ. ల దూరంలో గ్రామ దేవత కొండ పోచమ్మ ఆలయం వుంది. ఈవిడ మల్లికార్జున స్వామి అక్కగా చెప్తారు. స్వామిని జాతర సమయంలో దర్శించి, ఆదివారం బోనాలు సమర్పించిన భక్తులు కొండ పోచమ్మ ఆలయానికి చేరుకుని, ఈ తల్లిని కొలిచి, మంగళవారంనాడు బోనాలు సమర్పిస్తారు. ఈ ఆలయం చిన్నదే అయినా, అమ్మవారు తనని నమ్మినవారిని చల్లగా కాచే అమిత శక్తి స్వరూపిణి. దేవస్థానంవారు భక్తుల సౌకర్యార్థం వివిధ సేవలకోసం ఆన్ లైన్ లో రిజర్వు చేసుకునే సౌకర్యం కల్పించారు. మార్గము: వరంగల్ కి 110 కి.మీ., సిద్ధిపేటకి 22 కి.మీ, హైదరాబాదునుంచి 90 కి.మీ. ల దూరంలో వున్నది కొమరవెల్లిలోని ఈ ఆలయం. కొమరవెల్లి గ్రామం వరంగల్ జిల్లా, చేర్యాల మండలంలో వున్నది. సికిందరాబాదు, వరంగల్, హనుమకొండ, సిద్ధిపేట, వేములవాడనుంచి బస్ సౌకర్యం వున్నది. హైదరాబాదు నుంచి కరీంనగర్ వెళ్ళే రాజీవ్ రహదారిలో, హైదరాబాదునుంచి షుమారు 90 కి.మీ. లు వెళ్ళాక కుడి వైపు కమాను కనబడుతుంది. దాన్లోంచి 4 కి.మీ. లు వెళ్తే కొమరవెల్లిలో కొండపై గుహలో కొలువైన శ్రీ మల్లికార్జునుని చేరుకోవచ్చు.

మరికొన్ని.. దేవాలయాలు

శ్రీ జడల రామలింగేశ్వర స్వామి ఆలయం **పరశురాముడు ప్రతిష్టించిన చిట్టచివరి శివలింగం!!**



నల్గొండ జిల్లాలో అతిపురాతనమైన ఆలయాల్లో ఒకటిగా పేరుగాంచిన ఆలయం చెర్వుగట్టు జడల రామలింగేశ్వరస్వామి వారి ఆలయం. పరశురాముడు ఈ శివలింగాన్ని ప్రతిష్టించినట్లు ప్రతీతి. క్షత్రియ సంహారానంతరం, తన పాప ప్రక్షాళన కోసం పరశురాముడు 108 శివలింగాలను ప్రతిష్టించాడనీ, ఆయన ప్రతిష్టించిన 108 శివలింగాలలో చివరి లింగం జడల రామలింగేశ్వర స్వామిదని స్థలపురాణం.

నల్గొండ జిల్లా నార్కట్ మండల కేంద్రానికి ఆరు కిలో మీటర్ల దూరంలో ఎల్లారెడ్డి గూడెం అనే అందమైన గ్రామంలో ఈ ఆలయం వెలసింది. ఆ గ్రామానికి తూర్పు వైపున ఒక చెరువు, ఆ చెరువు గట్టున పార్వతీ సమేత మల్లికార్జునస్వామి దేవాలయం ఉంది. ఆ దేవాలయానికి పశ్చిమాన గల కొండపై శ్రీ జడల రామలింగేశ్వర స్వామి ఆలయం భక్తులను విశేషంగా ఆకర్షిస్తోంది. ఈ క్షేత్రం నల్గొండకు 14 కిలో మీటర్ల దూరంలో, అద్దంకి నార్కట్ పల్లి ప్రధాన రహదారికి ఒక కిలో మీటరు దూరంలో ఉంది. ఇక్కడి శివలింగంపై జడల మాదిరిగా రేఖలు ఉండటం వలన. .. ఈ శివలింగాన్ని పరశురాముడు ప్రతిష్ఠించడం వలన. .. కొండ దిగువున పార్వతీదేవి కొలువైవున్న కారణంగా ఈ స్వామిని పార్వతీ జడల రామలింగేశ్వరుడిగా పిలుస్తూ వుంటారు.



నా టి నుంచి నేటి వరకూ ఒక సర్పం స్వామివారికి ప్రదక్షిణలు చేసి వెళుతుండటం ఇక్కడి విశేషం. కొండ పై

భాగాన 'మూడు గుండ్లు'గా పిలవబడే రాతి బండల మధ్యలోని మరొక శివలింగాన్ని కూడా భక్తులు దర్శించుకుంటూ వుంటారు. ఈ క్షేత్రానికి హనుమంతుడు క్షేత్ర పాలకుడిగా వ్యవహరిస్తుంటాడు. ప్రతియేటా ఈ స్వామిచెంత మండల దీక్ష తీసుకునే వారి సంఖ్య ఎక్కువగా వుంటుంది.



ఇక భూత ప్రేత పిశాచ బాధలతో సతమతమైపోతోన్న వారికి స్వామివారి పాదుకలను తాకించడం ఆనవాయతీగా వస్తోంది. ఏడాదికి ఒకసారి జరిగే గ్రామోత్సవంలో పాల్గొనడానికి వివిధ ప్రాంతాల నుంచి భక్తులు వేల సంఖ్యలో ఇక్కడికి చేరుకుంటారు. స్వామివారిని దర్శించి కృతజ్ఞతలు చెప్పుకుని మొక్కుబడులు చెల్లించుకుంటారు. ఇక్కడి స్వామివారిని దర్శించుకోవడం వలన మానసిక పరమైన .. శారీరక పరమైన వ్యాధులు తొలగి పోతాయని భక్తులు విశ్వసిస్తుంటారు. స్థలపురాణం: పూర్వం హైహయ వంశ మూలపురుషుడు, కార్త వీర్జార్జున చక్రవర్తి సపరివారంగా వేటకోసం దండకారణ్యానికి బయలుదేరాడు. అవిశ్రాంతంగా వేటాడిన పిదప బడలికకు గురైన చక్రవర్తి, సపరివారంగా సమీపంలోని జమదగ్ని ఆశ్రమానికి వెళ్ళాడు. అప్పుడు జమదగ్ని మహర్షి తన దగ్గరున్న ధేనువు సాయంతో క్షణాలలో వేలాది సంఖ్యలలో ఉన్న రాజ పరివారానికి షడ్రసోపేతమైన విందు భోజనాన్ని ఏర్పాటు చేసాడు. ఆ ధేనువు మహత్తును మహర్షి దగ్గర అడిగి తెలుసుకున్న కార్తవీర్యార్జునుడు తనకు ఆ ధేనువు కావాలని అడుగుతాడు.

అందుకు మహర్షి తిరస్కరించడంతో కుపితుడైన కార్తవీర్యార్జునుడు, జమదగ్నిని సంహరించి ధేనువును తీసుకుని వెళతాడు. ఆ సమయంలో పరశురాముడు బయటకు వెళ్లి, తిరిగి పరశువుతో (దొడ్డలి) కార్త వీర్యార్జుని సంహరించి, ఇరవై ఒక్కసార్లు భూ ప్రదక్షిణం చేసి క్షత్రియ సంహారం చేస్తాడు.

క్షత్రియ వధానంతరం, తాను చేసిన పాప పరిహారార్థం దేశం నలుమూలలా 108 శివలింగాలను ప్రతిష్టించి, ఒక్కొక్క లింగం చెంత వేలాది సంవత్సరాలు తపస్సు చేసి, ఆ తపోఫలాన్ని, ఆ క్షేత్రానికి ధారపోసి, మానవ కళ్యాణానికి పాటుబడ్డాడు. అలా ప్రతిష్టించిన శివలింగాలలో చిట్టచివరిదైన 108వ శివలింగం ఈ చెర్వుగట్టు క్షేత్రంలోని జడల రామలింగేశ్వరుడు.



ఈ ప్రదేశంలో పరశురాముడు శివుని వేడుతూ.. ఎంతకాలం తపస్సు చేసినప్పటికీ శివుడు ప్రత్యక్షం కాకపోవడంతో, కోపగించుకున్న పరశురాముడు తన గడ్డలితో శివలింగం ఊర్ధ్వభాగంపై ఒక దెబ్బ వేశాడు. అప్పుడు శివుడు ప్రత్యక్షమై, ఇంత కాలం నువ్వు తపస్సు చేసిన ప్రాంతం, ప్రముఖ శైవ త్రేక్రంగా వెలుగొందుతుందని, కలియుగాంతం వరకు తానిక్కడే ఉండి భక్తులకు అనుగ్రహిస్తుంటానని చెప్పాడు.

అనంతరం పరశురాముడు కూడ ఇక్కడే లింగాకృతిని పొంది శివసాయుజ్యాన్ని పొందాడట. పరశురాముని ఆత్మలింగము జడల రామలింగేశ్వరాలయానికి దరిదాపుల్లో వేరొక గుహలో ఉంది. రామలింగేశ్వరుని ఊర్ధ్వభాగాన పరశురాముడు గండ్ర గొడ్డలితో దెబ్బవేసిన చోట జడల వంటి నిర్మాణాలు ఉన్నాయి.

అందుకనే స్వామిని జడలరామలింగేశ్వర స్వామి అని అంటారు. కొండపై గుహలోగల జడల రామలింగేశ్వరునికి 12వ శతాబ్దానికి చెందిన కాకతీయ గణపతిదేవ చక్రవర్తి గుహాలయాన్ని నిర్మించాడు. ఈ ఆలయంలో తొలి ఏకాదశినాడు, కార్తీక సోమవారాల్లో, పౌర్ణమి, మహాశివరాత్రి పర్వదినాలలో కడువైభవంగా ఉత్సవాలు జరుగుతుంటాయి.

## స్వయంభూ శంభు లింగేశ్వర స్వామి, రాష్ట్రంలో దక్షిణకాశీగా విరాజిల్లుతున్న ఆలయాల్లో మేళ్లచెరువు శివాలయం

సూర్యాపేట జిల్లా కేంద్రం నుంచి 68 కిలోమీటర్ల దూరంలో ఉంది ఇష్ట కామేశ్వరీ సమేత శంభులింగేశ్వర స్వామి ఆలయం.. మేళ్ళ చెరువు... హుజూర్ నగర్ కు 10 కి. మీ దూరం లో ఉన్న ప్రాచీన గ్రామము.

ఇక్కడ వెలసిన స్వయంభూ లింగము ఇష్ట కామేశ్వరీ సమేత స్వయంభూ శంభులింగేశ్వరుడు గా పూజలందుకుంటున్నాడు. ఒక్కొక్క ప్రాంతం చేసుకున్న పుణ్యం ఒక్కొక్కరూపం గా ప్రతిఫలిస్తూ ఉంటుంది కదా..

తలమీద గంగమ్మతో అర్ధనారీశ్వర రూపంతో స్వయంభూగా ఆ జంగమయ్య వెలసిన క్షేత్రం నల్గొండ జిల్లా మేళ్లచెరువు. పుష్కరకాలానికి అంగుళం చొప్పున శివలింగం వృద్ధి చెందడం, లింగం శిరస్సు భాగం నుంచి జలం రావడం, శివరాత్రి సందర్భంగా అయిదురోజులపాటు ఉత్సవాలు నిర్వహించడం... ఇలా ఎన్నో ప్రత్యేకతలకు నెలవు ఈ ఆలయం. దేవదేవుడు ఇక్కడ శంభులింగేశ్వరుడిగా భక్తసులభుడిగా పూజలందుకుంటున్నాడు..



లింగానికి పానుమట్టాన్ని పైనుంచి తొడిగారు. పెరుగుతున్న లింగ బాగాన్ని క్రిందివైపున ఉంచి, పానుమట్టాన్ని తొడిగి, దీనిక రాతి పలకలను పూటీగా పెట్టారు. దీన్ని అర్ధ నారీశ్వర లింగం గా భక్తులు కొలుస్తారు. ఎందుకంటే లింగం రెండు భాగాలుగా ఉంటుంది, స్వామి వారికి వెనుక వైపు మూడుపాయలు గా జడ ఉంటుంది. గంగ ఉన్న వెనుక భాగం లోనే ఉంటుంది. అందుకే అభిషేకానంతరం చేసే విభూతిచర్చ, చందన చర్చలను వెనుక భాగానికి తగలకుండా జాగ్రత్త పడటం అభి షేక సమయం లో మనం గమనించవచ్చు.



పంచభూతాలతో కలిసి ఉండే శివలింగాలు చాలా అరుదుగా ఉంటాయి. అందులో ఒకటి మేళ్లచెరువులోని ఇష్టకామేశ్వరీ సమేత శంభులింగేశ్వరస్వామి ఆలయం. పన్నెండో శతాబ్దంలోనే ఆలయ నిర్మాణానికి పునాది పడిందని స్థలపురాణం తెలియజేస్తోంది. పూర్వం ఈ ప్రాంతమంతా దట్టమైన అడవులతో ఉండేది. ఈ చుట్టుపక్కల గ్రామాలకు చెందిన పశువుల కాపరులు తమ ఆవులను ఇక్కడికే మేతకు తీసుకు వచ్చేవారు. వాటిని ఒకచోట కట్టి ఉంచేందుకు ఒక కొట్టాన్ని ఏర్పాటు చేసుకున్నారు. ఆ మందలోని ఒక ఆవు రోజూ కొట్టంలోని గుండ్రాయిమీద పాలు అభిషేకిస్తూ ఉండటాన్ని గమనించిన కాపలాదారుడు పల్లెపెద్దలకు తెలియజేయాలని బయలుదేరతాడు. ఆ రోజు రాత్రే పరమశివుడు పల్లెపెద్దలు గంగబోయిన మంగన్న, బోయన్నలకు స్వప్నంలో సాక్షాత్కరిస్తాడు. తాను పరమశివుడిననీ కొట్టంలో గుండ్రాయి రూపంలో కొలువై ఉన్నాననీ చెప్పి, తనకు ఆలయాన్ని నిర్మించమని ఆజ్ఞాపిస్తాడు. శివుడి ఆనతిమీద వారు వారి తాహతుకు తగ్గట్లుగా ఒక చిన్న ఆలయాన్ని నిర్మించారు. కాకతీయ రాజైన ప్రతాపరుద్రుడు ఈ ఆలయాన్ని అభివృద్ధి చేశాడని ఆలయగోడలమీద ఉన్న శాసనాల ద్వారా తెలుస్తోంది. పూర్వకాలంలో ఈ

ప్రాంతంలో పెద్ద చెరువూ దాని అంచువెంబడి మేడి చెట్లు ఎక్కువగా ఉండేవట. అందుకే ఈ ప్రాంతాన్ని మేడి చెరువుగా పిలిచేవారు. కాలక్రమంలో అది మేళ్ల చెరువుగా స్థిరపడిపోయింది.

శివలింగం శిరస్సు భాగంలో మూడు వేళ్లు పట్టేంత రంధ్రం ఉంది. దీన్నే గంగమ్మ స్థానమంటారు. ఇక్కడినుంచి గంగాజలం ఊరుతూ ఉంటుంది. ఈ జలం ప్రవహించదు కానీ తీస్తున్న కొద్దీ ఊరుతూ ఉంటుందట. ఇక్కడికి వచ్చే భక్తులకు ఈ జలాన్నే తీర్థప్రసాదంగా అందజేస్తారు అర్చకులు. ప్రతి సోమవారం స్వామివారికి ప్రత్యేక అభిషేకానంతరం విశిష్ట పుష్పాలంకరణ చేస్తారు.

రాష్ట్రంలో దక్షిణకాశీగా విరాజిల్లుతున్న ఆలయాల్లో మేళ్లచెరువు శివాలయం ముఖ్యమైంది.

ఇక్కడ ఏటా మహా శివరాత్రి వేడుకలను ఘనంగా నిర్వహిస్తారు. అయిదురోజులపాటు జరిగే ఈ ఉత్సవాలలో ఈ ప్రాంతమంతా జనసంద్రంగా మారిపోతుంది. శివరాత్రి రోజున ప్రత్యేక పూజలూ, లింగోద్భవకాల అభిషేకాలూ, శివకల్యాణోత్సవాలను ఇక్కడ వైభవోపేతంగా జరుపుతారు. చివరి రోజున పవళింపుసేవను కన్నులపండగగా నిర్వహిస్తారు.



జాతరలో రెండురోజుల పాటు ఎత్తయిన ప్రభలను నిర్మిస్తారు. ఈ ప్రభలను విద్యుద్దీపాలతో నింగిలోని నక్షత్రాలు ప్రభలమీద పడ్డాయా అన్నట్టుగా అలంకరిస్తారు. వీటిని చూడటానికి లక్షల సంఖ్యలో భక్తులు ఇక్కడికి చేరుకుంటారు. ఈ అయిదు రోజులూ పురాణ ప్రవచనాలతో, భాగవతోపన్యాసాలతో ఆలయ ప్రాంగణం మారుమోగుతూ ఉంటుంది. రాష్ట్రస్థాయిలో ఎడ్లపందేలనూ, వివిధ రకాల ఆటలపోటీలనూ నిర్వహిస్తారు. వీటిలో పాల్గొనడానికి రెండు మూడు నెలల ముందు నుంచి ఎద్దులకు శిక్షణ ఇస్తారు. ఇందులో గెలిస్తే ఆ పరమేశ్వరుడి అనుగ్రహం తమ ఊరికి లభిస్తుందన్నది భక్తుల విశ్వాసం. మేళ్లచెరువులోని ఈ శివాలయానికి 25 కిలోమీటర్ల దూరంలో మట్టపల్లి లక్ష్మీ నరసింహస్వామి ఆలయం ఉంది.

### ఉత్తరాఖండ్

## 94 ద్రోణుని ఆవాసం తపకేశ్వర మహాదేవాలయం డెహ్రాడూన్



భయంకర అరణ్య ప్రదేశం లో సహజ గుహలో ఏర్పడిన మహాదేవ శివలింగం ఉన్న క్షేత్రమే డెహ్రాడూన్ లోని తపకేశ్వర దేవాలయం, గుహ పై భాగం నుండి సంతత అలదార బిన్దురూపంగా శివలింగం పై అభిషేక జాలం గా పడుతూ ఉండటం ఇక్కడి విశేషం, గుహ ప్రక్కనే ప్రవహించే నది నీటి తుంపురులు శివలింగం పై పడుతుంటాయి, అద్భుతమైన ప్రకృతి అందాలమధ్య ఉన్న ఈ గుహాలయం భక్తులకు, యాత్రికులకు కను విందు చేస్తుంది, ఒకప్పుడు ఈ ప్రదేశం లో కౌరవ పందుల విలు విద్యా గురువు ద్రోణాచార్యులు ఉండేవారట.అందువల్లనే ఈ గుహకు "ద్రోణ గుహ "అనే పేరు వచ్చింది, ద్రోణాచార్యుల భార్య కృపి ఇక్కడే అశ్వత్థామ కు జన్మనిచ్చిందట, కుమారుడికి పాలుఇవ్వటానికి ఆమె స్తన్యం లో పాలు ఉన్దేవికావత, ఆవుపాలు ఇచ్చి పోషించే ఆర్ధిక స్తోమత ఆచార్య ద్రోణులకు లేదట, అందుకనే అశ్వత్థామ శివుని పాలకోసం ప్రార్ధించే వాడట, బోళా శంకరుడు కనికరించి గుహ పైబాహగం నుండి పాలధార కారేట్లు చేశాడట, అక్కడే తర్వాత శివ లింగం ఏర్పాటు చేశారట,



డెహ్రాడూన్ కు కేవలం 6 కిలో మీటర్ల దూరం లో ఉన్న ఈ తపకేశ్వర మహా శివాలయాన్ని యాత్రికులు తప్పకుండా వచ్చి దర్శిస్తారు, రెండు కొండల నడుమ ఉన్న ఈ గుహాలయం గొప్ప టూరిస్ట్ అట్రాక్షన్. ఉత్తరాఖండ్ లోని ఈ క్షేత్ర సందర్శనానికి ఆ రాష్ట్ర ప్రజలు తండోప తండాలుగా వచ్చి దర్శిస్తారు, వారికి అందుబాటులో



ఉన్న ఇష్టదైవం తపకేశ్వర మహా దేవుడు,, ద్రోణ గుహలో ఉన్న శివ లింగం పై సహజ సిద్ధ జల బిందువులు అభిషేక జలం గా నిరంతరం జాలువారటం యాత్రిక భక్తులకు మానసిక ఆధ్యాత్మిక భౌతిక ఆనంద దాయకం గా ఉంటుంది, మనసుపులకించి పరవశం కలుగుతుంది, శివ లింగం పై పడిన నీటి బిందువులు ఇట్టే అదృశ్యమై తర్వాత కొద్ది గజాల దూరం లో ప్రవాహంగా దర్శన మివ్వటం మరో ఆశ్చర్య కరమైన విషయం,.



తపకేశ్వర మహాదేవాలయం సమీపం లో సల్ఫర్ కలసిన చల్లని నీటి గుండాలున్నాయి, వీటిలో ముందు పవిత్ర స్నానం చేసి తర్వాత భక్తులు ఆలయం లో శివ మహాదేవుని దర్శిస్తారు, ప్రతి శివరాత్రికి భక్తులు విశేషంగా వచ్చి తపకేశ్వర స్వామిని దర్శించి తరిస్తారు, పెద్ద ఉత్సవమూ నిర్వహిస్తారు, డెహ్రాడూన్ చుట్టుప్రక్కల ప్రజలకు ఇది గొప్ప పిక్నిక్ స్పాట్, ట్రెక్కింగ్ కు కూడా అనుకూల ప్రదేశం, ఇక్కడున్న నిలువెత్తు హనుమాన్ భారీ విగ్రహం చూసి తీరాల్సిందే. ఉత్సవ సమయాలలో భక్తులకు ప్రసాదంగా మహా రుచికరమైన భాంగ్ కె పకోడా, భాంగ్ జ్యూస్ ఇస్తారు,

ఈ ఆలయం గర్హి కంటోన్ మెంట్ రోడ్డు మీద డెహ్రాడూన్ ఎయిర్ పోర్ట్ కు 30 కిలో మీటర్ల లో, డెహ్రాడూన్ రైల్వే స్టేషన్ కు 8 కిలోమీటర్ల దూరం లో ఉంది.

## 95 తుంగ నాథ దేవాలయం రుద్రప్రయాగ



ఉత్తరాఖండ్ రాష్ట్రం లో రుద్రప్రయాగ లో ఉన్న తుంగ నాథ దేవాలయం ప్రపంచ ఆలయాలలో అన్నిటి కంటే ఎత్తు మీదున్న ఆలయం గా భావిస్తారు, అందువలన దీనిని "శిఖర శిరోమణి ఆలయం "అంటారు, రుద్ర ప్రయాగ జిల్లాలోని అత్యంత ఎత్తునఉన్న ముఖ్య పంచ కేదారనాథ ఆలయాలలోఒకటి, కురు క్షేత్ర సంగ్రామం లో దాయాదులైన కౌరవులను పూర్తిగా సంహరించి శత్రుశేషం లేకుండా చేసిన పాండవులు ముక్తి కోసం పరి తపించారు, హిమాలయాలకు చేరి శివ మహా దేవుని శరణు వేడుకొని విముక్తి మార్గం తెలియ జేయమని కోరాలని తీవ్రంగా అన్వేషించారు, శివుడు గుప్తకాశి లో వృషభ రూపం దాల్చి ఉన్నాడని గ్రహించారు, గుప్తకాశిలోని వృషభ రూప శివ దర్శనం కోసం తీవ్రంగా గాలించారు, వీరి అన్వేషణ ఫలించి శివ మహాదేవుని" బాహువులు" కనిపించాయి ఇక్కడ, అప్పటి నుంచి ఈ క్షేత్రం అత్యంత పవిత్రమైనదిగా భావింప బడుతోంది, ఎందరెందరో మహర్షులు, ముని పుంగవులు ఈ తుంగ నాథ దర్శనం తో తరించారు,

## 96 రుద్రనాథ దేవాలయం చమోలి



ఉత్తరాఖండ్ లో రుద్రప్రయాగ జిల్లా చమోలి లో శ్రీ రుద్ర నాథ దేవాలయం ఉన్నది, ఇక్కడే పాండవులకు శివుడు "ఎద్దు(వృషభం ) యొక్క మూపుర" రూపం లో దర్శన మిచ్చాడు, శివుని పల్లకీని లూటీ బుగ్యాల్, పన్యార్ ల ద్వారా గోపేశ్వర్ కు మోసుకొంటూ వచ్చి, అక్కడ ఉన్న" పితృధార "వద్ద పితృ దేవతలకు తర్పణ, పిండ ప్రదానాలు చేస్తారు, మళ్ళీ ఇక్కడినుంచి డోలీ ని ధలాబ్ని మైదాన్ గుండా రుద్రనాథ్ కు చేరుస్తారు

## 97 –కల్పేశ్వర మహాదేవాలయం –చమోలి-



ఉత్తరాఖండ్ గర్హ్వి హిమాలయాలలో చమోలీ వద్ద అందమైన ప్రకృతి కనువిందు చేసే ఉర్గాం లోయ లో శ్రీ కల్పేశ్వర మహాదేవ ఆలయం ఉన్నది, ఇక్కడే పాండవులకు శివుని" తాళాలు" లభించాయి, పాండవుల ప్రార్ధన మన్నించిన కల్పేశ్వర మహా దేవ శివుడు వారి పాపాలను క్షమించి ముక్తి మార్గం ఉపదేశించాడు,

## 98 నీల కంఠ మహాదేవాలయం ఋషీకేశ్



ఉత్తరాఖండ్ పౌరి-గర్వాల్ జిల్లా ఋషీకేశ్ దగ్గర నీల కంఠ మహా దేవాలయం ఉంది.ఇక్కడే దేవ రాక్షసులు అమృతం కోసం క్షీర సాగర మధనం చేస్తుంటే వెలువడిన "హాలాహలం "ను దేవదానవుల ప్రార్ధన మన్నించి లోకోపకారం కోసం శివుడు మ్రింగిన ప్రదేశం, దాన్ని ఉదరం లోకి పోనీకుండా లోపలి లోకాలకు నష్టం కలుగ కుండా కంఠంలోనే ఉంచుకొని, కంఠం నీలం రంగుగా మారగా నీల కంఠుడయ్యాడు. గరళం మింగాడు కనుక గరళ కంఠుడు.కేదార్ నాథ్క్షేత్రం నుంచి నీల కంఠ పర్వత శిఖర దర్శనం అత్యంత ఆనందదాయకం గా నయన మనోహరం గా ఉంటుంది,

## 99 జగేశ్వర ధాం-ఆల్మోరా




హిమాలయాలలో ఆల్మోరా కు 35 కిలో మీటర్ల దూరం లో జగేశ్వర ధాం పరమ పవిత్ర శివాలయంగా భావింప బడుతోంది, ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఇది ప్రసిద్ధమైనది అంటారు, ఈ దేవాలయ సముదాయం లో 125 దేవాలయాలున్నాయి, వందలాది శిలా విగ్రహాలున్నాయి,

## 100 వైద్య నాథ దేవాలయం బాగేశ్వర్



ఉత్తరాఖండ్ గోమతి నదీ తీరాన ప్రశాంత వాతావరణం లో శ్రీ వైద్య నాథ దేవాలయం ప్రాముఖ్యం సంతరించుకొన్నది, కౌశానికి 16 కిలోమీటర్ల దూరం లో ఉన్నది,

## 101 గోపీనాథ దేవాలయం గోపేశ్వర్

ఉత్తరాఖండ్ చమోలీ జిల్లా గోపేశ్వరం పట్టణం లో శ్రీ గోపీనాథేశ్వర దేవాలయం 9-11 శతాబ్దాల మధ్యకాలం లో నిర్మింపబడిన దేవాలయం, దీనిని కాట్యూరి వంశ రాజులు నిర్మించారు, రుద్రనాథునికి పవిత్ర క్షేత్రం గా దీనిని భావిస్తారు, ఈ ఆలయ శివలింగాన్ని "ఏకానన్ "అంటే "శివుని ముఖంగా" భావించి అర్చిస్తారు, ఈ ఆలయం లో మరో విశేషం ఏమిటి అంటే అన్ని శివాలయాలలో శివునికి క్షీరం, జలంతో అభిషేకం చేసినట్లు ఇక్కడ చేయరు, ఆ రెండు ఇక్కడ అభిషేకానికి వాడరు అని అర్ధం, ఒక్క బిల్వ దళాలతోనే అభిషేకం, పూజ నిర్వహించటం ఇక్కడి ప్రత్యేకత,



మన్మధ సంహారం కోసం శివుడు త్రిశూలం వేస్తే, ఆ త్రిశూలం ఇక్కడ దిగబడి పోయిందట, ఆ త్రిశూలం ఏయే లోహ మిశ్రమాలతో తయారు చేయబడిందో తెలియదుకాని, అప్పటి నుండి ఇప్పటి వరకు అది చెక్కు చెదరలేదు, ఎంతటి పశుబలం ఉపయోగించినా దాన్ని కదిలించలేరు, కాని పరమ భక్తుడెవరైనా దాన్ని తాకితే ప్రకంపనలు కలిగిస్తుంది. ఇదొక విశేషం ఇక్కడ,



## 102 అగస్త్యేశ్వరాలయం రుద్రప్రయాగ

ఉత్తరాఖండ్ లో రుద్ర ప్రయాగలో ఉన్న అగస్త్యేశ్వరాలయం లో అగస్త్య మహర్షి తపస్సుచేసి శివ పూజ చేసినట్లు పురాణకథనం,

## 103 కోటేశ్వరాలయం రుద్రప్రయాగ



రుద్రప్రయాగలోనే శ్రీ కోటేశ్వరాలయం ఉన్నది ఇక్కడ శివుడే తపస్సు చేసినట్లు పురాణ ం లో ఉంది.ఇక్కడే భస్మాసురుడు తీవ్ర తపస్సు చేసి శివుని మెప్పించి వరం పొంది, తర్వాత విష్ణు మాయవలన తన నెత్తిసే తాను చేయిపెట్టుకొని భస్మమైన ప్రదేశం ఇది ఇది గుహాలయం,

## 104 మధ్యమహేశ్వరాలయం రుద్రప్రయాగ



రుద్రప్రయాగ కు 46కిలోమీటర్ల దూరం లో ఉన్న ఆలయమే మధ్య మహేశ్వరాలయం, పంచ కేదార్ ట్రెక్కింగ్ ప్రదేశాలలో ఇదొకటి, ప్రకృతి అందాల మధ్య కనువిందు చేసే ఆలయం, దీని నిర్మాణ శిల్ప చాతుర్యం అద్భుతమని పిస్తుంది,

## 105 ఓంకారేశ్వర దేవాలయం రుద్రప్రయాగ



ఉఖీ మర్ లో ఉన్న ఈ దేవాలయం తుంగనాధ స్వామి మద్మమహేశ్వరునికి శీతాకాల విశ్రాంతి మందిరం, శీతాకాలం పూర్తీ అవగానే మహా వైభవంగా ఈ దేవుళ్ళను వారి వారి దేవాలయాలకు చేరుస్తారు,

## 106 విశ్వనాథాలయం గుప్త కాశి



కాశీలో విశ్వేశ్వరునికి ఎంతటి ఆరాధనా భావం ఉందో ఇక్కడ గుప్తకాశీలో ఈ విశ్వేశ్వరునికి అంతటి పూజ్య భావం ఉంది.ఇక్కడే పార్వతీ పరమేశ్వరులు మొదటిసారి రహస్యంగా అంటే గుప్తంగా కలుసుకొన్నారు, అందుకే గుప్త కాశి అంటారు,

ఇక్కడే శివ పార్వతుల కల్యాణం జరిగింది, అంతేకాదు పాండవులు శివునికోసం వెదకటానికి వస్తే కనిపించకుండా ఉన్నప్రదేశం కనుక గుప్తకాశి అయింది,

## 107 బుఢా కేదార్ దేవాలయం గర్వాల్



గర్వాల్ జిల్లా లో బుఢాకేదార్ ఆలయం లో శివలింగం ఉత్తర భారత శివాలయ లింగాలలో చాలాపెద్దది, బృహత్ లింగం అన్నమాట, ధర్మ గంగా, బాల గంగా నదుల సంగమ స్థానం లో ఎత్తైన ప్రదేశం లో ప్రకృతి రామణీయకత మధ్య ఉన్న దేవాలయం ఇది, పాండవులతో సాన్నిహిత్యం ఉన్న ఆలయం అని ఇక్కడి వారు గర్వం గా చెప్పుకొంటారు,

## 108 లఖా మండల దేవాలయం డెహ్రాడూన్



పాండవులను సజీవ దహనం చేయించటానికి దుష్ట దుర్యోధనుడు ఇక్కడ లాక్షా గృహం అంటే లక్క ఇల్లు కట్టించాడు అదృష్టవశాత్తు వాళ్ళు తప్పించుకొన్నారు, అందుకనే ఈ ఆలయాన్ని దర్శించినవారు దురదృష్టం నుండి కాపాడ బడుతారని గొప్ప విశ్వాసం,



## 109 రామేశ్వర దేవాలయం ఋషీకేశ్

ఋషీకేశ్ లో గలగలాపారే గంగమ్మతల్లి ఒడ్డునే రాం ఝూలా వంతెన దగ్గర రంగురంగులతో శోభించే రామేశ్వరాలయం ఉన్నది,

## 110 కమలేశ్వర మహా దేవాలయం పౌరీ గర్వాల్

ఉత్తరాఖండ్ పౌరీ గర్వాల్ ప్రాంతంలో మంచు తో కప్పబడే హిమ శృంగాల మధ్య తెరై కోట్ ద్వార్ ప్రాంతం లో కమలేశ్వర మహా దేవాలయం ఉన్నది, వసంత సప్తమినాడుమహా దేవ శివునికి 52 రకాల పదార్థాలు



నైవేద్యం పెట్టటం ఇక్కడి ఆచారం, సాధారణంగా శివాలయాలలో ఎక్కడా ఇన్ని రకాల ప్రసాదాలు పెట్టటం చూడం, ఒక్క ప్రసాదం పెట్టటమే గొప్ప, విష్ణ్వాలయం లో ప్రసాదాలకు కొదవ ఉండదు, శివాలయం లో విభూతి తప్ప ఏమీ ఉండదు, అందుకే ఏమీ లేనిదానిని "'అక్కడేముందిరా శివాలయం "అనే సామెత వచ్చింది, రకరకాల భారీ ప్రసాద వినియోగం ఈ ఆలయ ప్రత్యేకత, సంతానం లేని దంపతులు కార్తీక చతుర్దశినాడు రాత్రి అంతా ఈ ఆలయం ప్రాంగణం లో చేతిలో మట్టిప్రమిద దీపం తో నిలబడి భక్తితో జాగరణ చేస్తే తప్పక సంతానం కలుగుతుంది అని ఇక్కడి వారి అచంచల విశ్వాసం, సంతానం కోసం, ప్రసాద వైవిధ్యం కోసం ఈ ఆలయాన్ని దర్శించి తరించాలి,

## 111 బాఘ్ నాధ దేవాలయం బాగేశ్వర్



వ్యాఘ్ర నాద బాఘ్ నాధ అయి ఉంటుంది, వ్యాఘ్రం అంటే పులిరాజు, శివుడు పులి చర్మం ధరిస్తాడు కనుక వ్యాఘ్రేశ్వరుడు, ఉత్తరాఖండ్ లో ప్రసిద్ధ హిల్ స్టేషన్ ఆల్మోరాకు 90 కిలోమీటర్ల దూరం లో బాగేశ్వార్ దేవాలయం ఉంది.శ్రావణ మాసం లో భక్తులు వచ్చి సందర్శించి కాపాడమని వేడుకొనే క్షేత్రం ఇది, గోమతి, సరయు నదుల సంగమ స్థాన ప్రదేశం లో ఈ ఆలయం ఉంటుంది, ఇక్కడే దుర్గా, దత్తాత్రేయ, హనుమాన్, కాళికా, గంగామాత, పంచం ఝుంకార, తుంగ భైరవ, విశ్వేశ్వరాలయాలున్నాయి,

## 112 బాలేశ్వర దేవాలయం చంపావత్



ఉత్తరాఖండ్ రాష్ట్ర మధ్యభాగం లో పితోరవాత్ జిల్లా కు 74 కిలో మీటర్లలో చంపావత్ నగరం లో బాలేశ్వర దేవాలయం ఉన్నది, ఈ దేవాలయం అతి ప్రాచీనకాలానికి అంటే క్రీశ 10 -12 శతాబ్దికాలం లో నిర్మించబడినట్లు తెలుస్తోంది, స్తంభాలు గోడలు తో కట్టబడింది, ఈ ఆలయ ప్రాంగణం లో రత్నేశ్వర, చంపావతి దుర్గ ఆలయాలున్నాయి శివ రాత్రినాడు బాలేశ్వర దేవాలయం లో విశేష పూజా కార్యక్రమాలు భారీగా జరుగుతాయి, వేలాది భక్తులు సందర్శించి తరిస్తారు,

## 113 బిన్సార్ మహాదేవాలయం చమోలి



సముద్ర మట్టానికి 2,480 మీటర్ల ఎత్తున చిక్కని దేవదారు వృక్షారణ్య భాగం లో ఉత్తరాఖండ్ లోని చమోలీ లో బిన్సార్ మహా దేవాలయం సుందర ప్రకృతిలో ఉంది.ఆలయానికి 19 కిలో మీటర్లలో ఆహా అనిపించే రాణిఖేత్ రైల్వే స్టేషన్ ఉంది.స్థానిక కధనం ప్రకారం ఈ ఆలయం ఒకే ఒక్క రోజులో నిర్మింపబడింది, వైకుంఠ చతుర్దశి నాడు మహిళా భక్తులు ఈ ఆలయం సందర్శించి తమ సంతానానికి మంచిఆరోగ్యం కోసం తమ కుటుంబానికి సౌభాగ్యం కోసం పూజలు చేయటం ఇక్కడ విశేషం, పారిశుధ్యానికి కేంద్రంగా ఉంటుంది ఆలయం, ,ప్రాంగణం కూడా,

## 114 శివ గణనాధ ఆలయం ఆల్మోరా



సముద్ర మట్టానికి 2,11 6 మీటర్ల ఎత్తులో ఆల్మోరాలో శివగణనాద దేవాలయం ఆల్మోరాకు 47కిలోమీటర్ల దూరం లో ఉంది, కార్తీక పౌర్ణమినాడు బ్రహ్మాండమైన జాతర జరుగుతుంది, భక్తులు తప్పెట్లు తాళాలతో బాజా భజంత్రీలతో ఆలయం సందర్శిస్తారు

## 115 జాగేశ్వర దేవాలయం ఆల్మోరా

2,500 ఏళ్ళ అతి ప్రాచీన దేవాలయామే ఆల్మోరాలోని జాగేశ్వర దేవాలయం, వివిధ వంశాలకు చెందిన రాజుల కాలాలో అభి వృద్ధి చెందిన దేవాలయం, ఆలయ శిల్ప నిర్మాణ ప్రతిభ ఆశ్చర్యం కలిగిస్తుంది, దీనిని అధ్యయనం చేయటానికే చాలా మంది వస్తారు, ఇది ఆలయ కాంప్లెక్స్ గా ఉంటుంది, జోగేశ్వర మహా శివ దేవాలయం తో పాటు,మృత్యుంజయేశ్వర,సూర్య, చండికా, కుబేర, నవ దుర్గ, నవగ్రహ దేవాలయాలూ ఉన్నాయి

## 116 మహా మృత్యుంజయ దేవాలయం జాగేశ్వర్



అతిప్రాచీన మహా శివుని అతి ప్రసిద్ధ దేవాలయం మహా మృత్యుంజయ దేవాలయం, జాగేశ్వర దేవాలయానికి దగ్గరలోనే ఉంటుంది, ఇక్కడి శివలింగం అతి విచిత్రంగా ఉండటం ప్రత్యేకత, శివలింగం లో తెరచి ఉన్న శివ నేత్రం ఆశ్చర్యం కలిగిస్తుంది, భక్తులు మృత్యుంజయ మంత్రాన్ని భక్తితో పఠిస్తూ దర్శించి తమకు మృత్యువువలన, ప్రమాదాలవలన ఇబ్బంది రాకుండా చేయమని ప్రార్ధిస్తారు,

## 117 ముక్తేశ్వర దేవాలయం నైనిటాల్

సరస్సుల నగరం అని పిలువబడే నైనిటాల్ కు 51కిలో మీటర్ల దూరం లో ముక్తేశ్వర దేవాలయం ఉన్నది, ఈ ఆలయం ఉత్తరాఖండ్ లో కుమాన్ పర్వత శ్రేణులలో సముద్ర మట్టానికి 2,286 మీటర్ల ఎత్తున ఉంది.ఆలయం చుట్టూ బ్రహ్మ విష్ణు, నంది,గణేశ,పార్వతి



విగ్రహాలున్నాయి, ఆలయానికి అతి సమీపం లోనే చౌలీకి జాలీ అనే రాక్ క్లైమ్బింగ్ సైట్ ఉంటుంది,

## 118 పాతాళ భువనేశ్వరాలయం పితోరగడ్



సున్నపురాయి గుహలయమే పాతాళ భువనేశ్వరాలయం, దీన్ని గురించి అనేక విచిత్ర కధలు గాధలు ప్రచారం లో ఉన్నాయి, పితోరగడ్ జిల్లా గంగోలి హాట్ కు 13 కిలోమీటర్లలో 13 50 మీటర్ల ఎత్తులో ఉన్న ఆలయ మిది, ఇక్కడే 33 కోట్ల మంది దేవతలు ఉంటారని విశ్వాసం, ఈ గుహాలయం 160 మీటర్ల పొడవు, 90 మీటర్ల లోతు ఉంటుంది, ఈ గుహాలయం లో లెక్కపెట్టటానికి వీలు లేనన్ని స్టాలిగ్ మైట్ శిలాకృతులు దర్శనమిస్తాయి, ఇక్కడే అనేక ఆశ్చర్యకరమైన విషయాలు కనిపిస్తాయి, అందులో కొన్ని –కాలభైరవుని నాలుక, ఇంద్రుని ఐరావతం, శివ జటాజూటం వంటివి అన్నమాట, తప్పక చూసి ఆశ్చర్యపోవాల్సిన ఆలయం,

## 119 సోమేశ్వర దేవాలయం కౌసాని



ఉత్తరాఖండ్ లో కౌశాని హిల్ స్టేషన్ కు 11 కిలో మీటర్ల దూరం లో అందమైన ప్రక్తి పరిసరాలున్న చిన్న పల్లె కౌశాని లో కౌశాని-ఆల్మోరా రోడ్డుపై సోమేశ్వరాలయం ఉన్నది.ఇక్కడి ప్రజలు దీనిని జ్యోతిర్లింగాల లో ఒకటిగా విశ్వసిస్తారు, 7 వశతాబ్ది ఆలయం,

## 120 త్రిజుగి నారాయణ దేవాలయం రుద్రప్రయాగ



ఉత్తరాఖండ్ రుద్రప్రయాగ జిల్లా త్రిజుగి నారాయణ గ్రామం లో ఉన్న విష్ణు ఆలయమే త్రిజుగి నారాయణ దేవాలయం, ఇక్కడ విష్ణువుతోపాటు శివునీ పూజించటం విశేషం, ఇక్కడే ఉమామహేశ్వర

కల్యాణం జరిగిందని అంటారు, ఈ ఆలయానికి ఒక ప్రత్యేకత ఉన్నది అదే "అఖండ ధుని ".అందుకే అఖండ ధుని దేవాలయం అని పిలుస్తారు, ఇక్కడి శివ పార్వతి కల్యాణం నాటి అగ్ని హోత్రం మూడు యుగాలుగా వెలుగుతూనే ఉండటం విశేషం, త్రిజుగి అంటే మూడు యుగాలు, ఆలయానికి దగ్గరలో ఉన్న జలపాతం చుట్టు ప్రక్కల మూడు సరస్సులను నింపి పంటలకు సహకరిస్తోంది,

## 121 వృద్ధ జోగేశ్వరాలయం ఆల్మోరా



ఉత్తరాఖండ్ ఆల్మోరాకు 37 కిలోమీటర్ల దూరం లో జోగేశ్వర్ కు మూడు కిలోమీటర్ల ఎత్తున శ్రీ వృద్ధ జోగేశ్వరాలయం ఉంది.ఇక్కడ శివుడిని వృద్ధ మానవ రూపం లో పూజించటం విశేషం, దట్టమైన అరణ్య ప్రాంతం లో ఉన్న ఈ ఆలయం పరిసరాలు సతత హరితం గా ఉండటం మరో ప్రత్యేకత, ఇక్కడి దేవదారు వృక్షాలు ఆకాశం అంచులు తాకుతున్నాయా అనిపిస్తాయి, జోగేశ్వర్ –వృద్ధ జోగేశ్వర్ లమధ్య బాల జోగేశ్వరాలయం కూడా ఉండటం మరో విచిత్రం,

## 122 చితై గోలు దేవాలయం ఆల్మోరా



ఉత్తరాఖండ్ ఆల్మోరా కు 8 కిలోమీటర్ల దూరం లో ప్రసిద్ధ చితై గోలులో ఒక దేవాలయం ఉన్నది, శివుని అవతారమైన గౌరు భైరవ రూపం లో గోలు దేవుడిని ఇక్కడ అర్చిస్తారు, ఆలయ ప్రాంగణం అంతా రాగి గంటలు వ్రేలాడదీయ బడి ఉండటం ఇక్కడి ప్రత్యేకత, ఇక్కడి గోలు శివుడిని న్యాయ దేవత గా భావిస్తారు, ఈ దేవాలయానికి వచ్చి గౌలు శివ దేవుని పూజిస్తే వారికి జరిగిన అన్యాయం తొలగి న్యాయం లభిస్తుందని ప్రగాఢ విశ్వాసం,

## 123 పూర్ణ గిరి సిద్ధ దేవాలయం చంపావత్

108 సిద్ధ పీఠాలలో ఒకటైన ఉత్తరాఖండ్ లోని చంపావత్ పూర్ణ గిరి సిద్ధ దేవాలయం ఒకటి, అందాలొలికే ప్రకృతి మయం లో ఉన్న ఆలయం ఇది, మార్చ్-ఏప్రిల్ లో వచ్చే చైత్ర నవరాత్రి నాడు వేలాది భక్తులు వచ్చి



సందర్శిస్తారు, ప్రశాంతతకు నిలయంగా ఉండే ఈ ఆలయం లో పూజ చేస్తే భక్తుల మనో వాంఛి తాలు నెరవేరుతాయని విశ్వాసం, ఇక్కడి నుంచి నేపాలీ గ్రామాలు తన్నాపూర్ దగ్గరగా కనిపిస్తాయి

## 124 చంద్ర బదిని దేవాయం టెహ్రి



ఉత్తరాఖండ్ చంద్ర బదిని పర్వత శ్రేణిలో ఉన్న శక్తి పీఠమే ఈ చంద్ర బదిని దేవాలయం, సతీదేవి మొండెం ఇక్కడ పడి, శక్తిపీఠమైంది, దేవ ప్రయాగ –ప్రతాపనగర్ మధ్య ఉన్న పర్వత శ్రేణులను చంద్ర బదిని శ్రేణి అంటారు, బహుశా చంద్ర వదనం లాగా ఉంటాయేమో చంద్ర వాదన శ్రేణి చంద్ర బదిని శ్రేణి అయి ఉండచ్చు నని ణా ఊహ, ఇక్కడి నుంచి అందమైన అద్భుతమైన కేదార్ నాథ్ బద్రీనాథ్,సూర్కందా శిఖరాలను కన్నుల పండువుగా చూడవచ్చు, అమ్మవారి విగ్రహం చిన్నదే కాని శ్రీయంత్ర ప్రతిష్టితం కనుక మహా శక్తి వంతం, శ్రీ చక్రానికి పైన ఉన్న ఛత్రానికి పూజారి సంవత్సరానికి ఒకసారి కళ్ళు మూసుకొని భక్తిగా ఒక గుడ్డ ముక్కను కట్టటం ఇక్కడి ఆనవాయితీ, ప్రతి ఏడాది ఏప్రిల్ లో ఇక్కడ పెద్ద ఎత్తున జాతర జరుగు తుంది,

## 125 కార్తీక స్వామి దేవాలయం రుద్రప్రయాగ

ఉత్తరాఖండ్ రుద్రప్రయాగలో కొండ అంచున శివుని కుమారుడు కార్తికేయస్వామి దేవాలయం ఉన్నది, ఈ ఆలయం సముద్ర మట్టానికి 3,050 మీటర్ల ఎత్తున ఉండటం విశేషం, ఆకాశం నిర్మలంగా ఉన్నరోజున




ఇక్కడి నుంచి బందర్ పూంచ్, కేదార్ నాథ్,సుమేరు, చౌకాంబ, నీలకంఠ,ద్రోణ గిరి, నందా దేవి శిఖరాలను వీక్షించటం మధురానుభూతి, పాలరాతి వంటి రాయిపై సహజంగా చెక్కినట్లున్న కార్తికేయ స్వామిస్వరూపం చూడముచ్చటగా ఉంటుంది, కనక చౌరీ నుంచి దట్టమైన అరణ్యం గుండా ట్రెక్కింగ్ చేసి ఈ ఆలయానికి చేరుకోవాలి, కష్ట పడి వ్యయ ప్రయాసలకు లోనై ఇక్కడికి రావాలి కనుక భక్తుల రద్దీ చాలా అతక్కువ, కాని అనుభవం మాత్రం అగణ్యం,

జమ్మూ కాశ్మీర్

## 126 ముస్లిమ్ పూజారి గా ఉన్న మహాలాకా శివాలయం పెహల్గాం



జమ్మూ కాశ్మీర్ లో గడ్డ కట్టే హిమ జలం ఉన్న లిడ్డర్ నదీ తీరాన 900 సంవత్సరాల ప్రాచీన శివాలయం ఉంది.దీని పూజారులు ముస్లిం లు అవటం విశేషం, కాశ్మీర్ లోయలో ఇదొక్కటే హిందూ దేవాలయం, కాశ్మీరీ పండిత కుటుంబాల వారు ఈ ఆలయ ఆలయ అర్చకత్వం చేసేవారు, ఉగ్రవాదుల దాడులు తీవ్రతరం అయ్యాక వారు ఈ గ్రామం వదిలి వలస వెళ్లి పోయారు, అప్పుడు దీనికి దగ్గరలో ఉన్న గ్రామం నుండి ఇద్దరు ముస్లిం పూజారులు మొహమ్మద్ అబ్దుల్లా, గులాం హసన్ లు ఈ "మహాలాకా "దేవాలయం తలుపులు తీసి, ఆలయ రక్షణ భారం వహించి అర్చకత్వం చేస్తూ ఘంటానాదం తో భక్తులను ఆకర్షించారు, నిత్యం హారతి నిస్తూ పవిత్రతను కాపాడుతున్నారు, ఈ ఆలయ శివలింగం మూడు అడుగుల నల్లరాతి శివలింగం, నిత్యం ప్రసాదం చేసి నైవేద్యం పెట్టి భక్తులకు అందజేస్తున్నట్లు పూజారులు అబ్దుల్లా, హసన్ లు ఆనందంగా తెలియ జేశారు,

రాజా జయ సూర్య నిర్మించిన ఈ ఆలయం దక్షిణ కాశ్మీర్ హిమాలయాలలో ఉన్న అమరానాథ్ దేవాలయ యాత్రికులకు మార్గాయాసం తీర్చుకొనే విశ్రాంతి మందిరం గా ఉప యోగ పడుతుంది, పూర్వం ఈ ఆలయ అర్చక రక్షణ బాధ్యతలు స్థానిక కాశ్మీర్ పండిట్ కుటుంబాల సంస్థ కు చెందిన పండిట్ రాదా కిషన్ చూస్తూ ఉండేవాడు,. 19 89లో రాధా కిషన్ పండిట్ వలస వెళ్లి పోయినప్పుడు ఈ ఆలయం రాష్ట్ర పురాతత్వ సంస్థ ఆధీనం లో కి చేరింది, పండిట్ వలస వెడుతూ ఆలయ బాధ్యతను తన ముస్లిం స్నేహితుడు అబ్దుల్ భట్ కు అప్పగించి, ఆలయ ద్వారాలు ఎప్పుడూ తెరచి ఉండేట్లు చూడమని కోరాడు, స్నేహితుడికిచ్చిన వాగ్దానాన్ని భట్ 2004లో ఆ ప్రాంతం నుండి వేరొక చోటుకు బదిలీ అయ్యేదాకా కాపాడాడు, ఆ తర్వాత మొహమ్మద్ అబ్దుల్లా, గులాం హసన్ లు ఆలయ బాధ్యతలు స్వీకరించి ప్రాణ ప్రదంగా కాపాడుతున్నారు



ఈ ముస్లిం శివభక్త పూజారులు "మాకు శివునిపై అత్యంత భక్తీ, విశ్వాసాలున్నాయి, ఆలయ నిర్వహణ బాధ్యత వహించటమేకాదు,అవసరమైన మరమ్మత్తులు కూడా చేస్తున్నాం, ఉగ్రవాదుల బెదిరింపులు, భయోత్పాతం ఉన్నప్పటికీ ఆలయాన్ని చక్కగా సమర్ధవంతంగా నిర్వ హిస్తూ, భక్తుల సందర్శనకు ఇబ్బంది లేకుండా చేయగలుగుతున్నామన్న సంతృప్తి మాకు ఉన్నది, మా స్నేహితుడు తమ ఇష్టదైవమైన శివుని ఆలయ విషయమై మాకు అప్పగించిన బాధ్యత మేము అత్యంత విశ్వాసంగా నిర్వహిస్తున్నాం, ఇక్కడి అర్చకులైన ఆ కాశ్మీర్ పండిట్ లు మళ్ళీ ఇక్కడికి వచ్చి వారి బాధ్యతలను వారు మరల చేబట్టాలని మనస్పూర్తిగా కోరుకొంటున్నాం, దానికి తగిన పరిస్టితులు,శాతి భద్రతలు త్వరలోనే ఏర్పడుతాయని నమ్ముతున్నాం "అన్నారు,

ఈ ఆలయం లో గణేష్, పార్వతీదేవి, హనుమాన్ విగ్రహాలు కూడా ఉన్నాయి, సహజ సిద్ధ జలపాతం కూడా ఉండి, యాత్రికులను ఆకర్షించే దేవాలయం ఇది, నాలుగేళ్ల నుండి భక్తుల రాక బాగా పెరిగింది, ఈ ప్రాంతాన్ని వదిలి వెళ్ళిన కాశ్మీర్ పండిట్ కుటుంబాలవారు కూడా యాత్రికులలాగా వచ్చి ఆలయాన్ని సందర్శించి వెడుతున్నారు,

కనుక ఈ మహా లాకా దేవాలయం హిందూ –ముస్లిం సమైక్యతకు, స్నేహ ధర్మానికి, స్నేహితుడికి ఇచ్చిన మాట నిలబెట్టుకొంటున్న విశ్వాసానికి ప్రతీకగా ఉండటం గొప్ప విశేషం, శుభ పరిణామం.

హిమాచల్ ప్రదేశ్

## 127 వైద్య నాథ శివాలయం వైద్యనాథ్

హిమాచల్ ప్రదేశ్ కాంగ్రా జిల్లా వైద్యనాథ్ లో ఉన్న వైద్యనాథ శివాలయం 13 వ శతాబ్దం నాటిది, జిల్లా ముఖ్యపట్టణం ధర్మశాల కు 50 కిలోమీటర్ల దూరం లో పశ్చిమ హిమాలయాలలో దౌలదార్ పర్వత శ్రేణిలో 1,3 14 మీటర్ల ఎత్తున ఉన్నది, వైద్యానికి నాధుడు శివుడు అనే అర్ధం తో ఏర్పడిన దేవాలయం ఇది, ఈ గ్రామం అసలు పేరు కిరగ్రామం పఠాన్ కోట –మండి హైవేలో ఉంటుంది, దాదాపు కాంగ్రా –మండి లకు మధ్యలో ఉంది.ఆలయం పేరు గ్రామానికీ వచ్చి ప్రస్తుతం వై(బై )ద్యనాథ్ అనే పిలుస్తున్నారు,



క్రీ. శ. 1204 లో ఆలయం నిర్మింపబడిన దగ్గరనుండి వైద్యనాథ్ శివునికి నిత్య పూజా నైవేద్య ఉత్సవాలు జరుగుతూ ఉన్నాయి, అక్కడున్న శిలాశాసనలను బట్టి ఇప్పుడున్న ఆలయానికి ముందు మరొక ఆలయం ఉన్నట్లు తెలుస్తోంది, ఇప్పుడున్న ఆలయం ఉత్తరభారత మధ్య యుగ శిల్ప నిర్మాణ శైలి లో నిర్మించబడినట్లు కనిపిస్తుంది, ఈ రకపు నిర్మాణ శైలిని" నగర నిర్మాణ శైలి" అంటారు, గర్భాలయం లో స్వయంభు వైద్యనాథ శివలింగం, దానిపై అయిదువైపులా వర్తులాకార శిఖరం ఉంటుంది, చదరంగా ఉన్న మండపం, దానికి ఉత్తర, దక్షిణాలలో బాల్కనీలు ఉంటాయి, మండపం ముందు నాలుగు స్తంభాలపై ఉన్న వసారా ఉంది.ఇక్కడే నంది విగ్రహం చిన్న మండపం లో కనిపిస్తుంది.ఆలయ బయట గోడలలో చిన్న చిన్న గూళ్ళు, వాటిలో దేవీ, దేవతల విగ్రహాలు ఉంటాయి, ఇవికాక అనేక విగ్రహాలు గోడలపై ఏర్పాటు చేయబడినాయి, సంవత్సరం అంతా ఆలయం భక్తులతో కిటకిట లాడుతుంది, మకర సంక్రాంతి, మహా శివరాత్రి, వైశాఖ సంక్రాంతి, శ్రావణ సోమవారాల్లో విశేషమైన పూజాకార్యక్రమాలు ఉత్సవాలు నిర్వహిస్తారు, శివ రాత్రికి అయిదు రోజుల ప్రత్యేక ఉత్సవం ఇక్కడి ప్రత్యేకత,

**ఆలయ ప్రాముఖ్యత**



త్రేతాయుగం లో రావణ బ్రహ్మ అనంత శక్తి సంపన్నత కోసం ఇక్కడే శివుని గూర్చి ఘోర తపస్సు చేశాడు, తన శివ భక్తికి తార్కాణంగా పది తలలను కోసి శివునికి హవాన కుండం లో వ్రేల్చి అర్పించాడు.ప్రీతి చెందిన శివుడు మళ్ళీ పది తలలు వచ్చేట్లు చేసి, మరణం లేకుండా వరం ఇచ్చి అశేష శక్తి సంపన్నుడిని చేశాడు, వర గర్వం తో కళ్ళు మూసుకుపోయిన పదితలల వాడు శివుడిని తనతో లంకకు రమ్మని కోరాడు, బోలాశంకరుడు అంగీకరించి, తాను శివ లింగం గా మారి, దానిని ఎక్కడా కింద పెట్టకుండా లంకకు తీసుకు వెళ్ళమన్నాడు, సమ్మతించిన రావణుడు ఆ మహాశక్తి వంతమైన శివుని ఆత్మలింగాన్ని బుజాలపై మోసుకొంటూ దక్షిణ దిశగా లంకకు ప్రయాణమై ఈ వైద్యనాథ్ కు చేరుకోగానే, కాలకృత్యాలు తీర్చుకోవలసి వచ్చి బాల పశువుల కాపరి వేషం లో ఉన్న గణపతి చేతిలో లింగాన్ని పెట్టి వెళ్ళాడు, గణేశుడు బరువును ఆపలేనట్లు నటించి దాన్ని నేలమీద దించాడు, వెంటనే శివలింగం అర్ధనారీశ్వర రూపంగా మారి అక్కడే ఉండి పోయింది, ఇది వాయు, గణపతి దేవతల పన్నాగం గా పురాణ కధనం.



దసరా ఉత్సవాలలో వైద్యనాథ్ లో మన దేశం లోని అన్ని ప్రాంతాలలో రావణాసురుని గడ్డిబొమ్మను తగలేసినట్లు తగలేయక పోవటం ఒక ప్రత్యేకత, రావణ బ్రహ్మకు శివునిపై ఉన్న అత్యంత భక్తికి ఇక్కడి ప్రజలు ముచ్చట పడి గౌరవాన్ని ప్రదర్శించటానికి ఇది నిదర్శనం, ఈ వైద్య నాథ్ లో బంగారు నగలు తయారు చేసే కంసాలులు కాని, షాపులు కాని ఉండక పోవటం మరో విశేషం,

ఆలయ మండప గోదాలపైఉన్న శాసనాలను బట్టి క్రీ శ.1204 లో వైద్యనాథ శివుని మహా భక్తులైన "మన్యుకుడు, ఆహుకుడు" ఈ ఆలయాన్ని కట్టించారు, ఇక్కడి శివ లింగాన్ని వైద్యనాథ శివలింగం

అంటారని, ప్రస్తుత  ఆలయ నిర్మాణానికి ముందే ఆలింగం ఆచ్చా దన  లేకుండా ఆరు బయట ఉండటం వలన ఈ ప్రస్తుత ఆలయం నిర్మించబడినట్లు కూడా లిఖించబడి ఉంది.

బ్రిటిష్ ఆర్కియాలజిస్ట్ అలెక్సాండర్ కన్నింగ్ హాం, 1786 లో వేయబడిన శాసనాన్ని గుర్తించి "సంసార చంద్ర మహారాజు "ఆలయ పునర్నిర్మాణం చేశాడని తెలియ బరచాడు, గర్భాలయ కొయ్య తలుపు మీద ఉన్న దాన్ని బట్టి నిర్మాణం 1783లో జరిగినట్లుంది, 1905 ఏప్రిల్ 4 న కాంగ్రా జిల్లా అంతా భయంకర భూకంపానికి గురై ఈ ఆలయం శిదిలమైనదని, ఆతర్వాత మరమ్మతులు జరిగాయని  జే, పి, హెచ్. ఒగేల్ ధృవీకరించాడు, ఇప్పుడు వైద్యనాథ శివాలయం ఆర్కిలాజికల్ డిపార్ట్ మెంట్ వారి సంరక్షణలో సురక్షితంగా ఉంది

ఈఆలయానికి 6 కిలోమీటర్లలోఉన్న  సంపాల్ లో  ముకుట్ నాథ,  అవాహీ నాగ దేవాలయాలు కూడా చూడతగినవి.

## 128 మణికర్ణిక దేవాలయం కులూ



హిమాచల్ ప్రదేశ్ లోని కులూ కు 42కిలోమీటర్లు, నగ్గర్ కు 61 కిలోమీటర్లు, మనాలికి 80 కిలోమీటర్ల దూరం లో మణికర్ణిక (మణి కరణ్ )దేవాలయం ఉంది.పెద్ద టూరిస్ట్ అట్రాక్షన్ ఉన్న ప్రదేశం, కులూ జిల్లాలో బియాస్-పార్వతి నదుల మధ్య పార్వతి లోయలో ఉన్న ఆలయం ఇది, 1760 మీటర్ల ఎత్తున ఉన్న ఈ ప్రదేశం వేడి నీటి ఊటలకు అంటే హాట్ వాటర్ స్ప్రింగ్స్ కు బాగా ప్రసిద్ధి, ఇక్కడ రామ చంద్ర దేవాలయం, సిక్కు గురుద్వారా కూడా దర్శనీయాలే,

ఈ మణి కరణ్ ప్రదేశానికి పురాణ సంబంధ ప్రశస్తి ఉంది. ఒకసారి శివ పార్వతులు విహార యాత్ర చేస్తూ ఈ ప్రదేశానికి వచ్చారు, ఇక్కడి ప్రకృతి అందచందాలకు పరవశులై ఇక్కడే కొంతకాలం గడుపుదామనుకొని ఉండిపోయారు, ఒక రోజు పార్వతీదేవి జలప్రవాహం లో స్నానం చేస్తుండగా,ప్రవాహ వేగానికి చెవి ఆభరణమైన మణికర్ణిక నీటిలో జారి పడి కనిపించలేదు, అమూల్యమైన ఆ మణి చే జారిపోయినందుకు పార్వతీ దేవి దిగులు చెంది, ఎలాగైనా సరే ఆమణి ని వెతికించి దొరికేట్లు చేయమని భర్త శివుని ప్రాధేయ పడింది, వెంటనే శివుడు తన అనుచరగణాన్ని

మణి కోసం గాలించమని ఆదేశించాడు, వాళ్ళు ఎంత వెదికినా మణి ని కనుక్కోలేక పోయే సరికి శివుడు కోపం తో ఉగ్రుడై మూడవ నేత్రం తెరిచాడు, లోకాలు అల్లకల్లోలమయ్యాయి, దేవతలందరూ శివుని శాంతింప జేయమని సర్పరాజు శేషుడిని శరణు వేడారు,



వెంటనే శేషనాగుడు నోటితో ఫూత్కారాలు చేయగా ఆ వేడికి అక్కడ ఉష్ణ జలంఏర్పడి ప్రవహించింది, ఆ నీరు ప్రవహించి నంత మేర పార్వతీ దేవి పోగొట్టుకొన్న అమూల్య మణి వంటి మణులు లెక్కపెట్టటానికి వీలు లేనన్ని లేర్పడ్డాయి, ఈ సంఘటనకు శివ పార్వతులు సంతుష్టు లయ్యారు, అప్పటినుంచి ఇక్కడి హాట్ స్ప్రింగ్స్ పరమ పవిత్రమనే భావన వచ్చి, భక్తులు వాటిలో స్నానించి పార్వతీ పరమేశ్వరులను సందర్శించి పునీతులవుతున్నారు, ఈ ఉష్ణకుండ జలంలో స్నానం చేస్తే అనేక దీర్ఘ వ్యాధులు నయమౌతాయని విశ్వాసం,

ఈ ప్రదేశం లో ఉన్న గురునానక్ దేవ్ గురుద్వారా సిక్కులకు కూడా పవిత్ర యాత్రా స్థలమై మణి కరణ్ గురుద్వారా గా పిలువ బడుతోంది, ఈ గురుద్వారా మిగిలిన వాటికంటే చాలా పవిత్రమైనదని సిక్కుల నమ్మకం, ఇక్కడ ఉచిత భోజన ఏర్పాటు ఉన్నది,

నగరం మధ్యలో 17 వ శతాబ్దం లో రాజా జగత్ సింగ్ నిర్మించిన శ్రీ రామ చంద్ర దేవాలయం కూడా ప్రసిద్ధమై భక్తులకు పుణ్య ధామమైంది, ఇక్కడి శ్రీరామ విగ్రహాన్ని రామజన్మ భూమి అయోధ్య నుంచి తీసుకొని వచ్చి ప్రతిష్టించారు, 1889లో రాజా దిలీప్ సింగ్ ఆలయాన్ని పునర్నిర్మించాడు,

## 129 బిజిలీ మహాదేవాలయం కులూ లోయ

హిమాచల్ ప్రదేశ్ కులూ లోయలో 2,460 మీటర్ల ఎత్తున ఉన్న బిజిలీ మహాదేవాలయం హిమాచల్ ప్రదేశ్ దేవాలయాలలో ప్రసిద్ధమైనది, కులూకు 26, చంసార్ కు 3, మనాలి కి 60 కిలో మీటర్లలో ఈ ఆలయం మతాన్ గిరి పై ఉన్నది, ట్రెక్కింగ్ కు కూడా బాగా అనువైన ప్రదేశం, దీని చుట్టూ పార్వతి



,గర్సా బున్దార్, కులు కొండలున్నాయి, ఆలయానికి ఉన్న 60అడుగుల ఎత్తైన ధ్వజ స్తంభం (పతాక స్తంభం )సూర్యకాంతిలో వెండి సూదిలాగా మెరుస్తూ కనిపిస్తుంది, ఇది దేవతల అనుగ్రహాన్ని ఆకర్షించి మెరుపులద్వారా తెలియ జేస్తుందని, మెరుపు మెరిసిన ప్రతిసారీ ఆలయం లోని శివలింగం అనేక ముక్కలు చెక్కలుగా పగిలిపోతుందని అంటారు, అలా పగిలిన శివలింగం ముక్కలను పూజారి వెన్న, గింజలపొడి గోధుమపిండి తో చేయబడిన సత్తూ అనే పేస్ట్ తో కలిపి మళ్ళీ అతికిస్తాడు, ఇలా ఏడాదికి ఒక్కసారి మాత్రమె జరుగుతుంది, కనుక ఈ శివాలయానికి మెరుపు ల మహాదేవాలయం అంటే బిజిలీ మహాదేవాలయం అనే పేరొచ్చింది

ఈ ఆలయ నిర్మాణం పహారీ శైలిలో ఉన్నది, శివుని ముందున్న నంది మెరిసిపోతూ మహా ముచ్చటగా ఉంటుంది, హిమాచల్ ప్రదేశ్ లో పహారీ ఆర్కిటెక్చర్ క్రీశ 8 వ శతాబ్దం లో ప్రారంభమైనదని ఈ ఆలయం, అప్పుడే ఆ తొలి నాళ్ళలో నిర్మించబడినదని అంటారు, ఆలయానికి చేరాలంటే చంసారి గ్రామం నుంచి 3 కిలోమీటర్లు ట్రెక్కింగ్ చేసి రావాలి, శ్రావణ శుద్ధ పాడ్యమినాడు భక్తులు ఈ బిజిలీ మహాదేవాలయానికి వచ్చి పితృదేవతలకు ప్రార్ధనలు చేస్తారు, అప్పుడే బ్రహ్మాండమైన జాతర జరుగుతుంది,

## 130 ద్రోణాచార్యుడు నిర్మించిన సదాశివ బారి దేవాలయం ఊనా



హిమాచల్ ప్రదేశ్ ఊనా లో ద్రోణాచార్యుడు నిర్మించిన అతి ప్రాచీన సదాశివ బారి దేవాలయం ఉన్నది, ఇది హోషియార్పూర్ –ధర్మశాల రోడ్ పై సోమ భద్ర అనే స్వాన్ నదీ తీరం లో ఉంది.ఇక్కడే ధనుర్విద్యా గురువు ఆచార్య ద్రోణుడు శిష్యులకు ధనుర్విద్య నేర్పిన కేంద్రం, ఇక్కడి సదాశివబారి దేవాలయాన్ని ద్రోణాచార్యుడు తన కుమార్తె జయతి కి నిత్య శివదర్శన పూజాదికాలకోసం నిర్మించాడని స్థలపురాణం,



దీనికి దగ్గరలోనే తల మేప్రోల్ లో మరొక సదా శివమందిరం ధౌమ్యేశ్వర దేవాలయం ఉన్నాయి, ఎత్తైన కొండమీద ఉన్న ఈ ఆలయలనుంచి నాలుఉవైపులా కంటికి ఇంపైన ప్రకృతి సౌందర్యాన్ని దర్శించవచ్చు, ఈ సదాశివ దేవాలయంలో శివ-పార్వతులు కలసిఉన్న అర్ధనారీశ్వరుడు ఉంటాడు, కొండపైన మహా ప్రశాంతంగా ఉంటుంది రివ్వున వీచే గాలి మానసిక ఆనందాన్ని, ప్రశాంతతను కలిగిస్తుంది, అందుకే నిత్యం కనీసం వెయ్యి మంది భక్తులు వస్తారు,

గుజరాత్

## 131 అరేబియా సముద్రం లో శివాలయం కొలియోక్



గుజరాత్ రాష్ట్రం భావనగర్ దగ్గర కొలియోక్ లో అరేబియా సముద్రం లో శివాలయం ఉండటం గొప్ప విశేషం, "నిష్కలంకేశ్వర్ దేవాలయం "గా పిలువబడే ఈ ఆలయం అరేబియా సముద్రం మధ్యలో ఉంది, సముద్ర తీరం నుండి ఒకటిన్నర కిలో మీటర్లు సముద్రం లోకి ప్రయాణించి ఆలయాన్ని చేరుకోవాలి, మహా భారత యుద్ధం లో పాండవులు తమ దాయాదులైన కౌరవులను అందరిని నిర్వంశం గా సంహరించి జయించి హస్తినాపుర సామ్రాజ్యాన్ని పొందారు, యుద్ధం జయించారు కాని వారి మనసులలో దాయాదుల చావుకు కారణం తామే ననే భావాన్ని మనసునుంచి తొలగించు కోలేక పోయారు, అందుకని ఇక్కడికి వచ్చి అయిదు శివ లింగాలను ప్రతిష్టించి పాప ప్రక్షాళనం చేసుకొన్నారని పురాణ కథనం,

కళంకం అంటే మచ్చ, దాన్ని లేకుండా చేసుకోవటం నిష్కళంకంగా ఉండటం,, పాండవులు ఇక్కడ దాయాది సోదర హత్య అనే మహా



పాపం అంటే కళంకాన్ని శివ లింగాలను ప్రతిష్టించటం వలన పోగొట్టుకున్నారు, అందుకే ఈ శివలింగాన్ని" నిష్కళంకేశ్వర్ "మహా దేవ శివ లింగం అంటారు, ఇక్కడే ఆ తర్వాత శివాలయాన్ని నిర్మించి పూజించారు, అయితే ఈ ఆలయం సముద్రం పొంగినపుడు నీటిలో మునిగి పోయి అదృశ్యమౌతుంది, ఆలయ శిఖరం పై ఉన్న పతాకం మాత్రమే కనిపిస్తుంది, కాని పౌర్ణమి నాడు సముద్రం బాగా వెనక్కి తగ్గి పోతుంది, అప్పుడు ఆలయం, శివలింగం బయట పడుతాయి, ఆసమయం లో భక్తులు పడవల ద్వారా ఈ శివ లింగాన్ని చేరుకొని అభిషేకించి పూజిస్తారు,



ఈ ఆలయ స్తంభాలు 20 అడుగుల ఎత్తు గా ఉంటాయి, సాధారణం గా ఆలయ స్తంభాలు సముద్ర జలాలలో మధ్యాహ్నం ఒంటి గంటవరకు మునిగి పోయి ఉంటాయి, మధ్యాహ్నం ఒంటి గంట తర్వాత యాత్రిక భక్తులు సముద్ర జలాలమీదుగా ఆలయ దర్శనానికి బయల్దేరి వస్తారు, రాత్రి 10 గంటల వరకు శివుని దర్శించి పూజించు కోవచ్చు, మధ్యాహ్నం ఒంటి గంట నుండి రాత్రి 10 వరకు సముద్రుడు భక్తులశివ



దర్శనానికి అనుకూలంగా, రక్షణగా ఉండటానికి దారి ఇస్తున్నట్లు వెనక్కి తగ్గి తానూ శివ భక్తుడనే నని రుజువు చేసుకొంటా డన్నమాట,, సముద్రుని ఉదార హృదయం సముద్రమంత విశాలమైనది, లోతైనది అని నిరూపించుకొంటాడు,, రాత్రి 10 గంటల తర్వాత మళ్ళీ సముద్రుడు విజ్రుంభించి ఆలయాన్ని క్రమంగా ముంచేస్తాడు, ఇదీ గొప్ప విచిత్రం, అంతటి విశేష, విచిత్ర ఆలయం ఇది, జ్యోతిర్లింగాలలో ముఖ్యమైన సోమనాద్ జ్యోతిర్లింగ దర్శనం, ద్వారకలో ద్వారకాధీశ శ్రీ కృష్ణ దర్శనం తో పాటు పాండవుల కళంకాన్ని కడిగేసిన ఈ శ్రీ కళంకేశ్వరస్వామిని కూడా తప్పక దర్శించి పాప ప్రక్షాళనం చేసుకోవాలి,

## 132 విషహర నాగేశ్వర దేవాలయం ద్వారక



గుజరాత్ లో ద్వారకకు, ద్వారక ద్వీపానికి మధ్యలో శ్రీ నాగేశ్వర మహాదేవాలయం ఉంది.సాధారణ హిందువులతోపాటు శైవ, వీరశైవులు విశేషంగా సందర్శించే ఆలయం ఇది, ఈ నాగేశ్వర స్వామిని దర్శిస్తే విష జీవులు, విషాహార వస్తువుల వలన ఏ ప్రమాదమూ ఉండదని భక్తుల ప్రగాఢ నమ్మకం, ఆలయం బయట అతిపెద్ద శివ విగ్రహం చాలా దూరం నుండే చూపరులను బాగా ఆకర్షిస్తుంది, ఇది కూడా ఒక జ్యోతిర్లింగ ఆలయమని ఒక విశ్వాసం ఉన్నది

## 133 –శివలింగం లేని పింప్లేశ్వర మహాదేవాలయం –సాల్డి

గుజరాత్, మెహ్సానా జిల్లా సాల్డి గ్రామం లో శ్రీ పింప్లేశ్వర మహా దేవాలయం "సాల్డి నొ మెనో "అంటే నవ్వుల పండగ అనే వార్షిక ఉత్సవానికి మిక్కిలి ప్రసిద్ధమైనది, శ్రావణ మాసం చివరి సోమవారం ఈ

ఉత్సవం ఇక్కడ జరుగుతుంది, ఇక్కడి మరో విశేషం ప్రతి శివాలయం లో ఉన్నట్లు ఈ ఆలయం లో శివ లింగమే లేక పోవటం, లింగానికి బదులు భూమిలో ఉన్న జలశాల (ఆక్వి ఫయర్ ) నుంచి పైకి ఉబికే జలధార నే దైవంగా భావించి పూజిస్తారు అందుకని దీన్ని "జలధారి "అంటారు, ఈ సహజ సిద్ధ జల ధార అత్యంత పవిత్రమైనదిగా భావిస్తారు '





సాల్ది గ్రామం అహ్మదాబాద్ కు 60 కిలోమీటర్లలో ఉన్నది, అందమైన గ్రామీణ వాతావరణం, ఇక్కడే ప్రత్యేకమైన రావి చెట్లు (పింపల్ ట్రీస్ ) బిల్వవృక్షాలు, వాఖాడ వృక్షాలవలన ఈ ఆలయానికి శోభా, జనాకర్షణ ఎక్కువ, రావి చెట్టు అత్యంత పవిత్రమైనదనిండులో మరీ వృద్ధ వృక్షాలు అత్యంత శక్తి జనకాలని నమ్మకం, ఆరోగ్యానికి రావి చాలా ముఖ్యమైనది, రావి చెట్టు గాలి చల్లదనానికి, ఆరోగ్యానికి, శ్రేయస్సుకు, ఆయుర్ వృద్ధికి మానసిక ప్రశాంతత కు ప్రసిద్ధి, దాదాపు 100 ఏళ్ళుగా ఈ ఆలయానికి మరమ్మత్తులు చేయలేదు కనుక చాలా పాతః దేవాలయంగా కనిపిస్తుంది

సుమారు 200 ఏళ్ళక్రితం సాల్వభాయ్ పటేల్, తేజా పటేల్ అనే తండ్రీ కొడుకులు గుజరాత్ లోని చామ్పనేర్ నుండి ఇక్కడికి వచ్చి స్థిరపడ్డారు, 7 తరాలుగా వారి వంశం ఇక్కడ వర్ధిల్లుతోంది, కనుక గ్రామ నామం వారిపేరుమీదనే సాల్ది అయింది, ఆ వంశం లో పేథాపటేల్ అనే ఆయన గారి ఆవు రోజూ ఒక చోటరావి చెట్టుకింద పాలు కారుస్తున్నట్లు గమనించాడు, ఆ గోవు తన క్షీరం తో నిత్యాభిషేకం

శివునికి చేస్తున్నట్లు గ్రహించారు అప్పటినుంచి ఈ ప్రదేశానికి విపరీతమైన ప్రసిద్ధిఏర్పడి భక్త జన సందోహం తో కళకళ లాడుతోంది



పేథా పటేల్ ఇక్కడే మొట్టమొదట ఆలయంక్రీ.శ.1086 లో కట్టించాడు ఇప్పుడున్న దేవాలయాన్ని బరోడా మహారాజు సాయాజీ రావు గైక్వాడ్ 1895 లో నిర్మించాడు, ఈ ప్రసిద్ధ అశ్వత్థ శివ మహా దేవాలయం సుమారు50 ఎకరాల విస్తీర్ణం లో ఉన్నది, ఇక్కడే ఉమయా, అంబా లక్ష్మి గణేష్, పార్వతి నాగ దేవత, హనుమాన్ దేవాలయాలున్నాయి, ధ్యానానికి మందిరం కట్టారు అందులో శివ పంచాక్షరి మంత్రం జపం చేసుకొంటారు భక్తులు, శివరాత్రి నాడు మహా వైభవం గా పూజలు భజనలు, సంకీర్తనలు నిర్వహిస్తారు, శ్రావణమాసం లో ఎంతో దూరాన్నుంచి భక్తులు శివపంచాక్షరి, దూన్ ఉచ్చరిస్తూ పింప్లేశ్వరాలయానికి వచ్చి శివమహా దేవుడైన జలదారి ని అర్చించి తరిస్తారు, నంది పై శివుని ఉంచి 5 సార్లు ఆలయం చుట్టూ ప్రదక్షిణ గా ఊరేగిస్తారు,

శ్రావణ మాస చివరి సోమవారం భారీ ఎత్తున నిర్వహించే "సలాది నొ మెలో"ఉత్సవానికి దాదాపు మూడు లక్షలమంది యాత్రిక భక్తులు హాజరై పాల్గొంటారు, బిల్వ పత్ర(మారేడు దళ)పూజ రోజున భక్తులు పూజారికి సహకరిస్తూ లక్ష పత్రి పూజ ఘనంగా చేస్తారు మృత్యుంజయ జపాన్ని ఎంతో భక్తి శ్రద్ధలతో భక్తులు ఆచరిస్తారు, , చిన్న పిల్లలకు పుట్టు వెంట్రుకలు ఇక్కడే వేడుకగా తీయించటం ఒక ప్రత్యేకత,

రాజస్థాన్

## 134 అచలేశ్వర మహా దేవాలయం రాజస్థాన్



రాజస్థాన్ సిరోహి జిల్లా అచల్ గర్ కోట కు సమీపం లో శ్రీఅచలేశ్వర మహా దేవాలయం క్రీ.శ.9 వ శతాబ్దం లో నిర్మింపబడిన దేవాలయం. అచల్ గర్ కోటను నిర్మించిన పారమార్ రాజు లు కట్టించిన ఆలయం. 1452మహా రాణా కుంభ దీనిని పునర్నిర్మించి మరమ్మత్తులు చేశాడు. అచల అంటే కదలని ఈశ్వర్ అంటే శివుడు. శివుని పాద మడమ గుర్తు పై నిర్మించబడిన ఆలయం గా స్థానికుల విశ్వాసం. దీనిసే శివలింగం గా మలచి పూజిస్తారు. ఆలయం న్యూక్లియర్ రియాక్టర్ డోమ్ లాగాఉన్నదాన్ని శివుని ఆకారంగా, పైభాగం సృష్టికి కారణమైన శక్తి స్వరూపిణి రూపంగా భావిస్తారు.



దక్షిణాన అగ్ని గుండం ప్రక్కన ఆలయం ఉంటుంది. శివవాహనమైన నంది చిన్నవిగ్రహాలు చాలా ఉంటాయి. అందులో నాలుగు టన్నుల బరువుతో బంగారం, వెండి, రాగి, జింకు, కంచు పంచ ధాతువులతో నిర్మించబడిన నంది విగ్రహం మిక్కిలి ఆకర్షణీయం. ఆలయం పై ముస్లిం దండయాత్ర లను నిరోధించటానికి ఈ నందీశ్వరుడు లక్షలాది తేనెటీగలను వారిపై ఉసిగొల్పి ఆలయం విధ్వంసం కాకుండా కాపాడుతాడు అని అచంచల విశ్వాసం.

ఇక్కడే స్పాటిక విగ్రహాలున్నాయి. అందుకని ఈ విగ్రహాలు సహజ కాంతిలో కాంతి నిరోధకం గా(ఒపెక్ ) ఉండి,వాటిపై కాంతి ప్రసరింప జేస్తే స్పాటిక పార దర్శకమై (ట్రాన్స్ లుసెంట్ ) గా కనిపించటం మరో విశేషం.



ఆలయం లో ఉన్న గొయ్యి నరకానికి ద్వారం గా భావిస్తారు. ఆలయం ప్రక్కనే మూడు ఎద్దుల అద్భుతమైన కొలను మూడు దున్నపోతుల శిల్పాలు మనోహరంగా ఉంటాయి, నీటి తూము గుండా ప్రవహించే నెయ్యి ని ఆపటానికి ఈ దున్నలు అడ్డుపడితే, రాజా అది పాల్ వాటిని కాల్చి చంపి ప్రవాహాన్ని పునరుద్ధరించాడని స్థానిక కధనం.

ఆలయ మరమ్మత్తుల పేరిట జరిగే పనులన్నీ ఆలయ శోభను తగ్గిస్తున్నాయి. అయితే ఈ మార్బుల్ మరమ్మత్తులు ఆలయం పాడై పోకుండా కాపాడుతూ చెడులో మంచి గా ఉంది..1979 లో సిరోహి రాజ్య యువరాజు ఆలయ పునర్నిర్మాణ పనులను పర్య వేక్షిస్తుండగా సున్నంలోపల మార్బుల్ కనిపించింది. రాజకుమారుడు పాలరాతి పనులలో అత్యంత సమర్ధులను పిలిపించి ఆలయానికి పూర్వ శోభ వచ్చేట్లుమార్బుల్ తో తీర్చి దిద్దించాడు. గర్భ గుడి పనులు చేస్తుండగా అది మార్బుల్ స్లాబ్ లతో నిర్మించ బడినది కాదనీ, అతిపెద్ద పాలరాతి తో చేయబడినట్లు గ్రహించారు. ప్రదక్షిణమార్గం అంటే పరిక్రమ కూడా బయట పడింది. వసారాలో వెనుక భాగం లో, ఎడమవైపునా ఉన్న చాముండీ దేవి విగ్రహాలు కనిపించాయి. అవి పవిత్ర ఎరుపురంగు శిలా స్పటిక నిర్మితాలు. ఈ విగ్రహాలు రిపేర్ పని ప్రారంభించక ముందు నిత్యార్చన వైభవం లో ఉండేవని తెలిసింది.

# 135 శ్రీ భండ దేవా శివాలయం రాంఘర్





తూర్పు రాజస్థాన్ లో బరాన్ జిల్లా బరాన్ కు 40 కిలోమీటర్ల దూరం లో రాం ఘర్ బిలం వద్ద శ్రీ భండ దేవ శివాలయం ఉంది, ఒక ఉల్కా పాతం వలన ఏర్పడిన బిలం ఇది, ముఖ్య ఆలయం మధ్య ప్రదేశ్ ఖజురాహో నిర్మాణ శైలిలో నిర్మించబడింది, అందుకని దీనికి "చిన్న ఖజురాహో "అనే పేరొచ్చింది, 750మెట్లు ఎక్కి కొండమీద ఉన్న ఈ ఆలయాన్ని చేరుకోవాలి, కిశ్నై అని అయ్యవారిని అన్నపూర్ణ అని అమ్మవారినీ పిలుస్తారు, ఝాలాఝాలీం అనే రాజు కట్టించిన ఆలయం, 1771 నుండి 1838లో బ్రిటిష్ వారు జోక్యం చేసుకొనే వరకు ఝలావర్ రాజ్యాన్ని ఈ వంశ రాజులు పాలించారు, కార్తీక పౌర్ణమి నాడు పెద్ద ఉత్సవం నిర్వహించి దేవీ దేవతలను కొలుస్తారు,

ఆలయ శిలా ఫలకం పై దీని వివరాలు లిఖించబడి ఉన్నాయి, అందులోని విశేషాలు, "శైవం లో తాంత్రిక శైవానికి సంబంధించిన ఆలయం ఈ భండ దేవా శివాలయం, ఆలయ నిర్మాణం నగర శైలి లో ఉన్నది, మాల్వదేశాన్ని ఏలిన నాగ వంశరాజు రాజా మలయ వర్మ ఈ ఆలయాన్ని 10 వ శతాబ్దం లో కట్టించాడు, ఈ ఆలయం తాను శత్రు రాజులను జయించినందుకు గుర్తుగా తన విజయాలకు కారణ భూతుడై ఆశీర్వ దించిన మహా శివునికి అంకితంగా నిర్మించానని తెలియ జేశాడు.1162 లో మేద్ వంశరాజు రాజా త్రిష్ణ



వర్మ ఆలయాన్ని పునర్నిర్మించాడు, ఆలయం లో సమావేశ మందిరంగా యక్ష, కిన్నర, కింపురుష, విద్యాధర జంటలు వివిధ భంగిమలలో ఆకర్షించే శిల్పాలున్న ఎనిమిది పెద్ద స్తంభాలపై నిర్మించబడిన విశాలమైన హాలు ఉంది,

## 136 బిసల్దేవ శివాలయం బిసల్పూర్



రాజస్థాన్ లో టోంక్జిల్లా బిసల్ నది పై ఉన్న బిసల్పూర్ డాం దగ్గర బిసల్పూర్ లో బిసల్దేవ శివాలయం ఉన్నది. దీనిని గోకర్ణే శ్వరాలయం అంటారు. 12 వశతాబ్దిలో చహమాన రాజు నాలుగవ విగ్రహరాజు నిర్మించిన ఆలయం రాజు కు బిసల్దేవ్ అనే పేరున్నది అందుకనే బిసల్దేవ్ శివాలయం అంటారు. బిసల్పూట్ ను. విగ్రహరాజులు నిర్మించారుకనుక విగ్రహరాజ దేవాలయం అనీ అంటారు. విశాల దేవుడు అనే బిసల్దేవ మహా రాజు 1150నుండి 1164 వరకు పాలించాడు,కనుక బి(వి )శాల దేవ దేవాలయం అంటారు. ఆలయ ప్రాంగణం లో కొంత భాగం బిశాల డాం రిజర్వాయర్ లో మునిగి ఉంటుంది. 1990 లో డాం కట్టేటప్పుడు నీటి మట్టం బాగా ఎత్తు గా ఉండేది. కొండపైన ఉన్న ఈ ఆలయన్నుంచి చూస్తే బనస్, దాల్ నదుల సంగమం ఆకర్షణీయంగా దర్శనమిస్తుంది. పురాతత్వ శాఖ ఈ ఆలయాని జాతీయ స్మారక చిహ్నంగా భావించి రక్షిస్తోంది

గర్భాలయం, శిఖరం, అంతరాలయం, చతురస్ర మండపం, అర్ధ చంద్రాకార డోమ్, ముందు ప్రాంగణం తో ఆలయం శోభాయమానంగా ఉంటుంది. గర్భగుడిలో శివలింగం, ఆలయ స్తంభాలపై చెక్కబడిన పుష్పలతలు చూడతగినవి.

## 137 ఏకలింగ దేవాలయం కైలాస్ పూరి (ఉదయపూర్)

రాజస్థాన్ ఉదయపూర్ లో మేవార్ రాజ వంశీకుల ఇలవేలుపు ఏకలింగ స్వామి దేవాలయం ఉంది.15 వ శతాబ్ది గ్రంధం "ఏక లింగ మహాత్మ్యం "ప్రకారం ఈ ఆలయాన్ని 8 వ శతాబ్ది రాజు బొప్పా రావల్ నిర్మించాడు. ఢిల్లీ సుల్తానుల దురాక్రమణ దాడులలో అసలైన దేవాలయం, లింగం ద్వంసమైనాయి. 14 వశతాబ్దం లో రాజా హమీర్ సింగ్ ఆలయాన్ని పునర్నిర్మించాడు. 15 వ శతాబ్దం లో కుంభ రాణా మహారాజు మరల ఆలయాన్ని



పునర్నిర్మిస్తూ, విష్ణు దేవాలయం కూడా కట్టించాడు. 1460 లో కుంభ రాణా వేయించిన శాసనం లో "నేను ఏకలింగ స్వామికి వ్యక్తిగత దాసాను దాసుడను "అని రాయించాడు.



15 వ శతాబ్దం లో మాల్వా సుల్తాన్ ఘియత్ ఖాన్ మేవాడుపై దాడి చేసి ఏకలింగ దేవాలయ విధ్వంసం చేశాడు. 1473-15 09 కాలపు రాజైన కుమ్భరాణా కుమారుడు రాణాజైమాల్, ఖాన్ ను ఓడించి బంధించి, తగిన శుల్కం పొంది విడుదల చేశాడు. ఈ ద్రవ్యం తో ఏకలింగ దేవాలయ సముదాయాన్ని మళ్ళీ కట్టించి లింగ ప్రతిష్ట చేశాడు. పూర్వం ఈ దేవాలయం పాశుపత అనుయాయుల అధీనం లో ఉంటె తర్వాత నాధ సంప్రదాయుల అధీనం లోకి వచ్చింది. 16 వ శతాబ్దిలో రామనందిల పరమైంది.

## 138 చోముఖ భైరవ దేవాలయం ఝున్ ఝును



ఫిబ్రవరి నెలలో అష్టమి తిది నాడు లేక జాగ్గాన్ నాడు వేలకు వేలుగా భక్తులు వచ్చి దర్శించే భైరవ దేవాలయమే రాజస్థాన్ లో ఝున్ ఝును వద్ద ఉన్న చోముఖి భైరవాలయం. చో ముఖి అంటే నాలుగు ముఖాల భైరవుడున్న దేవాలయం . భైరవుడు శివుని అవతారమే. ఆలయం లోని భైరవ మూర్తి నాలుగు ముఖాలతో పరమ భయంకరం గా కనిపిస్తాడు.

## 139 ఘుష్మేశ్వర జ్యోతిర్లింగ దేవాలయం




## సవాయ్ మధోపూర్

12 జ్యోతిర్లింగ క్షేత్రాలలో చివరిది అయిన ఘ్రుష్మేశ్వర జ్యోతిర్లింగా క్షేత్రం రాజస్తాన్ లోని సవాయ్ మధోపూర్ లో ఉంది.ఘ్రుశ్నేశ్వర జ్యోతిర్లిన్గాలయం మహా రాష్ట్ర లో పిర్డీ నుంచి ఔరంగా బాడద్ వెళ్ళే మార్గం లోకూడా ఉన్నది. పై ఆలయం గురించి అనేక కధలు గాధలు శివ పురాణం లో ఉన్నాయి. శివరాత్రినాడు లక్షలాది జనం, మామూలు రోజుల్లో వేలాది జనం దర్శించే ఆలయం ఘుష్మేశ్వర ఆలయం.

## 140 నల్దేశ్వర గుహాలయం ఆల్వార్

క్రీశ 6 -9 శతాబ్దాలలో సహజ సిద్ధ లింగం తో ఏర్పడిన గుహాలయమే ఆల్వార్ లోని నల్దేశ్వరాలయం. అందమైన ప్రకృతి మధ్యలోకొండల మధ్య ఉన్న ఆలయం. 18 వ శతాబ్దం లో సహజత్వానికి భంగం రాకుండా ఆలయాన్ని నిర్మించి నల్దేశ్వరాలయనిర్మాణం చేశారు ఋతుపవన కాలం లో ఇక్కడి ప్రకృతి శోభను తనివి తీర చూసి పులకించి ప్రకృతి సిద్ధంగా ఏర్పడిన నల్దేశ్వర స్వామి దర్శనం చేస్తారు భక్తులు.



## 141 పర హేద శివాలయం బన్స్ వారా

వెయ్యేళ్ళ చరిత్ర కలిగిన ఈ పర హేద శివాలయాన్ని దర్శించటానికి దేశం నలు మూలల నుంచి భక్తులు విశేషంగా వస్తారు. దీనికే భోగేశ్వర శివాలయం అనే పేరు కూడా ఉంది. రాజస్థాన్ లో బన్స్ వారాకు చాలాదూరం లో ఉన్న ఆలయం. ఆలయం ముందు శివుని వాహనం నందీశ్వరుని విగ్రహం అత్యంత ఆకర్షణీయం.



## 142 పరశురామ మహా దేవాలయం పాలి

రాజస్థాన్ లోని పాలి లో ఉన్న ఈ శివలింగాన్ని పరశురాముడు ప్రతిష్టించి నట్లు ప్రతీతి. తన పరశు అంటే గండ్ర గొడ్డలితో కొండ ను చేదించి గుహ ఏర్పరచి ఆలయం చేశాడు పరశురాముడు. ఆరావళీ పర్వత శ్రేణులలో అత్యంత ఆకర్షణీయ ప్రకృతి పరిసరాలలో ఈ ఆలయం చూడటానికి అశేషంగా భక్తులు వస్తారు. సంవత్సరం లో రెండు రోజులు పెద్ద ఎత్తున ఇక్కడ ఉత్సవాలు నిర్వహిస్తారు, ఈ ఉత్సవాలు ఆగస్ట్ నెలలో శ్రావణ శుద్ధ షష్టి, సప్తమి నాడు జరుగు తాయి.

హర్యానా

## 143 భూతేశ్వరాలయం జింద్(హర్యానా )



లెక్కలేనన్ని శివాలయాలున్న 48 కోశ కురుక్షేత్ర పరిక్రమ లో భాగం గా హర్యానా జింద్ లో ఉన్న భూతేశ్వరాలయం ఉన్నది, హర్యానా పాలకుడు రఘు వీర సింగ్ కట్టించిన ఆలయమే భూతేశ్వరాలయం, ఆలయం చుట్టూ విశాలమైన సరస్సు ఉంది.అందువలన రాణీ తలాబ్ అనే పేరు కూడా వచ్చింది, త-లాబ్ అంటే హిందీలో కొలను అని అర్థం,

సంవత్సరం పొడవునా ఆలయం భక్తుల రద్దీ తో ఉంటుంది, దగ్గరలో హరి కైలాస దేవాలయం, సూర్య కుండం, జావాల మలేశ తీర్ధం దర్శింప తగినవి, గురు తేజ్ బహదూర్ స్మృతి చిహ్నమైన గురుద్వారా కూడా సమీపం లో ఉంది. మహారాజ రఘు వీర్ సింగ్ మహా రాణి ప్రతి రోజు రాత్రి వేళ సురంగ్ శిధిలాలు దాటి ఇక్కడికి వచ్చి ఈ సరస్సు లో స్నానం చేసేది, అందుకనే ఈ కోలనుకు రాణీ తలాబ్ అనే పేరొచ్చింది, ఇది గోహనా రోడ్ పై ఉన్నది, దీనిని 'లైఫ్ లైన్ ఆఫ్ ది ఎన్శేంట్ సిటి "అంటారు, ప్రభుత్వ ఆసుపత్రి, పోలీస్ స్టేషన్ వగైరా అన్నీ అతి దగ్గరలోనే ఉన్నాయి,



## 144 మార్కండేయ మహా దేవాలయం చామోర్షి

హర్యానా కురుక్షేత్ర జిల్లా సహబాద్ మార్కండేయ టౌన్ దగ్గర చామోర్షి లో మార్కండేయ మహా దేవాలయం మృకండ మహర్షి కుమారుడైన మార్కండేయ మహర్షి ఆనవాలుగా ఉన్నది, మార్కండ నదీ తీరం లో ఉన్న ఈఆలయానికి విశేష ప్రఖ్యాతి ఉన్నది, ఈ నది గగ్గర్ నదికి, పురాణ ప్రసిద్ధ సరస్వతి నదికి ఉపనది, మార్కండేయ మహర్షి నాటి రుషి వాటికలు ఇప్పటికీ దర్శనమిస్తాయి, ఆలయ గోడపై శివుడు మార్కందేయులను యమ పాశం నుంచి రక్షించే దృశ్యం పరమాద్భుతంగా ఉంటుంది,

మార్కండేయునికి 16 వ ఏట మృత్యు గండం ఉన్నదని దేవతల ఆజ్ఞతో అనుక్షణం శివలింగానికి అభిషేక పూజాదులు చేసేవాడు, 16 వ ఏడు రాగానే యమభటులు ప్రాణం హరించ టానికి వచ్చి విఫలురవగా, సాక్షాత్తు యముడే





మార్కండేయుని ప్రాణాలను లాక్కుని వెళ్ళటానికి రావటం ఆయన శివ లింగాన్ని గట్టిగా కావలించు కొని ఉండటం శివలింగం లో నుంచి శివుడు ప్రత్యక్షమై యముడిని కాలితో తన్నటం అతడు విధిలేక పారిపోవటం మనకు తెలిసిన విషయమే. శివానంద లహరి లో శంకరాచార్య స్వామి కధనం కూడా, ఇక్కడే మార్కందేయమహర్షి మహా మృత్యుంజయ స్తోత్రం ఆశువుగా చెప్పాడు, మార్కండేయ పురాణం, భాగవతం మహా భారతం లో కూడా ఈ గాధ ఉన్నది, ప్రతి ఆదివారం, శ్రావణ మాసం లలో భక్తులు విశేషంగా దర్శించే ఆలయం ఇది అంబాలా –ఢిల్లీ గ్రాంట్ ట్రంక్ రోడ్ పై అంబాలాకు 20 కిలోమీటర్ల దూరం లో ఈ ఆలయం ఉన్నది

## 145 సిద్ధేశ్వర మహా దేవాలయం నైమిశారణ్యం

నైమిశారణ్యం లో చక్ర తీర్ధం దగ్గర శ్రీ సిద్దేశ్వర మహా దేవాలయం ఉంది.ఈ స్వామిని పూజిస్తే తీరని కోరిక ఉండదు అని నమ్మకం

## 146-సిద్దేశ్వర మందిరం – ద్వారక



గుజరాత్ ద్వారక వద్ద మరొక సిద్దేశ్వ్వరాలయం ఉన్నది, ఇది స్వయంభు లింగం అని ప్రసిద్ధి, ఇక్కడే ద్వారకాదీశ్వరుడైన శ్రీ కృష్ణ విగ్రహం సముద్రం లో కలిసి నట్లు పురాణ కధనం, ఈ ఆలయ సమీపం లోనే భూతెశ్వరాలయం తో పాటు పెద్ద బావి ఉన్నది.

.

ఢిల్లీ

## 147 గౌరీ శంకర దేవాలయం ఢిల్లీ



ఢిల్లీ లో చాందిని చౌక్ రోడ్ లో దిగంబర జైన దేవాల యానికి సమీపం లోఉన్న గౌరీ శంకర దేవాలయం 800ఏళ్ళ ప్రాచీన దేవాలయం, ఒక సైనికుడు యుద్ధం లో గాయపడగా, గాయాలనుండి రక్షిస్తే శివుడికి ఆలయం నిర్మిస్తానని మొక్కు కున్నాడు.అతడు సురక్షితుడు అవటం అన్నమాట నిలబెట్టుకొని శివ లింగ ప్రతిష్ట చేసి, గౌరీ శంకర ఆలయం కట్టించటం జరిగింది, గౌరీ దేవితోపాటు వినాయక, కార్తికేయ విగ్రహాలనూ ఏర్పాటు చేశాడు, శివలీలలు గోడలపై ఆకర్షణీయం గా ఉంటాయి,

## 148 శివ మందిరం ఢిల్లీ



ఢిల్లీ లో ఢిల్లీ గేట్ కు దగ్గరలో శ్రీ శివ మందిరం ఉంది.ఆ లయం పై నీలి రంగు బృహత్ రూపం లో శివ విగ్రహం విశేష ఆకర్షణ, అమ్మవారు కాళికాదేవి, లోపల కాల భైరవ మూర్తి ఉంటాడు, ఆయనకు మదిర అంటే మద్యం నైవేద్యం పెట్టటం రివాజు, ఆలయం ముందు వేప రావి చెట్లు పవిత్రతను పెంచుతాయి,

పశ్చిమ బెంగాల్

## 149 తారకేశ్వర దేవాలయం హుగ్లీ

పశ్చిమ బెంగాల్ హుగ్లీ నది తీరం లో ఉన్న తారకేశ్వర దే వాలయం భక్తుల మనో భీస్టా లను శీఘ్రంగా తీరుస్తుందని నమ్మకం, ఈ ఆలయ శివ విగ్రహం ఎక్కడో అరణ్యం లో రాజా విష్ణు దాస్ సోదరునికి కు దొరికిందని, ఆయన తెచ్చి ప్రతిష్టించి ఆలయ నిర్మాణం చేశాడని ప్రతీతి, శివుడు కలలో కనిపించి



ఆదేశించగా రాజా విష్ణు దాస్ ఇప్పుడున్న ఆలయం నిర్మించాడు, గుక్కెడు మంచి తీర్థం కూడా త్రాగ కుండా ఈ ఆలయం లో ఉపవాసం తో స్వామిని పూజిస్తే తారకేశ్వరుడు కోరిన కోరికలను తప్పక తీరుస్తాడని విశ్వాసం

మధ్య ప్రదేశ్

## 150 పశుపతి నాధ దేవాలయం మంద సార్



మధ్య ప్రదేశ్ మందసార్ లో శ్రీ పశుపతి నాధ దేవాలయం విశేషమైనది, భారత దేశం లో ఇదొక్కటే పశుపతి నాద దేవాలయం, నేపాల్ లో ఖాట్మాండ్ లో పశుపతి నాధ ఆలయం ఉన్నది, శైవం లో పశుపతి నాధ విధాన పూజకు ఈ ఆలయం ప్రసిద్ధి,. శివనా నదీ తీరం లో ఎనిమిది ముఖాల శివ లింగం ఇక్కడి ప్రత్యేకత, క్రీ శ,5 లేక 6 శతాబ్దాలలో నిర్మించిన ఆలయం,. అప్పుడు ఈ ప్రాంతానికి దశపురం అని పేరు. రాజస్తాన్ సరిహద్దు కు దగ్గర లో చారిత్రాత్మక మాల్వా ప్రాంతం లో ఇండోర్ కు 200 కిలోమీటర్ల దూరం లో ఉన్నది, గుప్త రాజుల కాలపు శిల్ప శైలీ నిర్మాణం కనిపిస్తుంది,

రెండవ శాతాబ్దినాటికే ఈ ప్రాంతం పర్యాటక కేంద్రం గా ఉండేది, కాళిదాస మహా కవి దశపుర మహిళలు పురుషుల మనసు లోబరచుకుని ముగ్గు లో దింప గలిగే నే ముఖ భంగిమలు ప్రదర్శించటం లో సిద్ధ హస్తులు అని పేర్కొన్నాడట.మొదటి శతాబ్ది పూర్వార్ధం లోనే ఈ ప్రాంతం సాంస్కృతిక వికాసం పొందినదిగా గుర్తింప బడింది, క్రీశ 404- 487కాలం లో సంస్కృతం లో

వాసుదేవ, శివులపై శ్లోక రచన జరిగింది, గుప్త రాజుల వర్ణనా ఉన్నది,. పశ్చిమ మధ్య ప్రదేశ్ తూర్పు రాజస్థాన్, ఉత్తర గుజరాత్ ప్రాంతాలలో అనేక దేవాలయా లు ఉండేవి, మందసార్ లోని ఆలయ నిర్మాణం మధ్యయుగ ప్రారంభ కాలపు పశ్చిమ శైలీ విధానం గా గుర్తించారు, గుప్త సామ్రాజ్య వైభవానికి ఇవన్నీ దృష్టాంతాలు,

నాలుగున్నర మీటర్లు అంటే 15 అడుగుల అష్టముఖ పశుపతి నాద శివ లింగం మొదటి శతాబ్దం లో అరుదైన విశేషం, ఈ భారీ లింగం శివానా నదిలో దొరికింది, దాన్ని జాగ్రత్తగా తెచ్చి ఇక్కడ ప్రతిష్టించారు, లింగం పై భాగం లోవరుసగా నాలుగు ముఖాలు, ,క్రింది భాగం లో నాలుగు ముఖాలు చెక్కబడినాయి, ముఖాలపై ఉన్న మూడు శివ నేత్రాలు తెరచుకొని ఉండటం విశేషం, ప్రతి ముఖానికి ఒక్కొక్క రకమైన కేశాలంకరణ ఆనాటి పురుష కేశాలంకరణ లాగా ఉండటం మరో ప్రత్యేకత, ప్రతి రూపానికి నగలు, కర్ణాభరణాలు ఉండటం మరో వింత, ఇది స్థానిక శైవ విధానపు ఆహార్యం, భవ, పశుపతి, మహాదేవ,ఈశాన, రుద్ర, శర్వ,ఉగ్ర, ఆశని అనే 8 ముఖాలతో పశుపతినాధుడు దర్శనమిస్తాడు, సాధారణంగా అష్ట మూర్తి గా అందరూ పిలుస్తారు,



# దర్శనీయ దేవీ ఆలయాలు

## 1 శ్రీ దేవి ఆజ్ఞతో దేవీపురం లో వెలసిన శ్రీ చక్రాలయం



అక్కడ తొమ్మిది కొండలు మనోహరం గా కని పిస్తాయి వాటి మధ్య పచ్చని ప్రకృతి పరవశం కల్గిస్తుంది. ఆకు పచ్చని తోటలు కను విందు చేస్తాయి అక్కడే దేవీపురం ఉంది. ఇది ఆంధ్ర ప్రదేశ్ లో విశాఖ కు అతి దగ్గరలో ఉన్న సబ్బవరం గ్రామానికి అయిదు కిలోమీటర్ల దూరం లో ఉంది. ఇక్కడే "సహస్రాక్షి "నామం తో శ్రీ రాజ రాజేశ్వరీ దేవి ఆలయం వెలసింది. ఆలయం అంతా శ్రీ చక్రం గా నే ఉండటం పరమ విశేషం. ఇంత పెద్ద శ్రీ చక్రాలయం ప్రపంచం లో ఇంకెక్కడా లేకపోవటం మరో విశేషం.

శ్రీ చక్రాలయం నిర్మాణానికి ఒక కద ఉంది. శ్రీ నిష్టల ప్రహ్లాద శాస్త్రి గారు న్యూక్లియర్ ఫిజిక్స్ లో డాక్టరేట్ చేసి, బొంబాయి లోని టాటా ఇన్ స్టి ట్యూట్ లో శాస్త్ర వేత్త గా ఉన్నారు. ఒక సారి శాస్త్రి గారు హైదరా బాద్ వచ్చి బిర్లా మందిరానికి వెళ్లి శ్రీ బాలాజీ ని దర్శించారు. ఒక ప్రశాంత మైన చోట కాసేపు ధ్యానం లో గడిపారు. అప్పుడు శ్రీ వెంకటేశ్వర స్వామి శ్రీ త్రిపుర సుందరీ మూర్తిగా దర్శనమిచ్చారు. తనకు "ఒక మంచి ఇల్లు" కట్టించమని శాస్త్రి గారిని ఆదేశించి అంతర్ధానమై పోయారు. ఇదేదో తమాషా అని పించింది ఆయనకు. కాని అమ్మ వారు ఆయన్ను వదలలేదు. మరో మారు ఇలానే ప్రత్యక్షమై "నువ్వే ఈపని చేయాలి నీ వల్లనే, నా ఆశీర్వాదం తో ఈ ఆలయ నిర్మాణం పూర్తీ కావాలి శాస్త్ర



పద్ధతి లో ఆగమ శాస్త్రాను సారం గా సర్వ సుందరం గా శ్రీ దేవీ ఆలయాన్ని నిర్మించి ప్రజలకు ఉపకారం చెయ్యి ".అని ఒకరకం గా ఆజ్ఞాపించింది. అంతే శాస్త్రి గారు వెంటనే నిర్ణయం తీసుకొన్నారు. కార్య క్రమానికి ఉపక్రమించారు. ఉద్యోగానికి సంకోచం లేకుండా రాజీ నామా చేసేసి స్వగ్రామం విశాఖ పట్నం వచ్చేశారు.

శ్రీ దేవీ ఆలయం నిర్మించే సంకల్పం తో నిష్టల శాస్త్రి గారు 1982 లో 108 మంది రుత్విక్కులతో, 16 రోజులు దేవీ యాగాన్ని పరమ నిష్ఠ తో చేశారు. వదాన్యులైన దాతలు వీరి అమోఘ సంకల్పానికి స్పందించి ఆలయ నిర్మాణానికి మూడు ఎకరాల స్థలం రాసిచ్చారు. ఈ స్తలమే పైన పేర్కొన్న తొమ్మిది కొండల మధ్యన ఉన్న ప్రదేశం. ఈ ప్రదేశం లో తగిన చోట ఆలయాన్ని నిర్మించాలని శాస్త్రిగారు నడిచి పరిశీలిస్తుంటే, ఒక రోజు అగ్ని గుండం లో మెరుపు లతో మెరిసే శరీరం తో పదహారేళ్ళ బాలిక లాగా శ్రీ దేవి దర్శన మిచ్చింది. పరవశంతో శాస్త్రి గారు అమ్మ ను అర్చించారు. అక్కడే తనకు "ఇల్లు "కట్టమని దేవి ఆజ్ఞాపించింది. ఆ ప్రదేశం లో త్రవ్వితే అగ్నిలో కాల్చిన గుర్తులున్న పంచ లోహ శ్రీ చక్రమేరువు లభించింది. దీన్ని గురించి వాకబు చేయగా ఇక్కడే 250 ఏళ్ళ క్రితం ఒక గొప్ప యజ్ఞం జరిగి నట్లు, ఆ యజ్ఞం పూర్తీ అవగానే ఆ శ్రీ చక్రమేరువు ను భూమిలో నిక్షిప్తం చేసి దానిపై కామాఖ్య పీఠం ప్రతిష్టించి నట్లు తెలిసింది,. ఇంకొంచెం ఎత్తు గా ఉన్న కొండ పైన శివాలయం కట్టించారు.



ఇప్పటి శ్రీ దేవీ ఆలయం లో శ్రీ చక్ర మేరునిలయం పొడవు 108 అడుగులు వెడల్పు 108 అడుగులు, ఎత్తు 54 అడుగులు. కొలతలతో నిర్మించారు. ఆది శంకరాచార్యుల వారి "సౌందర్య లహరి "లో వర్ణించిన రీతిలో, శ్రీ లలితా సహస్ర నామ స్తోత్రాలలో వాగ్దేవతలు వర్ణించి నట్లు గా ఆలయాన్ని నిర్మించారు. 1990 లో



మూల విరాట్ అయిన "సహస్రాక్షి "విగ్రహ. ప్రతిష్టఅగమోక్తం గా జరిగింది. శ్రీ చక్రాలయం మూడో అంతస్తులో అంటే "బిందు స్థానం "లో శయనించిన సదా శివుని మీద కూర్చున్న అమ్మ వారి నిలు వెత్తు విగ్రహం జీవ కళ ఉట్టిపడి కళ్ళను ప్రక్కకు తిప్పలేనంత మనోహరం గా ఉంటుంది. ఆమె చుట్టూ కింది అంతస్తులలో నక్షత్రాల వంటి ఆవరణలు, వాటిల్లో అమ్మవారి పరివార దేవతల విగ్రహాలు చూపరులను ఆకర్షిస్తాయి.

నిష్టల ప్రహ్లాద శాస్త్రి గారికి అమ్మ వారు ధ్యానం లో దర్శన మిచ్చిన విధం గానే "దేవీ ఖడ్గమాల"దేవతలకు రూప కల్పన చేసి, , గంధర్వ మాత్రు మూర్తులుగా 68 విగ్రహాలను భూమి మీద, 10 విగ్రహాలను మొదటి అంతస్తులో, ,10 విగ్రహాలను రెండో అంతస్తు లో సిమెంట్ తో నిర్మించి నెలకొల్పారు. మిగిలిన వాటిని పంచలోహాలతో తయారు చేయించి మూడవ అంతస్తు లో "అష్ట దళ పద్మం "లో ఉంచారు. వీటితో బాటు భూమి మీదే బ్రాహ్మి, మాహేశ్వరీ, కౌమారీ, వైష్ణవీ, వారాహీ, మాహెంద్రీ, చాముండీ, మహా లక్ష్మీ, ,బాలాజీ, కాళీయ మర్దనం చేస్తున్న బాల కృష్ణుడు శిలా విగ్రహాలను ప్రతిష్టించారు. వీటికే భక్తులు భక్తి తో అభిషేకం నిర్వహిస్తారు..

శ్రీ దేవీ భాగవతం లో వర్ణించిన విధం గా శ్రీ దేవీ పురాన్ని "మణి ద్వీపం "గా అమ్మ అనుగ్రహం తో నిర్మించాలని శాస్త్రి గారి సంకల్పం త్వరలో నెరవేరాలని శ్రీ దేవి ని ప్రార్ధిద్దాం, శాస్త్రి గారిని అందరు గౌరవం గా "గురూజీ "అని సంబోధిస్తారు.

## 2 అరుణాచల ప్రదేశ్ లో- అక్షయ గంగ పార్వతీ మందిరం



అరుణాచల ప్రదేశ్ అంటే సూర్యుడు మొదట ఉదయించే ప్రదేశం అని అందరికి తెలిసిన విషయమే.. అందుకే దీన్ని "లాండ్ ఆఫ్ రైజింగ్ సన్ "అంటారు. మహా భారతం కల్కి పురాణాలలో అరుణా చల ప్రదేశ్ ప్రసక్తి ఉంది. ఇక్కడి హిమాలయాలను "ప్రభు శిఖరాలు "అని పిలుస్తారు. క్షత్రియ రాజులను పరశురాముడు సంహారం చేసి తన పాపాలను ప్రక్షాళన చేసుకోవటానికి ఇక్కడికి వచ్చి వచ్చి స్నానం తో పునీతు డయ్యాడని ఐతిహ్యం. వ్యాస భగవానుడు ఇక్కడ కొంత కాలం తపస్సు ఆచరిం

చడ నీ  చెబుతారు. రాజా భీష్మకుడు ఈ రాజ్యాన్ని ప్రతిష్టించాడు. శ్రీ కృష్ణుడు ఆయన కూతురు రుక్మిణీ దేవిని ఆమె కోరిక పై అగ్ని జ్యోతనుడనే బ్రాహ్మణుని రాయ బారం పంపితే ఇక్కడి నుంచే అపహరించి తీసుకొని వెళ్లి వివాహం చేసుకొన్నాడు.. ఈ రాష్ట్రం లో అనేక పుణ్య తీర్దాలు తో బాటు బౌద్ధారామాలు కూడా ఉన్నాయి పర్యాటక కేంద్రం గా విలసిల్లింది.

## అక్షయ గంగ

క్రీ. ష.8 వ శతాబ్దం కు చెందినా ఇక్కడి  పార్వతీ దేవి మందిరం, అక్షయ గంగా, కల్కి పురాణం లో ప్రస్తా వనకు వచ్చాయి, దక్ష యజ్ఞం లో తండ్రి చేత పరాభావింప బడి యోగాగ్ని చే దగ్ధమైన సతీ దేవి పార్ధివ శరీరాన్ని చూస్తూ దుఖం తో ఇక్కడే చాలా సేపు ఉండి పోయాడట. విష్ణు మూర్తి సుదర్శన చక్రాన్ని ఉపయోగించి సతీ దేవి శరీరాన్ని ముక్కలు ముక్కలు గా ఖండించి విసిరశాడట. అందులో ఒక ముక్క ఇక్కడ పడిందట. అదే



జీవన గంగ అయి న ఒక సెలయేరు ప్రాంతం కావటం తో "అక్షయగంగ "అనే పేరు వచ్చిందట. ఇక్కడ ఒక సరస్సు కూడా ఉంది. దీనిని అనుకోని బ్రహ్మ పుత్రా నది ప్రవహిస్తోంది. భక్తులు అక్షయ గంగలోను, సరస్సు లోను స్నానాలు చేసి దగ్గర లోని పార్వతీ, శివ మందిరాలను దర్శించి పునీతులవుతారు.. పరశు రామ కుండం లో పుష్యమాసం లో మకర సంక్రాంతి మహా పర్వదినం నాడు వేలాది భక్తులు వచ్చి పుణ్య స్నానాలు చేసి పరశురాముని లాగా తమ పాపాలను ప్రక్షాళన చేసుకొంటారు.



## 3 అస్సాం లో కామాఖ్య ఆలయం



అస్సాం అనగానే చిరపుంజీ లోని అధిక వర్ష పాతం తో బాటు కామాఖ్య దేవీ ఆలయం చటుక్కున స్పురణ కు వస్తాయి. అస్సాం రాజధాని గౌహతి లో ఈ ఆలయం ఉంది మహా శక్తి పీఠం గా పేరు పొందింది. బ్రహ్మ పుత్రా నదీ తీరం లో "నీలాచల పర్వతం "మీద కామాఖ్య ఉంది. ఈ శక్తి పీఠాన్ని సంప్రదాయం మేళ వించిన నిజమైన శక్తి పీఠం అంటారు. దీనికి ఒక కారణం ఉంది అసలు శక్తి పీఠం యొక్క మూలమే "యోని పూజ "అదే ఇక్కడ పూర్తిగా ఆచరింప బడుతుంది. ఇక్కడ వామాచార బలి, కాల మంత్రం పూజలు యదా విధి గా జరుగుతాయి.

ఈ నీలా చల పర్వతం మీద గౌహతికి ఏడు కిలో మీటర్ల దూరం లో అమ్మవారి శరీర ఖండమైన "యోని "పడింది. అందుకే దీనికి అంతటి మహత్తు, ప్రాధాన్యం. ఇక్కడి శివుడిని "ఉమానందుడు "అంటారు. ఇక్కడ భక్తులే స్వయం గా పూజ చేసుకొనే వీలు ఉంది. జంతుబలి సర్వసాధారణం. అందులో మగ జంతువులనే బలి ఇవ్వటం ఆచారం కూడా.

కామాఖ్య ఆలయాన్ని గురించిన ఐతిహ్యం ఉంది. ఒకప్పుడు ఇద్దరు రాజకుమారులు ఇక్కడికి వేటకోసం వచ్చారట. అక్కడ ఒక వృద్ధురాలు కనీ పిస్తే దాహం వేసి నీళ్ళు పొయ్యమని కోరారు. ఆమె దగ్గరలో ప్రవహించే చిన్న నదిని చూపించి అక్కడికెళ్ళి దాహం తీర్చుకోమన్నది. ఆ స్థలం లోనే శ్రీ దేవి యోని భాగం పడింది కనుక ఆ ప్రదేశం చాలా పవిత్రమైనదని అక్కడే అమ్మవారికి ఆలయం నిర్మించమని చెప్పి అదృశ్యమైందట. రాజకుమారులకు అక్కడ యోని రూపం లో ఉన్న ఒక శిల కని పించింది. ఆ శిల చుట్టూ యెడ తెరిపి లేకుండా నీరు ప్రవహిస్తోంది..ఆశ్చర్య పడిన రాకుమారులు తమతో మాట్లాడినది పరమేశ్వరియే నని నిశ్చయించుకొని అక్కడే కామాఖ్య ఆలయం నిర్మించారట.

కామాఖ్య ఆలయం లో అమ్మవారికి నల్లని మనిషిని, కుక్కను, పిల్లిని, పందిని, గాడిదను, కోతిని మేక ను, పావురాన్ని బాలి ఇస్తారు. అన్నీ నల్లరంగులో ఉన్న వాటినే బలి ఇచ్చే ఆచారం ఇక్కడే కని పిస్తుంది. జంతు వధ ఇక్కడ నిషేధం కాదని గ్రహించాలి. అమ్మవారి శరీర భాగం పడిన ప్రదేశం కనుక దీన్ని" మహా స్మశానం " అనీ అంటారు. అమ్మవారి యోని భాగం ఇక్కడ పడి నందువల్ల అమ్మ వారితో సదా శివుడు సదా కామ కేళి లో తేలి యాడుతూ ఉంటాడని నమ్మకం. అందుకే కామాఖ్య అయిందని అంటారు.

శ్రీ దేవి ''యోని ''రాతి మీద చెక్క బడి ఉంటుంది. ఎప్పుడూ దాని చుట్టూ సన్నటి నీటి ఊట ఊరుతూ తడిగా కని పించే ఆలయం కామాఖ్య. పిల్ల వాడికి ప్రేమతో స్తన్యం ఇస్తున్న తల్లి విగ్రహం పడమటి ద్వారం వద్ద ఉంది. అమ్మ వారు ఈ ప్రాంతప్రజలకు కన్న తల్లి అని గొప్ప నమ్మకం.

## బహిస్టు అయ్యే దేవత



అమ్మవారు సంవత్సరం లో జూన్ రెండవ వారం లో బహిస్టు అవుతుంది. అస్సామీ భాషలో దీనిని ''అంటు బాషి ''సమయం అంటారు. దేవాలయాన్ని ఈ నాలుగు రోజులు మూసేసి ఉంచుతారు. అయిదవ రోజు స్నానం తర్వాత ఆలయాన్ని తెరచి భక్తులకు దర్శనం కలిగిస్తారు. అంబు బాషి రోజుల్లో కామాఖ్య దేవాలయం తో పాటు మిగతా దేవాలయాలనన్నిటిని మూసి ఉంచటం ఇక్కడి ఆచారం.

ఇక్కడ కొండమీద ఏడు ముఖ్య దేవీ ఆలయాలున్నాయి,. అవి తార, భువనేశ్వరి, చిన్నమస్త, భగ ళ, ధూమావతి కాళి,,భైరవి ఆలయాలు. ఇవికాక అయిదు-అమృతేశ్వర, కోటిలింగ,అఘోర, సిద్దేశ్వర, కామేశ్వర స్వామి అనే శివాలయాలూ ఉన్నాయి. గౌహతికి 40 కి.మీ.దూరం లో ''భగవతి ''అమ్మవారి ఆలయమూ దర్శనీయ క్షేత్రమే ఇది చంద్ర శేఖర పర్వతం పైన ఉంది దీని దగ్గర శీతా కుండం ఉంది ఇక్కడే సర్వకాల సర్వా వస్తలలో ''అగ్ని ప్రజ్వరిల్లుతూ'' ఉంటుంది. ఇదొక మహిమాన్విత శక్తి పీఠం గా భావిస్తారు,

## పచ్చి మాంసం తినే తామ్రేశ్వరీ దేవి ఆలయం



ఎలాగూ అస్సాం లో ఉన్నాం కనుక దగ్గరలో ఉన్న మరో రెండు దేవీ ఆలయాలను కూడా చూద్దాం. అస్సాం లో లిఖం పూర్ జిల్లా సాడియా అనే గ్రామం లో ''తామ్రేశ్వారీ దేవి ఆలయం'' ఉంది. పచ్చి మాంసం తినే అమ్మవారుగా ప్రసిద్ధి.. ఇక్కడ అమ్మవారిని ''కేశె ఖాటి ''అంటారు. అంటే పచ్చి మాంసం తినేది అని అర్ధం. కాళికా దేవి

అవతారం గా భావిస్తారు. మంగోలియా దేశానికి చెందిన చూటియా వంశ రాజులకు ఈమె ఆరాధ్య దేవత. ఇక్కడ రోగాలు బాగా ప్రబలినప్పుడు ఆరోగ్య వంతులైన వారిని కర్రకు కట్టి అమ్మ వారికి బలి ఇవ్వటం ఆచారం. దానితో వ్యాధులు పోతాయనే నమ్మకం. ఖైదీలను, నేరస్తులను, ఉరి శిక్ష పడ్డ వారిని అమ్మ వారి ముందు నిల బెట్టి బలి ఇవ్వటం ఇక్కడ మామూలు,. నరబలి మంగోలియన్ల ఆచారం అదే ఇక్కడ పాటిస్తున్నారు.

## విషం హరించే మానసా దేవి ఆలయం



గౌహతికి దగ్గరలో నీలాచల పర్వతం మీద బ్రహ్మ పుత్రా నదీ తీరం లో కామఖ్యకు దగ్గరలో మానసా దేవి ఆలయం ఉంది, ఈ అమ్మవారిని పూజిస్తే విషం విరిగి పోతుందని విపరీతమైన నమ్మకం. మానసా దేవి శరీరం అంతా అంటే తలా కాళ్ళ పై సర్పాల రూపాలు చెక్క బడి ఉంటాయి. ఈమె సర్ప రాజైన వాసుకి కి సోదరి. జరత్కార మహర్షికి భార్య అని పురాణ కధనం

## 4 త్రిపుర లో శ్రీ త్రిపుర సుందరీ ఆలయం



త్రిపుర రాష్ట్రం లో ఉదయపూర్ కు దగ్గరలో రాధా కిషోర్ పూర్ అనే గ్రామం ఉంది. ఇక్కడే త్రిపుర సుందరీ దేవి ఆలయం ఉంది. మహా శక్తి పీఠాలలో ఒకటిగా ప్రాముఖ్యం పొందిన ఆలయం ఇక్కడే అమ్మవారి కుడి పాదం పడటం వల్ల శక్తి పీఠమైంది. త్రిపుర రాజ దాని అగర్తలా నుండి 55 కి.మీ.దూరం లోను, ఉదయ పూర్ నుండి మూడు కిలో మీటర్ల దూరం లోను ఈ అమ్మవారి ఆలయం ఉంది. ఇది 16 వ శతాబ్దపు ఆలయం అని భావిస్తారు. దీనికి 'మాతా బారి ''దేవాలయమని, త్రిపుర సుందరి, త్రిపుర భైరవి, లలితాంబా అని అమ్మవారిని పిలుస్తారు, కొలుస్తారు. అమ్మవారి పీఠం తాబేలు అంటే కూర్మం ఆకారం లో ఉండటం విశేషం. అందుకని కూర్మ పీఠం లేక కూర్మ దేవాలయం అనే పేరు కూడా ఉంది. శివుడు త్రిపురాసుర సంహారం చేసి లోకాలను రాక్షస బారి నుండి రక్షించిన ప్రదేశం ఇది. అందుకే ఇక్కడి శివుడిని త్రిపురేశ్వరుడు అంటారు.

శ్రీ త్రిపుర సుందరీ దేవి విగ్రహం సుమారు 7 అడుగుల ఎత్తులో ఉన్న భారీ విగ్రహం. ఈ విగ్రహానికి దగ్గరలో అమ్మవారిదే రెండడుగుల చిన్న విగ్రహం ఉంది. దీనిని "చోటే మా "అని భక్తులు పిలుస్తారు. దేవాలయానికి వెనుక కళ్యాణ సాగరం అనే పెద్ద సరోవరం ఉంది ఈ సరస్సు పెద్ద ఆకర్షణ గా నిలుస్తుంది టూరిస్ట్ స్పాట్. ఇందులో లెక్కలేనన్ని తాబేళ్లు చేపలతో బాటు కానీ పిస్తాయి. సహజం గా చని పోయిన ఈ తాబేళ్ళకు, చేపలకూ శాస్త్రోక్తం గా దహన సంస్కారాలు నిర్వహించటం ఇక్కడి ప్రత్యేకత.



త్రిపుర సుందరీ దేవిని కాళీ మాత గా కూడా ఇక్కడ పూజిస్తారు,. ఈ ఆలయం లో దీపావళి నాడు మహోత్సవం జరుగుతుంది, రెండు లక్షల కు పైగా మంది భక్తులు వివిధ ప్రాంతాల నుండి వచ్చి అమ్మవారిని దర్శించి తరిస్తారు. ఈ ఆలయం అంతా బెంగాలీ పద్ధతి లో నిర్మించ బడి ఉంటుంది. ఆలయం చిన్న కొండ మీద ఉంటుంది యెర్ర దుస్తులు ధరించిన పూజారులు పూజాదికాలు నిర్వహిస్తారు 1501 లో దేవా మాణిక్య వర్మ మహా రాజు ఈ ఆలయాన్ని నిర్మించి నట్లు తెలుస్తోంది. అమ్మవారిది యెర్ర రాయి విగ్రహమ్ కాస్టి శిల తో చేయ బడింది. చోటే మా అనే అమ్మవారి చిన్న విగ్రహాన్ని రాజు యుద్ధానికి వెళ్తున్నప్పుడు తీసుకొని వెళ్లి నట్లు చెబుతారు అది జయ శూచకం అని ఆయన భావించాడట. అమ్మవారు కలలో కన్పించి త్రిపుర సుందరీ ఆలయాన్ని నిర్మించమని కోరిందట. అప్పటికే ఉదయ పూర్ లో విష్ణు ఆలయాన్ని కట్టించాడు రాజు. ఇప్పుడు సందేహం వచ్చింది మళ్ళీ మర్నాడు అమ్మవారు కన్పించి ఆలయం నిర్మించాల్సిందే నని ఆజ్ఞా పించిందట అప్పుడు శివ కేశవులకు అభేదం గా ఈ శక్తి పీఠం వెలసిందట దీనికి500 ఏళ్ళ చరిత్ర ఉంది, ఆలయం చిన్నదే 24 చదరపు అడుగులవైశాల్యం తో 75అడుగుల ఎత్తు తో ఉంటుంది. ఇక్కడి ప్రసాదం-ఆవుపాలను మరగకాచి గోధుమ రంగుగా మార్చి పంచ దార కలిపి చేసిన "దూద్ పేడ్ " ను భక్తులు పరమ పవిత్రం గా భావించి ఇంటికి తీసుకొని వెళ్తారు, యెర్ర గోగు పూలు అమ్మవారికి ప్రీతికరం గా భావించి సమర్పిస్తారు, జంతు బలి ఉంది మేక తలను సమర్పించే ఆచారం ఉంది,

కళ్యాణ సాగర్ సరస్సు సుమారు ఆరున్నర ఎకరాల సువిశాల మైన సరస్సు, ఈ సరస్సు నీరు కలుషితమై ఆమ్లాలు విపరీతం గా చేరటం వల్ల సరస్సులోని తాబేళ్లు చేపలు మరణించాయి ప్రభుత్వం వెంటనే స్పందించి సరస్సుకు గట్టి బందో బస్తు చేసి జాగ్రత్త పడింది.

## 5 వైష్ణవ దేవీ ఆలయం



జమ్మూ –కాశ్మీర్ రాష్ట్రం లో జమ్మూ కు 60 కిలోమీటర్ల దూరం లో వైష్ణో దేవి లేక వైష్ణవ దేవీ ఆలయం ఉంది. ఇది గుహాలయం. సృష్టి స్తితి లయం లకు మూలమైన ఆది పరాశక్తి ని మహా సరస్వతిగా, మహాలక్ష్మి గా, మహా కాళిగా నిరూపించే మూడు విగ్రహాలు ఇక్కడ ఉన్నా యి. భక్తజనం పరమ ఉత్సాహం తో భక్తీ భావనతో ‘’జయ మాతాజీకి’’అను కొంటు కష్టసాధ్యమైన ఈ పర్వతం ఎక్కుతారు గుహ చేరే వరకు దాదాపు మోకాలి మీదనే నడుచు కొంటు గుహ లోకి ప్రవేశిస్తారు. గుహకు చేరాలంటే చాలా దూరం నడవాల్సిందే. అన్ని శ్రమలకు ఓర్చుకొని అమ్మవారి ని దర్శించటానికి భక్తులు చేరుకొంటారు గుహలోకి చేర గానే తాము పడిన శ్రమ నంతా యిట్టె మర్చి పోయి అఖండ భక్తీ భావం తో పులకించి పోతారు. అమ్మవారి కరుణ ను, ప్రేమను తలచుకొంటూ ఆనంద పరవశులవుతారు.



జీవితం లో ఒక్క సారైనా వైష్ణో మాతను దర్శించి తరించాలని అందరి కోరిక. లక్షలాది భక్తులు ‘’త్రికూట పర్వతం’’పైన ఉన్న ఈ గుహను సందర్శిస్తారు. అమ్మను దర్శించి ఆశీర్వచనం పొందుతారు. గుహకు చేరే మార్గం లో బాణ గంగ, చణ పాదుక, హాతీ మాథా (ఏనుగు తల ),చణ గంగా అనే ప్రదేశాలను అంచె లంచెలుగా దాటి వెళ్ళాలి. ఇవన్నీ పవిత్ర స్థలాలే. చరణ గంగ లో నీరు చాలా చల్లగా ఉంటుంది. అంత చల్లని ప్రదేశం లో దేవీ దర్శనం కోసం భక్తులు అత్యంత శ్రద్ధతో వేచి ఉంటారు. రామాయణం లో స్వయం ప్రభ అనే తాపసి నివశించిన గుహ లానే ఈ గుహ ఉంటుంది. ఈ గుహ సమీపం లో రామ మందిరం ఉండటం ఆశ్చర్యమే.

భైరవుడు అనే రాక్షసుని సంహరించిన శ్రీ వైష్ణవీ దేవి అతనికి మోక్షాన్ని కూడా ప్రసాదించింది. భైరవాలయం కూడా దేవీ మందిరానికి కొంచెం దూరం లోనే ఉంది అమ్మను దర్శించిన తర్వాత భైరవ దర్శనం చేయటం పరి పాటి.

## మహా మాయా దేవి ఆలయం



అరణ్యం లో పురాతన మహా మాయా, త్రిసందేశ్వారీ ఆలయాలున్నాయి వీటికి దగ్గరలో తావీ నది ప్రవహిస్తుంది. ఇక్కడే అమ్మవారి గొంతుక భాగం పడిందని ప్రతీతి అమరానాధుని తో బాటు అమర నాదేశ్వరీ దేవీ వెలసింది.

వైష్ణవ దేవి ఆలయ కధ త్రేతాయుగానికి చెందింది, దేవతలు రాక్షస బారి నుండి రక్షించుకోవటానికి తమ శక్తులు అన్నీ లన్ని కలిపి అమ్మవారి ని సృష్టించుకొన్నారు, ఆమెకు తమ బాధ వివరించారు, అమె దక్షిణ భారత దేశం లో త్రికూట అనే పేరుతో రత్నసాగర్ కు కుమార్తె గా జన్మించింది, ఆమె శ్రీ మహా విష్ణు వంశ సంభూత కనుక వైష్ణవీ దేవి పేరుతో తో విరాజిల్లింది, ఆమె మహిమలకు సాధువులు యోగులు అందరు విని ఆమెఅనుగ్రహం కోసం దర్శించేవారు, ఒక సారి ఆమె తలిదండ్రుల అనుమతితో సముద్ర తీరం చేరి మహా విష్ణువును శ్రీరాముని గా భావించి తపస్సు చేసింది రాముడు ప్రత్యక్షమై ఏ వరం కావాలని అడిగితే తాను రాముడిని ప్రేమించానని ఆయనే తన జీవిత సర్వస్వం అనీ చెప్పింది, ఏక పత్నీ వ్రతుడైన రాముడు ఏమీ పాలు పోక ఆమె తపస్సును వ్రుధాకానీక ఆమె కు తానుకని పిస్తానని ఆమె గుర్తిస్తే ఆమె కోరిక నేర పేరుతుందని అభయమిచ్చాడు, రావణ రాజ్యమైన లంకనుండి తిరిగి వచ్చిన తర్వాత రాముడు ఒక సాధువు వేషం లో ఈ త్రికూట కన్య దగ్గరకు వెళ్ళాడు ఆమె ఆయన్ను గుర్తించలేక పోయింది, అప్పుడు రాముడు అనుగ్రహించి తాను కల్కి అవతారం దాలుస్తానని అప్పుడు ఆమె ను వివాహం చేసుకొంటానని అభయ మిచ్చాడు, ఆమెను ఉత్తర భారత దేశం లోని మాణిక్య పర్వతాలలో ఉన్న త్రికూట గిరిపై ఉండి ధ్యానం చేయమని ఆమె వైష్ణవీ దేవి పేరుతో భక్తుల ను అనుగ్రహించమని ఆదేశించాడు,



సుమారు 700ఏళ్ళ క్రితం అమ్మ వారి గుహను శ్రీధర పండితుడు అనే ఆయన మొదటి సారిగా గుర్తించాడు, ఆ పరిస్తితి చూసి చలించి నీరు అన్నం ముట్టకుండా దీక్ష పూనాడు, వైష్ణవీ దేవి ఆయనకు కలలో కని పించి తాను ఆ గుహ లోనే ఉన్నానని చెప్పింది, ఇలా చాల సార్లు కలలో కన్పించిన తర్వాత ఆ గుహను చేరి వెతికాడు అప్పుడు ఇప్పుడున్న మూడు విగ్రహాలు కని పించాయి, అమ్మ

అనుగ్రహం గొప్పదని అందరికి తెలియ జేశాడు, అప్పటి నుండి శ్రీధర పండితుడు అమ్మ వారి సేవలోనే ఆ గుహ లో ఉండి పోయాడు.

## 6 కలకత్తా మహా కాళీ దేవాలయం

బెంగాల్ రాష్ట్ర ఆరాధనీయ దేవత కాళీ మాత. దేశం లోని 51 శక్తి పీఠాలలో ఇది మూలాధార మైనది. అమ్మవారి దేహం లోని పాదాగ్రం ఇక్కడ పడింది. అక్కడే కాళీ క్షేత్రం వెలిసింది. గంగా సాగర సంగమానికి దగ్గర లోనే ఈ క్షేత్రం ఉంది. కలకత్తా వాసులకు కాళీ మాత మహా ఇష్ట దైవంమాత్రమె కాదు ఇల వేల్పు. కూడా. బెంగాలీల హృదయాధి దేవత కాళీ మాత. దుర్గా, లక్ష్మి, సరస్వతి అన్నీ కాళీ మాతలోనే దర్శిస్తారు. "మాగో "అని ఆ తల్లిని పిలిస్తే పలికే దైవం.



దేవీ నవరాత్రులు అంటే బెంగాలీలకు పరమ పండగ వీధి వీధినా దుర్గా, కాళీ మాత విగ్రహాలను ప్రతిష్టించి పూజ చేస్తారు భక్తీ శ్రద్ధలతో ఆమె ను ఆరాధిస్తారు అభీష్టాలను నేర వెరచు కొంటారు. అందరు దేవీ సంకీర్తన లో నృత్యం చేస్తూ తన్మయులవుతారు. దశమి నాడు అమ్మవారి "పజిని ఉద్యాపన "చేసే వరకు జనాలకు మరో వ్యాపకమే ఉండదు. మారు మూల ప్రాంతమైనా విధిగా అమ్మ వారి పూజ చేసి ధన్యులవుతారు.

కలకత్తా కు వంద కిలో మీటర్ల దూరం లో గంగా సాగర సంగమం ఉంది. మకర సంక్రాంతి నాడు ఇక్కడ గొప్ప ఉత్సవం చేస్తారు. లక్షలాది భక్త జనం సాగర సంగమం లో పవిత్ర స్నానాలాచారించి జన్మ చరితార్ధం చేసుకొంటారు. కాళీ ఘాట్ లో కాళికా దేవి ఎంత ఉగ్ర స్వరూపం లో ఉంటుందో సంగమం వద్ద అంత ప్రశాంతం గా ఉంటుంది. రెండు చోట్లా భక్తులకు ఇక్కట్లు తప్పవు వాటిని ఒర్చుకొనే వస్తారు.

### 1887 నాటి ఆలయం

దక్షిణేశ్వర్ లో కాళీ మాత దివ్య దర్శనాన్ని అందరు అనుభవించి తీరాలి. జనం ఇక్కడా విపరీతం గా ఉంటారు భాగీరధీ నదీ స్నానం ఎంతో ఉపశమనాన్ని స్తుంది. ఆలయం లో ద్వాదశ లింగాలను కూడా భక్తులు దర్శించి పునీతులవుతారు. తనివి తీరా అభిషేకాలు చేసుకొనే వీలుంది. శ్రీ రామ కృష్ణ పరమ హంస కాళీ మాతను అర్చించింది ఈ పవిత్ర స్థలం లోనే. ఇక్కడే పరమహంస శారదా మాయి తో

నివశించారు. గంగను దాటగానే బేలూరు మఠం వస్తుంది. ఇక్కడ పరమ ప్రశాంతం గా ఉంటుంది. రామకృష్ణ వివేకానందులు ఇక్కడే దర్శన మిస్తున్న భావన అందరికి కనిపిస్తుంది

కాళీ ఘాట్ లో కాళీ మందిరం ఉంది, కాళీఘాట్ వల్లనే కలకత్తా పేరు వచ్చింది, హుగ్లీ నది క్రమంగా గుడికి దూరం గా వెళ్ళింది, ప్రస్తుత దేవాలయం ఆది గంగ నది ఒడ్డున ఉంది, ఇది హుగ్లీ నది తో సంబంధం కలిగి ఉంది, ప్రస్తుత ఆలయం రెండు వందల ఏళ్ళ చరిత్ర కలిగి ఉంది 15.వ శతాబ్ది కవి మానసార్ భాసన్ కవితలోనూ17 వ శతాబ్దికవి కనకన్ రచనలలోను కాళీ మాత ప్రస్తావన ఉంది, గుప్తరాజులలో కుమారా గుప్తుని కాలం నాటి నాణాలు కాళీఘాట్ లో కానీ పించాయి, 16శతాబ్దం లో మానసిన్హ మహారాజు అమ్మ వారికి ఒక గుడిసె లాంటి ఆలయం నిర్మించాడు, బారిష వంశానికి చెందినా సబర్ణ రేయ్ చౌదరి ఆలయాన్ని పక్కాగా నిర్మాణం జరిపి 1809 లో పూర్తీ చేశాడు, కాళీ మాత విగ్రహాన్ని టచ్ స్టోన్తో బ్రహ్మానంద గిరి, ఆత్మా నంద గిరి అనే తాపసులు శిల్పీకరించారు, మూడు కళ్ళూ నాలుకా నాలుగు చేతులు అంతా బంగారం తో చేశారు, అమ్మ వారి చేతిలో రక్త శిక్త మస్తకం అసురీ శక్తుల సంహరణం జ్ఞాన సముపార్జనం ను తెలియ జేస్తుంది, దాని వల్ల మోక్ష ప్రాప్తి, అభయ, వరద ముద్రలతో అమ్మ భాసిస్తుంది,

మూడు అడుగుల ఎత్తులో చరురశ్రాకారం గా ఉన్న మందిరం లో శోష్టి, శితాలా మంగోల్ చండీ అనే మూడు శిలలున్నాయి, దీనిసే శోష్టి తలా అంటారు, దీనిని 1880 లో గోవింద దాస్ మందాల్ నిర్మించాడు, ఇది బ్రహ్మ నంద గిరి గారి సమాధి, ఈ శిలా దేవతలు కాళీ మాత రూపాలే,

## 7 హిమాచల్ ప్రదేశ్ లో చాముండీ దేవి ఆలయం



హిమాచల్ ప్రదేశ్ అంటేనే ఆహ్లాదకర మైన వాతావరణం. అక్కడి హిమగిరి సొగసులు, ఆపిల్ తోటలు కను విందు చేస్తాయి. హిమ సానువుల పాదాల చెంత శ్రీ చాముండీ దేవి ఆలయం ఉంది కాశ్మీర్ లోని కాట్రా నుంచి కాని, జమ్మూ నుంచీ, కాంగడా, జ్వాలా ముఖీ నుంచి కూడా ఇక్కడ కు చేరే అవకాశం ఉంది. బస్సు సౌకర్యం, ఆటో సౌకర్యమూ ఉంది.

చాముండీ దేవి ఆలయం దగ్గరే "వనగంగా నది "ప్రవహిస్తోంది.. ఆలాయప్రాంతం అంతా బహు ఆహ్లాదం గా ఉంటుంది. ఆలయం లోని విగ్రహాలకు ఎప్పుడూ విభూతి పూత ఉంటుంది. ఇక్కడి స్వామి వారిని "ఆశుతోష్ శివ శంకర్ "అని పిలుస్తారు. అమ్మవారిని చాముండా అని ఆప్యాయం గా పిలుస్తారు. ఊరి పేరు కూడా అమ్మవారి పేరు మీదుగానే "చాముండా "అని పిలువ బడుతోంది. వామా చార పరాయణులకు ఈ ఆలయం ఎంతో అనుకూల మైన ప్రదేశం. స్వామి చిన్మయా నంద ఇక్కడ కొంత కాలం తపస్సు చేశారు. రైల్ స్టేషన్ నుంచి ఆలయం ఆరు కిలో మీటర్లు ఉంది.

## రేణుకా దేవి ఆలయం



హిమాచల్ ప్రదేశ్ లో శివాలీ పర్వతాలలో అతి సుందర ప్రకృతి దృశ్యాల మధ్య రేణుకా దేవి సరస్సు ఉంది. ఇది అతి పవిత్ర తీర్ధ స్థానం గా పరిగణింప బడుతోంది.

శ్రీ మహా విష్ణువు అవతార మైన పరశురాముడు తల్లి రేణుకా దేవి తో ఈ స్థలం ముడి పడి ఉంది. పరశురాముడు తండ్రి జమదగ్ని మహర్షి ఆజ్ఞ తో తల్లి రేణుకా దేవి శిరస్సును ఇక్కడే ఖండించాడు. పుత్రుని ధర్మ నిరతికి తృప్తి చెంది జమదగ్ని రేణుకా దేవిని బ్రతికించాడు. రేణుకా దేవి సరస్సును ఆనుకొనే రేణుక దేవి ఆలయం ఉంది. దీనితో పాటు చాలా దేవాలయాలు ఇక్కడ ఉన్నాయి.

ఢిల్లీ నుండి అంబాలా మీదుగా "సహాన్" చేరుకోవాలి.. అక్కడికి రేణుకా దేవి సరస్సు 45 కిలో మీటర్ల దూరం లో ఉంది.

## జ్వాలాముఖీ ఆలయం



సతీదేవి శరీర భాగమైన "నాలుక" పడిన ప్రదేశం ఇది యాభై ఒక్క శక్తి పీఠాలలో ఇదొకటి. "ధ్యాగూ "అనే భక్తుడు తన శిరస్సు ను నరికి పళ్ళెం లో పెట్టుకొని అమ్మవారికి నైవేద్యం పెట్టిన పవిత్ర స్థలమిదే, పంచోపచార, దశోప చార, షోడశోపచారాలతో అమ్మవారు నిత్యం పూజింప బడుతుంది. గర్భ సంబంధ మైన వ్యాధులున్న వారు అమ్మవారిని దర్శించి ఆ వ్యాధిని దూరం చేసుకొంటారు. ఇక్కడి జ్వాలాముఖీ అమ్మవారిని దర్శిస్తే అన్ని రకాల వ్యాధులు నయమై పోతాయని భక్తుల అచంచల విశ్వాసం.

## వజ్రేశ్వరీ దేవి ఆలయం



జ్వాలాముఖి కి 55 కిలో మీటర్ల దూరం లో "నగర్ కోట ధాం" ఉంది. ఇక్కడి అమ్మవారు వజ్రేశ్వరీ దేవి. ఇక్కడ రాక్షసులతో యుద్ధం చేస్తే ఒళ్లంతా రక్తం తో గాయాలయ్యాయి అమ్మవారి రక్తం కారి పోయింది. ఆ ప్రదేశం లో చన్నీటి తో కడిగి నెయ్యి రాసే ఆచారం ఇక్కడ ఉంది. 100 సార్లు అమ్మవారి విగ్రహాన్ని చన్నీటితో కడిగి తరువాత నెయ్యి రాస్తారు. ఈ కార్యక్రమానికి "లోహ్రీ "అని పేరు.. ఆమె శక్తి ఆరురకాలుగా విశదం అవుతుందని భక్తుల నమ్మిక. అవే –ఆజ్ఞాచక్ర, విశుద్ధ, అనాహత, మణి పూరక, స్వాదిష్టాన, మూలాధార చక్రాలు. ఈ ప్రాంతం లో ఏవైనా ఉపద్రవాలు సంభవించి నప్పుడు ఇక్కడి భైరవ విగ్రహం కళ్ళ నుండి నీరు, శరీరం నుండి చమటలు కారుతాయట.

## 8 గోవా లోని శాంత దుర్గాలయం



1713 లో నిర్మించ బడిన శాంత దుర్గాలయం భక్తుల కోరికలను అనుక్షణం తీరుస్తుంది అనే నమ్మకం కలది. ఇక్కడ మహా మాత పార్వతీ దేవి ఆలయం ఉంది. అమ్మవారి విగ్రహానికి ఒకవైపు శివుని విగ్రహం రెండో వైపు కేశవుని విగ్రహం ఉన్నాయి. ఇది పానాజీ నుండి 33 కిలోమీటర్ల దూరం లో ఉంది.

## మహాల్సా దేవాలయం



విష్ణు మూర్తి మోహినీ రూపం లో వెలసిన క్షేత్రం ఇది. మార్దోవా కి దగ్గరలో ఉంది. మహా విష్ణువు అధి దేవత,. క్షీర సాగర మధనం లో లభించిన అమృతం కోసం దేవ దానవులు పోటీ పడితే మహా విష్ణువు మోహినీ దేవి అవతారం దాల్చి అమృతాన్ని దేవతలకు అంద జేసింది ఇక్కడే. అందుకే మోహిని రూపం దాల్చిన విష్ణు మూర్తి విగ్రహం చూడ ముచ్చట గా ఉంటుంది.

## పార్వతి అంశ తో వెలసిన మహా లక్ష్మి ఆలయం



పాండా నుండి నాలుగు కిలో మీటర్ల దూరం లో బందోడ్ అనే ప్రాంతం లో ప్రశాంత వదనం తో మహాలక్ష్మీ దేవీ ఆలయం ఉంది. ఇక్కడి అమ్మవారు ఈశ్వర ధ్యానం లో ఉండటం విశేషం. ఇది శక్తి పీఠం గా పేరొందింది,

## 9 హర్యానా లో జ్వాలా మాలేశ్వరీ దేవి ఆలయం

హర్యానా రాష్ట్రం లో జింద్ జిల్లాలో జ్వాలా మాలేశ్వరీ దేవి ఆలయం ఉంది. కురుక్షేత్ర సంగ్రామం కాలం నాటి ఆలయం ఇది. పాండవులు ఇక్కడే జయంతీ నదీ తీరం లో ఈ మందిరాన్ని నిర్మించి కురుపాండవ యుద్ధం లో తమకు విజయం సంప్రాప్తింప జేయమని దేవీ జయంతీ ని ప్రార్ధిన్చారట. అప్పుడు దేవిమెడలో జ్వాలా మాల తో ప్రత్యక్షమైందట.అందుకే ఈ మందిరాన్ని జ్వాలా మాలేశ్వరీ మందిరం అంటారు. ఢిల్లీ కి పన్నెండు కిలో మీటర్ల దూరం లో ఈ ఆలయం ఉంది,



## కురుక్షేత్రం లోని సావిత్రీ శక్తి పీఠం



హర్యానా లో కురుక్షేత్రం లో అంటే పూర్వపు స్థానేశ్వర్ నేటి తానేసార్ లో ఈ శక్తి పీఠంఉంది. దేవి కాలి మీన ఖండం పడిన చోటు ఇదే నంటారు. దేవిని సావిత్రి అని, శివుని స్థాణువు అని పిలుస్తారు. మహా భారత ఉద్ధం లో భీష్మ పితామహుడు అంపశయ్య పై పడుకొన్న స్థలం ఇదే. ఇక్కడే వైశంపాయన సరోవరం చూడ ముచ్చటగా ఉంటుంది..

## మాని మజ దేవీ ఆలయం



ఇది చండీ ఘడ్ కు చాలా దగ్గరలో ఉంది. ఇక్కడ అమ్మవారి శిరో భాగం పడిందని పురాణ కధనం. అందుకే శక్తి పీఠం గా వెలసింది ఇక్కడి అమ్మవారిని "మానసా దేవి "అని పిలుస్తారు

## శీతలాదేవి మందిరం

హర్యానాలోని గుర్గాం నగరం లో ఒక సరస్సు పక్కనే ఈ మందిరం ఉంది ఇది కూడా ఒక శక్తి పీఠం గా భావిస్తారు. వేలాది మంది భక్తులు భక్తీ శ్రద్ధలతో దర్శిస్తారు. చైత్రమాసం లో ఇక్కడ ఉత్సవాలను ఘనం గా నిర్వహిస్తారు. ప్రతి సోమవారం ఇక్కడి వారికి పరమ పుణ్య దినమే. భక్తులు అమ్మవారికి తల నీలాలు సమర్పించే ఆచారం ఉంది



## జయంతీ దేవి మందిరం



పూర్వం హిమాచల్ ప్రదేశ్ లో ఈ దేవీ ఆలయం ఉండేది. ఇప్పుడు హర్యానాలో చేరింది చండీఘడ్ పట్టణానికి పదమూడు కిలో మీటర్లదూరం లోనే ఉంది. ఇక్కడి జయంతీ నది తీరం లో ఆలయం ఏర్పడి భక్తులను విశేషం గా ఆకర్షిస్తోంది.

ఈ దేవి గురించి ఒక కదా ప్రచారం లో ఉంది, సుమారు అయిదు వందల యాభై ఏళ్ళ క్రితం మొగలాయీ పాలనలోచండీఘర్ కు ఉత్తరాన హితనూర్ అనే చిన్న సంస్థానం ఉండేది, దాని రాజుకు ఇర్వీ రెండు మంది సోదరులు, ఒకడు హిమాచల్ ప్రదేశ్ లోని కాంగ్రా రాజ కుమారిని పెళ్లి చేసుకొన్నాడు,

ఆమె జయన్తీదేవికి పరమ భక్తురాలు పెళ్లి అయినతర్వాత అత్తా వారింటికి వెడితే అమ్మవారికి దూరం అవుతానేమో నని దుఖించింది ఆమె మోర విన్న జయంతీ మాత ఆమె తో వస్తానని చెప్పింది పెండ్లి కొడుకు ఇంటికి మేనాలో వెడుతుండగా మధ్యలో మేనా విపరీతమైన బరువు గా తోచింది అప్పుడు అమ్మవారు పెళ్లికూతురితో మేనాలో వస్తోందని అర్ధమైంది రాజు మాతకు ఆలయాన్ని కట్టిస్తానని మొక్కుకొని అలానే కట్టించాడు,

## 10 గుజరాత్ లోని అరసురి అంబాజీ ఆలయం

గుజరాత్ అనగానే గాంధీజీ పుట్టిన పోర్బందర్, అనేక దండయాత్రలకు గురైన సోమనాద్ దేవాలయం ద్వారక, అక్షరధాం శబర్మతి ఆశ్రమం గుర్తుకొస్తాయి. కాని మహా శక్తి పీఠాలకు నిలయమైంది గుజరాత్ రాష్ట్రం.



ఇక్కడి ముఖ్య శక్తి పీఠం –అరసురి అంబాజీ దేవీ ఆలయం. బనస్కాంతా జిల్లాలో ఉంది. పాలన్ పూర్ నుండి 65 కిలోమీటర్ల దూరం లోను, మౌంట్ ఆబూ నుండి 45 కిలోమీటర్ల దూరం లోను ఈ ఆలయం ఉంది. గుజరాత్ – రాజస్థాన్ సరి హద్దు లో ఈ ఆలయం ఉంది. అమ్మవారి గుండె పడిన ప్రదేశం గా దీన్ని పేర్కొంటారు. ఇక్కడ అమ్మవారి విగ్రహం ఉండదు. దానికి బదులుగా 51 బీజాక్షరాల ఫలకం ఉంటుంది. దీనితో బాటు శ్రీ చక్రమూ ఉంటుంది. రోజు శ్రీ చక్రార్చన జరగటం విశేషం. ఇది నేపాల్, ఉజ్జయిని మోడల్ లో ఉంటుంది, చక్రం సామాన్య మానవుల కంటికి కనిపించదు.. అరసుర అనేది పెద్ద అటవీ ప్రాంతం చిన్న కొండ మీద ఆలయం ఉంటుంది, తంత్ర చూడామణి గ్రంథం లో దీని విశేషం చెప్ప బడింది. 999మెట్లు ఎక్కి అమ్మవారిని దర్శించాలి, నాలుగవ శతాబ్దం లో సూర్య వంశపు రాజు అరుణ సేన్ ఈ ఆలయాన్ని నిర్మించాడు,

మూడు కాలాలోను అమ్మవారిని మూడు రూపాలలో ఇక్కడ ఆరాధించటం మరో విశేషం. ఉదయంపూట అమ్మవారిని బాల రూపం అలంకారం తోను, మధ్యాహ్నం, సాయంకాలాలలో యువతిగా, అర్ధ నారీశ్వారి గా అలంకరించి పూజ చేస్తారు. నవరాత్రులలో వైభవం గా జాతర జరుగుతుంది. గుజరాత్ లోని ప్రతి చోటు నుంచి భక్తులు వచ్చి దర్శించు కొంటారు.

### చంద్ర భాగా శక్తి పీఠం

గుజరాత్ లో సోమనాధ ఆలయానికి సమీపం లో చంద్రభాగా శక్తి పీఠం ఉన్నది. రావల్ రైల్వే స్టేషన్ కు సుమారు పది కిలో మీటర్ల దూరం లో ఇది ఉంది. జునాగడ విమానాశ్రయానికి సుమారు వందకిలో మీటర్లు. దీని దగ్గరే హిరా, కపిల, సరస్వతి నదులున్నాయి

చంద్రభాగ లో అమ్మవారి ఉదరభాగం పడిందని నమ్మకం. చంద్రభాగా దేవికి కూడా ఆలయం లేదు. ఇక్కడి శివుడిని ''వక్ర తుండ ''అని పిలుస్తారు. ఈ తీర్ధాన్నే ప్రభాస తీర్ధం అంటారు. ఇక్కడే శ్రీ కృష్ణ, బలరాములు తమ అవతారాలను చాలించారు.

## 11 రాజస్థాన్ లోని పుష్కర గాయత్రీ ఆలయం



రాజస్థాన్ లో అజ్మీర్ కు వాయువ్య భాగం లో సుమారు పది కిలో మీటర్ల దూరం లో పుష్కర్ దగ్గర గాయత్రి గిరి లో ఉన్న శక్తి పీఠం ఇది. పుష్కర్ అంటే ప్రతి ఏడాదీ జరిగే ఒంటెల పరుగు పందాలకు ప్రసిద్ధి అని అందరికి తెలుసు. రవాణా సౌకర్యం బానే ఉంది.దీనినే "బ్రహ్మ పుష్కరిణి "అని కూడా అంటారు,

అమ్మవారి కంఠా భరణం ఇక్కడే పడిందని భక్తుల విశ్వాసం. ఇక్కడి అమ్మవారు గాయత్రీ దేవి,. దగ్గరలో సర్వానంద శివాలయం చాలా ప్రసిద్ధమైనది. సముద్ర మట్టానికి 1580 అడుగుల ఎత్తులో ఈ పీఠం ఉంది. ఇక్కడి సరస్సు పేరే ''పుష్కర్ ''.సరస్సులో 52 ఘాట్ లున్నాయి. నిత్యం హోమాలు, పూజలతో కళకళ లాడుతుంది. ఈ సరస్సు ఒడ్డునే బ్రహ్మ దేవుని ఆలయం ఉంది. ఇదొక్కటేప్రపంచం మొత్తం మీద బ్రహ్మదేవునికి ఉన్న ఏకైక ఆలయం. మనదేశం లో అతి ముఖ్య తీర్ధ రాజం గా ఇది ప్రసిద్ధి చెందింది. అందుకే దీనికి ''తీర్ధ రాజ్ ''అనే సార్ధక నామం కలిగింది. ఈ క్షేత్రానికి గొప్ప స్థల పురాణం ఉంది.

పద్మ పురాణం లో వజ్రనాభ అనే రాక్షసుడు ప్రజలను హింసించటం చూసి తట్టుకోలేక తన చేతిలోని తామర పువ్వునే ఆయుధం గా విసిరి బ్రహ్మ దేవుడు ఆ రాక్షసుడిని సంహరిచాడట. ఆ సందర్భం లో ఆ పువ్వు నుండి మూడు రేకులు రాలి మూడు చోట్ల పడి మూడు సరస్సులు గా ఏర్పడ్డాయి. వాటికే జ్యేష్ట పుష్కర్, మధ్య పుష్కర్, కనిష్ట పుష్కర్ అనే పేర్లు ఏర్పడ్డాయి. బ్రహ్మ చేతి నుండి జారి పడిన తామర పువ్వు పడిన ప్రదేశం కనుక పుష్కర్ అనే పేరు సార్ధక మైంది.

బ్రహ్మ కు ఇక్కడే యజ్ఞం చేయాలనే సంకల్పం కలిగింది. రాక్షసుల బారిన పడకుండా సరస్సుకి దక్షిణాన రత్నగిరి, ఉత్తరాన నీలగిరి, పశ్చిమాన సంచూరా, తూర్పున సూర్య గిరి అనే కొండలను సృష్టించి, దేవతల నందరిని బ్రహ్మ ఆహ్వానించాడు. సుముహూర్తం సమీపించింది. బ్రహ్మ భార్య సరస్వతీ దేవి అనే సావిత్రీ దేవి ని తీసుకొని రమ్మని బ్రహ్మ నారదుడిని పంపిస్తాడు.. నారదుడు ఆమెను ఒంటరిగా వెళ్ళ వద్దని చెలి కత్తేలతో కలిసి వెళ్ళమని కపట సలహా ఇస్తాడు. ఆమె లక్ష్మి, పార్వతులతో కలిసి వెళ్దామని ఆగిపోయింది.

ముహూర్తం దగ్గర పడుతున్నా భార్య సావిత్రీ దేవి రాలేదని కంగారు పడుతున్నాడు బ్రహ్మ దేవుడు. అనుకొన్న ముహూర్తానికి యజ్ఞం ప్రారంభించాలనుకొని ఇంద్రునితో ఒక అమ్మాయిని చూడమని ఆమె ను వివాహం చేసుకొని యజ్ఞం ప్రారంభిస్తానని అన్నాడు. అప్పుడు ఇంద్రుడు గుజ్జర్ల కుటుంబానికి చెందిన ఒక పాలమ్ముకొనే అమ్మాయిని తీసుకొని వస్తాడు శివ మహా విష్ణువుల సలహా మేరకు ఆమెకు తలంటి పోయించి సర్వాభారణాలను ధరింపజేసి, గోవుతో శుభ్రం చేసి ఆమెకు ''గాయత్రి''అనే పేరు పెడతారు. అనుకొన్న ముహూర్తానికి బ్రహ్మ

గాయత్రి దేవితో కలిసి యజ్ఞం ప్రారంభిస్తాడు. యజ్ఞం పూర్తీ అయే సమయం లో సరస్వతీ దేవి లక్ష్మీ పార్వతులతో అక్కడికి చేరుతుంది.



సరస్వతీ దేవికి కోపం వచ్చి అక్కడున్న బ్రహ్మాది దేవత లందర్నీ శపిస్తుంది. భర్త బ్రహ్మను వెంటనే వృద్ధుడై పోయేట్లు శపించి బ్రహ్మకు ఒక్క పుష్కర్ లో తప్ప వేరెక్కడా ఆలయం ఉండదని ఘోర శాపం ఇచ్చింది. ఇంద్రుడికి అన్ని యుద్ధాలలో అపజయం తప్పదని శపించింది. మానవ జన్మ ఎత్తి భార్యా వియోగం తో బాధ పాడమని విష్ణువు ను శపించింది. శ్మశానం లో భూత ప్రేత పిశాచాలతో సంచరించమని,శివుడిని, భిక్షాటన లో జీవించమని బ్రాహ్మణులను శపిస్తుంది. ఉన్న డబ్బంతా పోగొట్టుకొని నిరుపేద గా మారమని కుబెరుడికి శాపం ఇచ్చింది. ఆ తర్వాత సరస్వతీ దేవి అనే సావిత్రీ దేవి రత్నగిరి పర్వతాలలో తపస్సు చేసుకొంటూ, సరస్వతీ నది గా మారి ప్రవహిస్చిందని పురాణ కధనం. అందువల్లే కొండమీద సావిత్రీ ఆలయం తో బాటు, ఒక చిన్న నీటి ప్రవాహం కూడా కనిపిస్తుంది దీనినే ఇక్కడి వారు సావిత్రి నది అని పిలుస్తారు.. సావిత్రీ దేవి ని పూజించిన స్త్రీలకూ నిత్య సుమంగళి వరాన్ని ప్రసాదిస్తుందని పుష్కర్ ను సందర్శించిన వారంతా భావిస్తారు.

అలిగి శపించి వెళ్లి పోయిన సావిత్రీ దేవి నిష్క్రమణ తర్వాత అక్కడి బ్రాహ్మణులను యజ్ఞం కోన సాగించమని బ్రహ్మ కోరాడు. వారు తమకు ఇచ్చిన శాపం నుండి విముక్తి కల్గించమని వేడుకొన్నారు. అప్పటికే యజ్న ఫలం తో శిద్ధించిన శక్తులతో గాయత్రి పుష్కర్ తీర్ధ క్షేత్రమై విలసిల్లుతుందని, ఇంద్రుడు మళ్ళీ స్వర్గాన్ని గెలుచుకొంటాడని, విష్ణువు శ్రీ రాముడిగా జన్మించి రాక్షస సంహారం చేస్తడని బ్రాహ్మణులు గురు గౌరవం పొందుతారని బ్రహ్మ సావిత్రి ఇచ్చిన శాపానికి తీవ్రత తగ్గించాడు ఆ తర్వాత అందరు కలిసి యజ్ఞాన్ని నిర్విఘ్నం గా నిర్వహిస్తారు. అందుకే బ్రహ్మకు ఇక్కడ తప్ప ఇంకెక్కడా ఆలయం లేదు.

సావిత్రీ దేవి ఆలయం 14 వ శతాబ్దం నాటిది. అంతకు ముందు రెండు వేల ఏళ్ల క్రితం ఒక పురాతన ఆలయం ఉండేదట. ఆది శంకరాచార్యుల వారు ఇక్కడికి వచ్చి ఒకసారి ఆలయాన్ని పునరుద్ధరించారట. ఆ తర్వాతా మధ్యయుగం లో మహారాజా జవాత్ రాజా మరోసారి పునరుద్ధరణ చేశారట. ఆలయం లోపలి గోడలకు వందల కొద్దీ వెండి నాణాలు అంటించి ఉండటం ఇక్కడ గొప్ప విశేషం. భక్తులు తమ పేర్ల మీద నాణాలు సమర్పిస్తారు. పాలరాతి మెట్లు ఎక్కి మందిరం దాటి లోపలి ప్రవేశిస్తే, హంస వాహనం మీద ఉన్న చతుర్ముఖ బ్రహ్మ విగ్రహం కను విందు చేస్తుంది. ఆయన నాలుగు చేతులలో అక్షమాల, కమండలం, పుస్తకం, దర్భలు ఉంటాయి. ఆయనకు ఎడమ వైపు గాయత్రీ దేవి అమ్మ వారి విగ్రహం ఉంటుంది. ఆలయం గోడల మీద సరస్వతీ దేవి తో బాటు ఇతర దేవీ విగ్రహాలూ ముచ్చటగా ఉంటాయి

శీతాకాలం లో ఉదయంఆరు నుంచి రాత్రి ఎనిమిది గంటల వరకు దర్శనం పూజాదికాలు ఉంటాయి మధ్యాహ్నం మూడింటికి విరామం. సనాతన పద్ధతిలో పూజలు చేస్తారు. కేవలం సన్య సించిన వారే పూజలు

నిర్వహించటం ఇక్కడ సాంప్రదాయం. పుష్కర్ లోని ''పరాశర ''గోత్రీకులే పూజలు నిర్వహిస్తారు. సాధువు ద్వారానే కానుకలను భక్తులు అందజేస్తారు.



గర్భ గృహం మధ్యలో వెండి తాబేలు ఉంది. ఏటా కార్తీక పౌర్ణమికి బ్రహ్మ దేవునికి ఉత్సవాలు ఘనం గా నిర్వహిస్తారు. వేలాది మంది భక్తులు దేశం నలు మూలల నుండి వచ్చి పుష్కర సరస్సులో పవిత్ర స్నానాలు చేసి బ్రహ్మ దేవుడిని దర్శించుకొంటారు ప్రతి పౌర్ణమి అమావాస్యల రోజుల్లో ప్రత్యేక పూజలుంటాయి కార్తీకం లోనే ''పుష్కర జాతర ''మహా వైభవం గా జరుగుతుంది. ఇది దీపావళి తర్వాత వచ్చే ఏకాదశి నాడు ప్రారంభమై, పౌర్ణమి వరకు జరుగుతుంది.. ఈ సమయం లోనే ఒంటెల సంత కూడా జరుగుతుంది. తోలు బొమ్మలాటలు రాజస్తానీ సంప్రదాయ నృత్యాలతో రంగుల కాంతులతో మహా వైభవం గా జాతర ఉంటుంది

బ్రహ్మ ఆలయాన్ని దర్శించిన తర్వాత సావిత్రీ, గాయత్రీ అమ్మవార్ల ఆలయాలను దర్శించటం సంప్రదాయం. ఈ రెండు ఆలయాలు సరస్సుకు ఎదురుగా రెండు వేర్వేరు కొండలమీద ఉన్నాయి బ్రహ్మను శపించిన సావిత్రీ దేవి ఆలయం పుష్కర్ లో కెల్లా ఎత్తైన రత్న గిరి మీద బ్రహ్మ ఆలయానికి వెనక వైపు ఉంటుంది అమ్మవారి విగ్రహం లో కోపం కొట్టొచ్చినట్లు కన్పిస్తుంది. గాయత్రీ దేవి సావిత్రి కోపానికి భయపడి నట్లు దర్శన మిస్తుంది ఈ ఆలయం సరస్సుకు తూర్పున చిన్న కొండమీద ఉంటుంది.

## 12 ఒరిస్సా లోని విరజా దేవీ ఆలయం



ఒరిస్సా అనగానే పూరీ జగన్నాధ ఆలయం రధోత్సవం జ్ఞాపకం వస్తాయి. కోణార్క సూర్య దేవాలయం, అక్కడే సముద్రం లో సూర్యోదయ సూర్యాస్తమయ సుందర దృశ్యాలు గుర్తుకొస్తాయి.

పూరీ లోని జగన్నాధ ఆలయం లోనే ఒక శక్తి పీఠంఉన్న సంగతి చాలా మందికి తెలియదు. పూరీ లో సప్త మాతృకలున్నారు. దీనిసే శక్తి పీఠంఅంటారు. కాని ఇదికాదని కొందరి వాదన



ఒరిస్సా లో జాజ్పూర్ లో విరాజా దేవి ఆలయాన్నే శక్తి పీఠంగా జ్ఞానులు భావించారు అమ్మవారి నాభి భాగం ఇక్కడే పడిందని విశ్వాసం. అందుకే శక్తి పీఠంఅని పేరొచ్చింది. దీనికే

''ఓడ్యాణ పీఠం''అనికూడా పేరు. ఇక్కడి అమ్మవారిని విరజా దేవి అని, శివుడిని జగన్నాధుడు అని భక్తులు పిలుస్తారు. అమ్మ వారిని విమలామ్బికా అని కూడా పిలుస్తారు,



గుప్త వంశపు రాజులు మొదట ఆలయాన్ని నిర్మించారు, తర్వాత చంద్ర వంశానికి చెందినా కాన్డిహార్ రెండవ యయాతి అద్భుత మైన ఆల యాన్ని కట్టించాడు, 1558 లో ఆఫ్ఘన్ల దండయాత్రలో ఆలయం ద్వంశం అయింది, . 19 వ శతాబ్దం లో జైపూర్ రాజు సుదర్శన మహా పాత్రో ఇప్పుడు మనం చూస్తున్న ఆలయాన్ని నిర్మించాడు, ఆలయం ఎత్తు 70 అడుగులు. పద్మ పీఠంపై ఆలయం నిర్మింప బడింది, నాల్గవ శతాబ్ది నుండి పదిహేనవ శతాబ్ది వరకు అనేక మంది రాజులు అనేక శివ లింగాలను ప్రతిష్టించారు, అందులో ఈశానేశ్వర, భూపెశ్వర, మ్రుత్యుంజయెశ్వర లింగాలు ప్రసిద్ధమైనవి, నూట పదేళ్ళ క్రితం ఆలయానికి కాంపౌండ్ వాల్ ను భికారీ దాస్ అనే సాధువు సంకల్పం తో నిర్మాణం జరిగింది, దీని గోడలపై8-10 శతాబ్దపు భౌమాకార శిల్పాలు కనుల విందు చేస్తాయి, సింహద్వారం చాలా ముచ్చటగా ఉంటుంది,

## 13 నాసిక్ లో భ్రామరీ దేవి ఆలయం



మహారాష్ట్ర లో నాసిక్ వద్ద గోదావరి నది ఉన్నది. అక్కడే చిత్రకూటం రామాయణ కాలం నుంచి ప్రసిద్ధ మైనది. దగ్గరలో త్ర్యయంబకేశ్వర దేవాలయం ఉన్న సంగతి అందరికి తెలుసు గోదావరి జన్మ స్థానం ఇక్కడే అన్న సంగతి తెలిసిన విషయమే.

నాసిక్ నుండి గోదావరీ తీరానికి ముందుగా చేరుకోవాలి అక్కడి నుండి భ్రామరీ దేవి శక్తి పీఠం కు సులభం గా చేర వచ్చు ఇక్కడే అమ్మవారి ''చెంప భాగం 'పడిందని భక్తుల విశ్వాసం. అమ్మవారిని ''ధారా దేవి '' 'అని కూడా పిలుస్తారు.

ఇక్కడి శివుడిని ''వికృతేశుడు ''అంటారు. సమీపం లోనే పంచవటి కళారామం అనే చోట శివ లింగం ఉన్న ఒక గుహ ఉంది. ఈ లింగాన్ని శ్రీ రాముడు తన పరివారం తో అర్చించి నట్లు ఐతిహ్యం ఉంది. ఇక్కడే రాముడు తన అవక్ర పరాక్రమాన్ని చూపించి 14 వేల మంది రాక్షసులను వదించాడు. . దీనికే జనస్థానం అనే పేరు కూడా ఉంది సీతా దేవి

శ్రీ రామ పరాక్రమాన్ని చూసి విస్తుపోయిందని వాల్మీకి మహర్షి రామాయణ కధనం . ఇక్కడ కుంభమేళా విశేషం గా జరుగుతుంది.

తుల్జా లో హింగులా దేవి ఆలయం



మహారాష్ట్ర లోని ఒస్మానా బాద్ జిల్లా లో తుల్జాపూర్ అనే చోట తుల్జా భవానీ దేవీ ఆలయం ఉంది. ఈమెనే హింగులా దేవి అనికూడా పిలుస్తారు. దేవి ని అమ్బాబాయి అని జగదంబ అని తుకాయి అని భక్తితో భక్తులు పిలుచుకొంటారు. భగవతి, దుర్గా భవానీ అని కూడా కొలుస్తారు. తుల్జా భవాని మహారాస్ట్రుల కులదేవతే కాకుండా భాతీయులందరికి ఆరాధ్య దేవతయే. . శివాజీ మహారాజ్ కు ఖడ్గాన్ని బహూకరించి హిందూ సముద్ధరణకు ప్రేరేపించింది ఈ భవానీ దేవియే.

సహ్యాద్రి పర్వతాలమీద యమునా చలం మీద ఈ ఆలయం ఉంది. మహారాష్ట్ర ను భోన్సలే రాజులు పాలించినప్పుడు పరమ వైభవం పొందింది. నవరాత్రి ఉత్సవాలు ఘనం గా నిర్వహింప బడుతాయి. షోలాపూర్ కు సమీపం లో ఉన్న ఈ ఆలయం శక్తి పీఠంగా ప్రసిద్ధి చెందింది. స్కాంద పురాణం లో అమ్మవారి చరిత్ర వివరం గా రాయబడింది. కర్దమ మహర్షి మరణం తర్వాతా ఆయన భార్య అనుభూతి అమ్మవారిని తన కొడుకును రక్షించమని మందాకినీ నది ఒడ్డున దీక్ష చే బట్టింది. ఆమె దీక్షను భగ్నం చేయటానికి కుకుర్ అనే రాక్షసుడు ప్రయత్నం చేశాడు. మాతా భవానీ దేవి అనుభూతి దీక్షకు మెచ్చి ఆ రాక్షసుడిని సంహరించింది. అప్పటి నుంచే దేవికి తులజా భావాని అనే పేరు వచ్చింది.





తుల్జా భావాని స్వయంభు. మూడున్నర అడుగుల ఎత్తున ఉన్న గ్రానైట్ విగ్రహం చూడ ముచ్చట గా ఉంటుంది. ఆలయ ముఖ ద్వారాన్ని సర్దార్ నిమ్బాల్కర్ ప్రవేశ ద్వారం అంటారు. ఇంకో ద్వారాన్ని షాహాజి మహాద్వారం అని పిలుస్తారు. ముఖద్వారానికి దగ్గరలో మార్కండేయ మహర్షి ఆలయం ఉంది. మధ్యలో పెద్ద యజ్న కుండం ఉంది. దగ్గరలో అమ్రుతకుండ్, దూత్ దేవాలయాలున్నాయి. ఆది శక్తి ఆదిమాత మాతంగీ దేవి ఆలయాలున్నాయి. మతంగ అనే రాక్షసుడు ఇక్కడ అందర్నీ హింసిస్తుంటే అందరు బ్రహ్మను వేడుకొన్నారు. ఆయన సలహాతో శక్తి ని వేడుకొన్నారు ఆమె సప్తమాతా వారాహి గా మారి మతంగ రాక్షస సంహారం చేసింది. ఉదయాం సాయంత్రం అమ్మవారికి విశేష పూజలు నిర్వహిస్తారు నవరాత్రులలో విశేషం గా భక్తులు దర్శించి భవానీ మాత కృపకు పాత్రులవుతారు.

## 14 కొల్హాపూర్ శ్రీ మహా లక్ష్మి ఆలయం

మహారాష్ట్ర లోని కొల్హాపూర్ లో వెలసిన శ్రీ మహా లక్ష్మి దేవి ఆలయం శక్తి పీఠాలలో ఒకటి గా ప్రాముఖ్యత చెందింది. ఈ శక్తి పీఠం ముఖ్యమైన ఆరింటిలో ఒకటి వీటిని దర్శిస్తే మోక్షం లభించటం కాని మనస్సులో కోరిన కోరికలు తీరటం కాని జరుగుతుందనే నమ్మకం ఉంది. మహా విష్ణువు సతీమణి శ్రీ మహా లక్ష్మి భర్తతో నిరంతరం ఉండే ప్రదేశం గా భావిస్తారు

కన్నడ చాళుక్య రాజుల కాలం లో అంటే క్రీ శ.700లో నిర్మించ బడినది గా భావిస్తారు. శిలా వేదిక పై చతుర్భుజాలతో స్వర్ణ కిరీటం తో అమ్మవారు దర్శన మిస్తారు. జేమ్ స్టోన్ తో తయారు చేయ బడిన ఈ విగ్రహం బరువు నలభై కిలోలు. విగ్రహం ఎత్తు మూడు అడుగులు నల్ల రాతి సుందర విగ్రహం. గర్భ గుడి గోడపై శ్రీ చక్రం ఉండటం ఇక్కడి ప్రత్యేకత. మహా లక్ష్మి విగ్రహం వెనుక శిలతో చెక్క బడిన సింహ వాహనం ఉంటుంది. అమ్మవారి కిరీటం లో విష్ణువు శయనించే శేషుడున్నటం మరో ప్రత్యేకత. చతుర్భుజాలలోనాలుగు ప్రత్యేక వస్తువులుంటాయి కుడి కింది చేతిలో నిమ్మకాయ ఉంటుంది, కుడి పై చేతిలో కౌమోదకం తల భూమికి ఆని నట్లుంటుంది, ఎడమ పై చేతిలో ఖేటకం అనే ఆయుధం, కింది చేతిలో ఒక పాత్ర ఉంటుంది. ఈ నాలుగు నాలుగు ప్రత్యేక ధర్మాలు కలిగి ఉన్నవి.



సాధారణం గా ఆలయాలలో విగ్రహాలు తూర్పు, లేక ఉత్తర ముఖం గా ఉంటాయి కాని మహాలక్ష్మీ దేవి పశ్చిమాభిముఖం గా ఉండటం మరో ప్రత్యేకత.. పడమరలో ఉన్న గోడకు ఒక చిన్న కిటికీ ఉంటుంది. ఇందులో నుంచి మార్చి ఇరవై ఒక్కటి నుండి సెప్టెంబర్ లోపు మూడు రోజులు సూర్యాస్తమ కిరణాలు అమ్మవారి ముఖం పై పడి వింత శోభను చేకూర్చటం మరో వింత అనుభవం



ఆలయం లో నవగ్రహాలు సూర్యుడు మహిషా సుర మర్దిని, శివుడు, విష్ణువు, విటోబా రాఖ్ మాయి విగ్రహాలు ప్రత్యేక ఆకర్షణ. ఇందులో కొన్ని విగ్రహాలు పదకొండవ శతాబ్ది కి చెందినవి గా భావిస్తారు. ఆలయ ప్రాంగణం లో మణి కర్ణికా కుండం ఉంది. దీని ఒడ్డునే విశ్వేశ్వరాలయం ఉంటుంది.

అమ్మవారికి రోజు అయిదు సార్లు అర్చన జరుగుతుంది. ఉదయం అయిదు గంటలకు శ్రీ మహా లక్ష్మీ దేవికి మంత్రం పూతం గా సుప్రభాత సేవ చేస్తారు. కాకడ హారతి ఇస్తారు. ఉదయం ఎనిమిది గంటలకు షోడ చోప చార పూజ విధి విధానం గ నిర్వహిస్తారు. మధ్యాహ్నం, సాయంత్రాలలో శేజ హారతి పూజ జరుపుతారు.

ప్రతి శుక్రవారం సాయంత్రాలలో పౌర్ణమి నాడు అమ్మవారిని ఆలయం వెలుపల ఊరేగిస్తారు.

ప్రళయ కాలం లో కూడా ఇక్కడే శ్రీ మహా విష్ణువు శ్రీ మహాలక్ష్మీ ఉంటారని పురాణం కధనం అందుకని దీనిని ''అవిముక్త క్షేత్రం ''అంటారు. లక్ష్మీ దేవి భ్రుగు మహర్షి వల్ల విష్ణు మూర్తికి జరిగిన పరాభవాన్ని తట్టుకోలేక వైకుంఠం వదిలి కొల్హాపూర్ చేరి ఇక్కడ వెంకటేశుడని పిలువబడే విష్ణు మూర్తి ఉండటం గ్రహించి స్థిర పడి పోయిందని ఐతిహ్యం. తిరుమలలో మహాలక్ష్మి రూప మైన పద్మావతి దేవిని శ్రీనివాసుడు

వివాహమాడినట్లు లక్ష్మీ దేవి తెలుసుకొన్నది. ప్రతి రోజు మధ్యాహ్నం దత్తాత్రేయుడు ఇక్కడికి వచ్చి అమ్మవారి నుండి భిక్ష స్వీకరిస్తాడని అనుకొంటారు. సుమారు ఆరువేల ఏళ్ళ నాటి ఆలయం ఇది



'' కిరణోత్సవం సమయం లో వేలాది భక్తులు వచ్చి దర్శించుకొని పులకిస్తారు జనవరి 31, నవంబర్ 9 న సూర్యాస్తమయ కిరణాలు అమ్మవారి పాదాల మీద పడి అర్చిస్తాయి. ఫిబ్రవరి ఒకటి, నవంబర్ 10 న కిరణాలు అమ్మవారి వక్షస్థలం పై పడి ప్రభాసమానం చేస్తాయి. ఫిబ్రవరి రెండు, నవంబర్ పదకొండు తేదీలలో మహాలక్ష్మీ అమ్మవారి శరీరం అంతటా సూర్య కిరణాలు పడి వింత తేజస్సునిస్తాయి ఈ రోజులనే ''కిరణోత్సవ సమయం ''అంటారు. సూర్య దేవునికి అంతటి ఆరాధన ఆ మహా లక్ష్మీ దేవి అంటే అని దీనిని బట్టి అర్ధమవుతోంది. విగ్రహం చెక్కిన శిల్పి ప్రతిభకు ఎంచుకొన్న ప్రదేశానికి మనం జోహార్లు చెప్పాలి. ఈ కిరణోత్సవం దాదాపు వెయ్యి సంవత్సరాల నుండి జరుగుతున్నట్లు భావిస్తున్నారు.



కొంకణ రాజు కామదేవ్, చాళుక్య రాజులు సిలహార్లు, యాదవ రాజులు కొల్హా పూర్ దర్శించిన ఆధారాలున్నాయి. క్రీ శ107 లో కర్ణదేవ మహారాజు అడవి అంతా కొట్టించి ఆలయాన్ని వెలుగులోకి తెచ్చాడట. తొమ్మిదో శతాబ్దం లో రాజ గండవాడి మహాకాళి దేవాలయం నిర్మించి వ్యాప్తి చేశాడు. రాజా జయసిన్హప్రాకారం కట్టించాడు. 1792 కాలం నాటి శంభోజి మహారాజ్ కు అమ్మవారు కలలో కన్పిస్తే విగ్రహం కోసం వేదికాడట. 1712 సెప్టెంబర్ 26న అమ్మవారిని పునహ ప్రతిష్టించాడు. అప్పటి నుండి మహా రాష్ట్రులకు ఆరాధ్య దేవత అయింది. కొల్హాపూర్ పడమర మహారాష్ట్ర లో కరవీర్ ప్రాంతం లో ఉంది. అన్ని ప్రాంతాల నుండి ఇక్కడికి చేరుకోవటానికి రవాణా సదుపాయం ఉంది

## 15 శ్రీ సంతోషి మాత దేవీ ఆలయం




మహారాష్ట్రలో పండరి నాధుడు ఎంత సుప్రసిద్ధమో సంతోషిమాత కూడా అంతే ప్రాచుర్యం పొందింది. మహా రాస్ట్రకే కాదు భారత దేశమంతటా ఆ మాతను అత్యంత భక్తీ శ్రద్ధలతో అర్చిన్చేవారున్నారు ఆమె వ్రతాలను నిర్వహించి మనోభీస్టాలను నేర వేర్చుకొనే వారున్నారు. కస్టాల కడలి లో ఈదు లాడే వారికి సంతోషిమా కల్ప వృక్షమే. ఆమె దయ ఉంటె తీరని కోరిక ఉండదని నమ్మిక.

సంతోషిమా హిందూ దేవీ రూపాలలో కొత్త రూపమే.. సంత్రుప్తికి సంతోషానికి ఆ దేవి ప్రతిరూపం. ఉత్తర భారతం లోను, నేపాల్ దేశం లోను ఆమె ఆరాధనీయులు చాలా మంది ఉన్నారు. 16 శుక్రవారాలు సంతోషి మా ను దీక్షతో పూజించి వ్రతం చేస్తే ఆమె ప్రసన్ను రాలవుతుందని మహిళ ళ నమ్మకం. మహారాస్త్ర లోని ఆశా గడ్ దగ్గర దాను లో సంతోషిమా ఆలయం ఉంది ఇప్పుడు దేశమంతటా కానీ పిస్తున్నాయి

1960 లో మాత్రమె సంతోషిమా కు ప్రాధాన్యత వచ్చింది. 1975 లో హిందీ సినిమా ''జై సంతోషిమా ''తో ఆమె ప్రాచుర్యం ప్రపంచమంతా పాకింది. వ్రతానికీ ప్రాధాన్యత పెరిగింది. దీనితో హిందూ దేవి రూపాలలో కొత్తగా సంతోషిమా చేరింది వీలైన చోట్ల దేవాలయాలను నిర్మించటం ప్రారంభమైంది ఉన్న దేవాలయాలలో ఆమె విగ్రహాలు పెట్టటం ఆచారమైంది. సంతోషి మాత వినాయకుని కుమార్తె గా భావిస్తారు రక్షా బంధన్ పండుగకు ఆమె ప్రాధాన్యత పెరిగింది.

సంతోషి మా వ్రతాన్ని అత్యంత భక్తీ శ్రద్ధలతో చేసే వారికి ఆమె కొంగు బంగారం గా నిలుస్తుంది. సెనగ పప్పు, పంచదార, పూరీ కూర, తీపి పదార్ధం ఆమె కు నైవేద్యం పెట్టాలి. పులుపు పదార్ధాలు నిషిద్ధం. కోరిక తీరగానే ఉద్యాపన చేయాలి ఎనిమిది మంది మగ పిల్లలకు సంతృప్తిగా భోజనం పెట్టాలి. దక్షిణా తాంబూలం ఇవ్వాలి. వ్రతం చేసే రోజుల్లో ఒంటి పూటే భోజనం చేయాలి నేల మీదే నిద్రపోవాలి బ్రహ్మ చర్యాన్ని పాటించాలి.

సంతోషిమాత వ్రత కధ-ఒక ముసలి ఆవిడకు ఏడుగురు సంతానం. అందులో చివరి వాడు ఏ పనీ చేయకుండా తిరిగే వాడు. వాడికి అన్నలు తినగా మిగిలిన పదార్ధాలనే వాళ్ళ అమ్మ పెట్టేది. వాడికి ఈ

విషయం తెలీదు. సంపాదనకోసం ఇల్లు వదిలి వెళ్ళాడు భార్య ఉందన్న సంగతే మర్చిపోయాడు ఒక షాహుకారు దగ్గర పని చేసి డబ్బు బానే సంపాదించాడు. ఇంటి దగ్గర అత్తా తోడికోడళ్ళు అతని భార్యను రాచి రంపాన పెడుతున్నారు. ఆమె ను అసహ్యిన్చుకొంటున్నారు.. చిన్న కోడలికి ఒక సారి ఎవరో సంతోషి మా వ్రతం గురించి చెప్పారు ఆమె దీక్షగా పదహారు శుక్ర వారాలు వ్రతం చేసింది. మాత ప్రసన్ను రాలైందిద. ఆమె భర్తకు కలలో కనిపించి అతని భార్య పడుతున్న కష్టాలను గురించి చెప్పింది. ధన వంతుడైన భర్త ఇంటికి తిరిగి వచ్చి ఆమె దీన స్తితికి విచారించి వేరొక ఇంట్లో కాపురం పెట్టి సంతోషిమా వ్రత ఉద్యాపన జరిపించాడు తోటి కోడళ్ళు అసూయతో పిలిచిన ఎనిమిది మంది బాలురకు పుల్లని పదార్ధాలు వడ్డించారు. నియమం పాటింప బడక పోవటం తో అమ్మ అనుగ్రహం పోయి భర్త జైలు పాలయ్యాడు.

జరిగిన తోడికోడళ్ళ మాయోపాయం తెలుసుకొన్న చిన్నకోడలు మళ్ళీ పదహారు శుక్రవారాలు వ్రతమాచరించి యదా విధిగా ఉద్యాపన చేసింది. అప్పుడు సంతుస్తురాలైన మాత దయ వల్ల భర్త చెరసాల నుండి బయట పడ్డాడు. వారికి ఒక కుమారుడు దేవి దయ వల్ల కలిగాడు. భర్త తో కొడుకుతో మళ్ళీ అత్తా వారిల్లు చేరింది ఆమె గణశీలాలకు భయ పడి అత్తా తోడికోడళ్ళు ఇల్లు వదిలి పారిపోయారు ఒకరోజు మాత మారు వేషం లో వస్తే, చిన్నకోడలు గుర్తుపట్టి భక్తితో పూజించింది. పశ్చాత్తాపం చెందిన తోడి కోడళ్ళు మళ్ళీ చేరి ఆమె కు క్షమాపణ చెప్పి సఖ్యతతో ఉన్నారు.

## 16 రేణుకా మాత ఆలయం



మహారాష్ట్ర లోమహోర్గడ్ దగ్గర మాహుర్ లో రేణుకా దేవి ఆలయం మహిమాన్వితమైనడదిగా ప్రసిద్ధి చెందింది పరశురాముని తల్లి, జమదగ్ని మహర్షి భార్య అయిన రేణుకా దేవి జన్మించిన స్థలం ఇదే నని విశ్వాసం. మహారాష్ట్రలోని శక్తి పీఠాలలో ఇది ఒకటి. మిగిలిన రెండు తుల్జాపూర్ భవానీ, కొల్హాపూర్ లక్ష్మీ దేవి అని ఇదివరకే చెప్పుకొన్నాం, తెలుసుకొన్నాం. దీనితోబాటు మహాశ్రుంగి అమ్మవారి ఆలయం కూడా శక్తి. పీఠమే.

మాహూర్ లో కాళికా దేవి అనసూయా దేవీ ఆలయాలున్నా రేణుకా దేవి ఆలయం సుప్రసిద్ధమైనది. విజయ దశమి నాడు మహోత్సవం జరుపుతారు. వేలాది భక్తులు దర్శిస్తారు.

మాహూర్ లోనే దత్తాత్రేయ స్వామి జన్మించాడని భావిస్తారు. దత్తాత్రేయుని తల్లియే అనసూయా దేవి. మహా పతివ్రతలలో ఒకరు.. ఇక్కడే ప్రాచీన దత్త గుడి ఉంది. ప్రతి ఏటా దత్త పూర్ణమి నాడుభక్తులు విశేషం గా తరలి వచ్చి దత్తాత్రేయుని సందర్శిస్తారు.

దేవీ భాగవతం లో మాహూర్ ప్రస్తావన ఉంది. దీనినే ''మాత్రుపురం ''అంటారు ".దేవి గీత" గ్రంధం లో కూడా ఈ క్షేత్ర ప్రస్తావన ఉంది మహా శక్తి పీఠాలలో మాహూర్ లోని రేణుకా దేవి ఆలయం ఒకటి అని అందులో రాసి ఉంది. దేవి ఇలా చెప్పింది ''భక్తులారా సహ్యాద్రి పర్వతాలలో మాత్రుపురంచాలా ప్రాముఖ్యం కలది. అక్కడే రేణుకా దేవి భక్తులకు కొంగు బంగారం గా ఉండి మనోభీష్టాలను నేర వేరుస్తోంది ''

ముస్లిమలకు కూడా ఇక్కడ ''బాబా సోనాపీర్ దర్గా ''ఉంది. దీనికే ''మొహర్ ఏ రసూల్ ''అనే పేరు.. ఈ దర్గా లో ఉర్సు మహోత్సవాలు జరుగుతాయి భక్తులు విశేషం గా వచ్చి దర్గా ను సందర్శిస్తారు.

ఇక్కడి మొహర్గడ్ కోట పన్నెండవ శతాబ్దికి చెందినది.. బేరార్ చరిత్రలో ఈ కోటకు అత్యంత ప్రాధాన్యత ఉంది. బహమనీ సుల్తాన్ల కాలం లో 1478లో ఇది ఇరవై పరగణాలలో బేరార్ సుబా లో ఒకటిగా ఉండేది.

నాందేడ్ నుండి, పూసత్ నుండి మాహూర్ కు బస్ సౌకర్యం ఉంది. పరశురామ, దేవ దేవేశ్వర,దత్తాత్రేయ, అనసూయా రేణుకా దేవాలయాలు, సర్వతీర్ధ, మాత్రు తీర్ధాలనుఅందరు సందర్శించి వెళ్ళటం ఆచారం ఒక రకం గా పరశురాముని పరివారం అంతా తిరగాడిన పరమ పవిత్ర ప్రదేశం అన్న మాట.

వీటితోపాటు సోనాపీర్ దర్గా, షేక్ ఫరీద్ వాటర్ ఫాల్స్, ఉదేరాం రాజా భవంతి, చివరి పాలకురాలైన ఉదేరాం రాజ భార్య రాయ్ బాగాన్ తిరుగాడిన ప్రదేశాలను అందరు దర్శించి స్ఫూర్తి పొందుతారు.

అందరు తప్పకుండా చూసేది దేవ దేవేశ్వర దేవాలయం. ఇక్కడే దత్తాత్రేయుడు నిద్ర పోతూ ఉంటాడని చెబుతారు. దత్తాత్రేయుడు ''చిరంజీవి ''గా భావిస్తారు. అంటే అన్ని కాలాలలోనూ ఉంటాడని అర్ధం.

## 17 సప్త శృంగీ దేవి ఆలయం





మహా రాష్ట్ర లో నాసిక్ కు అరవై కిలో మీటర్ల దూరం లో ఏడు పర్వత శిఖరాల మధ్య ఉన్న ఆలయమే సప్తశ్రుంగీ దేవి ఆలయం. కాల్వాన్ తాలూకా నండూరి లో కొలువై ఉన్న అమ్మవారే ఈ దేవత. మహా రాష్ట్ర లో ఉన్న మూడున్నర శక్తి పీఠాలలో ఇది ఒకటి. భారత దేశం లోని 51శక్తి పీఠాలలో ఒకటిగా గుర్తింప బడింది.

పడమటి కనుమలలో సహ్యాద్రి పర్వతాలలో వెలసిన దేవి సప్త శృంగి. దాదాపు సముద్ర మట్టానికి4600 అడుగుల ఎత్తున ఉన్న శిఖరం. దేవీ భాగవతం లో దీని గురించి వివరణ ఉంది. అమ్మవారిని సప్త శృంగి అని సప్త శృంగి నివాసిని అనీ పిలుస్తారు. ఈ అమ్మవారిని బ్రహ్మ స్వరూపిణి గా భావిస్తారు. సృష్టి కర్త అయిన బ్రహ్మ దేవుని కమండల జాలం నుండి అమ్మ వారు ఉద్భవించి నట్లు కధనం. ఈమెనే దుర్గా దేవి గా పూజిస్తారు



దండకారణ్యం లో భాగమే సప్త శృంగపర్వతం. త్రేతాయుగం లో శ్రీ రాముడు సీతాదేవి లక్ష్మణుడు శృంగి దేవిని దర్శించి పూజించారు. ఇక్కడ ఉన్న మార్కండేయ గుహలో మార్కండేయ మహర్షి తపస్సు చేసినట్లు ఐతిహ్యం. ఈ గుహలోనే మహర్షి పురాణాలను దేవికి చదివి విని పించాడట. రాత్రివేళల్లో పెద్ద పులి అమ్మ వారి గర్భాలయం లోకి చేరి తెల్ల వార్లూ ఆలయానికి కాపలా కాసి ఉదయానే వెళ్లి పోతుందని కధనం. ఆలయం లో పట్టిన ఒక తేనే పట్టు ను పిండ బోయిన వాడిని అమ్మవారు వద్దని వారించి నట్లు చెబుతారు. ఈ దేవాలయం లో పని చేసే అర్చకుడు కాకాజీ వైద్య కు మానసిక శాంతి లభించటం లేదని అమ్మవారికి మొరపెడితే బాబా ను దర్శించి శాంతి పొందమని ఆదేశించిందట. ఆయనకు అమ్మ చెప్పింది ఏ బాబా యో తెలియక త్రయంబకేశ్వరం వెళ్లి ఆ స్వామిని అర్చిన్చాదట. అయినా శాంతి రాలేదట. ఆ తర్వాతా షిర్డీ వెళ్లి సాయి బాబాను శరణు వేడి పన్నెండు రోజులు ఆయన వద్ద ఉంటె మనశ్శాంతి దొరికిందట.



సప్త శృంగి దేవీ ఆలయం రెండస్తులు. .పై అంతస్తులో అమ్మ వారు కొలుపై ఉంటుంది. అమ్మవారి బొమ్మ ఒక గుహ లో గోడకు చెక్క బడి న శిలా విగ్రహం . ఎనిమిది అడుగుల విగ్రహం. కాషాయ రంగులో నుంటుంది. .మహిషాసురుడిని మర్దిన్చాటానికి దేవతలందరూ అమ్మ వారికిచ్చిన ఆయుధాలన్నీ ఆమె చేతులలో ధరించి ఉంటుంది. శివుడి త్రిశూలం, విష్ణువు చక్రం, వరుణుడి శంఖం అగ్ని దేవుని అగ్ని శిఖలు, ఇంద్రుని వజ్రాయుధం, ,వాయుదేవుని విల్లంబులు, యముడి దండం, దక్షుని అక్షమాల, బ్రహ్మ దేవుని కమండలం, సూర్యుని కిరణాలు, కాళికా దేవి కత్తి డాలు, విశ్వకర్మ పరశువు, కుబేరుని సురా పాత్ర, గద, పద్మం, పాశం, తోమరం మొదలైన ఆయుధా లన్నీ అమ్మ వారు ధరించి ఉంటుంది.



అమ్మవారికి పెద్ద కిరీటం నాశికా భరణం ఉంటాయి రోజు అభిషేకం చేస్తారు నూతన వస్త్రాలు ఆభరణాలు ధరింప జేస్తారు. దేవాలయానికి అనేక మార్పులు జరిగాయి. పర్వతం యెక్క టానికి1710 లో ఉమా బాయి 500 మెట్లు నిర్మించారు. ఇక్కడే మహర్షి మార్కండేయులు దేవీ మహాత్మ్యాన్ని రచించి అమ్మ వారికి విని పించారు. అమ్మవారి ఆలయం పై ఎగిరే జెండాను బుర్గాన్ గ్రామానికి చెందిన గ్రామాధికారి ఏప్రిల్ నెలలో సూర్యోదయం సమయం లో ఇన్ని మెట్లు ఎక్కి ఆలయ శిఖరం పై ధ్వజాన్ని ఎగుర వేస్తాదట.

చైత్ర మాసం లో శ్రీ రామ నవమి ఉత్సవాన్ని నిర్వహిస్తారు సంతానం కోసం అమ్మవారికి మొక్కు కొని అభీష్ట సిద్ధి పొందుతారు. గొందాల్ అనే ప్రాచీన సాంప్రదాయక జానపద నృత్యాన్ని గొందాలీ, భూత్యే, ఆరాదీ, నాయక తెగల వారు అమ్మ వారి యెదుట ప్రదర్శించి ఆమెకు సమర్పణ చేయటం ఇక్కడి ప్రత్యేకత.

## 18 దంతే వాడ దంతేశ్వరీ దేవి ఆలయం



చత్తీష్ గఢరాష్ట్రంలో జగదల్పూర్ జిల్లా లో దంతే వాడ దగ్గర బస్తర్ ఉంది. ఇక్కడ అమ్మ వారి దంతాలు పది నందువల్ల దేవికి దంతేశ్వరి అనే పేరు వచ్చింది. ప్రముఖ శక్తి పీఠాలలో ఇదొకటి. శివుడిని కపాల భైరవ అని పిలుస్తారు. ప్రకృతి రామణీయకత్వానికి ఇది నిలయం. ఇక్కడి అమ్మ వారి ఆలయం 14వ శతాబ్దికి చెందినది. చాళుక్య రాజులు నిర్మించి నట్లు ఆధారాలున్నాయి. నవ రాత్రి ఉత్సవాలలో బస్తర్ ప్రజలు తమ జాన పద కళలను అమ్మ వారి యెదుట ప్రదర్శిస్తూ ఊరేగించటం సాంప్రదాయం. మహా వైభవం గా జరుగే ఈ ఉత్సవాలను వేలాది మంది భక్తులు వచ్చి దర్శించుకొని తరిస్తారు.

ఆలయం సమీపం లో శంకిని, లంకిణి అనే రెండు నదులు రెండు రకాల రంగున్న జలాలతో ప్రవహిస్తాయి. విశాల మైన ప్రాంగణం, ప్రకృతి అందాలు ప్రవహించే నదుల సోయగాలు బస్తర్ ప్రజల సంస్కృతీ అందరు తప్పక చూడ వలసినవే. నల్ల రాతి తో చెక్క బడిన అమ్మ వారి మూర్తి బహు సుందరం భక్తులకు కొంగు బంగారం. ఆలయం లో గర్భ గృహం, మహా మండపం, ముఖ్య మండపం సభా మండపం ఉన్నాయి.. అంతా రాతి కట్టడమే. ఆలయ ప్రవేశ ద్వారం వద్ద గరుడ స్తంభం ఉండటం ఇక్కడి ప్రత్యేకత. విశాల మైన ప్రకారం తో చూడ ముచ్చటైన ఎత్తైన శిఖరం తో ఆలయం శిఖరాయ మానం గా కని పిస్తుంది.

నాగ వంశానికి చెందినా దంతేశ్వారి ఈ ఆలయానికి మణి కర్ణేశ్వరి  కి బదులు గాదంతేశ్వరి అనే పేరు పెట్టి నట్లు చరిత్ర, నాగులు చాళుక్యులకు ముందు పాలించారు, బస్తర్ వాసులే  కాక లక్షలాది భక్తులు  ఈ ఆలయ సందర్శన చేస్తారు,

## 19 ఉజ్జయిని మహా కాళీ ఆలయం



మధ్యప్రదేశ్ లోని ఉజ్జయిని లో మహా కాళీ దేవీ ఆలయం పద్దెనిమిది శక్తి పీఠాలలో ముఖ్యమైనది. అమ్మ వారిని మహా కాళిక అని కూడా పిలుస్తారు. శ్రీ దేవి'' పై పెదవి '' ఇక్కడ పడింది కనుక శాక్తి పీఠం అయింది. భోజ రాజు ఆస్థాన కవి, నవరత్న కవులలో శ్రేష్టుడు  అయిన మహా కవి కాళి దాసు ఈ అమ్మవారి అనుగ్రహం తోనే మహా కవిగా చలామణి అయ్యాడు ఆమె ఆయన నాలుక పై బీజాక్షరాలు రాసిందని ప్రతీతి. అప్పుడే ఆ మహా కవి ''మాణిక్య వీణాముపలాలయన్తీం ''స్తోత్రం ను ఆశువుగా మహా భక్తీ భావ బందురం  గా అమ్మ వారిపై చెప్పాడు.

ఉజ్జయిని నుండి బస్ సౌకర్యం ఉంది. మాల్వా పీఠ భూమి లో నెలకొన్న ఆలయం ఇది.. ఆలయం లో మహా కాళివిగ్రహం -మహా లక్ష్మి, మహా సరస్వతీ దేవి విగ్రహాల మధ్య ఉంటుంది. గరి కాళిఆలయం వెనుక స్తిర గణేష్ ఆలయం ఉంటుంది. హనుమత్కేశ్వర శివలింగం ఘర్కాలి ఆలయ సమీపం లో ఉంది దీనిని ఆంజనేయ స్వామి  ప్రతిష్టించాడు.. స్తిర్మన్ గణేష్ ఆలయం లో సింహేశ్వర శివలింగం ఉంది



స్కాంద పురాణం లో అమ్మ వారిని రక్త దంతిక అని చాముండా అని పేర్కొన బడింది.. ఒకప్పుడు ఉజ్జయిని ని అంధ కాసురుడు అనే రాక్షసుడు పాలించే వాడు. వాడి రక్తం భూమి మీద పడితే ప్రతి రక్త బిందువు నుండి మరో అంధకాసురుడు పుట్టే వాడు వాడు లోక కంటకుడై అందరిని హింసిస్తూ ఉండేవాడు. దేవతల ప్రార్ధన మేరకు శివుడు అందకుడిని ఎదిరించి పోరాడాడు. స్తిర్మన్ వినాయక లేక మహా వినాయకుడు అందకాసురుని నిలువ రించా గలిగాడు. ఆ సమయం లో శివుడు తన త్రిశూలం తో అందకుని రొమ్మును చీల్చాడు. ఆ రక్తం భూమి మీద పడి వేలాది అందకాసురులు ఆవిర్భ వించారు. అప్పుడు మహా కాళి అమ్మ వారు అందకాసురుని రక్తమంతా కింద పడకుండా తాగేసి, అన్ధకాసురులల

నందర్నీ మింగేసింది.. శివుడు త్రిశూలం తో వాడి దేహాన్ని ఆకాశానికి ఎత్తి తన తృతీయ నేత్రమైన అగ్ని నేత్రం తో వాడిని ఆకాశం లోనే దహింప జేశాడు. అంధకాసురుడు ఓటమిని అంగీకరించి శరణు వేడాడు. శివుడు కరుణించి అతన్ని ''భ్రుంగి ''గా మార్చిప్రమధగణంలో ఒకని గా  గా స్వీకరించాడు

ఆశ్వయుజ మాసం లో వచ్చే నవరాత్రి ఉత్సవాలు బ్రహ్మాండం గా నిర్వహిస్తారు. ఆలయం లో కామ బీజాక్షర జపం, నవాక్షర మంత్రం జపం, సప్త శతి స్తోత్రం చేస్తారు.

## 20 ప్రయాగలో లలితా( అలోపీ దేవి) దేవీ ఆలయం

గంగా, యమునా సరస్వతీ నదుల కూడలి ప్రదేశమే ప్రయాగ. ప్రకృష్టమైన కలయిక అని ఆ మాటకు అర్థం దీనిసే అలహా బాద్ అంటారు.త్రివేణీ సంగమం అని, సంగమం  అని కూడా అంటారు.'



ఈ పవిత్ర సంగమ స్థానం లోనే ఆలోపీ బాఘ్ లో లలితా దేవి ఆలయం ఉంది. త్రివేణీ సంగమం లో స్నానం చేసి అమ్మ వారిని దర్శించటం సంప్రదాయం. ఇక్కడే దాక్షాయణి కుడి చేతి వ్రేళ్ళు పడినందు వల్ల శక్తి పీ ఠంగా దీనికి ప్రాముఖ్యత కలిగింది. దేవికి ''లలితా ''అని, ''ఆలోపీ దేవి ''అనే పేర్లు కూడా ఉన్నాయి. ఇక్కడి

శివుని ''భైరవ ''లేక ''భవ" నామాలతో పిలుస్తారు. నిజం గా అమ్మ వారి విగ్రహం అంటూ ఏమీ ఉండదు. అమ్మవారు గా చిన్న డోలీ ని పూజిస్తారు. దీనికి సంబంధించిన ఒక ఐతిహ్యం ప్రచారం లో ఉంది.



ఒకప్పుడు ఇదంతా దట్టమైన అరణ్య ప్రదేశం. వివాహం చేసి వధువును అత్త వారింటకి పల్లకి లో లేక డోలీ లో కూర్చో బెట్టి పంపటం సంప్రదాయం గా ఉండేది. ఒక సారి అలా ఒక వధువుకు వివాహం జరిగి ఆమెను డోలీ లో అత్త వారింటికి సాగ నమ్పుతున్నారు. అటవీ ప్రాంతం గుండా డోలీలో పెళ్లి కూతురు వెళ్తున్నప్పుడు దొంగలు వచ్చి పెళ్లి కుమార్తె నగలను దోచుకు పోయారట. వధువు డోలీ వెంట కాపలా గా ఎవరూ లేరట. అప్పుడు దేవి వధువు ను" మాయం" చేసి ఆమె ను కాపాదిందట. ఈ వార్త దేశమంతటా వ్యాపించింది. ఆ సంఘటనే కద గా మారి తర తరాల వారికి స్పూర్తి దాయక మవుతోంది అందుకే అమ్మ వారికి ''ఆలోపి ''అనే పేరు వచ్చిందట. .అలోపీ అంటే మాయ మవటం అని అర్ధం. .ఈ ప్రాంతం లో పెళ్లి, పేరంటం మొదలైన ఏ శుభ కార్యాలు జరిగినా అలోపీ దేవిని ముందుగా పూజించి మాత్రమె కార్య క్రమాలను ప్రారంభిస్తారు. అలహా బాద్ లోని లలితా దేవి ఆలయాన్ని కొందరు శక్తి పీఠం గా భావిన్చటమూ ఉంది. నవ రాత్రులలో అమ్మ వారి ఉత్సవాలు వైభవో పేతం గా నిర్వ హిస్తారు.

## లలితా దేవి ఆలయం

భగవతి కుడి చేతి వ్రేళ్ళు యమునా నది ఒడ్డున పడటం తో ఇది శక్తి పీఠంగా ప్రసిద్ధి చెందింది. పురాతన ఆలయాన్ని ప్రభు డట్ట బ్రహ్మా చారి గారు మార్చి కొత్త ఆలయాన్ని 1987 నవంబర్16 న నిర్మించారు. 103 అడుగుల ఎత్తైన ఆలయం ఇది. . సింహ ద్వారమే 41 ఎట్టు ఉంది అతి గొప్ప ఆలయం గా చరిత్రకెక్కింది. అలహాబాద్ రైల్వే స్టేషన్ కు దగ్గర గా మిరాపూర్ ప్రాంతంమాలవ్యా నగర్ లో యమునా నది ఒడ్డున ఈ ఆలయం ఉంది.

నవరాత్రి ఉత్సవాలను ఘనం గా నిర్వహిస్తారు.

## 21 కాశీ విశాలాక్షీ దేవి ఆలయం

కాశి అనగానే పవిత్ర గంగానది విశ్వేశ్వరుడు, విశాలాక్షీ, అన్నపూర్ణా దేవి, డుంఠిగణపతి, కాల భైరవుడు ముందుగా గుర్తుకొస్తారు. ఈ క్షేత్రం ఒక మహా శక్తి పీఠం గా కూడా ప్రసిద్ధి చెందింది.



భగవతి కర్ణ కుండలాలు కాశీ లో పడి నట్లు ప్రతీతి. అందుకే అమ్మ వారిని మని కర్ణికా అని కూడా పిలుచుకొంటారు. ఆమెనే విశాలాక్షీ దేవి అని, విశ్వ లక్ష్మీ దేవి అని కూడా పిలవవటం ఉంది ఇక్కడి శివుడు కాల భైరవుడు అని అందరికి తెలిసిన విషయమే. విశాలాక్షి దేవి ఆలయం లో శ్రీ చక్రం ఉండటం మహా విశేషం ఇక్కడి అమ్మవార్కి పురాతన విగ్రహం ఉద్భవ మూర్తి గా భావిస్తారు. ఇప్పుడున్న విగ్రహానికి వెనుక ఈ విగ్రహం ఉంటుంది. అమ్మవారిని ఈ గౌరీ అని కూడా పిలుస్తారు.

విశాలాక్షి అంటే విశాల మైన కన్నులు కలదేవి అని అర్ధం. స్కంద పురాణం ప్రకారం వారణాశి లో ఒక సారి వ్యాస భగవానుని,ఆయన శిష్యులకు ఏడు రోజులు ఎవరూ భిక్ష వెయ లేదు. దానికి ఆయనకు విపరీతం గా కాశీ పై కోపం వచ్చింది.శపించాడు,. అప్పుడు విశాలాక్షి దేవి ఒక బ్రాహ్మణ గృహిణి గా మారి తన ఇంటికి వ్యాసాడులను భోజనానికి ఆహ్వానించింది. వారందరికీ విశాలాక్షీ విశ్వేశ్వర దంపతులు షడ్ర సోపేత మ్రుష్టాన్న భోజనం పెట్టారు, వ్యాసుడు కాశీ పట్టణాన్ని శపించటం మహా నేరం అని శివుడు వ్యాసుడిని కాశీ క్షేత్రం నుండి బహిష్కరించాడు దీనం గా కాళ్ళ మీద పది వేడుకొన్నాడు వ్యాస మహర్షి తప్పు మన్నించమని కోరాడు ''వ్యాస నిష్కాసనం ''చరిత్ర సృష్టిస్తుందని ఊరడించి మళ్ళీ తప్పక వ్యాసునికి కాశీలో అనుమతి నిస్తానని విశ్వేశ్వరుడు చెప్పాడు.. అన్న పూర్ణ లాగానే విశాలాక్షీ దేవి కూడా శివునికి ఒజనం సమకూరుస్తుంది. విశాలాక్షి పెట్టిన భోజనానికి సంతృప్తి చెందినా శివుడు ఆమె ను కాశీ క్షేత్రానికి ముఖ్య దేవత గా ఉండే యోగ్యత కల్పిస్తాడు. చాలాకాలం అన్నపూర్ణా దేవి అంటే విశాలాక్షి దేవి అనే భావించారు కాలక్రమం లో రెండు వేరు వేరు ఆలయాలేర్పడ్డాయి విశ్వనాధుని గుడికి దగ్గరలో అన్న పూర్ణ ఆలయం ఉంటె దీనికి కొద్ది దూరం లో విశాలాక్షి ఆలయం ఉంటుంది సందులు గొందులు దాటి అక్కడికి వెళ్ళాలి.

కాశీ విశాలాక్షి ని కంచి కామాక్షి తోను మధుర మీనాక్షి తోనూ పోలుస్తారు కామాక్షి అంటే కోరిక కల కన్నులు కలది మీనాక్షి అంటే చేపల వంటి కన్నులు కలది అని అర్ధం. వివాహం కాని కన్నెలు గంగా స్నానం చేసి నిష్టతో విశాలాక్షి ని అర్చిస్తే త్వరలో అనుకూలుడైన భర్త లభిస్తాడనే విశ్వాసం ఉంది. నల్ల రాతి అమ్మవారి విగ్రహాలు తేజో వంతం గా ఉంటాయి. నవ రాత్రి ఉత్సవాలను ఘనం గా ఇక్కడ నిర్వహిస్తారు. భాద్రపద మాసపు ఉత్సవాలు కూడా చెప్పుకో దగినవే.

దగ్గరలోని మణి కర్ణికా ఘట్టం లో వేలాది భక్తులు పవిత్ర స్నానాలు చేస్తారు మధ్యాహ్నం పన్నెండు గంటల సమయం లో దేవత లందరూ గంగా నదిలోని ఈ మణికర్ణికా ఘట్టం లో పుణ్య స్నానాలు చేస్తారనే నమ్మకం ఉంది.

## అన్నపూర్ణా దేవి ఆలయం



ఒకసారి శివుడు ప్రాపంచమే మాయ అని, అన్నం కూడా మాయయే అని పార్వతికి చెప్పాడు. తనను భక్తులు అమ్మగా అన్ని వస్తువులను ప్రసాదించే దేవి గా భావిస్తారు కనుక ఈ మాట పార్వతీ దేవికి నచ్చక కోపం వచ్చింది. అందరికి గుణపాఠం చెప్పాలనుకొని కాశీ నుంచి మాయమై పోయింది పార్వతీ దేవి. అప్పుడు అక్కడ క్షామం ఏర్పడి ప్రజలు అన్న పానాదుల కోసం అలమటించటం జరిగింది. ఎక్కడా ఎవ్వరికీ తిండి దొరకలేదు ఆహార ధాన్యాల జాడే లేకుండా పోయింది పొలాలన్నీ బీడులు గా మారిపోయాయి. తిన టానికే కాదు తాగటానికి నీరు కూడా లేదు ఊసరక్షేత్రాలను చూసి జనం అలమటిస్తున్నారు.

ప్రజల కష్టాలు చూసి చలించి పోయిన తల్లి మళ్ళీ కాశీ కి చేరి వంట శాలను ఏర్పాటు చేసింది. పార్వతి రాక తెలుసుకొన్న శివుడు వెంటనే ఆమె దగ్గరకు వచ్చి తన భిక్షా పాత్రను చూపించాడు శివుడు పార్వతి తో ''కనీ పించే ప్రపంచం మాయ అనటం భావ్యం కాదు ''అని తెలియ జేశాడు. భర్త సత్యాన్ని గ్రహించి నందుకు సంతోషించిన సతీ దేవిచిరు నవ్వుతో తానే స్వయం గా ఆయనకు భోజనం పెట్టి టిని పించింది. అప్పటి నుంచి పార్వతీ దేవిని ''అన్న పూర్ణ ''గా అంటే నిరతాన్న ప్రదాత గా పిలుస్తున్నారు శ్రీ శంకర భగవత్పాదులు భక్తితో ''అన్న పూర్నాష్టకం ''రాశారు కాశీ లో ఆ స్తోత్రాన్ని చదువుకొని భోజనం చేయటం ఇప్పటికీ ఆన వాయితీ. ముఖ్యం గా అన్నపూర్ణా దేవి మందిరం లో వేద విద్యార్థులు రెండు పూటలా అన్నపూర్ణాష్టకం పాటించి భోజనాలకు వెళ్తారు. అన్నపూర్ణ అమ్మవారి చేతిలో బంగారపు అన్నపు పాత్ర గరిటె ఉంటుంది ఇలాంటి విగ్రహాలను కొని భక్తులు ఇళ్ళలో భద్రం గా పూజామందిరాలలో పెట్టుకొని పూజిస్తారు.. .

## 22 రామగిరి లో శివానీ దేవి ఆలయం

ఉత్తర ప్రదేశ్ లో చిత్రకూట జిల్లాలో రామ గిరి క్షేత్రం లో శివానీ దేవి ఆలయం ఉంది. ఇది శక్తి పీఠంగా పేరు పొందింది. ఇక్కడ అమ్మ వారి ఎడమ వక్షస్థలం లోని కుడి భాగం పడింది అని విశ్వాసం. రామ గిరి చిత్రకూట ధాం నుంచి సుమారు పది కిలో మీటర్ల దూరం లో ఉంటుంది రామగిరికి దగ్గరే ఖజురాహో విమానాశ్రయం ఉంది.



రామ గిరి లోని అమ్మ వారు శివానీ దేవి. శివుని పేరు ''చండ''..చిత్రకూటానికి దగ్గరలో జానకీ సరో వరం లేక జానకీ కుండ్ ఉంది దీనినే శక్తి పీఠం గా భావించే వారూ ఉన్నారు ఈ శక్తి దేవాలయం బౌద్ధ క్షేత్రమైన రాజ ఘర్ కు దగ్గరలోనే ఉంది. ఇక్కడే వేడి నీటి బుగ్గలున్నాయి వీటికి ''గ్రుద్ధ కూటం ''అని పేరు. యాత్రికులు ఈ ఉష్ణ కుండాలలో పవిత్ర స్నానాలు చేసి శివానీ దేవిని చండ శివుడినీ ని దర్శిస్తారు లక్షలాది భక్తులు అమ్మ వారిని దర్శించి తరిస్తారు దుర్గా దేవి గా ఆరాధిస్తారు శివానీ అంటే శివుని భార్య అని అర్ధం, ఈమెనే చిత్రకూట శివానీ అని కూడా అంటారు,

నవరాత్రి ఉత్సవాలు మహా వైభవం గా నిర్వహిస్తారు ఆరోజుల్లో యజ్ఞాలు చేస్తారు, మకర సంక్రాంతి ని, శరత్ పౌర్ణమిని, సోమా వతీ అమా వాస్యను, శ్రీ రామ నవమి ని ఘనం గా నిర్వహిస్తారు, ఇక్కడి మందాకినీ నది ఒడ్డున రామ కుండం ఉంది, దగ్గరలో నే దేవాంగన, హనుమద్ధార, కామద్ గిరి, లక్ష్మణ పహాడ్, భరత్ మిలాప్దేవాలయం సతీ అనసూయ ఆశ్రమం, గుప్త గోదావరి భరత్ కూపం లను యాత్రికులు సందర్శించి రామాయణ ఘట్టాలను గుర్తుకు తెచ్చుకొంటారు. ఇవన్నీ త్రేతాయుగపు విషయాలే శ్రీ రామ వనవాసానికి సంబంధించిన గాధలు జరిగిన ప్రదేశాలే అందుకనే అంతా ఆపేక్ష గా దర్శిస్తారు.

## 23 బృందావనం లో ఉమా దేవి ఆలయం

ఉత్తర ప్రదేశ్ అంటే నే పుణ్య క్షేత్రాల కూడలి, అందులో బృందావనం అంటే శ్రీ కృష్ణుని లీలా క్షేత్రం. రాసలీలా విహారం గుర్తుకు వస్తాయి దానికి దగ్గరలో ఉన్న మధురా నగరం శ్రీకృష్ణుని జన్మ స్థానం. యమునా తీరం అన్నీ కళ్ళ ముందు మెదిలి మనసు ను మరో లోకం లోకి, రసమయ లోకం లోకి తీసుకొని వెళ్తాయి. అలంటి అద్భుత ప్రదేశమైన బృందావనం ఒక శక్తి పీఠం అని చాలా మందికి తెలియదు'



బృందావనం లో భగవతి తల వెంట్రుకలు పడి నట్లు గా భావిస్తారు. అందుకే శక్తి పీఠం అయింది. బృందావన్ ఆగ్రాకు యాభై కిలోమీటర్ల దూరం లోను, దిల్లీ కి నూట యాభై కిలో మీటర్ల దూరం లోను ఉంది. ఈ క్షేత్రానికి పది కిలో మీటర్లలో మధుర రైల్వే స్టేషన్ ఉంది కనుక ప్రయాణానికి అన్ని సదుపాయాలున్న ప్రదేశం, బృందా వనం. లో అమ్మ వారి పేరు ''ఉమా శివ ''అయ్య వారి నామం ''భూతేశ్వర మహా దేవ''. మధురా, బృందావనం, గోకులం లను మూడింటిని కలిపి ''వ్రజ భూమి ''అని పిలుస్తారు

మధురలోని గోవర్ధన పర్వతానికి భక్తులు ప్రదక్షిణ చేస్తారు. మేన మామ కంసుడిని సంహరించి బాల కృష్ణుడు విశ్రమించిన చోటును ''విశ్రామ ఘాట్ ''అంటారు. ఇక్కడే దేవకీ వసుదేవుల కారాగారం, నంద యశోదల నివాసం, ,రాధా మాధవుల విలాస భూమి ఉన్నాయి వీటిని దర్శించి తన్మయులౌతారు

ఉమా శక్తి పీఠ దేవాలయం బృందా వన బస్ స్టాండ్ కు అతి దగ్గరలోనే ఉంది. ఇది యాభై ఒక్క శక్తి పీఠాలలో రెండవది గా ప్రసిద్ధి చెందింది సతీ దేవి ముంగురులు పడిన ప్రదేశం అని ముందే తెలుసుకొన్నాం,. బృందావానాన్ని 'విధవల నగరం ''అని పిలుస్తారట భర్తలను కోల్పోయిన హిందూ స్త్రీలు పునర్వివాహం చేసుకొనే ఆచారం లే నందువల్ల వారంతా బృందావనం చేరి శ్రీ కృష్ణ నామ భజన తో జీవితాలను ధాన్యం చేసుకొంతారట. ఇలా వచ్చిన వీరి సంఖ్య 30,000 కు పైనే నట,

చైతన్య మహా ప్రభు 1515 లో బృందావననాన్ని సందర్శించే దాకా దీని చరిత్ర కాల గర్భం లో కలిసి పోయింది. శ్రీ కృష్ణుని లీలా ప్రదేశాలన్నితిని గుర్తు పట్టి వాటిని పునరుద్ధరించాదామహాను భావుడు లేక పోతే ఎవరికీ పట్టేదికా

## 24 పశ్చిమ బెంగాలో లో బహులా దేవి ఆలయం



పశ్చిమ బెంగాల్ లో కలకత్తా కాలి కాక అనేక శక్తి పీఠాలున్నాయి. ఇక్కడ ఒకప్పుడు వామా చారం బహుళ ప్రచారం లో ఉండేది అలాంటి శక్తి పీఠాలలో బర్ద్వాన్ జిల్లా కటువా దగర ''బహులా దేవి క్షేత్రం ఉంది. ఇక్కడ దాక్షాయణీ దేవి ఎడమ చేయి పడిందని ప్రతీతి శివుడిని ''భారుక్ ''అంటారు అంటే సర్వ సిద్ధి ప్రదాత అని అర్ధం. ఈ క్షేత్రానికి కటువా రైల్వే స్టేషన్ నుండి కేతుగాం ద్వారా చేరుకో వచ్చు. ఈడ క్షేత్రం అజయ్ నదీ తీరం లో వెలసింది, అమ్మ వారిని బహుళ కాళీ అని బహుళ లక్ష్మీ దేవి అని కూడా పిలుస్తారు,

## ఉచానీ లో మంగళ చండిక



పశ్చిమ బెంగాల్ లోని బర్ద్వాన్ జిల్లాలోనే ఉచాని అనే చోట మరో శక్తి పీఠం ఉంది ఇక్కడ అమ్మ వారి కుడి మని కట్టు పడిందని విశ్వసిస్తారు, గుస్కార్ స్టేషన్ కు సుమారు పదిహేను కిలోమీటర్ల దూరం, అమ్మ వారిని మంగళ చండిక అని అయ్యా వారిని కపిలామ్బరేశ్వార్ అని పిలుస్తారు శివుడికి కపిల వర్ణ వస్త్రాన్ని ధరింప జేస్తారు కనుక ఆపేరు సార్ధక మైంది, అమ్మ వారిని రణ చండికా, దుర్గా పేర్ల తో కూడా పిలుస్తారు  దేవీ మహాత్మ్యం లో చండి లేక చండిక పేరు29 సార్లు వస్తుంది.. తంత్ర విద్యకు ఈ ఆలయం నిలయం గా ఉండేది, చండీ దేవికి, నవాక్షర మంత్రానికి సంబంధం ఉంది, దేవీ మహాత్మ్యం లో అమ్మవారి చరిత్ర విపులం గా ఉంది. రక్త బీజ రాక్షసుని సంహరించే సమయం లో చండిక కాళికా దేవి కి సహకా రించిందని కధనం.



మార్కండేయ పురాణం ప్రకారం ఒక సారి దేవతలంతా సరస్వతీ దేవి ని శుమ్భ నిశుమ్భ రాక్షసుల ఆగడాలనుండి రక్షించమని వేడుకొన్నారుఒఅ మాటలు విన్న పార్వతీ దేవి దేవతలను ఎవరిని ప్రార్దిస్తున్నారని అడిగింది, ఆ సమయం లో ఆమె దేహం నుండి ఒక దేవత చండిక నామం తో వెలువడింది ఈమెనే అంబిక అనీ అంటారు. ఆమె అసలు పేరు చంద్ర ఘంటా దేవి, ఈమె నవ దుర్గాలలో ఒకరు, ఆమె చందా, ముద్నాసుర సంహారం చేసింది, చండిక బ్రహ్మ ను గూర్చి తపస్సు చేసింది తనకు పూర్వపు లావణ్యం సౌందర్యం ఇప్పించమని కోరింది, ఆమె శరీరం నుండి నల్లని రూపు వేరుపడి కౌశిక గా అవతరించింది, ఈమె పార్వతీ దేవి కూతురు గా భావిస్తారు నిశుమ్భాది రాక్షస సంహారం చేసిన తర్వాతాకాళికా దేవి గా పార్వతీ దేవి కార్యం పూర్తీ అయింది  కౌశిక తల్లి పార్వతిలో కలిసి పోయింది.

ఈ దేవాలయం లో నవరాత్రులలో చండీ హోమాన్ని తప్పకుండా వైభావోపెత్వం గా నిర్వహిస్తారు, దుర్గా సప్త శతి ని, నవాక్షరీ మంత్రాన్ని జపిస్తారు,

## 25 యోగాధ్యా దేవి ఆలయం



పశ్చిమ బెంగాల్ లో బర్ద్వాన్ జిల్లాలోనే ఖీర్ గాం అనే చోటుకు దగ్గర యోగాధ్యా దేవి ఆలయం ఉంది. దాక్షాయణీ దేవి పార్థివ ఆశరీరాన్ని బుజం పై మోసుకుంటూ పరమ శివుడు వస్తున్నప్పుడు ఆమె శరీరాన్ని విష్ణు మూర్తి విష్ణు చక్రం తో ఖండ ఖండాలుగా చేదిన్నాడని ఆ శరీర భాగాలు వివిధ ప్రదేశాలలో పడటం వల్ల అక్కడ శక్తి పీఠాలు ఏర్పడి నాయని అందరికి తెలిసిన విషయమే. ఇక్కడ క్షీర గ్రామం లో అమ్మ వారి ''కుడి బొటన వ్రేలు'' పడటం వల్ల శక్తి క్షేత్రం గా ప్రసిద్ధి చెందింది. అమ్మవారిని యుగాద్యా, యోగాద్య, జోగాదాయి, జుగాద్యా పేర్ల తో పిలుచుకొంటు కొలుస్తారు. శివుని ''క్షీర ఖండక ''అంటారు.



ఈ క్షేత్రానికి సంబంధించిన ఒక ఐతిహ్యం ఉంది. ఆలయానికి ప్రక్కనే ఉన్న సరస్సులో అమ్మ వారు ఉంటుందని, సంక్రాంతి నాడు వైశాఖ మాసం లోను బయటకు వచ్చి ఆలయం చేరి పూజ లందు కొంటుందని, మళ్ళీ సరస్సులో కి చేరిపోతుందని చెబుతారు. ఒకప్పుడు ఇక్కడ నరబలి కూడా జరిగి వామాచారానికి ప్రసిద్ధి చెందింది. ఇప్పుడు జంతు బలి మాత్రమె జరుగుతోంది. ఈ ఆలయాన్ని రాజా కీర్తి చంద్ర 1770 లో నిర్మించి నట్లు ఆధారాలున్నాయి. సంక్రాంతి పర్వదినాలలోను మాసం లోను వైశాఖం లోను వేలాది భక్తులు అమ్మ వారిని సందర్శించి అభీష్టాలను నేర వేర్చుకొంటారు.



## భ్రామరీ దేవి ఆలయం

పశ్చిమ బెంగాల్ లో జల్పాయ్ గురీ దగ్గర బోడా అనే ప్రాంత సమీపం లో సాల్ బాది గ్రామం లో ''తిరస్తా నది తీరం లో భ్రామరీ దేవి ఆలయం ఉంది. దాక్షాయణి ఎడమ కాలు ఇక్కడ పడటం వల్ల పవిత్ర శక్తి క్షేత్రం గా వెలసిల్లింది. అమ్మ వారిని భ్రామరీ దేవి అని అయ్యా వారిని ''అంబర ''లేక ''ఈశ్వర ''అని పిలుస్తారు

## కిరీట కోన లో విమలాదేవి మందిరం



ఇదికూడా పశ్చిమ బెంగాల్ లో ఉన్న శక్తి క్షేత్రమే ముర్షిదా బాద్ జిల్లాలో, లాల్బాగ్ నుండి మూడుకిలో మీటర్ల దూరం లో కిరీట కోన ఉంది ఇక్కడే అమ్మ వారి కిరీటం పడిందని విశ్వాసం అందుకే కిరీట కోన అయింది అమ్మ వారికి కిరీటేశ్వరి, విమలా దేవి అని రెండు పేర్లున్నాయి. శివుడిని బైరవ లేక సంవర్త అంటారు

ఇక్కడి విశేషం ఏమిటంటే ఇక్కడ అమ్మ వారికి విగ్రహం అనేదే లేక పోవటం. యెర్ర రంగు చీరను అమ్మ వారి ప్రతి రూపం గా భావించి దానికే పూజాదికాలు నిర్వహిస్తారు.. పురాతన ఆలయాన్ని అక్బర్ చక్ర వర్తి కట్టించాడు. 18 వ శతాబ్దం లో ఇక్కడ అనేక మంది సంతులు మునులు సాధువులు చేరి అర్చించారు. ఈ ప్రాంతపు రాజు రాజ వల్లభుడిని మీర్జాఫర్ హత్య చేశాడు అప్పుడు శివలింగం తానే స్వయం గా రెండు గా చీలి పోయిందట. మీర్జాఫర్ చావు దగ్గర పడ్డప్పుడు, మాత కిరీటేశ్వరి పాదోదకాన్ని పూజారులతో తెప్పించుకొని సేవించి చని పోయాడని స్తానిక కధనం.

## 26 పశ్చిమ బెంగాల్ లో గర్భా దేవి ఆలయం



పశ్చిమ బెంగాల్ లో భీర్భూం జిల్లా లో భోల్పూర్ కు సుమారు పదికిలోమీటర్ల దూరం ఉన్న శక్తి పీఠమే గర్భా దేవి ఆలయం. అమ్మవారి శరీరం లోని ఎముక ఇక్కడ పడిందని నమ్మిక. దేవిని ''దేవా గర్భా ''అని లేక కంకాలేశ్వరి అని పిలుస్తారు



## విభాస లో కపాలినీ దేవి ఆలయం

పశ్చిమ బెంగాల్ లోనే మిడ్న పూర్ దగ్గర తాంలుక్ లో దేవి ఎడమ పాదం అయిన మీనఖండం అంటే మోకాలి చిప్ప నుండి కింది పాదం వరకు పడి నందున శక్తి పీఠం అయింది. దేవికి భీమరూపా లేక కపాలిని అని పేర్లున్నాయి ఇక్కడి శివుడిని శర్వానంద అంటారు

## కుమారీ దేవి ఆలయం



పశ్చిమ బెంగాల్ లోని హుగ్లీ జిల్లా ఖానాకుల్ లో రత్నాకర నది ఒడ్డున రత్నావళీ దేవి ఆలయం ఉంది. బస్సుల్లోను పడవల్లోను చేరే వీలుంది. ఇక్కడ భగవతి కుడి భుజం పడింది కనుక శక్తి పీఠ మై నిలిచింది. దేవిని కుమారీ అని పిలిచి కొలుస్తారు. శివుడు ''బైరవ ''రూపం లో పూజ లందు కొంటున్నాడు.

## నల్హాతేశ్వారి దేవి ఆలయం



పశ్చిమ బెంగాల్ లోనే భీర్భూం జిల్లా నల్హాతి రైల్ స్టేషన్ దగ్గర ఉంది ఇక్కడ శ్రీ దేవి కాలి ఎముకలు పడినాయని విశ్వాసం. దేవిని కాళికా దేవి అని నల్ హాతేశ్వరి దేవి అని పేరు తో అర్చిస్తారు శివుని పేరు యోగీశ్వరుడు. ఇక్కడ స్థానికులే ఎక్కువ గా పూజిస్తారు.

## బక్రేశ్వర్ లో మహిష మర్దిని



పశ్చిమ బెంగాల్ బర్ధాం జిల్లాదబ్రజ్ పూర్ కు సుమారు ఇరవై కిలో మీటర్ల దూరం బక్రేశ్వార్ లో''పాప హరా ''నది ప్రవహిస్తుంది. ఇక్కడే దేవి ''భ్రూ మధ్య భాగం ''పడిందని కథనం. కనుక శక్తి పీఠ మైంది. అమ్మవారు మహిషాసురుని కాలి కింద తొక్కి పట్టి మహోగ్ర రూపం లో నిలుచుని దర్శన మిస్తుంది. శివుడికి బక్రేశ్వర, వక్రేశ్వర వక్రనాధ పేర్లున్నాయి శివ రాత్రి నాడు బ్రహ్మాండమైన జాతర చేస్తారిక్కడ.

స్థానిక ఇతి హాసం ప్రకారం సత్య యుగం లో లక్ష్మీ నారాయణుల వివాహ సమయం లో అసితాంగ అనే మహర్షిని ఇంద్రుడు ఎగతాళి చేశాడు. ఆ యనకు కోపం విపరీతం గా వచ్చి శరీరం లోని నరాలు వంకర తిరిగిపోయాయి అంగ వైకల్యమేర్పడింది. ఆయనే ''అష్టావక్రుడు అనే పేరు తో పిలువబడ్డాడు. ఈ క్షేత్రం లో ఆ మహర్షి చాలా కాలం తీవ్ర తపస్సు చేశాడు. శివుడు అనుగ్రహించాడు శివుడు ఈ క్షేత్రం లో ''వక్ర నాథుడి'' గా ఉంటానని మునికి చెప్పి అలా ఉండి పోయాడు వక్రనాథుడు అనే పేరు రావటానికి ఇదీ కారణం

## అట్టహాస్ లోని ఫుల్లార దేవీ ఆలయం




పశ్చిమ బెంగాల్ లోని శక్తి పీఠాలలో జనాకర్షణ గల శక్తి పీఠం అట్టహాస్ లో ఉంది ఇది బర్ధవాన్ జిల్లాలో ఉంది కలకత్తా నుంచి రెండు వందల కిలో మీటర్ల దూరం.అమ్మ వారు చాలా పెద్దఆకారం లో ఉంటుంది ఆమెను అట్టహసా దేవి అని ''ఫుల్లార దేవి ''అని పిలుచుకొంటారు దేవి నవ్వుతున్న పెదవుల వెడల్పు సుమారు18 అడుగులు ఉంటుంది అంత భారీ విగ్రహం అన్న మాట. అందుకే ఆమెను ఫుల్లార దేవి అన్నారు. దాక్షాయణి పెదిమలు ఇక్కడ పడి నట్లు పురాణ కథనం. శివుని నామం విశ్వేశ.. అమ్మవారి దేవాలయం ప్రక్కనే అయ్య వారి దేవాలయం ఉంటుంది.

## నందీపురం లో నందికేశ్వరిదేవి ఆలయం



పశ్చిమ బెంగాలోనే భీర్భూం జిల్లాలో నందీపూర్ కు కొంత దూరం లో ఈ ఆలయం ఉంది వెళ్ళ టానికి సౌకర్యం గానే ఉంటుంది ఇక్కడ పెద్ద వట వృక్షం ఉంటుంది. ఆ వట వృక్షం కిందనే అమ్మ వారి విగ్రహం ఉంటుంది దేవికి నందిని, నందీశ్వరి అనే పేర్లున్నాయి. శివుడి పేరు నందీశ్వరుడు. ఎక్కువగా స్థానికులు మాత్రమె వచ్చి అమ్మ వారిని పూజిస్తారు

## 27 కర్ణాటక లోని కొల్లూరు లో మూకాంబికా దేవి ఆలయం

కర్ణాటకలో పడమటి కొండలలో అందమైన కొండలు లోయలు ఫల వృక్షాల మధ్య కొల్లూరు లో మూకాంబికా క్షేత్రం.ఉంది. కామాసురుడు అనే రాక్షసుడు ఈ ప్రాంత ప్రజలను విపరీతం గా బాధిస్తుంటే



అందరు పార్వతీ దేవిని శరణు కోరారు వాడు ఒక మహిళ చేతులలోనే చస్తాడని గ్రహించిన దేవి వాడిని అవలీల గా సంహరించింది. ఆమె ధైర్యానికి మెచ్చి శివుడు ఇక్కడ తన కాలి మడమ తో శ్రీ చక్రాన్ని సృష్టించి ప్రతిష్టించాడని ప్రతీతి.

ఆలయానికి కనీసం 1200 ఏళ్ళ చరిత్ర ఉంది. హలుగల్లు వీర సంగయ్య అనే రాజు అమ్మ వారి విగ్రహం చేక్కిన్చాడని చెప్పుకొంటారు. మంగుళూరు నుండి నూట ముప్ఫై కిలో మీటర్ల దూరం లోఉడిపి క్షేత్రానికి ఎనభై కిలో మీటర్ల దూరం కొండల మధ్య ప్రకుతి అందాలు విందు చేస్తుండగా కూడకాద్రి శిఖరం పై ఈ ఆలయం కను విందు చేస్తుంది. తమిళనాడుకు అతి సమీపం లో ఉంటుంది. బంగారు శిఖరం తో భక్త జనాల దృష్టిని ఆకర్షిస్తుంది.

ఇక్కడి విశేషం ఏమిటంటే అమ్మ వారు జ్యోతిర్లింగం గా శివుని తో కలిసి ఉండటం. ఆది శంకరా చార్యుల వారు ఆలయం లో శ్రీ చక్రాన్ని ప్రతిస్టించటం తో మూకాంబికా దేవి ఆలయానికి విశేష ప్రాచుర్యం లభించింది. పంచ ముఖ గణేశ ప్రతిమ అద్భుత శిల్ప నైపుణ్యం తో విరాజిల్లు తుంది. కర్నాటక లోని ఏడు ముక్తి క్షేత్రాలలో కొల్లూరు ఒకటి మిగిలినవి ఉడిపి, సుబ్రహ్మాణ్య, కోడేశ్వర, శంకర నారాయణ, గోకర్ణ క్షేత్రాలు.



ఆది శంకరాచార్యుల వారు ఈ క్షేత్రాన్ని దర్శించి నప్పుడు అమ్మ వారు ప్రత్యక్ష మైనది ఆమె విగ్రహాన్ని ఆయనే ఇక్కడ స్తాపన చేశారు. గర్భాలయం లో ''శంకర సింహాసనం ''ఉంది, ఆ చోటులోనే శంకర భగవత్పాదులు అమ్మ వారి కోసం జపిస్తే సాక్షాత్కరించింది. మూకాంబిక సరస్వతి మహా కాళి,శక్తి ళ సంయుక్త స్వరూపం గా భావిస్తారు. అమ్మవారు కొలువైన కూడకాద్రి పర్వతం మీదనే ఆది శంకరులు తపస్సు చేసిన అమ్బవనం, చిత్రమూలం ప్రదేశాలున్నాయి భక్తులు వీటిని దర్శించి అనుభూతికి లోనౌతారు. కర్నాటక ను పాలించిన రాజు లందరూ అమ్మ వారికి విశేష మైన కానుకలు సమర్పించి భక్తీ శ్రద్ధలతో అర్చించారు. నగర, బెద్నూర్ రాజులకు ఈ దేవాలయమే'' రాజ

దేవాలయం'' వారి ఇల వేల్పు మూకామ్బికయే. మహారాష్ట్ర విజయ నగర ప్రభువుల పాలన లో కూడా వైభవం పొందింది ఆ తర్వాతా ముష్కర తురుష్క పాలన లో దోపిడీకి గురైంది ఇక్కడి కోట్లాది రూపాయలు విలువచేసే అమూల్య సంపద అంతా దోచుకో బడింది.

## పురాణ కధనం



శివుని వరం పొందిన కామాసురుడు కూడ కాద్రి పర్వతం మీద చేరి, దేవతలను మునులను హింసించే వాడు. సప్తర్షులు వీడి పీడ ఎలా విరగడ అవుతుందా అని ప్రయత్నాలు ముమ్మరం చేశారు ఈ విషయాన్ని శుక్రాచార్యుడు వాడి చెవిన వేసి, వాడి చావు ఒక స్త్రీ వల్ల జరుగుతుంది అని చెప్పాడు.. వెంటనే వాడు శివుని అనుగ్రహం కోసం తీవ్ర తపస్సు చేస్తే ఆయన ప్రత్యక్షమై వరం కోరుకో మన్నాడు. కామాసురుడికి శివుడు వరం ఇస్తే లోక కంటకుడు అవుతాడని భావించి వాగ్దేవి సరస్వతీ దేవి వాడి నాలుక పై చేరి మాట రాకుండా మూగ వాడిని చేసింది. మూగ వాడై పోయి నందువల్ల ఆ కామాసురుడు శివుడిని నోటి మాట తో ఏ వరమూ కోరలేక పోయాడు అప్పటి నుంచి వాడిని ''మూకాసురుడు'' అన్నారు. అప్పుడు'' కోల రుషి ''ఉపాయం మేరకు పార్వతీ దేవి సకల దేవతల శక్తులన్నిటిని కలిపి ఒక తీవ్ర శక్తి గా సృష్టించింది ఈమె మూకాసురుని తో యుద్ధం చేసి సంహరించింది. వాడి ప్రార్ధన మన్నించి వాడికి కైవల్యం ప్రసాదించింది మూ కాసురుడిని దేవి సంహరించిన ప్రదేశాన్ని ''మారణ కట్టే ''అంటారు(మరణ గద్దె ). మూకాసురుడు అమ్మ వారిని మూకాంబిక గా తనపేర వెలసిల్ల మని కోరుకొన్నాడు వాడి కోరిక తీర్చి కొల్లూరు లో మూకాంబిక నామం తో విరాజిల్లుతూ భక్తులకు కొంగు బంగారం గా ఉంది.

ఈ ఆలయం లో మూకాంబికా దేవి పద్మాసనం లో ప్రశాంతం గామూడు నేత్రాలతో దర్శన మిస్తుంది. శంఖం చక్రం గద ఆయుధాలను ధరించి ఉంటుంది.

## 28 హొర్నాడు లో అన్న పూర్ణా దేవి ఆలయం

కర్నాటక రాష్ట్రం లో పడమటి కనుమలు ప్రకృతి అందాలకు నిలయాలు. అక్కడే పవిత్ర దేవాలయాలన్నీ ఉండటం విశేషం. ఇప్పుడు హొరనాడు లో వెలసిన అన్న పూర్ణాదేవి ఆలయాన్ని గురించి తెలుసు కొందాం. కాశీ అన్నపూర్ణ తో బాటు అంతటి ప్రసిద్ధి చెందిన ఆలయం ఇది



కర్నాటక లోని చిక్కమగలూర్ జిల్లాలో హొరనాడు అనే పంచాయితీ గ్రామం లో అన్న పూర్నేశ్వారి దేవి కొలుపై ఉంది. జగద్గురువులు ఆది శంకరాచార్యుల వారు స్తాపించిన విగ్రహం ఇది తరువాత 1973 లో కొత్త విగ్రహాన్ని ప్రతిష్టించారు. బెంగుళూర్ కు సుమారు మూడు వందల కిలో మీటర్ల దూరం లో పరవశించే ప్రకృతి లో హొరనాడు ఉంది.. మంగలూర్ కు నూట ముప్పై కిలో మీటర్లు

ఈ ఆలయం లో అన్నపూర్ణా దేవిని దర్శించాలను కొన్న యాత్రికులు కుల మత భేదాలకు అతీతం గా పై చొక్కా, బనీనులు లేకుండా వచ్చి దర్శించుకోవాలనే నియమ ఉంది. దీన్ని అందరు భక్తులు శ్రద్ధ గా పాటిస్తారు.. బుజం మీద ఖండువా లేక తువ్వాలను కప్పుకొని భక్తీ గౌరవాల తో అమ్మ వారిని దర్శించి తరిస్తారు.



అన్నపూర్ణా దేవి విగ్రహం పూర్తిగా బంగారం తో చేసి ఉంటుంది. ఆ మూర్తి అతి సుందరం గా రమణీయం గా కృపా విలసనం గా చైతన్య స్పూర్తి గా దర్శన మిస్తుంది. అన్న పూర్ణా దేవి ని ఒక సారి దర్శించిన వారి ఇంట ఎప్పుడూ అన్నానికి కొదవ ఉండదని భక్తుల ప్రగాఢ విశ్వాసం

ఆ దేవి ప్రభావం గొప్పది. ఒక సారి శివుడు శాపానికి గురి అయితే అన్నపూర్ణ ను దర్శించి శాప విముక్తుడైనట్లు ఐతిహ్యం ఉంది.

కొండలపై ఉన్న ఘాట్ రోడ్లు, లోయలు, అరణ్యాల గుండాపచ్చ్చదనం పరుచుకొన్న ప్రాంతాలను దాటుతూ ఇక్కడి వస్తూ ఉంటె చెప్ప లేని ఆనందం తో మనసు ఉప్పొంగి పోతుంది. ఆలయ పద్ధతులు చాలా విశేషం గా ఆకర్షించి, పవిత్ర భావం అంతటా కనీ పిస్తుంది అమ్మ వారికి భక్తులు బియ్యాన్ని నైవేద్యం గా ఇవ్వటం ఇక్కడి ఆచారం. పూజారులు భక్తులకు అమ్మవారికి నివేదించిన బియ్యాన్ని ప్రసాదం గా తిరిగి ఇస్తారు ఈ బియ్యాన్ని ఇంటికి తెచ్చుకొని వండుకొనే బియ్యం లో కలుపు కొని తింటారు. కూకే లో సుబ్రహ్మణ్య దేవాలయం అరేబియా సముద్ర తీరం లో ఉంది దీన్ని, ఉడిపిని, మంజు నాద దేవాలయాన్ని శృంగేరి ని దర్శించి భక్తులు ఎంతో సంత్రుప్తికి లోనౌతారు.. అమ్మ వారిని'' ఆది శక్త్యాత్మక అన్న పూర్నేశ్వరి'' గా భావిస్తారు. అన్నపూర్నేశ్వరీ దేవి ని దర్శించిన అనుభూతి జీవితం లో మర్చి పోలేము.

ఎత్తైన బంగారు విగ్రహం, దూరం నుండే మనల్ని ఆశీర్వదించే చల్లని చూపులు, మనకు అభయ ప్రదం గా ఉంటుంది ఇది ఇక్కడి ప్రత్యేకత.

నవరాత్రి ఉత్సవాలు వైభవం గా జరుపుతారు, అక్షయ తృతీయ ను విశషం గా చేస్తారు, కార్తీక మాసం లో దీపోత్సవాన్ని కన్నుల పండువు గా నిర్వహిస్తారు, నవ రాత్రులలో నవ శక్తి రోపాలుగా అమ్మ వారిని అలంకరిస్తారు.ఫాల్గున మాసం లో రధోత్సవం చూసి తరించాల్సిందే, ఆలయ కమిటీ ఆధ్వర్యం లో స సామూ హిక ఉపనయనాలు, సామూ హిక వివాహాలు జరిపిస్తారు,

## 29 మంగళూర్ లో మంగళా దేవి ఆలయం

కర్నాటక లో మంగళూర్ర్ ఒక సముద్ర తీర ప్రాంతం అన్ని రకాల చాలా ప్రాధాన్యత సంతరించుకొన్నది. అక్కడ వెలసిన మంగళాదేవి వల్లనే దానికి ఆపేరు వచ్చింది.

మంగలూర్ దగ్గర బోలార లో ఈ దేవీ ఆలయం ఉంది. మంగళూర్ చుట్టూ చాలా కోటలున్నాయి. కేరళ కు సమీపం గా ఉంటుంది దీనిని వాళ్ళు మంగళా పురం అంటే మంగళా దేవి పురం గా పిలుచుకొంటారు,



తుళుప్రాంతాన్ని పాలించిన అడిపే వంశ రాజు కుద వర్మన్ కాలానికి అంటే తొమ్మిది వందల ఏళ్ళ నాటి ఆలయం ఇది. ఆ సమయం లో నేపాల్ దేశం నుంచి ''నాధ సంప్రదాయానికి'' చెందిన మచ్చేన్ద్రనాద్, గోరక్ నాద లు నేత్రావతి నది ఒడ్డున ఒక పవిత్ర ప్రదేశాన్ని కనుక్కొన్నారు. ఆప్రదశమే గోరకోండి.ఒకప్పుడు ఇక్కడ కపిల మహర్షి తపస్సు చేసినట్లు గ్రహించారు. కపిల మహర్షి అక్కడ ఆశ్రమాన్ని స్తాపించి పెద్ద విద్యా కేంద్రం గా తీర్చి దిద్ది తన సాంఖ్య శాస్త్రాన్ని బోధించిన ప్రదేశం ఇదే నని తెలుసుకొన్నారు.

ఇద్దరు మహాత్ములు వచ్చారన్న సంగతి రాజుకు తెలిసి వారిని దర్శించాడు. వారు రాజుకు రాజ్యం స్తిరపడటానికి ఒక పవిత్ర కార్యం చేయవలసింది అని చెప్పారు సరే నన్నాడు. రాజు ఆ ప్రదేశాన్ని తమకు అప్పగిస్తే అక్కడ ఒక ఆశ్రమాన్ని నిర్మించుకొని పెద్ద ముఖ్య ఆధ్యాత్మిక కేంద్రం గా మారుస్తామని అన్నారు. వారి వల్ల ఒకప్పుడు ఇక్కడ మంగళాదేవి ఆలయం ఉండేదని ఆమె పేర నే ఈ ప్రాంతం పిలువబదిందని

అది ఆమెకే అన్కితమివ్వబడిందని గ్రహించాడు. రాజు తన తల్లి వల్లవైష్ణవీ దేవి అండాసుర, పరశురాములు దేవి ఆలయాన్ని నిర్మించి నట్లు తెలుసుకొన్నాడు నాథ మహర్షులు స్వయం గా రాజును ఆ ప్రదేశం చూపించి అక్కడ తవ్వించమని కోరారు రాజు ఆ ప్రదేశాన్ని తవ్వించాడు. అక్కడ శివ లింగం ధారా పాత్ర దొరికాయి. అదే మంగళాదేవి పూర్వ ఆలయం గా నిర్ధారించారు.. వాటిని వారిద్దరూ సూచించిన ప్రదేశం లో స్థాపించి నాగరాజు ను కాపలా గా విగ్రహ ప్రతిష్ట చేశాడు.



మంగళకర రూపం తో మంగళాదేవి సుందర శిల్పాన్ని చెక్కించి రాజా కుంద వర్మ ప్రతిష్ట చేశాడు నాద మునుల సలహాతో. అప్పటి నుంచి మంగాళాదేవి ఆలయం ప్రసిద్ధమై ఆ దేశ ప్రజల మనో భీష్టాలను తీర్చే దేవతగా మంగళాపుర అధిష్టాన దేవత గా ప్రసిద్ధి చెందింది ముఖ్యం గా కన్నె పిల్లలు అనుకూలురైన భర్తలు లభించాలని అమ్మ వారిని కోరుకొంటారు తప్పక వారి కోరిక నేర వేరుతుందనే ప్రబల విశ్వాసం ఉంది. మంగళాదేవి, కద్రి, మంగలూర్ మూడుడు ముఖ్య సంబంధాలను కలిగి ఉన్నాయి

నవరాత్రి ఉత్సవాలు వైభవం గా జరుపుతారు. మంగళాదేవిని ఏడవ రోజు న శారదాంబ గా ఎనిమిదో రోజున మారి కామ్బగా ఆరాధిస్తారు.. ఈ రోజునే ఆయుధ పూజ చేస్తారు. మహర్నవమి నాడు రాదోత్సవాన్ని చూడ టానికి వేలాది భక్తులు విచ్చేస్తారు, మార్నమి కట్టెదాకా రథాన్ని బల మైన లావుపాటి మోకుల తో లాగుతూ అక్కడికి చేరి అమ్మవారికి అర్చన జరుపు తారు మంగాదేవి ని దర్శిస్తే సకల శుభాలు కలిగి సంపద పెరుగుతుందనే విశ్వాసం ప్రజల్లో ఉంది. పెళ్లి కాని పిల్లలు మంగళ పార్వతీ వ్రతాన్ని చేసి మంచి అనుకూలుడైన భర్త ను ఇమ్మని అమ్మ ను ప్రార్ధిస్తారు..

వినాయక చవితి నాడు అతి పెద్ద గణేశుని నెల కొల్పి ఆలయం లో గణేశ ఉత్సవాలు నిర్వహిస్తారు. నిమజ్జనం రోజున భక్తుల సంఖ్య లెక్కకు మించి ఉంటుంది. ఊరేగింపు గా గనేశుని తీసుకొని హోగె బజార్ లోని వెళ్లి ఉప్పెన కోటే దగ్గర నిమజ్జనం చేస్తారు.

## 30 మైసూర్ లో చాముండీ దేవి ఆలయం

మైసూర్ కు పదమూడు కిలోమీటర్ల దూరం లో చాముండీ కొండ మీద మైసూర్ ప్రజల మనో భీష్టాలను నెరవేర్చే చాముండేశ్వారీ దేవి ఆలయం ఉంది ఆమెను దుర్గా దేవి అని కూడా పిలుస్తారు. పన్నెండవ శతాబ్దిలో హోయసల రాజులూ మొదటగా ఆలయాన్ని నిర్మించారు. పది హేడవ శతాబ్దం లో విజయ నగర రాజులు శిఖర ప్రతిష్టచేశారు. 1669 లో 3000 అడుగుల ఎట్టు ఉన్న ఈ కొండ మీదకువెళ్ళటానికి వీలుగా వెయ్యి మెట్లను నిర్మించారు



ఆలయం లో అనేక నంది విగ్రహాలు కను విందు చేస్తాయి. 800 వ మెట్టు వద్ద అతి పెద్ద నందివిగ్రహం పదిహేను అడుగుల ఎట్టు ఇరవై నాలుగు అడుగుల పొడవు తో మెడనిండా గంటల తో చిన్న శివాలయం ముందు చూపరులను ఆకర్షిస్తూ దర్శనానికి ఆహ్వానిస్తున్నట్లు కనిపిస్తాడు. ఆలయానికి ఏడంతస్తుల గోపురం ఉంది. చాముండి అమ్మ వారి విగ్రహం బంగారు తోను ముఖ ద్వారం తలుపులు వెండి తోనూ చేయ బడినాయి. మైసూర్రాజా దొడ్డ దేవా రాజ ఒడియార్ అమ్మ వారి అత్యంత సుందర విగ్రహాన్ని నిర్మిమ జేశాడని చరిత్ర. చాముడీ హిల్స్ కు పూర్వపు పేరు మహా బాల పర్వతం.



నవ రాత్రి ఉత్సవాలు మహా వైభవం గా చేస్తారు, అన్ని రకాల అలంకరణలు చేస్తారు, దీపాలంకరణ తో ఆలయం వింత శోభ లీను తుంది,

ఆలయం వెలుపల పెద్ద రాక్షస విగ్రహం చూపరులను ఆకర్షిస్తూ దుష్ట స్వభావానికి పరాకాష్ట గా కని పిస్తుంది.

" దర్శనీయ దేవీ ఆలయాలు "ఇంతటితో సమాప్తమ్. ఇది స్వల్ప విరామం మాత్రమె. మళ్ళీ ఇంకో రూపం లో ప్రారంభ మవుతుంది

# దర్శనీయ వినాయక దేవాలయాలు

## 1 బొంబాయి లోని శ్రీ సిద్ధి వినాయక దేవాలయం



మహారాష్ట్రలో బొంబాయి నగరం లో ప్రభావతి అనే చోట శ్రీ విద్ధి వినాయక దేవాలయం రెండు వందల ఏళ్ళ చరిత్ర కలది దీనిని 1801 నవంబర్ 19 న శ్రీమతి లక్ష్మి విట్టు.శ్రీ దియు భాయ్ పాటిల్ లు నిర్మించారు బొంబాయి లో ఉన్న అన్ని దేవాలయాల కంటే అత్యంత సంపన్న మైన దేవాలయం గా ప్రసిద్ధి చెందింది

ఇదొక చిన్న ఆలయం గర్భ గుడిలో శ్రీ సిద్ధి వినాయక విగ్రహం ఉంటుంది గర్భాలయ పై కప్పు అంతా బంగారు తాపడం చేయ బడింది. గర్భాలయ ద్వారాలు కొయ్యతో చేయబడ్డాయి వీటిపై అష్ట గణ పతులను అత్యంత వైభవం గా చెక్కారు ఇవి బొంబాయి లోని అష్ట గణపతులకు ప్రతీకలు. ఇప్పుడు ఈ చిన్న ఆలయానికి అను బంధం గా విశాల మైన భవంతి సత్రాలు ఆధునిక పద్ధతులలో నిర్మించారు ఈ ఆలయం మహా శక్తి వంత మైనది రాజకీయ నాయకులకు సినిమా స్టార్లకు సిద్ధి వినాయకుడు వర దేవత వారందరుతరచు వచ్చి దర్శనం చేసుకొని కోరికలు విన్న వించి,స్వామి అనుగ్రహం తో , సఫల మనోరధులౌతారు అందుకే నిత్యం భక్తులతో అధికార అనదికారులతో ఆలయం రద్దీ గా ఉంటుంది ఒక కొలను కూడా ఆలయ సమీపం లో తవ్వించారు

శ్రీ సిద్ధి వినాయక స్వామి సంవత్సరాదాయం కనీసం పది నుంచి పది హేను కోట్ల రూపాయలు. ఒక ప్రైవేట్ ట్రస్ట్ బోర్డ్ ఆధ్వర్యం లోనే ఆలయం చాలా కాలం నిర్వహింప బడింది కాని పాలకులపై అవి నీతి ఆరోపణలు రావటం వాళ్ళ హైకోర్ట్ జోక్యం కలిగించుకోవాల్సి వచ్చింది కోర్ట్ ఆదేశం పై ప్రభుత్వం "సిద్ధి వినాయక ట్రస్ట్ బోర్డ్ "ను ఏర్పాటు చేసింది. అంటే రాజకీయాలు చోటుచేసుకోన్నాయన్న మాట. ఏ ప్రభుత్వం అధికారం లో ఉంటె వారికి



ఇష్టం వచ్చిన వారిని నియమించి సమర్ధతకు అంకిత భావానికి సేవకూ తిలోదకాలిస్తోంది ప్రభుత్వం. అంటే ఇప్పుడు ట్రస్ట్ బోర్డ్ రాజకీయ పునరావాస కేంద్రం అయిందన్న మాట. ఇది మంచిపద్ధతికాదని భక్తులు గగ్గోలు పెడుతున్నారు అయినా వీటిని లెక్క చెయ్యకుండా అశేష జనం స్వామిని దర్శించి మొక్కులు చేల్లిన్చుకొంటారు భక్తుల సంఖ్య కాని ఆదాయం కాని ఏ మాత్రం తాగ్గ లేదు ఇదీ సిద్ధి వినాయక మహిమ

## 2 స్వేతార్క గణపతి దేవాలయం –కాజి పేట్

వినాయకునికి అనేక రూపాలున్నాయి. ఇన్ని రూపాలు ఏ దేవుడికి లేవు. కాని ఈ రూపాలలో మనం ఆయన్ను దర్శించాలేము అందుకని ముఖ్యమైన 64 రూపాలను పేర్కొంటారు కాని అందులో 32 ముఖ్యమైనవి వీటిలో కూడా 16 రూపాలుఅత్యంత ముఖ్యమైనవి. కాని వీటిలో ఎక్కడా స్వేతార్క గణ పతి పేరు పేర్కొన బడ లేదు



కాని నారదాది పురాణాలలో లో తెల్ల జిల్లేడు చెట్టు వంద ఏళ్ళు బతికితే అది గణపతి రూపం పొందుతుంది అని ఉంది. అదే స్వేతార్క గణపతి. గా పెద్దలు చెబుతున్నారు. కాని అనుభవం లో స్వేతార్కం అంటే తెల్ల జిల్లేడు వంద ఏళ్ళు బతికి ఉండగా చూసిన వారు అది గణపతి రూపం పొందినట్లు చూసిన వారు ఎవరూలేరు. గణపతి ఉపనిషత్ లో మాత్రం తెల్ల జిల్లేడు వందేళ్ళు జీవిస్తే గణపతికి ఉండే సర్వ అవయవాలతో గణపతి రూపం దాలుస్తుంది అని ఖచ్చితం గా చెప్ప బడింది. ఇది అతి అరుదైన సంఘటన అని కూడా పేర్కొన్నారు. సాధారణం గా ఏ చెట్టు వేరు అయినా దీర్ఘకాలానికి పాము ఆకారం లోనో, ఏనుగు ఆకారం లోనో మారుతుంది. అని అనుభావ్నులైన పెద్దలన్నారు. అంతమాత్రం చేత ప్రతి వేరు గణపతి రూపం పొందటం అసంభవం. హనుమంతుడు పారిజాత వృక్షమూలం లో ఉంటాడని అందరికి నమ్మకం. పారిజాత మూలం హనుమాన్ రూపం దాలుస్తుంది అని విజ్ఞులు భావించారు.

తెలంగాణ లో కాజీపేట లో విష్ణుపురి కాలని లో "స్వేతార్క మూల గణపతి స్వామి "వారల దేవాలయం దేశ దేశాలలో ప్రసిద్ధి చెందిన అరుదైన ఆలయం. నిత్యం వేలాది భక్తులు "తెల్ల జిల్లేడు గణపతి "స్వామిని దర్శించి, పూజించి తరిస్తుంటారు. ఈ స్వామిని "సంకల్ప సిద్ధి వినాయకుడు "అని కూడా అంటారు. ఈ తెల్ల జిల్లేడుగణేశునికి అన్ని అవయవాలు ఏర్పడి పూర్ణ స్వరూపుడు గా దర్శనం ఇస్తాడు. ఏ శిల్పీ, చెక్కిన రూపం కాదుఇది. స్పష్టమైన కన్నులు తొండం, చెవులు, నుదురు కాళ్ళు చేతులు వాహనమైన అనిన్ద్యుడనే ఎలుక,యజ్ఞోప వీతం ముక్కు అన్ని ఉండిమహాశ్చర్యాన్ని కలిగిస్తాయి . అతి సహజం గా ఏర్పడిన విశిష్ట వింత స్వరూపం ఈ స్వేతార్క మూల గణపతి.

తూర్పు ముఖం గా స్వామి ఉన్నా, ఈశాన్య దిశ వైపు చూస్తున్నట్లు కన్పిస్తాడు ద్రుష్టి తండ్రి శివుని విహార భూమి కైలాసం వైపు ఉన్నట్లు అని పిస్తుంది. సకల వాస్తు స్వరూపుడు అని పిస్తాడు. పురాణ కధనం ప్రకారం ఒక సారి మూషికాసురునికి వినాయకునికి యుద్ధం జరిగింది తన కున్న రెండు దంతాలలో ఒక దాన్ని పెకలించి దానితో మూషికుడిని పొడిచి చంపాడు. ఈ మూషికాసుర వధ అయిన తర్వాతా స్వామి ప్రశాంత చిత్తం ఈ రూపం లో తో ఇక్కడ కూర్చున్నాడని కధనం. "ఓం గం గణపతయే నమః "అని ఆర్తిగా ధ్యానిస్తే స్వామి సంప్రీతుడై సకల కోరికలు నేరవేరుస్తాడు అని భక్త జన విశ్వాసం

## 3 హేరంబ గణపతి ఆలయం

వినాయకుని కి ఉన్న 32 ముఖ్య రూ పాలలో హేరంబ గణపతి 11 వ రూపం. బలహీనుల పాలిటి రక్షకుడు గా హేరంబ గణపతి పిలువ బడుతున్నాడు. హేరంబ గణపతికి అయిదు ముఖాలు పది చేతులు ఉంటాయి. కుడి చేయి అభయ ముద్రలో ఉంది భక్తుల రక్షణ తన బాధ్యత అని తెలియ జేస్తుంది. ఎడమ చేయి వర ప్రసాద ముద్ర లో ఉంటుంది. మిగిలిన చేతులలో ముడి, జపమాల, గండ్ర గొడ్డలి, ముద్గరం , విరిగిన దంతం ఆయుధం గా, పుష్పహారం,ఉండ్రాళ్ళు, పండు ఉంటాయి. తెల్లని శరీరం తో సింహ వాహనుడు గా దర్శన మిస్తాడు.. హేరంబ గణపతికి ఆర్ద్రా నక్షత్రం మహా పవిత్రమైనది. హేరంబ గణపతి ని కొలిచిన వారికి భయాలను పోగొట్టి, తమ మీద తమకు నమ్మకం కలిగించి విజ్ఞానం కలిగించి కోరిన కోర్కెలను నేర వేరుస్తాడు హేరంబ గణపతి భక్తులకు భయం అంటూ ఉండదు



.హేరంబ గణపతి రూపం చాలా అరుదైన రూపం. చాలా కొద్ది చోట్ల మాత్రమె ఉన్నాడు ముఖ్యం గా కాశీ విశ్వేశ్వరాలయం లో హేరంబ గణ పతి కొలువై ఉన్నాడు. కర్నాటక లోని మైసూర్ జిల్లాలోని చామ రాజ నగరం లో, నంజన్ గూడి లో హేరంబ గణపతి దేవాలయాలున్నాయి. ఇక్కడే మనకు 32 రూపాల గణపతి విగ్రహాలను దర్శించ వచ్చు.



**హేరంబ గణపతి మంత్రం**

**''అభయ వర ముద్రః పాషా దండాక్షమాలా –శ్రిని పరశు**

**దధానో ముద్గరం మోదకం చ**

**ఫలమది ఘుట సింహః పంచ మాతంగ వక్త్రః-గణపతి రతి**

**గౌరః పాతు హేరంబ నామా ''**

## 4 క్షిప్ర గణపతి దేవాలయం

క్షిప్ర అంటే శీఘ్రం అని అర్ధం. కనుక క్షిప్ర గణపతిని సేవిస్తే అతి త్వరలో కోరికలు తీరుతాయనిభావం ఇలాంటి క్షిప్ర గణపతి దేవాలయాలు అరుదుగా ఉన్నాయి. ఆంధ్ర ప్రదేశ్ లో విజయవాడ లో శ్రీ గణపతి

సచ్చిదానంద స్వామి వారి ఆశ్రమం లో క్షిప్ర గణపతి దేవాలయముంది దీనిని స్వామీజీ 1981 ఏప్రిల్ 16 న ప్రతిష్టించి ఆలయ నిర్మాణం చేశారు.



క్షిప్ర గణపతి ఎరుపు రంగులోబహు సుందరం గా ఉంటాడు. చేతిలో విరిగిన దంతం ఉంటుంది. మిగిలిన చేతులలో ముడి, అంకుశం, కల్పవృక్ష శాఖ, విలువైన వజ్రాలున్న చిన్న కుండ ఉంటాయి ఇవి విఘ్నానికి వర ప్రసాదానికి చిహ్నాలు తొండం పైకి ఎత్తి ఉంటాడు ఇది మేధావి తనానికి చిహ్నం.

ఒకప్పుడు కేరళలో లో కలపతి అగ్రహారపు బ్రాహ్మణులు తాటాకు పాకల లో అంటే పర్ణ శాలల్లో నివశించేవారు ఇవి మాటి మాటికీ అగ్నికి ఆహుతిఅయి చాలా ఇబ్బందులు పడే వారు. ఈ బాధ నుండి విముక్తి పొందటానికి అనేక రకాలుగా ఆలోచించి ఒక జ్యోతిష్యుని సంప్రదించారు. ఆయన గణేశ దేవాలయాన్ని శివ ద్రుష్టి పడేట్లు నిర్మించమని సలహా ఇచ్చాడు. ఆయన ఆదేశాను సారం తూర్పు చెరువు వద్ద మర్రి వృక్షం కింద ఉన్న మహా క్షిప్ర గణపతి విగ్రహాన్నిఅప్పటికే నిర్మింప బడి ఉన్న శ్రీ విశ్వ నాధ దేవాలయం లోని మహా శివుని ద్రుష్టి సోకెట్లు ప్రతిష్టించి ఆలయాన్ని నిర్మించారు ఆ అగ్రహారీకులు. ఈ ఆలయ నిర్మాణం ఎప్పుడు జరిగిందో ఎవరికి తెలియదు కాని దీనికి ముందే విశ్వనాధ ఆలయం ఉంది. మలబారు ప్రాంతం లో అతి ప్రాచీన ఆలయం గా భావిస్తారు ఇది క్రీశ.1425 లో నిర్మింపబడి నట్లు తెలుస్తోంది

**క్షిప్ర గణపతి మంత్రం -"-దంత కల్ప లతా పాశ రత్నకుంభాం అంకుశోజ్వలం**

**బంధూక కామ నియభం, ధ్యాయేత్ క్షిప్ర గణాధిపం "**

క్షిప్రా గణపతి దేవాలయాలు తమిళ నాడు లోని కన్యాకుమారిలో, కర్నాటక లోని శ్రీ రంగ పట్నం లో కూడా ఉన్నాయి.

వారణాసి లోని కాశీ విశ్వేశ్వరాలయ సమీపం లో క్షిప్ర గణపతి ఆలయముంది.

## 5 ఉచ్ఛిష్ట గణపతి దేవాలయం

ఉచ్ఛిష్ట గణపతి అంటే తినగా మిగిలిన దాన్ని చేత ధరించిన గణేశుడు. సర్వ రక్షకుడు గా ప్రసిద్ధి. నీలం రంగులో ఉంటాడు ఆరు భుజాలుంటాయి. శక్తి తో ఉపవిష్టుడై ఉంటాడు. చేతిలో వీణ ధరించి కనిపిస్తాడు మరొక చేతిలో దానిమ్మ పండు ఉంటుంది. మిగిలిన చేతులలలో నీలి కలువ, జపమాల, తాజా ధాన్యపు కంకి ఉండటం ప్రత్యేకత. భక్షించాగా మిగిలిన అన్నాన్ని చేత ధరించిన వాడే ఉచ్ఛిష్ట గణపతి. ఉచ్ఛిస్తం అంటే తినగా మిగిలింది అని అర్ధం అంతేకాక మిగిలిన ఏనుగు తలను ధరించిన వాడు అనే అర్ధాన్ని కూడా కొందరు చెబుతారు. తొండం నీ భార్య శక్తి తొడ మీద ఉంచి దర్శనమివ్వటం మరో ప్రత్యేకత. ఉచ్ఛిష్ట గణపతి తాంత్రిక గణపతి గా ఆరాధింప బడుతున్నాడు. గణపతికి ఉన్న ముప్పై రెండు రూపాలలో ఉచ్ఛిష్ట గణపతి ఎనిమిదవ రూపం

**ఉచ్ఛిష్ట గణపతి మంత్రం -"నీలాబ్జం దాడిమం వీణా శాలి గుంజాక్ష సూత్రాకరం**

**దదాదు చ్ఛిస్ట నామాయామ్ గణేశ పాతు మేచకః "**



ఉచ్ఛిష్ట గణపతి ఉపాసన వల్ల విద్యార్ధులకు విద్య బాగా వస్తుంది. మానసికం గా బాధ పడే పిల్లలకు ఈ గణపతి ఉపాసన మానసికారోగయం కలుగుతుంది. ఉచ్ఛిష్ట గణపతి మంత్రం అన్ని మంత్రాలకు మూలా దారమని వమా చార పరాయణులు భావిస్తారు ఈయన పూజకు ఏరోజు అని నియమం లేదు అన్ని వేళల అన్ని రోజులలో అర్చించ వచ్చు. ఉచ్ఛిష్ట గణపతి మంత్రజపం చేసే టప్పుడు ఫలాలను ఆరగిస్తూ లేక లడ్డూలను భక్షిస్తూ చేయటం వింత గా ఉంటుంది. ఆయన వల్ల సిద్ధి పొందాలంటే ఉచ్ఛిష్ట గణపతి మంత్రాన్ని 16,000 సార్లు జపించాలి.

తమిళ నాడు లోని తిరుచిరాపల్లి లో రాక ఫోర్ట్ మీద ఉచ్ఛిష్ట గణపతి దేవాలయం ఉంది మైసూర్ లోని చామ రాజ నగర్ నంజన్ గుడ్ లలో ను, కేరళ లో తిరువనంత పురం లోను ఉన్నాయి

### ఉచ్చిష్ట గణపతి  ధ్యాన మంత్రం

**''రక్త మూర్తిం గణేశంచ –సర్వాభరణ భూషితం –రక్త వస్త్రం త్రినేత్రం చ –రక్త పద్మాసనేష్టి తం**
**చతుర్భుజం మహా కాయం –ద్విదంతం సుస్మితాననం –ఇష్టాంచదక్షిణే హస్తే-దంతం చ దదాతః కరే**
**పాశామ్కుశంచ హస్తాభయం- జటా మండల  వేష్టితం –లలాటే చంద్రరేఖాద్యాంసర్వాలంకారభూషితం**

### 6 మాణిక్య గణపతి దేవాలయం



అష్ట వినాయక దేవాలయాలలో చింతామణి గణపతి దేవాలయం ముఖ్యమైనది. చింతామణి గణపతి దేవాలయం మహారాష్ట్ర లో పూనా కు ఇరవై అయిదు కిలో మీటర్ల దూరం లో ఉన్న ''తేయూర్ ''గ్రామం లో ఉంది. మొరయ గోస్వామి అనే మహాను భావుడు ఇక్కడ సిద్ధి పొందాడు ఆయన కుమారుడు ఈ ఆలయాన్ని నిర్మించాడు. ఆ ప్రాంతాన్ని పాలించిన అభిజిత్ మహా రాజు, భార్య గుణ వతి దంపతులకు సాగ కపిలముని  అనుగ్రహం తో ' గణ''అనే కుమారుడు జన్మించాడు. మహర్షి  కపిల తన కోరిక తీర్చాడు కనుక  ఆయన వద్ద ఉన్న చింతామణి ని బలాత్కారం గా లాక్కునే దురుద్దేశం తో వచ్చాడు  దాన్ని ఇవ్వటానికి కపిల అంగీకరించ లేదు. కాని రాజు కొడుకు గణ దాన్ని బలాత్కారం గా లాగేసుకొన్నాడు

ఆ ఆపత్కర సమయం లో దుర్గా దేవి కపిలుడిని గణపతి ని వేడుకొమ్మని హితవు చెప్పింది ఆయన ప్రార్ధన తో గణపతి వాళ్ళ లభించిన శక్తితో కపిలుడు గుణ ను ఓడించిచంపేశాడు  అభిజిత్ రాజు దాన్ని తన దగ్గర ఉంచుకోటా నికి ఇష్టం లేక కపిలునికి ఇచ్చేశాడు కాని కపిలుడూ చింతామణి ని దగ్గరా ఉంచుకోవటానికి ఇష్టపడ లేదు. వినాయక స్వామి ఆ ప్రదేశం లో ఉంది పోవాలని నిశ్చయించుకొని తనను ''చింతా మని గణపతి ''గా ప్రకటించుకొని అక్కడే కదంబ వృక్షం కింద వెలిశాడు

### 7 తేయూర్ ఆలయం

కపిల మహర్షి తపస్సు కు మెచ్చి శివుడు  చింతామణిని మహర్షికి కానుక గా ఇచ్చాడని ఐతిహ్యం, చింతామణి అంటే కోరిన కోర్కెలను వెంటనే తీర్చే మణి అని అర్ధం

చింతా మణి మంత్రం –**''ఓం హ్రీం శ్రీం –చింతామణి గణపతయే నమః –ఓం నమో గణేశాయ ఓం చింతామణి చిన్తితః**

**అర్ధ, లాభ పూరయ పూరయ –లక్ష్మీ అనయ అనయ  -నమ స్వాహా**




**శ్రీ కపిల భగవాన్ రు షిః-త్రిష్టుప్ చందః –గణపతిర్ దేవతా ''**

చింతామణి గణ పతి యజ్ఞం కూడా చేస్తారు. సకల వర ప్రదాత గా చింతామణి గణపతి ప్రసిద్ధి చెందాడు

## 8 కార్పాక గణపతి దేవాలయం తమిళ నాడు

తమిళ నాడు లో పిల్లియార్ పట్టి తిరుప్పత్తూరులో గుహాలయం లో గణపతి దేవుడు కొలువై ఉన్నాడు. ఈ గుహాలయం లో శివుని తో పాటు అనేక విగ్రహాలు, రాతి చెక్కడాలపై ఆగమ శాస్త్ర గ్రంధాలు దర్శన మిస్తాయి.. ఈ ఆలయం క్రీ ష.1091 -1238 కాలం నాటిదని తెలుస్తోంది. ఇందులోని ప్రత్యేక మైన ''పిల్లియార్ ''లేక గణ పతి విగ్రహం వల్ల దీని కాలం తెలుస్తోంది ఈ వినాయకుడినే ''కార్పాక వినాయకుడు ''అని ''దేశి గణపతి ''అని ''వినాయక పిల్లియార్ ''అని ముద్దు గా పిలుచు కొంటారు భక్తులు.

ఈ ఆలయ పూజారులు ''పిల్లియార్ పట్టి నగ రాతులు ''..దీని నిర్వహణ కూడా వారిదే. కార్పాక గణేశుడు విజ్ఞాన ప్రదాత అని విశ్వాసం ఉండటం వల్ల రాష్ట్రం నలు మూలల నుండి వచ్చి దర్శించుకొంటారు.

ఈ ఆలయం లో వినాయక చవితి ని పది రోజుల పాటు మహా వైభవం గా నిర్వ హిస్తారు ఈ సందర్భం గా జరిగే రధ యాత్రలో లక్షలాది జనం పాల్గొంటారు. ఇక్కడి శివుడిని '' అర్జున పురీశ్వర స్వామి ''అంటారు. గణ పతి స్వామి శిల్ప చెక్కడపు పని అద్భుతం అరుదైనది. గుహా శిల్పాలలో ఈ గణేశుడు అరుదైన వాడు

గుహాంతర భాగంలో 6 అడుగుల మహా గణపతి స్వామిదర్శన మిచ్చి పరవశింప జేస్తాడు గుహలో చెక్క బడిన విగ్రహం కనుక ప్రదక్షిణ చేసే వీలుండదు అంతర్భాగం అంతా దీపపు కాంతులతో కను విందు చేస్తుంది కర్పాక వినాయకస్వామి శరీరం అంతా బంగారు తాపడం చేయ బడి ఉంటుంది. అభి షేక సమయం లో మాత్రమె స్వామి నిజ రూపాన్ని కన్ను లారా దర్శించ వచ్చు. స్వామి విజ్ఞానాన్నే కాక విజయాన్ని కూడా ప్రసాదిస్తారు.

వినాయక తొండం కుడి వైపుకు తిరిగి ఉండటం ప్రత్యేకత. స్వామి ఉత్తరాభి ముఖం గా ఉప విష్టుడై ఉంటాడు. గుహ లోపల ఇంకా కార్తికేయుడు, పశుపతెశ్వర విగ్రహాలున్నాయి. . వినాయక చవితి నాడు ఉప వాసం మొదలు పెట్టి సంవత్సరం పాటు నిర్వ హించే భక్తులు '' అవని శుక్ల పక్ష చవితి ''నాటి పండుగకు

మళ్ళీ దర్శించి వ్రత దీక్ష పూర్తి చేసుకొంటారు. చవితి నాడు స్వామి సన్నిధి లో ఉప వాస దీక్ష చేస్తారు. ”కుమ్మ జాబం” అనే ఉత్సవం లో పాల్గొని పవిత్ర జలం ఉన్న కుంభాన్ని స్వీకరిస్తారు.

## 10 లక్ష్మి గణపతి దేవాలయం బిక్క వోలు

తూర్పు చాళుక్య రాజులు నిర్మించిన అతి పెద్ద ఏక శిలా వినాయక విగ్రహం తూర్పు గోదావరి జిల్లా బిక్క వోలు లో ఉంది. పచ్చని పంట పొలాల మధ్య ఉన్న ఈ ఆలయం అతి పురాతనమైనది గణేశ విజయాదిత్య మహా రాజు పాలన వరకు గణేశునికి రెండు భుజాలు మాత్రమె ఉండేవి ఆయన కాలం లో మరి రెండు భుజాలను ఏర్పరచి చతుర్భుజ గననేషుని గా మార్చారు. విగ్రహం 11 అడుగుల ఎత్తు ఉండి భక్తులకు పరమాద్భుతం గా కానీ పిస్తుంది ఈ దేవాలయం క్రీ శ 849-892 ప్రాంతం లో నిర్మించ బడింది



సాతలూరు కు చెందిన గుణక విజయా దిత్యుని రాజ ముద్రిక కూడా ఇక్కడ దర్శన మిస్తుంది దీన్ని అత్యద్భుత రీతిలో మలచారు. ఒక వైపు చూస్తె వినాయకుడు రెండవ వైపు నుండి చూస్తే లక్ష్మీ దేవి కన్పించి ఆశ్చర్య పరుస్తుంది అందుకే ఈ స్వామిని లక్ష్మీ గణ పతి అంటారు ఇప్పుడు ఈ రాజ ముద్రిక చెన్నై మ్యూజియం లో భద్ర పరచి ఉంది

## 11 మహా గణపతి దేవాలయం నెల్లూరు

ఆంధ్ర ప్రదేశ్ లో నెల్లూరు జిల్లాలో వేదాయ పాలెం లో మహా గణ పతి దేవాలయం ఉంది ఇది సప్త గిరి కాలని లో 1991 లో నిర్మించ బడింది ద్రావిడ ఆగమ పద్ధతిలో నిర్మించ బడింది పెద్ద గణపతి విగ్రహం మహా మండపం కళ్యాణ మండపం ఉన్నాయి

రామి శెట్టి పెంచలయ్య అనే ఆయనకు చిన్నప్పటి నుండి మహా గణపతి దేవాలయాన్ని నిర్మించాలని ఉండేది. 1991 ఆగస్ట్ లో ఆలయ నిర్మాణానికి ఇప్పుడున్న ఆలయానికి చాలా దూరం లో ఉన్న తల్ప గిరి కాలనీ లో శంకు స్తాపన చేయాలనీ భావించి నెల్లూరు నరసింహ స్వామిఆలయ ఆశ్రమం

అధిపతిగారిని, మరి కొందరు ప్రముఖులను ఈ కార్య క్రమానికి ఆహ్వానించారు. కాని ఒక రోజు రాత్రి కలలో పెంచలయ్య గారికి వినాయక స్వామి కని పించి ఇప్పుడున్న స్థలం లో ఆలయ నిర్మాణం చేయమని ఆదేశించారు. స్వామి ఆజ్ఞప్రకారమే ఇప్పుడు మహా గణ పతి దేవాలయం ఉన్న చోట శంకు స్తాపన చేసి నిర్విఘ్నం గా ఆలాయ నిర్మాణం పూర్తీ చేశారు

గర్భాలయ పనులు చేస్తున్నప్పుడు అక్కడ నిరంతరం ఒక అడుగు లోతు ఉండే నీటి ధార ఉబికింది ఈ జలం భక్తుల పాపాలను ప్రక్షాళనం చేసే పవిత్ర జలం గా అందరు భావించారు. ఆలయం ఉదయం తొమ్మిది నుండి పదకొండు గంటల వరకు, సాయంత్రం అయిదు నుండి రాత్రి ఎనిమిది వరకు తెరచి ఉంటుంది.ఆలయానికి అను బంధం గా విఘ్నేశ గురు కులాన్ని నిర్వహణ కమిటీ నడుపుతోంది. అన్ని స్కూళ్ళ విద్యార్ధులకు శని ఆది వారాలలో ఉదయం ఏడు గంట;అ నుండి ఎనిమిది వరకుకళ్యాణ మండపం లో గణేశ పాఠ శాల ను నిర్వాహిస్తున్నారు. ఈ కార్య క్రమం బహుళ ప్రచారం పొందింది. అశేష భక్త జనం భక్తీ శ్రద్ధలతో స్వామిని దర్శించి తరిస్తారు

## 12 వర సిద్ధి వినాయక దేవాలయం సికందరాబాద్




తెలంగాణా లో సికందరాబాద్ రైల్వే స్టేషన్ సమీపం లో వరసిద్ధి వనాయక ఆలయం ప్రాచీనమైనదే కాక చాలా ప్రాచుర్యం పొందింది కూడా క్రీ శ1824 లో స్వామి వారి విగ్రహం లభించింది. దీనిని కంచి కి చెందిన శ్రీ ఆది శంకరాచార్యులు ప్రతిష్టించారు ఆగమ శాస్త్రాను సారం ఆలయాన్ని నిర్మించారు. ఆలయం లో శ్రీ వల్లీ దేవసేనా సమేత శ్రీ సుబ్రహ్మణ్య స్వామి కూడా కొలువైఉంటారు.



ఈ ఆలయం లో సంకట మోచన వినాయక చతుర్థివ్రతాన్ని ప్రతి నెలా నిర్వహించటం ప్రత్యేకత. ర్తి మంగళ, శుక్ర వారాలలో వేలాది భక్త జనం స్వామిని సందర్శించి మొక్కు కుంటారు గణపతి నవ రాత్రులను అత్యంత వైభవోపేతం గా చేస్తారు అలాగే శివరాత్రి ఉత్సవాన్ని ఘనం గా నిర్వహిస్తారు శరన్నవ రాత్రి దేవీ ఉత్స వాలను అత్యంత శ్రద్ధ లతో చేస్తారు. ఉగాది పండుగను కూడా వేడుక గా చేస్తారు గణపతి
హోమాన్ని శాస్త్రోక్తం గా గా నిర్వ హిస్తారు

## 13 గణేశ రధదేవాలయం
## మహా
## బలిపురం

తమిళనాడు లో మహా బాలి పురం లో గుహాలయాలగురించి అందరికి తెలుసు. అయితే ఇక్కడ రథ గణేశుడు చాలా ప్రసిద్ధి చెందాడు, ఏకాండ శిలలో రథం, దానిపై గణేశుడు ఉన్నట్లు చెక్క బడిన దేవాలయం ఇది. పల్లవుల శిల్ప విన్యాసానికి ప్రతీక. అంతకు ముందు ఇందులో శివ లింగం ఒకటి ఉండేది. దాన్ని తొలగించి రథ గణేశుడిని మాత్రమె ఉంచారు వేలాది మంది నిత్యం దర్శిస్తారు



రధ గణేశ ఆలయం అర్జునుడు తపస్సు చేసినట్లు చెక్క బడిన శిలకు ఉత్తరం గా ఉంది మహా బలి పురం లో ఉన్న అన్ని రధ దేవాలయాలలో ఇదొక్కటే పూర్తిగా చెక్క బడి రూపు దాల్చిన దేవాలయం. మిగిలిన వన్నీ అసంపూర్తిగా మిగిలి పోయాయి

## 14 వరసిద్ధి వినాయక దేవాలయం లేబూరు



నెల్లూరు జిల్లాలో ఇందుకూరు పేట మండపం లో లేబూరు ఉంది దీనిసే లేమూరు అనీ పిలుస్తారు. ఇక్కడ ఊరికి కొంచెం దూరం గా నాలుగు కాళ్ళ మండపం లో శ్రీ వరసిద్ధి వినాయక స్వామిని తూర్పు ముఖం గా ప్రతిష్టించారు

ఈ గణపతి ఇక్కడి జాన పదులకు కొంగు బంగారం. ఈ మండపం కట్టించాతటానికి ముందు రాత్రిపూట గ్రామస్తులు ఆ దారిని పోతుంటే ఏదో జరగా రానిది జరిగేదట. ఇక్కడి స్తానికులైన తుమ్మ లోల్ల వంశస్తులు వారి పొలం లో కొద్ది భాగం మంది రానికి కేటాయించి వినాయక మందిరం కట్టించారు. అప్పటి నుంచి అ దారిన పోయే వారికి ఏ రక మైన ఇబ్బందులు రాలేదట.

ఇక్కడి గ్రామస్తులు ఇంట్లో ఏ శుభ కార్యం తల పెట్టినా, ముందుగా వర సిద్ధి వినాయకుని దర్శించి మొదటి పూజ చేస్తారు. విఘ్నేశునిపాదాల వద్ద ఉండే అనిన్ద్యుడు అనే పేరు గల ఎలుక కు కూడా పూజ చేస్తారు. గణపతి ఇబ్బడి ముబ్బడి గా పంటలను పండించి తమ కు అన్ని రకాల శుభం చేయ మని కోరుకొంటారు. పంటను కొట్టి వెయ కుండా ఎలుకలను చేల మీద పడు కుండాచేయమని స్వామి వాహనమైన ఎలుకను ప్రార్ధిస్తారు. వినాయకుడి నడుము చుట్టూ ఉన్న పాము దయ వల్ల క్రిమి కీటకాలు నశిస్తాయని వారి అచంచల విశ్వాసం.

ఈ జానపదులు చేసే స్తోత్రాలలో ఎంతో విజ్ఞానం ఉంది. గణపతి వ్యక్తిత్వాన్ని కొని యాడుతారు. స్వామి మాత్రు భక్తి పరాయణుడు కనుక తమ పాటలలో ఆయన్ను "పార్వతీ తనయా "అని అనేక సార్లు స్తుతిస్తారు. గ్రామంలో మట్టి తో గణ పతి విగ్రాహాలు తయారు చేస్తారు. వారి దృష్టిలో ఆయనకున్న ఏనుగు తల బుద్ధికి, జ్ఞానానికి చిహ్నాలని భావిస్తారు. ఎలుక శ్రద్ధ కు గుర్తు. ఏ పని అయినా నిర్విఘ్నం గా నేర వేరాలంటే జ్ఞానం శ్రద్ధ అవసరం అని వీరి పాటలలో భావం.. ఉదరం అనే గాదె ను ఎలుక నుండి పాము రక్షిస్తుందనే నమ్మకం వీరిది. భక్తులు కుడి చేత్తో ఎడమ చెవిని, ఎడమ చేత్తో కుడి చెవిని పట్టు కొని గుంజీలు తీస్తారు. ఇది శరీర వ్యాయామం ఇమిడి ఉన్న సూత్రం. దీని వల్ల ఎముకలు బల పడతాయిఅని విశ్వ సిస్తారు.

## 15 అష్ట సిద్ధి వినాయక దేవాలయాలు

మహారాష్ట్రలో ఒక వరుస క్రమం లో అష్ట సిద్ధి వినాయక క్షేత్రాలున్నాయి.. వీటిని మన పంచా రామ క్షేత్రాలు లాగా ఒకే రోజు దర్శించు కోవటం ఆన వాయితీ. ఈ దర్శనం ముక్తి దాయకం గా భావిస్తారు..

### బల్లాలేశ్వర దేవాలయం



పూనా కు సుమారు 160 కి.మీ. దూరం లో పాళీ క్షేత్రం లో స్వామి బల్లాలేశ్వరుడున్నాడు బల్లాలేశ్వరుడు అంటే" బాల గణపతి" అన్న మాట. అష్ట క్షేత్రాలలో బల్లాలుడు అనే భక్తుడి పేర నిర్మించిన గణేశ దేవాలయం ఇది బల్లాల్ అనే మహా భక్తుడి భక్తికి మెచ్చి వినాయకుడు స్వామి ప్రత్యక్షమై, అ భక్తుని పేరు తోనే వేలిశాడని అక్కడి స్తల పురాణ కధనం. తూర్పు ముఖం గా ఉన్న బల్లాలేశ్వరుడి విగ్రహం పై, దక్షిణాయనం లో సూర్య కిరణాలు పడటం ఇక్కడి ప్రత్యేకత

### వరద వినాయకుడు



మహాద్ క్షేత్రం లో వెలసిన గణేశుడే వరద వినాయకుడు. ఒకప్పుడు ఈ ప్రాంతాన్ని రుక్మాంగద మహా రాజు పాలించాడు. ఒక సారి మహా రాజు "వాచక్నవి "అనే మహర్షి దర్శనార్ధం ఇక్కడికి వచ్చాడట. మహా రాజు మహా వైభవాన్ని చూసిన ముని పత్ని "ముకుంద "మహా రాజు పై మనసు పారేసుకోంది.రాజు దానికి ఒప్పుకోకుండానే తిరిగి వెళ్లి పోయాడు. అదే సమయం లో ఎప్పటి నుంచో ఆమె ను మొహిస్తున్న ఇంద్రుడు రుక్మాంగద మహా రాజు వేషం లో వచ్చి ఆమె కోర్కె తీర్చాడు వారికి గృత్స మధుడు "అనే కొడుకు పుట్టాడు. అతడు పెరిగి పెద్ద వాడై తన జన్మ రహస్యం తెలుసుకొన్నాడు. తల్లి చేసిన పాపం తో పాటు తమందరి పాపాలు తొలగి పోవాలని ఆ కుర్రాడు వినాయక స్వామిని భక్తీ తో వేడుకొన్నాడు. భక్తికి మెచ్చిన గణ నాధుడు ప్రత్యక్షమై వరం కోరుకో మన్నాడు. అతని కోరిక మేరకు అక్కడే "స్వయం భు వినాయక స్వామి "గా వెలిశాడు. ఈ ఆలయం లోని గర్భ గుడి లో ఉన్న దీపం వందేళ్లుగా  అఖండం గా వెలుగుతూన్డటం ఇక్కడి ప్రత్యేక ఆకర్షణ

**చింతామణి గణపతి**



షోలాపూర్ –పూనా మార్గం లో "దేవూర్ "క్షేత్రం లో వినాయక స్వామి "చింతా మణిగణపతి "గా పూజలు  అందుకొంటు న్నాడు. పూర్వ కాలం లో కపిల మహా ముని వద్ద సకల కోరికలు తీర్చే చింతామణి ఉండేది. ఒక సారి ఆ ప్రాంత రాజు అభిజిత్ మహా రాజు కొడుకు గణ రాజు  తో సైన్యం తో మునిని సందర్శించ టానికి వచ్చాడు అందరికి  చింతామణి కృపతో షడ్ర సోపేత విందు ఇచ్చాడు కపిల మహర్షి. ఇది తెలిసి ఆశ్చర్య పడ్డ యువరాజు కపిల మునిని మాయో పాయం తో  చింతా మణి ని అపహరించుకు వెళ్ళాడు అప్పుడు మహర్షి  గణేశుని ప్రార్ధించాడు. గణనుని చంపిమణిని తెచ్చి కపిలునికిచ్చి  వినాయకుడు, కపిలుని కోర్కె పై అక్కడే "చింతా మణి గణ పతి "గా వేలిశాడని స్తల పురాణం. యుద్ధం కబంధ వృక్షం దగ్గర జరగటం వల్ల ఈ గ్రామాన్ని "కబందీశ్వరతీర్ధం 'అని పిలుస్తారు

**మయూరేశ్వరుడు**



పూనా జిల్లాలో బారామతి తాలూకా లో "మోర్ గావ్ "అనే ఊళ్ళో వెలసిన వినాయకుడికి మూషిక వాహనం ఉండదు మయూరాసనుడై ఉండటం విశేషం. స్వామి తన తమ్ముడైనసుబ్రహ్మణ్య స్వామి వాహన మైన మయూరాన్ని అధివసించి ఉంటాడు. దీనికొక కద ఉంది. ఒకప్పుడు సిన్దురాసురుడు అనే రాక్షసుడు ఈ ప్రాంత ప్రజల్ని తీవ్రం గా క్షోభ పెట్టె వాడు. అప్పుడు మునులంతా దేవతలను వేడుకొన్నారు. వినాయకుడు ఆఘ మేఘాల మీద తన తమ్ముడు షన్ముఖుని వాహన మైన నెమలి ని ఎక్కి వచ్చి రాక్షసుడిని సంహరించి అందరికి మోదం కలిగించాడు. అందుకే ఈ గణపతిని మయూరేశ్వర, మొరేష్, మొరేశ్వర్ పేర్ల తో పిలుస్తారు. మోర్ అంటే మహా రాష్ట్రభాష లో నెమలి అని అర్ధం. ఇక్కడ వినాయక చవితి తో బాటు విజయ దశమి వేడుకలను ఘనం గా నిర్వ హిస్తారు.

## 17 అష్ట సిద్ధి వినాయక దేవాలయాలు(నసాగింపు)

మహారాష్ట్రలో ఉన్న అష్టసిద్ధి వినాయక దేవాలయాలలో నాలుగింటిని గురించి తెలుసు కొన్నాం మిగిలిన నాలుగు దేవాలయాల గురించి తెలుసు కొందాం.

### సిద్ధి వినాయక దేవాలయం

మహారాష్ట్ర లో సిద్ధి క్షేత్రం లో కార్య సిద్ధి వినాయక స్వామి ఆల యం ఉంది దీనికి పురాణ కద ఒకటి ఉంది. పూర్వం మధు, కైటభులనే రాక్షసులతో శ్రీ మహా విష్ణువు యుద్ధం చేస్తూ వినాయక స్వామి సహాయం కోరాడు. శ్రీ హరి అభ్యర్దన మేరకు రణ రంగం లో గణేశుడు ప్రత్యక్ష మయ్యాడు ఆయన్ను చూసిన హరి రెట్టించిన ఉత్సాహం తో ఆ రాక్షసుల నిద్దరిని సంహా రించాడు వినాయకుడి వరం వల్ల కార్య సిద్ధి జరిగింది కనుక ఈ ప్రాంతానికి "సిద్ధి క్షేత్రం "అనే పేరొచ్చింది. వినాయకుడి సహాయానికి సంతోషించి, కృతజ్ఞత తో విష్ణువు స్వయం గా ఈ క్షేత్రం లో గణేశ ఆలయాన్ని నిర్మించి సిద్ధి వినాయకుడిని ప్రతిష్టించాడు. ఆలయం ఎత్తైన కొండా మీద ఉంటుంది. స్వామి స్వయంభు అని భక్తుల విశ్వాసం. స్వామి విగ్రహానికి ఇరు వైపులా సిద్ధీ, బుద్దీ దేవతల విగ్రహాలున్నాయి ఇక్కడ వినాయకుని తొండం కుడి వైపుకు తిరిగి ఉండటం విశేషం మామూలుగా ఎడమ వైపుకు తొండం ఉంటుంది.



### మహా గణపతిదేవాలయం



సిద్ధి, బుద్ధి సమేతం గా పద్మం లో కొలువైన మహా గణేశుడు రంజన్ గావ్ గ్రామం లో ఉన్నాడు. పూర్వం త్రిపురాసురుడు లోక కంటకుడు గా మారి నప్పుడు శివుడు వాడిని సంహా రించా టానికి యుద్ధం చేసి ఒడి పోయాడు. అప్పుడు నారదుడు వచ్చి పరమేశ్వరుడికి "సంకట మోచన స్తోత్రాన్ని "ఉప దేశించాడు గణేశుని పూజించి అనుగ్రహం పొందమని హితవు చెప్పాడు అప్పుడు శివుడు వినాయకుడి స్తోత్రం చేసి బలం పొంది రెట్టింపు ఉత్సాహం తో త్రిపురుడిని చంపాడు. తన విజయానికి కారకుడైన వినాయుకుని విగ్రహాన్ని శివుడు స్వయం గా ప్రతిష్టించి నట్లు "గణేశ పురాణం "లో ఉంది

## విఘ్న వినాయక దేవాలయం



మహారాష్ట్ర లోని ఓజ్హార్ ప్రాంతం లో ఒకప్పుడు విఘ్నా సురుడు అనే రాక్షసుడు విధ్వంసం సృష్టిస్తున్నాడు. మునుల జప తపాలకు భంగం కలిగించే వాడు వాడి బారి నుంచి రక్షించ మని మునులు గణేశుని వేడుకొన్నారు. వినాయకుడు స్వయం గా ప్రత్యక్షమై విఘ్నా సురుడి తో యుద్ధానికి పూను కొన్నాడు గణేశుని శక్తి ముందు తన బలం నిలువ లేదు అని గ్రహించిన రాక్షసుడు స్వామికి లొంగి పోయాడు. తన పేరు మీద విఘ్నే శ్వరుడి గా అక్కడే కొలువై ఉండాలని అభ్యర్దించాడు. స్వామి సరే నని ఉండి పోయాడు మునులు శాస్త్రోక్త విధానం లో వినాయకునికి దేవాలయం నిర్మించారు. దీనికి ఒజ్హార్ విఘ్న వినాయకదేవాలయం అనిపేరొచ్చింది.



## గిరిజాత్మజ వినాయక దేవాలయం

గిరిజాత్మజుడు అంటే పార్వతీ దేవి కుమారుడైన వినాయకుడే. ఈ స్వామి దర్శనం చాలా కష్టాల తో కూడి ఉంటుంది. చాలా ఎత్తైన కొండ మీద ఒక గుహ లో ఈ స్వామి కొలువై ఉంటాడు 238 మెట్లు ఎక్కి పైకి చేరాలి. వృద్ధుల కోసం




డో లీలుంటాయి. ఇక్కడే పార్వతీ దేవి పుత్రుని కోసం పన్నెండేళ్ళు తపస్సు చేసింది. దీనికి "లేన్యాద్రి పుణ్య క్షేత్రం "అని పేరు. తర్వాతనే పార్వతి ఒంటి నలుగుపిండి తో రూపు పొందాడు బాల గణ పతి కౌమార ప్రాయం వచ్చేదాకా తల్లి తో ఇక్కడే ఉన్నట్లు ఐతిహ్యం. నలుగు పిండి తో విగ్రహం చేస్తే ఎలా ఎగుడు దిగుడు గా ఉంటుందో అలానే ఇక్కడి గిరిజాత్మజ గణ

పతి విగ్రహం ఉండటం ప్రత్యేకత.

ఈ అష్ట వినాయక క్షేత్ర దర్శానికి బొంబాయి, షోలా పూర్ ల నుంచి స్పెషల్ పాకేజీ బస్సులున్నాయి డబ్బు కూడా తక్కువే ఉంటుంది. అందరు తప్పక ఆస్ట సిద్ధి వినాయకులను దర్శించి కైవల్యం పొంద వచ్చు

## 17 సాక్షి గణపతి దేవాలయం శ్రీ శైలం



శ్రీ శైల క్షేత్రానికి మూడు కిలో మీటర్ల దూరం లో ఒంటరి గా సాక్షి గణ పతి దేవాలయం ఉంది ఈ క్షేత్రాన్ని దర్శించిన భక్తుల పేర్లను త న చిట్టా లో ఆయన రాసి ఉంచి సాక్షీ భూతం గా నిలుస్తాడు కనుక సాక్షి గణపతి అని పేరొచ్చింది ఈ ఆలయం అనాది ఆలయం గా భావిస్తారు "సాక్షి గణ పతి కన్న తల్లివి సద్గుణా వతి శాంభవి "అని మా చిన్నప్పుడు స్త్రీలు ఇళ్ళల్లో పాటలు పాడుకొనే వారు. ఎడమ చేతిలో పుస్తకం కుడి చేతిలో ఘంటం తో స్వామి దర్శన మిస్తాడు. సాక్షి గణపతి ని దర్శించే ప్రతి వారు తమ గోత్రం, పేరు చెప్పుకొంటారు. ఆయన విని దాన్ని లిఖిస్తాడని అచంచల విశ్వాసం. 14వ శతాబ్ది వాడై న శ్రీ నాధుడు కాశీ ఖండం లో అగస్త్య మహర్షి ఇక్కడికి వచ్చి సాక్షి గణపతిని దర్శించి నట్లు రాశాడు

**మహా గణపతి దేవాలయం ఇడ గంజ్ కర్ణాటక**



ఉత్తర కర్నాటక లో హొన్న నూర్ తాలూకా ఇదుగన్జ లో ప్రసిద్ధ మహా గణపతి దేవాలయం ఉంది. భక్తులు లక్షల సంఖ్య లో దర్శించే దేవాలయం ఇది. ఆలయ చరిత్ర 1500 సంవత్సరాల పైనే ఉంది స్కంద పురాణం లో సహ్యాద్రి ఖ్ఞంధం లో దీని ప్రాశస్త్యం వర్ణింప బడింది ఇక్కడ అద్భుత మైన ప్రకృతి సహజ సిద్ధ ఉద్యాన వనం గా కనీ పిస్తుంది అందుకే ఆ పేరొచ్చింది శరావతి నది ఎడమ తీరం లో ఈ క్షేత్రం ఉంటుంది. ప్రసిద్ధ సుబ్రహ్మణ్య క్షేత్ర మైన మురుడేశ్వర్ కు అరకిలోమీటరు దూరం లోనే ఉంది.

ఇక్కడ భారీ గణేశ విగ్రహం నిలుచున్న భంగిమ లో ఉండటమం విశేషం. కాళ్ళు మాత్రం చాలా చిన్నవి గా ఉంటాయి. శిరస్సు పై చిన్న గుంట ఉంటుంది. ద్వి భుజుడైన ఈ గణేశుడు ఒక చేత్తో మొదకాన్ని, రెండవ చేతి తో పద్మాన్ని ధరించి ఉంటాడు. నల్ల రాతి తో అత్యంత సుందరం గా నిర్మించ బడిన విగ్రహం ఇది

గణేశ నైవేద్యం కోసం ''పంచ ఖాద్యం ''తాయారు చేసి నైవేద్యం పెట్టి భక్తులకు ఇస్తారు. ఈ పంచ ఖాద్య ప్రసాదాన్ని భక్తీ తో భుజిస్తే నెర వేరని కోరికలు ఉండవని భక్తుల విశ్వాసం. స్వామి ముఖ కవచాన్ని (మాస్కులను ) పొగడ పేరు తో తయారు చేస్తారు. వీటిని భక్తిగా అందరు పెట్టు కొంటారు

### 18 మహా గణపతి దేవాలయం పెర్నా కిల

ఉత్తర కర్నాటక లోని ఉడిపి దగ్గర ఇరవై కిలో మీటర్ల లో పెర్నాకిల అనే గ్రామం లోమహా గణ పతి దేవాలయం.,మహా శివ ఆలయాలున్నాయి.. ఆలయం ప్రక్కన సరస్సు ఉంది 1950 లో శ్రీ నరసింహ ఆచార్యులు ఆలయాన్ని పునర్నిర్మించారు ఇక్కడి స్వామిని ''ఉద్భవ గణ పతి ''అని పిలుస్తారు. భూమి లో నుంచి తనకు తాను ఉద్భవం చెందాడని స్థల పురాణం.



వినాయక చవితి ని అత్యంత వైభవోపేతం గా నిర్వహిస్తారు వేలాది భాక్తులు రధం లో కూర్చున్న స్వామిని ఊరేగింపు గా తీసుకొని వెళ్లి తరిస్తారు భక్తుల కోర్కెలను తీర్చే వరదుడుఅని మహా గణపతి ప్రసిద్ధి చెందాడు గణేష్ చతుర్ధి నాడు వేలాది మందికి అన్న సంతర్పణ జరుగుతుంది. ఎన్నో ఆధ్యాత్మిక, ధార్మిక, సాంస్కృతిక కార్య క్రమాలను నిర్వహిస్తారు ఏటా వచ్చే ఈ పండుగ కోసం వేయి కళ్ళ తో భక్తులు ఎదురు చూస్తారు.

మార్చి ఏప్రిల్ లలో వచ్చే మీన మాసానికి ఆలయ ధ్వజాన్ని ఆరోహణ చేసి రధోత్సవం చేస్తారు ఏకాదశి రోజు అందరు ఉపవాసం ఉండి భక్తీ స్రద్ధాల తో స్వామిని అర్చిస్తారు సంక్రాంతి నాడు జన సౌందోహానికి అంతే ఉండదు. ఆ నాడు మంగళ వారం అయితే మహా పవిత్ర దినం గా భావిస్తారు. మహా గణ పతికి ఉండ్రాళ్ళ మీద మోజు. వినాయక చవితి నాడు ఒక క్వింటాలు బియ్యం తో 50, 000 ఉండ్రాళ్ళను వాళ్ళ భాషలో అప్పాలను తయారు చేసి స్వామికి నైవేద్యం పెట్టి భక్తులకు అందిస్తారు ప్రతి నేలా 70000 తయారు చేసి భక్తులకు ప్రసాదం గా ఇస్తారు. "కొప్పెర గెప్ప సేవ "అని ప్రత్యేక సేవ చేసి అన్న సంతర్పణ చేస్తారు స్వామి విగ్రహం కాణి పాకం లో లాగా బావి లో ఉంటుంది. ఆలయ పూజారులు సరళ వంశానికి చెందినా బ్రాహ్మణులు.. గ్రామం లో మేజారిటీ జనం రాజాపూర్ సారస్వత బ్రాహ్మణులు

### 19 మహా గణపతి దేవాలయం కాసర్ గోడ్

ఉత్తర కర్నాటక లో కాసర గోడ్ సమీపం లో మధుర లో అనేక ఆలయాలున్నాయి ఇందులో మహాశివ ఆలయం, మహా గణపతి ఆలయం ముఖ్య మైనవి. దీనికి ఒక కద ఉంది ఒకప్పుడు నిమ్న కులానికి చెందినా మధుర అనే అమ్మాయి ఉద్భవ మూర్తి అయిన శివ లింగాన్ని చూసింది. ఒక బ్రాహ్మణ కుమారుడు గణ పతి విగ్రహాన్ని లాక్కొచ్చాడు. ఆ గణ పతి క్రమంగా పెరగటం గమనించాడు అందుకని "దొడ్డ గణపతి" అని ముద్దు గా పిలిచాడు. కూర్గు దండ యాత్రలో1784 లో టిప్పు సుల్తాన్ ఈ విగ్రహాన్ని ఆలయాన్ని ధ్వంసం చేయటానికి వచ్చాడు. దాహం గా ఉండి ఆలయంప్రక్క ఉన్న బావి నీళ్ళు తాగాడు. వెంటనే మనసు మార్చుకొని విగ్రహాన్ని ధ్వంసం చేయకుండా వెళ్లి పోయాడు తన

సైన్యానికి ధ్వంసం చేసిన రుజువు చూపటానికి పశ్చిమ కప్పు మీద విగ్రహం పై కత్తి గాటు ఒకటి పెట్టాడు. ఆగాటు ఇప్పటికి కనీ పిస్తుంది. దీనిని జాతీయ సంపద గా భద్ర పరిచారు నూతి చుట్టూ ప్రహరి గోడ కట్టారు.

ఇక్కడ స్వామికి ఉదయం అప్పం అంటే ఉండ్రాళ్ళు నిత్య నైవేద్యం గా పెడతారు దీనికి ఉదయాస్తానం అని పేరు ప్రత్యేక ఉత్సవాల రోజున వెయ్యి ఉండ్రాళ్ళు చేసి నివేదిస్తారు. ఇంకొక ప్రత్యేక అర్చన. ".మోదప్పం సేవ ". గణపతి విగ్రహాన్ని కప్పెసె టట్లు ఉండ్రాళ్ళ తో ప్రత్యేక పూజ నిర్వహిస్తారన్న మాట. దీనిని సామూహికం గా నిర్వహించటం ప్రత్యేక విషయం. వర్షాకాలం లో ఆలయం లోకిప్రక్కనే ఉన్న మధు వాహిని నది నీరు నీరు ప్రవేశిస్తుంది. ఆలయం ఉదయం ఎనిమిది నుంచి మధ్యాహ్నం పన్నెండున్నర వరకు సాయంత్రం అయిదు నుండి రాత్రి ఎనిమిది వరకు తెరచి ఉంటుంది ఇక్కడికి ఆదివారం నాడు భక్త జన సందోహం ఎక్కువ గా రావటం విశేషం



20 డుండి వినాయక దేవాలయం కాశి

ఆలయ చరిత్ర పదవ శతాబ్దికి చెందినది. ఒకప్పుడు ఇక్కడ మహర్షులు మహా శివ యజ్ఞం చేశారట ఉప్పుదు విపరీతం గా వర్షం వచ్చి విఘ్నం కలిగింది అప్పుడు యజ్ఞం ఆదరా బాదరా ఒక వినాయక చిత్రాన్ని ఆలయం లోపల గోడపై వేశారట. అది క్రమంగా పెరిగి పై కప్పుకు ఆనుకోన్నడిత అప్పుడు మునులు ప్రార్ధించి తగ్గమన్నారట అప్పుడు పెరగటం ఆగి పోయిందట. గణ పాటి పూజ చేసి మళ్ళీ యాగాన్ని నిర్విఘ్నం గా కోన సాగించారట.. /

కాశీ క్షేత్రం లో శ్రీ విశ్వ నాధుడు ప్రవేశించటానికి ముందుగా శ్రీ వినాయకుడు అక్కడికి చేరి ఒక ముసలి యోగి రూపం లో ఉండి జనాలకు మహిమలు చూపి, శివుని గురించి వారికి కలలు వచ్చేట్లు చేసి మహా శివుని వారందరూ ఆహ్వానించే సన్నీ వేశాలు కల్పించి గొప్ప నేపధ్యాన్ని ఏర్పరచాడు. కుమార గణ పతి చేసిన ఈ అద్భుత కార్యాన్ని తండ్రి మహా శివుడు మహా మెచ్చుకొన్నాడు. కొడుకును అప్యాయం గా "డుండి గణ పతి అని పిలిచాడు..

కాశీ లో విశ్వ నాద దర్శనానికి వెళ్ళే ముందు ఈ డుండి వినాయక స్వామిని అర్చించి,, పూజించి మాత్రమె దర్శించాలని నియమ పెట్టాడు విశ్వనాధుడు అలాగే భక్తులు ఈ గణపతిని ముందు దర్శించి ఆ తర్వాతే శ్రీ విశ్వేశ్వర మహా దర్శన భాగ్యాన్ని పొందుతారు. ఉదయమే డుంధి వినాయకుడిని దర్శించిన వారికి ఆ రోజు ఏ అడ్డంకులు రావు అని భక్తుల అచంచల విశ్వాసం. డుంధి వినాయక పేరు పెట్టు కొన్న వారికి ఆయన అన్ని రకాల ఆదు కొంటాడని ప్రతీతి.



మంగళ వారం ఉదయం డుంధి వినాయక దర్శనం సకల శుభ ప్రదం గా భావిస్తారు. మంగళ వారం నాడు వినాయక చవితి వచ్చినా, అమా వాస్య, పౌర్ణమి వచ్చినా అత్యంత పవిత్ర దినం గా భావించి అధిక సంఖ్యలో స్వామిని దర్శించి తరిస్తారు. మాఘ మాసం లో అమా వాస్య వెళ్ళిన చవితి నాడు డుంధి వినాయక దర్శనం సర్వా రిష్ట నివారకం. స్కంద పురాణం లో కాశీ ఖండం లో ఈ విషయం చెప్ప బడింది

డుండి వినాయక దేవాలయం శ్రీ అన్న పూర్ణ శ్రీ విశ్వేశ్వర దేవాలయాలకు ముందు ప్రవేశ మార్గం లో ఉంటుంది ఈ గణేశు ని విగ్రహం భారీగా ఉంటుంది. ఇక్కడ స్వామిని ఇరవై నాలుగు గంటలు దర్శించు కో వచ్చు. భక్తులు పుష్పాలను, గరిక ను స్వామికి వేసి అర్చిస్తారు మిఠాయి తెచ్చి నైవేద్యం పేద తారు ఇక్కడ పోలీసు పహారా ఎక్కువ, పొద్దేక్క కొద్దీ భక్తుల తాకిడి ఎక్కువ కనుక ఉదయమే దర్శించు కోవటం ఉత్తమం.

కాశి లో డుండి వినాయకుడు కాక ఇంకా 56 వినాయక దేవాలయాలున్నట్లు కాశీ ఖండం లో ఉంది.

### 21 కాశీ లో వినాయక విగ్రహాలు

పవిత్ర క్షేత్రం కాశీ లో యాభై ఆరు వినాయక విగ్రహ్ లున్నాయని, అందులో మొట్ట, మొదటిది డుంఠివినాయకుడని తెలుసు కొన్నాం. మిగిలిన వాటి గురించి క్రమం గా తెలుసు కొందాం. అందులో కొన్ని ఆలయాలున్నాయి కొన్ని వేరొక దేవాలయం లో ఉన్నాయి కొన్ని గోడలలో తాపడం చేయ బడి ఉంటాయి



## అభయ వినాయకస్వామి

దశాశ్వమేద ఘాట్ దగ్గర ''సుల్తానకేశ్వర దేవాలయం ''లో అభయ వినాయక స్వామి ఉన్నాడు. ఈయన్ను పూజిస్తే భయాలను పోగోడ తాడని నమ్మకం. ఆలయం ఎప్పుడూ తెరిచే ఉంటుంది భక్తులు స్వయం గా స్వామిని అర్చించుకో వచ్చు. ప్రత్యేకం గా పూజలు చేయించు కోవాలంటే పూజారి కూడా అందు బాటులో ఉంటాడు.

## అర్క వినాయక స్వామి



లోలార్క గణపతి సమీపం లోనే అర్క వినాయక స్వామి ఉంటాడు కోరికలు తీర్చే దైవం గా ప్రసిద్ధుడు. ఆదివారం నాడు భక్తులు అశేషం గా దర్శిస్తారు. ఇక్కడ ప్రత్యేక పూజలుండవు భక్తులే స్వామి పూజ చేసుకో వచ్చు.

## ఆశా వినాయక స్వామి



మీర్ ఘాట్ దగ్గర బేరి హనుమాన్ గుడి దగ్గర,విశాలాక్షి ఆలయ సమీపం లో ఆశా గణపతి స్వామి ఉన్నాడు. ఉదయం ఏడు నుంచి మధ్యాహ్నం ఒంటి గంట వరకు సాయంత్రం నాలుగు నుండి రాత్రి ఎనిమిది వరకు దర్శనానికి వీలు కల్గిస్తారు. భక్తులు స్వయం గా స్వామి పూజ చేయ వచ్చు.

## అవిముక్త వినాయక స్వామి



అతి ప్రాచీన కాలం నాటి అవి ముక్త వినాయక స్వామి విగ్రహం శిధిల మైతే రెండు విగ్రహాలను మళ్ళీ ప్రతిష్టించి నట్లు కధనం. ఒకటి గ్యాపి మసీదు దగ్గర, రెండోది విశ్వనాధ ఆలయం లోను ఉన్నాయి.



జ్ఞాన వాపి క్షేత్రానికి అవి ముక్త వినాయక గుడి దగ్గరలో ఉంటుంది. భక్తుల కష్టాలను పోగొట్టే దైవం. ఆలయం ఎప్పుడూ తెరిచే ఉంటుంది భక్తులు ప్రార్ధన చేసుకో వచ్చు. పూజ ఉండదు.

## భీమ చండి వినాయక స్వామి

పంచ కోషి మార్గం లో కాశీకి వెలుపల భీమ చండి వినాయక దేవాలయం ఉంది. భయ నివారకుడు. అందరు అన్ని వేళలా దర్శించి పూజించ వచ్చు

## చతుర్ దంత వినాయక స్వామి



నయా సారక్ లో సనాతన ధర్మ స్కూల్ దగ్గర చతుర్దంత వినాయక స్వామి ఆలయం ఉంది. సర్వ వేళలా దర్శించి పూజించుకోవచ్చు విఘ్న నివారకుడ ని ప్రసిద్ధి.

## చింతామణి వినాయక స్వామి

బాబు బజార్ లో ఈశ్వర్ గంజ్ తలాబ్ దగ్గర చింతా మణి గణపతి కొలువై ఉన్నాడు కోరిన మంచి కోర్కెలను తీర్చే దైవం. అన్ని వేళలా దర్శించి స్వయం గా పూజ చేసుకో వచ్చు

## చిత్ర ఘంట వినాయక స్వామి

చిత్ర ఘంటా దేవి ఆలయ సమీపం లో చిత్ర ఘంట వినాయక స్వామి ఉన్నాడు.. తలచిన మాత్రం చేత దుష్ట శక్తులను పారద్రోలుతాడనే నమ్మకం. ఏ సమయం లో నైనా దర్శించి పూజించే వీలుంది.

## దంత హస్త వినాయక స్వామి



లోహాట్ల లో బార్ వినాయక గుడి దగ్గర దంత హస్త వినాయక స్వామి ఆలయం ఉంది. కాశి క్షేత్రాన్ని దుష్టజనాల బారి నుండి కాపాడటం ఈయన కర్తవ్యమ్. ఉదయం 4-45 కు మంగళ హారతి తో దర్శనం ప్రారంభమై పదిన్నర వరకు ఉంటుంది. ఉదయం పదిన్నరకు భోగం నివేదిస్తారు రాత్రి పది గంటలకు శయన హారతి ఇస్తారు. మంగళ వారం నాడు మాత్రం రాత్రి 11-30 కు ప్రత్యేక హారతి ఉంటుంది.

## దేహ్లి వినాయక స్వామి

వారణాసి కి సుమారు ఇరవై కిలో మీటర్ల దూరం లో దేహ్లివినాయక స్వామి దేవాలయం ఉంది. దేహ్లి అంటే ఇంటి గడప అనిహిందీలో అర్ధం. ఆపన్నివారకుడిగా పేరు. అన్ని వేళలా దర్శించి అర్చించ వచ్చు.

## 22 కాశి లో వినాయక విగ్రహాలు

### దుర్గ వినాయక స్వామి



దుర్గా కుండ్ వద్ద దుర్గ వినాయక స్వామి ఆలయం ఉంది. ఉదయం అయిదు నుండి పన్నెండు వరకు సాయంత్రం అయిదు నుండి రాత్రి ఎనిమిది వరకు దర్శనం చేయ వచ్చు పన్నెండు గంటలకు భోగం, రాత్రి ఏడింటికి హారతి ఉంటాయి పదింటికి శయన హారతి ఉంటుంది. ఉద్యోగ ప్రయత్నం లో ఉన్న వారు, ప్రాజెక్ట్ వర్క్ కోరే వారు స్వామిని దర్శిస్తే సఫల మనోరధు లవుతారు

### దుర్ముఖ వినాయక స్వామి

కాశి కార్వార్ దేవాలయం వద్ద దుర్ముఖ వినాయక దేవాలయం ఉంది.. అన్ని వేళలా దర్శించి పూజించ వచ్చు.

### ద్వార వినాయక స్వామి

స్వర్గ ద్వారేశ్వర గుడి దగ్గర ద్వారా గణేశ ఆలయం ఉంది. కాశీ నుండి దుష్ట శక్తులను పార ద్రోలుతాడు.

### వినాయక స్వామి

సూర్య కుండ్ లో సాంబ ఆదిత్య వద్ద ద్విముఖ వినాయక స్వామి ఆలయం ఉంది. అన్ని వేళలా పూజించ వచ్చు.

### ఏక దంత వినాయక స్వామి

బెంగాలీ తోలా లో పుష్ప దంతేశ్వర స్వామి గుడి వద్ద ఉంది దుష్ట శక్తులను దూరం చేస్తాడు

### గజ కర్ణ వినాయక స్వామి

కోత్వాల్ పురా లో ఈశానేశ్వర దేవాలయం సమీపం లో గజ కర్ణ వినాయక స్వామి ఉన్నాడు. విగ్రహం ధ్వంస మైతే కొత్తది ఏర్పరచారు. సుఖ సంతోషాలనిచ్చే గణపతి.

### గజ వినాయక స్వామి

రాజ దర్వాజా భార భూతెశ్వరాలయం వద్ద గజ గణేశుడున్నాడు. స్వామి అనుగ్రహం తో ఏనుగు ను కూడా కొన గలిగిన సామర్ధ్యం వస్తుంది.

### గణనాధ వినాయక స్వామి

విశ్వేశ్వర ఆలయం వద్ద గణ నాద ఆలయం ఉంది. విజయం, ఆనందం ఇస్తాడు అన్ని వేళల దర్శనం ఉంటుంది

### జ్ఞాన గణేశుడు

లింగేశ్వర దేవాలయం వద్ద జ్ఞాన గణ పతి ఉన్నాడు. ఉదయం ఎనిమిది నుండి పది వరకు, సాయంత్రం ఆరు నుండి ఎనిమిది వరకు తెరచి ఉంటుంది. అన్ని వేళలా పూజించ వచ్చు

### హేరంబ గణపతి

మైదాహియా వద్ద హేరంబ గణ పతి స్వామి ఉన్నాడు.. ఉ దయం ఎనిమిది నుండి పన్నెండు వరకు సాయంత్రం ఆరు నుండి ఎనిమిది వరకు ఆలయం తెరిచి ఉంటుంది అందరు దర్శించి పూజించ వచ్చు కోరికలు తీర్చే గణేశుడీయన

### జ్యేష్ట వినాయక స్వామి

జ్యేస్ట్వేశ్వర దేవాలయం దగ్గర జ్యేష్ట వినాయక స్వామి కొలువై ఉన్నాడు. శివుని కుమారులైన అనేక గణ పతు లలలో ఈయన పెద్ద కుమారుడు. జ్యేష్ట మాసం లో చవితి, అమా వాస్య రోజున విశేష సంఖ్య లో భ క్తులు దర్శిస్తారు. ఈ రోజుల్లో అర్చిస్తే కోరికలన్నీ తీరుస్తాడు.

### కాల వినాయక స్వామి

రామ ఘాట్ సమీపం లో కాల వినాయక స్వామి ఉన్నాడు. అకస్మాత్తుగా సంభవించే మృత్యువును దూరం చేస్తాడని నమ్మకం.

### కాళీ ప్రియ వినాయకుడు

సాక్షి గణపతి దేవాలయం వద్ద కాళీ ప్రియ వినాయకుడున్నాడు. భక్తుల శత్రువులను అదుపు చేస్తాడు. అని వేళలా దర్శించే వీలుంది.

### ఖార్వ వినాయక స్వామి

రాజ ఘాట్ కోట వద్ద ఖార్వవినాయక స్వామి ఉన్నాడు. భక్తీ తో సేవిస్తే అన్నీ ఇస్తాడు. ఉదయం ఏడు, రాత్రి ఏడు సమయం లో హారతి ఇస్తారు.

### కూనితాక్ష వినాయక స్వామి

పాత లక్ష్మి దేవాలయం వద్ద కూనితాక్ష వినాయక స్వామి ఉన్నాడు. అన్ని వేళలా దర్శనం, పూజా ఉంటుంది.

23 32 రకాల గణపతులు

ద్విముఖ గణ పతి –రోమన్లు ఈ గణేషుని "జెనస్ "అంటారు. రెండు ముఖాలతో అన్ని వైపులా చూస్తాడు. అంకుశం పాశం కిరీటం ధరించి ఉంటాడు

త్రిముఖ గణ పతి –స్వర్ణ పద్మాసనస్తితుడైఎరుపు రంగులో మూడు ముఖాలతో దర్శన మిస్తాడు అమృత భాండం, పాశం ఉంటాయి కుడి చేయి వరద హస్తం ఎడమ చేయి కోరికల నిచ్చేది.

సింహ గణ పతి –సింహం పై కూర్చుని తెల్లగా ఉంటాడు. శక్తి నిచ్చి భయం లేకుండా చేస్తాడు. కల్ప వృక్ష శాఖ, పద్మం, రాత్నాలున్న పాత్ర, వీణ ధరించి ఉంటాడు

యోగ గణపతి –స్తిరం గ కూర్చుని మంత్రం జపం లో ఉంటాడు కాళ్ళకు ఉత్తరీయం ముడి వేసుకొని ఉంటాడు. యోగ దండం, చెరకు గడ రుద్రాక్ష మాల, ఆయుధం ధరించి ఉంటాడు ఉదయ సూర్యుని కాంతి తో కనిపిస్తాడు.. నీలి వస్త్రాలు ధరిస్తాడు.

దుర్గా గణ పతి –చేతిలో కాషాయ ధ్వజం విజయ చిహ్నం గా చీకటి నుంచి వెలుగు కు ప్రస్తానం గా ఉంటుంది. బంగారు రంగు ఛాయ.. యెర్రని వస్త్ర ధారణా. చేతిలో విల్లు బాణం, అంకుశం, జపమాల. యెర్రని విరిగిన దంతం తో ఉంటాడు.

సంకట హర గణపతి –దుఃఖ నివారకుడు. ఎర్రర కలువ పై ఆసీనుడై, అన్నం పాత్ర, పాశం అంకుశం ధరించి వరద ముద్రతో నీలి రంగు వస్త్రాలు ధరించి కనీ పిస్తాడు.

ఏకాక్షర గణపతి –మూడు కళ్ళతో ఎర్రగా యెర్ర వస్త్ర ధారణ లో ఉంటాడు శిరస్సు పై ఉదయ చంద్రుని ధరిస్తాడు. మూషిక వాహనం పై పద్మాసనం లో కూర్చుని ఉంటాడు. దానిమ్మ , పాశం అంకుశం ధరించి అభయ దాయకం గా దర్శన మిస్తాడు.

వరద గణ పతి -.మూడవ కన్ను జ్ఞాన నేత్రం. తేనె పాత్ర, పాశాముఙ్కుశాలతో తొండం లో వజ్రాలతో ఉంటాడు. ఆయన శక్తి తొడమీద ఆసీనయై ఉంటుంది. ఉదయ చంద్రుడు శిరస్సు పై ఉంటాడు

త్ర్యక్షర గణ పతి –అ ఉ అం అనే ప్రణవాత్మక గణపతి. బంగారు వర్ణం తో. శూర్ప కారకర్ణాలతో, విరిగిన దంతం పాశాముఙ్కుశాలతో, మామిడి పండుతో, మోదక భక్షణ చేస్తూ ఉంటాడు

క్షిప్ర ప్రసాద గణ పతి –కోరిన వెంటనే కోర్కెలు తీరుస్తాడు కనుక క్షిప్ర ప్రసాద గణ పతి అయ్యాడు. దర్భాలున్న ఆసనం పై ఉప విస్టూడు. బాన పొట్ట ఈ విశ్వానికి సంకేతం. పాశం అంకుశం దానిమ్మ కలువ పువ్వు దంతం,కల్ప వృక్ష శాఖ కలిగి ఉంటాడు.

హరిద్ర గణపతి –బంగారు చాయతో పచ్చని వస్త్రాలు ధరించి ఉంటాడు. సింహాసనం పై ప్రశాంతం గా కూర్చుని ఉంటాడు. మోదకం, దంతం పైకెత్తిన పాశామ్కుశాలతో ఉంటాడు

ఏక దంత గణపతి –పెద్ద పొట్ట తో నీలి దుస్తులతో అజ్ఞాన బంధ విచ్ఛేదకమైన గొడ్డలితో,జపమాల, లడ్డూ లతో దర్శన మిస్తాడు

## 24 32 రకాల గణపతులు

బాల గణపతి

బాల గణపతి హస్తాలలో చెరకు గడ అరటి పండు, పనసపండు కలిగి పసుపు వర్ణ కాంతి తో తొండం లో ఉండ్రాయి తో ఉంటాడు

తరుణ గణపతి

అస్ట భుజాలతో పాశామ్కుశాలు, మోదకం,రోజా రంగు ఆపి, విరిగిన దంతం ధాన్యపు కంకి తో యెర్రని రంగులో తరుణ వయస్సుకు చిహ్నం గా కనీ పిస్తాడు

భక్తీ గణపతి

శరత్కాలపు వెన్నెల తెల్లదనం తో పుష్పహారం రం తో భక్తీ మూర్తీభ విస్తు ఉంటాడు. చేతులలో అరటి పండు మామిడి పండు, పాయస పాత్ర,కొబ్బరి బొండాం లతో కనీ పిస్తాడు

వీర గణపతి

పదహారు చేతులతో శక్తి, పౌరుషం ఉట్టి పడేట్లు ఆ చేతులలో సకల ఆయుధాలు ధరించి ఉంటాడు

శక్తి గణపతి

అంకము మీద భార్య శక్తి తో చతుర్భుజాలతో పసుపు ఎరుపు కలిసిన కాంతి తో పుష్పమాల తో కనీ పిస్తాడు యజమానిని సర్వ కాల సర్వావస్తాలా కాపాడుతాడు. అభయ ముద్ర తో హారం పాశం అంకుశం ధరించి ఉంటాడు

ఊర్ధ్వ గణపతి

.వామాంకం పై శక్తి తో బంగారు రంగుతో ఉంటాడు.తల ఊర్ధ్వ ముఖం గా ఉండి కనీ పిస్తాడు. ఆరు చేతులుంటాయి వాటిలో ధాన్యపు కంకి, తామర పువ్వు చెరకుగడవిల్లు బాణాలు నీలి కమలం దంతం ధరించి కనీ పిస్తాడు ,

సృష్టి గణపతి

మూషిక వాహనం పై ఆసీనుడై సృష్టి గణపతి ఉంటాడు ఎరుపు రంగులో పాశాము్కశాలు, దంతం తో త్యాగ మూర్తి లా ఆనంద సంధాయి గా కనీ పిస్తాడు.

ఉద్దండ గణపతి

ధర్మ సంరక్షకుడుగా పది భుజాలతో ఉంటాడు. రత్న పాత్ర నీలి కలువ, చెరకు గడ తామర పువ్వు, ధాన్యపు కంకి, పాశాము్కశాలు, దానిమ్మ పండు, పుష్పహారం, విరిగిన దంతం తో దర్శన మిస్తాడు

రుణ విమోచన గణపతి

బంధాల నుండి అప్పుల నుండి రక్షిస్తాడు ఎర్రటి వస్త్రాలతో ఎరుపు వర్ణం తో ఉంటాడు. తెల్లని దంతం ఎరుపు రంగు ఆపిల్, పాశాము్కశాల తో ఉంటాడు.

25 కాశి లో వినాయకులు

కూష్మాండ వినాయక స్వామి

ఫూల్ వారియా గ్రామం లో కూష్మాండ వినాయక స్వామి ఉన్నాడు. సుఖాలను కలిగించే ఈ స్వామిని ఎల్లవేళలా దర్శించుకో వచ్చు.

కూట దంత వినాయక స్వామి

కీన రామాశ్రమం వద్ద ఈ గణేశుడున్నాడు. సర్వ వేళలా దర్శించ వచ్చు

లంబోదర వినాయక స్వామి

కేదార్ ఘాట్ సమీపం లో ఉంది దీనికే చింతామణి గణ పతి అని పేరు. నియమిత సమయాలలో దర్శనం ఉంటుంది సకల కోరికలు నేర వేరుస్తాడు.

మంగళ వినాయక స్వామి

మంగళ గౌరీ దేవాలయం వద్ద ఉంటాడు. దుష్టశక్తి వినాశకరుడు. నిర్ణీత వేళల్లో దర్శనం ఉంటుంది.

మణి కర్ణిక వినాయక స్వామి

మణికర్ణిక ఘాట్ దగ్గర లో సాతుబాబా ఆశ్రమ సమీపం లో ఉన్న దేవాలయం ఇది అన్ని వేళలా దర్శనం

మిత్ర వినాయక స్వామి

సింధియా ఘాట్ వద్ద వీరేశ్వర గుడి దగ్గర ఉంది సుఖ ప్రదాత. నిర్ణీత వేళల్లో దర్శించ వచ్చు.

మోద వినాయక స్వామి

కాశి కార్వత్ దేవాలయం వద్ద ఉంది. అడ్డంకులు తొలగిస్తాడు.

మోదక ప్రియ వినాయక స్వామి

త్రిలోచన్ లోని ఆది మహా దేవాలయం దగ్గరుంది. నిర్ణీత వేళల్లో దర్శనం

ముండ వినాయక స్వామి

చండీ దేవాలయంలో లో సాదర్బజార్ గుడి వద్ద ఉంది. స్వామి శిరస్సు మాత్రమెవిగ్రహం లో కన్పిస్తుంది.

నాగేశ వినాయక స్వామి

భూసాల ఘాట్ సమీపం లో ఉంది. జీవన్మరణ సమస్యలను స్వామి పరిష్కరిస్తాడని నమ్మకం.

పాశ పాణి వినాయక స్వామి

సాదర్ బజార్ లో ఈ స్వామి ఉన్నాడు. జీవితం సాఫీ గా గడవటానికి అనుగ్రహిస్తాడు.

పంచాస్య వినాయక స్వామి

పిశాచ విమోచనం దగ్గర ఉన్నాడని కాశి ఖండం లో ఉంది అయిదు ముఖాలున్నటం విశేషం.

పిచండి ల్ వినాయక స్వామి

ప్రహ్లాద ఘాట్ వద్ద వట వృక్షం కింద ఉన్నాడు. కాశీ క్షేత్రాన్ని ఇరపై నాలుగు గంటలూ రక్షిస్తూ ఉంటాడు.

ప్రమోద వినాయక స్వామి

నయీ పాళీ కాప్రా వద్ద ఉంటాడు విఘ్న నివారకుడు

ప్రణవ వినాయక స్వామి.

హిరణ్య గర్భేశ్వర దేవాలయం వద్ద ఉన్నాడు. స్వర్గానికి వెళ్ళాలను కొనే వారి కోరిక తీరుస్తాడు

రాజ పుత్ర వినాయక స్వామి

రాజ ఘాట్ రోడ్డు దగ్గర ఉంటాడు. పదవి ఊడిపోతే ఈ స్వామి అనుగ్రహం తో మళ్ళీ పదవి లభిస్తుంది

శాల కాంతి వినాయక స్వామి

కాశీ కి పడమర న ఈ స్వామి ఉంటాడు సుఖ దాయి

సృష్టి వినాయక స్వామి

కాళికా గల్లీ లో ఉంటాడు. కోరికలన్నీ తీరుస్తాడు.

సిద్ధి వినాయక స్వామి

మని కర్ణికా ఘాట్ వద్ద ఉంటాడు. వర సిద్ధి దాయకుడు.

సింహ తుండ వినాయక స్వామి

దశాశ్వ మేధా ఘాట్ సమీపం లో ఉన్నాడు పాప నివారకుడు

స్థూల దంత వినాయక స్వామి

మన్ మందిర్ సమీపం లో ఉన్నాడు సిద్ధి ప్రదాత.

సుముఖ వినాయక స్వామి

మోతీ ఘాటియా వద్ద ఉంటాడు

వక్ర తుండ వినాయక స్వామి

బారా గణేష్ దగ్గర లో ఉంటాడు. సర్వకాలాలలో సౌఖ్యాన్నిస్తాడు

వరద వినాయక స్వామి

.ప్రహ్లాద ఘాట్ వద్ద నయా మహా దేవుని ఆలయ సమీపం లో ఉన్నాడు ఉన్నత కోరికలను తీరుస్తాడు.

వికట ద్విజవినాయక స్వామి

ధూమావతి గుడి వద్ద ఉంటాడు ఉన్నత పదవులు అందిస్తాడు

యక్ష వినాయక స్వామి

కోత్వాల్ పురా లో రుద్ర ప్రయాగ వద్ద ఉన్నాడు అడ్డంకులు తొలగిస్తాడు.

# శ్రీ శంకర

## శ్రీ అది శంకరాచార్యుల వారి జన్మ క్షేత్రం –కాలడి



కేరళలో గురువాయూర్ కు 75కిలో మీటర్ల దూరం లో కాలడి గ్రామం ఎర్నాకులం జిల్లా లో ఉంది. ఇదే జగద్గురువులు శ్రీ ఆది శంకరాచార్యులు వారు జన్మించిన పవిత్ర క్షేత్రం. ఇక్కడి నుండే కాలి నడకన ఆసేతు హిమాచల పర్యంతం అనేక సార్లు తిరిగి నాలుగు ఆమ్నాయ పీఠాలు స్తాపించి ఆర్షధర్మాన్ని నిల బెట్టారు. వైదిక మతోద్ధారణ చేశారు. అద్వైత మత స్థాపనా చార్యులు గా కీర్తి శిఖరాన్ని అధిరోహించారు. పరమ విశిష్టమైన కాకాశ్మీర్ శారదా పీఠాన్ని సమర్ధత నిరూపించి శారదా మాత అంగీకారం తో అధిరోహించి జగద్గురువు లని పించుకొన్నారు. ఆ మహాను భావుడే లేక పోతే చైనా, పాకిస్తాన్ సరిహద్దు లో ఉన్న భారత దేశ ప్రజలు ధర్మానికి దూరమై పోయి ఉండేవారు. ఆయన ప్రబోధం సకల మానవ సోదరత్వమే. ఆధ్యాత్మిక కీర్తి పతాకని ప్రపంచం అంతా రెపరెప లాడించిన ఆ మహనీయ మూర్తి జన్మ స్థలాన్ని దర్శించాలనే తపన ఈ ఫిబ్రవరి లో తీరింది. ఆ మాహత్మునికి ఏమిచ్చినా హిందూ జాతి ఋణం తీరనే తీరదు. అలాంటి పవిత్ర కాలడి గురించిన విశేషాలు ఇప్పుడు తెలియ జేస్తున్నాను.

### శ్రీ శంకర జన్మ క్షేత్రం గుర్తింపు



ఎర్నాకులం జిల్లాలో పెరియార్ నదికి తూర్పున ఉంది కాలడి గ్రామం. ఈ గ్రామాన్ని గుర్తు పట్టటం మొదట పెద్ద సమస్య గా మారింది. అప్పుడు శృంగేరి పీఠం వారు మహా పండితుడు చారిత్రిక పరిశోధకుడుశంకరుల జీవితం పై అధారిటీ అయిన శ్రీ నడుకావేరి శ్రీనివాస శాస్త్రి గారిని కాలడికి పంపారు. అసలు ఆది శంకరుల జన్మ స్థలాన్ని అన్ని ఆధారాలతో తేల్చమనిపంపారు. ఆయన ఇక్కడికి వచ్చి పరిశీలనా, పరిశోధనా చేసి కైఫీయత్తులను తిరగేసి ఇప్పుడు శ్రీ శంకరులదేవాలయం కట్టబడిన ప్రదేశమే అసలైన ఆది శంకరుల జన్మ క్షేత్రం అని నిర్ధారించి రుజువులతో సహా తెలియ జేశారు. అప్పుడు ఈ ప్రదేశం అంతా ''కపిల్లి మన ''అనే ఆయన స్వాధీనం లో ఉండేది. ఈ విషయాన్ని శృంగేరి వారు తిరువాన్కూర్ మహా రాజా వారికి తెలియ జేశారు ఆ స్థలాన్ని తమకు ఇస్తే అక్కడ శంకర ఆలయం నిర్మించి

స్మృతి చిహ్నం గా తీర్చి దిద్దుతామని చెప్పారు. మహా రాజు మహాదానందం పొంది" కపిల్ల మ'న" నుంచి 1906లో ఈ ప్రాంతాన్ని స్వాధీన పరచుకి శృంగేరి పీఠానికి అప్పగించాడు.

శృంగేరి మఠం ఇక్కడ 1910లో శ్రీ ఆది శంకరుల ఆలయాన్ని నిర్మించింది. అదే కాలడి ఆవిర్భావ సంవత్సరం గా భావించారు. సరిగ్గా వంద ఏళ్ళకు 2010లో కాలడి శత వత్సర ఉత్సవాలను పీఠం ఘనం గా నిర్వ హించింది ఒక డాక్యుమెంటరీ చిత్రాన్ని పీఠం నిర్మించి ప్రచారం లోకి తెచ్చింది. లేక పోతే కాలడి అలాగే చరిత్ర గర్భం లో కలిసి పోయి ఉండేదేమో ?బాల శంకరులు తన తల్లి ఆర్యాంబ కోసమై పూర్నా నదిని ఇంటి వరకు మళ్లించిన ప్రదేశం శంకరాలయానికి దగ్గరలోనే ఉంది. దాని తీరం మీదనే శంకరులు శ్రీ కృష్ణ విగ్రహం ప్రతిష్టించారు. ఇక్కడే "అచ్యుతాస్తకం "చెప్పారు. శంకర ఆలయం లో శ్రీ శంకర, శారదాంబ విగ్రహాలు జగన్మోహనం గా కనీ పిస్తాయి నిత్యం అభిషేకం పూజా హోమాదులు నిర్వహించే విశాల ప్రాంగణం ఉంది. శంకరుల తల్లి ఆర్యాంబ సమాధి కూడా ఇక్కడే ఆలయం లో ఉంది అక్కడ నిత్యం జ్యోతి వెలుగుతూనే ఉంటుంది. వినాయకుని చిన్న విగ్రహమూ ఉంది. ఇక్కడ తమిళ కన్నడ స్మార్త బ్రాహ్మణులే పూజారులు

### శంకరాచార్య కీర్తి స్థంభం

శంకరాలయానికి దగ్గరే శృంగేరి పీఠం ఉంది. ఇక్కడి శ్రీ కృష్ణ దేవాలయం లోనే శ్రీ శంకరులు 243పంక్తుల "ప్రబోధ చంద్రోదయం "రాశారు. కాలడి దేవస్థానం అధీనం లో ఉంది. రామ కృష్ణ మఠం కూడా సమీపం లో ఉంది. కాలడి గ్రామం లో ప్రవేశించ గానే మనకు కంచి కామ కోటి పీఠంవారు నిర్మించిన ఎనిమిది అంతస్తుల" కీర్తి స్థంభం "అనే బృహత్ భవనం కానీ పిస్తుంది. అది శంకరుల జీవిత చరిత్ర అంతా చిత్రాలలో ప్రదర్శించారిక్కడ. పై అంతస్తుకు వెళ్లి నగర దర్శనం చేయ వచ్చు శ్రీ శంకరాచార్య, శ్రీ గనేశుల పెద్ద విగ్రహాలు ఇందులో ఉన్నాయి

### చూడాల్సిన ప్రదేశాలు



కాలడికి ఒక కిలో మీటర్ దూరం లో మాణిక్య మంగళం లో శ్రీ కాత్యాయిని మాత దేవాలయం ఉంది. ఇది దుర్గా మాత ఆలయం. ఇక్కడే శంకరుల బాల్యం లో తండ్రి శివ శర్మ ఏదో పని మీద వెడుతూ కొడుకు కు అమ్మవారికి పాలు నైవేద్యం పెట్టి రమ్మని పంపాడు. అలానే బాల శంకరుడు అమ్మవారి ముందు పాల చెంబు ఉంచి నైవేద్యం పెట్టి తాగమని గోల చేశాడు అమ్మ వారు తాగక పోయే సరికి ఏడుపు లంకించుకొన్నాడు అప్పుడు అమ్మ వారు ప్రత్యక్షమై ఆ క్షీరాన్ని తృప్తిగా త్రాగి శంకరులకు ఆనందాన్ని కలిగించింది. ఈ అమ్మ వారి గురించే తరువాత "సౌందర్య లహరి" రాశారు శంకరాచార్య.

కాలడికి రెండు కిలో మీటర్ల దూరం లో "మట్టూర్ తిరు వేలు మాన్ శివ దేవాలయం" ఉంది. దీన్ని శంకరుల తండ్రి శివ శర్మ ప్రతిష్టించాడు. ముసలి తనం లో శంకరుని తలి దండ్రులు ఇంత దూరం వచ్చి పూజాదికాలు చేయలేక శివుడిని ప్రార్ధించారు. అప్పుడు కల లో కన్పించి "నాట్యం చేసే తెల్ల జింక "ను అనుసరించి వెడితే తన లింగం దగ్గరకు చేరుస్తుందని చెప్పాడు. అలానే రోజూ చేసేవారు. అందుకే ఈ గుడికి "తిరువెల్ల మాన్ మల్లి "అనే పేరొచ్చింది. అంటే "నాట్యం చేసే తెల్ల జింక "అని అర్ధం.



నయ తోడూ శంకర నారాయణ దేవాలయం కాలడికి మూడు కిలో మీటర్ల దూరం లో ఉంది. ఇది అద్వైత అర్చనకు గొప్ప స్థానం గా ప్రసిద్ధమైంది. ఈ శివాలయం లో శంకరాచార్య విష్ణువును ప్రార్ధిస్తే ఆయన ప్రత్యక్షమై ఇక్కడి శివుని లో కలిసి పోయి శివ కేశవులకు భేదం లేదని నిరూపించినగొప్ప క్షేత్రం ఇది. అందుకే ముందు శివుడికి తర్వాత విష్ణువుకు ఇక్కడ అర్చన నిర్వహిస్తారు.

మంజప్ప కు ఎనిమిది కిలో మీటర్ల దూరం లో శివ శర్మ పూజారిగా ఉన్న "మంజప్ప కార్వెల్లి కావు శివ టెంపుల్ "ఉంది

అలాగే "తెక్కే మదోం "అనే చోట శ్రీ కృష్ణుని గుడి పక్కనే తిరుచ్చి శంకర మఠం ఉంది ఈ మఠానికి చెందిన వారికే పూజార్హత.



శంకరుని తల్లి ఆర్యామ్బకు దహన సంస్కారాలను జరిపిన చోటు ఇప్పుడు శంకరాలయం లోనే ఉంది. పది నంబూద్రి కుటుంబాలలో శంకరునికి సాయం చేసినవి రెండే రెండు కుటుంబాలు. ఈ ప్రాంతాన్ని "కపిల్లమన" అంటారు. ఆనాటి నుంచి ఈనాటి వరకు నిత్య దీపారాధన జరుగుతూనే ఉండటం విశేషం.

కాలడి కరవు (ఆడట్టు కడవు )దగ్గరే నది మార్గం మారి కాలడి గ్రామం ఏర్పడింది. ఇక్కడే శంకరులు శ్రీ కృష్ణ విగ్రహం స్థాపించారు. శ్రీ కృష్ణ ఉత్సవాలలో ఇక్కడి నుండే జలాన్ని తీసుకు వెడతారు

"మూతల ల కడవు "అంటే మొసలి ఘాట్ -క్రోకడైల్ ఘాట్ అంటారు. ఇక్కడే నదిలో స్నానం చేస్తుంటే బాల శంకరుని మొసలి పట్టుకోంది. తల్లి అనుమతి తో నీటిలోనే ఆపద్ధర్మ సన్యాస దీక్ష తీసుకొన్నాడు బాల శంకరులు. ఇవి కాక శ్రీ శంకరాచార్య యూని వర్సిటి, కాలేజి, ఇంజినీరింగ్ కాలేజి చూడ తగిన ప్రదేశాలు.

## శ్రీ శంకరం లోక శంకరం

వైశాఖ శుద్ధ పంచమి శ్రీ శంకర జయంతి –ఆది శంకరాచార్య జన్మించిన రోజు. దానిని నిన్న 11వ తేదీ బుధవారం కృష్ణానదీ తీరం సమీపం లో ఉన్న శ్రీ రామ చంద్రుడు ప్రతిష్టించిన ఉభయ రామేశ్వర క్షేత్రంగా ఖ్యాతి చెందిన ఐలూరు కు రెండు కిలో మీటర్ల దూరం లో ఉన్న కూడేరు గ్రామం వాసి, నాకు 30ఏళ్ళుగా పరిచయం ఉన్నవారు నాతొ పాటు ఉయ్యూరు హైస్కూల్ లో లెక్కల మేష్టారు గా పని చేసినవారు మాంచి బాడ్మింటన్ , వాలీ బాల్ ప్లేయర్, గణిత శాస్త్ర బోధనలో దిట్ట, క్రమశిక్షణకు మారు పేరు, సహాయ సహకారాలలో ముందుండే సహృదయులు, స్నేహానికి చిరునామా సరసభారతికి ఆత్మీయులు, మాకుటుంబ మిత్రులు అయిన శ్రీ పసుమర్తి ఆంజనేయ శాస్త్రిగారు వారి స్వంత దేవాలయ సముదాయం లో ఉదయం 9గం లకు నిర్వహిస్తూ సెలరోజుల నాడే నన్ను ఆహ్వానించి నాలుగు ముక్కలు భాగవత్పాదులపై మాట్లాడమని కోరారు. మేమిద్దరం, మా మూడవ కోడలుశ్రీమతి రాణి, మనవరాలు ఛి రమ్య కారులో ఉదయం 8గంటలకు కూడేరుకు కనకవల్లి దేవరపల్లి మీదుగా వెళ్లి కృష్ణ కరకట్ట ఎక్కి , దారిలో ఐలూరు లో శ్రీ రామ లింగేశ్వర స్వామిని దర్శిద్దామని పావు తక్కువ తొమ్మిదికే అక్కడికి చేరగా గుడి తలుపులు తాళం వేసి ఉన్నాయి కటకటాల తలుపు లోంచి స్వామి లింగాన్ని దర్శించి తరించం. ఈ స్వామిని సుమారు 26ఏళ్ళక్రితం నేను మేడూరు హెడ్ మాస్టారుగా పని చేసినప్పుడు స్కూల్ పిల్లలను ఫీల్డ్ ట్రిప్ గా ఐలూరు తీసుకు వెళ్లి కృష్ణానది ఒడ్డుకు తీసుకు వెళ్ళే ఆలోచనలో ఉంటె, మేడూరు మహిళామండలి వారు మా అందరికోసం సుమారు 500మందికి లడ్డూలు, పులిహోర చేసి రిక్షాలో మా వెనక పంపిన జ్ఞాపకం ఇంకా ఉంది. "కటకటాల దర్శనం" తర్వాత సరాసరి కూడేరు శాస్త్రిగారింటికి చేరాం. ఇంటి దగ్గర మేము బయల్దేరే టప్పుడే టిఫిన్ చేసేశాం. ఇప్పుడు శాస్త్రిగారి భార్య ఇచ్చిన కాఫీ త్రాగాం.ఇంకా ఆయనకాని ఆవిడకాని స్నానాలు చేయలేదు. కూడేరు అల్లుడు శ్రీ ఫణి అభిషేక కార్య క్రమం కోసం కలిదిండి నుండి వచ్చారు. కలిదిండి అంటే శ్రీ పాతాల భోగేశ్వర స్వామి ఆలయం గుర్తు ఉండే ఉంటుంది. అక్కడికి ఒకప్పుడు రాజ రాజ నరేంద్ర మహారాజు ఆస్థానకవి నన్నయ గారు రాజ మండ్రి నుంచి వచ్చి స్వామిని దర్శించి ఇక్కడి నాగ కన్య వృత్తాంతం విని, అప్పటికే రాజు మహా భారతాన్ని అనువదించమని కోరగా నన్నయ ఉదంకో పాఖ్యానాన్ని గుర్తుచేసుకొని ఉదంకుడు చేసిన నాగ స్తోత్రాలకు శ్రీకారం ఇక్కడే చుట్టాడని ఐతిహ్యం. అంటే తెలుగు భారత రచన కలిదిండిలో ప్రారంభమైనదన్నమాట. కలిదిండి అంటే ఇది జ్ఞాపక మొచ్చింది.

కూడేరు శ్రీ శంకరుల విగ్రహానికి నమక చమకాలతో అభిషేకం బిల్వార్చన శంకర భగవత్పాదుల అష్టోత్తర పూజాఫనిగారి ఆధ్వర్యం లో చేశారు. తర్వాత శ్రీ దాసాంజనేయ స్వామికి తమలపాకులతో అష్టోత్తర పూజ నిర్వహించారు స్వామికి మేము నూతన వస్త్రాలు సమర్పించాం.తరువాత

సభ మొదలైంది. నేను శ్రీ శంకరులపై మాట్లాడాను. నాకు శాలువా కప్పి "చంద్రునికో నూలు పోగు "అన్నారు శ్రీ శాస్త్రి. ఒక జ్ఞాపిక బహూకరించారు. నేను ఆయనకు సరసభారతి జ్ఞాపికను "దైవ చిత్తం "శ్రీ హనుమజ్జయంతి ఆహ్వాన పత్రాలు అందించాను. శ్రీ ఫణిగారికి జ్ఞాపిక, కేమటాలజి పిత, దైవ చిత్తం తో బాటు వేదాశీర్వచనం చేసినందుకు 116 రూపాయలు తాంబూలం లో సమర్పించాను అక్కడికి వచ్చిన శ్రోతలు" ఆరుగురికి" మన ఈ రండు పుస్తకాలు, కరపత్రాలు అందజేశాను. స్వామి ప్రసాదం రవ్వకేసరి పులిహోర అందరికి అందించారు. బహు రుచిగా ఉన్నాయి రెండూ. .తరువాత శాస్త్రి గారింట్లో మాకు రసం మామిడి పండు తో సహా భోజన ఏర్పాటు చేశారు. పదార్దాలాన్నీ రుచిగా శుచిగా ఉన్నాయి. కమ్మగా భోజనం చేశాం. మా ఇద్దరికీ శ్రీ శాస్త్రి దంపతులు నూతన వస్త్రాలు ప్రదానం చేసి ఆశీర్వదించారు వెంటనే బయల్దేరి కట్ట మీదుగా వల్లూరు ద్వారా ఉయ్యూరుకు మధ్యాహ్నం రెండున్నరకు చేరాం.

సాయంత్రం ఉయ్యూరు శ్రీ సువర్చలాంజ నేయ స్వామి దేవాలయం లో శ్రీ శంకర జయంతి ణి సరసభారతి 92 సమావేశంగా చేశాం. శ్రీ శంకరాచార్య పటానికి అష్టోత్తర పూజ చేశాం. తరువాత ప్రముఖ గాయని శ్రీమతి వట్టెం శాంతిశ్రీ శ్రీ శంకర కృత దేవీ స్తోత్రగానం వీనుల విందుగా చేశారు. ఆమె సౌందర్య లహరి ని సిడి లుగా తీసుకొచ్చే ప్రయత్నం చేస్తున్నాని శ్రీ కంచి స్వామి సన్నిధిలో నాలుగు గంటలు పాడి వినిపించానని వారు దివ్య ఆశీస్సులందించి ముందుకు సాగమని చెప్పారని అన్నారు. మంచి ప్రయత్నం చేస్తున్నారని, విజయ వంతం కావాలని నేను అన్నాను. ఇలా రెండు సార్లు శ్రీ శంకర జయంతి లో పాల్గొనే అదృష్టం కలిగింది. అక్కడా ఇక్కడా మాట్లాడిన మాటలనే "శ్రీ శంకరం లోక శంకరం "గా మీకు అందిస్తున్నాను.

''శ్రుతి స్మృతిపురాణామాలయం కరుణాలయం-నమామి భాగవత్పాదశంకరం లోక శంకరం ''

**''దుష్టాచార వినాశాయ ప్రాతుర్భూతో మహీతలే –**
**స ఏవ శంకరాచార్యః –సాక్షాత్ కైవల్య నాయకః –**
**శ్రౌత స్మార్త ప్రతిస్టార్ధం భక్తానాం హితకామ్యయా**
**కరిషత్సవతారం స్వం శంకరో నీల లోహితః ''(శివ రహస్యం )**

కంచి మఠం లెక్కల ప్రకారం క్రీ పూ. 509లో జన్మించి, క్రీ పూ 477లో కైవల్యం పొంది, పాశ్చాత్యుల లెక్కప్రకారం క్రీ శ 788లో జన్మించి క్రీ శ 820 లో మరణించారు జగద్గురువులు శ్రీ ఆది శంకరాచార్యులు. ఎవరివి యే లెక్కలైనా వైశాఖ శుద్ధ పంచమి ఆర్ద్రా నక్షత్రం లో జన్మించారు అని అందరూ అంగీకరించారు. కేవలం 32సంవత్సరాలు మాత్రమే జీవించి,ప్రస్తాన త్రయానికి భాష్యం రాసి, రసగుళికలు అనదగిన సంస్కృత స్తోత్రాలు, సౌందర్య లహరి శివానంద లహరి వంటి అనేక రచనలు చేసి సంస్కృత భాషను సుసంపన్నం చేసి దాన్నిసామాన్య జనాలకుఅందుబాటులో తెచ్చిన మహానుభావుడు . అందుకే స్వామి వివేకానంద "In Sankara we see tremendous intellectual power throwing, the scorching light of reason upon every thing ''అన్నారు. "Sankara was not merely a philosopher, not really a religious leader, but

he was the greatest nation builder and thought leader ''అన్నాడు ఎ.కే బెనర్జీ . జాతి నిర్మాత శంకరుడు. మాసానాం మార్గశీర్షోహం "అని గీతలో కృష్ణుడు అన్నా వైశాఖ మాసం విశిష్టమైనదని నాకని పిస్తుంది. ఈనెలలో ఎందరో మహానుభావుల జయంతులు ఉన్నా యి. వైశాఖ శుద్ధ తదియ అక్షయ తృతీయ నాడు సింహాచ నరసింహ స్వామి చందనోత్సవం, పరశురామ జయంతి వీరశైవ మత స్థాపకుడు బసవనమంత్రి జన్మదినం. శుద్ధ పంచమిశ్రీ శంకర జయంతి, శుద్ధ షష్టి శ్రీ రామానుజ జయంతి. శుద్ధ చతుర్దశి శ్రీ నృసింహ జయంతి. పౌర్ణమి భగవాన్ బుద్ధ జయంతి అన్న మాచార్య జయంతి. వైశాఖ బహుళ దశమి శ్రీ హనుమజ్జయంతి. మండు వేసవిలో ఇన్ని జయంతులు. అందుకే పానకాలు వడపప్పు, మామిడిపళ్ళు తాటాకు విసన కర్రలతో ఉపచారాలు తాపోపశమనం అటు దేవుళ్ళకూ ఇటు మనకూ కూడా.

కలియుగం ప్రవేశించి అప్పటికి 3వేల సంవత్సరాలు అయింది. దేశం లో వేద విరుద్ధ భావనలు వ్యాపించాయి యజ్న యాగాదులు లేవు. వేదఅధ్యయ్యన అధ్యాపనాలు లేవు. రాజులు వైదికాన్ని వదిలేసి జైన బౌద్ధాలవైపు చేరి పోషించారు. పాషండ మతాలన్నీ పెరిగిపోయాయి. దేవతలందరూ శివుడిని చేరి లోకోపకారం చేయమనిప్రార్ధించారు. బోళాశంకరుని హృదయం కరిగి పరిష్కారమార్గంగా తానే భూమిపై శంకరాచార్య స్వామిగా అవతరిస్తానని అభయమిచ్చాడు. కుమార స్వామిని భట్ట పాదునిగా , బ్రహ్మను మండన మిశ్రునిగా, ఇంద్రుడిని సుధన్వ మహా రాజుగా తనకంటే ముందే భూమి పై జన్మించమని ఆదేశించాడు. విష్ణువును పద్మ పాదాచార్యునిగా వాయుదేవుడిని హస్తామలకాచార్యునిగా, అగ్ని దేవుడిని తోటకాచార్యునిగా, వరుణ దేవుడిని చిత్సుఖా చార్యునిగా జన్మించమని కోరాడు. శుక మహర్షిని గౌడ పాద లేక గోవింద భగవత్పాద యతీంద్రు నిగా పుట్టమని చెప్పాడు. ఒకప్పుడు బ్రహ్మ వేదం చదువుతున్నప్పుడు స్వరలోపం జరిగింది. ప్రక్కనే ఉన్న అర్ధాంగి సరస్వతి నవ్వింది. కోపం వచ్చి ఆమెను భూలోకం లో విష్ణు మిత్రునికి కుమార్తెగా జన్మించమని శాపమిచ్చాడు ఆమె యే ఉభయ భారతిగా జన్మించి మండనమిశ్రుని వివాహమాడింది. భట్ట పాదుడు జైమిని సూత్రాలకు తాత్పర్యం రాసి సుధన్వ మహా రాజుకు వినిపించి ఆయన అనుగ్రహాన్ని పొందాడు. రాజు సహాయం తో జైన బోద్ధాచార్యులతో వాదాలు చేసి ఓడించి వైదికం వైపు జనాలను చేరేట్లు చేశాడు. శివుడు ఒక రోజు సుధన్వ మహా రాజు కలలో కన్పించి కేరళలో కాలడి దగ్గర పూర్ణానది తీరాన ఒక శివాలయం నిర్మించి నిత్య ధూప దీప నైవేద్యాలతో వర్ధిల్ల జేయమని ఆదేశించాడు. రాజు అలానే చేశాడు. ఇంతటి బృహత్ నేపధ్యం ఏర్పాటు చేసుకొని శివుడు శంకరాచార్యునిగా కాలడిలో నంబూద్రీ బ్రాహ్మణ కుటుంబీకు డైన శివగురు ధర్మ పత్ని ఆర్యాంబ లకు జన్మించాడు. ఈ దంపతులకు వృద్ధాప్యం సమీపిస్తున్నా సంతతి కలుగ లేదు. వారి ఇష్టదైవం పరమేశ్వరుని అనుగ్రహం కోసం చాలా చేసి చివరికి పొందారు. దీర్ఘాయుస్సు కల కొడుకు కావాలా అల్పాయుష్కుడైన తేజస్వి కుమారుడు కావాలా అని అడిగితె తేజస్వి నే కోరారు. ఆ దంపతులు. ఇలా శివానుగ్రహం వలన ఆర్యాంబ శంకరుని భర్త శివ గురువుద్వారా కన్నది. శ్రీ శంకరుని జీవితం పై అనేక గ్రంధాలు ఉన్నప్పటి కి, విజయనగర స్థాపనకు

హరిహర బుక్క రాయల ను ప్రేరేపించి న అద్వైత గురువులు శ్రీ మాధవ విద్యా రణ్య స్వామిరాసిన "శంకర విజయం "సాదికారికమైనది. నా రచనకు ఎక్కువగా శంకర విజయం ఆధారం. మిగిలినవాటినుండీ గ్రహించి రాసినవే.

ఎలా ఉన్నాడు శంకరుడు ?"వేద విద్య లో బ్రహ్మకు సమానం. వేదాంత ఉపనిషద్విద్య లో బృహస్పతి. వేద కర్మ వ్యాఖ్యానానికి జైమినిమహర్షి తో సరి జోడు. వేద తత్వ మూలానికి వ్యాస భాగవానులే. మూర్తీభవించిన వేద వ్యాసుడే శ్రీ శంకర భాగవత్పాదులవారు "అన్నారు విద్యారణ్య స్వామి. 8ఏళ్ళ వయసులో కపిల మహర్షి రాసిన సాంఖ్యశాస్త్రాన్నీ, పతంజలి రచించిన యోగ శాస్త్రాన్నీ ఔపోసన పట్టిన ప్రజ్ఞా మూర్తి. భట్ట పాదుల వార్తికాన్ని అవగాహన చేసుకొన్నవాడు. అద్వైత సుఖాన్ని పొంది, వేద సారాన్ని ఒక చేతిలో, జ్ఞాన సముద్రాన్ని రెండవ చేతిలో ధరించి, ఎదుటివారి వాదనలోని స్ఖాలిత్యాన్ని అంటే దోషాలలాంటి ముళ్ళనుతీసివేసే ప్రజ్న కలిగి ఉన్నాడు అంటారు మాధవ విద్యారణ్యు లు. చంద్రుడూ,శ0కరుడూ అమృతాన్నే ఇస్తారట. చంద్రుడు కాంతి రూపం లో ఇస్తే ఈబాల శంకరుడు వేదాంత భావనా రూపంగా కాంతి నిచ్చాడట . చంద్రుడు నక్షత్ర కాంతిని హరిస్తాడు. ఈ శంకర ముఖ చంద్రుడు సజ్జనుల తేజస్సును పెంచుతాడట.



శంకర ఫాల భాగం పై ధరించే మూడు విభూతి రేఖలు గంగా, యమునా సరస్వతీ నదుల పవిత్ర త్రివేణీ సంగమం. అవి మూడు వేదాల శిరస్సులనే ఉపనిషత్తుల వ్యాఖ్యానాలనే మూడు కీర్తులుగా భాసిస్తున్నాయన్నారువిద్యారణ్యు లు. అజ్ఞా నారణ్యం లో భార్యా, పిల్లలు అనే కార్చిచ్చు మంటల చేత తపిస్తున్న జనానికి, ఆత్మ విద్య ను ఉపదేశించటానికి శ్రీ మేధా దక్షిణా మూర్తియే, మౌన ముద్ర వదిలి శ్రీ శంకరాచార్యులుగా అవతరించారట. శంకర యతీశ్వరునికి, కైలాసవాసి పరమేశ్వరునికి పోలికలతో పాటు ఒక ముఖ్య భేదం కూడా ఉందట. భగవత్పాదులు వైదిక మార్గాన్ని అనుసరించి యజ్ఞ యాగాదులు చేస్తూ చేయించారు. కాని పరమ శివుడు మామగారైన దక్షుడు చేసే యజ్ఞానికి వెళ్ళకుండా భార్యకు అవమానం జరిగిందని తన వీరభద్రావతారం తో దక్ష యజ్న వినాశనం చేయించాడు అని చమత్కరించారు మాధవ విద్యారణ్య స్వామి. శంకరుడు అనే హిమవత్పర్వతం నుండి బయలుదేరిన "వాక్కు "అనే గంగా ప్రవాహం, దుస్టవాదాలను హరించి "వైదిక పంటలు "పండించింది. శ్రీ శంకర వాక్ పరిమళాన్ని పచ్చ కర్పూరం అప్పుగా తెచ్చుకొందట. కస్తూరి పరిమాణం గా గ్రహించిందట. కుంకుమ పువ్వు కొనుక్కోన్నదట. ఇదంతా చూసి మంచిగంధం ఏకంగా తస్కరించిందని విద్యారణ్య చమత్కారం.

శంకరా ద్వైతం లో విశిష్టత ఏమిటి ?పూర్వం అరణ్యాలలో మహర్షులు మాత్రమే ఆత్మ జ్ఞానం టో అద్వైత సుఖాన్ని దర్శించారు. అందుకే అది అంతా "ఆరణ్యకం "అయింది. గౌతమ బుద్ధుడు దాన్ని జనసామాన్యం లోకి తెచ్చాడు. కాలక్రమంలో అది భ్రష్టు పట్టింది. శంకరాచార్య వచ్చి అద్వైతాన్ని మళ్ళీ నిల బెట్టారు. అందుకే వివేకానందస్వామి "నైతిక దృక్పధం లో బుద్ధుడు, శాస్త్రీయ దృష్టిలో శంకరుడు అద్వైతాన్ని నిలబెట్టారు "అన్నాడు. శంకరాద్వైతం లో మరో విశిష్టత ఉంది. క్షుద్ర దేవతారాధన చేసే కాపాలికుల విశ్వాసాలను భద్ర పరిచింది. అద్వైత దైవం "సమస్వరూపుడు ".సర్వం ఆయనే. సర్వాన్నీ ఆయన గా చూడటమే అద్వైతం.



శంకర భగవత్పాదులు ఒక విజ్ఞాన సర్వస్వం. వాదనా సామర్ధ్యానికి పరాకాష్ట. జ్ఞాన సాగరం ఆయన. వైరాగ్య హిమవన్నగం. సంస్కృత వాజ్మయానికి మహా గొప్ప ప్రచారకులు. ఆయన స్తోత్రాలు అమృత ధార.జ్ఞాన గంగాస్నాన ఫలాన్నిస్తాయి. జీవన్ముక్తి సాధకాలు. అంతటి ప్రతిభా ప్రజ్ఞామూర్తి మళ్ళీ జన్మించనే లేదు. వ్యాసమహర్షి సాక్షాత్తు విష్ణు మూర్తి అయితే శంకరాచార్య అపర శంకరుడే. భగవంతుడిచ్చిన ఆయుర్దాయం 8ఏళ్ళు మాత్రమే.అగస్త్యాది మహర్షులిచ్చింది మరో 8 ఏళ్ళు. అంటే 16 ఏళ్ళకే జీవితం చాలించాల్సి ఉంటుంది. మరి ఈలోపలే ఎన్నో అద్భుతాలు సాధించారు. తల్లి ఎప్పుడు మనసులో తలుచు కొంటె అప్పుడే ఆమెదగ్గరకు వచ్చి వాలుతానని తల్లికి వాగ్దానం చేసి, సన్యాసియై సరైన గురుని అన్వేషిస్తూ కాలినడకన కాలడి నుండి బయల్దేరారు. నర్మదా నదీ తీరం లో కొండపై ఒక గుహలో శ్రీ గోవింద భగవత్పాదులు ఉన్నారని తెలుసుకొని దర్శించటానికి శంకరులు చేరారు. చూడగానే "ఎవరు నువ్వు?అని ప్రశ్నించారు గౌడ పాదులనే, గోవింద భగవత్పాదులు. అయన వేద, ఉపనిషత్తుల ను శిష్యులకు నేర్పుతూ బహుళ కీర్తి నార్జించారు. సాక్షాత్తు శుక మహర్షి అవతారం. అప్పుడు శంకరాచార్య –

''మనో బుధ్యహంకార చిత్తానినా-న శోత్రం న జిహ్వా, నచ ఘ్రాణ,నేత్రే –నచ వ్యోమ భూమి ర్న తేజో , న వాయు-శ్చిదానంద రూపం శివోహం శివోహం ''అని జవాబు చెప్పారు శంకరులు. భళా అనుకొని,ఈయన కోసమే తాను ఎదురు చూస్తున్నట్లు చెప్పి"స ప్రాంగ శంకర స శంకర ఏవం సాక్షాత్ "అని శిష్యునిగా స్వీకరించారు గోవిందులు. ఒక రోజు అర్ధ రాత్రి హోరు గాలి, వానతో నర్మదా నది విజ్రుమ్భించి పొంగి గుహలోకి నీరు చేరే స్థాయికి చేరింది గురువు గాఢ నిద్రలో ఉన్నారు. శంకరులు ఓంకార జపం చేస్తూ నర్మదా స్తుతి చేస్తూ కాలం గడిపారు. అంతే నర్మద శాంతించింది దిశ మార్చుకొని తరలిపోయింది. . తెల్ల వారేసరికి అంతా ప్రశాంతం గా ఉంది. ఈ విషయం శిష్యులు గురుదేవులకు తెలియ జేశారు. మహా ప్రసన్నులై నాలుగు

మహావాక్యాలు, ఉపనిషత్తులు బోధించి వాటికి వ్యాఖ్యానం రాయమని ఆదేశించారు. అలానే చేశారు శిష్య శంకరులు. గౌడపాడులున్న ఈ క్షేత్రం లో ఓంకారేశ్వర శివుడున్నాడు. అందుకే ఇది ఓంకార క్షేత్రమైంది. ఇక్కడి జ్యోతిర్లింగం" మామలేశ్వర జ్యోతిర్లింగం" గా ప్రసిద్ధం. రెండుకొండల నడుమ ఈ క్షేత్రం ఓంకారాకృతిలో కనిపించటం మరో విశేషం.




గురువు ఆజ్ఞను ఔదల దాల్చి శంకరులు ప్రస్థాన త్రయం అంటే బ్రహ్మ సూత్రాలు ఉపనిషత్తులు భగవద్గీత లకు మహా భాష్యం రాశారు. బ్రహ్మ సూత్రాలకు వ్యాఖ్యానం రాస్తూ శిష్యులకు వివరిస్తుంటే వ్యాసభగవానుడు శిష్య రూపం లో వచ్చి వింటూ వాదిస్తూ 8రోజులు ఉన్నాడు. చివరి రోజు శిష్యుడొకడు ఆయన వ్యాసర్షి అని తెలియ జేస్తే అమాంతం పాదాలపై వాలి పోయారు శంకరులు. ఆప్యాయంగా లేపి కౌగిలించు కొనిఅద్భుతమైన వ్యాఖ్యానం చేశాడని శంకరులను వ్యాసుల వారు అభినందించారు. 16వ ఏడు దాటి పోతోందని తెలిసి కాశీలో ప్రాణ త్యాగం చేయాలనుకొన్న శంకరులకు వ్యాసభగవానుడు దర్శనం అనుగ్రహించి ఆయనతో చాలా పని మిగిలి పోయిందని తాను మరొక 16సంవత్సరాల ఆయుర్దాయం ఇస్తున్నానని జన్మించిన దానికి సార్ధకం చేసుకోమని చెప్పాడు.



కాశీలో భట్ట పాదుడు చుట్టూ ఊక పేర్చుకొని దహనం చెందే ప్రయత్నం చేస్తున్నప్పుడు శంకరులు అటుగా వెడుతూ విషయం తెలుసుకొని ఆయన సాక్షాత్తు కుమార స్వామి అవతారమని కనుక ఆత్మ త్యాగం వద్దని చెప్పి శిష్యునిగా స్వీకరించి వార్తికం వ్రాయమని కోరారు. అలానే చేశాడు భట్ట పాదుడు. నర్మదా నదీ తీరం లోని మాహిష్మతీ పట్టణం లో ఉన్న కర్మిష్టి,జ్ఞానమార్గానికి వ్యతిరేకి అయిన మండన మిశ్రుని వాదం లో ఓడించి శిష్యుని చేసుకొని, ఆయన భార్య ఉభయ భారతి తననూ ఓడించాలని కోరితే "కామ శాస్త్రం "లో తనను ఓడించ మని కోరింది. గడువు కోరి మరణించిన అమరుక మహారాజు శరీరం లో పరకాయ ప్రవేశం చేసి అంతఃపుర స్త్రీలతో శృంగారం అనుభవించి ఆ విద్యలో అఖండుడు అని పించుకొని అమరుక కావ్యం రాసి, మళ్ళీ తన శరీరం లో ప్రవేశించి

ఉభయ భారతిని కామ శాస్త్రం లో వాదం తో ఓడించి ఆమెను మళ్ళీ బ్రహ్మ లోకానికి వెళ్ళేట్లు చేశారు శంకరులు

శ్రీ శంకరులు కాశీ లో "మనీషా పంచకం "రాశారు. మనీషా అంటే బుద్ధి. "ఏక శ్లోకి "లో రెండు మహా వాక్యాల భావం పొదిగారు. విష్ణు మూర్తి ణి పాదాది కేశాంతం 50శ్లోకాలో వర్ణించారు. అంబాష్టకం, శివపరాద స్తోత్రం కాలభైరవాస్టకం, మానస పూజా స్తోత్రం, భజగోవింద శ్లోకాలు, ,లక్ష్మీనృసింహ స్తోత్రం దక్షిణా మూర్తి, అన్నపూర్ణాష్టకం, చిన్నప్పుడే " పేద విధవరాలి దరిద్రాన్ని పోగొట్టి కాపాడమని లక్ష్మీదేవిని "కనకధారా స్తోత్రం "తో ప్రసన్నురాలిని చేసుకొని ఆమె ఇంట బంగారు ఉసిరికాయలు కురిపించిన సంగతి మనకు తెలిసిందే. శ్రీశైలం లో "శివానంద లహరి "రాశారు. దేశం లోని అన్ని పుణ్య క్షేత్రాలను దర్శించి అవసరమైన చోట్ల అమ్మవార్ల ఉగ్రత్వాన్ని తగ్గించటానికి శ్రీ చక్ర యంత్ర స్థాపన చేశారు. కర్నాటక లోని గోకర్ణం లో హరి శంకర మఠం ఏర్పాటు చేసి, కొల్లూరులో మూకాంబికా దేవిని ప్రతిష్టించారు. శృంగేరిలో శారదాదేవిని ప్రతిష్టించారు. బదరీ కేదార్ నాద లను దర్శించి అక్కడి స్వాములపై స్తోత్ర రచన చేశారు. పాండురంగాష్టకం రాశారు. కేరళలో పర్యటించారు గుజరాత్ లో ద్వారక కృష్ణుని సోమనాధ జ్యోతిర్లిగ్గాన్నీ దర్శించారు. గణేశ, సుబ్రహ్మణ్య, ఉమామహేశ్వర, కృష్ణా, అచ్యుత, హనుమత్కావచం, జగన్నాధ విష్ణు భుజంగ స్తోత్రాలు చేశారు.

ఆధ్యాత్మికంగా ప్రాతస్మరణ, ఉపదేశ, యతి, మాయా పంచకం, నిర్వాణ షట్కం, అద్వైత,,కాశీ పంచ రత్నం, ప్రశ్నోత్తర మాలికా, బ్రహ్మజ్ఞానావళీ మాలా, లఘు వాక్య వృత్తి, అనాత్మ శ్రీ విగర్హణం,బ్రహ్మను చింతనం, యోగ తారావాళీ, దశ శ్లోకి, షట్పదీ స్తోత్రం, మోహ ముద్గరం, తోటకాస్టకంవంటివి రాశారు. దేవీ స్తుతులుగా గౌరీ దశకం, భవానీ భుజంగ స్తోత్రం, త్రిపురసుందరీ, దేవీ భుజంగ, స్తోత్రాలు, అన్నపూర్ణాష్టకం భ్రమరాంబా, శారదా భుజంగ, స్తోత్రాలు, మీనాక్షీ, లలితా పంచరత్న స్తోత్రాలతో పాటు గంగ, యమునా, మణికర్ణిక నర్మదాస్టకాలటో మరెన్నో చెప్పారు. ఇవి వింటేనే పుణ్యం చదివి అర్ధం చేసుకొని అనుసరిస్తే కైలాసమే.

ఆ నాటికి సంప్రదాయాలుగా ఉన్న కీట వార, భోగ వార, ఆనంద వార, భూరి వార అనే నాలుగు సంప్రదాయాల ను ప్రమాణంగా తీసుకొని నాలుగు ఆమ్నాయ పీఠాలను నెలకొల్పారు శంకర యతీంద్రులు. పూరీకి హస్తమలక, శృంగేరికి సురేశ్వర, ద్వారకకు పద్మ పాద, బదరికి తోటకాచార్యులను పీఠాది పతులుగా నియమించి అద్వైత సేవ చేయమని ఆదేశించారు. శ్రీ శంకరులు కాశ్మీర్ వెళ్లి అక్కడ సర్వోన్నత శారదా పీఠాన్ని అది రోహించాతానికి ముందు అక్కడున్న అన్ని మతాల అధిపతులను వాదం లో గెలిచి యెక్క బోతుండగా సరస్వతీ దేవి ప్రత్యక్షమై "నువ్వు కామశృంగారాలలో మునిగి తేలావు యతీశ్వరునికి ఇవి నిషిద్ధం ఈ పీఠం ఎక్కే అర్హత లేదు "అన్నది. "అమ్మా ! నా కామవాసన అమరుక దేహం లో ఉన్నప్పుడే. ఇప్పుడా దేహం లేదునేను మామూలు యతినే "అనగానే సంతోషించి "నిన్ను మించిన వారెవ్వరూ లేరు

సర్వ అర్హతలు నీకున్నాయి నువ్వే దీన్ని అధిరోహించాతానికి సర్వ విధాలా సమర్దుడివి "అనగానే అందరూ శంకరుని వెంట బెట్టుకొని వెళ్లి పీఠం పై సగౌరవంగా కూర్చో బెట్టి అభినందించారు దీనితో శంకర యతీంద్రులు "యోగి మహా రాజ్ "అయ్యారు. తల్లికి జబ్బు చేసి మనసులో తలచుకొంటే కాలడి వెళ్లి, 12మంది నంబూద్రీ కుటుంబాలలో రెండు కుటుంబాలవారు మాత్రమె సహకరించగా శ్మశానం లో కాకుండా స్వంత ఇంటిలో దహన క్రియలు నిర్వహించి తల్లికిచ్చిన మాట నిల బెట్టుకొన్నారు. ఆ రెండు కుటుంబాలవారికి అక్కడ తమ పేరా ఉన్న వన్నీ అప్పగించిమళ్లీ కాలినడకన దేశపర్యటన ప్రారంభించారు. కేదార్ నాద లో శ్రీ శంకర భగవత్పాదుల వారు మహా నిర్యాణం చెందినట్లు తెలుస్తోంది అక్కడే ఆయన సమాధి ఉంది. రెండేళ్ళ క్రితం వరదలలో అది కొట్టుకు పోయింది.

వేద ధర్మ పునరుద్ధరణకు ఇంతగా శ్రమించిన ఆ 32ఏళ్ళ యువ యతికి మనం ఏం చేశాం అని ఆలోచిస్తే సిగ్గు పడాల్సి ఉంటుంది. ఆయన మనవాళ్ళ లెక్క ప్రకారం క్రీ శ.820లో మరణించినా 1906వరకు అంటే సుమారు 1,086సంవత్సరాల వరకు అసలు ఆయన జన్మించిన స్థలం ఏది అని నిర్ధారించలేక పోయాం. అప్పటికి తిరువాన్కూర్ మహా రాజు అధీనం లో ఉన్న కేరళ రాష్ట్రం లోని శృంగేరీ మఠంపీఠాధిపతి 1906లో సుప్రసిద్ధ చారిత్రిక పరిశోధకుడు పురాశాస్త్ర వేత్త అయిన శ్రీ నడుకావేరి శ్రీనివాస శాస్త్రి గారినికేరళ లోని ఎర్నాకులం జిల్లాలో ఉన్న కాలడి ని సందర్శించి ప్రభుత్వ రికార్డులు, కైఫీయత్తుల సహాయం తోఖచ్చితంగా శంకరుల జన్మ ప్రదేశాన్ని నిర్ధారించమని పంపారు. శాస్త్రి గారు కాలడి వచ్చి అక్కడి రికార్డులన్నీ పరిశీలించగా అది అంతా"కపిల్లమన "అనే ఆధీనం లో ఉన్నాడని తేల్చి, శంకరులు జన్మించిన స్థలాన్ని నిశిత పరిశోధనలతో నిగ్గు తేల్చి ఇప్పుడు కాలడిలో శంకరాలయం ఉన్న చోటే ఆది శంకరుల జన్మస్తలి అని రుజువులతో సహా శృంగేరి మఠానికి నివేదిక ఇచ్చారు, పీఠాదిపతులు తిరువాన్కూర్ మహా రాజాను సందర్శించి విషయమంతా తెలియ జేసి నివేదిక అందించి ఆస్తులాన్ని కబ్జా దారుడి నుండి తీసుకొని తమ మఠానికి అప్పగిస్తే అక్కడ శంకరాలయం కడతామన్నారు. రాజు గారు పరమానందం పడి కపిల్ల మన స్వాధీనం లో ఉన్నదాన్ని అంతటినీ ప్రభుత్వ పరం చేసుకొని శృంగేరి మఠానికి రాసిచ్చారు. ఆ తర్వాత నాలుగేళ్ళకు అక్కడ శృంగేరి మఠం శ్రీ శంకరాలయాన్ని 1910లో నిర్మించి, నిత్య పూజాదికాలు చేయిస్తున్నారు. శంకరాచార్య దివ్య విగ్రహం ప్రతిష్టించారు అఖండ జ్యోతి ఆ రోజు నుండి వెలిగే ఏర్పాటు చేశారు 2010లో ఆలయానికి శాత జయంతి ఉత్సవాన్ని మహా ఘనంగా నిర్వహించారు ఈ ప్రదేశం లోనే తల్లి ఆర్యాంబ కు కుమారుడు శంకరులు శవ సంస్కారం నిర్వహించారు. కాలడికి దగ్గరలో "మాణిక్య మంగళం "అనే చోట శ్రీ కాత్యాయినీ మాత దేవాలయం ఉంది. నిత్యం ఉదయాన తండ్రి శివ గురువు అమ్మవారికి క్షీరాన్ని నైవేద్యంగా సమర్పించేవారు ఒక రోజు ఊరికి వెడుతూ ఆ బాధ్యతను బాల శంకరునికి అప్పగించారు. అమ్మవారి దగ్గర పాల చెంబు పెట్టి తాగమని గోల చేశారు. ఎంతకీ తాగాక పోయేసరికి ఏడుపు మొదలు పెట్టాడు. అమ్మ అనుగ్రహించి దర్శనమిచ్చి పాలు తాగేసింది అమ్మవారి దివ్య దర్శనం టో పులకించి ఆమె దివ్య సుందరాకారాన్ని "సౌందర్య లహరి "రాసి నిక్షిప్తం చేశారు. పూర్ణానది ఒడ్డునే

శంకరాచార్య శ్రీ కృష్ణ విగ్రహాన్ని తల్లి కోరికపై ప్రతిష్టించి అక్కడే కూర్చుని 243పంక్తుల "ప్రబోధ చంద్రోదయం "రాశారు. తమిళనాడు లోని కంచి మఠంవారు కాలడి సెంటర్ లో కీర్తిస్తంభం "అనే 8 అంతస్తుల భవనం నిర్మించి శ్రీ శంకరులకు సంబంధించిన సర్వవిషయాలను అందులో ఉంచారు.

కాలడికి రెండు కిలో మీటర్ల దూరం లో "మట్టూరు తిరువేలు మాన్ శివాలయం "ఉంది. ఈ లింగాన్ని శంకరుల తండ్రి శివగురువు ప్రతిష్టించారు రోజా భార్యా భర్తలు ఇంట దూరం వచ్చి పూజాదికాలు చేయటం కష్టమైంది అడవి ప్రాంతం శివుని ప్రార్ధిస్తే నాట్యం చేసే తెల్ల జింక కనిపిస్తుందని అది ఆలయానికి దారి చూపిస్తుందని చెప్పాడు అలాగే వెళ్లి శివార్చన చేసేవారు అందుకనే ఆ ప్రదేశాన్ని "తిరువేల్లమాన్ మళ్లి "అస్తెనాత్య మాదే తెల్ల జింక అని పిలుస్తారు.

కాలడికి మూడు కిలో మీటర్ల దూరం లో "నయ తోడు శంకర నారాయణ కోవెల" ఉంది. ఈ శివాలయం లో శంకరాచార్య కూర్చుని విష్ణు మూర్తి ణి ప్రార్ధిస్తే శ్రీ హరి ప్రత్యక్షమై శివునిలోకలిసి పోయి హరి హర భేదం లేదని చాటాడు అందుకే ఈ దేవాలయం అద్వైత అర్చనకు గొప్ప స్థానంగా ప్రసిద్ధి చెందింది. ముందుశివుడికి తర్వాత విష్ణువుకు ఇక్కడ అర్చన చేస్తారు. ఇక్కడి నదిలో మూతల నడవు "అంటే మొసలి ఘాట్ (క్రోకడైల్ ఘాట్ )ఉంది. ఇందులో స్నానం చేస్తుంటేనే బాల శంకరుని మొసలి పట్టుకోగా తల్లి అనుమతితో ఆపద్ధర్మ సన్యాసం తీసుకొన్న రేవు అన్నమాట.

శ్రీశంకరుల గురించి యెంత చెప్పినా తనివి తీరదు. సౌందర్య లహరిలో భగవత్పాదుల శ్లోకం తో సమాప్తి చేస్తాను –

"ప్రదీప్త జ్వాలాభిర్దివస కర నీరాజన విధి –స్సుదా సూతే శ్చంద్రో పల జలల వైర్ఘ్య రచనా –స్వకీయై రంభోభి స్సలిలనిది సౌహిత్య కరణం –త్వదీయాభిర్వా గ్భిస్తవ జనని వాచాం స్తుతి రియం "

## మాతృ పంచకం.

ఆది శంకరాచార్య

మనస్సును కదిలించే ఆదిశంకరుల మాతృ పంచకం

(అర్ధ తాత్పర్యాలతో)

కాలడిలో అది శంకరుల తల్లి ఆర్యాంబ మరణశయ్యపై ఉంది. కాలడిలో అది శంకరుల తల్లి ఆర్యాంబ మరణశయ్యపై ఉంది. తనను తలచుకొన్న వెంటనే ఆమె దగ్గరకు శంకరులు వచ్చి ఉత్తరక్రియలు చేసారు.

ఆ సందర్భంలో శంకరులు చెప్పిన ఐదు శ్లోకాలు "మాతృపంచకం" గా ప్రసిద్ధమైనవి. వాటిని స్మరించుకొందాం

**1:- ముక్తామణిస్త్వం నయనం మమేతి**
**రాజేతి జీవేతి చిరం సుత త్వం**
**ఇత్యుక్తవత్యాస్తవవాచి మాతః**
**దదామ్యహం తండులమేవ శుష్కమ్.**
తాత్పర్యము

అమ్మా !

"నువ్వు నా ముత్యానివిరా! , నా రత్నానివిరా !, నా కంటి వెలుగువు నాన్నా! నువ్వు చిరంజీవి గా ఉండాలి " అని ప్రేమగా నన్ను పిలిచిన నీనోటిలో - ఈనాడు కేవలం ఇన్ని శుష్కమైన బియ్యపు గింజలను వేస్తున్నాను.నన్ను క్షమించు.

**2:- అంబేతి తాతేతి శివేతి తస్మిన్**
**ప్రసూతికాలే యదవోచ ఉచ్చైః**
**కృష్ణేతి గోవింద హరే ముకుందే**
**త్యహో జనన్యై రచితోయమంజలిః.**
తాత్పర్యము

పంటిబిగువున నా ప్రసవకాలములో వచ్చే బాధను "అమ్మా ! అయ్యా ! శివా ! కృష్ణా ! హరా ! గోవిందా !" అనుకొంటూ భరించి నాకు జన్మనిచ్చిన తల్లికి నేను నమస్కరిస్తున్నాను.

**3:- ఆస్తాం తావదియం ప్రసూతిసమయే దుర్వార శూలవ్యథా**
**నైరుచ్యం తనుశోషణం మలమయీ శయ్యా చ సంవత్సరీ**
**ఏకస్యాపి న గర్భభార భరణ క్లేశస్య యస్యాక్షమః**
**దాతుం నిష్కృతిమున్నతోపి తనయః తస్యై జనన్యై నమః.**
తాత్పర్యము

అమ్మా ! నన్ను కన్న సమయంలో నువ్వు ఎంతటి శూలవ్యథను(కడుపునొప్పి) అనుభవించావో కదా !

కళను కోల్పోయి, శరీరం శుష్కించి ఉంటుంది. మలముతో శయ్య మలినమైనా – ఒక సంవత్సరకాలం ఆ కష్టాన్ని ఎలా సహించావోకదా ! ఎవరూ అలాంటి బాధను సహించ లేరు.

ఎంత గొప్పవాడైనా కుమారుడు తల్లి ఋణాన్ని తీర్చుకోగలడా ? నీకు నమస్కారం చేస్తున్నాను.

**4:- గురుకు లముప సృ త్య స్వప్న కాలే తు దృష్ట్వా**

**యతి సముచితవేషం ప్రారుదో త్వముచ్చైః**

**గురుకులమథ సర్వం ప్రారుదత్తే సమక్షం**

**సపది చరణయోస్తే మాతరస్తు ప్రణామః.**

తాత్పర్యము

కలలో నేను సన్యాసివేషంలో కనబడేసరికి బాధ పడి, మా గురుకులానికి వచ్చి పెద్దగా ఏడ్చావు. ఆ సమయంలో నీ దుఃఖం అక్కడివారందరికీ బాధ కలిగించింది. అంత గొప్పదానివైన నీ పాదాలకు నమస్కరిస్తున్నాను

**5:- న దత్తం మాతస్తే మరణ సమయే తోయమపివా**

**స్వ ధా వా నో దత్తా మరణదివసే శ్రాద్ధవిధినా**

**న జప్త్వా మాతస్తే మరణసమయే తారక మను-**

**రకాలే సంప్రాప్తే మయి కురు దయాం మాతురతులామ్.**

తాత్పర్యము

అమ్మా ! సమయం మించిపోయాక వచ్చాను. నీ మరణసమయంలో కొంచెం నీళ్ళు కూడా నేను నీగొంతులో పోయలేదు. శ్రాద్ధవిధిని అనుసరించి "స్వధా"ను ఇవ్వలేదు. ప్రాణము పోయే సమయంలో సమయంలో నీ చెవిలో తారకమంత్రాన్ని (ఓం రామాయనమః" అను ఆఱు అక్షరముల మంత్రమని కొందఱు "ఓం శ్రీరామరామ" అనునదే తారకమని మరికొందరు) చదవలేదు. నన్ను క్షమించి, నా యందు దేనితో సమానము కాని దయ చూపించు తల్లీ !

## శ్రీ శంకర స్మరణం

వైశాఖ శుద్ధ పంచమి అంటే ఈ నెల 26 వ తేదీ గురువారం ఆది శంకరా చార్యుల వారి జయంతి. కేరళ లోని కాలడి లో భూమిపై కాలిడిన అపర శంకర అవతార మూర్తి అయిన శంకర భగవత్పాదులు చిన్న తనం లోనే సన్యాసాశ్రమం స్వీకరించి, పరమ గురు శుశ్రూష లో విద్యలునేర్చి,గురువులకే గురువై జగద్గురువులై దేశమంతా కాలినడక తో పర్య టించి ఆధ్యాత్మ భావ వాహినిని ప్రవ హింప జేశారు.

ఎదురైన అన్యమత వాదనలను తన వాదనా పటిమతో ఎదుర్కొని వారిని తన మార్గం లోకి మార్చుకొన్న ఘనులాయన. వైదిక ధర్మ పునరుద్ధరణకు వారు చేసిన సేవ మాటలతో వర్ణించ లేనిది. అద్వైత భావం బీజ రూపం లో ఉన్నదాన్ని వట వృక్షం గా పెంపొందించిన మహాను భావులు. ఇతర దేశాల సరిహద్దు లలో ఉన్న హిందూ మతావ లంబులను అక్కడే పీఠాలు ఏర్పరచి వారిలో వైదిక, ధర్మ సంస్కారం కలిగించి, నిలిపిన

మహోన్నత వ్యక్తీ. శంకరులే లేకుంటే. ఆ ప్రాంతాల వారందరూ ప్రక్క దేశాల మతాను యాయులై ఈ దేశ భావ జాలాన్నే మరిచి పోయి ఉండే వారు. అలాంటి ప్రదేశాలైన బదరీ నాద్ . కేదార్ నాద్,ప్రాంతాలనుభారతీయ సజీవ జీవనస్రవంతి లోకి. మళ్లించిన దార్శనికులు.

జ్ఞానులకు మాత్రమే అందు బాటు లో ఉన్న ప్రస్తాన త్రయం అన బడే బ్రహ్మ సూత్రాలు ఉపనిషత్తులు భగవద్గీత లకు సామాన్యులకు అర్ధ మయే  రీతి లో విపుల మైన వ్యాఖ్యానం రాసి అందు బాటు లోకి తెచ్చిన యోగి వరేన్యులు. మరి ఇంకా దిగువ తరగతి సంగతేమిటి ? వారినీ ద్రుష్టి లో ఉంచుకొని సకల దేవతల పైనా స్తోత్రాలను రచించి, భక్తి భావం తో ఆడుతూ పాడుతూ పాడు కొనే సులభ శైలి లో, లయతో, శబ్ద సౌందర్యం తో, అర్ధ గౌరవం తో రాసి వారికి అందు బాటు లోకి తెచ్చారు. అర్ధం కాక పోయినా ఆ స్తోత్రాలను వింటే చాలు నోటికి వచ్చేంత సులభం గా ఉంటాయి. బహుశా సంస్కృత భాష ను ఇంత గొప్పగా ప్రజల దగ్గరకు తెచ్చిన, భాషా సేవ చేసిన చరితార్ధుడు ఇంకెవరు లేరని పిస్తుంది. వైరాగ్యం పొందాలనే వారికి వివేక చూడామణి, వంటి వాటిని రచించి సన్యాసాశ్రమ ధర్మాలను బహు చక్కగా వర్ణించి , అందులోని కట్టు బాట్లను ప్రవర్తనా నియ మావళిని బోధించిన సద్గురువు శ్రీ శంకరులు. నిర్గుణ ఉపాసకులే కాక సద్గుణ ఉపాసకులకు కూడా మార్గ దర్శ కత్వం వహించిన జన హితైషి ఆది శంకరులు. అందుకే ఆధ్యాత్మిక జ్యోతి అని పించు కొన్నారు. నిర్యాణం చెంది శతాబ్దాలు గడిచినా ఇంకా మన అందరి ముందు నిలిచి జ్ఞాన జ్యోతి ని ప్రకాశింప జేస్తున్నారు. శంకరాద్వైతం తో జాతిని, ప్రపంచాన్ని చైతన్య వంతం చేస్తున్నారు. అన్ని మతాల వారి భావనలను వ్యవస్తీక్రుతం చేసి ప్రధాన స్రవంతి  లో నడిచే వీలు కల్పించారు అందుకే ష న్మత   స్థాపనా చార్య అని పించుకొన్నారు. శారదా దేవినే మెప్పించి కాశ్మీరు లోని మహోన్నత శారదా పీఠాన్ని అధిహోరించిన అపర శారదా వతారం.

భగవత్పాదులు రచించిన ''శివా నంద లహరి '',''సౌందర్య లహరి ''శివ శివా ల అలౌకిక శక్తిని ఆవిష్కరించిన ఉత్తమోత్తమ రచనలు. అద్వైతామృత వర్షం తో సకల జనాలను పులకరింప జేసిన రచనలవి. వాటిల్లోని పరమ గంభీర మైన భావనలను చదివి, విని స్మరించి తరించాల్సిందే.ఇప్పటికీ చాగంటి కోటేశ్వర రావు గారి లాంటి వారు వాటి లోతుల్ని తరచి ఆస్తిక జనాలకు అంద జేస్తున్నా రంటే ఎంత గొప్ప జ్ఞాన నిధి ని వాటిలో ఆచార్యుల వారు ప్రక్షిప్తం చేశారో ఆశ్చర్యమేస్తుంది. శ్రీ శంకరులు లలితా సహస్ర నామాలకు భాష్యం వివరణ రాయాలని భావించారట. శిష్యుడిని ఆ గ్రంధం తీసుకొని రమ్మని, చెప్పటానికి ఉపక్రమించి కూర్చున్నారట. శిష్యుడు తెచ్చాడు. తీరా చూస్తె అది లలితా సహస్రం కాదు విష్ణు సహస్రం. పూనుకున్నారు కనుక విష్ణు సహస్ర నామాలకే భాష్యం రాశారు. అదే మనకు దక్కింది. లలితా సహస్ర నామాలకు అమ్మ అను మతి నివ్వవ లేదేమో. రాయ లేక పోయారు.

ఇప్పుడు సౌందర్య లహరి గురించి కొన్ని విషయాలు తెలుసు కొందాం. ఒక సారి శంకరా చార్యుల వారు కైలాసం వెళ్లి ఆది దంపతులైన పార్వతీ పరమేశ్వరులను దర్శించారట. స్వామి వారి భక్తీ శ్రద్ధ లకు సంతోషించి, పరమేశ్వరుడు అయిదు స్పటిక లింగాలను వారికి ప్రదానం చేశారట. మాత పార్వతీ దేవి వంద శ్లోకాలతో ఉన్న ఒక మంత్ర గ్రంధాన్ని ఆయనకు బహూకరించింది. ఆ రెండిటినీ తీసుకొని సెలవు పొంది భూ లోకానికి తిరిగి వస్తున్న తరుణం లో వాకిట్లో ఉన్న నందీశ్వరుడు ఆ గ్రంధాన్ని లాగ బోయాడు. అలాంటి ఉత్తమ గ్రంధం కైలాసం నుండి భూలోకం చేరటం నందికి నచ్చలేదట. అందుకని ఆ పని చేశాడట. అలా లాక్కో బోతున్నప్పుడు అందులోని 59 శ్లోకాల భాగం నందీశ్వరుడికి చిక్కిందట.మిగిలిన 41 శ్లోకాలున్న భాగమే శ్రీ శంకరాచార్యుల వారికి దక్కిందట. శంకరులు చింతిస్తూ ఉంటె శార్వాణి. "నంది లాక్కొన్న శ్లోకాల గురించి చింతించ వద్దు. ఆ యాభై తొమ్మిది శ్లోకాలను నువ్వే రచించు "అన్న వాణి విన్పించింది. అంతే ఆయన లోని కవితా గంగ ఉత్తుంగ భావ తరంగాలతో ప్రవహిన్చిందట. నిమిషాల మీద ఆ యాభై తొమ్మిది శ్లోకాలు అలవోకగా  శంకరుల నోటి నుండి అపూర్వం గా నభూతో గా వెలువడ్డాయట. కనుకనే సౌందర్య లహరి లో లలితా పరమ భట్టారిక ఇచ్చిన 41 శ్లోకాలలో మంత్రాను ష్టానానికి సంబంధించిన కఠిన నియమాలతో ఉన్న మంత్ర, కుండలినీ యోగాలు, శ్రీ విద్యో పాసనా ఉన్నాయి.  గురుముఖతహ్ నేర్చుకొని నియమ నిష్టలతో అనుష్టించాల్సినవే ఇవన్నీ. ఏ మాత్రం తప్పు జరిగినా బెడిసి కొడుతుందని విశ్వ సిస్తారు. కనుక సౌందర్య లహరి లో మొదటి 41 శ్లోకాలు అమ్మ వారిచ్చినవి తరువాతి 59 శ్లోకాలు శ్రీ శంకర కృతం. ఏదైనా అమ్మ  వారి వర ప్రసాదమే  సౌందర్య లహరి.

సౌందర్య లహరి శ్లోకాలన్నీ చిక్కని పద బంధం తో ఉంటాయి. ఏ పదాన్ని మార్చలేం. ఒక  వేళ  సాహసం చేసి పెట్టినా రస స్ఫూర్తి కల్గించదు.అది భగవద్దత్తం.

శ్రీ శంకరులకు పరమేశ్వరుడు అనుగ్రహించిన పంచ లింగాలలో ఒకటి కంచిలోని యోగ లింగం --చంద్ర మౌళీశ్వరుని గా పూజింప బడుతున్నాడు. రెండవది కేదార నాద్ లోని ముక్తి లింగం, మూడోది నేపాల్ దేశం లోని వర లింగం, నాల్గవది చిదంబరం లోని మోక్ష లింగం, అయిదవది శృంగేరి లోని భోగలింగం గా చెబుతారు,

శ్రీ శంకర జయంతి నాడు శ్రీ శంకరుల అద్వైతామృతాన్ని, గ్రోలుతూ, స్తోత్ర మకరందాన్ని ఆస్వాదిస్తూ, జ్ఞాన జ్యోతి వైపు అడుగులు వేద్దాం. ఆ మహాను భావుడిని ఒక సారి సంస్మరించుకొనే మహద్భాగ్యం నాకు కల్గినందుకు ఆనందం గా  ఉంది

"  నారాయణ సమారంభాం -శంకరాచార్య మధ్యమాం -అస్మదాచార్య పర్యన్తాం -వందే గురు పరంపరాం "

## పరమాచార్య పధం

"పొట్టి మనిషి. కషాయామ్బర దారి. నెత్తిన కూడా కప్పుకొన్న వస్త్రం.బలహీన మైన శరీరం. చేతిలో దండం. నలభై ఏళ్ళను దాటిన వయసు. తెల్లబడినజుట్టు. కళ్ళు నల్లగా కాంతి వంతం. భావ గంభీర మైన నుదురు. కమనీయ మైన కనులలో అలౌకిక కాంతి. కోటేరు తీసిన ముక్కు. బిరుసు గడ్డం. చిన్న నుదురు. నోరు విశాలం. కూర్చున్న భంగిమ లో పరమ మేధావిత్వం. కలలుకాక ఏదో లోకం లో విహరిస్తున్నట్లున్న కను లు. " ఇదీ paul brunton దర్శించిన కంచి పరమాచార్య జగద్గురువులు శ్రీ శ్రీ చంద్ర శేఖర యతీంద్రుల వారి దివ్య స్వరూపం. వారు ఆంగ్లాన్ని చక్క గా అర్ధం చేసుకో గలిగి మాట్లాడ గలిగినా తమిళం ఆంగ్లము తెలిసిన మధ్య వర్తి చేత అనువాదం చేయించి సందేశమిచ్చారు ".ప్రపంచ పరిస్థితులు ఎప్పుడు చక్క బడతాయి "అని అడిగిన ప్రశ్నకు "మార్పు రావటానికి చాలా సమయం పడుతుంది. అదొక క్రమ పద్ధతి లో రావాలి. ఆయుధాలను విసర్జించి, దేశాలు శాంతి కోసం ప్రయత్నించాలి "అని సమాధానం. "ఆ దిశలో దేశాలు కొంత ప్రయత్నిస్తున్నాయి "అని అంటే -"ఆయుధాలు విసర్జినంత మాత్రానే శాంతి రాదు, యుద్ధం ఆగదు. కొట్టుకోవటానికి కర్రలు చాలు. దీనికి పరిష్కారం ఆధ్యాత్మిక భావ వ్యాప్తి మాత్రమే. అది దేశాలమధ్య, మనుషుల మధ్య, బీద ధనికుల మధ్య పరి వ్యాప్తమైతేనే కుదురు తుంది. సుహృద్భావం పేర గాలి. అప్పుడే నిజమైన శాంతి అభ్యుదయం కలుగుతాయి '. "అయితే అది చాలా దూరం చాలా కాలం పడుతుందేమో '"అని సందేహించాడు పాల్ -దానికి స్వామి "ఇంకా దేవుడున్నాడు "అన్నారు. "దేవుడెక్కడో లేడు దేవుడంటే ప్రేమ స్వరూపం. జీవుల మీద ప్రేమే దైవం. "అని సమాధానం. "దేవుడు మానవ పరికరాలను అవసరం వచ్చి నప్పుడు వాడుతాడు. మానవాళి, సంఖోక్షోభాన్న ఎదుర్కొన్నప్పుడు ఏదో రూపం లో వచ్చి పరిష్కరిస్తాడు. ప్రతిశతాబ్దం లోను దివ్య విభూతి కలిగిన మహాత్ములు జన్మించి, మాన వాలి ని ఉద్ధరించారు. ఈ విధానం అంతా భౌతిక శాస్త్ర నియమాలుగా పని చేస్తుంది. . భౌతికత పెరిగి ఆధ్యాత్మికత కు జనం దూర మైన ప్రతి సారి ఇలా జరుగు తూనే ఉండటం అందరికి తెలిసిన విషయమే. పాల్"మన కాలం లో కూడా అలాంటి మహాత్ముడు జన్మిస్తాడా?"అని అడిగితే "మా దేశం లో ఇది తప్పక జరుగు తుంది, జరిగింది. భౌతికత అనే చేకటి విస్తరించి జ్ఞాన జ్యోతి మినుకు మినుకు మన్నప్పుడల్లా ఇలా జరగటం మాకు సహజమే. వారినే మేము దైవాంశ సంభూతులు అంటాం ""అన్నారు ఆచార్యులు.

"మనుష్యులు బాగా పతన మై పోయారా" అన్న ప్రశ్నకు "అంతగా నాకు అని పించటం లేదు. మనిషి లో దివ్యత్మమ్ జాగృతం అవాలి. అప్పుడు మనిషి దేవుని వైపుకు అడుగులేస్తాడు. "బ్రంటన్ "మా పశ్చిమ దేశాల్లో దెయ్యాల లాగా మానవులు ప్రవర్తించటం బాధా కరం గా ఉంది "అంటే -"అలా వేరు చేసి మాట్లాడ వద్దు. అక్కడి దేశ రాజకీయ ఆర్ధిక స్తితి గతులను మనం దృష్టిలో ఉంచుకోవాలి.పిడుక్కు, బియ్యానికి ఒకటే మంత్రం కాదు. సమాజాన్ని ఉన్నత స్తితికి తీసుకొని వెళ్ళాలి. భౌతికత ను ఆదర్శం ( ఐడియలిజం) తో సమానం చేయాలి. ప్రపంచం ఎదుర్కొనే క్లిష్ట పరిస్తితికి నిజమైన నివారణ అంటూ ఏదీ లేదు. "అన్నారు. "అయితే నిత్య జేవితం లో ఆధ్యాత్మికతను జోడిన్చాలా ?"అని అడిగితే -"ఖచ్చితంగా. సరైన ఫలితాలు రావాలి అంటే అదొక్కటే మార్గం. ప్రపంచం లో ఆ స్తాయి మనుష్యులు ఎక్కువైన కొద్దీ మార్పు వేగ వంత మవుతుంది. మా అదృష్ట వశాత్తు మా దేశం లోఅలాంటి వారికి కొదువ లేదు. ఈ మార్పు ప్రపంచం అంతటా వస్తే మంచి రావటానికి స్వల్ప సమయం చాలు. " పాల్ "తమరికి ఈ ఆశ్రమాధి కారం

సంక్రమించి ఎంతకాలమైంది "?అని ప్రశ్నిస్తే -"1907 లో నేను పన్నెండేళ్ళ వయసు లో ఉండగా లభించింది. నాకు ఆశ్రమాది కారం వచ్చిన తర్వాత నాలుగేళ్ల కు, నేను కావేరి నది ఒడ్డున ఒక గ్రామం లో తపస్సు చేసి, మూడేళ్ళు వేద వేదాంగ విద్య లన్ని నేర్చాను. "అని చెప్పారు. "మీరు నిత్యం సంచారం చేస్తూనే ఉంటారా ?"అన్న దానికి "1918 లో లో నేపాల్ లో జరిగే ఒక కార్య క్రమానికి నేపాల్ రాజు ఆహ్వానించారు. దానికి సమ్మ తించినేను అప్పటి నుండి దేశ సంచారం చేస్తూ ప్రతిగ్రామమూ తిరుగు తున్నా ను. మా ఆశ్రమ ధర్మ ప్రకారం ప్రతి గ్రామము సందర్శించాలి. ప్రజల్ని ఆధ్యాత్మికత వైపు మరల్చే ప్రసంగాలు చేయాలి. మా ఆశ్రమ సంప్రదాయాలను పాటించాలి. నిత్యార్చన అవీ మాకు చాలా నియమాలుంటాయి."అని సమాధానం. "నాకు మార్గ దర్శనం చేయ గలిగిన యోగుల కోసం నేను భారత దేశ మంతా పర్యటిస్తున్నాను. సరై న వారిని మీరు నాకు సూచించ గలరా "?అని అడిగిన దానికి సమాధానం గా కంచి స్వామి "మీకు నిజం గా అలాంటి కోరిక ఉంటె అదేమీ అత్యాస కాదు. మీ లోని నిజాయితీ తప్పక మీ కోరిక తీరుస్తుంది. ఇప్పుడే మీలో జాగృతి కలిగింది. అదే మీకు మార్గ దర్శనం చేస్తుంది. మీ సందేహాలన్నీ పటా పంచలవుతాయి ".పాల్ మళ్ళీ "ఆ ఆలోచనే నాకు ఇప్పటి దాకా మార్గ దర్శకత్వంచేసింది. నేను ఎ మహాను భావుడిని కలిసినా "దేవుడు వేరుగా లేడునీ లోనే ఉన్నా డు"అంటున్నారు "చూపించండి అంటే నువ్వే వెతుక్కో వాలి "అని అంటూ దాటేస్తున్నారు" అన్నాడు. నవ్వు తు స్వామి "దేవుడు అంతటా ఉన్నాడు. మనిషి లో మాత్రమె ఉన్నాడని అక్కడే బంధించక్కర లేదు. ఈ విశ్వానికి అంతటికి ఆధారం ఆయనే కదా "'అన్నారు. "అయితే స్వామీ ! ఎ ప్రయోగాత్మక పద్ధతి ని నేను అవలంబించాలి ?"-"మీ యాత్రలో మీరు అన్వేషించు కొంటూ వెళ్ళండి. మీకు నచ్చిన వారిని ఎన్ను కొండి. "అన్నారు. "వారిలో ఎవరూ నాకు సరైన మార్గ దర్శనం చెయ్య లేక పోతే "?సందేహించాడు పాల్ "అలా అయితే మీరు ఒంటరిగా ప్రయాణం చేసి దైవ విభూతిని పొందే వరకు ఆ మార్గం వదలకండి "ధ్యానం క్రమం తప్పకుండా చేస్తూ ఉండండి. ఉన్నత భావాలమీద ఆసక్తి, ప్రీమ పెంచుకోండి. మనసంతా ప్రేమ తో నింపు కొండి. తెల్ల వారు జామున, సాయం సంధ్యలో ధ్యానం సత్ఫలితాల నిస్తుంది. అప్పుడు ప్రపంచమంతా పరమ ప్రశాంతం గాఉంటుంది. దీన్ని మాత్రం సాధన చేయటం మరవ కండి "అని హితవు చెప్పారు. "స్వామీ ! నా ప్రయత్నా లన్ని వ్యర్ధమై, నా సాధన ఉపయోగ పడకపోతే మీరు నాకు మార్గ దర్శనం చేస్తారా ?"అని సూటిగా ప్రశ్నించాడు బ్రంటన్ బ్లంట్ గా. దీనికి సమాధానం గా పరమా చార్యులు "నేను ఒక సంస్థానానికి అధి పతి ని. ఇక్కడ నా సమయం అంటూ ఏమీ ఉండదు. నా నిత్య కార్యక్రమాల తో నా సమయం అంతా ఖర్చు అయి పోతుంది. అవి కాల నియమ ప్రకారం జరగాల్సినవి. వాటిని వేటినీ వదిలి పెట్ట రాదు. నేను ఎన్నో ఏళ్ళు గా రోజురాత్రిళ్ళు నిద్ర పోయేది "మూడు గంటలే ".అలాంటి పరిస్థితుల్లో నేను ఒక వ్యక్తి మీద శ్రద్ధ పెట్టటం జరిగే పని కాదు. మీరే మీ కోసం సమయాన్ని పూర్తిగా కేటాయించే గురువు ను ఎన్ను కొండి "అని విస్పష్టం గా చెప్పారు. "బాధ గురువులే తప్ప బోధ గురువులు లేరు అని అంతా అంటున్నారు. అందులో నేను ఒక యూరోపియన్ని. నాకు బోధించే వారు దొరకరేమో ?"అని సందేహం వెలిబుచ్చాడు "సత్యం ఉంది. దాన్ని కనుగొన వచ్చు "అని సమా ధానం. "మీరేఒకరిద్దరి పేర్లను సూచించి నా అన్వేషణ కు దగ్గరి దారి చూపించండి మహాత్మా "'అని అంటే "నాకు తెలిసి ఇద్దరే మీ కు గురువులు అని పించుకోన దగిన సమర్ధులు ఉన్నారు. అందులో ఒకాయన కాశీ లో ఎక్కడో విశాల మైన భవంతి లో దాగి ఉంటారు. ఆయన దర్శనం అంత తేలిక కాదు. అదీ గాక వారు పాశ్చాత్యు లకు ప్రవేశం కల్గిస్తారని నేను భావించటం లేదు "అన్నారు పాల్ మీద కృపా ద్రుష్టి తో. పట్టు వదలని విక్రమార్కుడు పాల్ -"రెండో వారు ?"అని ప్రశ్నించాడు. "ఎక్కడో దక్షిణ భారత దేశం లో మారు మూల ఉన్నారు. ఆయన్ను "మహర్షి "అంటారు. నేను ఇంత వరకు వారిని చూడ లేదు. కాని అ వారు ఉత్తమ దేశికులు అని తెలుసు. వారు మీకు చక్కని

మార్గ దర్శనం చేస్తారని నమ్మకం ఉంది. వారు అరుణాచల జ్యోతి స్వరూప మైన అరుణా చలం లో ఉంటారు. వారి దర్శనం మీ కు మనో భీష్టం కల్గిస్తుంది. ''అని చెప్పగానే పాల్ పరమా నంద భరితుడయాడు. తనఅన్వేషణ ఫలించే రోజు దగ్గర లో ఉందని సంబర పడ్డాడు. అరుణా చలం వెళ్లి రమణ మహర్షిని ఎప్పుడు సందర్సిద్దామా అనే తహ తహ పెరిగి పోయింది. చివరగా ఒక మాట చెప్పారు శంకరులు ''రమణ మహర్షి ని దర్శించ కుండా ఇండియా నుండి తిరిగి మీ దేశం వెళ్ళను అని నాకు మాట ఇవ్వండి ''అన్నారు కృపా దృష్టి తో. శ్రీ వారిలోని ఆ కారుణ్యం, తన తపనను అర్ధం చేసుకొన్న వారి మనో భావం చూసి పాల్ చలించి పోయాడు. ''మీ మాట జవదాట ను మహాత్మా !''అనిమనస్పూర్తిగా చెప్పాడు.చివరి సారిగా శంకరులు ''ఆదుర్దా పడకండి. మీరు సత్యాన్ని కనుక్కొంటారు. మీరు వెతుకు తున్న వారు మీకు లభించి మీ కోరిక తీరుస్తారు ''అని అభయం ఇస్తూ ''మీరు నన్నెప్పుడు గుర్తుంచు కొండి. నేనూ మిమ్మల్ని ఎప్పుడూ గుర్తుంచు కొంటాను ''అని paul the seeker కు వీడ్కోలు చెప్పారు పరమా చార్యులు. ఆయన దేశ సంచారాన్ని ఆది శంకరుల దేశ సంచారం తో సరి పోల్చాడు పాల్.ఒక ఆధ్యాత్మిక జ్యోతిని సందర్శించిన మహదానందం తో పాటు మరో అద్భుత మహర్షిని సందర్శించా బోతున్న ఉద్వేగం పాల్ ను కుదిపేస్తోంది. మహాత్ములు ఎంత ఉన్నతులో, ఎంత మార్గ దర్శనం చేస్తారో ఆధ్యాత్మికానుభూతి పొందాలనుకొనే వారంటే వారికి ఎంత అభిమానమో వ్యక్తమయ్యే అన్ని వేశాలను ఇందులో మనం చూశాం. ఇదే పరమాచార్య పథం.

## జ్ఞాన కనకధార

చిన్న ఉసిరికాయ భిక్షగా వేస్తే ఏకంగా ఉసిరికాయలంత కనకాన్ని ధారగా కురిపించిన కరుణామూర్తి ఆది శంకరాచార్య. ఆ స్తవం చదివితే అందరికీ లక్ష్మీదేవి కరతలామలకం అవుతుందని నమ్మిక. ఇదీ శంకరుల మహితభక్తి. అందులోని పరమార్ధాన్ని చాలాకాలం క్రితమే శ్రీ ధూళిపాళమహాదేవమణి ఆవిష్కరించి పుస్తకంగా ప్రచురించారు. వెతుక్కోవాలేకాని అందులో దొరకనిది ఏదీ ఉండదేమో ! కనకధారా స్తవం లోని లోతుల్ని చాలామంది ప్రసంగాలద్వారా లోకంలో ప్రచారం చేశారు.

పూర్వపు నా సహా ఉపాధ్యాయుడు, గురుముఖతా సంస్కృతాంధ్రాలు క్షుణ్ణంగా గ్రహించి, తనపదునైన మేధో శక్తితో అంతరాంతరాలు తరచే మహా ప్రతిభాసంపన్నులు, ఇప్పటికే ఎన్నో ఆధ్యాత్మిక గ్రంథాలను పండిత జన మెప్పుతో రాసి ప్రచురించిన వారు శ్రీ రంగావఝుల మురళీధరరావు. మొన్న శివానందలహరిలో ఈదులాడి, ఇప్పుడు కనకదారలోతడిసి మోపెడు అయ్యారు . ఈ గ్రంథరచన ఆసాంతం అవలోడనం చేయటానికి నేను అశక్తుడిని. అది తెలిసికూడా ఆత్మీయంగా నాకు పుస్తకం పంపారు రావు జీ. ఉగాదికి రెండు రోజులముందే అందుకున్నా తెరిచి చూసే సమయం లేక తర్వాత చూసి స్పందిస్తా అని వెంటనే విద్యుల్లేఖ పంపాను.

ఇవాళే కొద్ది సమయం దొరికి చూశాను. కనక ధార జిగేలు మనిపించింది. అందులోని తత్త్వం నాకు అర్ధమవ టానికి ఏళ్ళూ,పూళ్ళు పట్టవచ్చు. కానీ ఈ గ్రంథాన్ని బహుదా ప్రశంసించారు శ్రీ విద్యాపారంగత డా టివిఎస్ శర్మ. కనకధార రసాస్వాదన చేయమని శ్రీరస్తుగా ఆశీర్వదించారు గీతాచార్య బ్రహ్మశ్రీ దోర్బల ప్రభాకర శర్మ. అవధాన ప్రాచార్య శ్రీ ధూళిపాళమహాదేవమణి”జ్యోత్స్నిః”అంటూ నిండుగా మెచ్చి

ఆశీస్సులందించారు. ."అనంత జ్ఞానదార జీవధార "గా అభి వర్ణించారు ప్రవచన సరస్వతి బ్రాహ్మశ్రీ చాగంటి కోటేశ్వరశర్మగారు.

ఈ జ్ఞానపయోది ని తరించాలను కొనేవారు మీభక్తి అనే తులసి దళాన్ని చూపి ఉచితంగా పొందవచ్చు

రంగావఝుల మురళీధరరావు
21-1-54పవన్ సాయి హోమ్స్
అల్లూరి సీతారామరాజు వీధి
ముత్యాలంపాడు
విజయవాడ -11

## శ్రీ శంకరుల లలి (కవి )తా సౌందర్య లహరి

శ్రీ వినాయక చతుర్ధి సందర్భం గా శ్రీ ఆది శంకరా చార్యుల వారి అపూర్వ కవితా సృష్టి" సౌందర్య లహరి "ని ధారా వాహికం గా మొదలు పెడుతున్నాను. ఇందులో శ్లోకం, తాత్పర్యం తో పాటు అవసర మైన విశేషాలను మాత్రమె అందరికి అందు బాటు లో ఉండే టట్లు తెలియ జేయటమే నా లక్ష్యం. ఇందులో భాగ వత్పాదుల కవితా సౌందర్యాన్నీ వెలువ రించటం కూడా ఉంది. అందుకే దీనికి "లలి(కవి )తా సౌందర్య లహరి "అని పేరు ఉంచాను. . వచ్చేది అమ్మ వారికిష్టమైన శరన్నవ రాత్రులు కనుక ఈ ప్రయత్నం. సమాదరిస్తారని, అమ్మ వారి కరుణా కటాక్షలహరి మనందరి పై ప్రస రించాలని కోరుతున్నాను. మీ--దుర్గా ప్రసాద్

**" శృతి స్మృతి పురాణామాలయం కరుణా లయం --నమామి భాగవత్పాదం శంకరం లోక శంకరం "**

సౌందర్య లహరి ని పరమ శివుడే, పర దేవత ను స్తుతిస్తూ చెప్పినదని, శ్రీ శంకర భాగ వత్పాదులు లోకానుగ్రహం బుద్ధి తో వెళ్ళ డించారని ప్రతీతి. ఇది భక్తీ సాహిత్యం లో మణి పూస గా పేర్కొన బడింది. సమయ మతాన్ని అనుసరించే శ్రీ విద్యోపాసకుల కు ఇది గౌరవ శ్రేష్టమైన గ్రంధం. ఇందులో శాక్త మతాన్ని సమర్ధి స్తున్నట్లు గా కనీ పిస్తుంది. కౌల, మిశ్రమ, సమయా చారాలు అని శాక్తేయ మతం లో మూడు రకాలున్నాయి. కౌల, మిశ్రమ వారికి ఐహిక దృష్టి ఎక్కువ. సమయా చారు లది పరమార్ధ దృష్టి అని తెలుస్తుంది. షణ్మతస్థాపకు లైన భాగ వత్పాదులు శక్తి ఉపాసకులను సంస్కరించి, వైదిక పద్ధతి గా తన మార్గాన్ని చూపారు. ఇందులో మొదటి శ్లోకం అన్ని శ్లోకాలకు సార భూత మైన దానిని గా భావిస్తారు.

ఆగమాలు అంటే సగుణ బ్రహ్మ ను గురించి చెప్పేవి. ఇందులో తంత్ర గ్రంధాలు ముఖ్య మైనవి. ఇవే మంత్ర శాస్త్రాలని పిలువ బడుతాయి. సామాన్యులకు కూడా ఇవి అర్ధమవు తాయి. ఇందులో శైవ, వైష్ణవ, శాక్త ఆగ మాలు అని మూడు రకాలున్నాయి. శక్తి ని జగన్మాత గా, పర తత్వం గా చెప్పేవి శాక్తాగమాలు. కౌల, మిశ్రమ, సమయ అని ఇందులో మూడు రకాలు. మిశ్రమాగమాలు -ధర్మ, ఉపాసనా వివరణ ఉన్నవి. ఇందులో కుండలినీ శక్తి వివరణ, దాని ఉత్థానం, అవలంబించాల్సిన సాధన ప్రక్రియ తెలియ జేయ బడుతుంది. సమయ మతం అంటే పర మార్గదృష్టి తో కర్మ మార్గాన్ని వదిలి జీవ బ్రహ్మైక్యాన్ని గురించి చెప్పేది. ''బ్రహ్మం నాలోనే ఉన్నాడు ''అని సమయ శబ్దానికి అర్ధం. ఈ పద్ధతి లో శక్తిని ఉపాశించాలని చెబుతుంది. సమయ అంటే ''సహ మయ ''అని అర్ధం చెబుతారు.

కేన ఉపనిషత్ లోని ''ఉమ''సాక్షాత్కారాన్ని విపులీకరించే దే ''సౌందర్య లహరి '' కుండలిని జాగృతం చేసి, మూలాధారం నుంచి, పైకి తెచ్చి, షట్ చక్రాలను భేదం చేయించి, సహస్రారం లో చేర్పించటం ఇందులో చెప్ప బడిన ముఖ్య విషయం. కౌల మతం వారికి మూలాధారం లోనే ఉపాసన ఉంటుంది. సమయా చార సారమే సౌందర్య లహరి. నిర్గుణ బ్రహ్మాన్ని తెలుసు కోవటం సామాన్యులకు వల్ల కాని విషయం. అటు వంటి వారికి పర తత్వం సగుణ మైనదే అని శ్రీ శంకరులు అంటారు. బ్రహ్మం దాని కది గా నిష్ప్రాపంచికం గా, చూస్తే, నిర్గుణమే. అవాన్మానసమే. ప్రాపంచిక దృష్టి లో చూస్తే మాత్రం సగుణమే. బ్రహ్మం మాయ తో కూడి నప్పుడు ఈశ్వరుడు అవుతాడు అని తాత్పర్యం. భక్తుల కోసం దేవతా స్వరూపం ధరిస్తాడు. శివ, విష్ణు, దేవీ, సూర్య, గణపతి, కుమార స్వామి పూజా విధానాలను సంస్కరించి, ప్రార్ధనా శ్లోకాలను శంకరా చార్యుల వారు మనకు ఎంతో మేలు చేశారు. ఈ దేవతా మూర్తులు వేరైనవి కావు. పర తత్వ రూపాలే అని తెలియ జెప్పారు. ఇందులో యే దేవత నైనా స్వార్ధ త్యాగ బుద్ధి తో పూజిస్తే ఈశ్వరానుగ్రహం లభిస్తుంది. అప్పుడు అద్వైత భావన కలిగి ముక్తి లభిస్తుంది. వేద విరుద్ధ మైన వాటిని విసర్జించి, వేద విహిత మైనవీ, శుద్ధ మైన ఆగమ పూజలను ఆచార్యుల వారు అంగీక రించారు. అదే షణ్మత స్థాపన అని పెద్దలంటారు.

శ్రీ విద్య -లో జ్ఞాన, కర్మ లు కలిసే ఉంటాయి. ఇది క్రియ తో కూడిన అద్వైత సాధనం గా పరిగ ణిస్తారు. బ్రహ్మ విద్యా స్వరూపమే ఇది అని స్పష్టం చేస్తారు. శక్తి లేని శివుడు కర్తృత్వ హీనుడు. కనుక శక్తికే ప్రాధాన్యం. శివుడు శక్తి అవసరం లేకుండా నే సర్వ స్వతంత్రుడు. అనే ఈ రెండు భావాలకు సమతూకం లో ఆది శంకరులు సౌందర్య లహరి రచించారని ఇందులోని గోదార్ధ దర్శనం చేసిన శ్రీ తుమ్మల పల్లి రామ లింగేశ్వర రావు గారు తెలియ జేశారు. ''మాయాంతు ప్రకృతిం, విద్యాన్మాయి నంతు మహేశ్వరం -తరత్య విద్యాం వితథం హృది తస్మిన్నివేశితే ''అన్న దాని లో ''మిధ్యా జగదది ష్టాత్రి ''అనే అమ్మ వారి నామం లో భావం. శ్రీ విద్యనే మోక్ష విద్య అంటారు. ''ఆత్మా విద్యా, మహా విద్యా శ్రీ విద్యా, ''అని లలితా సహస్రనామాలలో ఉంది. ఆత్మా స్వరూపాన్ని చెప్పేదే.ఆత్మా విద్య మోక్ష విద్య అని చాందోగ్య ఉపనిషత్ చెబు తోంది. బ్రహ్మ విద్య అయిన ఆత్మా విద్య ను స్త్రీ రూపం గానే శంకరులు ధ్యానిన్చారని భావం.

సౌందర్య లహరి లో నిర్గుణ పర బ్రహ్మాన్ని వర్ణించ కుండా సగుణ రూపం లోనే ఆమె సౌందర్యాన్ని వివరించారు శ్రీ శంకరులు. నిర్గుణ పరబ్రహ్మాన్ని దాచి పెట్టి, దాని ప్రాపంచిక దృష్టికి కన్పించిన సృష్టి విలాసాన్ని వర్ని౦ చట మే శ్రీ శంకరులు చేసిన కవితా సౌందర్యం. దీన్నే అలంకార శాస్త్రం లో ''అపహ్నావ అలంకారం ''అంటారు. మనసుకు, వాక్కు కు గోచరించని, జగత్తుకు కారణం అయినట్టి, మొదటగా ప్రాదుర్భావించిన స్త్రీ రూపం గా కేన ఉపనిషత్ లో ''ఉమా దేవి ''గా చెప్పబడింది. ఉపనయన సమయం లో బ్రహ్మోప దేశాన్ని స్త్రీ రూపం గానే చేయటం మనకు ఆచారం గా వస్తోంది. బీజ ప్రాయం గా ''కేన ''లో ఉన్న శ్రీ విద్య సౌందర్య లహరి లో విస్తృతి చెందింది . ఇది మంత్ర, యంత్ర ప్రతీక రూప ఆరాధనం. మంత్రం వాక్కు కు సంబంధించింది. ప్రతీక మనస్సు కు సంబంధించింది. పూజ చేసేది కాయానికి. ఇవి వాక్, మన, కాయ త్రికరణాలు. దీనికి ప్రతీక శ్రీ చక్రమే నని భావన. ఇదీ సౌందర్య లహరి లో ప్రవేశించే ముందు మనకు అవగాహన కావలసిన విషయాలు. ఇక ఆ సౌందర్య ప్రవాహం లో మునిగి ఈదుతూ తేలియాడుదాం.

**1--''శివ శ్శక్త్యా యుక్తో, యది భవతి శక్తః ప్రభు వితుం --నాచే దేవం, దేవో న ఖలు కుశలః స్పందితు మపి అతస్త్వా మారాధ్యాం హరి హర విరించాదిభిరపి --ప్రణంతుం స్తోతుం వా, కధ మకృత పుణ్యః ప్రభవతి ''**

తాత్పర్యం --తల్లీ !సర్వ మంగళవు అయిన నిన్ను చేరితేనె, నీ నాధుడు శివుడు సర్వ ప్రాభవం తో, ప్రపంచాన్ని నిర్మిస్తున్నా డు. అలా కాక పోతే స్థాణువు అంటే కదల టానికే సామర్ధ్యం లేని వాడు అవుతాడు. అందుకే హరి, హర, బ్రహ్మ మొద లైన దేవతల చేత కొలువ బడే నీకు మ్రొక్కటం, నిన్ను స్తుతించటం పూర్వ జన్మ సుకృతం లేని వాడెవడూ చేయ లేడు.

విశేషం --శివుడు జగన్నిర్మాణశక్తి తో కూడిన వాడైనాడు. ఆయన అవిచ్చిన్నుడు. అవిద్య అయిన మాయ తో కూడిన వాడు. జగన్నిర్మానానికి శక్తి యుతుడైన పుడే ఆది సాధ్యం అయింది. లేక పోతే స్పందించ టానికి కూడా ఆయనకు సాధ్యం కాదు. శివ, శక్తులు భార్యా భర్తలు. జాయా పతులు. జాయా పతి, జాయ యొక్క శక్తి తోనే ప్రపంచ రూప సంతానాన్ని నిర్మించ గలదు. శక్తి లేక పోతే సంతాన ప్రాప్తి లేదు. శివుడు సర్వ మంగళుడు. అంటే జనన, మరణ మైన అమంగళం లేని వాడు అని అర్ధం.

శ్రీ చక్రం లో తొమ్మిది యోనులు ఉంటాయి. అందులో నాలుగు శివ సంబంధ మైనవి. అయిదు శక్తికి సంబంధించినవి. రెండు అర్ధ చక్రాలు గల తొమ్మిది యోనుల తో కూడిన శ్రీ చక్రమే ఇది. ఇది విశ్వ వ్యుత్పత్తి, స్తితి లయాలకు స్వరూపమే. పరుడు అంటే శివుడు శక్తి లేని వాడు అయితే సృష్టి స్తితి లయాలు చేయ లేడు. అందుకే వీరి అధి దేవత లైన విష్ణు, బ్రహ్మ, రుద్రులచే పూజింప బడే భ,గ వతి -ప్రపంచానికి తల్లి. ''ఆది ''అనటం లో వేద ధ్వని కని పిస్తుంది. శ్రీ విద్యోపాసకులు-- విష్ణు, శివ, మను, చంద్ర, కుబేర, లోపాముద్ర, అగస్త్య,స్కంధ, మన్మధ, ఇంద్ర, బల రామ, దత్తాత్రేయ, దుర్వాసాదులు. శ్రీ దేవుని స్తుతించ టానికి పూర్వ జన్మ సుకృతం ఉండాలి. ఇతర దేవతలను పూజించినా, ఆ దేవతలు శ్రీ దేవి అనుగ్రహం తోనే భుక్తిని, ముక్తిని ఇస్తారు. శ్రీ దేవి సేవ సర్వత్రా ఫల దాయకం. ఇతర దేవోపాసన కూడా శ్రీ దేవి ఉపాసనే

అవుతుంది. అన్ని వర్ణాలు శివ శక్తి మయాలే. దీన్ని పఠిస్తే సకల శ్రేయోభి వృద్ధి కలుగు తుంది అని ఫల శ్రుతి.

**2--" తనీ యామ్సుం పాంసుం, తవ చరణ పంకేరుహ భవం --విరిన్చిహ్ సంచిన్వన్, విరచ యతి, లోకాన వికలం**

**వహత్యేనం, శౌరిహ్, కధ మపి సహస్రేణ శిరసాం --హరః, సంక్షుద్యైనం, భజతి, భస్మో ద్ధూలిన విధిం ".**

తాత్పర్యం --అమ్మా !నీ పాద ధూళి రేణువు తగిలి, బ్రహ్మ దేవుడు చరా చర సృష్టి చేస్తున్నాడు. ఆ రేణువు నే, వేయి తలల తో అనంతు డైన విష్ణువు మోస్తున్నాడు. దానినే ఈశ్వరుడు భస్మం గా శరీరం అంతా పూసుకొంటున్నాడు.

విశేషం --శ్రీ దేవి పాద ధూళి యే, బ్రహ్మ, విష్ణు, శివ దేవులకు సృష్టి, స్తితి, లయ శక్తులకు కారణం అవుతోంది. ఆ మాయా గుణాలే, సత్వ, రజ, తమోగుణాలు. విష్ణువు శింశు మార (మొసలి )రూపంతో ఊర్ధ్వ లోకా లను ధరిస్తున్నాడు. శేష రూపం లో అతల మొదలైన అదో లోకాలను ధరిస్తున్నాడు. శివుడు భస్మ స్నానం చేస్తున్నాడు. అంటే పృధివి, నీరు అగ్ని, వాయువు ఆకాశం అనే పంచ భూతాలు భస్మం చేస్తున్నాడని భావం. "అగ్ని రితి భస్మం, వాయురితి భస్మం, జలమితి భస్మం, స్థల మితి భస్మం వ్యామేమితి భస్మం సర్వం హవా ఇదం భస్మమన ఏతాని చక్షూమ్సి భస్మాని "అని ఉంది.

పృధివి మొద లైనవి అమ్మ వారి చరణ ధూళి కణాలు అవుతుంటే, ఆమె స్వరూపం తెలుసు కోవటం ఒక్క శివ మహా దేవుడికే సాధ్యం అని అర్ధం. రజో గుణం అనే పంకేరుహం లో బ్రహ్మ సృష్టి చేస్తుంటే, శుక్ల చరణ పంకేరుహం తో విష్ణువు పోషిస్తుంటే, మిశ్ర చరణ పంకేరుహం తో శివుడు లయం చేస్తున్నాడని విశేషం. సృష్టికి ఉపాదాన కారణం "పరమాణువులు "అనీ, కణాదుడు గౌతముడు మొదలైన మహర్షులు సిద్ధాంతం గా ఎప్పుడో చెప్పిన సంగతి మనకు తెలుసు. వేదాంత భావన లో ఈశ్వర ఇచ్చాశక్తియే ప్రధాన కారణం అని చెబుతారు.

**3--- "అవిద్యానాం అంతస్తిమిర మిహిరోద్దీపన కరీ--జడానాం, చైతన్య స్తబక మకరంద శ్రుతిఝరీ దరిద్రానాం, చింతా మణి, గుణ నికా, జన్మ జలధౌ --నిమగ్నానాం, దంస్త్రా మురరిపు, వరాహస్య భవతి ".**

తాత్పర్యం ---జననీ !నీ పాద కమల రేణువు,లోపల ఉన్న అజ్ఞానం అనే చీకటికి సూర్య కిరణం లాంటిది. జ్ఞానం కలిగిస్తుంది. మంద బుద్ధులకు చైతన్యం అనే కల్ప వృక్ష పుష్పం యొక్క మకరందం. దీనులకు అన్ని కోర్కె లను తీర్చే చింతా మణి. జనన, మరణ, సంసార సముద్రం లో మునిగి ఉన్న వారికి యజ్ఞ వరాహ మైన విష్ణువు యొక్క దంష్ట్రం (కోర ).లలితా పరా భట్టారిక ను స్తుతిస్తే -అవిద్య, జడత్వం, దరిద్రం, జనన, మరణ భయాలు ఉండవు అని స్పష్ట పరుస్తున్నారు శంకర భగవత్పాదులు.

**4--"త్వదన్యహ పాణిభ్యా, మభయ వరదో, దైవత గణః --త్వమేకా, నైవాసి, ప్రకటిత, వరా భీత్య భినయా**

**భయాత్రాతుం, దాతుం, ఫలమపి, చ, వాన్చా సమధికం --శరణ్యే, లోకానం,తవహి, చరణా వేవ నిపుణౌ ".**

తాత్పర్యం -భవానీ ! ఇతర దేవతల చేతి లో అభయ వర ముద్రలు ఉన్నాయి. అందరి కంటే ముఖ్యురా లైన నీ చేతులలో ఆ ముద్రలసేవి లేనే లేవు. అయితే నేమి ?నీ పాదాలే, భయం నుంచి కాపాడి, కోరిన దాని కంటే ఎక్కువ ఇచ్చే అధిక సామర్ధ్యం కలవి. అవే మాకు దండి. పాశ, అంకుశ, ఇక్షు, బాణాదులే ఆమె హస్తాలలో ఉంటాయి. ముద్రాభి నయం అనేది లేదు కనుక ఆమె పాదాశ్రయమే భోగం, మోక్షం అని భావం.

**5--''హరిస్త్వా మారాధ్య, ప్రణత జన సౌభాగ్య జననీం --పురానారీ భూత్వా, పురరిపు మపి క్షోభ మనయత్**
**స్మరోపిత్వాం, నత్వా, రతి నయన లేహ్యన వపుషా--మునీనా మప్యంతః ప్రభవతి, హి, మోహాయ మహతాం.''**

తాత్పర్యం --శర్వాణీ !సౌభాగ్యాన్ని ఇచ్చే నిన్ను ఆరాధించే, పూర్వం విష్ణు మూర్తి మోహినీ రూపం ధరించి, త్రిపుర సంహారకు డైన మహేశ్వరుడిని కూడా మొహం చెందించాడు. శరీరమే లేని మన్మధుడు నీకు నమస్కరించి, భార్య అయిన రతీ దేవి కన్ను లతో ఆస్వాదించ దగిన శరీరం తో మునీశ్వరులనే మోహ పెడుతున్నాడు. నీ అనుగ్రహం లోకా ద్భుతం గా ఉంది. లలితా దేవిని స్మరిస్తే చాలు ఎంతటి కష్టమైనా పని నైనా చేసే సమర్ధత వస్తుంది అని భావం.

**6---''ధనుహ్ పౌష్పం, మౌర్వీ మధుకర మయీ, పంచ విశిఖాః--వసంతః సామంతో, మలయ మరుదా యోధన రథః**

**తదాప్యేకః,సర్వం, హిమ గిరి సు తే, కామపి, కృపాం --అపాఘ్గత్తే, లబ్ధ్వా, ,జగదిద,మనంగో విజయతే "**

తాత్పర్యం -పురాణీ !పూల విల్లు, తుమ్మెద గుమ్పులే అల్లే త్రాడు, అయిదు మాత్రమె పుష్ప బాణాలు, జడుడు,, సంవత్స రానికి ఒక సారి మాత్రమె కనీ పించే వసంతుడే చెలికాడు గా, గంధపు కొండ గాలి రధం గా, చేసుకొని మన్మధుడు, నీ కడ గంటి చూపు అనే కరుణ తో, అంతు లేని దయను పొంది, ,ఈ జగత్తు నంతా చేల రేగి జయిస్తున్నాడు.

విశేషం --పుష్పాలు అతి మెత్తనివి సుకుమారమైనవి. తాకితే వాడి పోయేవి. ఎప్పుడూ రోద చేస్తూ ఎగురుతుండే తుమ్మెదలు. ఇవన్నీ సమర్ధ వంత మైనవి కావు. అంటే వీటి పై నమ్మకం పెట్టుకోవ టానికి వీలు లేదు. కాని దేహమే లేని మన్మధుడు ప్రపంచం పై శ్రీ దేవి కరుణా కటాక్షం వల్ల విజ్రుమ్భించి అందర్నీ మోహ పర వశు లను చేయ గలుగు తున్నాడు. కారణం లేకుండానే కార్యం జరిగి పోతోంది. గడ్డి పరక మేరు పర్వతం గా, మూగ వాడు వాచాలుని గా, కుంటి వాడిని పర్వతాలను ఎక్కే సామర్ధ్యం కల వానిని గా లలితా త్రిపుర సుందరి చేయ గలుగు తుంది అని భావం.

**7---''క్వణత్కాంచీదామా, కరి కలభ, కుమ్భస్తన భరా --పరిక్షీణా మధ్యే, పరిణత, శరశ్చంద్ర వదనా**
**ధనుర్బాణాస్, పాశం, సృణీ మపి, దధానై, కరతలైహ్ -పురస్తా దాస్తాం నః, పురమధితు రాహో, పురుషికా''**

తాత్పర్యం --రుద్రాణీ !మెరిసే మణుల గజ్జల మొల నూళులు, గున్న ఏనుగు కుంభ స్థలాల వంటి చనులు కలిగి, సన్నని నడుము తో, వంగి, శరత్కాల వెన్నెల వంటి ముఖం తో, తామర తూడుల వంటి సుతి మెత్తని చేతులతో, చెరుకు విల్లు, పూల బాణాలు, పాశం, అంకుశం అనే ఆయుధాలను ధరించి, త్రిపుర సంహారకు డైన ఈశ్వరుని యొక్క అలంకార స్వరూపు రాలైన న శ్రీ దేవి మా ఎదుట సుఖా శీనురా లవుఅవు గాక.

విశేషం --త్రిపురా మంత్ర బీజాలను మదించి, నవనీతం అంటే వెన్నను తీసే వాడు త్రిపురారి అంటే శివుడు. శ్రీ దేవి స్తూల ఆకారాన్ని, మంత్ర రూప మైన సూక్ష్మ ఆకారాన్ని, పరా స్వరూప మైన మాయా కారాన్ని శ్రీ శంకరులు ఇక్కడ సూచించారు. ''పరమధితుం ''అనటం లో ఐం, క్లీ, సౌః, అనే త్రిపురా మాతృకా బీజాలను శివుడు ఉద్ద రించి, లోకాలను ప్రకాశింప జేశాడు అని అర్ధం. అ-అంటే బ్రహ్మ -హ -అంటే శక్తి ఈ రెండు కలిస్తే అహం -అంటే ప్రత్య గాత్మ అయిన పురుషుడు -అదే ''అహో పురిషికా ''అన్న మాటలో భగవత్పాదులు పొదిగారు. గజ్జల మొల నూలు మ్రోత -సాధకునికి ఆజ్ఞా చక్రం తర్వాత విని పించే నాదం అని భావం. సహస్రారం లో పరాశక్తి చంద్ర జ్యోత్స్న గా ప్రకాశిస్తుంది. దానినే ఆది శంకరులు ''పరి ణత శరశ్చంద్ర వదనా ''అనే మాటలో నిక్షిప్తం చేశారు.

**8 --- ''సుధా సింధు ర్మధ్యే, సుర విటపి, పాటీ పరి వృతా -మణి ద్వీపే, నీపోప వన వసతి చింతా మణి గృహే శివా కారే, మంచే, పరమ శివ పర్యంక నిలయం --భజంతిత్వాం , ధనయః, కతి చన, చిదా నంద లహరీ ''**

తాత్పర్యం --పరాశక్తీ !అమృత సముద్రం మధ్య లో, రత్నాల దీవిలో, కల్ప వృక్షాల తో పరి వేష్టించ బడిన కదంబ వృక్ష వనం లో, చింతా మణి నిర్మిత నగరం లో, శక్తి స్వరూపం అయిన త్రికోణా కార మంచం పై, పరమ శివుని ప్రక్కలో, ప్రకాశించే జ్ఞాన స్వరూపమైన, నిరతి శయ సుఖ ప్రవాహం గా ఉన్న నిన్ను కొంత మంది ధన్యు లు మాత్రమె సేవించ గలుగు తున్నారు.

విశేషం --శ్రీ చక్రం అంటే ''వియత్ ''చక్రం. ఆకాశ చక్రం అన్న మాట. అంటే ఇది ఆకాశ పూజ అన్న మాట. దహరా కాశ, బాహ్యాకాశ పూజ అని అర్ధం. పీఠం లో భూర్జ పత్ర, శుద్ధ వస్త్ర, సువర్ణ, రజత రేకుల పై శ్రీ చక్రాన్ని వ్రాసి, ఆరాధించా టాన్ని బాహ్యాకాశ పూజ అంటారు. హృదయాకాశం లో చేసే పూజ దహరా కాశ పూజ. శివాత్మ క మైన నాలుగు యోనులు అదో ముఖం కలవి. శక్త్యాత్మక మైన అయిదు యోనులు ఊర్ధ్వ ముఖం కలవి. ఈ తొమ్మిది యోనులు కలిగిన, శ్రీ చక్రం క్రింది ప్రదేశం లో ణి బిందువునే ''సుధా సింధువు ''అంటారు. బిందు స్థానం సుఖ సముద్రమే. అయిదు యోనులు కల్ప వృక్షాలు. అక్కడే కదంబం. దాని మధ్య మణి మంటపం. అందులో చింతా మణి గణం చేత నిర్మించ బడిన పీఠం ఉంటుంది. అక్కడే శక్తి రూప మైన మంచం మీద శివుడు దిండుగా, రమ్య మైన పాన్పు గా ఉన్న సదా శివుడు ఉన్నాడు. బ్రహ్మాదులు ఆయన్ను సేవిస్తుంటారు. ఇంద్రుడు తమ్మి ప డగ.అక్కడ పర మేశ్వరి అయిన మహా త్రిపుర సుందరీ దేవి ఉంటుంది. శివార్క మండలం ఛేదించి చంద్ర మండలాన్ని ద్రవింప జేస్తూ, ,దాని లో విని పించే అమృత తుల్య మైన పరమానందాన్ని పొందుతూ, కుల సుందరి, కులాన్ని త్యజించి, పరమ మైనద ర్శనాన్ని పొందు తోంది.

దేవీ మందిరం 43 కోణాలు గల శ్రీ చక్రం. దానికి. బ్రహ్మ, విష్ణు, రుద్రా, ఈశ్వరులు నాలుగు కోళ్ళు. మహేంద్రుడు తాంబూలం ఉమ్మి వేసే పళ్ళెం. కులం -- కుల మార్గ శుషుమ్నా నాడి మార్గం. అక్కడే చంద్ర మండలం లో నిలిచి, 72,000నాడులు అమృత వర్షా న్నిస్తూంటాయి. మళ్ళీ కుండలిని స్వస్థానం పొంది, స్వాదీష్టా నం లో నిద్రిస్తుంది. మూలాధారం లోని కుండలినీ శక్తి, సుషుమ్న ద్వారా, సహస్రారా నికి,వెళ్ళ బోతూ, దహర గత సూర్య మండలాన్ని చేదించి, బ్రహ్మ రంధ్రాన్ని కప్పి, అక్కడి చంద్ర మండలాన్ని ద్రవింప జేసి, అమృత వర్షం తో, సర్వ ప్రపంచాన్ని అంటే సాధకుడి నాడీ మండలాన్ని తడిపి, తృప్తి పొందు తోంది. శివుడు ''ఏ''ఆకారం. అదే ఏకాదశ స్వరం. అందు వల్లే ఆది త్రికోణం అయింది. పరమ శివుడు బిందువు. అక్కడ ఉండేది త్రికోణా కార మధ్య బిందు నిలయం. ఆమెను ధన్యు లైన వారే పూజించ గలరు. ఇదే శ్రీ శైలం లాంటి దేవాలయ దర్శనం అని రామ లింగేశ్వర శర్మ గారి అత్యన్తాద్భుత వ్యాఖ్య. అనాహత చక్రం పరమ కళ్యాణ రూపం. అదే పర్యంకం అంటే తోడ. అక్కడే చిదానంద లహరి ని దర్శిస్తారు.

**9---''మహీం మూలాధారే,కమపి, మణి పూరే , హుత వహం --స్థితం, స్వాధి ష్టానే, హృది మరుత, మాకాశ ముపరి**

**మనోపి, భ్రూ మధ్యే, సకల మపి, భిత్వా, కుల పథం --సహస్రారే , పదమే, సహ, రహసి, పత్యా విహరసే.''**

తాత్పర్యం --ఆది శక్తీ !మూలా ధారం లో పృధ్వీ తత్త్వం, మణి పూరం లో జల తత్త్వం, స్వాదిష్టానం లో అగ్ని తత్త్వం, అనాహతం లో వాయు తత్త్వం, విశుద్ధం లో ఆకాశ తత్త్వం, ఆజ్న లో మనస్తత్వంఉన్నాయి. ',సుషుమ్నను చేదించి, సహస్రారం లోని భర్త అయిన సదా శివుని తో సదా విహరిస్తున్నావు నువ్వు.

విశేషాలు --నాలుగు శివ చక్రాలు, అయిదు శివా అంటే లలితా దేవి చక్రాలు కలిసి శ్రీ చక్రం గా రూపు దాల్చింది. శివ చక్రం లో బిందు, అష్ట దళ, షోడశ దళ, చతుర్దశ దళ క్రమాలుంటాయి. ఈ కొణా, చక్రాలు శ్రీ దేవి ఆధార స్వరూపాలు. అమ్మా! నువ్వు త్రికోణ రూప శక్తివి. బిందు రూప శివుడిని నేను అని సాధకుడు భావిస్తాడు. మూలాధారం నుంచి ఆజ్ఞా చక్రం వరకు ఉన్న ఆరు చక్రాలకు ''కుల మార్గం ''అని పేరు. ఆ మార్గం లో సహస్రారం లో, సహస్ర దళ పద్మం పై పరమ శివుని తో రహస్యం గా భగ వతి విహరిస్తుంది. ఇది ధ్యాన యోగానికి ఉపాసనా విధానం. దీని వల్ల యోగ సిద్ధి కలుగు తుంది. మూలాధారంలో కుండలినీ శక్తి నిత్య నివాసి అని భావిస్తారు.

**10--- '' సుధా సారా సారై, శ్చరణ, యుగాళాన్తరవి గలితైహ్ ప్రపంచం, సిన్చంతే, పునరపి, రసామ్నాయ మహ్సా -**

**అవాప్స్త్వాం భూమిం, భుజగ నిభ మధ్యష్ట వలయం -స్వమాత్మానాం కృత్వా స్వపిషి, కుల కుండే, కుహరిణి ''**

తాత్పర్యం --కుమారీ !నీ రెండు పాదాల మధ్య నుండి స్రవించే అమృత ధారా వర్షం చేత, 72000నాడులను తడు పుతూ, దాన్ని అమృత కిరాణ కాంతి గల చంద్రుని వది లేసి, మళ్ళీ మూలాధారానికి చేరి, అందులో స్వ స్వ రూపం అయిన పాముల చుట్టలు గా చుట్టూ కోని, పృధ్వీ తత్వం లోని సన్నని రంధ్రం ద్వారా, కుండలినీ శక్తి పై, నువ్వు నిద్రిస్తావు.

విశేషం --శిరస్సు లో చంద్ర మండలం ఉంటుంది. ఇది పదహారు కళల తో ఉంటుంది. పైన కానీ పించే చంద్ర మండలం కూడా శ్రీ చక్రమే. పద్మాసనం పై కూర్చుని, సాధకుడు శ్వాసను ఊర్ధ్వ ముఖం గా నాడు పుతూ, కుంభకం లో మనసు ను నిలపాలి. లోపల వాయువును నిలపదాన్నే కుంభకం అంటారు. దీని వాళ్ళ స్వాధీ శతానం లోని అగ్ని జ్వలిస్తుంది. దాని వేడికి ''ఆహిరాట్ ''అనే కుండలినీ శక్తి మేల్కొంటుంది. ఆ శక్తి స్వాధిష్ఠాన, మణి పూరకళ మధ్య గల రుద్రా గ్రంధిని చేదించి, మణి పూరక, అనాహతాల మధ్య ఉన్న విష్ణు గ్రంధిని భేదించి, అనాహత, విశుదదాల మధ్య గల బ్రహ్మ గ్రంధిని, ఆరు మలాలను అనాగా ఆజ్ఞా చక్రాన్తాన్ని చేదిస్తుంది. ఆ తర్వాతా కుండలిని, సహస్రారం చేరి శివుని తో కలిసి, సంతోషాన్ని పొందు త్తుంది. ఈ స్తితి లో నిశక్తే పరాశక్తి. ఆమె నిత్య సుఖ ప్రదాయిని.

శివ, బ్రహ్మ శక్తులే అమ్మ వారి చరణాలు. ప్రకాశ విమర్శలు . ప్రకాశ శక్తి బ్రహ్మం, శుక్ల వర్ణం గా ఉంటుంది. విమర్శ- మూల శక్తి. రక్త వర్ణం లో ఉంటుంది. శక్తి తో కూడిన శివుడే ''పరా పాదుక ''గా భావింప బడుతాడు.

పాదుకాంత దీక్ష -విమర్శ రూప శక్తి, ప్రకాశ శివ సంగతి కలిసి సహస్రారం లో చేసేదే ఆనందామ్రుతాభి షేకం. పాదుకా మహా మంత్రాన్ని ఉప దేశం గా స్వీక రించటం, సర్వ ఔషధాలున్న కాషాయ స్నానం చేయటం, మాత్రమె పాదుకాంత దీక్ష కాదు. ఈ విధం గా సుధా సారాభి షెకాన్ని పొందిన వాడే పాదు కాంత దీక్షా ను భవం గల నిర్వాణ యోగ్యుడు అవుతాడు. అని దీని పై లోతులు తరచిన వారు తెలియ జేస్తున్నారు. కుండలిని 3,1/2మూడున్నర చుట్టలు గా ఉంటుంది.

**11---''చతుర్భిహ్, శ్రీ కన్థైహ్ శివ యువథిభిహ్, పంచభి రాపి --ప్రభిన్నాభిహ్, శంభోర్నవ భి రపి, ,మూల ప్రక్రుతిభిహ్**

**త్రయశ్చత్వా రిమ్ష, ద్వసు దళ, కళా శ్రీ, త్రివలయ --త్రిరెకాభిహ్, సార్ధం, తవ, శరణు కోణః పరి ణతః ''**

తాత్పర్యం --చాముండీ !నీ నిలయం అయిన శ్రీ చక్రం లో నాలుగు శివ కోణాలు, అయిదు శక్తి కోణాలు కలిసి తొమ్మిది మూల ప్రకృతుల చేత, అష్ట దళ, షోడశ కళ, త్రివలయ, భూ, పురత్రయాదు ల చేత 44 అంచులు గా మారింది. అయిదు శక్తి చక్రాలు -త్రికోణ, అష్ట దళ, దశ కోణ ద్వయ, చతుర్దశ కోణాలు అన్న మాట. నాలుగు శివ చక్రాలు --బిందు, అష్ట దళ, షోడశ దళ, చతురస్రాలు.

విశేషం --శ్రీ చక్రానికి మూల కారణాలైన తొమ్మిది చక్రాలు ప్రపంచ నిర్మాణ కారణాలైన తొమ్మిది దాతువులే. చర్మ, రక్త, మాంస, మేధ, ఆస్తులు ఈ అయిదు శక్తి సంభూతాలు. మజ్జ, శుక్ల ప్రాణ, జీవాలు నాలుగు శివ సంజాతాలు. అలాగే పంచ భూత, పంచ తన్మాత్ర, పంచ జ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు మనశ్శక్తి సంబంధాలు. మాయ శుద్ధ, విద్య, మహేశ్వర సదాశివ లు శివ శక్తికి సంబంధించినవి. ఇలా25 తత్వాలు కలిసిన 9 కోణాలే బ్రహ్మాండ, పిండాండ నిర్మాణానికి ఆధారం అని విజ్ఞులు చెబుతున్నారు.

అహంకారం మనసులో, ఖ్యాతి విద్య లో, గుణాలు ప్రకృతి లో, ప్రకృతి శక్తి లో అంతర్భావాలు. పురుషుడు మహేశ్వరుని లో, ''కళకు శుద్ధ లో ''అంతర్భావం. కాలానికి మహేశ్వరుని లో, సదాశివుని లో శక్తికి శుద్ధ విద్య లో అంతర్భావం. శివ తత్త్వం సదా శివ తత్త్వం లో అంతర్భావం.

అయిదు భూతాలు, అయిదు తన్మాత్రలు, అయుదు జ్ఞానేంద్రియాలు, అయిదు కర్మేంద్రియాలు , మనసు, మాయ, శుద్ధ విద్య, మహేశ్వర, సదాశివ లతో కూడిన25 తత్వా లవల్ల ఆత్మ ఏర్పడు తుందని వేదోపనిషత్తులు తెలియ జేస్తున్నాయి. ''పంచ వింశ ఆత్మా భవతి ''అని చాందోగ్య ఉపనిషత్ అంటోంది. వీటన్నిటికీ అతీత మైంది శివ శక్తి సంపుటం అయిన శ్రీ చక్రం, దీని వల్ల నే జగత్తు ఉత్పత్తి అవుతోంది. పరమేశ్వరుడు శక్తి తో కలిసి నపుడే కార్య కారణ సమర్ధుడు అవుతాడు. ఇన్ని విషయాలను ఒక్క శ్లోకం లో నిక్షిప్తం చేసి, విశ్వ సృష్టి రహస్యాన్ని, అమ్మ వారి శక్తి సామర్ధ్యాన్ని తెలియ జేశారు శ్రీ శంకర భగ వత్పాదులు.

**12--- ''త్వదీయం సౌందర్యం, తుహిన గిరి కన్యే, తులయితుం --కవీన్ద్రః కల్పంతే, కధ మపి, విరించి, ప్రభ్రుతయః**

**యదా లోక్యౌ త్సుక్యా, దమర లలనా యాంతి మనసా --తపో భిర్దు ష్ప్రా పామపి, గిరిశ, సాయుజ్య పదవీం''**

తాత్పర్యం --ఓ పార్వతీ మాతా !నీ అందాన్ని వర్ణించ టానికినాలుగు ముఖాలున్న బ్రహ్మాదుల వల్ల కూడా కాదు. బ్రహ్మ సృష్టించిన లోకోత్తర సౌందర్య రాశు లైన రంభాది అప్సరసలు నీ చక్కదనానికి ప్రభావితు లై, నిన్నే తదేక ధ్యానం తో అలా చూస్తూ ఉండి పోతారు. వారు శివ సాయుజ్యం పొంద టానికి మనసు లోనే భావించటం వింత గా ఉంటుంది. వేరే పూజ వారికి అక్కర లేదని పిస్తుంది.

నీ సౌందర్యం తెలిసిన వాడు శివుడు ఒక్కడే. ఆయనతో మానసిక ఐక్యత కోరి, శ్రీ దేవి సౌందర్యాన్ని పూర్తిగా చూడాలను కొనే వారు అప్సరసలు. నీ సౌందర్యానికి మించిన సౌందర్యం ప్రపంచం లో లేనే లేదు. నీ ధ్యానం తో నానా భోగాలను అనుభవించి, శివ సాయుజ్యం పొంద వచ్చు.

**13--- '' వరం వర్షీ యామ్సం, నయన విరసం, నర్మ సు జడం --తావా పాఙ్గా లోకే, పతిత, మనుధావంతి శత సహః**

**గళద్వేణీబంధః, కుచ కలశ, విస్రస్త, సి చయా --హఠాత్, త్రుట్యత్కాం చ్యో , విగలిత,యువ తయః ''.**

తాత్పర్యం --కాత్యాయినీ !ముసలి వాడై, కంటి చూపు కూడా లేకుండా, శృంగార భావం నశించిన వాడు కూడా నీ కడ గంటి చూపు తో నవ మన్మధుడై స్త్రీ లను ఆకర్షించే శక్తి సంపన్నుడు అవుతున్నా డు. అంతటి సామర్ధ్యం నీ కడ గంటి చూపుకు ఉంది.

**14---''క్షితౌ, షత్పంచాశ, ద్విసమధిక, పంచాశాదుదకే --హుతాశే, ద్వే షష్టి శ్చ తురధిక, పంచా దనిలే దివి, ద్విషత్రిమ్శన్మన సిచ, చతు స్షష్టి రితియే --మయూఖా, స్తేషా మప్యుపరి, తవ, పాదాంబుజ యుగం''**

తాత్పర్యం --పృధ్వీ తత్త్వం తో కూడిన మూలాధారం లో 56,జల తత్వ మైన మణి పూరకం లో 52,అగ్ని తత్వ మైన స్వాదిష్టానం లో 62,వాయుతత్వ ప్రధాన మైన అనాహతం లో 54,ఆకాశ తత్వ మైన విశుద్ధం లో 72,మనస్తత్వం కల ఆజ్న లో 64,కిరణాలు సాధకుని దేహం లో ప్రసిద్ధి చెందాయి. వాటి పైన ఉన్న సహస్ర దళ మధ్యమ లో, చంద్ర బిమ్బాత్మక మైన బైందవ స్తానం లో, సుధా సింధువు లో, నీ అడుగుల జంట నర్తిస్తోంది. ఇదంతా సమయా చార సంప్ర దాయం గా భావించాలి.

విశేషం --మూలాధార, స్వాధీ ష్టానాలు ఒక ఖండం. మణి పూరక అనాహతాలు రెండవ  ఖండం. విశుద్ధ, ఆజ్ఞలుమూడవ ఖండం. మొదటి ఖండానికి పైన అగ్నిస్థానం ఉంటుంది. ఇదే రుద్రా గ్రంధి అంటారు. రెండవ ఖండం పైన సూర్య స్తానం ఉంటుంది. ఇదే విష్ణు గ్రంధి. మూడవ ఖండం పైన చంద్ర స్తానం ఉంటుంది. ఇదే బ్రహ్మ గ్రంధి. ఇదే సోమ, సూర్య, అనలాత్మకం అని అవరోహణ క్రమం లో (కింది నుంచి పైకి )చెబుతారు. ప్రధమ ఖండం లోని అగ్ని జ్వాల అంతటా వ్యాపిస్తుంది. రెండవ ఖండం లోసూర్య కిరణ ప్రసారం జరుగు తుంది. చంద్రుడు తన కళ ల చేత మూడవ దాన్ని ప్రకాశింప జేస్తూంటాడు.

మూలాధారం లోపృధ్వి, అగ్ని  జ్వాలలు56, మణి పూరకం లో ఉదక జ్వాలలు 52,కలిసి మొత్తం108 అగ్ని జ్వాలలు. స్వాదిష్టానం లో అగ్ని తత్వాత్మక జ్వాలలు 62,అనాహత వాయు తత్వాలు54, కలిసి సూర్య కిరణాలు 116.సూర్య కిరణాలు మణి పూరకం వదిలి, స్వాధీ శతానం చేరటం అంటే సూర్యుడు, అగ్నీ ఒక్కరే నాన్న భావాన్ని తెలియ బర్చతమే. అంటే సూర్యునిలో అగ్ని అంతర్భావం అని అర్ధం. సూర్య స్థానం లో అగ్ని, అగ్ని స్థానం లో సూర్యుడు ప్రవేశిస్తారు అని తెలుసుకోవాలి. అగ్ని ని శమింప జేయ టానికి ''సంవర్తం ''అనే మేఘం సూర్య కిరణాల వాళ్ళ పుట్టి వర్షాన్నిస్తుంది.

ఆకాశాత్మక మైన విశుద్ధం లో 72,మనస్త్వాత్మక మైన ఆజ్న లో 64కలిసి 136 చంద్ర కళలు. అగ్నికి 108 జ్వాలలు, సూర్యునికి116.కిరణాలు, చంద్రునికి136 కళలు అని తెలియ దాగిన విషయం. ఈ విధం గా సోమ సూర్య అగ్నులు అంద, పిండ, బ్రహ్మాన్డాలను ఆవరించి ఉన్నారని భావం. పిందాన్డానికి అతీతం గా, సహస్ర కమలం ఉంది. ఆది వెన్నెల సముద్రం. అక్కడి చంద్రుడు నిత్య కళా స్వరూపి. సహస్ర దళ కమలం లోని చంద్రునికి వృద్ధి, క్షయం అనేవి ఉండవు. 16వాడి అయిన చంద్ర కళ ''సదా ''అనే పేరుతో సహస్రారం లో ఉంటుంది. మొదటి 15కు వృద్ధి క్షయాలున్నాయి.

" పంచాతిధి "రూపం ఉండటం వాళ్ళ శ్రీ విద్య కు "చంద్ర కళా విద్య " అనే పేరు వచ్చింది 360.కిరణాలు కలిస్తే, 360రోజులు ఉన్న సంవత్సరమే అవుతుంది. దీనికి రూపం "ప్రజాపతి ".ఆయనే జగత్కర్త. కనుక కిరణాలు ఈ జగత్తును సృష్టించ టానికి కారణం అవుతున్నాయని భావం. ఇవి స్రేఏ దేవి పాడార విండ సంభావాలు. "మరీచిః స్వాయమ్భువః "అని తైత్తిరీయ ఉపనిషత్తు యొక్క సారమే ఇదంతా.

సూర్య చంద్రాగ్నులు భగవతి పాడార విన్దాల నుండి ప్రభవించిన అనంత కోటి కిరనాలనుంది కొన్నిటిని మాత్రమె తీసుకొని జగత్తును ప్రకాశిమ జేస్తున్నాయి. అయితే సర్వ లోకాలకు అతీత మైన చంద్ర కళా చక్రం మే బైండవ స్థానం. అక్కడే శ్రీ దేవి చరనాముజాలున్నాయి. అంటే అనేక కోటి బ్రహ్మాండ, పిండాండ ల పై భగవతి పాద పద్మాలు నర్తిస్తున్నాయని తెలుసు కోవాలి. "తమేవం భాంతం, అనుభాతి సర్వం తస్య భాషా సర్వ మిదం విభాతి "అని కథోపనిశత్ తెలియ జేస్తోంది. అదే ఇది.

పగలు సూర్యుడు, రాత్రి చంద్రుడు, సంధ్య వేల అగ్ని ప్రకాశిస్తాయి. ఈ కిరణాల మొత్తం360 అని ముందే చెప్పుకొన్నాం. అదే ప్రజాపతి అంటే 360రోజులున్న సంవత్సరం. ఆయన మరీచి మొదలైన మునులను సృష్టిస్తే, వారు లోక పాలకులను సృష్టిస్తే, వారంతా లోకాలను రక్షిస్తున్నారని భావం. జగత్ సంహారం "హరుడు "చేస్తాడు. భవుడు జగత్తు ను ఉత్పత్తి చేస్తాడు. మ్రుడుడు జగత్తును రక్షిస్తాడు. ఈ విధం గా సృష్టి స్తితి, లయలు పరమేశ్వరి నియమం తో శివుడు చేస్తున్నాడని అర్ధమయ్యే విషయం. కంథం'లో విశుద్ధం, హృదయం లో అనాహతం, నాభి లో స్వాదిష్టానం, లింగం లో మణి పూరకం గుదం లో మూలా ధారం ఉన్నాయి. ఇన్ని విషయాలను ఎరుక పరచ టా నికే ఈ శ్లోకాన్ని పరమ రమణీయం గా, నిగూఢం గా, తెలుసు కొనే వారికి తెలియ దగి నంతగా, లోతులు తరచే వారికి ప్రజ్ఞా నిది సమూహం గా భగవత్పాదులు ఈ శ్లోకం రాసి తరింప జేశారు

**15--"శర జ్యోత్నా శుద్ధం, శశి యుత, జటా జూట మకుటం --పరస్త్రాస త్రాణ స్పటిక ఘటికా పుస్తక కరాం సక్రున్న త్వా, నత్వా, కధమివ, సతాం సన్ని దధతే --మధు క్షీర ద్రాక్షా, మధురి మధురణాహ్ ఫణి తయః "**

తాత్పర్యం --త్రిపురసుందరీ !శరత్ పూర్ణిమ వంటి శుద్ధ మైన శరీరం కల దానివి. చిన్న జాబిల్లి తో కూడిన జడ ముడి ఉన్న కిరీటం కల దానివి. సకలాభీష్టం ఇచ్చే వర ముద్ర, భయం పోగొట్టే అభయ ముద్ర స్పటికాక్షర మాల, విద్యా రూప పుస్తకం ధరించిన నిన్ను ఒక్క సారైనా నమస్కరించిన వారికి, తేనె, ఆవు పాలు, ద్రాక్షా ఫలం తో సమాన మైన మాధుర్యం కలవాక్కును, కవిత్వాన్ని అందజేస్తావు.

విశేషం --శ్రీ దేవి క్రియా శక్తి స్వ రూపిణి. మూడు వేదాల లోని మొదటి అక్షరాలూ కలిస్తే. "ఐం "అనే బీజం ఏర్పడుతుంది. దీనినే "వాగ్బీజం "అంటారు. దీన్ని జపిస్తే, సర్వ విద్యా, కవిత్వ లాభం కలుగుతుతాయి. .ఇదే "దుర్గా నవాక్ష రాలు "లో "మహాకాళి బీజం". కాళిదాసు ఈ బీజక్షరాన్ని జపించే మహా కవి అయాడు. "చిద్గగన చంద్ర కళ"లో కాళిదాస మహా కవే స్వయం గా చెప్పుకొన్నాడట. నాలుగు హస్తాలు, నాలుగు పురుషార్ధాలకు చిహ్నాలు. వర ముద్ర -కోరికలను తీర్చటానికి, అభయ ముద్ర- భయం లేకుండా

చేయటానికి, సంసార భయ నివారణ చేసి, జన్మ రాహిత్యం కలిగించ టానికి, జప మాల సర్వ తపస్సిద్ధి నిస్తుందని, పుస్తకం- సర్వ విద్యా ప్రదత్వానికి గుర్తు అని భావించాలి.

**16--''కవీన్ద్రానాం చేతః కమల వన బాలాతప రుచిం --భజన్తే ఏ సంతః కతిచ, దరుణా మేవ భవతీం విరించి ప్రేయస్యాస్తరళ తర శృంగార లహరీ - గాభీరాభిర్వాగ్భిర్విదధతి సతాం రంజన మమీ ''**

తాత్పర్యం --అమ్మా సౌందర్య లహరీ !కవీశ్వరుల మనస్సు అనే పద్మ వనానికి నువ్వు బాల సూర్య ప్రభవు. అరుణవు. ఏ కొందరో సత్పురుషులు నిన్ను కొలువ గలుగుతున్నారు. వారు మాత్రమే పుంభావ సరస్వతులు అవుతున్నారు. అందుకే వారు సభా రంజనం చేయ గల సమర్దులౌ తున్నారు.

ఆమె సరస్వతీ ప్రతీక స్వరూప. అరుణం శృంగార రసానికి చిహ్నం. వాక్కు తో చేసే జప మహిమను ఇక్కడ శంకరులు వివ రించారు. .రెండవది ''కామ రాజ కూట జప ఫలం ''అని విజ్ఞులు తేల్చారు. దీనికి ''గుప్త మహా సారస్వత మంత్రం ''తురీయం గా భావిస్తారు. అ దే ''ఈం''బీజం అంటారు.

**17--''సవిత్రీ భిర్వాచాం, శశి మణి శిలా భంగ రుచిభిహ్ --ర్వశిత్వా ద్యాభిస్త్వాం, సహ జనని, సంచిత యతి యః**

**స కర్తా కావ్యానాం, భవతి, మహాతాంభంగి రుచిభిహ్ --ర్వచో భి ర్వాగ్దేవీ వదన, కమలా మోద మధురైహ్ ''**

తాత్పర్యం --మహేశ్వరీ !చంద్ర కాంత మణి కాంతులతో శ్రీ చక్రం లో, సర్వ రోగ హర చక్ర స్వామినులు అయిన వశిని, కామేశ్వరి మొద లైన అష్ట శక్తు లతో, 12మంది యోగినులతో, గంధా కర్శిణి తో, కూడిన నిన్ను ఎవరు ధ్యానిస్తారో, వారు కాళి దాసు లాంటి మహా కవీశ్వరులై, మహా శక్తి వంత మైన కావ్యాలను రచించి చిర కీర్తిని పొందుతారు.

విశేషం --ఎనిమిది శక్తులు --వశిని, కామేశ్వరి, మోదిని, విమల, అరుణ, జయిని, సర్వేశ్వరి, కౌలిని.

వసివ్యాదులు అంటే -క వర్గ, చవర్గ, ట వర్గ, త వర్గ, ప వర్గ, య వర్గ, శవర్గ ళ తో కూడిణ అక్షరాలూ

**12యోగి నులు-అంటే -విద్యా, రేచికా, మోచికా, యోగినీ, అమృత యోగినీ, దీపికా జ్ఞాన, ఆప్యాయినీ, వ్యాపినీ, మేధా, వ్యోమ రూప, సిద్ధ రూప లక్ష్మీ యోగినులు.**

8వశినులు, 12యోగినులు కలిసి20 కళలు.శుద్ధ స్పటికం లాగా అని పించేవి. గందాకర్శిణిఅంటే -గందాకర్శిణి, రసా కర్శిణి,రూపా కర్శిణి, స్పర్శా కర్శిణి.''గంధ ద్వారాం ధురాకర్షాం నిత్య పుష్టం కరీషినీం-ఈశ్వరీం సర్వ భూతానాం, తా మిహోపహ్వయే శ్రియం ''అని పూజా విధానం లో ఉన్నది ఈ నలుగురి తో కూడినదే ''గంధ ద్వారా ''.దురాధర్షాంఅంటే మంద మతులు సమీపించ రానిది. నిత్య పుష్ట అంటే -అను నిత్యం ఆనంద స్వరూపిణి గా ఉండేది. కరీషినీంఅంటే గంధాదులను ఆకర్షించే శక్తి కలది. లేక ఏనుగుల చేత పరి వేష్టింప బడేది. ఈశ్వరీం --సర్వ భూతాది దేవత అని అర్ధం. తాం -అంటే ఆమేను అంటే శ్రీ విద్యన, ఇహ అంటే ఈ చక్రం లో ఉపహ్వయే -అంటే ఆహ్వానిస్తున్నాను.

అ మొదలైన సర్వ శక్తులు స్పటికాల వలె శుద్ధ మైనవి. క నుండి మ వరకు పగడపు రంగు కలవి. య నుండి ళ వరకు పసుపు రంగు కలవి. క్ష -ఎరుపు రంగు కలది. అకారాదులు బూడిద రంగు లోను, క నుండి ధవరకు సింధూరం రంగు లోను, డనుండి ఫ వరకు అక్షరాలూ తెలుపు రంగులోను, బ నుండి ళ వరకు అరుణం రంగులో, వ నుండి స వరకు వర్ణాలు బంగారం రంగు లోను, హ నుండి క్ష వరకు అక్షరాలూ ఎరుపు రంగు లోను ఉంటాయి., ళఅక్షరం లలోని భాగమే. ఇదే శ్రీ శంకరుల మతం అని శ్రీ తుమ్మల పల్లి వారు విశేష వ్యాఖ్యానం చేసి ఎరుక పరిచారు. ఇలా ప్రతి అక్షరానికి క ప్రత్యేక ఫలితం రంగు వున్నాయి అని తెలుస్తోంది.

వచస్సులు --అంటే శుభగ, శోభన, భగ, ఐశ్వర్యాదులు అని నాలుగు రకాలు. ఇవి మధురం గా, సరస్వతీ దేవి ముఖ కమలం నుండి వినిర్గతమవుతాయి. ఇవి చాలా మృదువు గా ఉండటం విశేషం. ఈ విధం గా ఆమెను ధ్యానిస్తే కర్తా, నిర్మిత కూడా అయి, కావ్య రచన చేస్తాడు అని భావం.

**18--''తను చ్చాయాయాభిస్తే, ,తరుణ తరణి శ్రీ సరణిభిహ్ --దివం సర్వా ముర్వీ, మరు మణి, నిమగ్నా నాం స్మరతియః**
**భవ్యన్త్యస్య త్రస్య ద్వహన హరిణ శాలీన నయనాః --సహోర్వస్యః కతి కతి న గీర్వాణ గణికాః''**

తాత్పర్యం --ఉమా దేవీ !ఉదయ సంధ్య లోని ఎరుపు రంగు తో, నీ శరీర కాంతి ఈ భూమిని, ఆకాశాన్నీ అరుణిమ గా భావించి, ఎవరు ధ్యానిస్తారో, వారికి అప్సరస స్త్రీలు వశమవుతారు. ఊర్వశిని విష్ణువు తొడల నుండి (ఊరువు )సృష్టించాడని ఐతిహ్యం.

**19--''ముఖం బిందుం కృత్యా కుచయుగ మదన్యస్థా తదధో --హరార్ధం ధ్యాయే ద్యో హర మహిషి, తే, మన్మధ కలాం**
**ససద్య స్సంక్షోభం, నయతి, వనితా, ఇత్యతి లఘు --త్రిలోకీ మప్యాసు భ్రమ యతి, రవీందు స్థనయుగాం. ''**

తాత్పర్యం --శ్రీ చక్ర వాసినీ !ముఖాన్ని బిందు స్థానం లో కల్పించి, దానికి క్రిందుగా, స్థన యుగ్మాన్ని చేసి, దానికి క్రింద శివుని శరీరం లో సగం అయిన శక్తిని అంటే త్రికోణం గా భావించి, దాని లో నీ కామ బీజాన్ని (క్లీం )ఎవడు ధ్యానిస్తాడో వాడు స్త్రీల మనసుల్నిరంజింప జేస్తాడు. ఎందుకంటె -సూర్య చంద్రులే చనులు గా ఉన్న స్వర్గ, మర్త్య, పాతాళ లోకాలను భ్రమ తో నువ్వు మోహ పెడుతున్నావు.

విశేషం --క్లీం అనేది మన్మధ బీజం గా చెబుతారు. దీన్ని ధ్యానిస్తే కావలసిన స్త్రీ భార్య గా లభిస్తుందని శాస్త్రం చెబుతోంది. బిందువు ముఖం. దాని కింద స్థానాలు. దాని కింద యోని ని అదో ముఖం గా ధ్యానించాలి. తురీయ స్వరూపం ''ఈం ''దీన్ని జపించే టప్పుడు పై బొట్టు రవి అంటే సూర్యునిగా, కింది బొట్టు చంద్ర, అగ్నులు గా (కుచాలు )భావించాలి. రవి రూపం గా ఉన్న బిందువే ముఖం. కిందివి రెండు స్థానాలు. ''హ'' కారార్ధం యోని రూపం లో ఉంటుందనిఅక్షర నిపుణులు అంటారు. '' హ ''అంటే సంస్కృతం లోని హకారం. హ కారం శివ వాచికం గా చెబుతారు. హకారార్ధమే ''ఏ''-ఇది పార్వతీ వాచకం గా భావన

చేస్తారు. "శివ "లోని"వ్ శ్"తీసేస్తే మిగిలేవి ఇ,అ. ఈ రెండు కలిస్తే" ఏ"ఏర్పడుతుంది. ఇదే సంస్కృతం లోని త్రికోణా కృతి.

**20---"కిరంతీ మంగేభ్యః కిరణ నికురంబామృత రసం --హ్రుదిత్వా, మాధత్తే,హిమ కర, శిలా మూర్తి మవయవః**
**ససర్పాణాం, దర్పం, శమయతి, శాకున్తాధిప ఇవ --జ్వర ప్లష్టాన్, దృష్ట్యా, సుఖ యతి, సుధా సార సిరయాః"**

తాత్పర్యం --శివ మనోహరీ !నీ సర్వ అవయవాల నుండి, స్రవించే కిరణాలు అమృతాన్ని వర్షించే, చంద్ర కాంత మణి మయం గా ఎవడు ధ్యానిస్తాడో,అతడు గరుత్మంతుని లాగ, అన్ని రకాల పాములనుండి వచ్చే విష బాధలను పోగొట్ట గల సమర్దుడౌతాడు. జ్వరం తో ఉన్న వారికి అమృత ధార గా తన శీతల స్పర్శ తో బాధను తొలగించి సుఖం ఇవ్వగలుగు తాడు.

ఈ విధం గా ఆరు నెలలు ధ్యానిస్తే గరుత్మంతుని తో సమాన మవుతాడని శాస్త్రం. దృష్టి చేత లోకాన్ని ఆకర్షిస్తాడు. చూపులతో స్త్రీ లను వశం చేసుకో గలుగు తాడు. సర్పాదుల వల్ల భయాన్ని పోగొట్టగల సమర్దుడౌ తాడు.

**21--"తటిల్లెఖా తన్వీం, తపన శశి వైశ్వానర మయీం --విషన్నానాం, షన్నా మప్యుపరి కమలానాం తవ కలాం**
**మహా పద్మాటవ్యం, మ్రుదిత మలమాయేన మనసా --మహాన్తః పశ్యంతో దదతి, పరమాహ్లాద లహరీం ".**

తాత్పర్యం --హ్లాదినీ !మెరుపు తీగ లాగా సూక్ష్మమై, పొడవైనదై,ఆజ్ఞా మొద లైన పన్నెండు వరకు క్షణ విలాసనం కలిగి,సూర్య, చంద్రాగ్ని సార మైన ది అయిన, పరాఖ్య ఐన నీ కళను, ఆరు పద్మాల పై, సహస్రారం అనే మహా పద్మ వనం లో కూర్చున్న దాన్ని, అవిద్యా మొద లైన అహంకారాలు, మాయ లేని మనసు తో ధ్యానించే సజ్జనులు పరమా నంద ప్రవాహా మయులై విల సిల్లు తున్నా రు.

విశేషం --ఇది ఉత్తమాధి కారు లైన సాధకుల లక్షణం. కింది నుండి పైకి, విద్యా పంచాదశాక్షరాలను ఒక దానితో ఒకటి లయం అవుతూ, 15వదిఅయిన మూడు బిందువులతో కూడిన త్రికోణం లో లీన మయ్యే ధ్యాన విధానం ఇప్పుడు చెప్పబడినది అంతా. బిందు త్రయం, సోమ, సూర్య, అనలాత్మకం. సూర్యుడు అగ్ని లో, అగ్ని చంద్రుని లో, సోముడు "స" తో కూడిన పదార్ధ కళ లో ( సకారానికి హకారం లో )లీనం కాగా, సాధకుడు శివ శక్తి మేళ వింపు లో సదా శివుని లో ఐక్యమై, జీవన్ముక్తుడు అవుతున్నా డు.

శ్రీ దేవి నే "తపన, శశి, వైశ్వానర మయీ "అంటారు. సోమసూర్య అగ్ని లయాత్మకం అని భావం. అంటే అవన్నీ ఆ పర దేవతే అని అర్ధం. వారికి విడి గా ప్రత్యేక మైన ఉనికి లేదు అని భావన. "షన్నాం ఉపరికమలానాం విషన్నాం"అంటే ఆరు కమలాల పైన ఆసీన అయిన అమ్మవారు. సహస్రార,

పద్మా రూఢ, పరాకార రూపా, చంద్ర కళా అయిన శ్రీ దేవి ని ధ్యానించి, బ్రహ్మానందాన్ని పొందుతున్నారు సాధకులు.

**22---'' భవానీ త్వం, దాసీ మయి, వితర దృష్టిం స కరుణా --మితి స్తోతుం, వాంచస్, కథ యతి, భవానీ, త్వ మితియః**

**తదేవత్వం. తస్మై, దిశసి, నిజ సాయుజ్య పదవీం --ముకుంద బ్రహ్మేంద్ర స్ఫుట మకుట నీరాజిత పదం ''**

తాత్పర్యం --కరుణా మయీ !నీ కరుణా కటాక్షం నా పై ప్రస రింప చెయ్యమని ఎవరు స్తోత్రం చేస్తారో, నిన్ను ''భవానీ - నీవు ''అనే రెండు మాటలు అనే లోపే బ్రహ్మ, విష్ణు మొద లైన దేవతల కిరీటాల మణు లతో, నీరాజనం చేయ బడే నీ పాద పద్మాలు కలది అయిన సాయుజ్య పదవిని వానికి అనుగ్రహిస్తావు. అంత త్వరగా నీ అనుగ్రహం నిన్ను నమ్మిన వారికి కలుగుతుంది.

విశేషం --''త్వం ''అంటే త్వమేవాహం అనే మహా వాక్య ప్రయోగమే. అంటే జప, తపాల కంటే, తాదాత్మ్యం అనే సంభావనే ఫలితాన్నిస్తుంది. బ్రమాదులు కూడా పాదార్చకులు గా ఉంది, సాయుజ్య లాభం లేకుండా, నిల్చి ఉన్నారని భావం. సకల మనో రధాలను శ్రీ దేవియే అనుగ్ర హిస్తుంది. పరమాత్మ లోకం చేరతానని సా లోక్య ముక్తి అంటారు. సన్నిధి లోకి చేరటం సామీప్య ముక్తి. పరమాత్మ తో సమాన రూపం పొందటం సా రూప్య ముక్తి. పర మాత్మ లో ఐక్యం అవటం సాయుజ్య ముక్తి.

ద్వైతులకు సామీప్య ముక్తి ఉత్తమం. వశిష్టా ద్వైతులకు సారూప్య ముక్తి శ్రేష్టం. అద్వైతులకు సాయుజ్యమే ముక్తి మోక్షం. దీనినే శ్రీ శంకరులు'' శివా నంద లహరి ''లో వివరించారు ''సాలోక్యం తవ పూజనే శివ మహాదేవేతి సంకీర్తనే --సామీప్యం, శివ భక్తీ దుర్య జనతా సాంగత్య సంభాషణే--సారూప్యం, చ, చరా చరాత్మక, తను ధ్యానే, భవానీ పతేహ్ --సాయుజ్యం , మమ చిత్ర మత్రా భవతి స్వామిన్, క్రుతార్ధో స్మ్రహం '

**23--''త్వయా హృత్వా వామం, వపుర పరి త్రుప్తేన మనసా --శరీరార్ధం, శంభో, రపర మపి, శంకే హృత మభూత్**

**యదె తత్వ ద్రూపం, సకల మరునాభ స్త్రినయనం --కుచాభ్యా మానమ్రం కుటిల శశి చూడా ల మకుటం.''**

తాత్పర్యం --హిమ గిరి పుత్రీ !నీవు శివ మహా దేవుని శరీరం లో ఎడమ భాగార్ధాన్ని ఆక్ర మించావు. దానితో తృప్తి పడక, కుడి భాగాన్ని కూడా గ్రహించా వేమో ననే అనుమానం కూడా ఉంది. ఎందు కంటే -నా హృదయ కమలం లో ప్రకాశించే నీ రూపం, బాల భానుని లేత కేంజాయతో, మూడు కన్నులు కలిగి స్తన భారం తో, ముందుకు వంగి నట్లు కనీ పిస్తూ, జాబిల్లి కిరీట మణి గా ఉంచుకొని ప్రకాశిస్తున్నా వు.

విశేషం --కౌల సిద్ధాంతం లో శక్తి తత్త్వం ఒక్కటే. శివ తత్త్వం అనేది లేదు. శివత్వం శక్తిత్వం లో అంత ర్భాగమే. దానినే ఉపాసించాలి. శరీరం ఎర్రగా ఉండటం, స్తన ద్వయం, త్రాలున్డటం, వాళ్ళ శివుని శరీరం

అపహరించావు అని భావం. అంటే భగవతి యే శివ రూపం. శివుడు శ్రీ దేవీ మయుడు అని అర్ధం చేసుకోవాలి. శివ, శక్తులు అభేద్యాలు అని గ్రహించాలి. ''న శివేన వినా శక్తి ర్న శక్తిరహితః శివః ''శక్తి లేక పోతే శివుడు లేదు. శివుడు లేకుంటే శక్తి లేదని అర్ధం. శ్రీ దేవి రూపం లో యెర్ర దానం శక్తిని కలిగి ఉండ తాన్ని, కిరీటం సర్వేశ్వరత్వాన్ని, శశి మకుట మణి ఆనంద మయత్వాన్ని, మూడు కళ్ళు మూడు కాలాలను, చనుల భారం సృష్టిలోని జీవుల అన్నమయాది పంచ కోశ పోషణ ద్రవ్య సమృద్ధిని తెలియ జేస్తున్నాయి. ఇదంతా శ్రీ మాత్రు విరాట్ స్వరూపం.

**24--''జగత్సూతే దాతే, హరి రవతు రుద్రః క్షప యతే --తిరస్కుర్వ న్నేనత్, స్వమపి, వపురీ శస్తి రయతి సదా పూర్వ స్సర్వం, తదివ, మను గృష్ణాతి చ, శివ --స్తవాజ్ఞా మాలంబ్య , క్షణ చరిత ర్భ్రూ లతికయోహ్''**

తాత్పర్యం --జగన్మాతా !బ్రహ్మ దేవుడు సృష్టి చేస్తే, శ్రీ హరి రక్షిస్తే, రుద్రుడు సంహారం చేస్తున్నాడు . .ఈ మూడు తత్వాల లోని మహేశ్వర తత్వ మైన ఈశ్వరుడు అంతర్హితం గా ఉన్నాడు. ప్రళయం జరిగి పోయిన తర్వాతా మళ్ళీ బ్రహ్మాండాన్ని ఉత్పత్తి చేయా లనే తలంపు సదా శివునికి కలిగింది. క్షణ కాలం శ్రీ దేవి కను బొమ్మల ఆజ్న కోసం కాచుకొని ఉండి, దాన్ని స్వీక రించి బ్రహ్మ విష్ణు రుద్ర రూపం తో ఉన్న తత్త్వం సకల జగత్తును సృష్టించ టానికి సన్నద్ధం అవుతోంది.

విశేషం --సృష్టి, స్తితి, ఉప సంహారం తిరోధానం, అనుగ్రహం అనే అయిదు పనులు బ్రహ్మ విష్ణు, రుద్రా,మహేశ్వర సదాశివులు చేస్తూంటారు. ఇవన్నీ పరమేశ్వరి అనుజ్న తోనే జరుగుతాయి. బ్రహ్మ ఆమె కు పెద్ద కొడుకు. ప్రపంచోత్పత్తి చేస్తాడు. రెండవ కొడుకు హరి జగత పాలన చేస్తాడు. కాల రుద్రుడు మూడవ వాడు. సంహరిస్తాడు. వీరంతా కాల పురుషులే. బ్రహ్మాదులకు కారణ భూత మైన మహేశ్వరుడు చతుర్ధ పుత్రుడు. ఈ పనులన్నీ దేవీ శక్తి మూల కాలు. ''ఆత్మా వై పుత్రా నామాసి ''-- ''స ఏవాయుం పురుషః ప్రత్యక్షనోప లభ్యతే ''అన్నది వేదం.

**25-- ''త్రయాణాం దేవానాం త్రిగుణ జనితానాం తవ శివే --భవేత్పూజా పూజా, తవ చరణ యోర్యా విరచితా తదాహిత్వా, త్వాదో ద్వహన మణి పీఠి కస్య నికటే --స్తితా హ్యేతోశశ్వన్ముకు లిత కరోత్తంస మకుటః ''**

తాత్పర్యం --శివ వామ భాగ నిలయా !సత్వ, రజో, తమో గుణాల వల్ల జన్మించిన బ్రహ్మ, విష్ణు, రుద్రులనే త్రిమూర్తులకు నీ పాదాలకు జరిగే పూజ యే వాళ్ళకూ పూజ అవుతోంది. ఇది సహజమే. ఎందు కంటే -వారు నీ పాదాల ను కలిగిన రత్న పీఠిక కింద, చేతులు మోడ్చి, శిరస్సు ల పై గల కిరీటాలతో వినతు లై ప్రార్ధిస్తున్నారు.

విశేషం --శ్రీ దేవికి పూజ చేస్తే విడిగా బ్రహ్మాదులకు పూజ చేయక్కర లేదు. ఆమె పూజ అందరి పూజ ల కంటే విశిష్ట మైనది. ''విష్ణు పూజా సహస్రాణి, శివ పూజా శతానిచ, అంబికా చరనార్చాయః కాలం నార్హంతి షోడశం ''అంటే అమ్మ వారి పాద పూజే పూజ. మిగిలిన వేవీ పూజలు కాదు

అని అర్ధం. ''పూజ్య పూజనం పూజా, నహో అపూజ్య పూజనం ''పూ జ్యు లైన వారికీ చేసిందే పూజ. అపూజ్యులకు చేసే పూజ పూజ కాదని భావం.

**26---'' విరించి పంచత్వం ప్రజతి హరి రాప్నోతి విరతిం --వినాశం, కీనా శో భజ తి ధనదో యాతి నిధనం**

**వితంద్రీ, మాహేంద్ర వితతి రపి, సమ్మి లిత దృశా --మహా సంహారే స్మిన్, విహరతి, సతి, త్వత్పతి రసౌ ''**

తాత్పర్యం --స్వాధి ష్టా నదేవతా !మహా ప్రళయం తర్వాతా బ్రహ్మాది దేవత లంతా, సంహారం పొందుతున్నారు. నీ పతి సదా శివుడు మాత్రం, విశ్రుష్ఖలం గా విహరిస్తున్నాడు. ఆది నీ పాతి వ్రత్య మహాత్మ్యమే. దాని వల్లనే నీ పతి లయం కావటం లేదు.

విశేషం --సతీ అంటే సత్ శబ్దం యొక్క స్త్రీ లింగ రూపమే. సత్ రూప పర బ్రహ్మ మైన శివ బ్రహ్మానికి నాశనం లేదని భావం.

**27--''జపో జల్పశిల్పం, సకల మపి, ముద్రా విరచనా --గతిహ్ ప్రాదక్షిన్య క్రమణ, మశనా ద్యాహుతి విధిహ్**

**ప్రణామస్సంవేశ స్సుఖ, మఖిల మాత్మార్పణ దృశా --సపర్యా పర్యాస్తవ భవతు, యన్మే విలసితుం ''**

తాత్పర్యం --శర్వాణీ !ఆత్మ సమర్పణ బుద్ధి తో నేను నోటి తో పలికిన మాటలన్నీ నీ వు నిర్మించినవే. నువ్వు నిర్మించినవే కనుక అవి నీ మంత్ర జపమే. ఈ శరీరం నీవే ఇచ్చావు కనుక, నేను చేసే హస్త విన్యాసాలన్నీ నీకు చేసే ముద్రా విధానాలుగా నే భావించు. ఎంతటి వివేకమూ వినయమూ శ్రీ భాగవత్పాదులలో ఉన్నాయో దీనితో మనకు అర్ధ మవుతోంది. అంతా ఆమె ఇచ్చింది కనుక తాను కొత్తగా చెప్పేదేమీ లేదని, తాను చేసే చేష్టలన్నీ ఆమె కైన్కర్యాలే నని గడుసు గా చెప్పారు. నీవు సర్వ వ్యాపివి కనుక నేను చేసే సంచారం అంతా నీకు చేసే ప్రదక్షినమే అనుకో. నా అంగ భంగిమ లన్నీ, నీకు ప్రనామాలే. నీవే జతరాగ్ని వి కనుక నేను గ్రహించే అన్న, పానాదు లన్నీ, నీ ప్రీతీ కోసం చేసే హోమం గా స్వీకరించు. శబ్ద స్పర్శాదులతో నేను చేసే చేష్ట లన్నీ నీ సపర్యలె అని భావించు. అని అమ్మ ఇచ్చినవన్నీ అమ్మకే సమర్పిస్తున్నానని భావన.

విశేషం --అన్ని అక్ష రాలు, మాతృకా వర్ణ రూపాలే కనుక పలుకులన్నీ జపంతో సమానాలే అని భావం. హస్త విన్యాసాలన్నీ జపం లో చేసే ముద్రలే. అన్నీ ఆమెకే చెందు తాయి. మాత జథరాజ్ఞి స్వ రూపం. కనుక మనం తిన్నదంతా ఆమెదే. సందేశం అంటే శయనం నీ ముద్రాదులన్నీ ఆత్మ సమర్పణ ద్రుశాలు. ఇదంతా ''సపర్యా పర్యాయం '.'భగవద్ గీత లో కూడా ''మన్మనా భవ, మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు --మమే వేశ్యసి కౌంతేయ , ప్రతి జానే ప్రయోజనే ''అన్నాడు శ్రీ కృష్ణ భాగ వాన్. ఏమి చేసినా, ఎలా చేసినా, సర్వం భగ వతికి అర్పణమే. ఇంకేదైనా పూజ చేస్తే ఆది పూజా క్రమం కాదు అని తెలియ జేయటమే.

**28--''సుధా మప్యాస్వాద్య ప్రతి భయ జరా మృత్యు హరిణీం --విపద్యన్తే విశ్వే, విధి, శత మఖ, ముఖాద్యాది విషదః**

**కరాళం , యత్త్రేళం, కబలిత వతః కాల కలనా --న శంభో స్తన్మూలం, తవ, జనని, తాటంక మహిమా ''**

తాత్పర్యం --మహేశ్వరీ ! దేవత లంతా అమృతం త్రాగి నా, జరా మృత్యువు లను పొందుతున్నారు. అంతా ప్రళయం లో లయమవుతున్నారు. అయితే కాల కూటవిషాన్ని త్రాగిన నీ భర్త శివుడు, ప్రళయ కాలం లో కూడా చని పోకుండా , కాలానికి అతీతు డై, మ్రుత్యుఞ్జయుడై ఉన్నాడు. దీనికి కారణం నీ చెవి కమ్మల ప్రభావమే.

విశేషం --తాటంకాలు అంటే చెవి కమ్మలు. సౌభాగ్య చిహ్నాలు. ఆమె కమ్మలకు చేటు తెచ్చే శక్తి కాలానికి లేదని అర్ధం. కారణం --కాలానికి ఉత్పత్తి, స్తితి, లయాలు శ్రీ దేవి తాటంక నియ తాలు. కనుక ఆమె పాతి వ్రత్య మహిమ సర్వాతీ శయ మైనది అని భావం. శ్రీ దేవి కాల సంకర్షిణి. అమే ను సేవిస్తే, కాల భయం ఉండదు. సతుల పాతివ్రత్యమే పతులకు శ్రీ రామ రక్ష.. అందుకే సువాసినులు మంగళ ప్రద మైన చెవి కమ్మలను, కమ్మర, ముంగర, కుంకుమ, మంగళ సూత్రం సర్వదా కాపాడు కోవాలి అని తెలియ దగిన విషయం. ఇతర దేవతల సౌభాగ్యం నశించేది. భగ వతి సౌభాగ్యం అనశ్వరం. అమృతం తాగిన వారికి కూడా చావు తప్పలేదు. మృత్యు రూపమైన కాల కూటాన్ని భక్షించిన వాడు శివుడు మ్రుత్యుఞ్జయుడైనాడు. దీనికి కారణం కూడా భగ వతి పాతి వ్రత్యమే.

**29--''కిరీటం, విరించిం, , పరి హర పురః, కైట భిదః --కఠోరే, కోటీరే,స్ఖల సి, జహి జంభారి మకుటం**

**ప్రనమ్రే, శ్వేతేషుప్రసభ, ముపయా తస్య భవనం --భావస్యాభ్యుత్తానే తవ, పరి జనోక్తి ర్విజ యతే ''**

తాత్పర్యం --అమ్మా శారదా రాధ్యా !నీ ముందు బ్రహ్మ గారి కిరీటం ఉంది. దాన్ని తగల కుండా నువ్వు రావాలి. తర్వాతా కైటభ మర్దనుడైన విష్ణు మూర్తి కిరీటం ఉంది. నీ కాలికి తగులు తుందేమో జాగ్రత్త సుమా. ఆ తర్వాత జమ్భాసుర మర్దనుడైన ఇంద్రుని కిరీటం ఉంది. దాన్ని అతి జాగ్రత్త గా దాటి రా. అంటే, నీకు బ్రహ్మాదులు సాష్టాంగ ప్రణామం చేస్తూ ఉంటె, నీ పతి సాంబ శివుని దర్శించ టానికి నీవు వేగం గా వీటిని అన్నిటిని దాటు కుంటూ అతి జాగ్రత్త గా రావాల్సి ఉంటుంది.

**30--''స్వ దేహోద్భుతాభి ర్ఘుణిభి, రణిమా ద్యాభి రభీతః --నిషేవ్యే, నిత్యే, త్వామహ మితి సదభి వయతియః**

**కిమా శ్చర్యం, తస్య, త్రినయన, సంరుద్ధిం, త్రుణయతః --మహా సంవర్తాగ్ని ర్విరచయతి, నీరాజన విధిహ్.''**

తాత్పర్యం --ఆద్యంతాలు లేని చిచ్ఛక్తీ !లోకం చేత నీవు సేవింప బడుతున్నావు. నీ చరణ కమల కిరణాలతో అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్య, ఈశత్వ, వశిత్వాలు అనే ఎనిమిది సిద్ధుల తోకూడి ఉన్న ''అహం ''అనే భావం తో ఎవరు నిన్ను ధ్యానిస్తారో, వారికి శివుని ఐశ్వర్య విభూతిని త్రుణీకరించిన వానికి, మహా ప్రళయ కాలాగ్ని నీరాజనం పడుతుంది.

విశేషం --తాదాత్మ్యం తో ధ్యానిస్తే, ప్రళయ కాలాగ్ని సాధకుని పాదాల వద్ద వెలుగు తుంది. వాడు శ్రీ దేవి తో కలిసి పోవటం వల్ల, ప్రళయ కాలాగ్ని దేవి పాదాలకే నీరాజనం ఇస్తోందన్న మాట. అంటే అతడు దేవి గా మారి పోయాడు అని భావం. అలాంటి వాడికి శివుడిచ్చే ఐశ్వర్యాన్ని లెక్క చేయడు అని అర్ధం.

శ్రీ దేవి శరీరం శ్రీ చక్రమే. శ్రీ చక్ర నవావరణ దేవతలు ఆమె శరీర కాంతులే. భూపుర త్రయం లో ఉండే వారు అణిమాది అష్ట సిద్ధులు., బ్రాహ్మ్యాది అష్ట మాతృకలు, సర్వ సంక్షో భిన్యాది దశ ముద్రా దేవతలు. షోడశార పద్మం లో కామ్మాక్షి మొద లైన పదహారు మంది దేవతలు, అష్ట దళ పద్మం లో మన్మధాది దేవతలు ఎనిమిది మంది, చాతుర్దశారం లో సర్వ సంక్షోభిన్యా దులు14 గురు, బహిర్దశారం లో సర్వ సిద్ధి ప్రదులు1o మంది, అంతర్దశారం లో సర్వజ్ఞాది దేవతలు పది మంది, అష్ట కోణం లో వశిన్యాదులు ఎనిమిది మంది, త్రికోణం లో కామేశ్వరీ, మొద లైన ముగ్గురు, బిందు స్థానం లో మహా త్రిపుర సుందరీ దేవి ఉంటారని సర్వజ్ఞులు శ్రీ తుమ్మల పల్లి రామ లింగేశ్వర శర్మ గారుగొప్పగా విశ్లేషించి చెప్పారు.

**31-- " చతు స్వష్ట్యా తన్త్రైహ సకల మతి సంధాయ భువనం --స్తిత స్తత్తే, త్సిద్ధి ప్రసవ పర తన్త్రైహ పశు పతిహ**

**పునస్థ న్నిర్బంధా దఖిల, పురుషార్ధైక క ఘటనా --స్వతంత్రం తే తంత్రం, క్షితి తల మవా తీతరదిదం "**

తాత్పర్యం --శ్రీ మహా రాజ్నీ!పశు పాలకుడు శివుడు. పర కాయ ప్రవేశం, ఆకాశ గమనం, తిరోధానం, జల స్తంభన, అగ్ని స్తంభన, వాయు స్తంభన, మొదలైన ఇంద్ర జాల విద్యలను, వాటి విద్యా స్వరూపాలైన విద్యా స్వరూప సిద్ధాంతాలను సాధకులకు వారి వారి కోర్కెలను తీరుస్తూ, మహా మాయ, శామ్బరం మొద లైన 64తంత్రాలను తెలిపి, ప్రపంచాన్ని మోహ పెడుతూ, తాను నిశ్చలం గా ఉన్నాడు. ఈ విద్యల సారాన్ని గ్రహించిన నీవు, వాటి వల్ల మోక్షం కలగటం లేదని భావించి, నీ భర్త శివదేవుడిని ఉత్తమ పు రుషార్ధాన్ని చ్చే విద్యన అందించ మని కోరావు. ఆయన సకలార్ధ సాధన మైన శ్రీ విద్యా తంత్రాన్ని ఉపదేశించాడు.

విశేషం --భగ వంతు డైన పశు పతి లోకాన్ని అనుగ్రహం చేత ఉద్ధరించాలను కొనే వాడు. భగవతి యొక్క నిర్బంధం వల్ల వైదిక మార్గాలకు సాటి అయిన శ్రీ చక్ర విధా నాన్ని, లోకానికి అంద జేశాడు. "ఈశానః సర్వ విద్యానాం ""అని శృతి చెబుతోంది. అన్ని తంత్రాలు, విద్యలు ఆయన ముఖం నుండే వెలువడి నాయి. ఇదంతా శ్రీ దేవి అనుగ్రహం వల్లనే జరిగిందని భావం. శ్రీ విద్య పర దేవత. "ఆత్మా విద్యా, మహా విద్యా, శ్రీ విద్యా, కామ సేవితా, షోడశాక్షరీ విద్యా, త్రికూటా "అని లలితా సహస్ర నామాలలో ఉన్న సంగతి మనకు తెలిసిన విషయమే.

**32--" శివశ క్తిహ కామః, క్షితి రధః రవిస్శీత కరణః --సమారో హంస శక్రః తదనుచ, పరమార హరయః**

**హమీ, ప్రుల్లెఖాభిస్తి స్రుభి రవ సానేషు ఘటి తాః --భజన్తే, వర్నాస్తే, తవ జనని నామా వయవతాం "**
తాత్పర్యం --కపర్దినీ !శివుడు (కకారం ),శక్తి (ఏ కారం )కాముడు (ఈ కారం )భూమి (ల కారం )మొదటి ఖండం గాను, రవి (హ కారం )చంద్రుడు (స కారం )మన్మధుడు (క కారం )హమాస (హకారం ),ఇంద్రుడు (ల కారం )రెండవ ఖండం గా, పరా శక్తి (స కారం )మన్మధుడు (క కారం )హరి (ల కారం )మూడవ ఖండం గా ఉన్న దాని, విమర్శ స్థానం లో హ్రీమ్కారం తో కూడిన, నీ పేరు తో ఉన్న త్రిపుర సుందరీ దేవి మహా విద్య కు అవయవాలు గా ఉన్నాయి. ఈ పన్నెండు వర్గాలు, మోడు హ్రీం కారలతో, కలిసి త్రిపుర సుందరీ మహా మంత్రమవుతుంది. "క, ఏ, ఈ, ల, హ్రీం, హ, స,క,ల,హ్రీం, స, క, ల, హ్రీం "అనేదే మహా మంత్రం అని భావిస్తారు సాధకులు

విశేషం --ఇందులో పద హారు అక్ష రాలున్నాయి. ఇవి షోడశ "నిత్య "లకు రోప్పాలు. పద హారావడి షోడశి -నిత్య. ఆ పదహారవాడే పరా కళ. దానినే "చిదేక రస "అంటారు. దాని ఛాయా ఏ, విశుద్ధ చక్రం లోని షోడశారం లో, కళా స్వ రూపం గా, వెలుగుతూ ఉంటుంది అని రహస్యం. ఆ షోడశి కలే ముఖ్య మైనది గా భావిస్తారు. అదే ప్రకృతి అయింది. మిగిలిన పడి హేను నిత్యాలు, ఈ పదహారవ కళ కు అంగాలు మాత్రమె. ఈ శోడశికళా రూపాన్ని గురు ముఖం గా తెలుసు కోవాలి. ఇది "హాస్ట మస్తక ప్రయోగం వల్లనే "సాధ్యమవుతుంది. అంటే గురువు గారు శిష్యుని ఆశీర్వా దిస్తూ దగ్గరకు తీసునిని శిరస్సు మీద చెయ్యి వేయటం. నెత్తిన చెయ్యి పెట్టటం అన్న మాట. ఇవాళ లోక వ్యవ హారం లో నెత్తిన చెయ్యి పెట్టాడు అంటే మున్చేశాడని అర్ధం. ఆది అలా కాదు.

షోడశ కళ అంటే ష, రేఫా, ఈ కారాలు ఉంది, బిందువు చివర ఉన్న మంత్రం అని అర్ధం. ఈబీజమే శ్రీ విద్య. శ్రీ బీజాత్మక మైంది శ్రీ విద్య. ప్రతి పట్టి రోజున త్రిపుర సుందరి కళను, విదియ నాడు కామేశ్వారిని, తదియ రోజున భాగ మాలిని ని, చవితి నాడు నిత్య క్లిన్నాను, పంచమి నాడు భేరుండా ను, షష్టి రోజున వహ్ని వాహినిని, సప్తమి నాడు మహా వజ్రేశ్వారిని, అష్టమి నాడు రౌద్రిని, నవమి నాడు నీల పతక, దశమి రోజున కుల సుందరిని, ఏకాదశి నాడు నీల పతాకను, ద్వాదశి రోజున విజయ ను, త్రయోదశి రోజున సర్వ మంగళ ను, చతుర్దశి నాడు జ్వాలను, పూర్ణిమ రోజున మాలినీ కళ ను ఉపాసించాలి అని శ్స్స్త్రం చెబు తోంది. అన్ని తిధుల లో చిద్రూప కళ షోడశి ను ఇ ఉపాసించాలని భావం.

ఈ షోడశ, నిత్యలకు శ్రీ చక్రం లో విశుద్ధ చక్రం (షోడశారం )లో స్తానం ఉంది. తూర్పు నుండి ప్రారంభ మవుతాయి. దీని క్రింద ద్వాదశారమైనఅనాహతం లో12 మంది సూర్య మంద లాది పతులు ప్రా దక్షిణం గా చుట్టి, ఉన్నాయి. ఇవి పన్నెండు మాసాల కు ప్రతీకలు. క నుండి ల వరకు ఉన్న వర్ణాలే "కళ.

అనుస్వారాలు, నాలుగు సున్నాలు బిందువులు. దీని పై నాదం. ఈ విధం గా నాద, బిందు కళాత్మకం గ శ్రీ చక్రం మూడు ఖండాలు గా గోచ రిస్తుంది.

**33--''స్మరం యోనిం లక్ష్మీం, త్రితయ మిద మాదౌ, తవ మనోహ్ --నిధా యైకే, నిత్యే, నిరవధి మహా భోగ రసికాః**

**భజంతి త్వాం, చింతా మణి, గుణ నిబద్ధాక్ష వలయాః --శివా జ్ఞౌ, జుహ్వస్త స్సురభి ఘ్రుత ధారా హుతి శతైహ్''**

తాత్పర్యం --నిత్య స్వరూపా దేవీ !నీ మంత్రానికి మొదట కామ రాజ, భువ నేశ్వారీ, లక్ష్మీ బీజాలు (క్లీం, హ్రీం, శ్రీం )లను చేర్చి, అపరిచ్చన్న మై, అఖండమై, మహా భోగ రూప మైన నిత్య సుఖానుభావం పొందిన పరమ యోగీశ్వరులు ఏ కొద్ది మంది, సమయా చార తత్పరులు, చింతా మణు లతో కూడిన అక్ష మాలలను చేతిలో ధరించి, త్రికోణ రూప మైన బైందవ స్తానం లో, శివాగ్ని లో అంటే స్వాదిష్టానం లో కామ ధేనువు యొక్క, సహస్ర నేతి ధారలతోనిన్ను హృదయ కమలం లో ఉంచుకొని, హోమం చేస్తూ, నిన్ను సేవిస్తున్నా రు.

కాముడైనా, మహేశ్వరుడైనా, మానసిక హోమాలు చేయాలి. ఆమె జపం లోనే సర్వ కామాలు తీరు తాయి

**34--''శరీరం త్వం, శమ్భోహ్, శశి మిహిర వక్షో రుహయుగం --తవాత్మానాం మధ్యే, భగవతి, నవాత్మాన మనఘం**

**అతః శేషః శేషీ త్యయ, ముభయ సాధారణ తయా --స్థితః సంబందోవాం, సమరస పరానంద పరయోహ్ ''**

తాత్పర్యం --మణి పూరాబ్జ నిలయా !జగత్ ఉత్పత్తి, మొదలైన ఆరు విషయాలు తెలిసిన భగవతి వి నువ్వు. ఆనంద బైరవివి. సూర్య చంద్రులు స్థన యుగ్మం గల శరీరం నీది. అయితే, నవ వ్యూహాత్మకు డైన ఆనంద బైరవుని, నీ దేహం గా భావిస్తున్నా వు. ఈ రెంటి వల్ల నీవు శేషం, ఆయన శేషి అవుతున్నా రు. ఆయన శేషం, నువ్వు శేషివీ కూడాఅవుతున్నా రు. ఈ రకం గా ఆనంద బైరవ, ఆనంద బైరవీ రూపు లైన మీ ఇద్దరికీ అంటే శివ, శక్తులకు ఇది సాదా రణమే అవుతోంది.

విశేషం --ఆనంద బైరవుడు పరా నంద. బైరవి పరా. వీరిద్దరి తాదాత్మ్యమే నవాత్మకం. అందుకే శేష, శేషీ భావం. లయ కాలం లో బైరవి ప్రయత్నం వల్ల , ప్రధానత్వం వల్ల ఆమె శేషి అంటే మిగిలి ఉండేది. ఆనంద బైరవుని అప్రధానం వల్ల , గుణ భావ శేషత్వం కలుగు తోంది. శరీరం బైరవు ని లో అంతర్భావం కలుగు తోంది. అప్పుడు బైరవునికి శేషిత్వం, బైరవికి శేషత్వం కల్గు తుంది. ఇద్దరూ కలిస్తే పూర్ణత్వం అవుతుందని భావం. దీనినే కాళి దాసు ''కుమార సంభవం ''కావ్యం లో ప్రారంభ శ్లోకం గా ''వాగార్ధా వివ సంపృక్తౌ వాగర్ధ ప్రతి పత్తయే -జగతః పితరం వందే పార్వతీ పరమేశ్వరం ''అని ఆ ఆది దంపతులకు నమస్కరించాడు.

**35---''మనస్త్వం, వ్యోమత్వం, మరు దపి, మరుత్సారధి రసి --త్వ మాపస్త్వం, భూమి స్త్వయి, పరిణతయాం త్వమేవ స్వాత్మానం, పరిణమయితుం, విశ్వ వపుషా --చిదా నందా కారం, శివ యువతి, భావేన భిభ్రుషె ''**

తాత్పర్యం --ఛందస్సారా !ఆజ్ఞా చక్రం లోని మనస్తత్వం నీవే. విశుద్ధం లోని ఆకాశ తత్త్వం, అనాహతం లోని వాయు తత్త్వం, స్వాధీ ష్టానం లోని అగ్ని తత్త్వం, నీవే. నీ కంటే వేరైనది ఏదీ లేనే లేదు. నీవే, నీ స్వ స్వరూపాన్ని, ప్రపంచం గా, పరిణమింప జేయ టానికి చిదా నంద శివ తత్వాన్ని, బ్రహ్మ రూప మైన ఆనంద భై రవ రూపాన్నీ ధరిస్తున్నా వు.

విశేషం --భగవతి చిదా నందా కార. శివుని ఆకారమే ఆమె. అందు చేత 'విశ్వ వపుషా ''అయింది. అన్దాండ, పిండాండాలు ఒకే రూపం లో శ్రీ దేవి యే.అంతా, ఆమె ఏక ఆకారమే అని భావం.

**36---''త్వమాజ్నా చక్రస్త్వం, తపన, శశి కోటి ద్యుతి ధరం --పరం, శంభుం, వందే, పరి మిళిత పార్శ్వం, పర చితా**

**యమా రాధ్యస్, భక్త్యా, రవి, శశిహ్, శుచీనామ విషయే --నిరాలోకే లోకే, నివ సతి, హి, భాలోక భువనే ''**

తాత్పర్యం --నిఖిలేశ్వరీ !సూర్య, చంద్ర, అగ్ను లకు కంపించ కుండా, జనం లేని చంద్ర లోకం లో అంటే సహస్రారం లో, నీ సాయుజ్యం పొంది, (నీ భ్రూ మాధ్యమ లోని శ్రీ చక్రం లోని )ఆజ్ఞా చక్రం లోని చంద్ర కాంతిని ధరించి, ''సర'' అనే చిత్ చేత ఆవ రింప బడిన శంభుని గూర్చి నమస్క రిస్తున్నాను.

**37--''విశుద్ధే తె, శుద్ధ స్పటిక విశదం, వ్యోమ జనకం, --శివం సేవే, దేవీ మపి, శివ సమాన వ్యవస్తితాం యయొహ్, కాన్త్యా,యాన్త్యాహ్, శశి కిరణ సారూప్య సరణే --విధూతాం తర్ధ్వాంతా, విలసతి చకోరీవ జగతే ''**

తాత్పర్యం --శివ జ్ఞాన ప్రదాయినీ !నీ విశుద్ధ చక్రం లో, స్పటిక మణి లాగా నిర్మలుడు, ఆకాశ వ్యుత్పత్తికి హేతు వైన శివుని, ఆయనతో సమాన మైన దేవి వగు నిన్ను, నేను ఉపాసిస్తున్నాను. శివా శివు లైన మీ నుండి వచ్చే, చంద్ర కిరణా లతో సాటి వచ్చే వైభవం గల కాంతులతో, మూడు లోకాల్లో, అజ్నా నాంధ కారాన్ని పార ద్రోలి, వెన్నెలను, తాగే చకోర పక్షి లాగా, సంతుష్ట మైన అంత రంగం తో, విశుద్ధం లో ధ్యానింప బడే శివా శివుల చంద్ర కాంతి చే, లోపలి అజ్ఞానం తొలగి, సాధకులు సంతుష్టులవు తున్నారు.

**38--''సమున్మలత్సంవిత్కమల, మక రందైక రసికం --భజే హంస ద్వంద్వం, కిమపి, మహతాం, మానస చరం**

**యదా లాపా, దష్టా, దశ గుణిత, విద్యా పరి నతిహ్ --యదా దత్తే, దోషాద్గుణ, మఖిల మాధ్యం వయ ఇవ''**

తాత్పర్యం --భావనా గమ్యా -!వికసించే జ్ఞానం అనే కమలం లో, అంటే అనాహతం లో, పుష్ప రసాన్ని ఆస్వాదించే, రసజ్ఞనత ను, యోగీశ్వరుల మానస సరోవరం లో సంచ రించే, అనిర్వచనీయ శక్తి గల, హంసేశ్వర, హంసేశ్వరీ దేవుల సమ్మిళితం అయిన రాజ హంస జంటను భజిస్తున్నాను. వాని వల్లే, అష్టా

దశ విద్యలూ లభించాయి. హంస పాలను మాత్రమె ఎలా గ్రహిస్తుందో, ఈ జంట దోషాల నుండి సద్గుణాలను మాత్రమె గ్రహిస్తుంది.

విశేషం --అనాహతం లో అగ్ని జ్వాలారూపు డైన పరమేశ్వరుడు గా ఉన్న వాడిని "సమయుడు "అంటారు. అగ్ని జ్వాలా రూపిణి భగవతి " సమయ" అంటారు. ఆ జంట, నా హృదయ పద్మం లో నివ సించాలి. సోహం అంటే హంస అని హంస శబ్ద మహా వాక్యార్ధం ప్రబోధిస్తోంది. హ అంటే శివుడు. సహ్ అంటే శక్తి. "భజే హంస ద్వంద్వం "అని శృతి చెప్పింది. శివ, శక్తి జంటను భజించమని అర్ధం. అదే జీవాత్మ, పరమాత్మ ల ద్వంద్వం. దీనినే ఉపనిషత్ "ద్వా సుపర్ణా "మంత్రం లో చెప్పింది.

**39--"తవ స్వాదిష్టానే, హుత వహ మధిష్టాయ నిరతం --తమీడే, సంవర్తం, జనని మహతీం, తాంచ సమయం యదా లోకే, లోకాన్ దహతి, మహతి క్రోధ కలితే --దయార్ద్రాయా ద్రుష్టిశ్శిశిర, ముప చారం, రచయితి "**

తాత్పర్యం --తేజో వతీ !నీ స్వాధి ష్ఠాన చక్రం లో, అగ్ని తత్వాన్ని కల్గి ఉన్న, నిరంతరం ప్రకాశిస్తున్న,, సంవర్తాగ్ని పేరు తో నిరంతరం వెలిగే పరమేశ్వరుని ప్రార్ధిస్తున్నాను. ఆయనతో అధిష్టాన, అవస్తాన, అనుష్టాన అనే పేర్ల తో సమాన సమయవు అయిన నిన్ను స్తుతిస్తున్నాను. సంవర్తాగ్ని స్వరూపు డైన ఆ పర మేశ్వరుని, అతి కోప వీక్షణం, లోకా లను దాహిస్తుంటే, నీ కృపా వీక్షణం తో చల్ల బడి, ఉప చారం పొందు తోంది.

విశేషం --స్వాధి ష్టానం లో సంవర్తెశ్వర, సమయాంబ దేవ, దేవీ యుగాళాన్ని పూజించాలి అని భావం.

**40--"తటిత్వంతం శక్త్యా, తిమిర పరి పంధి, స్ఫురణయా --స్ఫురన్నానా రత్నాభరణ, పరినేద్దేంద్ర ధనుశం తవ శ్యామం, మేఘం, కమపి, మణి పూరైక శరణం --నిషేవే, వర్షంతం, హర మిహిర తప్తం, త్రిభువనం "**

తాత్పర్యం --మాలినీ !నీ మణి పూరక చక్రమే ముఖ్య మైన గృహం గా ఉండి, అందులోని అంధ కారానికి శత్రువైన, మెరుపు యొక్క ప్రకాశ శక్తి కలదీ, అనేక రత్నా లచే నిర్మింప బడిన, నగల చేత అమర్చ బడిన, ఇంద్ర ధనుస్సు కలది, శ్యామల వర్ణం కలిగి ఉన్నదీ, హరుడు అనే మహా సంవర్తాగ్ని అనే, సూర్యుని ఛే, కాల్చబడిన ముల్లోకాలను, తన వర్ష దారల చేత తడిపే, వర్ణించ టానికి శక్యం కాని దైన మేఘం అనే సదా శివుని అధికం గా సేవిస్తున్నాను.

విశేషం --సూర్య కిరణాగ్ని ఛే మేఘాలు ఏర్పడి జల రూపం లో మణి పూరం లో, ఆధార, స్వాధిష్ఠానాల మధ్య ఉండే వాడు. అనాహతం పైన, స్వాధిష్ఠాన అగ్ని తో కలిసి , మణి పూరాన్ని చేరి, జల రూపం పొంది, ఆ జాలం చేత స్వాదిష్టానాగ్ని దగ్ధ మయ్యే జగత్తును తడుపు తున్నాయి. ఆది ఆగమ రహస్యం.

అరుణ ఉపనిషత్ లో "యోపాం పుష్పం వేదా "నుంచి "ఇమే వై లోకా అప్పు ప్రతిష్ఠితా"వరకు ఉన్న దానిలో రహస్యం కూడా ఇదే నని విజ్ఞుల భావన. ఉదకం నుండి చంద్రుడు, సూర్యుడు, అగ్ని రోజులు, నక్షత్రాలు ఉత్పత్తి అవుతున్నాయని భావం. ఉదకానికి సార భూతు డైన చంద్రుని యోగీశ్వరులు పొందుతారు. సూర్య

మండలం లో అమృతం (శుక్రం )అన్ని చోట్లా పూరింప బడుతుంది. చంద్ర మండలం నుండి స్రవించే పీయూష (అమృతం )ధారల వాళ్ళ సూర్యుడు తపన కార్యం చేస్తాడు. మణి పూరకం లో శ్రీ చక్రం ప్రతిష్టితం.

మణి పూరకం లో మేఘేశ్వర, సౌదామినులు ఉంటారు. అమ్రుతేశ్వర, అమ్రుతేశ్వరి పేర్లతో పిలుస్తారు. ఇక్కడే104 మంది దేవతలు, లోపాముద్రాదులు ఉన్నారని సాంప్రదాయం. ''మేఘం నిషేవే --నితరాం సేవే భజామి ''అమ్రుతేశ్వర పేరు గల దంపతులను అనవరతం భజిస్తాను అని అర్ధం.

**41–"త వా దారే మాతే, సహ్ సమయ యా లాస్య పరయా –నవాత్మానం మన్యే, నవ రస మహ్ తాండవ నటం**

**ఉభాభ్యా మేతాభ్యా ముదయ విధి, ముద్దిస్య దయయా –సనాదాభ్యాం జజ్ఞే, ,జనక జననీ, మజ్జాగదిదం "**

తాత్పర్యం –కౌమారీ !మూలాధారం లో నాట్య రూప నృత్యాన్ని తిల కిస్తు, సమయ అనే పేరు కలిగి, ఆనంద భైరవి అనే శక్తి తో కలిసి శృంగారం మొదలైన నవ రసాలతో, తాండవ నృత్యం చేసే నటుడు అయిన, నవాత్ముడు అయిన ఆనంద భైరవుని గా తలుస్తాను. దగ్ధ జగత్తు ను మళ్ళీ సృష్టించాలి అంటే, ఆనంద భైరవీ, భైరవు ల చేత మాత్రమె చేత నవు తుంది.

విశేషం –శివా శివు లిద్దరికీ ఆధార చక్రమే అధిష్టానం. జగత్తు కోసం జననీ జనకులు ఉన్నారు. అందుకోసమే ఇద్దరూ ప్రయత్నిస్తారు. నృత్యం లో ఇద్దరు, ఏక రూపాన్ని పొందుతారు. ఇద్దరు అరుణ వర్ణులై, అవస్థా రూప సామ్యం పొందారు. ఇద్దరు నవాత్మకలే. "తటి త్వంత్వం "అంటే తటిత్తు , విద్యుత్తూ కల వారు అని అర్ధం. హృదయ కమలం లోని భగ వతి ఐహిక ఫలాలన్నీ ఇస్తుంది. సకల విద్యా దానం చేస్తుంది. స్త్రీ వశీ కరణ శక్తి నిస్తోంది. హృదయ కమలం లో హోమ, తర్పణాలు చేస్తే, ఐహిక ఫలాన్ని స్తుంది. కనుక అంతరిక పూజ చేయా లని భావం.

జగత్తు ను ఉత్పత్తి చేయ టానికి లాస్య, తాండవ పరాయణత్వం వల్ల మాతా, పితృ భావం కలుగు తుంది. ఆధార చక్రం లో ప్రాణ నిరోధకం కాగా, యోగి నృత్యం చేస్తాడట. ఆధార చక్రం లోనే విశ్వం అంతా కనీ పిస్తుంది. సృష్టికి ఆధార మైంది ఆధార చక్రం. ఇదే సర్వ వేదాలకు, దేవతలకు ఉనికి పట్టు.

**42—"గతైర్మాణి కృత్వం, గగన మణి నిభిహ్, సాంద్ర ఘటితం –కిరీటం తే, హై మం, హిమ గిరి సుతే కీర్తయతియః**

**సనీడే యచ్చాయాచ్చురణ, పటలం, చంద్ర శకలం –ధనుహ్ శౌనా శీరం, కిమతి, నని బధ్నాతి దిషణం "**

తాత్పర్యం –హిమ గిరి తనయా !గగన మణు లైన పన్నెండు మంది ఆదిత్యుల చేత, చక్కని రత్నాలు గపొ ద గ బడిన నీ బంగారు కిరీటాన్ని ఎవరు కీర్తిస్తారో, ఆ కవీశ్వరుడు గోళా కారం గల ఆ కిరీటం లో కుదుళ్ళ తో ద్వాదశాదిత్య మణుల కాంతు లతో కలిసి, చిత్ర చిత్ర వర్ణాలు గల నీ పాపట బొట్టు అయిన చంద్ర రేఖ ను చూసి, ఇంద్ర ధనుస్సు అని తన మనసులో భావించి పరవ శిస్తాడు. ,

–విశేషం –కిరీటం లోని చంద్ర రేఖ ద్వాదశాదిత్యులు అనే మణి కాంతులచే, చిత్ర విచిత్ర వర్ణాలు కలిగి ఉన్నట్లు అని పిస్తోంది. ఇంద్ర ధనుస్సు అనే భ్రమ ను కల్గిస్తోంది. ఉషః కాలం లోనిఆకాశ ప్రకృతే అది. అదే కిరీటం. కృష్ణ చతుర్దశి, అమావాస్య ల మధ్య సంధి కాలం లో వచ్చే ఉషః కాలం ఇలానే ఉంటుందని విజ్ఞులు తెలియ జేస్తున్నారు. కార్తీక బహుళ చతుర్దశి సాక్షాత్తు శ్రీ దేవి స్వరూపమే. దీనినే "రూప చతుర్దశి "అంటారు. కిరీటం లోని చంద్ర రేఖ ఇంద్ర చాపం లా కనీ పిస్తోంది. కిరీటాన్ని కీర్తిస్తే, శ్రీ దేవి ని కీర్తించి నట్లే. "హేమ కిరీటా య సహస్రాదిత్య తేజసే నమః "అని కిరీటానికి మంత్రం ఉంది. దీన్ని గురువు ద్వారా గ్రహిస్తే సాక్షాత్కారం కలుగు తుందని భావం.

**43-''ధనోతు ధ్వాంతం, నస్తులిత, దలి తేరి దేవర వనం --ఘనం స్నిగ్ధం, శ్లక్ష్యం, నికురుంబం, తవ శివే య దేయం, సౌరభ్యం, సహజ, ముప లబ్దుం, సుమనసో --వసంత్యస్మిన్మన్యే, బల మదనః, వాటీ విట పినాం''**

తాత్పర్యం --శ్రీ లలితా!అప్పుడే వికశించిన నల్ల కలువల సమూహాన్ని మరపించే కారు మబ్బు లాగా దట్టమై , నున్నగా, సుగంధం తో మెత్త గా ఉన్న నీ కురుల క్రొమ్ముడి, మాలోపలి, చీకటి అనే అజ్ఞాన అంధ కారాన్ని పోగొట్టాలి. నీ కురులకు ఉన్న సహజ గంధం సంపాదించ టానికి బలుడు అనే రాక్షసుని సంహరించిన ఇంద్రుని యొక్క నందనోద్యాన వనం లోని కల్ప వృక్ష పుష్పాలు, నీ కొప్పులో చేరి ప్రకాశిస్తున్నాయి. పూలు సహజ గంధం పొందాలనే కోరిక తో శ్రీ దేవి కొప్పు లో నిత్య నివాసం ఉంటున్నాయని భావం

**44--''తనోతు క్షేమం, నస్తవ, వాదన సౌందర్య లహరీ --ప్రీ వాహ స్రోత స్సరనివ, సీమంత సరణీం వహంతీ సింధూరం, ప్రబల, కబరీ భార తిమిర --ద్విషాం, బృందై ర్బందీకృత మివ, దీనార్క కిరణం ''**

తాత్పర్యం --త్రిపుర సుందరీ !నీ వదన సౌందర్యం , పొంగులు పొంగులుగా, జాలు వారే ప్రవాహం లాగా ఉండగా, వాని లోంచి చీలి, చక్కగా ప్రవహించే నీటి పాయ లాగా నీ పాపట, నీ కురులలో జన్మించి, దట్టమైన చీకట్లు అనే శత్రుసేనల చేత చె ర పట్ట బడిన బాల సూర్యుని కిరణమా అన్నట్లు గా ఉన్న సిందూర పరాగాన్ని ధరించి, మా యోగ క్షేమాలకు అభి వృద్ధి కలిగిస్తోంది.

విశేషం --పాపట లో సిందూరం ధరించటం సువాసినీ స్త్రీల ఆచారం., సుమంగళీ చిహ్నం. శ్రీ దేవి వదన సౌందర్యం అనే ఎరుపు కాంతి పైకి ప్రాకుతూ, పాపట లో వ్యాపించి ఉంది. ఇందులో ప్రాతక్కాలం లోని సూర్యుడు చీకటిని పోగొట్టే విధానం సూచింపబడింది నీటి ప్రవాహం పల్లానికి సహజం గా ప్రవహిస్తుంది. శ్రీ దేవి సౌందర్య లహరి ఊర్ధ్వ గామిని -అంటే పైకి ప్రవ హిస్తుందని భావం.

**45—అరాలైస్వాభావ్యా, దళికలభస శ్రీ భిరలకైహ్ –పరీతం తే వక్త్రం, పరి హసతి, పంకేరుహ రుచిం దర స్మేరే యస్మిన్, దశన రుచి కిన్జిల్క రుచిరే –సుగంధౌమాద్యంతి, సమర దహన, చక్షుర్మధులిహః ''**

తాత్పర్యం –అన్నపూర్ణేశ్వరీ !స్వభావ సిద్ధం గా, తుమ్మెద రెక్కల నల్ల దనం తో, కాంతి వంతం గా ఉన్న నీ ముంగురు లచే, చుట్ట బడిన నీ ముఖం, తామర పూవు సౌభాగ్యాన్ని పరి హసిస్తోంది. చిరు నవ్వు కల పంటి తళుకులు అనే కేసరాల విలాసం తో, అందమైన సుగంధం కల, ఆ ముఖం లో, మన్మధుని దహించిన శివుని చూపులు అనే తుమ్మెదలు మోహ పడుతున్నా యి.

విశేషం –మన్మధుని దహించిన శివునికి కూడా ఆమె ముఖ సౌందర్యం వికారం పుట్టిస్తోంది. శివుడు ప్రకృతి స్వరూప లావన్యానికి ముగ్దుడౌతున్నాడని భావం. జిత మన్మదునికే అభిలాష కల్పించిన దేవి ముఖం యొక్క లోక ప్రియత్వం సర్వ లోకాతిశయంఅని గ్రహించాలి.

**46—''లలాటం లావణ్యద్యుతి, విమల మాభాతి తవయత్ –ద్వితీయం, తన్మన్యే మకుట ఘటితం చంద్ర శకలం**

**విపర్యా సన్యాసా దుభయ మపి, సంభూయచ, మిదః –సుధా లేపస్యోథిహ్ పరిణమతి రాకా హిమ కరః ''**

తాత్పర్యం –చిదగ్ని కుండసంభూతా !లావణ్యం అనే వెన్నెల చేత ప్రకాశించే, నీ లలాటం, రెండవ చంద్ర ఖండం గా భావిస్తున్నారు. మొదటి చంద్ర ఖండం నీ కిరీటం పైనే ఉంది. ఈ రెండు వ్యత్యస్తం గా, అర్ధ వలయాలు గా ఉండటం వల్ల, కలిసి నప్పుడు అమృతం పూత పోసిన పూర్ణిమా చంద్రుడే నేమో నని పిస్తోంది

విశేషం –భగవతి ని చంద్ర మండలం అనే లలాటం లో నిలిపి ధ్యానిస్తే అమృతత్వ లాభం కలుగు తుందని భావం.

**47 -- భ్రువౌ భగ్నే కిన్చిద్భువన, భయ భంగ వ్యసనిని –త్వదీయే, నేత్రాభ్యాం, మధుకర రుచిభ్యాం ధ్రుత గుణం**

**ధనుర్మన్యే, సవ్యేతర కర, గృహీతం, రతి పథెహ్ –ప్రకోస్తే,,ముష్టౌచ, స్థగయతి, నిగూdhaanతర ముమే''**

తాత్పర్యం –తల్లీ ఉమా దేవీ !జగత్తు లోని భయాన్ని పోగొట్టే దానివి నువ్వు. కొంచెం వంగి ఉండి,తుమ్మెద వరుసల్లాగా, నీలి రంగుతో సుందరం గా ఉన్న నీ రెండు కండ్ల చేత కట్ట బడిన అల్లే త్రాడు తో కూడి, ముడి పడ్డ నీ కను బొమల జంట ఎలా ఉందొ విను. రతి భర్త మన్మధుడు ఎడమ చేయి పిడికిలి తో పట్టు కొన్నప్పుడు కనపడ కుండా దాగి ఉన్న విల్లు మధ్య భాగం లా ఉన్న కోదండం అని అని పిస్తుంది.

విశేషం –మన్మధుని చాపానికి అల్లెత్రాడు తుమ్మెదల దండు. కనుబొమలు మన్మధుని ధనుస్సు లా ఉంటె, కళ్ళు, మధుర మైన నీలి రంగులో ఉన్నాయి. ఆమె భ్రూమధ్యం మన్మధుని చాప మధ్యమ గా ఉన్నదని భావం. ఆమె నిరంతరం జగత్తును ఉద్ద రించే ప్రయత్నం తోనే ఉంటుంది అని అర్ధం.

**48—"అహస్యుతే, సవ్యం, తవ నాయన, మార్కాత్మక తయా –త్రియామాం, వామం, తే, సృజతి, రజనీ, నాయక తయా**
**త్రుతీయాతే దృష్టి ర్ద దలి త, హేమామ్బుజ రుచిహ్ –సమాధత్తే, సంధ్యాం, దివస నిశయో రంతర చరీం. "**

తాత్పర్యం –జగద్దాత్రీ !నీ కుడి కన్ను సూర్యుడు అవటం వల్లపగలు కలుగు తోంది. కొంచెం గా వికశించిన, బంగారు కమలం వంటి దైన, నీ నొసలు లో , ఉన్న మూడవ నేత్రం దృష్టి, దివారాత్రాల మధ్య ఉండే ఉభయ సంధ్యలను ధరిస్తోంది.

విశేషం –ఆమె మూడు కళ్ళు –పగలు, రాత్రి, సంధ్యా కాలాలు. అవి కాల ఉత్పత్తి హేతువులు. ఆమె కాలానికి అతీత. పగలు ఉపాసనా కర్మకు, రాత్రి నిశాకృత్యాలకు, సంధ్య –అగ్ని హోత్రాదులకు వీలు కల్గిస్తుంది. పగలు జాగ్రత్ స్థితి, రాత్రి సుషుప్తి, సంధ్య స్వప్నాన్ని సూచిస్తాయి. జాగృత్ లో జ్ఞానం కలిగి, సుషుప్తి లో అజ్ఞాన అంధకారం తొలగు తుంది. చంద్రాత్మక నేత్ర కాంతి జ్ఞాన మయ మైన సమాధి స్థితి కన్పిస్తాయి. సంధ్యారూప స్వప్నా వస్త జ్ఞాన భూమికకు సోపానం. జ్ఞాన దృష్టికి, బ్రహ్మైక్యానికి మధ్యలో ఉండే స్తితే సంధ్య అని భావం.

**49—"విశాలా కళ్యాణీ స్పుట రుచిరయోధ్యా, కువలయైహ్ –కృపా దారా, ధారా, కిమపి, భోగవతి కా అవంతీ, సృష్టిస్తే, బహునగర, విస్తార విజయా –ధ్రువం, తత్తన్నామ వ్యవహరణ యోగ్యా విజయతే ''**

తాత్పర్యం –విశాలాక్షీ !నీ చూపు విశాలం కనుక, విశాల అనే నగరం గా వెలసింది. కళ్యాణ ప్రదం కనుక, కల్యాణి గా, నల్ల కలవ కాంతి కలది కనుక అయోధ్యా, కృప అనే అమృత ధారకలది, కనుక దారా నగరం గా, అవ్యక్త మధుర మైనది కనుక మధురగా, సర్వ భోగ భూమి కనుక భోగ వతి గా, ఆశ్రిత రక్షణం కనుక, అవంతి గా, విజయ దృష్టి ఉన్నది కనుక విజయ నగరం గా విల సిల్లింది.

విశేషం –నగరాల పేర్లను శ్రీ దేవి దృష్టు లతో శంకరులు సమన్వయించారు. విశాల దృష్టి అంతర్వికాసం కలది కళ్యాణీ దృష్టి, విస్మితం తో కూడిన చిరు నవ్వు. అయోధ్య దృష్టి కడ గంటి హాసం. దారా దృష్టి అలసత్వం. మధురా దృష్టి వంకర చూపు భోగవతీ –మెరుపు చూపు. అంటే తళుకు కలది. విజయ దృష్టి కటాక్ష వీక్షణ మైన క్రీగంటి చూపు. కలది అని భావం. అవంతి ముగ్ధ మైనది. అంటే యవ్వన ప్రారంభ కన్యా దృష్టి కలది అని అర్ధం. ఈ ఎనిమిది దృష్టులు సంక్షోభ, ఆకర్షణ, ద్రావణ, ఉన్మాద, వశ్య, ఉచ్చాటన, విద్వేషణ, మారణ కార్యాలు చేయిస్తాయి. శ్రీ దేవి చూపు లోని విశేష ప్రసారం తో ఆయా నగరనామాలు వర్ధిల్లాయి. అని రామ లింగేశ్వర రావు గారు చక్కని సమన్వయం చేశారు.

**50---''కవీనాం, సందర్భ స్తబక, మకరందైక భరితం –కటాక్ష వ్యాక్షేప, భ్రమర, కలభౌ, కర్ణ యుగళం అముచంతౌ, దృష్ట్వా, తవ, నవరసాస్వాద, తరలౌ –అసూయా, సంసర్గా, దలిక, నయనం, కించి దరుణం ''**

తాత్పర్యం –సినీ వాలీ !తల్లీ కవీశ్వరులు రస గర్భితం గా రచించిన కావ్య రచనలు అనే, పూవు లోని తేనెను గ్రోలటం లో, మక్కువ కల్గిన నీ చెవులను అంటి పెట్టు కొన్నవీ, నవ రసాలను ఆస్వాదించ టం తో అమిత మైన ఆసక్తి కలవి అయిన, నీ క్రీ గంటి చూపులు అనే, నెపం తో ఉన్న తుమ్మెద సమూహాన్ని చూసి, అసూయతో, నీ ఫాల నేత్రం కొంచెం యెర్ర బడిందేమో నమ్మా.

విశేషం –ఆమె రెండు కనులు చెవులను తాకి ఉన్నాయి. ఆకర్ణ విశాల నేత్రాలు వాటికి అమృత పానం లభించింది. నొసటి లో ఉన్న మూడవ కన్ను కు, ఆభాగ్యం కలగ లేదు. అందుకే అసూయ తో యెర్ర బడిందని భావం. లలాట నయనం అగ్ని రూపకమే.

**51—''శివే శృంగా రార్ద్రా, తదిత, రజనే, కుత్సువ పరా సరోషా,గంగాయాం , గిరిశ చరితే, విస్మయ వతీ హరా హిభ్యో భీతా, సరసి రుహ, సౌభాగ్య జననీ –సఖీషు, స్మేరా, తే, మయి, జనని, దృష్టి స్సకరుణా''**

తాత్పర్యం –నిత్యా నంద కరీ!నీ కంటి చూపు పరమ శివుని పై శృంగార భావం చూపి, మోహనం గా కన్పిస్తోంది. ఇతరుల పై భీభత్స దృష్టీ (ఏవగింపు )సపత్ని యైన గంగ పై రోషం తో కూడిన రౌద్ర దృష్టి కలిగి ఉంది. త్రిపుర సంహారం మొదలైన శివుని విజయ గాధలు విని, విస్మయంతో, అద్భుత రాసా వేశంగా ఉంది. (శివుని మూడవ నేత్రాన్ని మన్మధ దహనం లో చూసి –అద్భుత రసం).పరమ శివుని ఆభరణాలైన పాములను చూసి, భయానక రసం కల్గిస్తోంది. యెర్ర కలువ కాంతి, ఎరుపు కలిగి వీర రసం గా ఉంది. సఖీ జనం పట్ల, లేత నవ్వు తో కూడిన స్థిర మైన హాస్య దృష్టి ఉంది. నిన్ను స్తుతించే భక్తు డైన నాయందు కరుణా రస దృష్టి ఉంది. నీ దృష్టులు నవ రసాలతో నిండి ఉన్నాయి.

విశేషం –భగవతి దృష్టి అధికార భేదం చేత నవ రసాలు ఒకే సారి కన్పింప జేస్తున్నాయి. నవ రాసా వాస భూతం ఆమె దృష్టి. దీనికి శివుడే వ్యాఖ్యాత. ఆయన సమస్త కళ్యాణ గుణ దారి. ఆమె అనుగ్రహ లబ్ధ నాముడు అని వ్యవ హరింప బడుతున్నాడుసదా శివుడు.

**52—''గతౌ కర్ణాభ్యర్ణం, గరుత ఇవ, పక్ష్మాణి దధతీ –పురా భేత్తుస్చిత్త ప్రశమ రస, విద్రాణ ఫలే ఇమే నేత్రే, ,గోత్రాధర పతి, కులోత్తంసకలికే –తవా కర్ణా కృష్ణ స్మరశరవిలాసం కలయతః ''**

తాత్పర్యం –పర్వత రాజ తనయా !నేను ధ్యానిస్తుంటే, నా హృదయ కమలం లో ప్రత్యక్షం అయినావు. నీ దర్శన భాగ్యం కలిగింది నీ కనులు చెవుల వరకు వ్యాపించాయి. ఆ నేత్రాల రెప్పల పై గల వెంట్రుకలు ఎలాగఉన్నాయంటే, బాణానికి రెండు ప్రక్కలా కట్ట బడిన గ్రద్ద ఈకలు గా ఉండి, పరమ శివుని మనసు లో నిస్పృహ ను పోగొట్టి, శృంగార రానోత్పాదన చేస్తున్నట్లు న్నాయి. ఆ కర్ణాంతం లాగిన మన్మధ బాణ సౌందర్యాన్ని కల్గిస్తున్నాయి.

విశేషం –మన్మధుడు పంచ బాణుడు. ఆరవ బాణం స్త్రీ ల కడ గంటి చూపు. శివుని పై పంచ బాణాలు వేసి, గెలవ లేక భస్మమైనాడు మన్మ్మధుడు. అలాంటి శివుని మనస్సు ను మోహ పర వశం తో ముస్చేత్తేట్లు చేస్తున్నాయి శ్రీ దేవి చూపులు. అంటే ప్రకాశఅంశ మైన బ్రహ్మం లో సృష్టికి కారణ మైన వివర్శ అంశ స్పందనాన్ని కల్గిస్తోంది. అంటే అతి దుర్ఘట మైన కార్య కారణాన్ని చేసే సమర్ధత ఆమె చూపులకు ఉంది అని భావం.

**53—''విభక్త త్రైవర్న్యం , వ్యతికరిత, లీలాన్జన తయా –విభాతి, త్వన్నేత్ర, త్రితయ మిద నదయితే**
**పున స్స్రుష్టుం, దేవాస్, ద్రుహిణహరి, రుద్రానుపరతాస్ –రజస్సత్వం, బిభ్రత్తమ, ఇతి గుణానాం త్రియ మిద''**

తాత్పర్యం –ఈశాన ప్రియే !దేవీ !ఈ దీనుని వైపు చూసే, నీ మూడు నేత్రాలు, ,వాని పై అర్ధ వలయాకారం గా తీర్చి దిద్దిన కాటుక కలవై, తెలుపు, నలుపు, ఎరుపు అనే మూడు రంగులు కలవై, జరిగి పోయిన జల ప్రళయ సమయం లో, నీలో లీన మై,బ్రహ్మ, విష్ణు, రుద్రులను, మహనీయ దేవతలను, మళ్ళీ ఈ, బ్రహ్మాండం లో సృష్టించ టానికి సత్వ, రజస, తమో గుణాలను ధరించాయేమో అన్నట్లు ప్రకాశిస్తున్నాయి.

విశేషమ –దేవి మూడు నేత్రాల్లో మూడు గుణాలున్నాయి. అవి –సృష్టి, స్థితి, లయాలకు కారణమవుతున్నాయి. కుడి కన్ను రజో ప్రధానం. ఎడమ కన్ను సత్వ ప్రధానం. ఫాల నేత్రం తమో గుణ ప్రధానం కలవి. భగవతి నేత్రాలు అనే ఉత్పలముల వల్ల, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను సృష్టిస్తోంది. అంటే, వీరిని సృష్టించే త్రిగుణాలు, ఆమె నేత్రా లలో నిత్య నివాసం గా ఉన్నాయని భావం.

**54—''పవిత్రీ కర్తుం, నః పశు పతి, పరాధీన హృదయే –దయా మిత్రైర్నేత్ర, రారున ధవళ, శ్యామ రుచిభిహ**
**నద స్నోనో,గంగా, తపన, తసయేతి, ధ్రువ మయం –త్రయాణాం, తీర్ధానాం ముపనయసి,సంభేద మనఘం.''**

తాత్పర్యం –అపర్ణా !అజ్ఞాన ప్రాణులను కాపాడే పశు పతి హృదయ పత్నీ !దయా రసం చేత తడుప బడి, మెత్తని, ప్రసన్నాలైన యెర్రని, తెల్లని, నల్లని కాంతులు గల నీ కనులు మూడింటి చేత, బంగారు రంగు నదీ ప్రవాహమైన శోణభద్రా, తెల్లని రంగు గల గంగా, నీలపు రంగు కల యమునా, నదుల సంగమమైన స్థానమైన త్రివేణీ సంగమం గా, పాపులను పవిత్రులను చేయటం కోసం మాకు లభిస్తున్నాయి

విశేషం –దేవి నేత్రాలకు స్వభావ సిద్ధ మైన తెలుపు, నలుపు, ఎరుపురేఖలు గంగా, యమునా, షోనా నదుల కూడలి గా చెబుతున్నారుశంకర భగవత్పాదులు. ఇది ప్రయాగ సంగమం కాదు. అక్కడ సరస్వతి నది అంతర్వాహిని గా ఉంటుంది. కానీ బీహార్ చేరిన గంగ లో షోనానది (సోన్)

కలుస్తుంది. ఈ మూడు నదుల కలయిక మనకు కనిపించదు. మనల్ని కనిక రించ టానికి, త్రివేణీ సంగమం లాగా, అందిస్తోంది. భక్తులపై ఆమె దయా దృష్టి చాలా గొప్పది. అసంభవమైన దాన్ని సంభవం అయ్యెట్లు దేవి చేస్తోందని భావం.

ఆమె కన్నులలో మూడు రంగులున్నాయి. ఎరుపు రంగు రక్త రాజిలో, తెలుగు అపాంగం లో, నలుపు నల్ల గ్రుడ్డు లో, కనీ పించి, శోభాయ మానం గా ఉన్నాయి. శోన-హిరణ్య బాహువు, హిరణ్య వాహిని. "శోనో హిరణ్య బాహుహ్ స్యాత్ "అని శ్రుతి. వో అనఘాదేవీ ! పాప సంహారిణీ, నీ చరణాలను సేవిన్చే భక్తులకు, నీకు వ్యతి రేకం గా, తీర్ధ యాత్ర సేవ వ్యర్ధం అని అంత రార్ధం. ఆమె చరణాలే అన్నీ ఇస్తుంటే, వేరే తీర్ధ యాత్రలు అనవసరం అని అర్ధం

**55—''నిమేషోన్మే షాభ్యాం, ప్రళయ ముదయం, యతి జగతీ –తవే వ్యాహుస్సంతో, ధరణి ధర రాజన్య తనయే**

**త్వదన్మే షాజ్జాతం, జగదిద మశేషం, ప్రళయతః –పరిత్రాతుం, శంకే, పరి హృత, నిమేషాస్తవ ద్రుశః**

తాత్పర్యం –మాతంగ తనయా !నీవు కను రెప్పలు మూస్తే, జగత్ ప్రళయం సంభ విస్తుంది. కనులు తెరిస్తే, జగత్తు ప్రభవిస్తుంది. ఇలా నీ కను రెప్పల కదలిక లో, విశ్వ ఉత్పత్తి, నాశనం జరుగుతున్నాయని వ్యాస మహర్షి మొదలైన వారు, చెబుతున్నారు. నీ కనురెప్పల వికసనం వల్ల, జన్మించిన ఈ సృష్టి అంతా, నాశనం కాకుండా కాపాడటానికి నీ రెప్పలను మూయ కుండా అని మేష స్థితి లో ఉన్నావు. నీ దయ ఎంత గొప్పదమ్మా!

విశేషం –ఆమె రెప్ప పాటు లేకుండా, నిరంతరం జగత్తును కాపాడుతోందని భావం. దేవి మహిమ అవాజ్మానగోచరం.

**56—''తవాపర్నే కర్నె, జపనయన, పైశున్య చాకితాః—నిలీయన్తే తోయే, నియతమ నిమేశాశ్శఫలికాః**

**ఇయంచ, శ్రీర్బద్ధ చ్చదపుట, కవాటం, కువలయం –జహాతి, ప్రత్యూషె,నిశిచ, విఘటయ్యప్రవిశతి ''**

తాత్పర్యం –అపర్నాదేవీ !నీ చెవుల వరకు వ్యాపించిన నీ రెండు కళ్ళు, ఆ చెవులకు తమ రహస్యాన్ని వెల్లడిస్తాయేమో నసే భయం తో, నీ కనుల రెప్ప పాటును దొంగిలించి, ఆడు బెడిస చేపలు రెప్ప పాటు లేకుండా, నీటిలో తమ రూపు కంపించ కుండా, దాక్కున్నాయి. నీ నేత్రాలను చేరిన కాంతి, అనే సౌభాగ్య లక్ష్మి, ఉదయం పూట, మూయ బడిన దొప్పల వంటి రేకులు కల, నల్లకలువలను వదిలిపెడుతూ, రాత్రి వేళ, తలుపుల రూపం లో ఉన్న రేకులను తెరచికొని, ఆ కలువలను ప్రకాశింప జేస్తోంది. అంటే నీ కనులు ఆకర్ణ విశ్రాన్తాలూ, అసిత సుందరాలూ.

విశేషం ---తమ సౌభాగ్యాన్ని శాఫరికలు అంటే బెడిస చేపలు దొంగిలించాయి అని కళ్ళు చెవులకు చాడీలు చెబుతున్నాయిఅని భావం. ఆడ బెడిస చేపలు నీళ్ళలో ఉండటం రెప్ప పాటు లేక పోవటం వాటి స్వభావ సిద్ధ గుణాలు. శ్రీ దేవి నేత్ర కాంతి ణి రాత్రులలో, ఆమె నేత్రాలను వదిలి, నీలోత్పలాల పై ప్రేమతో, వాటిని కాపాడ టానికి వాటిని చేరుతున్నాయి రాత్రి పూతే కలువలకు వికాసం ఉంటుంది. పగలు ముడుచు కోవటం వాటి లోక రీతి. ఉదయమే ఆ కాంతి మళ్ళీ ఆమె ను చేరుతోందని భావం. అందుకని కలువలు ఉదయం ముడుచుకొంతాయి.

కాంతి లక్ష్మి పగలు ఆమె నేత్రాల్లో, రాత్రి కాలువల్లో సంచరిస్తోందని అర్ధం. అపర్ణ అంటే శివుని కోసం పార్వతీ దేవి చేసే తపస్సు లో ఆకులను కూడా తిన కుండా ఉన్నది. లేక అపగత రుణ సంబంధం కలది అని అర్ధం. అంటే జగత్తు యొక్క సృష్టి, స్తితి, సంహార కర్మ లలో, ఆలస్య కారణం గా, యే కొంచే మైనా మిగిలిన కర్మ సమాపనం –అలాంటిది లేక పోతే అపగత రుణ సంబంధం అంటారని విజ్ఞులు తెలియ జేస్తున్నారు. చేపలు –కండ్లు చాడీలు చెబుతున్నాయి అనే భయం తో,శత్రు భయం తో జలదుర్గం లో దాగాయి అని భావం.

**57—''దృశా ద్రాఘీ యస్యా, దార దళిత, నీలోత్పల రుచా –ద్రవీ యామ్సం, దీనం, స్నపయ కృపయా, మామపి, శివే**

**అనేనాయం, ధన్యో భవతి, నచతే, హాని రియతా –వనేవా, హర్మ్యేవా, సమకర , నిపాతో మహికరః ''**

తాత్పర్యం –మహేశ్వరీ !చాలా దీర్ఘ మై, వికసించిన నల్ల కలువల వంటి చల్లని కాంతి తో ఉన్న నీ కడ గంటి చూపు అనే కృపారసం తో, కడుదీనుడను, నీకు చాలా దూరం గా ఉన్న వాడను, సామాన్యుడను అయిన నన్ను తడిసి పోయేట్లు చేసి, నన్ను ధన్యుడిని చెయ్యి. దీని వల్ల నీకేమీ నష్టమూ లేదు. ఎందు కంటే, చల్లని వెన్నెల నిచ్చే చంద్రుడు ఉచ్చ, నీచాలు అని చూడ కుండా, అందరి మీదా, తన చంద్ర కల ను ప్రసరించి, వెలుగు వెల్లువ లతో ముంచెత్తడం లేదా !

విశేషం –స్వచ్చ మైన అంతఃకరణ ఉన్న వారికి అందరి మీదా సమాన మైన ఆదరణ ఉంటుందని భావం. అది స్వభావ సిద్ధమే. అసలు సృష్టి అంతా శ్రీ దేవికి ఆత్మీయం గా ఉంటె, తన వాళ్ళనీ, బయటి వాళ్ళనీ తేడా ఉండదు కదా !చంద్రుడు ఆమె నేత్రాల్లో ఒక భాగం. ఆ చంద్రునికే నర్వ సమభావం ఉంటె శ్రీ దేవికి ఉన్నట్లే. కారణం చంద్రుడు ఆమె నేత్రమే కనుక. ఆమె దృష్టి దీర్ఘ మైనది. అందుకే దూరం గా ఉన్న భక్తుడిని ఆదు కొనటం లో కష్టం లేదని భావం. లీలా మాత్రం గా దృష్టి ప్రసరిస్తే చాలు ఆయాస పడ నక్కర లేదని అర్ధం. చంద్రుడు ఔశదీషుడు. అందుకే వనాల మీద ఎక్కువ కాంతి ప్రసరించి, మిగిలిన వాని పై తక్కువ ప్రసరించే పక్ష పాతం కల వాడు కాదు. అలాగే అమ్మ కూడా దూరంగా ఉన్న వారనేభేదం లేకుండా సమానం గా కృప చూపిస్తుంది. తాను దీనుడిని, అయినా తన మీద పక్ష పాతం చూపించినా న్యాయమే.

శ్రీ దేవి అనాయాసం గా బహుజన ధర్మ బుద్ధి తో, ఆపన్నులను రక్షించే బుద్ధితో, అనవధిక మైన కారుణ్యం తో, రక్షణా భార నిర్వహణ తో, సత్కర్మ లను చేస్తున్నది అని భావం.

**58—''అరాళం తే పాళీయాగళ, మగ రాజన్య తనయే –న కేశా, మాధట్టే, కుసుమ శర, కోదండ కుతకం**
**తిరశ్చేనో, యత్ర శ్రవణ పద, ముల్లంఘ్య విలసస్ –అపాంగ వ్యాసంగో, దిశతి, శర సంధాన దిషణం''**

తాత్పర్యం –శరవణ భవ జననీ !వంకర గా ఉన్న నీ కణతల జంట (తమ్మల జంట )మన్మధుని ధనుస్సు యొక్క విలాసం గా అని పిస్తోంది. ఎందుకంటె, నీ కనుల కటాక్షప్రసారం అడ్డం గా తిరిగి, చెవిని

దాటి మెరుస్తున్న బాణాలను సందిస్తున్నాయేమో నసే అనుమానాన్ని కల్గిస్తోంది. అంటే చెవి తమ్మెలు అంటే కణత మన్మధుని విల్లులాగా, అపాంగ వీక్షణం మన్మధుని పూల బాణాల్లా ఉన్నాయని భావం.

విశేషం –ఈ భావం ఎవరికి ?అమ్మ వారి చూపుతో మన్మధ ప్రసక్తి ఎవరికి ?సదాశివునికే. వేరెవరికీ కాదు అని అర్ధం

**59—''స్ఫురద్గండా భోగ ప్రతి ఫలిత, తాటంక యుగళం –చతుశ్చక్రం మన్యే, తవ ముఖ మిదం మన్మధ రధం యమారుహ్య ద్రుహ్యత్సవని, రధా మర్కెందు చరణం –మహా వీరో మారః, ప్రమద పతి సజ్జిత వతో ''**

తాత్పర్యం –ఆర్యా దేవీ !అద్దాల లాగా నిగనిగప్రకాశించే, నీ చెక్కిళ్ళ పై, ప్రతి ఫలిస్తున్న, నీ కమ్మల జంటలు కల నీ ముఖం ఎలా ఉందో తెలుసా ?/మొక్క వోని ప్రతాపం గల మన్మధుడు ఎక్కిన నాల్గు చక్రాల రధం లా ఉంది.ఆ చక్రాల రదం ఎక్కి, ,అతి లోక వీరుడైన మన్మధుడు సూర్య, చంద్రులు అనే రెండే రెండు చక్రాలు గల భూమి అనే రధం ఎక్కి, యుద్ధానికి వచ్చే, త్రిపురాన్తకుడైన శివుని నే ఎదిరించ టానికి సిద్ధం గా ఉన్నాడు. ఇదంతా నీ కంటి చలువే. లేక పోతే మన్మధునికి అంత ప్రతాపం ఎక్కడిది ?

విశేషం –శ్రీ దేవి ముఖ లక్షణం అనే రధాన్ని ఎక్కి నందు వల్లనే, మన్మధుడు మహా వీరుడై, శివుని పై కాలు దువ్వుతున్నాడు అని భావం. రెండు చక్రాల రధం కంటే నాలుగు చక్రాల రధం బాగా నడుస్తుంది. బలం కూడా ఎక్కువ గా ఉంటుంది. అందుకే మన్మధుడు మహా శివుని ఎదిరించ గలిగాడు అనే భావం. మహాదేవుని కామ మోహిత చిత్త వృత్తీ, ఆ మొహం ద్వారా లభించిన రసికతా, భగవతి వదనార వింద శృంగార రసార్ద్ర భావం పుష్కలం గా ఉన్నాయి. ఆమే లావణ్య కాంతి విశిష్టమైనదీ, లోకోత్తర మైనదీ కూడా.

**60—''సరస్వత్యా సూక్తీ రంరుత లహరీ, కౌశాలహరేహ్ –పిబంత్యా శ్శర్వానీ, శ్రావణ చులుకాభ్యామవిరాలం చమత్కార శ్లాఘా, చలిత శిరసః కుండల గనో—ఝనత్కారై స్తారైహ్, ప్రతి వచన సమా చష్ట ఇవతే ''**

తాత్పర్యం –శార్వానీ !అమృత ప్రవాహం లో ఉన్న మాధుర్యాన్ని, ,మార్ధవాన్ని, మించి పోయే తేనె పలుకులతో, మధుర పద గుమ్పనతో, నిన్ను సరస్వతీ దేవి స్తుతిస్తుంటే, చెవులు అనే దోసిళ్ళ తో చక్కగా తాగుతున్నావు. ఆ స్తోత్రం లోని చమత్కారాన్ని శ్లాఘించ టానికి, నీ శిరస్సు కది లిస్తుంటే, నీ కర్ణ భూషణాలు అతి చక్కని ఝణత్కారం చేస్తూ, ఆ స్తోత్రానికి తెల్పే ఆమోదం లాగా అని పిస్తోంది. విశేషం –''తార ''అంటే ఓంకారం. పూర్వం అనుజ్న ఇవ్వ టానికి ఓం అనే వారు. బాగా ఉంది అనటానికి కూడా ఓం అనే అలవాటు ఉంది. సరస్వతీ దేవి చేసే ప్రార్ధనకు, పార్వతీ దేవి మెచ్చి కోలుగా తల ఊపి నప్పుడల్లా, కుండలాలు ''ఓం ''అనే నాదం తో అనుజ్న ను ప్రకటిస్తున్నాయట. శ్రీ శారదా దేవి యొక్క వాక్ అనే అమృతాన్ని చెవులు తాగుతున్నాయి. జిహ్వా పాణం కాదు కనుక చెవులే సమాధానం చెప్పాలి. అవి మాట్లాడ లేవు కదా. అందుకే కర్ణాభరణ ఝణత్కార రూపం లో ప్రణవ నాద మైన ఓంకార ధ్వని తో ప్రశంసిస్తోంది

**61—''అసౌ నాశా వంశ, స్తుహిన గిరి వంశాధ్వజ పటి –త్వదీయో, నేదేయః ఫలతు ఫల మాస్మాక ముచితం వహత్యంత ర్ముక్తా, శ్శిశిర కర, నిశ్వాస, గలితం –సంరుద్ధ్యా యత్తాసాం , బహిరపి, సముక్తా మణిధరః ''**

తాత్పర్యం –హిమ గిరి తనయా !!పర్వత వంశ పతాకమా !పార్వతీ దేవీ !నీ, నాసాదండం మాకు, మా సంబంధీకులకు, కోరిన కోర్కెలను తీర్చు గాక. ఆ నాసా దండం లోపల ముక్తా మణులున్నాయి. లోపల ఉన్న ఆ మణుల చేత, ఎడమ నాసిక నుండి, వెలుపలికి వచ్చే, గాలి వల్ల బయట కూడా ముక్తా మణులను ధరించి నట్లుంది.

విశేషం –వెదురు లో ముత్యాలు ఉంటాయని లోక ప్రసిద్ధి. ముక్కులో ముత్యాలు లేక పోతే, శ్వాస తో ఎలా బయటకు వస్తాయి ?అంటే, ఎడమ నాసిక ముత్యాన్ని ధరించింది అన్న మాట. నాసిక నువంశ దండం గా చెప్పటం లో కోమలత్వం, రుజుత్వం, రామణీయకత గల నాళాలున్నాయని అర్ధం.

**62—''ప్రకృత్యా రక్తాయాస్తవ సుదతి, దంత కృదరుచెహ్ –ప్రవక్ష్యే, సాదృశ్యం, జనయతు ఫలం విద్రుమ లతా న బింబం, తద్బిమ్బ ప్రతి ఫలాన, రాగా దరుణిమాం –తులా మధ్యా, రోదుంకధమివ, నలజ్జేత కలయా ''**

తాత్పర్యం –వర దండ మండిత కరా !చక్కని పలువరుస గల తల్లీ !స్వభావ సిద్ధం గా కెంపు రంగుతో ఉన్న నీ పెదవుల కాంతి ని,దేనితోను పోల్చటానికి వీలు లేదు. పోల్చదగినది వేరేది లేదు కూడా. ఎందు కంటే, నీ క్రింది పెదవి కి సహజ కాంతి ఉంది. అలాంటి కాంతి –పగడపు తీగేకు పండు పండితే, ఎలా ఉంటుందో అలా ఉంటుంది. కాని, దానికి పగడం  పుట్టటం లేదు. అది పండ్లను ఇవ్వటమూ లేదు. దొండ పండు తో పోలుద్దాం అంటే దానికి కాంతి సహజం కాదు. దొండ పండుకు బింబం అని పేరు. అంటే ప్రతి బిమ్బించేది. దానికి ఆ పేరు రావటానికి కారణం నీ ఆధర బింబం యొక్క అనుగ్రహం వల్లనే కనుక నీ క్రింది పెదవి తో పోల్చదగిన వస్తుపేదీ ప్రపంచం లో లేదు. నీ క్రింది పెదవి నిరుప మాన మైన శోభ కలది.

**63—''స్మిత జ్యోత్స్నా జాలం, తవ వదన చంద్రాస్య పిబతాం –చకోరాణా మాసి దతి రసతయా, చంచు జడిమాఅతస్తే, శీతాంశో రమృతలహరీ రామ్లు రుచయః –పిబన్తి స్వచ్చందం, నిశి, నిశి, భ్రుశం కాంచి కధీయా'**

తాత్పర్యం –చండికా !నీ ముఖ చంద్రుడి చిరు నవ్వు అనే వెన్నెలను త్రాగే చకోర పక్షులకు, త్రాగి, త్రాగి, అతి మాధుర్యం వల్ల  అరుచి కలిగింది. అందుకే అవి పులుపు మీద ఇష్టం తో చంద్రుని అమృత కిరణాల పొంగునే బియ్యం కడుగు గా భావించి, ఇష్టం వచ్చి నంత వెన్నెల రాత్రులలో తృప్తి గా తాగుతున్నాయి .

శ్రీ దేవి ముఖచంద్ర మంద హాస కాంతులు చంద్ర కిరణ మాధుర్యం కంటే గొప్పవి అని భావం.

**64—''అవిశ్రాంతం, పత్యుర్గున గణ కదా మరేద ణ జపా –జపా పుష్పచ్చాయా, తవ జనని, జిహ్వా జయతిసా యదగ్రాసీనాయాఃస్పటిక ద్రుషదచ్చచ్చ విమయీ –సరస్వత్యా మూర్థిహ్ పరిణ మతి, మాణిక్య వపుషా ''**

తాత్పర్యం –కదంబ వన వాసినీ !నీ జిహ్వాగ్రం మీద ఆసీన అయిన సరస్వతీ దేవి యొక్క శుద్ధ స్పటిక మణి కాంతి చేత ప్రసిద్ధ మైన స్వరూపం, పద్మ రాగ మణి ఎరుపు రంగుగా మారుతోంది. ఎందు కంటే ఆమె కు ఆశ్రయ మైన నీ నాలుక నిరంతరం , నీ భర్త అయిన శివుని గుణ గణ కద ను, జపం లాగా విని, విని, జపా పుష్పం యొక్క కాంతి వంటి కాంతి కలదై , యెర్రని రంగు కలదై ప్రకాశిస్తోంది.

విశేషం –శ్రీ దేవి జిహ్వ తాను ఎరుపు రంగు తో ఉండటం మాత్రమె కాదు, తటస్తు లైన వారిని కూడా ఎరుపు రంగు కల వారిని గా చేస్తోందని భావం. శ్రీ దేవి నాలుక మీద నిత్య నివాసి అయిన సరస్వతి దేవి ''మాణిక్య వపుష ''గా పరిణ మిస్తోందని అర్ధం.

**69—''రాణే జిత్వా, దైత్యా, నప హృత శిరస్త్రైహ్ కవచిభిహ్ –ర్నివృత్తి, స్చండాం శ, త్రిపుర హర నిర్మాల్య విముఖై**
**విశాఖేన్ద్రో పేన్ద్రై శ్శశి విశద, కర్పూర శకలా –విలీయన్తే, మాతస్తవ, వదన, తాంబూల కబళః''**

తాత్పర్యం –త్రిదగ్ని కుండసంభూతా !యుద్ధం లో రాక్షసులను జయించి వచ్చి, తల పగాలను విడ దీసి, కవచాలను ఇంకా ఉంచుకొని, చండుడు అనే ప్రధముని చేతఅనుభవించ టానికి వీలైన ''హరుని నిర్మాల్యం వద్దు ''అన్న కుమారాస్వామి –దేవేంద్ర, ఉపెంద్రుల చేత చంద్రుని లాగా, స్వచ్చందం గా, నిర్మలం గా ఉన్న కర్పూరపు పలుకులు గల, నీ వదన తాంబూలం యొక్క తమ్మలు కాజేయ బడుతున్నాయి.

విశేషం –కుమారస్వామి, దేవేంద్రుడు, ఉపెంద్రుడు, యుద్ధం లో రాక్షసుల్ని జయించి, శ్రీ దేవికి పాదాభి వందనం చేయ టానికి తల పాగాలు తీశారు. ఆమె ప్రసన్నం గా నవ్వింది. అప్పుడు ఆమె నోటి నుండి కర్పూర పలుకుల తో కూడిన తమ్మల కబళాలు (తాంబూలం యొక్క ఉమ్మి )కింద పడ్డాయి. ఆ ముగ్గురూ వాటిని గ్రహించి, మింగారు. అందులోని కర్పూరం మెత్తగా మారి కలిసి పోయింది. జగన్మాత అయిన భగవతికి కుమారులపై అంత ప్రేమ ఉండి అని భావం. కుమారా స్వామి కి ఇది మామూలే. ఇంద్ర, ఉపెంద్రులకు అప్పుడప్పుడు జరిగే సంఘటన.

శివ నిర్మాల్యం ''చండుడు ''అనే ప్రధముడి కే దక్కాలి. ఇతరులకు దక్క కూడదు. శివునికి అభి షేకం చేసే ముందు నిర్మాల్యం తీసేసి ''వచ్చందేశ్వరాయ నమః ''అంటారు. అందుకని కుమారస్వామి మొదలైన వారు అమ్మ దగ్గరకే వచ్చారు. మాతృ రూప ఉపాసనం క్షిప్ర ఫలదాయకం అని చెబుతారు.

యుద్ధం నుంచి తిరిగి వచ్చిన వారికి, శ్రమ పోగొట్టటానికి శ్రీ దేవి వదన కర్పూర మిశ్రిత తాంబూల శకలాలు ఉపయోగ పడినాయి అని అర్ధం. మహాదేవుని శిరస్సు పై ఉన్న చంద్రుణి వెన్నెల కూడా శివ నిర్మాల్యమే. దానిని కూడా వదిలి, వీరు అమ్మ తాంబూల కబళాలు స్వీక

రించారని భావం. దీని వల్ల ఆమె ముఖ సౌభాగ్యం స్తుతింప బడింది. .

**అమ్మ మాటల గొప్పదనం**

**66—''విపంచ్యా గాయంతీ, వివిధ మపదానం పశు పతే –స్త్వయా రబ్దే, వక్తుం, చలిత, శిరసా, సాధు వచనే**
**త్వదీయై ర్మాదుర్యై రపలసిత, తంత్రీ కల రవాం, –నిజాం వీణాం వాణీ, నిచుళ యతి చోళేన నిభ్రుతం. ''**

తాత్పర్యం –శివ కుటుంబిణీ !నీ ముందు కూర్చుని సరస్వతీ దేవి శివుని వీర గాధలు, అంటే త్రిపుర సంహారం, దక్ష యజ్ఞ ధ్వంసం, హాలాహల భక్షణం, జలంధర వధ, గజాసుర వధ లను వీణ తో గానం చేస్తోంది. అప్పుడు నీ మనస్సు సంతోషం తో నిండి, అనుగుణం గా శిరస్సును ఊగిస్తూ, మధుర వచనా లతో ప్రశం సిస్తున్నావు. నీ వచో మాధుర్యం ముందు సరస్వతి వీణా గాన మాధుర్యం నవ్వుల పాలైంది. ఆమె సిగ్గు పడింది. అప్పుడామే తన వీణ ను పై ముసుగు తో కప్పేస్తోంది. .

**67—''కరాగ్రే ణస్పృష్టం తుహిన గిరిణావత్సలతయా –గిరీశేనో దంతం, ముహురధర, పానా కులతయా**
**కర గ్రాహ్యం శంభోర్ముఖ ముకుర వృంతం, గిరి సుతే –కదం కారం, బ్రూమస్త వ చుబుక మౌపామ్య రహితం.**

తాత్పర్యం –అమ్మా విష్ణు సోదరీ !నీ తండ్రి హిమ వంతుడు నీ మీద మిక్కిలి పుత్రికా వాత్సల్యం తో నీ చుబుకాన్ని పునుకు తాడు. నీ పతి పశు పతి నీ క్రింది పెదవి మాధుర్యాన్ని చవి చూసే సందర్భం లో మాటి మాటికీ నీ ముఖాన్ని పైకెత్తు తు, శంభుని చేతి తో తీసుకోన దాగిన ముఖం అనే అద్దానికి పిడిని వర్ణించ టానికి తగిన వస్తువే లేక పోయింది. అలాంటి నీ చుబుకాన్ని ఎంతని వర్ణించాను ?

విశేషం –శివుడు శ్రీ దేవి చుబుకాన్ని చేత్తో పట్టుకొంటున్నాడు. కారణం –ఆమె ముకుర వృంత కనుక ఆ ముఖ దర్పణానికి చుబుకం పిడి అవటం వల్ల పట్టుకొని, ఆ అద్దం లో తన ప్రతి బింబాన్ని చూసు కొంటున్నాడు అని భావం. శృంగార సమయం లో స్త్రీలు తల వంచుకొని ఉంటారు. ఆ ముఖాన్ని పైకి ఎత్తితేనే ''సు చుంబనం ''అవు తుంది. అంటే చక్కని ముద్దు సాధ్యం అవుతుంది. సమగ్ర లావణ్యం కలిగింది కనుక చుబుకాన్ని పోల్చా టానికి ఏ వస్తువూ లేదు. అనుపమమైనది అని అర్ధం.

**68 –''భుజా శ్లేషాన్నిత్యం, పుర దమయిథుహ్ కంటక వతీ –తవ గ్రీవా ధత్తే, ముఖ కమల నాళశ్రియ మియం**
**స్వతః శ్వేతా కాల గురు బహుళ జంబాల మలినా –మ్రుణాలీ లాలిత్యం వహతి, యదదో హార లతికా ''**

తాత్పర్యం –మూల మంత్రాత్మికా !సహజం గా స్వచ్చ మైనదీ, కృష్ణా గరు చేత నల్లనైనదీ, ముత్యాల సరాలున్న తీగలు కలది , అయిన నీ కం ఠనాళం, కలువ తూడు లాలిత్యాన్ని, పొంది, త్రిపుర మదనుడైన ఈశ్వరుని బాహువు లచే, ఆలింగనం తో, నిత్యం రోమాన్చాలనం కలది ముఖ పద్మనాళ శోభ తో విరాజిల్లు తోంది.

విశేషం –ముఖం పద్మం. నాళం –కమల నాళం. పరమ శివాలింగానం తో కలిగిన రోమాన్చలం కలిగిన నాళం అందులోని కంటకాలు అంటే ముళ్ళు కంథం కింద పూయ బడిన క్రిష్ణాగరు గంధపు బురద. .ముత్యాల హారాల, తామర తూళ్ళు.

**69—''గళేరేఖాహాస్తిశ్రో, గతి గమక, గీతిక నిపుణా –వివాహ వ్యానద్ధ ప్రగున, గుణ సంఖ్యా ప్రతి భువ విరాజన్తే, నానావిధ, మధుర రాగా కర భువాం –త్రయాణాం గ్రామానాం స్తితి నియమ సీమాన ఇవతే ''**

తాత్పర్యం –కైవల్య పద దాయినీ !నీ గళం పై మూడు రేఖలున్నాయి. ఇవి, వివాహ వేళ వేయబడిన మంగళ సూత్రాలుగా ఉన్నాయి. తల్లీ ! మార్గ, దేశి అనే సంగీత గతుల యొక్క అయిదు రకాలైన స్వర గమకాల యొక్క గీతాలను పాడటం లో నీవు నిపుణవు..నీ గళం పై ఉన్న మూడు ముడతలు మూడు భాగ్య రేఖలు. వివాహ సమయం లో మంగళ సూత్రం కట్టిన తర్వాత, వాటి దగ్గర అనేక పేటలతో కలిపి, పేనిన,మూడు సూత్రాలను జ్ఞాపకం చేస్తున్నాయి. నానా విధ మధుర గానాలకు నిలయ మైన షడ్జ గ్రామ, మధ్యగ్రామ, గాంధార గ్రామాల ఉనికిని తెలియ జేయటానికి ఏర్పరచిన సరిహద్దుల్లా ఉన్నాయి.

విశేషం –పతివ్రతలు, తమ పతి ప్రాణాలను తమ మంగళ సూత్రాలలో ధరిస్తారు. ''బ్రహ్మ విశ్వేశ రూపేషు రంధ్ర శ్యేతం త్రి తంతుకం –త్రిరత్న, రుక్మజం, స్త్రీణాం, మాన్గల్యాభరణం విదుహ్ –

సంగీతం లో రాగానికి గతి, గమకం, గీతం అనేవి మూడు అంగాలు. రాగం నడక గతి. స్వరాల ఆరోహణావరోహణలు గమకం, నిర్దుష్టమైన స్వరాల క్రమం గా పాడటం గీ తం. సంగేతానికి షడ్జమ, మధ్యమ, గాంధార అనే మూడు గ్రామాలున్నాయి. ఏ గ్రామం లో ప్రారంభిస్తే ముగింపు కూడా ఆగ్రామం లోనే చేయాలి. ఈ రోజుల్లో గాంధారం లో పాడేవారు లేరని చెబుతారు. మాధ్యమంగా పాడే వారు చాలా తక్కువ మంది ఉన్నారని సంగీత విశ్లేషకుల అభి ప్రాయం.

శ్రీ భగవతి మాత్రం మూడు స్తాయిల్లోను, సంకరం కాకుండా, గానం చేయ గల నిపుణ. మంగళ సూత్రం అంటే పవిత్ర మైంది. కలంక రహిత మైనది. పరిశుద్ధ మైనది అని అర్ధం. ''పవెహ్ త్రాయతీతి పవిత్రః = =''పవి అంటే మృత్యువు. మృత్యువు నుండి రక్షించేదే మాంగల్యం –అందుకే పవిత్ర మైనది. మాంగల్య తంతువు (దారాలు )తత్వాలను సూచిస్తుందని దాని వల్ల ''బ్రహ్మమఃహ మస్మి''అనే స్మృతి రూపం లోని మేధస్సు యొక్క ప్రభ జనిస్తుందని భావన అని తెలియ జేశారు బ్రహ్మశ్రీ తుమ్మల పల్లి రామ లింగేశ్వర శర్మ గారు ''

**70— ''మ్రునాళీ మ్రుద్వీనాం తవ భజలతానాం చతుస్రునాం–చతుర్భి స్సౌన్దర్యం సరసి భవ స్తైతి, వదనైహ్ నఖేభ్య, స్సంత్రస్సన్ ప్రధమ, మదనాదంధక రిపో –స్చాతుర్నాం, శీర్శనాం సమ మభయ , హస్తార్పణ దియా''**

తాత్పర్యం –కామ కళా రూపా !పూర్వం శివుడు బ్రహ్మ యొక్క అయిదవ శిరస్సు ను తన వ్రేలి గోటి తో ఖండించాడు. అప్పుడు, మిగిలిన నాలుగు ముఖాలు తమను కూడా ఖండిస్తాదేమో నని భయం తో, ఈశ్వరుని కోపాన్ని పోగొట్టి, తమ నాల్గు తలలను కాపాడ టానికి అభయ హస్తం ఇవ్వ మని బ్రహ్మ –తన నాలుగు ముఖా లతో తామర తూడుల్లాగా మెత్త నైన నీ బాహు లతలను గురించి దీనం గా ప్రార్దిస్తున్నాడు

విశేషం –బ్రహ్మ చతుర్ముఖాలతో నాల్గు వేదాలతో స్తుతిస్తున్నాడని భావం. సృష్టించటం వల్ల లభించిన అహంకారమే బ్రహ్మ గారి అయిదవ తల. నాలుగు ముఖాలు ఉంటె, శ్రీ దేవి బాహువులను అహంకారం వదిలి బాగా వర్ణించ గలడు అని అర్ధం.

**71—''నఖానా ముద్యోత్రైర్న వన లిన రాగం, విహసతాం—కరాణంతే, కాంతిం, కదయ, కధయామః, కధముమే కయాచిద్వా, సామ్యం, భవతు కలయా, హంత కమలం –యది క్రీడల్లక్ష్మీ, చరణ తల లాక్షారుణ దళం ''**

తాత్పర్యం –ఉమా దేవీ !ప్రభాత కాలం లో, అప్పుడే వికసించిన తామర పూవు కాంతిని పరిహసించె గోళ్ల సముదాయం తో విలసిల్లె నీ హస్తాల శోభ ను ఎలా వర్ణించగలను ?కమలం లోని కమలాలయ యైన లక్ష్మీ దేవి పాదముల లత్తుక యొక్క ఎరుపు రంగును పొందితే, కొంచెం పోలికగా ఉందిఅన వచ్చు. అది కూడా సంపూర్ణ మైన పోలికకు తగదు. నీ నఖాగ్రాలు నిరుపమ శోభా రంజితాలు.

**72—''సమం దేవీ స్కంద, ద్విప వదన, పీతం స్తన యుగం –తవేదం, నఃఖేదం,హరతు, సతతం ప్రస్నుత ముఖం**

**యదా లోక్యా శంకా కులిత హృదాయో హాస జనకః –స్వకుమ్భౌ హీరంభః పరి మ్రుశతి హస్తేన ఝటితి ''**

తాత్పర్యం –సర్వేశ్వరీ !నీ స్తనముల యొక్క స్తన్య పానీయం చేస్తున్న వినాయకుడు, ఆ వక్షోజాలను చూసి, తన శిరః కుంభాలు అక్కడికి వచ్చాయేమో నని అనుమానంతో, తన కుంభ స్తలాన్ని, తన తొండం తో తడిమి  చూసు కొంటున్నాడు. ఇతని అమాయకత్వానికి పార్వతీ పరమేశ్వరులు నవ్వుతున్నారు. ఆ స్తనద్వాయాన్ని గణపతి, కుమారస్వామి, ఇద్దరు ఒకే సారి పానం చేస్తున్నారు. పుత్రవాత్సల్యం తో, పాలు పొంగుతున్న ఆ స్తనద్వయం, మా దుఖాన్ని పోగొట్టు గాక.

విశేషం –జగత్పూజ్యు లైన ప్రమద గణాధి పతి, దేవ సేనా పతి పుత్రులు గా గల శ్రీ దేవి, మహాత్మ్యం సర్వ లోకాతిశయం.ఆమె కుధ కుంభాలు స్వభావ సిద్ధం గా గజ కుంభాలు అని భావం.

**73—''అమూతే, వక్షోజౌ, వమృతరస, మాణిక్య కుతుపౌ –న సందేహ స్పందో, నగపతి, పతాకే మనసినః పిబంతౌ, తౌ, యస్మాదవిదిత, వధూ సంగ రసికౌ –కుమారా వద్యాపి, ద్విరద, వదన, క్రౌంచ దళనే ''**

తాత్పర్యం –శైలజా !నీ చనుల జంట అమృత రసం తో నిండి, మాణిక్య మయ కుప్పెలు గా ఉన్నాయి. ఇందులో సందేహమేమీ లేదు. కారణం –నీ చనుబ్రాలు త్రాగిన వినాయకుడు, కుమారస్వామి నేటికీ, యవ్వన ఉత్సాహం తో, ఆనంద రసాస్వాదన రసికులుకాకుండా, బాలురు గానే ఉన్నారు సుమా !

విశేషం –గణ పతి భార్యలు సిద్ధి, బుద్ధి. కుమారస్వామి భార్యలు వల్లీ, దేవసెనలు. వీరు శబ్ద వాచ్యులు, శక్తి స్వరూపులే కాని, స్త్రీ సుఖం ఇచ్చిన వారు కాదు. భ్రాంతిలో ఉన్న దాంపత్యం ఇది.

శివ శక్తి యోగ సాధన లో సాధకుడైన యోగికి లభించే రుతంబరా ప్రజ్ఞను గణ పతి అంటారు. ఈ ప్రజ్ఞయే శివ,శక్తుల కుమారుని గా చెబుతారు. ఈ ప్రజ్ఞ కలిగితే, బుద్ధి, సిద్ధి వశం అవుతాయి. వారి వలన విఘ్నాలను నివారించే వాడై,విఘ్న హంత అవుతున్నాడు గణపతి.

కుమారస్వామి భార్యలు వల్లీ దేవసెనలు. వల్లీ అంటే లతా. ఆమె సర్పాకృతిలో ఉన్న కుండలినీ శక్తి. దేవసేన అంటే తత్వ సముదాయం. గణపతి, కుమారస్వాములిద్దరు నైష్ఠిక బ్రహ్మ చారులే. ఈ ఇద్దరి బ్రహ్మ చర్య విషయం విస్పష్టం చేయటానికే, వీరి పూజా విధానం లో వటువులను పూజిస్తారు.

కుండలినీ శక్తి ని వ్యష్టి, సమష్టి పరం గా చెప్పవలసి వస్తే, సర్పం గా చిత్రించటం ఆచారం. స్త్రీ గా భావిస్తే కుమారి. పురుషుడిగా భావిస్తే కుమారుడు. సమష్టి కుండలిని సర్ప దేవత గా నాగ చతుర్ధి నాడు పూజిస్తారు. అది కుండలినీ శక్తికి ప్రతీక. నాగ పంచమి నాడు పూజించేది వ్యష్టి కుండలిని. అంటే వల్లీ దేవిని. -అంటే కుమారస్వామి అర్ధాంగి ని.

కుమారస్వామి దేవ సేనా నాధుడు. ఇంద్రుని కుమార్తె దేవ సేన కు అది పతి. తత్వ సముదాయమే దేవ సేన. జగత్తును నిర్మించటానికి తగిన సామగ్రియ ఈ తత్వ సముదాయం అంటే. కల్పాంతం లో ఈ తత్వాన్ని (చమువు )అంటే ఉపసంహరించేది చాముండా (చముండాతీతి చాముండా ).చండీ నవాక్షరాది పతి చాముండా –శివశాక్తియే రుతంభర ప్రజ్ఞా మూర్తి- బ్రహ్మ కు భిన్నుడు కాదు.సుబ్రహ్మణ్యం కూడా బ్రహ్మమే.

**74—‘’వాహస్త్యంబ, స్తంటే రామ దనుజ, కుంభ ప్రక్రుథిభిహ్ –సమారబ్ధాం, ముక్తామణి భిరమలాం, హారలతికాం**

**కుచాభోగో, బింబాధర రుచిభి , రంతశ్శబలితాం –ప్రతాపవ్యామిశ్రాం, పురదమయిథుహ్ కీర్తి మివతే ‘’,**

తాత్పర్యం –అంబా !గజాసురుని శిరస్సు యొక్క కుంభస్థలమే జన్మ భూమి గా కలిగి, కర్పూర వాసన, దోష రహిత మైన ముక్తామణుల హారాన్ని, నువ్వు, నీ విశాల స్తన మండలం మీద ధరిస్తున్నావు. నీ ఆధర బింబం యొక్క యెర్ర దనపు కాన్తులచే, ఆముత్యాల హారం, లోపలే పుట్టిన చిత్ర విచిత్ర కాంతులతో పరమ శివుని ప్రతాపాన్నీ, కీర్తినీ ధరించి నట్లుగా విరాజిల్లు తోంది.

విశేషం –శ్రీ దేవి హృదయ పీఠంమీద ఉన్న హారం, శివుని ప్రతాప కీర్తులను ప్రకాశింప జేస్తోంది. అంటే, ఆయన కీర్తి ప్రతాపాలు ఆమె హృదయ గతాలు అని భావం. ఆమె కంఠం లోని ఇతర ఆభరణాలు కూడా శత్రు సంహార లక్షణాలు కలవని అర్ధం. అధర కాంతితో మెరిసే భగవతి స్తనద్వయం పైనున్న హారం, జగదేక వీరుడైన త్రిపురారి అయిన శివుని శత్రువైన గజాసురుని కుంభ స్తలం లో ఉన్న, ముత్యాల లాగా, ఆమె కుచాల యందు నిక్షిప్తం అయాయి అని భావం. అలాంటి భగవతి యొక్క భర్త ప్రతాపం తో కూడిన

మూర్తి కీర్తిధారణ తో పతివ్రతా ధర్మాన్ని చూపిస్తోంది. శివ కీర్తికి ఉత్పత్తి స్థానం శ్రీ దేవి కుచాలు అని అంతరార్ధం.

**75—''తవస్తన్యం, మన్యే, ధరణీధర కన్యే హృదయతః –పయః పారావారః పరి వహతి సారస్వత మివ**

**దయాపత్యా దత్తం ద్రవిడ శిశు రాస్వాద్య తవ యత్—కవీనాం, ప్రౌఢానా జనని కమనీయః కవయితాః''**

తాత్పర్యం –శైలేంద్ర తనయా !పాల కడలి పైకి సారస్వత రూపం గా ప్రవహించే వాఙ్మయం గా నేను నిన్ను భావిస్తాను. లేక పోతే –మిక్కిలి పుత్ర వాత్సల్యం తో, నీవిచ్చిన చనూబాలు త్రాగి ఈ ద్రావిడ శిశువు (శంకరా చార్యులు )ప్రౌఢ కవులలో జగన్మోహను డైన కవిగా ఎలా కీర్తి పొందుతాడు ?

విశేషం –ఆమె హృదయం నుండి పాలు సారస్వతం లాగా ప్రవహిస్తున్నాయి. చిన్నప్పుడు శంకర భగవత్పాదుల వారు ఆలయానికి వెళ్లి అమ్మవారికి పాలు నైవేద్యం పెట్టె వారు. ఆమె త్రాగగా మిగిలిన పాలనే తండ్రి తనకు ఇస్తున్నాడని అనుకునే వారు. ఒక రోజు తండ్రి ఊరికి వెళ్లాడు కుమారుడు పాలు తీసుకొని ఆలయానికి వెళ్లాడు. దేవి త్రాగ లేదు. ఏడవటం ప్రారంభించాడు బాల శంకరుడు. ఆమె ప్రేమతో ఆ పాలను పూర్తిగా త్రాగేసింది. తనకు కొంచెం కూడా మిగిల్చ లేదని మళ్ళీ ఏడ్చాడు. ఆమె కనీ కరం తో తన స్తన్యాన్నిచ్చింది బాల శంకరులకు /.అది మొదలు ఆయనకు మహా ప్రజ్ఞ కలిగింది.

ఆరు మాసాల వయసు లో ఉన్న శంకరుడు దరిద్రాన్ని అనుభ వించాడు. తండ్రి భిక్షాటనానికి వెళ్లాడు తల్లి నీరు తేవటానికి పూర్ణా నదికి వెళ్ళింది. ఇంట్లో ఒక్కడే ఉన్న బాలుడికి ఆకలై ఏడ్చాడు. పార్వతీ దేవి జాలి పడి, ప్రేమతో ఎత్తుకొని, కంటి నీరు తుడిచి, స్తన్యాన్నిచ్చింది. పడుకో బెట్టి అదృశ్య మైంది. ఆ రోజు నుండే ఆయనకు సర్వ శాస్త్రాలు కరతలా మలకాలైనాయి శ్రీ దేవి అనుగ్రహం ఉంటె సర్వ విధ ఈప్సితాలు నేర వేరుతాయని భావం శివజ్ఞాన ప్రదం.

**76—''హర క్రోధ జ్వాలా వలిభి రవ లీడేన వపుషా –గభీరే తే నాభీ సరసి, కృత సంగో మనసిజః**

**సముత్తస్థౌ తస్మా దచల తనయే, ధూమ లతికా –జనస్తాం జానీతే, తవ జనని రోమావలి రితిహ ''**

తాత్పర్యం –హర ప్రియే !హరుని క్రోధాగ్ని జ్వాలల తో చుట్ట బడిన శరీరం తో మన్మధుడు తనను తాను కాపాడు కోవా టానికి లోతైన నీ నాభి మడుగు లో దూకి కాపాడుకొన్నాడు. కాలు తున్న వాడి శరీరం వల్ల పుట్టిన పొగతీగ చాలు ఒకటి, నీ పొక్కిలి నుంచి పైకి పాకి కన్పించింది. ఆ పొగతీగె చాలునే లోకం, నీ నూగారు గా బావిస్తోంది.

విశేషం –సాధన చేసే తప్పుడు కామోద్దీపన కలిగితే, వెంటనే భ్రు మాధ్యమ లో హరుని నిలిపి ధ్యానిస్తే (అక్కడ జ్ఞాన నేత్రం ఉండి కనుక )హృదయం లోని కామ తాపం నాభికి దిగి శాంతి లభిస్తుందని

పరమ రహస్యం. హరుని క్రోధం నుండి కాపాడ గల సమర్ధురాలు భగవతి మాత్రమె. అన్యులకు అసాధ్యం అని భావం.

**77—''యతే తత్కాళిందీ,తను తర తరంగాకృతి శివే –కృశేమధ్యే, కిన్చిజ్జనని తవ యద్భాతి సుధియాం**
**విమర్దా దంన్యోన్యం , కుచ కలశయో, రంతర గతం –తనూభూతం, వ్యోమ ప్రవిశదివ నాభిం, కుహరిణీం''**

తాత్పర్యం –హరు సామ్రాజ్నీ !కృశించిన నీ నడుము లో ముందుగా ఎదురుగా కన్పిస్తూ, యమునా నది యొక్క చిన్న చిన్న తరంగం లాగ, నల్లగా ఉన్న నీ నూగారు ఎలా ఉందీ అంటే –నీ కుచ కుంభాలు రెండు ఒరుసుకోవటం వల్ల, వాటి మధ్య ఉన్న ఆ కాశం, ఆ ఒరిపిడికి ఆగ లేక నలిగి పోయి, నల్లగా మారి, సన్నగా నాభి వరకు కిందికి లక్క జారి నట్లు జారినది గా భావిస్తున్నాను.

విశేషం –భగవతి రోమ రాజి, ఇతరులకు కన్పించాడు. గిరీశుడైన శివునికే కన్పిస్తుంది. ఆమె స్తనాలు పరి పుష్టాలు. అదే భాగ్య లక్షణం. రోమావళిఅతి సూక్ష్మం. ప్రకాశామానం గా ఉంటుంది. ఆకాశం నుంచి వాయువు దాని నుంచి అగ్ని, దాని నుండి జాలం, దాని నుండి భూమి జన్మించాయి. ఉరాసి స్తానం లో అనాహత చక్రం, దాని పై విశుద్ధ చక్రం ఉంటాయి. అది ఆకాశ తత్వానికి గుర్తు. విశుద్ధ స్తానం లో ఉన్న ఆకాశ తత్త్వం నలిగి, సన్నగా కిందికి జారుతోందని భావం.

హృదయం సూర్య మండలం. యమున సూర్య తనయ. నాభి నుంచి జారే ఆకాశ తత్త్వం సూర్య మండలం నుంచి కిందికి జారుతోంది. కనుక యమునా నదితో పోల్చారు. ఇడా,పింగళా సుషుమ్నా నాడులే గంగా, యమునా, సరస్వతి నదులు. పింగళ అంటే యమున యే. ప్రాణ వాయువు వల్ల షట్చక్ర భేదం, గ్రంధి త్రయ భేదనం జరుగుతుందని అర్ధం. కాళిం దీనామ, యమునా నామం గల పింగళా నాడీగత ప్రాణ క్రియను వివరించటమే శ్రీ శంకరులు చేసిన ప్రయత్నం.

**78—''స్తిరో గంగా వర్త స్స్తన ముకుర రోమావళి లతా –కలావాలం, కుండం, కుసుమ శర తేజో హుత భుజః**
**రతేర్లీలా గారం, కిమపి, తవ నాభిర్గిరి సుతే –బిలద్వారం, సిద్దేర్గిరిశ,నయనానాం,విజయతే ''**

తాత్పర్యం –త్రిపుర సుందరీ !నీ నాభి స్తిరమై, వినాశం లేని గంగా నది. పాలిండ్లు అనే పూల మొగ్గలు పూసిన, రోమ రాజి అనే, తీగ పాదు,మన్మధ తేజస్సు అనే అగ్నికి హోమ గుండం గా ఉంది. అది రతీ దేవికి విహార గృహం. ఈశ్వర నేత్ర తపస్సిద్ధికి గుహాముఖం. వర్ణించ టానికి వీలు కాని చెలువం అంటే శోభ కలది

విశేషం –శివుడి కన్నుల ఫలం ఏమిటి ?మంచి దృశ్యా లను చూడటం. ఆమె నాభియే, ఆయన చూపులకు ఫలసిద్ధి. శివుని మూడో నేత్రం చూపు వల్ల దానికేమీ భయం లేదు. కారణం అది ఇది వరకే అగ్ని గుండం కనుక. నాభి దగ్గర స్వాధిష్ఠాన చక్రం ఉంది.అక్కడే భగవతిని ఉపాశించాలి. నాభి బిల ద్వారమే కాని బిలం కాదు. బిలం –స్వాధిష్ఠాన చక్రం. అక్కడ మన్మధుడు దేవిని ఉపాసిస్తున్నాడు. శివుని తపస్సు

కూడా అక్కడే ఫలిస్తుందని అర్ధం. ఆమె నాభి, బిలద్వారం గిరీశనయనాలకు తపస్సిద్ధి కల్గిస్తుంది. ఇతరు లెవరు దానిని చూడ లేరు.

**79—''నిసర్గ క్షీణస్య స్తన తట భరేణ క్లమ జుషో –నమన్మూర్తే, ర్నారీ తిలక,శనకై స్త్రుట్యత ఇవ**

**చిరంతే మధ్యస్య, త్రుటిత తటినీ తీర తురుణా –సమానస్థాస్తే మ్నో భవతు కుశలం శైల తనయే**

తాత్పర్యం –కపర్దినీ !నారీ తిలకమైన నువ్వు స్వభావ సిద్ధం గానే బాగా కృశించి, సన్నదైనదీ, స్తన భారం తో బడలిపోయి, వంగినదీ, మేళ మెల్లగా తెగి పోతుందేమో అన్నట్లు ఉండేదీ, ఒడ్డు విరిగిన ఏటి గట్టు పై ఉన్న చెట్టు లాగా ఉన్న, నీ నడుము చిరకాలం మాకు సౌఖ్యాన్నివ్వాలి.

విశేషం –నడుము చాలా సన్నగా ఉండి, పడి పోతుందేమో అన్నట్లున్నా, శరీరం నిలిచే ఉండి. నడుము క్రుశించినా శ్రీ దేవి మహాదేవుని భాగ్య వశం తో నిల్చి ఉండి అని భక్తీ రాసొంమేశితం అయిన హాస్యోక్తి. ఆమె నడుము విరిగితే, సకల లోకాలకు విలయమే. జగత్ క్షేమం కోసం ఆమె నడుం చిర కాలం ఉండాలి. నడుము అతి సూక్ష్మ మైనదీ, అతి సారవత్వ మైనది అని భావం.

**80—''కుచౌ సద్య స్స్విద్యత్తట ఘటిత, కూర్పాసభి దుశౌ—కషంతౌ దోర్మూలే,కనక కలశాభౌకలయతా**

**తవ త్రాతుం, భంగా దలమితి వలగ్నం తను భువా –త్రిధా నద్ధం, దేవి, త్రివలి లవలీవల్లి భిరివ**

తాత్పర్యం –ముక్తి నిలయా !ప్రకాశ స్వరూపం గల తల్లీ !చెమట తో పార్శ్వాలను అంటుకొన్న రవికను, పిగులుస్తున్నవి, బాహుమూల సమీప ప్రదేశాలని ఒరుచు కుంటున్నవీ, బంగారు కలశాల సౌందర్య సౌభాగ్యాలతో కూడినవీ, అయిన నీ స్తనాలను నిర్మిస్తున్న మన్మధుడు, వాటి బరువుకు నడుము ఒంగి పోకుండా ఉండటానికి, ఏలకి లత చేత మూడు చుట్లు చుట్టాడా అన్నట్లు నీ ఉదరం పై మూడు ముడతలు కన్పిస్తున్నాయి.

విశేషం –నడుము వంగి పోకుండా మహాదేవుని అనుగ్రహం పొందటానికీ, మన్మధుడు మూడు కట్లు కట్టాడు. అతడు తను భవుడు. అంటే శరీరం లో నిత్యం ఉండే వాడు. దేహ యోగాక్షేమాదులను నిత్యం గమనిస్తాడు మన్మధుడు. స్వస్థాన పరి పాలనా దక్షుడు. లలితా సహస్ర నామాలలో ''స్తన భార లసన్మధ్య పట్టభందవలిత్రయా '' అన్నదానికి ఇది కవిత్వీకరణ. బిగి చన్నులు, సన్నని నడుము, మూడు ముడుతలు ఉత్తమ స్త్రీల లక్షణాలు.

**81—''గురుత్వం, విస్తారం, క్షితి ధర పథిహ్ పార్వతి నిజా –న్నితంబా, దాచ్చిద్య త్వయి, హరణ రూపేనా, నిదధే**

**అతస్తే, విస్తీర్ణోగురు రాయ మశే షాం వసు మతీం –నితంబ, ప్రాగ్భారః శ్తగాయతి లఘుత్వం నయతిచ ''**

తాత్పర్యం –ప్రాణ దాత్రీ పార్వతీ దేవీ !కొండ ల రాజైన నీ తండ్రి హిమ వంతుడు తన నితంబ ప్రదేశం నుంచి కొంత గురుత్వాన్ని, వైశాల్యాన్ని తీసి, నీ వివాహ సమయం లో తాను కుమార్తె కిచ్చే, కానుక గా

నీకు సమర్పించాడు. నీ పిరుదుల అతిశయంచాలా గొప్పదీ, వెడల్పైనదీ అయి, భూమి నంతా, కప్పుతోంది. భూమి దీనితో చులకన అయి పోయింది.

విశేషం –భగవతి పిరుదులు భూమిని తిరస్కరిస్తున్నాయి. అంటే –భూమి ఆమె కు పీ ఠమైంది. శ్రీ దేవి ప్రకృతి స్వరూపం. భూమిని ఆశ్రయించిన శోభ అంతా ప్రకృతి శోభే ఆమె శోభ. ప్రాకృతిక శోభకు గిరి పుత్రిక లైన నదులే ఉదాహరణలు.

ఆమె నితంబ సౌభాగ్యం ముందు సకల భూ బింబం చులకన అవుతుంది,వేల వేల బోతుంది. ఆమె పాదాక్రాంత మైన భూమి ఇలా అవటం లో తప్పేమీ లేదని సమర్ధిస్తున్నారు శ్రీ శంకరులు. మార్కండేయ పురాణం లో "సదదర్శ, తతో దేవీం, వ్యాప్య, లోకత్రయం, త్విపా — దాక్రాన్త్య, నత భువం, కిరీటోల్లిఖితాంబరాం –క్షోభి తాశేష పాతాలం, ధనుర్జ్యానిహ్ స్వనేన తాం –దిశో భుజ సహస్రేణ సామంతా, ద్వాప్య సంసిద్ధతాం "అనేది దీనికి నిదర్శనం

**82—"కరీన్ద్రానాం, శుం డాస్,కనక కదళీ, కాండ పటలీ—ముఖాభాం, మూరుభ్యాముభాయ మపి నిర్జిత్య భవతే**

**సువృత్తాభ్యాం, పత్యుహ్ ప్రణతి కఠథినాభ్యాం, గిరి సుతే –విదిజ్ఞే, జానుభ్యాం, విబుధ, కరి కుంభ ద్వయ మసి'',**

తాత్పర్యం –వేద విజ్ఞాత్రీ !వేద ధర్మాన్ని చక్క గా అనుష్టించే గిరికన్యవు. నీ తొడల అందం దిగ్గజాల తొండాలను, బంగారు అరటి స్తంభాలను మించి ఉంది.శోభనం గా, వర్తులం గా ఉంది. సదా శివుడు నీకు మొక్కే తప్పుడు భూమిని స్పృశించటం వల్ల, కాయలు కాచిన మోకాళ్ళచేత, ఐరావతం యొక్క కుంభ ద్వయాన్ని కూడా జయించి ప్రకాశిస్తున్నావు.

విశేషం –భగవతి సర్వ సౌభాగ్య లక్షణాలు కల మహా పతివ్రత. జగాలను కానిదీ, ధరించేదీ. ప్రళయ కాలం లో మేల్కొని, ఉండేది భగవతి. "సుతే జగంతి భగవతీ భవతీ, భిభర్తి, తత్ క్షయ కృతే భవతీ భవానీ "అని కాళి దాస మహా కవి చెప్పాడు. లలితా సహస్ర నామాలలో కూడా "కామేష జ్ఞాని సౌభాగ్య, మార్దవో రుద్వయాన్వితా, మాణిక్య మకుటా కార జాను ద్వయ విరాజితా "అని ఉంది

**83—"పరాజేతుం, రుద్రం, ద్విగు, శర గర్భౌ గిరిసుతే –నిషం గౌ జఘ్నేతే, విషమ, విశిఖో బాద, మక్రుత**

**యదగ్రే, దృశ్యంతే, దశ, శర ఫలాఃపాద యుగళీ—నఖాగ్రచ్ఛ ద్మాన, స్సుర మకుట శానైక నిశితా**

తాత్పర్యం –రుద్రాణీ !"రుద్రుని జయించ టానికి మన్మధునికి, తన దగ్గరున్న అయిదు బాణాలు చాలనే లేదు. అందుకని, పది బాణాలు గా చేయ దలచి, నీ పిక్కలను అమ్ముల పొదిగా, ,కాళి వ్రేళ్ళను బాణాలుగా, వ్రేలి గోళ్ళను బాణాల చివర పదును పెట్టి ఉంచిన ఉక్కు ముక్కలుగా, చేసుకొన్నాడు. నీకు

నమస్కరించే దేవతల కిరీటాలలో ఉన్న మణులు అనే ఒరిపిడి రాళ్ళ పై నఖాగ్రాలు అనే ములుకులు పదును పెట్ట బడ్డాయి.

విశేషం –మదనుడు పది బాణాలను సంపాదించుకొన్నాడు. ఇది రుద్ర విజయ సాధనార్థత వల్లనే అని భావం. లలిత లో ''ఇంద్ర గోపా పరిక్షిప్త, స్మర తూణాభ జఙ్ఘికా ''అని ఉంది. శ్రీ దేవి జం ఘలు మదన తూణీరాల వలె, అతి లోక రమ్యాలు అని అర్ధం.

**84—''శ్రుతీనాం మూర్ధానో, దధతి తవయౌ, శేఖర తయా –మమాప్యే తౌ మాతఃశిరసి దయయా ధేహి, చరణౌ యయోహ్ పాద్యం పాథఃపశు పతి, జటాజూట తటినీ –యయోర్లాక్షా లక్ష్మీ, రరుణహరి చూడా మణిరుచిహ్''**

తాత్పర్యం –పాశు హస్త్రీ !వేదాల శిరస్సులు అని పిలువబడే ఉపనిషత్తు లే, సిగ పూలు గా ధరించబడినవి. పశు పతి జటా జూటం లోని గంగా జలం చేత ప్రక్షాళనం చేయ బడినవీ, ఎర్రగా ఉన్న శ్రీ హరి కౌస్తుభ మణి కాన్తులే, లాక్షా రస కాంతి గా కలవీ, అయిన నీపాదాలను, నా తల పై ఉంచి నన్ను అనుగ్ర హించు.

విశేషం –ప్రణయ కోపం పోగొట్ట టానికి పశు పతి దేవికి ప్రణుతి చేస్తాడు. ఆయన శిరసు లోని గంగా జలం శ్రీ దేవి పాదాలను కడుగు తుంది. అంటే గంగ ఆమె కు పాద్యజలం అయి పవిత్ర మైంది అని భావం. ప్రతి రోజు ఉభయ సంధ్యల్లో నమస్కరించే విష్ణువు మకుటం లోని కౌస్తుభ మణి తెల్లగా ఉన్నప్పటికి, శ్రీ దేవి చరణాలకున్న లత్తుకయొక్క ప్రసాదం వల్ల ఎరుపు రంగుగా ప్రకాశిస్తోంది.

భగవతి పాదాంబుజ ద్వయం వేదాల శిరస్సు లందు, సదా శివుని శిరస్సు నందు, విష్ణువు శిరస్సు నందు సంచరిస్తోందని, మూర్ధ అంటే శిరస్సు పై సంచరం ఆమె పాదాలకు ఉన్నదని, భావం. అలాంటి పాదాలను తన శిరసు పై ఉంచమని భగవత్పాదులు కోరుతున్నారు భగవతి పాద ప్రక్షాలన జలం తో హరి, బ్రహ్మ మొదలైన దేవతలు పవిత్రు లవుతున్నారని అర్ధం. ఆ మహిమ తోనే వారు తమ అధికారాలను పొంది, నిర్వ హిస్తున్నారు.

శృతి శిరస్సు లైన ఉపనిషత్తులకు భగవతి చరణాలు సిగ పూలు గా ఉన్నాయి అంటే, సమస్త వేదాంత ప్రతి పాదనలు భగవతి చరణాలే అని భావం. ''లోకస్య ద్వారా మర్చి యత్పవిత్రం ''అని శృతి అంటోంది. ''యం, కామయ తం తముగ్రం, క్రునోతి తం బ్రహ్మణం, తమ్రుషిం, తం సుమేదాం –అహం రుద్రాయ, ధనురాతనోమి, బ్రహ్మ ద్విశే, శరవే, హంత వా ఉ ''భక్తులకు అతి మహత్తు నివ్వ టానికి భగవతి పాదాలే శరణ్యం. శ్రీ దేవి కూడా పశు పతికి ప్రణామం చేయటం వల్ల ఆమె జానువులు భూమికి తాకటం చేత కఠినా లైనాయని భావం. వారిద్దరూ సమ ప్రధానులు. సమాన మైన బల, సత్వాలున్న వారు. సమ ఓజస్సు, తేజస్సు ఉన్న వారు. కనుక శివుడు కూడా ఆమె కు నమస్కరించటం సమంజసమే నని సమర్ధిస్తారు శ్రీ శంకరులు. ''సమ ప్రదానౌ, సమ సత్వౌ, సమౌజసౌ, వ్రుభా దాతారా, విహ సౌభగానాం ''అని వేదం అంటోంది.

**85—''నమో వాకం బ్రూమో, నయన రమణీయాయ పదయొహ్—తవాస్మై ద్వంద్వాయ స్ఫుట రుచిర సాలక్త కవతే**

**అసూయత్యత్సంతం , యదభి హననాయ, స్పృహ యతే –పశూనా మీశానః ప్రమద వన కంకేళి తరవే ''**

తాత్పర్యం –మలయా చల వాసినీ !ణీ పాదాల తాడనం చేత పుష్పించిన అశోక వృక్షాన్ని చూసి, ణీ భర్త ఈశ్వరుడు అసూయ పడుతున్నాడు. ఆ పాదాలు నాయన రమణీయంగా, తడి లత్తుక తో ప్రకాశిస్తున్నాయి. అలాంటి ణీ పాద ద్వయానికి నమో వాకాలు

విశేషం –ప్రణయ కలహం తో, అనుగ్రహం గా శ్రీదేవి పాద తాడనం లభిస్తుందేమో నని శివుడు ఎదురు చూసి నిరాశ చెందాడు. అచేతన వస్తుయిన అశోక వృక్షం ఆమె పాదాల తాకుడుకు పుష్పించటం చూసి ఆ చెట్టు పై అసూయ చెందాడు. ప్రణయ కలహం లో కూడా భర్తను పాద  తాడనం చేయ లేదు. .కనుక ఆమె పాతి వ్రత్యం చాలా గొప్పది. లక్ష్మీ సరస్వతులకు ఇంత ఘనత లేదని ధ్వని.

అశోక వృక్షం పద్మినీ జాతి స్త్రీల పాద తాడనం వల్ల పుష్పిస్తుంది. "అశోకశ్చ రణ పాతే ఙ్ఞాయతే పుష్పవత్తరం "దీనినే "దోహదం" అంటారు '.పరమ శివుడు కూడా శ్రీ దేవి పాద తాడనాన్ని కోరుతున్నాడు. అంటే –మన వంటి వారికి జన్మాంతర సుకృతం లేక పోతే, ఆమె చరణసేవ లభించ లేదు. అశోకం అంటే శోకం లేనిది. శివుడు శోక రహితుడే. ఆయన పాశ ముక్తుడు "పాశా బద్ధ స్తదా జీవః పాశా ముక్తః సదా శివః –పాశా బద్ధ పశుహ్ ప్రోక్తః పాశా ముక్తః పశు పథిహ్ "

**86—''మృషా కృత్వా, గోత్రస్థలన మథు వైలక్ష్య నమితం –లలాటే భర్తారం, చరణకమలే, తాడయతి తే**

**చిరా దంత శ్శల్యం దహన కృత, మున్మూలిత వతా –తులా కోటి క్వాసైహ్ కలి కిలిత మీశాన రిపుణా''**

తాత్పర్యం –విశ్వ మాతా !పొరపాటులో అకస్మాత్తుగా, నీ ఎదుట, నీసవతి పేరు చెప్పి, తన తప్పు తెలుసుకొని, ఏమీ చేయటానికి పాలు పోక, నీకు నమస్కరించే నీభర్తనుపశు పతి నాదుడిని నీవునీ చరణ కమలం తో నుదుట తాడనం చేస్తే ఆ శివ వైరి యైన మన్మధుడు శివ లలాటాగ్ని బాధతో చాలా కాలం గా బాధ పడుతూ ఇప్పుడు సమయం దొరికింది కదా అని మంజీరధ్వని రూపం గా కిల కిలా రావాలను మన్మధుడు చేసి నట్లుగా ఉంది,నీ మంజీర ధ్వని.

విశేషం –పొరా పాటున పేరొక స్త్రీ పేరు చెప్పటాన్ని గోత్ర స్కలనం అంటారు. అలా శివుడు చేసి నందుకు పర మేశ్వరుడు అని కూడా చూడ కుండా జగదీశ్వరి పాద స్పర్శ విధి చేసింది. ఆయన కోరుకోన్నదీ అదే. ఇక తన బోటి వారికి ఆమె చరన కమలాలే కదా గతి అని శ్రీ శంకరుల భావం. అది కూడా పూర్వ జన్మ సుకృతం వల్ల మాత్రమె లభించాలి.

తను చేసిన పొరబాటుకు లజ్జితుడై శివుడు దేవి ముందు తల వంచుకొన్నాడు. గోత్రస్థలన ప్రభావం శ్రీ దేవి చరన ప్రహార సౌభాగ్యమే అని భావించాడు. అందుకే వంగి వంగి నమస్కరిస్తున్నాడు. మన్మధుడు

చాలా కాలం గా ఉన్న హృదయ శాల్యాన్ని (శల్య తుల్య మైన వైరాన్ని )వెల్ల దించాడు. ఇదీ వీర ధర్మమే. అతనికిది ఉచిత సమయం కూడా.

శ్రీ దేవి శివుని లలాతాన్ని తాడనం చేసింది అక్కడ ఉన్నది "ఫాల నేత్రాగ్ని ".శ్రీ దేవిని ఆశ్ర యించి ఉన్న మన్మధుడు శత్రువుల దర్పం అణచి వేసేట్లు సింహ నాదం చేశాడని అర్ధం. ఇంతకు ముందున్న శ్లోకం లో శివుడు శివానీ యొక్క పాద తాదనాన్ని కోరాడు. ఈ శ్లోకం లో దాన్ని తీర్చారు శంకరా చార్యస్వామి.

''గాన్త్రాయతే ఇతి గోత్రం "అంటే ఇంద్రియ సంయమనమే గోత్రం. గోత్ర స్ఖలనం అంటే ఇక్కడ ఇంద్రియ సంయమనం జారి పోవటం. అంటే తగ్గినా ఇంద్రియ సంయమనాన్ని, తిరిగి పరి పుస్తం చేసుకోవటం దీనినే "పై లక్ష్య నమితం "అంటారు అంటే –లక్ష్యం తో కూడిన దృష్టి. కిందికి జారటం అని భావం. యోగా శాస్త్రం లో దీన్ని "శాంభవీ ద్రుష్టి "అంటారు. అంటే శాంభవీ ముద్ర సందర్భ ద్రుష్టి. "అంతర్లక్ష్యం బహిర్ద్రుస్తిర్నిమేషోన్వేష వర్జితా, సా ఏషా, శాంభవీ ముద్రా సర్వ తంత్రేషు గోపితా "బయటి ద్రుష్టి లక్ష్యం పై ఉండదు. కన్నులు తెరచి, అర మోడ్పు గా ఉంటాయి. అప్పుడు జాలన్ధర బంధనం లో శిరస్సు ముందుకు వంగుతుంది. గడ్డం కంతం లోని గుంత వరకు దిగి పోతుంది. ద్రుష్టి నేలకు ఒరుగుతుంది. ఇదే పై లక్ష్య నమితం అంటే. అప్పుడు కుండలినీ శక్తి జాగ్రుత మై, శీఘ్రమే ఆజ్ఞా చక్రాన్ని ప్రవేశించి, శివ లలాటం లో కాలు పెట్టి, సహస్రా దిశా గా పైకి పరుగు తీస్తుంది

దేహాన్ని భరించే వాడు భర్త. అంటే దేహాభి మాని. ఆజ్ఞా చక్రం వరకు సాధకునికి దేహ స్మృతి ఉంటుంది. దాటగానే ఉన్మనీ స్తితికి అభి ముఖం గా సంచారం జరుగుతుంది. అప్పుడు దేహ స్మృతి ఉండదు. దేహాభి మానం మాయ మవుతుంది ఇదీ ఇందులోని రహస్యం అని వివ రించారు శ్రీ తుమ్మల పల్లి రామ లింగేశ్వర శర్మ గారు. శ్రీ శంకరా చార్యుల వారు శ్రీ దేవి అంగ ప్రత్యంగా వర్ణన లో కామదేవుడిని సహాయోగం గానే చెప్పారు. అంటే చని పోయిన మన్మదుడికి, అనంగ రూపంతో పునర్జన్మ శ్రీ దేవి కరుణ వల్లనే లభించింది. ఆమె కృప తో లోకాలను జయిస్తు, తన పని చేస్తున్నాడు. అంటే కాముడు ఉపాశించి ఆమె తో సాయుజ్యం పొందాడు. అందుకే కామదేవుని రూపం అమ్బికయే అని చెప్పారు శర్మ గారు.

శ్రీ దేవి పంచ దశాక్షరీ మంత్రం అంటే "కాదివిద్య "లో మొదటి అక్షరం "క "కారమే. ఈ అక్షరం గొప్ప తనాన్ని "త్రిపుర తాపిన్యుపనిషత్తు "చాలా బాగా వివ రించింది

''స ఎకో దేవః శివ రూపే ద్రుష్యత్వే న వికాసతే –యతిషు, యజ్ఞేషు, కామయతే, కామం జాయతే –స ఏష నిరంజనో, కామత్వే నో జ్రుమ్బతే అ క చ ట ప –యశాన్ సృజతే తస్మాదీశ్వరేహ కామో భి ధీయతే –తత్పరి భాషయా కకారం వ్యాప్నోతి "

దీని భావం –ఆ ఒక్క దైవమె శివుడు గా కనీ పిస్తున్నాడు. యతులలో, యజ్ఞం లో, యోగులలో "కామన "చేస్తున్నాడు. అందుకే కాముడు అని పిలువబడుతున్నాడు. నిరంజనుడు, కామ రహితుడు అయిన ఆ

శివుడే విజ్రుమ్భించి అ,క,చ, ట,త, ప, య, శ,,వ, ర వర్ణ సమామ్నాయాన్ని సృష్టిస్తున్నాడు. కనుక ఈశ్వరుడే కాముడు. -అంటే కామేశ్వరుడు. అంటే క కారం వల్ల వెలిసే వాడు

సృష్టించే సృజన శక్తి కామ శక్తే. ఇచ్ఛ అంటే ''కామన ''యే. సృజన చేయాలన్న ''ప్రజనన వాసన ''ను కామ వాసన అంటారు. ఇది సృజనాభి ముఖ మైన శివ శక్తి. ఇది ప్రసవ భావం తో ''శివా ''అవుతుంది. సృష్టి అంటే ప్రభవం,లయం దాని విపరీత భావనలు పరస్పర విరుద్ధం గా ఉంటాయి.

సమాధి సమయం లో శివుడు కాముడిని శత్రువు గా భావించి జయిస్తునాడు. సృష్టి కార్యాచరణ సమయం లో కాముడు శివుని అర్ధాంగి గా మారి సృష్టి కార్యానికి సహా యోగిఅవుతున్నాడు. సమాధి వేళ తన ప్రజ్ఞా నేత్రాగ్ని చేత కాముని దహిస్తే, సృష్టి వేళ వాడే పరిహాస ముఖు డవుతున్నాడు. అంటూ విశేశార్ధాలను విస్పష్ట పరచారు రామ లింగేశ్వర విజ్ఞులు.

**87—''హిమానీ హంతవ్యం, హిమగిరి నివాసైక చతురౌ –నిశాయాం, నిద్రాణం,నిశిచ పర భాగే చ, విశదౌ పరం లక్ష్మీ పాత్రం, శ్రియ మతి,సృజన్తే సమయినాం –సరోజం త్వత్పాదౌ, జనని, జయ, తశ్చిత్ర మిహికిం ''**

తాత్పర్యం –శివ శక్త్యై క రూపిణీ !మంచు కొండ పై నివసించి, నడిచే నేర్పు కల వీ, అన్ని వేళలా ప్రసన్న మైనవీ, సమయాచారు లైన నీ భక్తులకు సౌభాగ్యాన్ని కల్గించేవి అయిన నీ పాదాలు మంచు వల్ల నాశనం పొందేవీ, రాత్రి ముడుచుకొని పోయేవీ, లక్ష్మీ దేవికి పీఠమైనవీ, అయిన కమలముల కాంతులను మించి అతిశయిస్తున్నాయి.

విశేషం –రాత్రులు తమస్సుకు ప్రదానాలు. నీల కాంతి కలవి. పాదాలేమో అరుణాలు ఈ రెండు రంగుల మిశ్రమం గొప్పది. దేవీ చరణ భక్తీ భావం తో కూడిన శాస్త్రం ''సమయ మతం ''అంత రంగిక పూజ కు విలువ నిచ్చేది. హృదయం లో భగవతిని ఉపాసించే వారికీ అంటే సమయాచారులకు సర్వ వితర్క విలయ పూర్వకం, ఐశ్వర్యం సృష్టి ప్రకాశమైన దాన్ని భగవతి సృజిస్తుందని భావం. అంబ స్తవం లో ఇలా అని ఉంది–

''యావత్పరం, పద సరోజ యుగం, త్వదీయం –నాంగీ కరోతి హృదయేశు, జగచ్ఛరన్యే –తావద్వికల్ప జటిలః కుటిల ప్రాకారా –స్టార్క గ్రహాఃసమయినాం, ప్రళయం న యాతి ''

**88—''పదం తే, కీర్తీనాం, ప్రపద మపదం దేవి, విపదాం—కదం నీతం సద్భిహ్ కతిన కమఠీ కర్పూర తులాం కథంవా, పాణిభ్యా, ముపయ మన కాలే పురభిదా –యదాదాయ న్యస్తం ద్రుషది, దయా మానేన, మనసా''**

తాత్పర్యం –కౌలమార్గ తత్పర సేవితా భవానీ !సత్కీర్తులకు నిలయమై, ఆపదలను తొలగించే, నీ మీగాలు (అడుగు పై భాగం )ను, కవులు ఆడు తాబేలు వీపు చిప్పతో పోలుస్తున్నారు. దయా పూర్ణ

మనస్సుగల శివుడు, మీ వివాహ సమయం లో నీ పాదాలను కఠిన శిల యైన సన్ని కల్లు రాయి మీద ఉంచటానికి మనసు ఎలా ఒప్పిందమ్మా ?

విశేషం –దయామయుడైన శివుడు శ్రీదేవి పాదాన్ని ఎలా ఉంచ గలిగాడు ?పూర్వ కవులు తో బాటు, పురభేది కూడా వివేకం లేకుండా ప్రవర్తించారు. వివాహ సమయం లో సప్తపది క్రియ లో వధువు పాదాన్ని వరుడు సన్ని కళ్ళు పై ఉంచటం ఆచారం. "గూడ గుల్ఫా, కూర్మ పృష్ట, జయిష్ణు ప్రపదాన్వితా "అని లలితా సహస్ర నామాలున్నాయి. సప్త పడిలో "అతిష్ట మమ శ్మాన, మష్మే వత్వం, స్థిరాభవ "అన్న మంత్రం చదువుతారు. అంటే సన్నీ కళ్ళు లాగా మనసు ద్రుధంగా ఉంచుకోవాలని భావం. .

**89—"నఖి ర్నాక స్త్రీణాం, కరకమల, సంకోచ శశిభిహ్ –స్తరూణందివ్యానాం, హసత,ఇవ, తే చండి చరణౌ**

**ఫలానిస్వస్తేభ్యః కిసలయ, కరాగ్రేణ,దదతాం –దరిద్రేభ్యో భద్రాం శ్రియ, మనిశ, మహ్నాయ దదతౌ ''**

తాత్పర్యం –అమ్మా చండీ దేవీ !సకల సంపదల చె, తుల తూగే స్వర్లోక వాసు లైన దేవతలకు మాత్రమె, చిగురు తాకులు అనే హస్తాలతో కోర్కెలను తీర్చే కల్ప వృక్షాలను దరిద్రులకు కూడా, సర్వ లోకాల్లో తరుగు లేని సంపదలను శీఘ్రం గా ఇచ్చే నీ పాదాలు –శచీ దేవి మొదలైన దేవతా స్త్రీల కర పద్మాలను ముకుళింప జేసే గోళ్ళు అనే చంద్రుల చేత పరిహాసం చేస్తున్నాయేమో అన్నట్లున్నాయి.

విశేషం –స్వర్గ లోక దేవతలకు కోరిన కోరికలను దేవి చరణాలు నెమ్మది గా టీరుస్తున్నాయి. కాని, అన్ని లోకాలలోని, దీనులకు తిరుగు లేని, మంగళ కర మైన సంపదలను వెంటనే ఇస్తున్నాయి.

కల్ప వృక్షాలు కరాగ్రాలతో స్వర్గ లోక వాసులకు కొద్ది రోజుల్లోనే అనంత సంపదల నిస్తున్నాయి. భగవతి చరణాలు ఐహిక, ఆముష్మిక సుఖ, సంతాన, సముల్లలిత సంపదను వెంటనే ఇస్తాయి. అందుకే నఖాలు నవ్వుతున్నాయి అని చమత్కరించారు భగవత్పాదులు.

గోళ్ళను చంద్రుని గా చెప్పటం అవి అతి తెల్లదనం కలవని చెప్పటమే. శ్రీ దేవి పాద కమలాల ముందు కల్ప తరువు న్యూనత చెందినదట. అవి చేతులతో చెయ్య లేని దాన్ని శ్రీదేవి పాదాల తో చేస్తోందని అన్నారు శంకరులు.

**90—"దదానే, దీనేభ్యః శ్రియ మనిశ,మాశాను సదృశీ –మమందం, సౌందర్య ప్రకర మకరందం, వికిరతి**

**తవాస్మిన్, మందారస్తబక, సుభగే, యాతు చరణే –నిమజ్జన్మజ్జీవః, కరణ చరనై షట్చరణతాం ''**

తాత్పర్యం –నాద రూపిణీ !దీనులకు వారి కోర్కెలను అనుసరించి, తగిన సంపదలను ఎల్లప్పుడు ఇచ్చే నీ, అధిక లావణ్య సంపుటి అనే పువ్వుల తేనెను వెదజల్లే, కల్ప వృక్షపు పూగుత్తి లాగా, సుందర మైనది అయిన నీ పాద కమలాల యందు, మనసు తో కూడిన అయిదు జ్ఞానేన్ద్రియాలతో సహా ఆరు పాదాలను కల వాడ నైన నేను తుమ్మెద నై మునుగుదును గా.క.

విశేషం –నేను అనే జీవుడు ఆరు పాదాల తుమ్మెదను అయి నీ పాద కమలాలను అర్చిస్తాను భక్తీ తో ఆ మకరందాన్ని గ్రోలు తాను అని శంకర భగ వత్పాదులు భక్తీ తో వేడుకోన్నారని భావం.

**91—''పదన్యాస క్రీడా పరిచయ మివారబ్దు మనసః—స్ఖలన్తస్తే, ఖేలం, భవన, కలహంసా, న, జహతి**

**అతస్తేషాం,శిక్షాం, సుభగ మణి మంజీర రణిత –చ్చలా దాచక్షాణం, చరణ కమలం, చారు చరితే ''**

తాత్పర్యం –సుచరితా దేవీ !నీ పెంపుడు హంసలు నీ దగ్గర నడక నేర్చు కోవా టానికి ప్రయత్నిస్తూ, తొట్రు పడుతున్నాయి. అయినా, నీ విలాస గమనాన్ని వదల లేదు. అందు చేత నీ పాద కమలం అతి రమ్య మైన మణులతో కూడిన అందేల మ్రోత అనే నెపం తో, ఆ పెంపుడు హంసలకు నడక లో శిక్షణ ను ఉపదేశిస్తున్నాయేమో నన్నట్లు గా ఉంది''

విశేషం –హంసలు సహజం గా తమను పెంచే వారి వెంటే నడుస్తాయి. అలా పోవటం, నడక నేర్చు కోవటానికే. జీవన్ముక్తు లైన పరమ హంస లే శ్రీ దేవికి పెంపుడు హంసలు. వారు ఆమె కు ఆశ్రితులు. శ్రీ చక్ర రూపం గా ఉన్న గృహం లో నర్తించే కల హంసలు, అవ్యక్త మధుర ధ్వని తో హంస మంత్రాన్ని పఠిస్తాయి అవే చక్రేశ్వర, గణపతి, కమల నాద, ద్వీప నాద, వసంతులు. వీరే శ్రీ చక్రాధి ష్టాన దేవతలు.

పదాలు అంటే చతుర్దశ భువన స్తానాలు. న్యాసం అంటే ఉంచటం. అంటే సృష్టి. క్రీడా అంటే రక్షణం. పరిచయం అంటే సంహారం. చిఞ్ –చయనే –సంహారం అని అర్ధం ఈ కల హంసలు భువన సృష్టి స్తితి, లయ కారణ సామర్ధ్యాన్ని ఆశిస్తాయి. అవి చిదాకాశం లో (ఖే )"అల మత్యంతం స్తలంతః చరంతః సంతః "అన్నట్లు గా ఆమె చరణాలను వదలవు. కారణం ఆమె చర ణాలు శుభగాలు. హంస అంటే ''సోహం ''అంటూ నిరంతరం జపించేవి అని భావం. ఇన్ని భావాలను భగవత్పాదులు ఈ శ్లోకం లో నిక్షిప్తం చేశారని వివరించారు తుమ్మల పల్లి మహాశయులు.

**92—''గతాస్తే మంచత్వం ద్రుహిణగిరి రుద్రేశ్వర భ్రుతః –శివ స్వచ్చ, చ్చాయా ఘటిత కపట ప్రచ్చ దపటః**

**త్వదీయానాం భాసాంప్రతి ఫలానా రాగారుణతయా –శరీరే శృంగారో, రస ఇవ దృశాం దోగ్ధి కుతుకం**

తాత్పర్యం –అమ్మా చిత్కళా నంద కలికా !బ్రహ్మ, విష్ణు, రుద్రా, ఈశ్వర అనే నలుగురు సేవకులు నీ మంచం కోళ్ళు గా మారి మంచం రూపం పొందారు. వారు కామ రూపం తో నీ మంచానికి నాలుగు కోళ్ళు అయి,నీ సమీపం లో ఉన్నారు. పైన కప్పుకొనే వస్త్రం లా ఉన్న సదాశివత్వం, తెల్లని కాంతులతో, నీ అరుణ కాంతులు వ్యాపించగా శృంగార రసం రూపు దాల్చిందేమో అన్నట్లు, నీ కండ్ల కు ఆనందం కల్గిస్తోంది.

విశేషం –సదాశివునికి -భగవతి యెర్రని కాంతి మీద పడి, ఆయనకు సహజం గా ఉన్న తెల్లని దేహం అరుణ కాంతిని పొంది, శృంగార రస శరీరం గా కనీ పిస్తోంది. అంటే శృంగారమే శరీరం లాగా ఉన్నాడు సదా శివుడు. "పంచ ప్రేతాసనా సీనా, పంచ బ్రహ్మ స్వరూపిణీ "అని లలితా సహస్ర నామం లో ఉంది."రుద్ర మళ యాళం"లో

''బ్రహ్మ విష్ణు రుద్రశ్చ, ఈశ్వరశ్చ , సదా శివః –ఏతే పంచ మహా ప్రేతా భూతాది పతయో మాతః –చత్వారో మంచ చరణః పంచమః ప్రచ్చదః పటః –సాక్షీ ప్రకాశ రూపేణ, శివేనా భిన్న విగ్రహే –తత్రాసనే సమాసీనా, నిర్భరానంద రూపిణీ ''అని ఉన్న విషయం శ్రీ శంకరులు చక్కని శ్లోకం లో అందం గా, శృంగార భరితం గా చెప్పారు.

పచ్చడమే –ఘటిత కపటం అంటే మాయా రూపం ''ప్రచ్చాడ కపటసం కశిపుహ్ –కశి పుశ్చ సదా శివః –కశి పూర్వక స్వదేహ కాంతి చే కల్పిత మైన ఉపరి వస్త్రం అని భావం.

**93—''అరాళాకేశేషు, ప్రకృత సరళా, మంద హసితే –శిరీషాభా చిత్తేదృష ద్రుపల శోభా, కుచ తటే**

**భ్రుశం తన్వీ మధ్యే పృదురురసి జారోహ విషయే –జగత్రాతుం శంభోర్జయతి, కరుణా, కాంచి దరుణా** '

తాత్పర్యం –చారుహాసా మణీ !నీ కేశ పాశం నొక్కులు నొక్కులు గ ఉండటం వల్ల, వక్రత ఉంది. . మరెక్కడా నీ శరీరం లో వక్రత లేదు. .స్వభావ సిద్ధ మైన నీ చిరు నవ్వు, అందం గా, మెత్తగా ఉంది.స్తన యుగ్మం సన్నికల్లు లాగా బలుపు, చెలువదనం కలిగి ఉంది.సన్నని నడుము, స్తన యుగ్మం లో పిరుదుల వద్ద స్థూలత్వం పొందింది. అనిర్వచ నీయ మైన శంభుని కరుణా స్వరూపమైన అరుణ అనే శక్తి జగత్తును రక్షించటం లో నిపుణ యై, సర్వత్రా ఉత్కర్ష తో, ప్రకాశిస్తోంది. చిరునవ్వు లో స్వభావ సిద్ధ మైన సరళ ఆసక్తి ఉండి మనసులో దిరిసెన పువ్వు లాంటి మహా మెత్తని శక్తి ప్రకాశిస్తోంది. స్తనాల్లో సన్ని కల్లు వంటి శక్తి ఉంది. నడుము లో తన్వీ శక్తి ఉంది . కుచ, నితంబం లలో స్థూల శక్తి ఉంది. జగద్రక్షణకు అరుణ శక్తి, కరుణా శక్తి ఉన్నాయి.

విశేషం –శ్రీ శంకరా చార్యులు అమ్మ వారిని కిరీటం నుంచి, పాదాంతం వరకు వర్ణించారు ''మౌళి తో మానవా,దేవాస్చారనః పునః ''అని కావ్య లతా అనే అలంకార శాస్త్రం చెబు తోంది. మానవులను శిరసు నుంచి, దేవత లను చరణం నుంచి పైకి వర్ణించాలి అని శాస్త్రం. అయితే శ్రీ లలితా సహస్ర నామాలలో దేవిని కిరీటం నుండి పాదాంత వర్ణన చేయటం . . దానినే భగవత్పాదులు అనుసరించారు వ్యాస మహర్షి పద్ధతి కూడా ఇంతే. ఈ శ్లోకం లో కూడా కేశం నుంచి నితంబం వరకు శంకరా చార్య వర్ణించారు.

పరమేశ్వరుని జగద్రక్షణా శక్తి యేఅరుణ శక్తి. శక్తికి శక్తి వంతునికి భేదం లేదు. అందుకే వారి ఐక్యత కే ''క కార ''ప్రయోగం చేశారు ఆచార్యుల వారు అంటే శివునికి అభిన్న ఐన చిచ్చక్తి మూర్తి రూపం ధరించి జగద్రక్షణ కు ప్రసన్ను రాలు అయింది అని భావం.

భగవతి అరుణ. ఆమె లో శంభుని కరుణ మూర్తి కట్టింది. కరుణ కు కుటిలత్వ, మందత్వ , శీర్నత్వ, కఠోరత్వ, ,హిమ్సత్వ, క్షీణత్వాలు పనికి రావు. అందుకే ఆమె కేశాలకే కుటిలత్వం ఉంది , ఇంకెక్కడా లేదన్నారు. ఆ కేశాలనూ వెనక్కి తోసేసింది. మందత్వం చిరు నవ్వు లో ఉంచింది. కుటిలత్వం కేశ శోభ ను

వృద్ధి చెందిస్తుంటే , మందత్వం చిరు నవ్వు కు సొగసు తెస్తోంది. కృశించింది నడుమే కాని ఆమె కరుణ కాదని స్పష్టం చేశారు. ఆ క్రుశిత్వాన్ని కప్పి వేయ టానికి స్తూలత్వం ఉంది, స్తిరత్వం ఉంది.

**94—''కలంకః కస్తూరీ రజనికర బింబం జలమయం –కళాభిహ్ కర్పూరైర్మరకత కరండం, నిబిడితం అతస్తాద్భోగేనా ప్రతి దిన మిదం రిక్త కుహరం –విధిర్భూయో భూయో, నిబిడ యతి నూనం తవ కృతే ''**

తాత్పర్యం –అమ్మా దక్షిణా మూర్తి స్వరూపిణీ !లోకం లో చల్లదనాన్ని చ్చే దాన్ని చంద్రుడని, కళంకం అని, చంద్ర కిరణాలని, చంద్ర బిమ్బమని చంద్ర మండ లాన్ని గురించి అజ్ఞానం తోఅనుకొంటాం. నిజం గా, ఆ చంద్ర మండలం –నువ్వు కస్తూరి మొదలైన పదార్థాలను ఉంచుకొనే తాంబూల భరిణే. కళంకం అంటే నువ్వు ఉయోగించే కస్తురే.చంద్రుడు నువ్వు జలక మాడే పన్నీరు గిన్నె. చంద్ర కళ లే పచ్చ కర్పూరం పలుకులు. ఇవన్నీ నిత్యం నువ్వు వాడుతూ ఉంటె తరిగి పోతుంటే, నీ సేవకుడు బ్రహ్మ మళ్ళీ ఆ వస్తువులను అక్కడ నింపు తున్నాడు. లేక పోతే చంద్రునికి కళలు ఎందుకు తగ్గుతాయి ?

విశేషం –కుబేర, పశుపతి, ప్రజాపతి అనే పంచ దశ దేవతలు శక్తి అయిన భగవతి స్వరూపాలే. చాంద్రీ, కలా,అమృతమయ, ,పిబసి అనేవి అవే. భగవతి అమృత పానం వల్ల వారి వారి స్వసాదారణ శక్తి రూపం గ కన్పిస్తోంది. మార్కండేయ పురాణం లో "యచ్చ కించి త్క్వచిద్వస్తు, సద సర్వాఖిలాత్మకే –తస్య సర్వాస్య యా శక్తిహ్ సా త్వం కిం స్తూయసే మయం "అన్నదానికి వివరణేపై శ్లోకం.

''సర్వ త్రాను, స్యూత దేవతా రూపేణ ప్రతిభా సమానో –ఏకైక చిచ్చక్తి రూపాది భేదేన నానా ప్రతి భాసతే –"అని మంత్ర ప్రకాశిక లో ఉంది. కృష్ణ పక్షం లో కామేశ్వరీ, భగమాలినీ, నిత్యక్లిన్నా, భేరుండా, వహ్ని వాసినీ, వజ్రేశ్వరీ, శివ దూతీ, త్వరితా, కుల సుందరీ, నిత్యా, నీల పతాకా, విజయా, సర్వ మంగళా, జ్వాలా మాలినీ, చిత్రా అనే పంచ దశ నిత్యలు ప్రతి లోమం గా వస్తాయి. ఇవన్నీ శ్రీ దేవి అధిష్టాన భూతాలు

రజని కర బింబం జలమయం. అమృత బీజ మైన వకారాత్మక బిందువు. రిక్త కుహరం. షోడశ స్వర, సంవిత్కలా మాత్రావ శేషితం. .మళ్ళీ శుక్ల పక్షం లో అనులోమంగా, కామేశ్వరి మొదలు చిత్ర వరకు ఆయా తిది నిత్య లక్షణ కళలు. పూరింప బడుతాయి.

భగవతి సమస్త భోగానుభావం కలది. ఆమెకు బ్రహ్మాన్డమే గృహం. ఊర్ధ్వంగం విధానం. మేరువు మొదలైనవి విహార స్తలాలు. నక్షత్రాలు హారాలు. గోత్రాభిదులు పౌత్రులు. బ్రహ్మాదులు పుత్రులు. మార్తాన్డుడే ఇంట్లోని దీపం. సకల జగత్తును చక్కని చల్లని వెలుగులతో నింపే చంద్రుడు సుగంధ వస్తువులుంచే కరండం. అందులోని కలంకమే కస్తూరి. జలమే పన్నీరు. కల –కర్పూరపలుకులు.

కళంకం ఉండటం లో మరకత వర్ణం అంటే నీలి రంగు. చంద్రుడు జలమయం తెలుపు. సముద్రాలలో నీల వర్ణం ఉండటం చేత మరకత కరండం అయింది. చంద్ర కళలన్నిటిని దేవతలు కబ లిస్తారు. "ప్రధమా పిబతే

వహ్నె ద్వితీయా పిబతే రవిహ్ "అని ఉన్నది. దేవి సర్వ మయి. సర్వత్రా అను స్యుత. అంబా స్తవం లో –"త్వం చంద్రికా, శశిని, తిగ్మరుచౌ, రుచిస్త్వం –త్వం చేతనాపి, పురుషే, పవనే, బలం త్వం –త్వం, స్వాదుతాసి, ,సలిలే, శిఖాని త్వమూష్మా –నిహ్ సారమే తదఖిలం త్వ ద్రుశే, యదిస్యాత్ "

శ్రుతికూడా "అహం రుద్రు భిర్వసుభిశ్చ రమ్యః, మాదిత్యై రుత విశ్వ దేవః "అన్నది. స్మృతి లో"యదాదిత్య గతం తేజో, జగద్భాసయతేఖిలం –యచ్చంద్ర మసి, యచ్చాజ్ఞౌ, తత్తేజో విద్ధి మామకం "అని చెప్పింది.

**95—"పురారాతే రంతః పురమసి, తతస్త్వచ్చరణయో –స్సపర్యా మర్యాదా తరల కరణానా, మసులభా తదాహ్యేతే నీతా, శ్శత ముఖా సిద్ధ మతులాం –తమద్వారో స్టాన స్తితిభి రణి మాద్యాభి రమరాః**

తాత్పర్యం –పురారాతి పట్టపు రాణీ '!నీ చరణ సపర్యా మర్యాద చపల చిత్తం వారికి దుర్లభం. అందువల్లే చపల చిత్తు డైన ఇంద్రుడు మొదలైన దేవతలు నీ అంతః పుర ద్వార పాలన చేసే అణిమ, మహిమా గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్య, ఈశిత్వ, వశిత్వాలనేఅష్ట విభూతులను కొలిచి, వారి వల్ల సాటి లేని అభీష్ట ఫల సిద్ధి ని పొందారు. చంచల చిత్తం లేని వారికే అంటే సమయా చారులకే సుధా సింధు మధ్యస్తిత శ్రీ దేవి పాదాంబుజ సేవ లభిస్తుంది. '

విశేషం –శ్రీ దేవి అంతః పురం వద్ద ఉన్న అణిమాది సిద్ధులు ఆమెను ఎలా సేవిస్తున్నారో, ద్వారాల వద్ద ఉన్న ఇంద్రాదులూ అలానే సేవిస్తున్నారు. అణిమాదులు ద్వారా పాలకులు కనుక సర్వద అక్కడే ఉంటారు. ఇంద్రాదులు చపలురు కనుక, అంతః పుర అర్హత లేని వారూ కనుక, ద్వారపాలకుల అను మతి తో ద్వారం వద్దనే ఉండి, సిద్ధి పొందుతున్నారని భావం. శ్రీ చక్ర భూ గృహ ద్వారం వద్దే అణిమాది సిద్ధులకు స్తానం. వీరు అష్ట దిక్పాల కు లతో దేవిని కాపలా కాస్తున్నారు.

ఇంద్రాదులు ద్వారపాలకుల వల్ల సంపద పొందారు. సంసారం లో ఆనందాన్ని అనుభ విస్తున్నారు. కనుక లోపలకు వారికి ప్రవేశార్హత లేదని భావం. మనో నిగ్రహం లేని వారికీ, ధ్యాన విధానం లేని వారికీ శ్రీ దేవి చరణ కమల సేవ లభించదు. అకార వాచ్యు లైన బ్రహ్మాదులకు సులభం. ఇంద్రాదులు వైభవం తో, ఊర్వశి మొదలైన దేవ వేశ్యల సంభోగం తో రసికులై ఇంద్రియ జయం పొందలేదు కనుక అర్హత సంపాదించ లేక పోయారని అర్ధం. అందుకే ద్వార పాలకుల్లా అక్కడే ఉండి పోయారు. అని శ్రీ శంకర మనో భావాన్ని తుమ్మల పల్లి వారు మనోహర మైన ఆవిష్కరణ చేశారు.

**96—"కళత్రం, వైధాత్రం, కతికతి, భజన్తే, న,కవయః –శ్రియో దేవ్యాః, కోవా, న భవతి పతిహ్ కైరపి ధనైహ్ మహాదేవం హిత్వా తవ సతి సతీ నామ చరమే –కుచాభ్యామాసంగః కురవక తరో, రప్యసులభః "**

తాత్పర్యం –పుణ్య శ్రవణ కీర్తనా తల్లీ !ఎందరెందరో కవులు సరస్వతీ దేవిని పొందాలను కొంటారు. ఏదో కొంత డబ్బు సంపాదించిన వారంతా లక్ష్మీ పతులం అను కొంటున్నారు. పతివ్రతా శిరోమణి వైన నీవు నీ ఉద్యాన వనం లో ''కురవక ''వృక్షానికి దోహదం చేయ వలసి వస్తే, నీవు నీ అర్ధ భాగం అయిన శివుని తో ఆలింగనం చేస్తున్నావు. నీ పాతివ్రత్య మహాత్మ్యం అవాజ్మానస గోచరం.

విశేషం –కురవక పుష్పం పుష్పించ టానికి భర్త తో కలిసిన ఉత్తమ స్త్రీ ఆలింగనం చేయాలి దీనిసే దోహద క్రియ అంటారు. కురవాకం అంటే యెర్ర గోరింట. పచ్చ గోరింటాను కురంటంకం అని, నీలి గోరింటాను ఝుంటి అని అంటారు.

సరస్వతి, లక్ష్మి ప్రసాదం వల్ల ఉపాసకులు మధుర కవిత్వం, దానం సౌఖ్యం పొందుతారు. కాని భగవతి ప్రసాదం వల్ల ''అక్షయ పరమా నందం ''అనుభవిస్తారని ధ్వని పూర్వక భావం. సతీ –''సతీ సతి యోగా విస్పృష్ట దేహతాం ''అన్నాడు కాళి దాస మహా కవి. ''సతీ పతివ్రతా గౌర్యః ''అని నిఘంటువు చెబుతోంది. సర్వ దేవతా సార్వ భౌముడే మహా దేవుడు ఇతర దేవతలు-- దేవః. సదాశివుడు-- మహాదేవః

కు +రవ =కురవ –కుత్చిత వాదాలు చేసే వాడని అర్ధం. కాషాయం ధరించి కుతర్క, వితర్క కుత్చిత వాదాలు చేసే వారికి శ్రీ దేవి అనుగ్రహం రాదు అని అంత రార్ధం.

**97—''గిరా,మాహుర్దేవీం, ద్రుహణగృహిణీ, మాగమా విదో –హరెహ్ పత్నీం పద్మం హర సహచరీ, మద్రి తనయాం**

**తురీయాకాపి, త్వం, దురధిగమ నిశ్సీమ మహిమా –మహా మయా, విశ్వం, భ్రమయసి, పరబ్రహ్మ మహిషీ'**

తాత్పర్యం –మహా ప్రళయ సాక్షిణీ !పరబ్రహ్మ పట్టపు రాణి వైన జననీ !ఆగమ విదులు నిన్నే బ్రహ్మ దేవుని భార్య యైన, వాక్కులకు అధిష్టాత్రి అయిన సరస్వతి దేవిగా, నిన్నే విష్ణువుకు భార్య యైన లక్ష్మీ దేవి గా, హరుని అర్ధాంగి అయిన పార్వతీ దేవి గా భావిస్తున్నారు. నువ్వు ఈ ముగ్గురి కంటే వేరైన నాల్గవదీ, అనిర్వాచ్య మైనదీ అతి కష్టం మీద పొంద పొంద శక్య మైన అపార మహిమాన్విత మైన, శుద్ధ విద్యాన్తర్గత మైన మాయా తత్వమై, ఈ ప్రపంచాన్ని భ్రమింప జేస్తున్నావు. విశేషం –వాశిష్టం లో ''విశ్వ నాటక విలాస సాక్షిణీ సంవి దేవ పురతో విజ్రుం భతే ''అనీ, శ్రుతిలో ''ఋతం సత్యం, పరబ్రహ్మ పురుషం, కృష్ణ ఊర్ధ్వ రిదం, విరూపాక్షం విశ్వ రూపాయతే నమః ''అనీ ఉంది.సర్వ శక్తులు సదా శివుడిన పర బ్రహ్మను, ఆయన భార్యభావాలను పొంది అంక స్తిత మై ఉన్నాయని భావం.

''తస్మాకం మండలా రూఢా శక్తిర్మాహేశ్వరీ పరా –మహాలక్ష్మిరితిఖ్యాతా, శ్యామా, సర్వ మనోహరీ ''అని పురాణాలు శ్లాఘించాయి.

''సర్వ స్యాద్యా, మహాలక్ష్మీ, స్త్రిగుణాపరమేశ్వరీ –లక్ష్యా లక్ష్య స్వరూపా, సా వ్యాప్య క్రుత్స్నం వ్యవ స్తితా ''అని మార్కండేయ పురాణం.

పరబ్రహ్మ సకల జగత్కారణ భూతుడు. పరబ్రహ్మ మహిషి –సకల జగత్కారణ భూత. సృష్టి స్తితి లయ హేతు వైన మహా లక్ష్మి సమాఖ్య దేవత. మహా మాయా అంటే అందరికి సంసార వాసన ను ప్రసాదించేది.మహా అంటే అందరి చేత అర్చింప బడేది. రుద్రుని సహచారిణి ''జయ ప్రధమ మిధునం బ్రహ్మ, సరస్వతి. ద్వితీయ మిధునం –విష్ణు, లక్ష్మి తృతీయ మిధునం –రుద్రా, జయ. సృష్టి స్తితి లయాది సకల దేవతా కారణ భూత మైన పరబ్రహ్మ భగవతి యే.

**98 –''కదా కాలే మాతః కధయ కలితా లక్తక రసం –పిబేయం, విద్యార్థీ, తవ చరణ నిర్నే జన జలం**
**ప్రకృత్యా, మూకానా, మపిచ, కవితా కారణ తయా –కదా ధత్తే వాణీ ముఖ కమల తాంబూల రసతాం ''**

తాత్పర్యం –మంగళాక్రుతీ మాతా !జన రంజకత్వం కోసం పూతగా పూసుకొన్న యెర్రని లత్తుక రసం తో ఉన్న నీ చరణాలను కడిగిన పాద్యోదకాన్ని, బ్రహ్మ విద్య ను అభ్య సించె విద్యార్ధి నైన నేను, మరణించే లోపల, యే సమయం లోనైనా పుచ్చు కోగాలనా ? ఆ నీ పవిత్ర పాదోదకం చెవిటి వారికి వినికిడి శక్తిని, మూగ వాడికి మాటను కలిగించి, కవిత్వం చెప్ప టానికి కారణం అవటం చేత, వాణీ ముఖ కమల రస సారస్యాన్ని ఎప్పుడు స్వీకరిస్తుందో కదా ?

విశేషం –శంకర భగవత్పాదులు సామీప్య భక్తీ ని కోరు కొన్నారు. తాంబూల కవిత సరస్వతీ వాదన వాగ్విలాసం తో పోల్చా దాగిన సూక్తి ప్రవాహం. కాళి దాసాదులు సరస్వతి ముఖ కమలస్త తాంబూలం వల్ల మహా కావు లైనారు. భగవతి పాదజాలం లాక్షారసావుకితం కనుక భారతీ ముఖ కమస్త వీటీ (తాంబూలం )రూపం పొంది, సత్కవితా హేతువు అయింది. మూగ వాడిన ఒకనికి కంచి కామాక్షి అమ్మ తాంబూల రసం నాలుక మీద పడ గానే మహా ఆశుదార గా మహా కవిత్వం అలవోక గా నోటి నుండి వెలువడింది. .ఆయననే ''మూక కవి ''అంటారు. .ఆయన ఆర్యా శతకం మొదలైన అయిదు శతకాలనుఅమ్మ వారి పై చెప్పారు. వీటినే ''మూక పంచ శతి ''అంటారు. అద్భుత కవితా ప్రవాహం అందులో ఉంటుంది. ఆయనే తర్వాతా కంచి కామ కోటి పీఠానికి అది పతి కూడా అయారు. అమ్మ దయ అంట గొప్పదని, ఆమె తాంబూల రసం లో అంతటి మహత్తు ఉందని శంకరుల భావం. అంటే కాదు అంత మహా విద్వాంసుడు వేద వేదాంగాలను ఆవ పోసాన పట్టిన వాడు అయిన ఆయన తనను ''విద్యార్ధి ''గానే చెప్పుకోవటం వారి వినయానికి ప్రతీక. అమ్మ దయ ఉంటె రానిదేమీ లేదని అర్ధం.

**99—''సరస్వత్యా లక్ష్మ్యా, విధి, హరి, సపత్నో విహరతే –రతెహ్ పాతివ్రత్యం, శిదిలయతి రమ్యేణ వపుషా**
**చిరంజీవంనేవ క్షపిత పశు పాషా వ్యతి కరః –పరా నందా భిఖ్యం రసాయతి రసం త్వద్భజన వాన్ ''**

తాత్పర్యం –సర్వాపద్నివారి ణీ మాతా !నిన్ను భజించే భక్తుడు సరస్వతి, లక్ష్మి దేవులతో చిరంజీవి గా వర్ధిల్లు తాడు. బ్రహ్మ, విష్ణు లకు అసూయ పుట్టిస్తాడు. మన్మధుని సౌందర్యం తో సమాన మైన

కాంతి సౌందర్యం కల శరీరం తో, మన్మధుని భార్య రతీ దేవికే మొహం పుట్టించి, ఆమె పాతి వ్రత్యానికే భంగం కలిగిస్తాడు. చివరికి జీవ సంబంధాన్ని వది లించుకొని, జీవన్ముక్తుడై, సదాశివ తత్వాత్మకుడై, పరమానంద రస సౌభాగ్యాన్ని అనుభవిస్తాడు. అంటే నీ భక్తుడు అతి సౌందర్య వంతుడు, తేజస్వి, వర్చస్వి విద్యా పారంగతుడు ఐశ్వర్య వంతుడు అవుతాడు.

విశేషం –సాధకుడు తానే మన్మధుని వంటి శరీరం పొంది, రతీ దేవినే భ్రమింప జేస్తాడని భావం. బ్రహ్మ, విష్ణు లకుఅసూయ కల్గిస్తాడు. పశువు అంటే జీవుడు. ఇంద్రియాల చేత ప్రపంచాన్ని చూసే వాడని అర్ధం."పశు –బందనే "అవిద్య చేత బద్ధు డైన జీవుడే పశువు. పాశం అనేది అవిద్య ".అదిధిహ్ పాశం ప్రముమొక్త్వే తన్ని మః –పశుభ్యః పశు పతయే కరోమి "అని శ్రుతి. ఆదిత్య మండలాన్తర్గత మైన అదితి అనే స్త్రీ శక్తి అవిద్యా కృత బంధాన్ని విముక్తి చేయుగాక అని పై దాని అర్ధం. అదితి –పశు పతి ఐన సదా శివుని తో పాశ విముక్తి చేస్తాడని భావం.

అవిద్యా పాశం వది లించుకొంటే సదా శివ రూపుడు అవుతాడు. పరా నంద, పరా నందాత్మిక, పరా నంద జ్యోతి లో రసిస్తున్నాడు. ఆస్వాదిస్తున్నాడు. ఇదంతా భగవతి ని భజించే వాడికే సాధ్యం. భజించటమే సేవించటం అని అర్ధం.

ఆత్మ జ్ఞానం కలిగినా, ధర్మా నుష్టాదులకు ఫలా పేక్ష లేక పోయినా, సంస్కార వశం తో చక్ర భ్రమణం వల్ల శరీర సంబంధం ఉంటుంది. భజనలు రెండు రకాలు మొదటిది షట్చక్ర సేవ రెండోది ధారణా. షట్చక్ర సేవ –ఆధార, స్వాధీ ష్టానాలలో ఉపాసన ఉండదు. కారణం తమస్సు చేత అవి ఆవ రింప బడి ఉన్నాయి. మణి పూరకం నుంచి సహస్రారం వరకు పూజ ఉంటుంది. మణి పూరక పూజాదులకు ఆమె సమీపం లోకి చేరతారు. అనాహత చక్ర పూజా పరులకు సాలోక్య ముక్తి వస్తుంది. అంటే దేవి పట్టణం లోనే ఉంటారు. విశుద్ధ చక్రోపాసకులకు సామీప్య ముక్తి లభిస్తుంది. పాద సేవ చేసే సేవకులవటం వల్ల ఆజ్ఞా చక్రోపసకులకు సారూప్య ముక్తి వస్తుంది. అంటే ఆమె తో సమాన రూపాన్ని పొందుతారు. వీరందరికి బాహ్యా బాహ్య దుఖాన్ని వదిలేసె శక్తి ఉండదు. దేహ ధారణా ఉంటుంది కనుక సాయుజ్య ముక్తి రాదు. సాయుజ్యమే శాశ్వత ముక్తి అని భావం. అది భగవతి భజన వల్ల ఆస్వాద్యమవుతుంది.

లోకం లో స్త్రీ సమ్మేళనం వల్ల పరమ సుఖం లేదు. అన్ని దుఖాలు పోతేనే సాయుజ్యం. అది శివ శక్తి సంపుటాన్తర్భాగం. పశువులు జ్ఞాన గర్వితులు. పరలోక సుఖం లేనివారు. విద్య లేదు ఒట్టిఐహిక సుఖ జీవులు, పాశ బందితులు.

రసో వై సహః "అని శ్రుతి భగవతి సకల సేవా రాధ్య. సర్వ దేవతాధిక. సకల ప్రపంచ ఉత్పత్తి మాతృక. సర్వ మంత్ర జలోత్కట. అలాగే భగవతి భక్తులు కూడా. బ్రహ్మాదుల కంటే ఉత్కృష్ట స్తితి ని పొందుతారని పిండి తార్ధం.

**100—''ప్రదీప్త జ్వాలా భిర్దివస కర, నీరాజన విధి –స్సుదా,సూతే స్చంద్రోపల జలల, వైరర్ఘ్య రచనా స్వకీయై రంభోభి స్సలిల నిది సౌహిత్య కరణం –త్వదీయా భిర్వాగ్భిస్తవ జనని, వాచాం స్తుతి రియం''**

తాత్పర్యం –మనో వాచామ గోచరీ తల్లీ !వాక్ ప్రపంచానికి తల్లి పైన నీవు ఇచ్చిన నీ స్వరూపాలైన వాక్కుల చేత నిన్ను నేను కొని యాడుతున్నాను. తనవి అయిన కాంతి దివిటీ లతో సూర్యుడికి నీరాజనం పట్టి నట్లు ఉంది నా చేష్ట. తన సంబంధ మైన చంద్ర కాంత శిలనుంచి వచ్చే నీటి తో చంద్రునికి అర్ఘ్యం ఇచ్చి నట్లుంది. తన సంబంధ మైన జలాల చేత తర్పణం చేసి, సముద్రుని దప్పిక తీర్చటం లాగా ఉంది నా వెర్రి చేష్ట.. నీవు పరా శక్తివి. నిన్ను స్తుతించే శక్తి ఎవ్వరికీ లేదు. అహంకారం వదిలి సర్వం నీ కరుణ యే నని నీ స్తోత్రం చేస్తూ ముగిస్తున్నాను.

విశేషం –సర్వము భగవతియే. చేతనా చేతనం అంతా ఆమెయే. స్తోత్రమే శ్రీ దేవి అయితే ఈ స్తోత్రం చేయటం అపరాధమే. అందుకే ''క్షం తవ్యం "అని క్షమించ మని చమని వేడుకొన్నారు వేదాంత శంకరులు. "త్వదీయాభిర్వాగ్భిస్తవ "అంటే ఆమెయే మాతృకా రూపిణి. మాత్రుకాక్షరాలు ఆమె. ఆమె స్తుతి. "మాతృకా వర్ణ లిప్తాంగీ –మహా చక్ర మాధ్యగాం"అని లలిత.

పరా, పశ్యంతీ, మాధ్యమా, వైఖరీ రూప వాక్కు ల వల్ల "త్వయైవ ఉల్లసితా వైఖరీ, సంరుజ్జృంభిత తన్మయ, మాత్రుకాక్ష రైహ్ త్వయి వస్తు రితి ఆకారంత క్షకారాంత మాతృకా వర్ణ రూపిణీ "అని లలితా సహస్రం. .ఇంతటి మేధావి, పరమ ఉపాసకులు సాక్షాత్తు కైలాస వాసి ఈశ్వరుడు, ఆత్మ జ్ఞాని ఉపనిషత్తులకు, బ్రహ్మ సూత్రాలకు,భగవద్గీత కు అమోఘ వ్యాఖ్యానాలు రచించి భక్తీ స్తోత్రాలను అనర్గళం గా చెప్పి, అద్వైత మాతా చార్యులై,షణ్మతస్తాపకులై, సకల జనోద్ధారకులై, వేద మార్గ పద గామి యైన శ్రీ శ్రీ శ్రీ శంకర భగవత్పాదులు అలౌకికా నందం తో లలితా రా భట్టారిక వైభవాన్ని "సౌందర్య లహరి "లో నిక్షిప్తం చేశారు. ఇందులో వారి కవితా సౌందర్య లహరి నీ దర్శించుకోన్నాం. దీన్ని చదివితే ఇంకా దేన్నీ చదవనక్కర్లేదన్నట్లున్న రచన ఇది. సాధన చేసే వారికి చేసి నంత. ఇప్పటి దాకా ఆ పరమ వైభవాన్ని దర్శించి తరించాం. దీని లోని అంతరార్దాన్ని పరమ శోభాయ మానం గా వివరించారు "సదా శివా నంద నాద "బిరుదాంకితులు బ్రహ్మశ్రీ తుమ్మల పల్లి రామ లింగేశ్వర శర్మ గారు. .ఆ అమృత పానమే మనకు శ్రీ రామ రక్ష. ఇతి మంగళం మహత్ –సంపూర్ణం.

## శ్రీ దేవి భండాసుర వధ

### శ్రీ దేవి భండాసుర వధలో అంత రార్ధం -1

శ్రీ లలితా సహస్రనామ స్తోత్రం లో శ్రీ దేవి అయిన శ్రీ లలితా పరమేశ్వరి సహస్ర నామ స్తోత్రాలలో భండాసుర రాక్షసుని సంహారం ఉన్నది. ఇది మామూలుగా దుస్ట రాక్షస సంహారం గా అని పిస్తుంది. కాని లోతులు తరచి చూస్తె అద్భుతమైన అంతరార్ధం గోచరిస్తుంది ఇవిదసరా నవరాత్రి ఉత్సవాలు కనుక

ఇందులోని ఆంతర్యాన్ని తెలియ జేయటమే నా ఉద్దేశ్యం. దీనికి మహా ఆధ్యాత్మిక పరులు, బహు గ్రంధ కర్త, మహా వాజ్మి అనేక భాషలలో నిష్ణాతులు కేంద్ర ప్రభుత్వ ఉన్నతోద్యోగులు అయిన స్వర్గీయ శ్రీ ఇల పావులూరి పాండు రంగా రావు గారు రచించిన "శ్రీ సహస్రిక "అనే శ్రీ లలితా పరమేశ్వరి సహస్ర నామ స్తోత్రానికి వారు రాసిన అత్యద్భుత మైన మహా విశ్లేషణ ఆధారం. నేను చదివి ఎంతో అనుభూతి పొందాను. ఇప్పుడు మీ కోసం సంక్షిప్తం గా ఈ వధలోని ఆంతర్యాన్ని వారు ఆవిష్కరించిన సత్యాలను మీకు తెలియ జేయటానికి సాహసిస్తున్నాను. ఈ అంత రార్ధం తెలుసు కొని మనం లలితా సహస్రనామ స్తోత్ర పారాయణ చేస్తే అలౌకిక ఆనందం లభిస్తుంది. అదొక దివ్య అనుభూతి గా మిగులుతుంది. ఊరికే పారాయణ కోసం పారాయణ కాకుండా ఈ సూక్ష్మాన్ని గ్రహించి చదివితే చెప్పరాని సంతోషం కలుగుతుంది. పాండు రంగా రావు గారు అమ్మ నామాలలోని ప్రతి దాన్ని గొప్పగా అర్ధం చెప్పి, ప్రతి నామానికి తరువాతి నామం తో ఉన్న అను బంధాన్ని వివరిచటం నాకు తెలిసి నంత వరకు ఎవరూ చేయలేదు. అలాగే వారు శ్రీ విష్ణు సహస్ర నామాలకూ ఇదే పద్ధతి అవలమించి వివరణ ఇవ్వటం ఆంధ్ర దేశం చేసుకొన్న అదృష్టం. ద్రష్టలు మాత్రమె సందర్శించ గలిగే మహా వైభవం ఇది. వారు జితేంద్రియులు కనుక బహు ఆధ్యాత్మిక గ్రంధాలను అవలోడనం చేసిన మహా మనీషి కనుక వారికే సాధ్యమైంది అదొక లోకం. అందులో ప్రవేశిస్తే పరమాను భవమే. మాన, ఆధ్యాత్మిక మహా శాంతి లభించటానికి ఇలాంటివి చదివి తరించాలి.

ఉపాసన లో శారీరక అంగం అయిన అర్చన, మానసిక అంగం జపం, బౌద్ధిక అంగం ధ్యానం అని మూడు ఉంటాయి వీటిలో మాటల ద్వారా చేసే స్తోత్రం లేక స్తుతి అందరికి చాలా తేలికైనది సాధ్యమైనది ఈ స్తోత్ర సాహిత్యం లో భాగాలే సహస్ర నామ స్తోత్రం. ఆచార్య శంకరులు "గేయం గీతా నామ సహస్రం "అని దీని గొప్ప తనాన్ని చెప్పారు. శంకరుల దృష్టిలో గీతాధ్యయనం, సహస్ర నామ పఠనం సాధకులందరికి పరమ కర్తవ్యమ్. గీత అంటే ఆచార్యుల భావనలో భగవద్గీత. సహస్ర నామం అంటే విష్ణు సహస్ర నామం. ఈ రెండిటికి భాష్యం రచించి చదువరులకు సుసాధ్యం చేశారుఆది శంకరులు ఈ రెండు మనం పంచమ వేదం అని చెప్పుకొనే మహా భారతం లోనే ఉన్నాయి కర్త వేద వ్యాస మహర్షి . మహా భారత యుద్ధం ముందు భగవద్గీత ను సాక్షాత్తు శ్రీ కృష్ణ పరబ్రహ్మ జిజ్ఞాసువైన అ ర్జునునికి బోధించాడు . యుద్ధం తర్వాత విష్ణు సహస్ర నామం వస్తుంది గీత ప్రేరణ నిస్తే సహస్రనామం శాంతి నిస్తుంది. భారతం లో విష్ణు సహస్రం తో బాటు శివ సహస్ర నామమూ ఉంది. ఈ సహస్రనామ పారాయణ హిందువులకే కాదు జైనులకు కూడా ఉంది. జైన మునులు సాధకుల కోసం అనేక సహస్ర నామాలు రాశారు

ఈ పరంపరలో మనకు బ్రహ్మాండ పురాణం లో శ్రీ లలితా మాత లాలిత్యాన్ని, లావణ్యాన్ని, లీలా విభూతిని వర్ణించే శ్రీ లలితా సహస్రనామం లిఖించ బడి ఉంది దక్షిణాది సాధకులకు ఇది పరమ పావనమైనది. వ్యక్తి గతం గా సామూహికం గా ఉత్సవాలలో దీన్ని పారాయణ చేసి గొప్ప అను భూతిని పొందుతారు, కలిగిస్తారు. శుక్ర వారం నాడు పఠనం మహా పవిత్రమైనదిగా భావిస్తారు ప్రతి నామానికి మొదట

ప్రణవ నామమైన "ఓం కారాన్ని", చివర ప్రణామ నామమైన "నమః "శబ్దాలను చేర్చి లలితా మాతను వాగ్రూపం గా అర్చిస్తారు

శ్రీ శంకర భగవత్పాదులు విష్ణు, లలితా సహస్ర నామాలకు ఎంతో ప్రాధాన్యత నిచ్చారు. విష్ణు సహస్రనామాలకు ఎంతో సార వంత మైన భాష్యం రాశారు. లలితా సహస్రనామాల ఆధారం గా "సౌందర్య లహరి "అనే మహిమాన్విత మైన శతకం రాశారు. ఇది సాధకులకు తవ్విన కొద్దీ లభించే అపూర్వ నిధి. శంకరులు స్థాపించిన ద్వాదశ పీఠాలలో లలో శ్రీ చక్రాన్ని ప్రతిష్టించి దానికొక విశిష్టతను సంత రించారు. .లలితా సహస్ర నామం స్తోత్రం మాత్రమె కాదు శ్రీ దేవీ రహస్యాన్ని ప్రతి పాదించే శాస్త్రం కూడా. స్మరణ మాత్రం చేత పవిత్రం చేసేవి ఈ రెండు సహస్రాలు. లలిత లో శ్రీ దేవి అనంత సౌందర్యం, ప్రభావం ప్రసాద గుణం గొప్పగా వర్ణించ బడ్డాయి. ఆత్మ విద్య యొక్క అంత రంగిక రహస్యం కూడా ప్రతి పాదించారు. అందుకే దీన్ని "రహస్య నామ స్తోత్రం "అనీ అంటారు.

శ్రీ తత్త్వం,శ్రీ విద్యా,, శ్రీ చక్ర రహస్యం శ్రీ దేవి సహస్రనామాలలో దర్శన మిస్తాయి. అమ్మ తన చిన్మయ మంద హాసం తో ఆత్మ కధను మధుర వాక్కులతో వినిపిస్తున్నట్లున్తుంది. ఇందులో ఒక చక్కని క్రమ పద్ధతి ఉంది. విష్ణు సహస్ర నామాలలో నామాల పూర్వా పరం, ఆత్మాను శాసనం అందరికి అర్ధం కావు. చాలా సూక్ష్మ పరిశీలన చేసిన వారికే అవి గోచరాలు. కాని లలిత లో పూర్వాపర సంబంధం, ఆధ్యాత్మికత, దార్శనికత, ఆలోచనా ధార, ప్రతి వారికి అర్ధమయ్యే రీతి లో కూర్చబడిన నామాలు ".బహుజన హితాయ బాలానం సుఖ బోధనం" అన్నట్లు సులభ శైలిలో నామాలు నడుస్తాయి.

సరస్వతీ మాతను శ్రీ దేవి తన నమ సహస్రిక ను రచించమని కోరితే వాగ్దేవి రాసింది. అమ్మ ఆజ్ఞ తో వాగ్దేవతలు ఈ స్తోత్రం చేశారు. రచనలో సుందరత,సౌష్టవం ఉన్నాయి సాహిత్యం పరమ ఉత్కృష్ట స్థాయి లో ఉంది. మొదటి ఇరపై నాలుగు శ్లోకాలలో శ్రీ దేవి దివ్య సౌందర్య వర్ణన ఉంది ఇంత అద్భుత వర్ణన ప్రపంచం లో ఏ సాహిత్యం లోను లేదని దీనికి సరి సాటి లేదు అని శ్రీ ఇల పావులూరి వారన్నారు. లలితా సహస్రనామాలను చెప్పిన వాడు హయ గ్రీవుడు. శ్రోత అగస్త్య మహర్షి. రహ్మాండ పురాణం లో హయగ్రీవుడు లలితామాత మహిమ లన్నీ అద్భుతం గా వర్ణించి చెప్పినప్పుడు మహర్షి పులకించి "లలితా దేవి రహస్య నామాలను "కూడా తెలియ జేయ వలసిందని కోరగా "రహస్య నామ సహస్రం "ను హయగ్రీవుడు ఉపదేశించాడు. ప్రతి నామం లో దేవి నివాసం ఉంటుందన్నాడు కనుక నామాల ద్వారా చెప్పిన సత్యం దీని కూర్పు లో ఉందని తెలుస్తుంది.

శ్రీ దేవి మహిమాన్విత గాధల వెనుక కూడా తాత్విక రహస్యం ఉంది. బ్రహ్మాండ పురాణం లో శంభువు శ్రీ యాగం లో చిత్ కుండం లో శ్రీ మాతను ప్రత్యక్షం చేసుకోన్నాడని ఉంది కనుక శ్రీ యాగం, శ్రీ మాత ను పొందటానికి ఒక సాధనం అని తెలుస్తోంది. ప్రతి ప్రాణి లలాట లో ఈ చిత్ కుండం జ్వాజ్వల్య మానం గా ప్రకాశిస్తుంటుంది. శ్రీ యాగం చేసినా దర్శన మిస్తుంది శివుడికే యాగం చేస్తే కాని ఆమె దర్శనం కాలేదు.

శ్రీ తత్వాన్ని గూర్చి ఆలోచించటం,శ్రీ విద్య మననం, శ్రీ చక్రారాదనే శ్రీ యాగం అంటే. వేరే ఏదీ కాదని గ్రహించాలి.

శ్రీ తత్త్వం విశ్వ మంతా వ్యాపించి ఉంది. ప్రతి మనిషి లలాటం లో శ్రీ తత్వాన్ని చూడ వచ్చు "లోకానతేత్య లాలతే, లలితా తేన సోచ్యతే "అంటే అమ్మ వారికి లలిత అన్న పేరు ఆమె లోకానికి అతీత యై లోక లీలను లాలిస్తుంది. కనుక ప్రతి వ్యక్తీ లలాటం అ లీల దామమే. కావలసింది దాని పై ధ్యాస మననం అవగాహనా మాత్రమె. దీనికే ఈ లలితా సహస్ర నామాలు సాధనాలు అవుతాయి. అది పఠిస్తుంటే శ్రీ తత్త్వం బోధ పడుతుంది. ఉపాసకులు శ్రీ చక్ర పూజ చేస్తారు. ఇదొక విశిష్టమైన యంత్రం. ఇందులో బిందు, త్రికోణ, వలయ రేఖ, దళాల వంటి చిహ్నాలుంటాయి ఇవి ఈ బ్రహ్మాండం యొక్క సృష్టి స్టితి లయాలకు ప్రతీకలు. ఈ లక్షణాలన్ని మానవ శరీరం లోనే ఉన్నాయని మనం మర్చి పోతూంటాము. శరీరమే శ్రీ చక్రానికి ప్రతి రూపం అని తెలియాలి. ఇందులోని తొమ్మిది ఆవరణలే మన నవ రంధ్రాలు. అందులోని ఆనంద మయ బిందువే లలాటం మీద ఉన్న సహస్రార చక్రం. ఇదే అమ్మ వారి పవిత్ర నివాసం. శ్రీ చక్రం మన పుట్టుక తోనే వచ్చే పరమాత్మ సాధనం.

శ్రీ విద్య శ్రీ మాతను ప్రసన్నం చేయటానికి దోహద పడుతుంది. లలితా సహస్రనామ పఠనం ఈ మంత్రం ఫలాన్నిస్తుంది. దేవి కృప అంతర్ముఖమైన వారికే లభిస్తుందని మరువ రాదు. అంటే భావన చాలా ముఖ్యం అందుకే "అంతర్ముఖ సమారాధ్యా –బహిర్ముఖ సుదుర్లభా "అన్నారు భవానీ భావనా గమ్యా అనటం భావనే ముఖ్యమని. భావన అంతర్ముఖం అయితే పిండాండం లో బ్రహ్మాండ దర్శనం లభిస్తుంది. ఇదే శ్రీ దేవి ఆరాధనా పరమ లక్ష్యం. దీని శ్రీ సహస్రిక అమోఘమైన సాధనం.

శాస్త్ర దృష్టిలో చూసినా పదార్ధం శక్తి వీటి ప్రతి క్రియ వల్లనే ప్రపంచ సృష్టి జరుగుతుంది. ఈ రెంటికీ భేదం లేదు. ఆదార్ధం శక్తిగా శక్తి పదార్ధం గా మారుతుంది. శక్తి స్తూల రూపం పదార్ధం. ఈ పరార్ధమే పరమ శివుడు. శక్తియే పరమేశ్వరి. శివుడికి, శివానికి భేదం లేదు. ఒకే తత్వానికి వారిద్దరూ రెండు రూపాలని గ్రాహించాలి. శక్తి దేశాకాల ను బట్టి వివిధ రూపాలు ధరిస్తుంది "యస్య యస్య పదార్ధస్య యాయా శక్తి రుదాహృతా – సాసా సర్వేశ్వరీ దేవీ శక్తిమంతో మహేశ్వరః "

భండాసురుడిని సంహరించింది శ్రీ దేవి. భండాసురుడు అంటే జడత్వం అంటే బద్ధకానికి ప్రతీక. మనిషి హి స్వభావ సిద్ధం గా విశ్రాంతి కోరుకొంటాడు అవసరం వచ్చే దాకా రాయిలా ఉండి పోతాడు. లేక పోతే యేపనీ లేకుండా దేశ ద్రిమ్మరి లా తిరుగు తాడు. న్యూటన్ జడత్వ సిద్ధాంతం కూడా దీన్ని సమర్ధించింది జడత్వం నశించే వరకు మనిషి తన లో ఉన్న శక్తిని గుర్తించలేడుఈ శక్తినే మనం శ్రీ దేవి అంటున్నాం. అందుకే ఆమె భండాసుర సంహారం చేసి తృప్తి చెందింది. .లోపల చైతన్యాన్ని ఒక సారి మేలు కొలిపితే సాధనా మార్గం తేలికవుతుంది. అమ్మ మన చెయ్యి పట్టుకొని ఆనంద పరమా వదికి చేరుస్తుంది.

లలితా సహస్ర నామాలలో మొదటి పంక్తి "శ్రీ మాతా శ్రీ మహా రాజ్ఞీ శ్రీ మాట్సింహ్వాసనే శ్వరి ",చిట్ట చివరిది "శ్రీ శివా శివ శాక్త్యైక్య రూపిణీ లలితాంబికా 'మొదటి మాటలలో శ్రీ మాత గా, మహా రాణి గా, ఈశ్వరి గా కనీ పించే పరమేశ్వరి చివరికి పరమ శివుని తో తాదాత్మ్యం చెంది జగదంబిక, లలిత రూపం గా దర్శన మిస్తుంది ఇదీ వరుస క్రమం. ఒక్కొక్క సారి మహా లావణ్య నిధి రూపం లో, ఆరో చోట పరమేశ్వరి ప్రతాప, పరాక్రమాలు ప్రాణులకు ప్రేరణ నిస్తాయి. ఒక చోట ఆత్మానందాన సంధాయి. మరో చోట మూలాధారం నుండి సహస్రారం దాకా చక్రాలను దాటి అమృతత్వ సంధాయినీ గా దర్శన మిస్తుంది. ఒక చోట బ్రహ్మ విష్ణు రుద్రాగ్రంధి విచ్చేదనం చేసి శివ శక్తుల అభేదాన్ని చూపించి మహా శక్తి రూపం గా ఉంటుంది. విశ్వం సమస్తానికి కర్త్రి, ధాత్రి, సంహార్త్రి గా ఉంటుంది మన కన్నులలోనే ఉంది మనల్ని కాపాడుతుంది. ఆమెయే శివుడు ఆమె శక్తి, ఆమెయే పురుషుడు ఆమె ఏ శక్తి . ప్రకృతి ఆమె జీవుడూ ఆమె.ఆమెయే బ్రాహ్మ ఆమె పదార్ధ సహక్తుల సమ్మేలన రూపం

ఇది లలితా సహస్రమే అయినా ఆమె దివ్య విభూతి సందర్శనమే. మొదటి నామం శ్రీ మాత చివరిది లలితాంబిక మధ్యలో కామాక్షి, బాలా, భవానీ, శాంకరీ, శివకరీ,దుర్గా, మహా దేవి, ఆహా లక్ష్మి, మహా త్రిపుర సుందరి, పార్వతి, నారాయణి, కల్యాణి, కాత్యాయని, రామా, ఉమా, గౌరీ బ్రాహ్మి, రాజరాజేశ్వరి ఆయత్రి, సరస్వతి, మహా కాళి, చండికా, అపర్ణా, త్ర్యంబిక, బ్రాహ్మణి, వైష్ణవి, శివా మొదలైన నామాలు వస్తాయి ఈ సహస్రం లో లలిత పేరు ఒక్క సారే వస్తుందని గ్రహించాలి. ఏ రూపం ఎవరికి ఇష్టమో అది ఇందులో ఉంటుంది "సహస్ర పరమా దేవి శతమూలా శాతాంకురా "అన్ని సూక్తం ఇందు లో ఉంది. ఇందులో ఏ నామమూ రెండో సారి రాక పోవటం ప్రత్యేకత. నిర్మల మనసు, నిశ్చల హృదయం, స్తిర భావనా లతో ఈ నామాలు ఉచ్చరిస్తే అన్ని రహస్యాలు క్షణం లో అర్ధమవుతాయి. శ్రీ చక్రం లో అధిష్టాన దేవత శ్రీ మాత అక్షర ఆకృతి లో దర్శన మిస్తుంది. ఒక చోట డకారం లో మరో చోట రకారం లో, మరో చోట లకారం లో, వేరే చోట కకారం లో మరో సారి సకారం లో దర్శన భాగ్యం కలిగిస్తుంది. మనలో ఉన్న ఆత్మ మన దేవత. అది ప్రపంచమంతా వ్యాపించి ఉండనే భావన ముఖ్యం ఇక్కడ లలిత అన్నారు అంటే ఆత్మకే మరో పేరు లలిత అని గుర్తించాలి

శక్తి స్వరూపిణి అయిన శ్రీ దేవి భండాసుర వదకోసమే జన్మించింది. భండాసురుడు మహా శక్తి సంపన్నుడు మన్మధుని కుమారుడు బల గర్వాలతో మదించి ఉన్నాడు ఎవరిని లెక్క చేసే వాడు కాదు అక్షౌహిణుల దానవ సైన్యం అతని అధీనం లో ఉంది తమ్ముళ్ళు మహా బల పరాక్రమాలు కలవారు కొడుకులు వీరికంటే శక్తి ఉన్న వారు. వాడి ఆజ్ఞా కు అందరూ దాసోహం అనాల్సిందే. ఎదిరించే ధైర్యం ఎవరికి లేదు దేవతలను మునులను రుషి పత్నులను బాధిస్తూ వారి యజ్న యాగాదు లకు భంగం కలిగిస్తున్నాడు. అలాంటి వాడిని వదించాలంటే శక్తి మాత్రమె చాలదు యుక్తి ఉండాలి. దానికి మించి శస్త్రాస్త్ర సంపన్నత ఉండాలి వాడి బలాన్ని నిర్వీర్యం చేసే ఆయుదాలుఉంటేనే వాడిని నిర్జిన్చటం తేలిక లేక పోతే శ్రమ అంతా వృధా. ఇవన్నీ దేవతలు గ్రహించారు అమ్మకు బాసట గా నిలిచారు తమ శక్తులన్నిటి ని ఆమె

పరం చేశారు తాము నిమిత్త మాత్రులుగా ఉండిపోయారు. సర్వ వస్తు సామగ్రి సమకూర్చారు. ఇక శ్రీ దేవి ఆజ్ఞ ఇస్తే చాలు రణం మొదలెట్టటమే అన్నట్లు గా యుద్ధ రంగం సర్వ సంసిద్ధం గా ఉంది

ముందే చెప్పినట్లు భండాసురుడు రాయి లాంటి వాడు. నిష్క్రియా పరుడు, నిస్చేష్టూడు, నిస్చేతనుడు. ఎక్కడ పడి ఉంటె అక్కడే ఉండే తత్త్వం వాడిది. ఒక వేళ ఏదైనా మార్గం లో నడిస్తే అది తప్పుడు త్రోవే అవుతుంది. తప్పు పనులే చేస్తాడు విచక్షణా జ్ఞాన శూన్యుడు వాడి జీవిత పరమావధి తినటం సౌఖ్యాలనుభావించటం. మనస్సు, ప్రాణం విజ్ఞానం అనేవి ఏమిటో వాడికి తెలీనే తెలియవు. భౌతిక సుఖాలలో పశువు లాగా ప్రవర్తిస్తాడు. బ్రాహ్మాన్డాన్ని కేవల పిందాండం గా భావించి దేవి ఆగ్రహ జ్వాలకు మాడి మసి అయ్యాడు. అమ్మ ఆత్మ వైభవమే వాడిని లోబరు చుకుంది. ఈ విజయాన్నే అమ్మ వారి నామం "భండాసుర వదోద్యుక్త శక్తి సేనా సమన్వితా "అనే నామం లో ఆవిష్కార మైంది ఇక ఆమె సైన్య సమున్నతిని గూర్చి తెలుసు కొందాం.

**"సంపత్కరీ సమారాధ్యా, సింధూర వ్రజ సేవితా –అశ్వా రూఢాదిష్టి తాశ్వ కోటి కోటి భిరావృతా ''**

'' సంపత్కరి" అనే శక్తి శ్రీ దేవికి ఈ యుద్ధం లో సహాయ పడింది. ఈ శక్తి ఏనుగు మీద స్వారీ చేస్తుంది. ఇదీ దేవి గజ సైన్యం. సంపద నిచ్చే ఈ శక్తి ఏనుగు లాగా ఘీన్కరిస్తుంది. ఘోర నిద్రలో ఉన్న జీవులకు మేల్కొల్పు పలుకుతుందన్న మాట. కనుక జనాలను జాగృతం చేసే ఈ నినాదాన్ని "హస్తి నాద ప్రాబోదినీ "అని శ్రీ సూక్తం లో చెప్పారు. గజ గర్జనలో గంభీరత, పరి పూర్ణత జాగృతి మూడు కలిసి సమ్మేళిత మవుతాయి. ఈ అద్భుత సమ్మేళనమే సంపత్కరీ శక్తి అయిన శ్రీ దేవి గజ సేన లో కనీ పిస్తుంది. సంపత్ అనే శబ్దానికి సమ్యక్ రూపం లో పొందటం అనే అర్ధం ఉంది. ఏ వస్తువు సమ్యక్ అంటే సరైన రూపం లో లభిస్తుందో అదే సంపత్తు అని భావార్ధం. సంపత్తు రూపం లో లభించనిదే విపత్తు. ఏ వస్తువూ సంపత్తు, కాని విపత్తు కాని కాదు మనం చూసే దృష్టిలో భేదమే ఏ దృష్టిలో చూస్తె, ఎలా సంపాదిస్తే అది సంపత్తా లేక విపత్తా అన్నది ఆధార పడి ఉంటుందని అంతరార్ధం. సంపత్కరీ శక్తి దైవిక మైనది. అదే ప్రపంచం లోని ప్రతి వస్తువును సరైన దృష్టిలో చూపిస్తుంది.జీవితాన్ని ఏనుగు నడకలా గాంభీర్యం గా దర్జాగా గతి శీలం గా సుందరం గా చేస్తుంది శ్రీ దేవి గజ సేన ఇలా యుద్ధ రంగం లో సాగుతుంటే భండాసురిడికి, వాడి సేనకు వణుకు పుట్టిందన్న మాట.

రెండో పాదం లో అశ్వ సేన వర్ణిత మైంది. అశ్వా రూఢఅన్న దైవీ శక్తి కోట్లాది గుర్రాలతో కదులు తోంది.సంపత్కరి గజ గమనం లో గాంభీర్యం సౌందర్యం ఉంటె ఆశ్వారూ కోటి కోటి అశ్వాల పరుగులో గతి శీలతా, వేగం దమ్యత లేని స్వభావం జ్యోతక మవుతాయి. వేదాలలో "అశ్వ పూర్వా, రధమద్యా ""అనే శ్రీదేవి వర్ణన ఉంది ఇప్పుడీ నామం దాన్ని సార్ధకత చేస్తోంది గజ సేనలో దేవి సంపన్నత ఉంటె అశ్వ సేన లో సశ్రీకత కూడా మర్మ గర్భం గా ఉంది. గజ సేనలో జ్ఞానం, అశ్వ సేన లో కర్మ భావం వ్యక్త మవుతాయి

ముందు జ్ఞానం కలగాలి తర్వాత జ్ఞానాన్ని అనుసరించి కర్మా చరణ చేయాలి. అప్పుడే అభీష్ట లక్ష్యం నేర వేరుతుంది అని అంత రార్ధము

శ్రీ దేవి ఆమె అనుచర గణం తమ తేజస్సు, ఓజస్సు లకు అనుగుణమైన వేర్వేరు రధాల పై ముందుకు నడుస్తున్నారు. శ్రీ దేవి కూర్చున్న రధం "శ్రీ చక్ర రాజం "అంటే శ్రీ చక్రం తో అలంకరింప బడింది ఈ రధం లో విజయం సాధించి పెట్టె సకల శ స్త్రాస్త్రాలు ఉన్నాయి. ఆమె అనుచర మంత్రులు "గేయ చక్ర"అనే పేరున్న చక్రాలతో తాయారు చేయ బడిన రధాల మీద అనుసరిస్తున్నారు ఈ వర్ణన అంతా తరువాతి శ్లోకం లో దర్శన మిస్తుంది.

**"చక్ర రాజ రాదారూఢ సర్వాయుధ పరిస్కృతా –గేయ చక్ర రధా రూఢా మంత్రిణీ పరి సేవితా "**

శ్రీ దేవి రధ చక్రాలు అన్నిటి కంటే పెద్దవి ఆ చక్రాల గొప్ప తనాన్ని వర్ణిస్తూ మంత్రిణుల రధ గేయ చక్రాలు కదులుతున్నాయి. ఈ గేయ గానం అమ్మ వారి రాగిణీస్వరాన్ని ముఖరితం చేసే సంగీత చక్రాలుగా ఉన్నాయి. ఈ గేయ చక్రాలు వాక్య రామణీ యకం గా, మదురిమ లతో కూడి ఉన్నాయి ఇది దేవి తీజో రూప వర్ణనం. జ్ఞాన, జ్ఞేయ, జ్ఞాతలవివేకం అంతా ఈ భూమిక లో కనిపిస్తుంది. సత్, అసత్ ల మధ్య ఉండే తేడాను మంత్రిణీ మాత స్పష్టపరుస్తోంది అని భావం. అంటే మంత్రిణులగేయ చక్రాల సహకారం తో శ్రీ మాత శ్రీ చక్ర సాక్షాత్కారం సాధ్యమవుతుంది. .కాని గేయ చక్రం కూడా అందరికి అందేది కాదు. నిర్మల, నిశ్చల మైన వాక్కున్న వారికే అది సుసంపన్న మవుతుంది. దీని తర్వాత కిరి చక్ర వర్ణన ఉంటుంది

**"కిరి చక్ర రధా రూఢదండ నాధ పురస్కృతా –జ్వాలా మాలిని కాక్షిప్త వహ్ని ప్రాకార మధ్యగా "**

చావు, పుట్టుక ల చక్ర భ్రమణం లో ఇరుక్కు పోయిన జీవితాలకు జరా మరణాలు లేని శాశ్వత లోకాన్ని అందించేఆచరణ రూపం లో ఉన్నది శ్రీ చక్రంమాత్రమె. ఆమె దండ నాదు రాలై కూర్చునేది కిరి చక్రం లోనే. "కుర్వాన్నే వేహ కర్మాణి జిజీవిషేత్ –శతం సమః "అని ఈశోపనిషత్తు అంటుంది. అంటే మనిషి జీవిత కాలం లో విధ్యుక్త నిర్వహణ చేస్తూ నూరేళ్ళు ఆచరణ లో హాయిగా ఆనందం గా జీవిస్తాడని అర్ధం. ఇదే మానవుడి అమరత్వ రహస్యం అంది ఉపనిషత్. దీని ఆధారం గా దండనాయకి కిరి చక్రం ధర్మ రాగం లో కర్మ గీతం విని పిస్తోందని భావం. కిరి చక్రం కర్మ చక్రమైతే, గేయ చక్రం జ్ఞాన చక్రం గా అర్ధం చేసుకోవాలి. శ్రీ చక్రం అమ్మ వారి పరమ పావన భక్తీ భావనకు ప్రతినిధి అయిన కైవల్య చక్రం అని అర్ధమవుతుంది. మంత్రిణులు అమ్మ వారికి నాల్గు దిక్కులా కాపలా కాస్తూ ఉంటె ఆమె భక్తులను రక్షిస్తూ మార్గాన్ని శుభ్రం చేస్తూ ముందుకు సాగి పోతోంది.

శ్రీ మాత అగ్ని గుండం మధ్య ప్రతిష్టిత మై ఉంటుంది. ఆమెను అగ్ని ఏమీ చేయలేదు. అగ్ని సమాన పవిత్రురాలు, ఉజ్వల తేజస్కు రాలు. మనం బొట్టు పెట్టుకొనే చోట మూడో కన్ను ఉంటుందని అందరికి తెలిసిన విషయమే. అది జ్ఞాన, తేజస్సు, జ్వాల లప్రతీక గా ఉంది లోపలే జ్వలిస్తూ ఉంటుంది. ఈ జ్వాల

ఎవరిలో బాగా ఉజ్వలం గా ఉంటుందో వారు ఆ పరమేశ్వరి కి దగ్గర వారవుతారు. అంటే అమ్మ కృప వారి పై చాలా ఎక్కువన్న మాట. దేవీ కృప, మనలోని అంతర్జ్వాల ఒక దాని పై ఒకటి ఆధార పడి ఉంటాయి. దేవి కృప వల్ల మన జ్ఞాన జ్వాలజ్వలిస్తుంది. ఈ జ్ఞాన కాంతి వల్లే శ్రీ దేవి సాక్షాత్కారం లభిస్తుందని గ్రహించాలి. దీన్ని విశ్లేషణ చేసి చెప్పలేం. దైవ సంయోగం, ఇచ్చ మీద ఆధార పడి ఉంటుంది. ఆమె జ్వాలా వలయాల మధ్య ఉంటుంది కనుక ఆమె వద్దకు ఎవరు వెళ్ళ లేరు. ఆ పరం జ్యోతి సాక్షాత్కారం ఉంటె జ్వాలా వలయం లోకి ప్రవేశించే అధికార యోగ్యత లభిస్తుంది ఇది సాధన వల్లనే సాధ్యం.

**''భండ సైన్య వధోద్యుక్త శక్తి విక్రమ హర్షితా –నిత్యా పరాక్రమోపేతా నిరీక్షణ సముత్సుకా ''**

భండాసుర వధకోసం శ్రీ దేవి ఏమీ చెయ్యాల్సిన పని లేదు ఆమె శక్తి సేనయే ఈ పని చేస్తుంది. వాడి వధకు బ్రహ్మాండ మంతటి సైన్యం పరమేశ్వరికి తోడ్పడుతుంది.

దేశ కాలాల అనంత విస్మృతి నుండే దేశ కాలాతీత శక్తిని సముపార్జిస్తుంది. అగ్ని కుండ మధ్యలో ఉండి సూర్య చంద్రుల ప్రకాశం నుండి పరాక్రమాన్ని పొందుతుంది పరమేశ్వరి. సూర్య, చంద్ర గతి వల్లనే అనేక కళలు ఆవిర్భావ మవుతాయి. సూర్యుడు చంద్రుడి తో సమ రేఖ మీద ఉన్నప్పుడు చంద్రుడు సూర్య కాంతి లో దాక్కుని పోతాడు. ఇదే అమా వాస్య. తర్వాత చంద్రుడు నెమ్మదిగా సూర్యుడి నుండి వేరవుతూ తన కళలను చూపిస్తాడు. క్రమంగా వికసించి చంద్రుడు సూర్యుని ముందు చేరి తన కున్న పదహారు కళలను వ్యక్తం చేస్తాడు. దీనికే పూర్ణిమ అని పేరు. మానవ మెదడు మీద, సముద్ర తరంగాల మీద చంద్ర కళల; ప్రభావాన్ని మనం అందరం గ్రహిస్తూనే ఉన్నాం. ప్రతి నెలలో పూర్ణిమ అమావాస్య వస్తాయి. ఈ రెండిటి మధ్య నిత్య దేవతలు మంజుల మంగళ రూపం తో మానవ మనస్సు ను అమృత మయం చేసి ఆనందాన్నిస్తూఉంటాయి .

యుద్ధ రంగం లో శ్రీ దేవి గొప్ప ఉత్సాహం తో యుద్ధ నైపుణ్యాన్ని ప్రదర్శిస్తుంది పరమేశ్వరి ముద్దుల కూతురు ''బాల ''కూడా యుద్ధ రంగానికి చేరుకొంటుంది. ఆమె భండాసురునికి ఉన్న 32 మంది కొడుకుల్ని వధించే సింది. వాడి సర్వ సైన్యం క్షణం లో రూపు మాసి పోతుంది. శ్రీ బాల చేసిన ఈ అద్భుత కార్యాన్ని మాత శ్రీ దేవి ప్రశంసించే లోపలే మంత్రిణీ, వారాహీలు భండాసుర మిత్రులైన విషంగ, విశుక్రులను హత మారుస్తారు. ఈ భీషణ యుద్ధం లో తనకు అండగా నిలవ మని పరమేశ్వరి భర్త కామేశ్వరుని ముఖం నుండే ప్రేరణ పొందుతుంది. వెంటనే విఘ్నే శుడిని సృష్టిస్తుంది. పరమేశ్వరి పవిత్ర గాధకు శ్రీ గణేశుని తో శ్రీకారం జరుగుతుంది

**''భండ పుత్రా వధోద్యుక్త బాలా విక్రమ నందితా –మంత్రిణ్యంబా విరచిత విషంగా వధ తోషితా ''**

**విశుక్ర ప్రాణ హరణ వారాహీ వీర్య నందితా –కామేశ్వర ముఖా లోక కల్పిత శ్రీ గణేశ్వరా''**

శ్రీ మాత విజయం ఆత్మ వైభవ గాధయే . భండాసుర వధ అంటే అజ్ఞాన, అత్యాచార అహంకార నిర్మూలనమే. నశ్వరం అయింది నశించే దాకా అవినశ్వరం ఆవిర్భావం కాదు. శ్రీ మాత శక్తి ఆత్మ శక్తియే అనిశ్వరమైంది భండాసురుని శక్తి, పరాక్రమాలు పార్ధివమైనవి నశించేవి. శ్రీ మాత కుమార్తె శ్రీ బాల వాడి ముప్పై మంది పుత్రులని క్షణం లో భస్మం చేసే సింది. దీని తో ఆత్మ సేన కు ధైర్యం ప్రేరణా కలిగాయి. వాడి సంతానం నశిన్చాగానే మిత్రులైన విషంగ, విశుక్రులు విజ్రుమ్బించారు. వీరిని మంత్రిణి, వారాహి దేవతలు వధించేశారు దీనితో వాడి పరాజయం పరమేశ్వరి విజయం ప్రారంభ మైంది.

పరమాత్మ స్వరూపిణి అయిన పరమేశ్వరి ఆత్మ వైభవం తెలియని విషంగ , విశుక్రులు నిష్ప్రయత్నానికి, నిర్వీర్యతకు ప్రతీకలు. విషంగుడు అంటే తనంతటి వాడు లేడని మదం తో అహంకరించే ప్రాణి. వాడికి ఆత్మ స్వరూపం తెలియదు. వాడికి సత్సంఘం అంటే తెలియదు అందుకే విషంగుడైనాడు. సాధారణం గా సంసార జీఎవితం పట్ల అనాసక్తి రెండు రకాల కారణాల వాళ్ళ కలుగుతుంది స్వార్ధం వల్ల , పరమార్ధం వల్లా కూడా అనాస క్తి వస్తుంది ఇంద్రియా సక్తుడై విషయ లంపటం లో ఉన్న మనిషి ఈ శరీరాన్ని గురించే ఆలోచిస్తాడు. లౌకిక సుఖం కోసం డబ్బు కావాలని అర్రులు చాస్తాడు. ఇది వ్యక్తీ గత స్వార్ధం దీని వల్ల మనిషి విషంగుడ వుతాడు. సర్వ సంగ పరిత్యాగి అయినా యోగి ఆత్మానందం కోసమే అన్వేషిస్తాడు మిగిలిన వన్నీ అతనికి తుచ్చాలు నీచాలు, .మొదటి వాడిది స్వీయ ఆనందం ఇతనిది విరాట్ భావం అంటే సర్వ ప్రపంచం ఈ యోగికి ఆనంద మయం గా కన్పిస్తుంది. మొదటి వాడిది అసంపూర్ణమే కాక ప్రమాదం కూడా. ఇదే విషంగుడి ఆనందం. ఇదే పరామేశ్వరికి ఇష్టం లేని విషయం. క్షుద్ర ఆనంద నిరాకరణమే విషంగ వధ లో అంత రార్ధం.

విషంగుడి సోదరుడే విశుక్రుడు. శుక్రుడు మనిషి తేజస్సుకు, ఓజస్సుకు, ప్రకాశానికి ప్రతీక. ''శుక్రమసి తేజోసి ''అని అనే దానిలో పరమేశ్వరి ఈ సంకేత నామం తోనే లభిస్తుంది. కొందరు దీన్ని సద్వినియోగం చేసుకొంటే కొందరు దుర్వినియోగం చేసుకొని చేటు తెచ్చుకొంటారు. కేవలం సుఖ భోగాలకే శుక్రత్వాన్ని ఉపయోగించే వాళ్ళు పార లౌకిక జ్ఞానం పొందలేరు. విశుక్రుడు ఇలాంటి విషయా సక్తుడు. అతని శక్తి పరాక్రమాలను హరించే శక్తి పేరే వారాహి. వరాహ శబ్దం శ్రేష్ట వాచకమే వరాహ లాంచనులు వరాహ ధ్వజాన్ని ధరించే వారూ ఉన్నారు. ''దేన్నీ నాశనం చేయ వీలు లేదో అదే అహం ''.ఇలాంటి అక్షయ తత్వాలలోవిశిష్టమైన యుక్తి పేరే వారాహి. విశుక్రుడు నశ్వర సుఖ లాలసుడైతే, వారాహి అవిననిశ్వర , అక్షయ, అలౌకిక ఆనంద సంధాయిని . వారాహి చేసిన ఈ కార్యానికి ఆమె వీర్య, పరాక్రమాలకు దేవి ప్రసన్ను రాలైంది ఇలా వారాహి విశుక్రుని విషయ లాలసను నాశనం చేసిన్దన్నమాట. ఈ రకం గా మంత్రిణి వారాహిచేసిన విషంగ, విశుక్ర వధ చెడు తత్వాల నాశనానికి, సత్ప్రేరణ కు దారి తీసింది

అన్ని అడ్డంకులు తొలగి పోయిన తర్వాత పరమేశ్వరి పరమ శివుని చూసి శ్రీ గణేశుని సృష్టిస్తుంది. ఈ ఆనంద సమయం లో పరమాందం పొందిన శివుడు కూడా ప్రసన్నుడవుతాడు. వారిద్దరి చూపులు కలిశాయి. అంతే అప్పుడు వెంటనే గణేశుడు వారి ముందు ప్రత్యక్ష మైనాడు వినాయకుడు కుమారస్వామి ఇద్దరు పార్వతీ పరమేశ్వరుల పుత్రులే. సుబ్రహ్మణ్యుడు శివ కుమారుడు. గణపతి పార్వతీ నందనుడు. దీన్నే తులసీ దాస భక్త కవి "శంకర సువన్ భవానీ నందన్ "అని వర్ణించాడు. అంటే ఇందులోని పరమార్ధాన్ని గోస్వామి గ్రహించి మనకు తెలిపాడన్న మాట. కుమార స్వామి జననం కోసం శివుడి వీర్యం అవసర మైంది కాని గణేశ జననం కోసం మహేశ్వరి మహా సంకల్పమే సరి పోయింది మహేశ్వర రూప కల్పన ఈ మహా సంకల్పాన్ని సాకారం చేశాడని అర్ధం చేసుకోవాలి

మహేశ్వరి మహా సంకల్పం వల్ల జనించిన విఘ్నేశుడుఅన్ని విఘ్నాలను దూరం చేసే సర్వ సమర్ధుడు. అతని విఘ్న కారిణీ మహత్వాన్ని చూసి పార్వతి మహా ఆనంద పడింది ఈ వర్ణనే తరువాతి శ్లోకం లో కానీ పిస్తుంది

**"మహా గణేశ నిర్భిన్న విఘ్న యంత్ర ప్రహర్షితా –భండాసురేంద్ర నిర్ముక్త శస్త్ర ప్రత్యస్త్ర వర్షిణీ"**

పరమేశ్వరి ప్రశస్తమైన మార్గం లో భండాసురుడు అనేక రకాల విఘ్నాలు కల్పించే ప్రయత్నం చేశాడు. కాని వీటన్నిటికి నివారణోపాయాలుఆమె వద్ద ఉన్నాయి . పుత్రుడు ఆమెకు ఈ కార్యం లో అన్ని రకాల తోడ్పడతాడు గణేశుడు యాంత్రికం గా విఘ్నాలను నియంత్రించ గలడు.కాని మాత భండాసురుని ప్రతి శస్త్రాన్ని, అమోఘాస్త్రాలతో ఎదుర్కొంది. శస్త్రం భౌతికం. అస్త్రం మానసికం. శరీర బాధా నివారణకు మనో బలం తోనే సాధ్యం. శారీరక యాతనల నుండి ముక్తం అయిన మానస మరాళంఅంటే మనో హంస ఆత్మ వైపుకు ప్రయాణం ప్రారంభిస్తుంది.

**"కరాంగులి నఖోత్పన్న నారాయణ దశాకృతిహ్-మహా పాశుపతాస్త్రాగ్ని నిర్ధగ్ధాసుర సైనికా ''**

పరమేశ్వరి సృష్టి అతి విచిత్రం గా ఉంటుంది ఆమె చేతుల పది వేళ్ళలో నారాయణుని పది రూపాలుఅయిన మత్స, కూర్మ వరాహాదులుదేవి చేతి గోళ్ళ నుండే ఉత్పన్నమవుతాయి మానవ శరీరం దేవి గృహమే. అందువల్ల ఆ శరీరం లో ప్రతి అణువు దేవి కాంతి తో నిండి ఉంటుంది. ఆధ్యాత్మిక దృష్టిలో చూసినా మనిషిచేయి అన్నిటి కంటే ఉత్కృస్టమైనది. చేతులతోనే పరమాత్మ ను పూజిస్తాం తినటం త్రాగటం పని చేయటం అన్నీ వాటితోనే అంతేకాక ఇవ్వటం తీసుకోవటం భయపెట్టటం బెదిరించటం ఆశీర్వదించటం అభయమివ్వటం మొదలైన వాటికి చేతులే ముఖ్యాంగాలు. మన చేతి అగ్రభాగం లో లక్ష్మీ దేవి, మధ్య భాగం లో సరస్వతీ దేవి, మూల భాగం లో మాహేశ్వరి కాపురముంటారని చెబుతారు ''కరాగ్రే వసతే లక్ష్మీ- కరమధ్యే సరస్వతి- కర మూలేతు శర్వాణీ(గోవిందః )ప్రభాతే కర దర్శనం "అని నిద్ర లేవ గానే మన చేయిని చూసుకొంటాం

జంతువులన్నిటికి చేతులున్నా మనిషి చేతులకే ప్రత్యేకతలున్నాయి కర్మలు చేయటం తో పాటు ఇవి మనస్వితకు కూడా ఉప యోగ పడతాయి. చేతిని,అరచేతిని తిప్పటం లోనే మనిషి వ్యక్తిత్వం బయట పడుతుంది. ఏ వ్యక్తీ చేతిలో ఎంత పవిత్రత, మనస్విత , మధురిమ ఉంటాయో అతని వ్యక్తిత్వం అంత దివ్యమైనదిగా భావిస్తారు. మహేశ్వరి దివ్య హస్తం వరద హస్తమై లోకోత్తర భవ్యత, దివ్యత ల తో నిండి ఉంటుంది. అందుకే ఆమె చేతి వేళ్ళగోళ్ళనుండే సమస్త చరాచర సృష్టి పుడుతుంది. ఆమె శక్తి ముందు మిగిలిన వేవీ సమానం కావు.

భౌతిక ద్రుష్టి లో ప్రపంచం లోని ప్రతి ప్రాణీ పశువే. కాని ఆధ్యాత్మిక దృష్టిలో అతడే పశుపతి నాధుడు కూడా. పశుపతి దయ వల్లనే మనిషి ఆలోచించటం ప్రారంబించి తనను తాను తెలుసుకొంటాడు. . –తనలో పశుపతి భావనను సాక్షాత్కారింప జేసుకొంటాడు. ఈ హిరణ్మయ చేతన అ నుభవం లోకి రాగానే అప్పుడు అజ్ఞానం అంతా తొలగి పోతుంది. నిజమైన జ్ఞానోదయమవుతుంది

భండాసుర సైన్యం అంతా పాశుపతాస్త్ర ప్రయోగం తో సర్వ నాశనమవుతుంది వాడి సారహీన నగరాన్ని ఆ జ్వాలలతో భస్మీపటలం చేస్తుంది శర్వాణి. వాడి మహా నగరం పేరే ''శూన్య క నగరం ''అంటే నగర వైభవం అంతా శూన్యం అన్న మాట. అందులో తత్త్వం అనేది లేదని సారాంశం. భవనాలు సింహాసనాలు అధికారం భోగం వంటివి మనిషిని అమరుడిని చేయలేవు. దీన్ని ఇచ్చేది వాడి ఆత్మ జ్ఞానమే. దీనికి తోడూ బ్రహ్మ భావనా. దానిలోనే ఆనందం ఉంది. ప్రపంచం లోని సర్వ వస్తు సముదాయమూ శూన్యమే. సర్వాత్మ అంతటా వ్యాపించి ఉన్నాడన్న ఎరుకయే అసలైన ప్రపంచసారం. ఇది సర్వ సంపూర్ణం. దీనికి బయటి సాధనాలు ఉపకరణాలు పని చెయ్యవు. ”అంటే శూన్యం నుంచి పూర్ణం ''వైపుకు ఆధ్యాత్మిక ప్రయాణం సాగాలి అని పరమార్ధం.

**''కామేశ్వరాస్త్ర నిర్దగ్ధ భండాసుర శూన్యకా –బ్రహ్మోపేంద్ర మహేంద్రాది దేవ సంస్తుభ వైభవా ''**

ఈ సంసారం నిస్సారం అని అర్ధం అవటానికి కామేశ్వరుని కృప కావాలి. శూన్యం సంపూర్ణం గా కనీ పిస్తుంది అప్పుడే. కామ దేవుడు మన్మధుడిని క్షణం లో భస్మం చేసిన అస్త్రం కామేశ్వరుడి దగ్గరే ఉంది ఆ అస్త్రమే భండాసురుడిని, వాడి శూన్యక నగరాన్నీ భస్మీ పటలం చేసింది మనసులో ఏ కోరికా లేనప్పుడు ప్రా పంచిక సుఖాల శూన్యత్వం దానంతటికి అది బయట పడుతుంది. మాయ, మొహం మమత, అనే అందమైన వల క్షణం లో ముక్కలై పోతుంది.

కామేశ్వరుడైన మాహా శివుడి ఈ విజయం తో ఏంతో సంతోషించిన బ్రహ్మ, విష్ణు మహేన్ద్రులు ఆయనను ప్రస్తుతించారు. ఆత్మ వైభవ మహత్తు ను తెలుసుకొని దేవతలంతా పరమేశ్వరీ పరమేశ్వరులను పరమ పురుష, పరా ప్రక్రుతులను ముక్త కంఠం తో ప్రస్తుతి చేశారు. త్రుటిలో భస్మమైన

కామ దేవుడిని కరుణామయి అయిన అమ్మ సహించలేక కరుణ తో అతని భార్య రతీ దేవి విలాపాన్ని విని సహించలేక పోయింది. స్త్రీ, పురుషులను మానవతను మమత, అనురాగాల తో బంధించే మంగళ కరమైన కామాన్ని లోకానికి అవసరం అని భావించింది అంతే క్షణం లో దయతో అమ్మ మన్మధుడిని పునర్జీవితుడిని చేసింది ఆమె ధర్మ సంవర్ధిని. కనుక కఠిన హృదయం తో కామేశు డు చేసిన కామ దహనాన్ని, పొరబాటును సరి దిద్దింది. ధార్మిక భూమి మీద విశుద్ధమైన మమత, ప్రేమ అనురాగాలు వర్ధిల్లాలని కామేశ్వరి సంకల్పం అందుకే మన్మధుడికి బతుకు నిచ్చింది

నిజానికి కాముడు కూడా అమ్మ సృష్టి లోని వాడే కదా. అందుకే స్రష్ట కు సృష్టి మీద సహజం గా అనురాగం ఉంటుంది ఆ అనురాగమే ఇక్కడ కాముని జీవితానికి సహాయ పడింది తండ్రి -కొడుకు పై కోపం ప్రకటిస్తే తల్లి సర్ది చెప్పటం లోకం లో మనం చూస్తూనే ఉన్నాం. "అశరీర రూపం "లోకాముడిని కామేశ్వరి సృష్టించి అతని చాయను అందరి హృదయాలలో ప్రతిష్టించింది ఇది కామునికే కాదు సకల చరాచర ప్రాణి కోటి కీ అవసరమైన ధార్మిక భావం సహజం గా "తీయని ఆకలితో" కామ వాసన అందరిలో మేల్కొనే ఉంటుంది. దాన్ని పరమేశ్వరి ప్రసాదం గా భావించి ధర్మ సమ్మితం గా సేవిస్తే అది దేవి ఆరాధనే అవుతుంది. ఈ విషయాన్నే తరువాతి శ్లోక పాదం తెలియ జేస్తోంది

**''హర నేత్రాగ్ని సందగ్ధ కామసంజీవ నౌషధిహ్ ''**

పరమేశ్వరి నామాలలో ప్రతిదీ ప్రాణ శక్తితో ఉంటుంది కామ దేవుడిని బూడిద రాసి చేసిన కామేశ్వరుడిని "హర "శబ్దం చక్కగా వ్యక్తం చేసింది. అంతటినీ హరించే వాడు హరుడు ప్రజాపతి చేసిన సృష్టిలో ఆహితమైంది, అనవసర మైంది, అశోభన మైంది అంతా నశింప జేయటమే శంకరుని పని. అందుకే హర శబ్దం వాడారు. హరుని మూడవ కన్ను మంట కాముడిని కాల్చింది. ఈ మూడో కన్ను మనందరి లోను ఉంటుందని గ్రహించాలి. లలాటం లో ఉన్న ఈ మూడో కన్ను లోపలి చూపును కలిగి ఆనందాన్ని పొందుతుంది. ఈ కన్ను తెరుచుకొంటే అంధకారం అంతా పటా పంచలై వెలుగు పరచుకొంటుంది. అజ్ఞానం స్థానాన్ని జ్ఞానం ఆక్రమిస్తుంది. ఆత్మ తత్త్వం బోధ పడుతుంది. అప్పుడు జ్ఞాని జీన్ముముక్తుడౌతాడు. ఈ జీవన్ముక్త దశ వైపు ఈ నామం సూచిస్తుందని భావం. పరమేశ్వరుడు ముక్తి దాత. పరమేశ్వరి ఈ ముక్తి ప్రయోజనాన్ని సమస్త ప్రపంచానికి అందిస్తుంది. "వినాశం లోనే వికాస బీజం ఉంది "అని గ్రహించాలి. కామ వాసన కామిని వినాశనం వైపు లాక్కేడుతుంది. అమ్మ వాడిని కామేశుని వికాసం వైపుకు తీసుకొని వెడుతుంది ఇదే పరమేశ్వరి నామం లో ఉన్న రహస్యార్ధం అని మహా వ్యాఖ్యాన కర్త స్వర్గీయ ఇల పావులూరి పాండురంగా రావు గారు వ్యాఖ్యానించి చెప్పిన దానినే మీకు అంద జేశాను. అందరికి ఆ పరమేశ్వరీ కటాక్షం లభించాలని ఈ దసరా సందర్భం గా కోరుతున్నాను

శ్రీలలితా  సహస్రనామ విశేషాలు

–ఆధారం స్వర్గీయ డా.శ్రీ ఇల పావులూరి పాండు రంగారావు గారి ''శ్రీ సహస్రిక ''

## త్రికూట రహస్యం

దేవి త్రిపుర సుందరి అందరిలోనూ ప్రేమ భావ బీజం నాటుతుంది. ప్రేమను పవిత్రం గా సేవిస్తే శుద్ధమైన ఆనందాన్ని అనుభ విస్తుంది. .కామ తో ఉన్న ప్రేమ లౌకిక శారీరక సుఖాన్నే ఇస్తుంది. కాని అలౌకికం అయితే పరమానందాన్ని శాశ్వత సుఖాన్నే ఇస్తుంది. ధర్మ సమ్మతం అయిన కామం  మంగళ ప్రదం. కామం మనిషిని పశువును చేస్తుంది, దైవ సమానుడినీ చేస్తుంది. కామాన్ని కోరేవాడు లౌకికాన్ని అలౌకిక ప్రేమగా గ్రహించాలి. అప్పుడే ప్రేమ సార్ధకమవుతుంది. అప్పుడు వ్యక్తిగత హద్దులు దాటి విరాట్ శక్తిని సాక్షాత్కారించుకో గలుగుతాడు అంటారు ఇలపావులూరి వారు.

రక్త మాంసాలతో కూడిన శరీరం వెనక ఒక పరమ రామణీయకమైన నిధి దర్శనమిస్తుంది. దీనిముందు ప్రపంచ సుఖాలన్నీ తుచ్చం అనిపిస్తాయి. అందుకే లలితా సహస్రం లో దేవిని ''మహా లావణ్య శేవధి ''అన్నారు అంటే దేవి సౌందర్యానికి పరాకాష్ట. పాప పరిహారం జరిగితే రూపం నిగ్గు తేలి దివ్యత్వాన్ని పొందుతుంది అంటారు డాక్టర్ పాండురంగా రావు గారు. ''శ్రీ వాగ్భవ కూటైక స్వరూప ముఖ పంకజా ''అన్న దానిలో ఆమె సర్వ శోభితమైనది. ముక్కుకింద సుధారస పాత్రలతో సమానమైన సరసత్వపు అక్షయ ప్రవాహాలైన ఆమె ఆధరాలున్నాయి. అవి ప్రపంచాన్ని దాహ పిపాసలో ముంచేస్తాయి. పెదవుల  నుండి మాటలు వెలువడు తున్నప్పుడు మాటల మధ్య దేవి చిరునవ్వు కోమల చాయతో వాయు మండలాన్ని అంతటికి ఆశ్రయం ఇస్తూ ఉంది. ఆమె ముఖానికి తగిన వాక్ సౌందర్యం ముగ్ధుల్ని చేస్తుంది. ముఖానికి నిజమైన శోభ వాణి అంటే పలుకు. అమృత వాక్కులు  వెలువడుతుంటే తదేక ధ్యానం తో తన్మయత్వం తో దర్శిస్తాం. అలాంటి దివ్య శోభ దేవి ముఖ మండలం లో భాసిస్తుంది.

''కంఠాధః కటి పర్యంత మధ్య కూట స్వరూపిణీ ''-దేవి కంఠం నుండి నడుము వరకు మధ్య కూటం వ్యాపించి ఉంది. వాగ్భవ కూటం లాగా ఇది తెరచుకొని ఉండదు అని గ్రహించాలి. ఎక్కువ భాగంకప్పబడి ఉంటుంది. శరీరం లోని నవ రంధ్రాలలో ఏడు రంధ్రాలు ముఖ మండలం లోనే ఉన్నాయి. మధ్య కూటం లో ఒక్క రంధ్రం కూడా లేదు. ఈ కూటం వాగ్భవ కూటాన్ని నడప టానికి సహాయ పడుతుంది. పెదవులనుండి బయటికి వచ్చేమాటలు నాభి నుంచే బయల్దేరుతాయని మనకు తెలిసిన విషయమే. ముఖ మండల సౌందర్యాన్ని  పెంపొందించ టానికి మధ్య కూటం తోడ్పడుతుంది.  మధ్య కూటానికి దాని స్వంత సౌందర్యం కూడా ఉంది. మెరిసే కళ్ళల్లో యెంత సౌందర్యం ఉంటుందో, ఎత్తైన వక్షస్థలం లోనూ అంతే సౌందర్యం

ఉంటుంది. కూర్చోవటానికి, లేవటానికి తిరగడటానికి శరీర మధ్య కూటం అందరికీ కావాల్సిందేగా. దేవి ముఖ మండలం యెంత మహిమాన్వితమో మధ్యకూటం అంటే మహిమాన్విత పాత్ర పోషిస్తుంది అన్నారు రావు గారు.

నడుము కింది భాగాన్ని శక్తి కూటం అంటారు సామర్ధ్య, సౌభాగ్య, సౌందర్యాలను పెంపొందించటం లో శక్తి కూటంముఖ్య పాత్ర పోషిస్తుంది. ప్రాణి శక్తికి ఇది మూల కేంద్రం. అందుకే దీన్ని మూలాధార కేంద్రం అంటారు. శక్తి స్వరూపిణి అయిన దేవి ముఖ్య నివాస స్థానం ఇదే అంటే మూలాధార కేంద్రమే. పరమేశ్వరి యొక్క ఈ శక్తికూటం కొందరిలో జాగృతం గా ఉంటె మిగిలిన వారిలో సుషుప్తం గా ఉంటుంది. ఈ శక్తి కూటం మేల్కొన్నప్పుడు వ్యక్తీ యొక్క చైతన్యం వికాసం వైపుకు ఉన్ముఖ మౌతుంది అంటారు డాక్టరుగారు. నడుము నుండి నాభి, నాభి నుండి హృదయం, అక్కడి నుండి కంఠం,దాని నుంచి లలాటం, అక్కడినుండి కపాలం వరకు ఈ శక్తి చైతన్య సంచారం చేసి సహస్రార చక్రం లో ఉన్న ఆనందమయి అయిన దేవి చరణామృతం లో శరీరం లోని అవయవాలన్నిటిని రస ప్లావితం చేసేస్తుంది. అందుకే శక్తి కూటమే పరాశక్తి ప్రధాన ప్రవాహం.

దేవి నివాసం మూడు కేంద్రాలు -వాగ్భవ కేంద్రం, , మధ్యకూట కేంద్రం, శక్తి కూటకేంద్రం. ఈ మూడూ వేరు వేరుగా ఉన్నా ఒకదానితో ఒకటి కలిసి ఉండటం విశేషం. ప్రతిజీవిలో ఇవి విడివిడిగా ఉంటాయి . ఈ మూడూ కలిస్తేనే శరీరం.ఈ శరీరమే అశరీర అయిన ఆత్మ యొక్క ఆనంద నిలయం. అక్కడే అమ్మ ఉనికి. పైకి కనిపించే రక్తమాంస ఆస్తుల వెనుక ఇంతటి రహస్యం ఉందని గమనించకపోవమే అజ్ఞానం. చీకటి బతుకు. ఈ శరీరమే పరమేశ్వరీ రమణీయ రూప రేఖలకు అంకితమైన యంత్రం . ఈ శరీరం వాగ్భవ కూటం నుంచి వెలువడే వాక్కే పరమేశ్వరి వాగ్విలాసాన్ని చిత్రించే మంత్రం. శరీర కదలికలు, వర్తనలే దేవి నడకలకు ప్రాతి నిధ్యం వహించే స్వతంత్ర తంత్రం. ఇలా పరమేశ్వరి స్థూల సౌందర్యం , సూక్ష్మ సౌందర్యం, యాంత్రిక స్వరూపం, మాంత్రిక మహత్వం, తాంత్రిక విధానం మానవ శరీరం మీదే ఆధారపడి ఉన్నాయని మరువ రాదన్నారు.

''మూల మంత్రాత్మికా మూల కూట త్రయ కలళేబరా –కులామ్రుతైక రసికా కుల సంకేత పాలినీ ''అన్న ముప్పై ఆరవ భాగం ఉపనిషత్ దర్శనమే. దేవత ఆత్మ విశిష్టమైన మంత్రం లో నిహితమై ఉంటుంది. ప్రత్యేక మంత్రంలో రూప మార్మిక సంకేతం ఉంటుంది. ప్రతి వ్యక్తికీ స్వంత వాక్ వైఖరి ఉంటుంది. మంత్రం లో మనకు కావలసిన దేవతను సాక్షాత్కారించుకో వచ్చు. ప్రతి మంత్రం ఏదోఒక దేవత ఆత్మకు ప్రతీక. కానీ శ్రీమాత అందరు దేవీ దేవతలకు జనని. అందుకే ఆమె ను ఆహ్వానించే మంత్రం మూలమంత్రం. అందులో ఆమె ఆత్మ నివాసం ఉంటుంది. కనుక మూల మంత్రాత్మిక అయిందన్నారు ఇలపావులూరి వారు. దేవి దివ్య శరీరం లోని మూడు ప్రధాన కూటాలు సమస్త ప్రాణుల శరీరం లోని కూట త్రయ సమూహానికి

మూలాదారాలు అని అర్ధం చేసుకోవాలి.అందుకే "మూల కూట త్రయ" అయింది. దేవి శరీరం ఒక మూల బిందువు. ఈ బిందువు ప్రతి బింబం ప్రతిప్రాణి లోను కనిపిస్తుంది. దేవి ద్రుష్టి మన ద్రుష్టి వెనక ఉన్నప్పుడే దాన్ని చూసే శక్తి మనకు లభిస్తుంది. ఆమె శ్రవణాలు మన వెనక ఉన్నప్పుడే మనం వినగలుగుతాం. అప్పుడే మన శరీర అవయవాలు శక్తి వంతం అవుతాయి.

కూట త్రయపు మూలం -,శారీరకం మానసికం, ఆధ్యాత్మికం అని మూడు రకాలు. స్తూల శరీరం లో ఇది శారీరకం. మాంత్రికం లో మానసికం, అఖండానంద ఆక్షయ రూపం లో ఆధ్యాత్మికం అవుతుంది. మూడు రూపాలలోను దేవి సకల చరాచర సృష్టికీ మూలాదారమే అవుతుంది. ఆమె దివ్య శరీరం లో ఉన్నట్లే మంత్రాక్షర కళేబరం లోను మూడు కూటాలు ఉంటాయన్నారు రంగా రావు గారు. శిరోభాగం, మధ్య భాగం, పాద భాగం. గాయత్రీమంత్రం లో కూడా మూడుభాగాలున్నాయని మనకు తెలుసు "తత్స వితుర్వరేణ్యం ",భర్గో దేవస్య ధీమహి ",ధియో యోనః ప్రచోదయాత్ ".ఇందులోని మూడు భాగాలు, పాదాలు కూటాలు కూడాఇలాంటి కూట త్రయాన్ని బాలా త్రిపుర సుందరి, పంచ దశి, శ్రీ విద్య మొదలైన మంత్రాలలో దర్శించ వచ్చునంటారు వారు. మంత్రం నిర్మాణం మంత్రం ద్వారా మనం మననం చేసే దేవత రూప కల్పనకు అక్షర రూపమే నంటారు. మంత్రమే దేవి శరీరం. అందుకే అక్కడ ఆమె ఆవాసం. కనుకనే "మూల కూట త్రయ కళేబరా "అనటం జరిగిందని వివరిస్తారు ఇల పావులూరి వారు.

శరీరపు మూడుకూటాలను కలిపి "కుల "అంటారు. ప్రాణి శరీర తత్వ సారం అంతా ఈ మూడుకూటాలలో ఉంటుంది. పాదాల నుండి శిరస్సు దాకా ఉన్న శరీరమంతా "కుల "అనవచ్చు. కంఠానికి పైభాగం సర్వ శ్రేష్టం అనిలోక రివాజు. లలటానికి పైనా , కపాలానికి కింద శ్రీ లలితా పరమేశ్వరి సహస్ర దళ కమలం లో నివసిస్తుందని విజ్ఞులంటారు. ఇక్కడ అఖండ ఆనందామృతం నిరంతరం స్రవి స్తుంది . ఈ ఆనందామృతాన్నే "కులామృతం "అన్నారు. ఇదే నశించే శరీరానికి అమరత్వ సిద్ధికలిగిస్తుంది. దీనినే "రసం "అనీ అంటారు. రసమే పరమాత్మ స్వరూపం. దేవి రసమయి. సాధకుడు "రసయిత ".రసమయి, రసయిత మధ్య సంధానం చేసే శరీరం "కుల "ను చూడటానికి ఒక్క లిప్త పాటు పరీక్షించి నిగ్గు తేలిస్తే అమృత భాండారం అవుతుంది అన్నారు ఇలపావులూరి వారు. శరీరం భస్మ మైన తర్వాత కూడా శరీరం లోని ఈ అమృతత్వం అనంత కాంతిపుంజం లో తన చిత్ ప్రకాశాన్ని వ్యాపింప జేస్తుంది. ఈ అమరత్వం, ఆనంద తత్త్వం పరమేశ్వరి కృప వల్లనే ఆస్వాదించగలం. .దేవి తానూ కులామృతాన్ని ఆస్వాదిస్తుంది, ఇతరులనూ ఆస్వాదింప జేస్తుంది. అసలు రసమే ఆమేకదా. రసయితా ఆమే.ఆమె ధ్యానం ధ్యాయిత్వం ధ్యాత కూడా. మాతా, మేయ, మాన రూపాల మూడిటి సమ్మేళనమే దేవి. ప్రపంచాన్ని కొలిచే కోలా బద్దకూడా ఆమెయే. సమస్త ప్రపంచం ఆమె వైభవాన్ని కొలిచే ప్రయత్నం చేస్తుంది. కొలిచే వారి కొలత సాధనమూ ఆమే కదా.

అన్ని కులాలను దేవి సృష్టించింది కనుక సృష్టి మంచి చెడు బాధ్యతా ఆమెదే. దీనిని సూచించేదే ''కుల సంకేత పాలిని ''అనే నామం. ప్రాణుల జగత్ అంతా కులమే. దాని ఆలనా పాలనా ప్రణదాత్రి అయిన పరమేశ్వరిదే. ప్రేమతో ఈ కార్యం నెర వేరుస్తుంది. ప్రాణి శరీరం లో ప్రాణ శక్తి రూపం లో ఆమె సంచరిస్తుందని మనం చెప్పుకొన్నాం. మూలాధారం నుండి సహస్రారం వరకు విభిన్న కేంద్రాలలో దేవి భిన్న రూపాలు చూడగలం. ఒక చోట సాకినిగా, మరొక చోట కాకిని గా, వేరే చోట హాకినిగా, ఇంకొక చోట సర్వాంతర్యామిని అయిన యాకిని గా ఆమె మూలాధార, స్వాదిస్టాన, మణిపూరక, ,అనాహత, విశుద్ధి, ఆజ్ఞాది చక్రాలలో ఉంటుంది. ఇవి బయటికి కనిపించేవికావు. సంకేత స్థలాలు మాత్రమె. ఇక్కడే సర్వ మంగళ సాక్షాత్కారిస్తున్దంటారు పాండురంగా రావు గారు. అంటే దేవి కులాలనే కాదు కుల సంకేతాలనూ పాలిస్తుంది అని తెలుసుకోవాలి తాను ఏర్పరచిన నియమాలనూ, సంకేతాలను, ఆదర్శాలను ఆమె ఆచరిస్తుంది, సాధకుల చేత ఆచరింప జేస్తుంది. ఇదంతా ఒక ప్రత్యేకమైన కూటభాష. అంటే సంకేత భాష. పరమేశ్వరి కూటత్రయ భాషా కళేబర రహస్యం తెలిసిన వారే దీన్ని అర్ధం చేసుకోగలరు. దీని తాళం చెవి వారి దగ్గరే ఉంటుంది.

ఈ కూట భాష ద్వారా కల భాషిణి కల్యాణిని చేరుకోవటానికి రెండు ఉత్తమ మార్గాలున్నాయి. ఒకటి కౌల మార్గం రెండవది సమయ మార్గం. కౌలమార్గం కులం లో ఉంటూనే కులాంగన సహ యోగం తో కైవల్యాన్ని పొందేకర్మ యోగం. సమయ లేక సమయాచార మార్గం లో ధ్యాన జ్ఞానాల ద్వారా సమయం తో సహస్ర దళ కమలంలో నివసించే సరసిజ నయన అయిన దేవీ సాక్షాత్కారం సాధించే సాదుమార్గం. కౌలమార్గాన్ని వామాచారం అనీ అంటారు. సమయాచారాన్ని దక్షిణా చారం అంటారు. కౌలం లో కామ వాసన పోదు. మానిని, మాంసం, మద్యం, ముద్ర మొదలైన పంచ మకారాల అనుభవమూ ఉంటుంది. కానీ ఈ మార్గం లో బాలన్స్ చాలా ఉండాలి. లేక పొతే అధో పతనమే. సమయాచారం ఆచరణకు సులభం, సాదుమార్గం కూడా. గృహస్త జీవితం గడుపుతూ, కామ భోగం అనుభవిస్తూ, పరమేశ్వరి సాన్నిధ్యాన్ని పొందే మార్గం ఇది. నిజానికి ప్రతి స్త్రీ పరమేశ్వరి ప్రతిరూపమే కదా. సవ్య దృష్టిలో స్త్రీని అర్ధం చెసుకుంటే దివ్యత్వం గోచరిస్తుంది. బాహ్యానికే కట్టుబడితే దారి మూసుకు పోతుంది.

సమయాచారం లో లౌకిక వాసనలకు స్థానం ఉండదు. యమ, నియమ, సమయ, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, సమాధి మొదలైన ఉత్తమ సాధనాలతో ముందుకు నడవాలి. శివ, శక్తుల సామరస్యమే ఈ సాధనకు సారం అన్నారు డాక్టర్ గారు. శివసాయుజ్యమే సాధకుని లక్ష్యం. సాధకుడు –సాధ్యం, ఆరాధకుడు –ఆరాధ్యం, జీవుడు –బ్రహ్మ, ప్రకృతి –పురుషుడు, తత్ –త్వం లు ఏకం కావటమే సమయాచార సంవిద అంటే మార్గం. సంవిదకే మరోపేరు సమయం. .సమయాన్ని ఆచరణ లోకి తేవటమే సమయాచారకుడి సాధనా రహస్యం. సంవిత్ –కామేశ్వరుడు. సంవిద –కామేశ్వరి. కామేశ్వరీ కామేశ్వరుల సాయుజ్యాన్ని సాక్షాత్కారించుకోవటం కోసమే కౌల, సమయాచార మార్గాలేర్పడ్డాయి. సాధకుడి యోగ్యతా,

ఆసక్తిని బట్టి కావలసిన మార్గాన్ని ఎన్నుకోవాలి. పరమేశ్వరి దృష్టిలో రెండూ సమానమైనవే. ఈ సమదృష్టిని తరువాత నామం లో చెప్పారు.

శివానంద లహరి

**శ్రీ శంకరుల ''శివానంద లహరి ''ఆంతర్యం**

శివానంద లహరి అనటం లోనే గొప్ప ఆంతర్యం ఉంది. శివఅంటే శివుని యొక్క, శివా అంటే అమ్మవారి యొక్క ఆనంద ప్రవాహం అని భావం. అంటే అయ్యగారి, అమ్మగారి ఆనంద రస ప్రవాహం అన్నమాట. దాన్ని చదువుతుంటే మనం ఆ ఆనందాన్ని సంపూర్ణంగా అనుభవిస్తామని అర్ధం. "గుహాయాం గేహేవా బహిరపి "అనే శ్లోకం లో ఎవడు తన అంతః కరణాన్ని సమర్పిస్తాడో వాడు పరమ యోగి అన్నారు శంకరులు. కీటకం అంటే పురుగు తాను మట్టి గూడులో ఉండి, తను తుమ్మెదగా మారాలని మనసా వాచా కర్మణా కోరుకొంటుంది, ఉవ్విళ్ళూరు తుంది. ఇలా తలచి తలచి చివరికి భ్రమరం గా అంటే తుమ్మెద గా మారుతుంది. దీనినే భ్రమర కీటక న్యాయం అంటారు. అసలు ఇందులో ఒక తమాషా ఉంది. కీటకాన్ని తెచ్చి మట్టి గూడులో పెట్టేది భ్రమరమే. పెట్టి, దాని చుట్టూ ధ్వని చేస్తూ నిరంతరం తిరుగుతూ ఉంటుంది. లోపలి కీటకం ఆశబ్దం వింటూ తానూ భ్రమరం కావాలని తహతహ లాడుతుంది. అది తాను కీటకం అనే స్పృహనే కోల్పోతుంది. అప్పుడు చివరికి కీటకం ఆ భ్రమర నాదం లో లీనమై పోయి భ్రమరం గా మారుతుంది. కనుక మన సర్వ దేహ ఇంద్రియాలను కీటకంలాగా సర్వ సర్పణ చేస్తే, అదే ధ్యాసలో ఉంటే పరమాత్మగా మారుతాం, ఆయనలో లీనమైపోతాం. ఈ విషయాన్నే ఆది శంకరులు మరో శ్లోకం లో

''ఆత్మాత్వం గిరిజా మతిః,పరిజనాః,ప్రాణాః,శరీరం, గృహం –పూజాతే విషయోప భోగ రచనా, నిద్రా సమాధిస్థితిః

సంచారః పదయోః ప్రదక్షిణ విధిః స్తోత్రాణి సర్వాగిరః –యద్యత్కర్మకరోమి తత్తదధికం శంభో తవారాధనం '' అన్నారు

''నువ్వే నా ఆత్మ., పార్వతీ దేవి నాబుద్ధి. నా పంచ ప్రాణాలు నీ సేవకులు అంటే పరిజనాలు. నాశరీరమే నీ ఆలయం. విషయ సుఖాల కోసం నేను చేసే పనులన్నీ నీ పూజలే. నేను పోయే నిద్ర నీలో తదేకంగా పొందే సమాధి స్థితి. నాపాదాలు చేసే నడక అంతా నీకు చేసే ప్రదక్షిణాలు. నేను మాట్లాడే మాటలన్నీ నీ స్తోత్రాలే. మహేశ్వరా ! నేను చేసే ప్రతి చర్యా నీ ఆరాధనే అనుకొని స్వీకరించు "అంటూ మనలోని 24 తత్వాలూ

ఈశ్వరార్పణం గా చేస్తే, మనలోని ఇంద్రియ లోలత్వం అంటే వ్యామోహం తొలగి మన జీవాత్మ పరమాత్మలో లీనమవుతుంది అని చెప్పారు. అప్పుడు మనకు, పరమాత్మకు భేదం ఉండదు అంటే అద్వైత స్థితి పొందుతాం. జీవన్ముముక్తులం అవుతాం అని శంకరుల ఆంతర్యం.

మరొక శ్లోకం లో –''నిత్యాయ త్రిగుణాత్మనే పురజితే కాత్యాయనీ శ్రేయసే –సత్యాయాది కుటుంబినే, ముని మనః ప్రత్యక్ష చిన్మూర్తయే

మాయా సృష్ట జగత్రయాయ, సకలామ్నాయాంత సంచారిణే-సాయం తాండవ సంభ్రమాయ జటినే సేయం నతిః శంభవే"అని స్తుతించారు. ఈ జగత్తుకు ఆధారం కారణ భూతుడు అయిన పరబ్రహ్మ నిత్యుడు అంటే ఎప్పుడూ ఉండేవాడు. అనగా సృష్టి లయ కాలం లోనూ ఆయన ఉంటాడు. ఆయన త్రిగుణాత్ముడు అంటే స్థూల, సూక్ష్మ , కారణ శరీరాలను జయించి అంటే వాటికి లొంగకుండా, నాలుగవది అయిన స్వస్వరూప ఆనందం లో వెలిగి పోతూ ఉంటాడు. పార్వతీ దేవి తపస్సుకు ఆయన ఫల స్వరూపుడు. అన్నికాలాలలో ఉండే సత్య స్వరూపుడు. భక్తులను అనుగ్రహించటం కోసం ఆది కుటుంబి గా అవతరించి పార్వతీ పరమేశ్వరులు గా ఆది దంపతులై అభీష్ట సిద్ధి కలిగిస్తున్నారు. మహర్షుల అంతఃకరణాలలో అనగా మనస్సులలో మాత్రమే కనిపించే జ్ఞాన స్వరూపుడు. మాయ అనే తన శక్తితో మూడు లోకాలను సృష్టించాడు. అన్ని వేదాలలో, వేదాంతాలలో సంచరించే బ్రాహ్మ మయ మూర్తి ఆయన . ప్రదోష కాలం అంటే సాయంకాల సంధ్య వేళ తాండవ నృత్యం చేసే జటాజూట దారి . అలాంటి శుభాలనిచ్చే శివునికి నమస్కారం అని భావం. ఇందులో ప్రయోగించిన పదాలన్నీ అర్ధ వంతమైనవే. పరబ్రహ్మ తత్వాన్ని తెలియ జెప్పే పదాలే.

నిర్గుణ, సగుణ పరబ్రహ్మ స్వరూపాలను శంకరాచార్య ఎలా వర్ణించారో తర్వాత తెలుసుకొందాం.

''ఆద్యా యామిత తేజసే శ్రుతిపదైః వేద్యాయ సాధ్యాయతే –విద్యాయానంద మయాత్మనే, త్రిజతస్సరంక్షణోద్యోగినే –

ధ్యేయాయాఖిల యోగిభిః సుర గణైః గేయాయ మాయావినే –సమ్యక్ తాండవ సంభ్రమాయ జటినే సేయం నతిఃశంభవే ''

సృష్టికి పూర్వమే ఉన్న పరబ్రహ్మ ప్రళయ కాలం లోనూ నిశ్చలంగా ఉండే మహా జ్యోతిర్లింగ స్వరూపుడు కనుక ఆది, అంతం లేనివాడు. ఆయన తేజస్సు సాటిలేనిది. వేద వాక్యాలవలననే ఆయన తెలియ బడతాడు. భక్తులను అనుగ్రహించటానికి మాత్రమే లింగ రూపం లో దర్శన మిస్తాడు. జ్ఞానానంద స్వరూపుడు, అన్ని లోకాల సంరక్షణ బాధ్యత ఉన్నవాడు. యోగి పుంగవుల ధ్యానానికి ఆయనే ధ్యేయం. దేవతల చేత కీర్తింపబడే మాయా మయుడు. సాయం వేళ తాండవ నృత్యానికి ఇష్టపడేవాడు. అటు వంటి శంకరునికి నమస్కారం. ఈ వర్ణన అంతా నిర్గుణ పర బ్రహ్మ వర్ణనే. మరో శ్లోకం లో సగుణ నిర్గుణ పరబ్రహ్మను వర్ణించారు శ్రీ శంకరులు –అ వైభవం చూద్దాం –

''త్రయీ వేద్యం, హృద్యం, త్రిపుర హర మాద్యం త్రినయనం –జటా భారోదారం, చలదురగ హారం, మృగధరం

మహా దేవం, దేవం, మయి సదయ భావం, పశుపతిం –చిదానందం, సాంబం,శివ, మతి విడంబం, హృది భజే ''

మూడు వేదాలచే తెలియ బడే వాడు, మనోహర రూపుడు, త్రిపురాలను అంటే స్థూల, సూక్ష్మ, కారణ శరీరాలను సంహారం చేసేవాడు, లేక త్రిపురాసురుడు అనే రాక్షసుని సంహరించినవాడు, ఆది పురుషుడు, మూడుకన్నులున్న జటాధారి,గంభీరుడు, కదులుతున్న సర్పాల ఆభారణాలు కలవాడు, మృగం అంటే జింక ను చేతిలో ధరించినవాడు, దేవ దేవుడు, కరుణాళువు,అజ్ఞానాన్ని నిర్మూలించే జ్ఞాన స్వరూపుడు, అసలు జ్ఞానానికే ఆధారమైన వాడు, లోక క్షేమం కోసం కాలానికి తగిన రూపాలు ధరించేవాడు, సాంబుడు అంటే –సా –అంబ -ఉమాదేవితో కూడిన వాడుఅయిన పరబ్రహ్మను నా మనసులో ధ్యానిస్తాను అని భావం. ఇందులోని పదాలు నిర్గుణ పరబ్రహ్మను తెలియ జేసే సార్ధకమైన పదాలు. నిర్గుణ పరబ్రహ్మను చేరాలి అంటే ముందుగా సగుణ పరబ్రహ్మపై సాధన చేయాలి. త్రయీ నయనం మొదలైనవి సగుణ పరబ్రహ్మను తెలియ జేస్తాయి. కనుక ఈ శ్లోకం లో సగుణ, నిర్గుణ పరబ్రహ్మ తత్త్వం అంతా కళ్ళ ముందు ఉంచారు భగవత్పాదులు. సగుణం అంటే మనలాగా శరీర ధారణ కలవాడు అలంకారాలు,అహంకారాలు ఉండి భార్యాపిల్లలతో ఉండేవాడు. నిర్గుణ అంటే వీటికి అతీతమైనవాడు అని భావం.

సగుణ పరబ్రహ్మ తత్వాన్ని చెప్పేమరో శ్లోకం –

''కరలగ్న మృగః కరీంద్ర భంగో, ఘన శార్దూల విఖండనోస్త జంతుః-గిరిశో, విశదాకృతి శ్చ చేతః కుహరే పంచముఖోస్తి మే కుతో భీః''

చేతిలో జింక కలిగి గజాసుర సంహారం చేసిన వాడు, వ్యాఘ్రాసురుని చంపినవాడు, పర్వతాలలో నివాసం ఉండేవాడు, స్వచ్చమైన అతి తెల్లని రూపం ఉన్నవాడు, పంచ ముఖ అంటే తత్పురుష సద్యోజాత వామదేవ, అఘోర, ఈశాన అనే ముఖ స్వరూపుడు, ఊర్ధ్వంగా మరొక ముఖం ఉన్నవాడు అంటే విశ్వ వ్యాప్తుడైన పరమాత్మ నా మనస్సులో . ఉన్నాడు.కనుక నాకింక భయం ఎందుకు ?''చేతః "పదం ఆయన మోక్ష ప్రదాత అని తెలియ జేసేది. ఆశలు నశిస్తే చేతస్సు నశిస్తుంది. చేతస్సు నశిస్తే వచ్చేది మోక్షమే. చిత్తం నాశనమవటమే ముక్తి అని అంతర్యం.

''అంకోలం నిజ బీజ సంతతి రాయస్కాంతో పలం సూచికా, -సాధ్వీ నైజవిభుం క్షితి రుహం సింధుః సరిద్వల్లభం

ప్రాప్నో తీహ యధా తధా పశుపతేః పాదార వింద ద్వయం –చేతో వృత్తి రుపేత్య తిస్టతిసదా సా భక్తిరిత్యుచ్యతే ''

ఇందులో జీవాత్మ, పరమాత్మలస్థితి వర్ణన ఉంది.జీవుడు పరమాత్మను చేరాలి అంటే వ్యాజ భక్తి వలన, నిర్వ్యాజ భక్తి వలన చేరాలి. ఇందులో నిర్వ్యాజ భక్తి శ్రేస్టం. శివ సాయుజ్యానికి ఇదే మంచి మార్గం.

''అంకోలం" అంటే ఊడుగు(బూరుగు చెట్టు ) చెట్టు గింజలు. దాని కాయ పక్వమై పగలగానే గింజలువాలా తేలిక కనుక గాలిలో యెగిరిపోతూ ఉంటాయి. మేఘం ఉరమగానే భయం తో వచ్చి చెట్టు చుట్టూ పడిపోతాయి . గుండు సూది బలమైన అయస్కాంతానికి ఇట్టే ఆకర్షింప బడిఅతుక్కు పోతుంది. . పతివ్రత ఎక్కడున్నా భర్తనే ప్రేమతో ఆరాధిస్తుంది. తీగ భూమిపైకి పాకి చెట్టు లాంటి ఆధారం దొరకగానే దానికేగట్టిగా అల్లుకు పోతుంది. నదులు ప్రవహించి ప్రవహించి అలసి సొలసి చివరికి సముద్రం లో కలుస్తాయి. ఇవన్నీ ప్రకృతి సిద్ధమైన ధర్మాలు. అలాగే మానవుని చిత్త వృత్తులన్నీ భగవంతుని పాదర విందాలపై లగ్నం అవటాన్ని భక్తి అంటారు. ఈ భక్తి కలగటానికి కారణం భయం. కనుక ఇది వ్యాజ భక్తి. వ్యాజం అంటే నెపం. కాని నది సముద్రం లో కలవటం లో భక్తి పరా కాష్టకు చేరుతుంది. ఎందుకంటె ఇక్కడ నది సముద్రం లో కలవగానే దాని అస్తిత్వాన్ని కోల్పోతుంది. తానె సముద్రం అవుతుంది. దీనికి కారణం, నెపం ఉండవు. కనుక ఇది నిర్వ్యాజ భక్తి . మనం కూడా పరమేశ్వరుని చేరితే మన అస్తిత్వం ఇక శూన్యమే అయి మనం పరమాత్మ స్వరూపులమే అవుతాం. ఇంతటి అంతరార్ధం పై శ్లోకం లో ఇమిడ్చారు శ్రీ శంకరులు.

మరి భక్తి మనకేమైనా చేస్తుందా ?చేస్తుంది. ఇది చెప్పటానికే మరొక శ్లోకం రాశారు.

''ఆనదాశ్రుభిరాత నోతిపులకం, నైర్మల్య తశ్చాదనం –వాచా శంఖ ముఖ స్థితైః చ జఠరాం

రుద్రాక్షైః భసితేవ దేవ ! వపుషోరక్షాం భవద్భావనా –పర్యం కే వినిపేశ్య భక్తి జననీ భక్తార్భకం రక్షతి ''

భక్టి కూడా మనకు శివ మంత్రాన్ని ఉపదేశించి, భస్మంతో రక్ష కలిగించి, అభయ ప్రదాత్రి అవుతుంది. అర్భకు లైన భక్తులను రక్షించే దయామయి భక్తి. అని భక్తి యొక్క పరమ పూజ్యత్వాన్ని స్పష్టంగా తెలియ జేశారు. భక్తికి అసాధ్యం అంటూ ఏదీ లేదు.

''ఆకీర్ణేనఖరాజి కాంతి విభవై రుద్యత్సుధా వైభవైః-రాధౌతే పి చ పద్మ రాగ లలితే హంస వ్రజై రాశ్రితే

నిత్యం భక్తివధూ గణైశ్చ రహసి స్వేచ్ఛావిహారం కురు –స్థిత్వా మానస రాజహంస గిరిజా నాధాంఘ్రి సౌధాంతరే''

శివుని పాద పద్మాలు ఒక భవనం లాంటిది. అది పరమ శివుని కాలి గోళ్ళ కాంతితో ప్రకాశిస్తుంది. చంద్రుని అమృత కిరణాల వైభవం తో కడగ బడుతుంది. కనుక అత్యంత స్వచ్చంగా తెల్లగా ప్రకాశిస్తుంది. పద్మ రాగ మణుల తో కలిసి ఎర్రగా లలితంగా శోభిస్తుంది. దేహ జ్ఞానం లేని పరమ హంసలకు అది ఆశ్రయ భూమి. ఆ సుందర రమ్య హర్మ్యం లోకి భక్తిఅనే కొత్త పెళ్లి కూతురుతో ప్రవేశించి అన్నీ మరచి హాయిగా విహరించ వే ఓ మనసా అని భావం. అంటే భక్తిని భార్యగా భావించమని ఆంతర్యం.

భక్తి ధేనువు అంటూ మరో శ్లోకమూ చెప్పారు –

''అమిత ముద మమృతం ముహు ర్దుహంతీ-విమల భవత్పద గోష్ట మా వసంతీం

సదయ పశుపతే సుపుణ్య పాకాం-మమ పరిపాలయ, భక్తీ ధేను మేకాం''

నీ పాదాలపై ఉన్న భక్తి గోవు లాంటిది. నీ పరమ పవిత్రమైన నిర్మలమైన పాదాలు అనే గోశాలలో సురక్షితంగా ఉంటోంది . ఎన్నో జన్మల పుణ్యం వలన అది నాకు లభించింది. ఈ భక్తి గోమాత నాకు మాటి మాటికీ ఆనందామృతం అనే శుద్ధమైన క్షీరాన్ని హాయిగా పిండుకోనిస్తోంది. నన్నూ ఈ భక్తి ధేనువు ను సదా రక్షించు.

గడ్డి తిని ఆవు అమృతం లాంటి పాలు ఇస్తుంది. గోవు నుండి వచ్చే ప్రతి ద్రవ్యమూ పవిత్రమైనదే. అలాగే భక్తి కూడా నిరంతరం స్రవించే తైలధార . ఇది పరమాత్మ పాదాలు అనే గోశాలలో సురక్షితంగా ఉంది. నన్నూ ఆ భక్తి ధేనువును నిరంతరం రక్షించి కాపాడి,కైవల్యం ప్రసాదించు అని ఆంతర్యం. భక్తిమామూలు గోవు

కాదు. కోరికలు తీర్చే కామ ధేనువు  అన్నీ అనుగ్రహించే చింతామణి, కైవల్య  సంధాయిని అని శంకరుల ఆంతర్యం.

భక్తి ధేనువు, రక్షా అని చెప్పిన శంకరులే భక్తిఒక తీగ, ఒక సంకెల, ఒక త్రాడు, ఒక పంట అని కూడా చెప్పారు.

''ఆనందామృత పూరితా, హర పదాంభోజా లవాలోద్యతా –స్థైర్యోపఘ్నముపేత్య, భక్తిలతికా, శాఖోపశాఖాన్వితా

ఉఛ్చై: మానస కాయమాన పటలీ మాక్రమ్య నిష్కల్మషా-నిత్యాభీష్ట ఫలప్రదా  భవతు మే సత్కర్మ సంవర్ధితా ''

భక్తి ఒక తీగ. అది ఆనందం అనే అమృతం తో నింపబడింది.  అది పర మేశ్వరుని పాద పద్మాలు అనే పాదులో పుట్టి పెరిగింది. స్థిర చిత్తం అనే గట్టి కంప ను పట్టుకొని, చిక్కగా అల్లుకు పోయి, శాఖోప శాఖలుగా పెరిగి పోయింది. స్వచ్ఛ ఉన్నత మైన మనస్సు అనే పందిరిని ఆక్రమించింది. చీడ పీడలు లేకుండా పరమేశ్వర చింతనం తో ఏపుగా పెరిగి,కోరిన కోరికలను ప్రతి రోజు ఇస్తోంది. పుణ్య కర్మలతో ఈ తీగ వృద్ధి చెందుతోంది. అంటే భక్తిఒక తీగగా ఉండి పుణ్యాలను సముపార్జించి పెడుతోంది అని ఆంతర్యం. భక్తితీగ పాకుతూ పోయి శిఖరాగ్రం చేరి కైలాస వాసి, వాసిని అయిన ఉమా మహేశ్వరుల సన్నిధానానికి చేర్చి, ఇక వదిలి పెట్టకుండా అక్కడే పరమేశ్వర పాద పద్మ లగ్నమై ఉండి పోతుంది అని ఆంతర్యం.

భక్తిఒక శ్రుంఖల అన్నారు కదా –అదెట్లాగో చూద్దాం –

''ధైర్యాంకుశేన  నిభ్రుతం –రభసాదాకృష్య భక్తి శ్రుంఖలయా

పురహర, చరణాలానే-హృదయ మదేభం బధాన చిద్యంత్రై:''

భవానీశంకరా !నా మనసు ఒక మదపు టేనుగు. అయినా నీ చేతిలో అంకుశం ఉందికదా అనేధైర్యం తో ఉన్నాను. నన్ను నీకు బంధించుకోవాలను కొంటే  భక్తిఅనే గొలుసు ఉండనే ఉంది. మరి కట్టెయ్య టానికి ఒక గుంజకాని స్థంభం కాని కావాలంటావా –ఉందిగా నీ పాదం.  అదే కట్టు గొయ్య. బంధించటానికి యంత్రం ఏదీ అంటావా ? అదే జ్ఞానం అనే యంత్రం. అంటే మనం భగవంతునికి జ్ఞాన యంత్రం తో బంధింపబడాలి. మదం ఉన్న ఇభం అంటే మదేభం అంటే మదించిన ఏనుగు. దీన్ని అంటే మదహంకారాన్ని తొలగించుకోవాలి అంటే భక్తిమాత్రమే సాధనం అని ఆంతర్యం.

దీని తర్వాత శ్లోకం లో కూడా మనసు మదపు టేనుగు అని దాన్ని కట్టెయ్యటానికి భక్తిత్రాడుగా ఉపయోగ పడుతుందనీ చెప్పారు –

''ప్రచరత్న భితః ప్రగల్భ వృత్త్యా –మదవా నేష మనః కరీ గరీయాన్

పరిగృహ్యా నయేన భక్తిరజ్జ్వా –పరమ స్థాణుపదం దృఢం నయాముమ్''

దేవాదిదేవా సర్వేశ్వరా !మదపు టేనుగు లాంటి నామనసు కు హద్దూ పొద్దూ లేదు. విశుంఖలంగా స్వేచ్చా విహారం చేస్తోంది. నాలో భక్తికలిగించి ఆ భక్తిఅనే త్రాడుతో స్థిరమైన నీ పాదానికి కట్టేసెయ్యి.

అస్థిరమైన తమోగుణానికి ఏనుగు ప్రతి రూపం. కామ క్రోధాలకు చిహ్నం. ఇంతటి దురహంకారమైన నా మనసుకు నీతి బోధించి నీ పాదానికి కట్టేయ్యి. శివ పాదం అంటే స్థాణు పదం. దాన్ని పొందించు. అది మోక్షదాయకం అని, అందరూ దానినే ఆశ్రయించాలని శంకరుల ఆంతర్యం.

భక్తి త్రాడు మనసు కలశం అని మరో శ్లోకంలో అన్నారు –

''భక్తో భక్తిగుణావృతే ముద మృతాపూర్ణే ప్రసన్నే మనః –కుంభే సాంబ తవాంఘ్రిపల్లవ యుగం సంస్థాప్య సంవిత్రులం

సత్వం మంత్ర ముదీరియన్ నిజ శరీరా గార శుద్ధిం వహన్ –పుణ్యాహం ప్రకటీ కరోమి రుచిరం కళ్యాణ మాపాదయన్ ''

సాంబ శివా !నేను మోక్షం అనే కల్యాణం చేసుకో దలచాను. దీనికి ముందు స్వస్తి పుణ్యాహవాచనం చేసుకోవాలి కదా. దాన్ని ప్రారంభిస్తూ నా మనసును కలశం గా చేసి, దాన్ని సంతోషం అనే అమృత జలం తో నింపు తున్నాను. ఇక నాకు వేరే ఆలోచనలే లేవు. భక్తిని త్రాడుగా అంటే సూత్రంగా ఆ కలశానికి చుడుతున్నా. పరమేశ్వరుని పాదాలను మామిడి చిగుళ్ళు గా ఆ కలశం లో ఉంచుతున్నా. అహంకారం బ్రద్దలవ్వాలంటే జ్ఞానం కావాలి కదా –కనుక జ్ఞానాన్ని కొబ్బరి కాయగా ఉంచుతున్నా. మరి మంత్రంఅంటావా ''ఓం నమశ్శివాయ ''అనే ప్రణవ శివ పంచాక్షరి మంత్రం ఉండనే ఉందిగా –ఆ మంత్రాన్ని జపిస్తున్నా. వీటన్నిటితో నా దేహం అనే ఇంటిని, అన్తఃకరణాలను శుభ్రం చేసి పవిత్ర వంతం చెయ్యి. ఈ ప్రక్రియ ఫలం అంతా నీకే సమర్పిస్తున్నా. దయతో గ్రహించు. ఇదే నాజీవితం లో జరిగే ఏకైక శాశ్వత మోక్ష కళ్యాణ ఘటన.

ఈ విధంగా భక్తిఅనే త్రాడుతో ప్రతి ఒక్కరూ మోక్ష కల్యాణాన్ని జరుపుకోవాలని ఆంతర్యం.

చివరగా భక్తి ఒక పంట గా ఎలా చెప్పారో చూద్దాం –

''ధీ యంత్రేణ,వచో ఘటేనకవితా కుల్యోప కుల్యాక్రమై –రానీతైశ్చ,సదా శివస్య, చరితాంభో రాశి దివ్యామృతైః హృత్కేదార యుతాశ్చ భక్తి కలమా స్సాఫల్య మాతన్వతే –దుర్భిక్షా న్మమ సేవకస్య భగవన్విశ్వేశ భీతిః కుతః''

శివా ! నా హృదయం ఒక పొలం. నీ చరిత్ర ఒక సముద్రం. కాని అందులోని నీరు ఉప్పునీరుకాదు – దివ్యామృతజలం.ఈ అమృత జలాలను కవితలు అనే పంట కాలువలద్వారా ప్రవహింప జేయాలి. వాక్కులు అనే కడవలతో ఆజలాన్ని నింపాలి. బుద్ధి అనే యంత్రం తో మోటబావిలో లాగా పైకి తోడాలి . అలా తోడిన అమృత ధారలను నా హృదయం లో నింపితే భక్తిఅనే పంటలు పండుతాయి.

జన జీవనానికి ఆధారం పంట. అలాగే అద్వైత జీవితానికి ఆధారం భక్తి.మనసు శివ జ్ఞానం తో నిండితే భయం అనేది ఉండదు. అద్వైత సిద్ధి కలుగుతుంది, తరింప జేయటానికి భక్తిమార్గం ఉత్కృష్టమైనది అని శ్రీ శంకరుల ఆంతర్యం. అందుకే'' భక్తిరేవగరీయసి ''అన్నారు శంకరాచార్య.

శివానంద లహరిలో నవ విధ భక్తి కి శంకరులు చెప్పిన శ్లోకాలు

1- వందనం –''కలాభ్యాం చూడాలంకృత శశి కలాభ్యాం నిజతపః –ఫలాభ్యాం భక్తేషు ప్రకటిత ఫలాభ్యాం భవతు మే

శివాభ్యా మస్తోక త్రిభువన శివాభ్యాం హృది పున-ర్భవాభ్యామానంద స్ఫురదనుభవాభ్యాం నతి రియం ''

శివునికి, శివా కు నమస్కారం. ఆ ఆది దంపతులు సకల వేద విద్యా స్వరూపులు. సిగపై చంద్ర కళ కలవారు. ఒకరి తపస్సుకు మరొకరు ఫలంగా లభించినవారు. భక్తులు కోరే ధర్మార్ధ కామ మోక్షాలను ప్రసాదించేవారు . మంగళప్రదులై ముల్లోకాలకు అనంత శుభాలనిచ్చేవారు. ధ్యానిస్తే హృదయం లో గోచరించేవారు. ఆనంద స్వరూపులే కాకుండా మనకూ ఆనందాన్ని కలిగించేవారు అయినశివా శివులకు నమస్కారం.

దీనితో పాటు 50, 51, 56 శ్లోకాలు కూడా వందనానికి ఉదాహరణలే. ''శివాభ్యాం ''అనే మాటలో ఒకే రూపం లో ఉన్న శివ పార్వతులు పరబ్రహ్మ తత్వంగా భావించాలని శ్రీ శంకరుల ఆంతర్యం.ఈ శ్లోకం నుంచి 27 వ శ్లోకం వరకు శిఖరిణీ వృత్తం లో రచించారు. 27 సంఖ్య నక్షత్రాలకు సంకేతం. అంటే కాల చక్ర స్వరూప దర్శనం చేయించారని భావించాలి.

2- శ్రవణం –''దూరీ కృతాని దురితాని దురక్షరాణి-దౌర్భాగ్య దుఃఖ దురహంకృతి దుర్వ చాంసి

సారం త్వదీయ చరితం నితరాం పిబంతం –గౌరీశ మామిహ సముద్ధర సత్కటాక్షైః''

గౌరీశా !నా పాపాలు, దుఖం దౌర్భాగ్యం దురహంకారం తో వచ్చే చెడ్డమాటలు, అన్నీ నీ దయ వలన దూరమై పోయాయి. నిత్యం నీ చరిత్రను పానం చేస్తున్న నన్ను ఉద్ధరించు. సంసార లంపటం నుంచి తరింప చేయి.

ఇక్కడ శివ చరిత్ర స్మరణ యిచ్చే ఫలితం చెప్పారు. శివ చరిత్ర గ్రోలితే లభించేది శివానంద లహరి అని ఆంతర్యం.

3- కీర్తనం –''కదావా కైలాసే కనక మణి సౌధే సహ గణైః-వసన్ శంభో రగ్రే స్ఫుట ఘటిత మూర్ధాంజలి పుటః

విభో, సాంబ స్వామిన్ పరమ శివ పాహీతి నిగదన్ –విధాతౄణాం కల్పన్ క్షణ మివ వినేష్యామి సుఖతః ''అది కైలాసం లో బంగారు భవనం అందులో మణులు కూర్చబడి అందంగా ప్రకాశమానంగా ఉంది. పరమశివుడు ఆ భవనం లో ఉన్నాడు. ఆయన ముందు శిరస్సుతో అంజలి ఘటిస్తూ ''ఓ విభో సాంబ సదాశివా పరమ శివా పాహి పాహి ''అంటూ బ్రహ్మ కల్ప కాలాలను క్షణ మాత్రం గా ఎపుడు గడుపుతానో కదా అని శంకర భాగవత్పాదులు ఆర్తిగా కీర్తిస్తున్నారు.

నిజానికి ఇదే శివానంద లహరి అంటే కైలాస వాస వాంఛ.శివ సన్నిధిలో ఒడలు మరచి పోవటం కీర్తనలో పరవశించటం. అంతకంటే జీవి కోరుకొనే ఉత్కృష్ట పదవి ఏదీ లేదని ఆంతర్యం.

4-స్మరణం –''నరత్వం దేవత్వం నగవన మృగత్వం మశకతా-పశుత్వం, కీటత్వం భవతు విహగత్వాది జననం

సదా త్వత్పాదాబ్జ స్మరణ పరమానంద లహరీ –విహారాసక్తం చేద్హృదయ మిహ కిం తేన వపుషా ''

పరమేశా !నేను మనిషిగా  దేవునిగా, పశువుగా, పురుగు గా, పక్షిగా జన్మించినా సరే, ఏ జన్మ లోనైనా నీ పాద పద్మాలను  స్మరించి పరమానందాన్నిపొందుతూనే ఉండాలి. దానిలో నా హృదయం హాయిగా విహరించాలి. ఉపాధి అంటే దేహం ఏ రూపం లో ఉన్నా పరమేశ్వర పాదారవింద స్మరణ చేయాలని ఆంతర్యం.

5-పాద సేవనం –''నిత్యం యోగి మనస్సరోజ దళ సంచార క్షమస్త్వత్క్రమ-శ్శంభో, తేన కథం కఠోర యమరాడ్వక్షః కవాట క్షతి –

రత్యంతం మృదులం త్వదంఘ్రి యుగళం హా మే మనశ్చింతయ-త్యేతల్లోచన గోచరం కురు విభో హస్తేన సంవాహయే ''

పశుపతీ ! అత్యంత కోమలమైన నీ పాదాలు అతి సున్నితాలు. యోగీశ్వరుల హృదయ పద్మాలపై సంచరించే కుసుమ కోమలాలు. అలాంటి నీపాదాలు అతి కఠినమైన తలుపు చక్కలాంటి యముని వక్షస్థలాన్నిఎలా తన్నగలిగాయి ? తన్ని అసలు కందిపోకుండా ఎలా తట్టు కో గలిగాయి? అని నా మనసు శంకిస్తోంది. నీ లలిత కోమల పాదాలు నాకు కనిపించేట్లు చేస్తే నీ బాధ ఉపశమింప జేయటానికి వాటిని నా చేతులతో  చక్కగా ఒత్తి సేవిస్తాను. ఆ అనుగ్రహం నాకు ప్రసాదించు.

భక్తుడైన మార్కండేయుని ప్రాణాలు హరించటానికి  యమ ధర్మ రాజు వస్తే శివుడు యముని వక్షస్థలాన్ని పాదం తో తన్ని తగిలేశాడు. భక్త రక్షణకు పరమ శివుడు ఎంతటి బాధనైనా భరిస్తాడని ఆంతర్యం.

6-అర్చనం –''36 వ శ్లోకం –''భక్తో భక్తి గుణా వృతే –''దీన్ని గురించి ఇదివరకే చెప్పుకొన్నాం

7 దాస్యం –''కదావా త్వాం దృష్ట్వా గిరిశ తవ భవ్యాంఘ్రి యుగళం –గృహీత్వా హస్తాభ్యాం శిరశి నయనే వక్షసి వహన్

సమాశ్లిష్యాఘ్రాయ స్ఫుట జలజ గంధాన్ పరిమళా- నలభ్యాం బ్రహ్మాద్యై ర్ముద మనుభవిష్యామి హృదయే

గిరీశా శివా !నీ పవిత్ర పాదార విందాలను నేను చేతులతో పట్టుకోవాలి. వాటిని నాశిరస్సు మీద పెట్టుకోవాలి. కళ్ళకు అద్దుకోవాలి. నా గుండెలమీద ఉంచుకోవాలి. వాటిని గట్టి గా నేను ఆలింగనం చేసుకోవాలి. నీపాద పద్మాల పరిమళాలను నేను ఆఘ్రాణించాలి . ఇంతటి మహద్భాగ్యం బ్రహ్మామొదలైన దేవతలకు కూడా లభించదు. అలాంటి నీ పాద సేవలో నేను బ్రహ్మానందం అనుభవించాలి. అంతటి పరమ సౌభాగ్యం నాకు ఎప్పుడు నువ్వు అనుగ్రహిస్తావో ?

ఇందులో పరబ్రహ్మ చుట్టూ పరిభ్రమించాలానే ఆరాటం ఆవేదన పరబ్రహ్మనై పోవాలన్న తపన ఉండటం తో భక్తి పరాకాష్టకు చేరి "అహం బ్రహ్మాస్మి " భావం కలుగుతుందని ఆంతర్యం.

8- సఖ్యం –"సారూప్యం తవ పూజనే శివ, మహాదేవేతి సంకీర్తనే –సామీప్యం శివ భక్తి ధుర్య జనతా సాంగత్య సంభాషణే

సాలోక్యం చరాచరాత్మక తను ధ్యానే భవానీ పతే –సాయుజ్యం మమ సిద్ధ మత్ర భవతి స్వామిన్ , కృతార్ధోహం "

పరమశివా ! నిన్ను పూజిస్తూ సారూప్య ముక్తిని, నిన్ను కీర్తించేటప్పుడుసామీప్యముక్తిని, నీ భక్తుల స్నేహం తో సంభాషణం తో సాలోక్య ముక్తిని, కదలలేని పర్వతాదులలో నిన్ను దర్శించి ధ్యానం చేసి సాయుజ్య ముక్తిని, పొందుతున్నాను.

పూజ సేవ లలో "సోహం భావేన పూజయేత్ "అనే భావం ఉండాలని ఆంతర్యం అప్పుడే అభీస్ట సిద్ధి.

9-ఆత్మ నివేదనం – "కరస్థే హేమాద్రౌ గిరిశనికటస్థే ధన పతౌ –గృహస్థే స్వర్భూజామర సురభి చింతామణి గణై

శిరస్థే శీతాంశౌ చరణ యుగళ స్థేఖిల శుభే –కమర్ధం దాస్యే హం భవతు భవదర్థం మమ మనః"

నువ్వు ఉండేది వెండి కొండ మీద నీకు అందుబాటులో  బంగారు కొండమీద.  నీ కనుసన్నలలో కుబేరుడు, కామధేనువు  కల్ప వృక్షం, చింతామణి అన్నీ జ్వాజ్వల్యంగా ప్రకాశిస్తున్నాయి. నీ శిరసుపై వెన్నెల వెదజల్లే చంద్ర వంక .  సమస్త సన్మంగళాలునీ పాద సమీపం లో ఉన్నాయి. ఇక నీకు ఇచ్చేందుకు నా దగ్గర ఏముంది స్వామీ.  అయితే నా మనసు ఒక్కటే ఉంది.దాన్ని మాత్రం నీకు ఇవ్వగలను. తీసుకొని అనుగ్రహించు అంటూ ఆత్మ నివేదన తెలియ జేశారు శ్రీ శంకర భగవత్పాదులు.

చివరగా –"త్వత్పాదాంబుజ మర్చయామి పరమం త్వాం చింతయా మ్యన్వహం –

త్వామీశం శరణం వ్రజామి వచసా త్వామేవ యాచే విభో

దీక్షాం మే దిశ చాక్షుషీం స కరుణాం దివ్యైశ్చిరంప్రార్థితాం

శంభో  లోక గురో మదీయ మనస స్సౌఖ్యోప దేశం కురు "

లోకానికే గురువైన సాంబశివా. నీ పాదాలనే అర్చిస్తున్నా.నిన్నే మనసులో ఎప్పుడూ చింతిస్తున్నా.నిన్నే శరణు వేడుతున్నా. వాక్కులతో నిన్నే స్తుతిస్తున్నా. దేవతలే నీ కరుణ కోసం నిరీక్షిస్తూ ఉంటారు. వారిపై చూపే కారుణ్యం నాపై కూడా చూపించు. నేను చిన్నవాడిని అనుకో వద్దు  మనసుకు సౌఖ్యం కలిగే ఉపదేశాన్నివ్వు. నువ్వు లోక గురుడవు. కనుక నాకూ గురువు నీవే. నేను తరించే శాశ్వత సందేశాన్ని ఇచ్చి, శాశ్వత సుఖాన్ని  ప్రసాదించు.

పరబ్రహ్మ జ్ఞానోపదేశం చేసి శాశ్వత ముక్తిని ప్రసాదించమని ఆంతర్యం.

నాలుగు రకాల భక్తులకు ఉమా మహేశ్వరుడే శరణు అంటూ వారి  విషయమై శంకరాచార్య వివరిస్తున్నారు. "ఆర్తో, జిజ్ఞాసు, ర్ధార్థీ,జ్ఞానీ చ భరతర్షభ "అని గీతలో భగవాన్ కృష్ణ పరమాత్మ నలుగురు భక్తులను పేర్కొన్నాడు.

1-ఆర్తుడు – ఆర్తుడు అంటే దుఖం తో బాధ పడేవాడు.

''అసారే సంసారే నిజ భజన దూరే జడధియా-భ్రమంతం మాం మంధం పరమ కృపయా పాతుముచితం

మదన్యః కో దీనస్తవ కృపణ రక్షాతి నిపుణః-త్వదన్యః కో వా మే త్రిజగతిశరణ్యః పశుపతే ''

''స్వామీ శివా !స్వస్వరూప జ్ఞానం లేని మూఢుడను నేను. అంధుడను. దయతో ఈ దీనుడిని రక్షించు. ఈ ప్రపంచం చావు, పుట్టుకలతో కూడి బాధామయంగా ఉంది.ఇందులో సారం అంటే రుచి లేనే లేదు. నేనెవరినో, ఎక్కడి నుంచి వచ్చానో, మళ్ళీ ఎక్కడికి చేరుకోవాలో తెలుసుకో లేక పోతున్నాను. దేహమే నేను అనే భ్రాంతి లో పడి కొట్టుకొంటున్నాను. కించిత్తు కూడా ఆత్మ జ్ఞానం లేని వాడిని. ఆత్మ చింతన లేకపోవటం తో ఈ ప్రపంచం నిత్యం, సత్యం అనే మాయలో ఉన్నాను. వయసు మీద పడి ముసలి వాడినై, కంటి చూపు కూడా లేని వాడినయ్యాను. ఏది సత్యమో ఏది నిత్యమో తెలియ లేకున్నాను. సంసార లంపటం లో కూరుకు పోయి తపిస్తున్న దీనుడిని. నాలాంటి దీనులను రక్షించటం లో నువ్వు మహా నేర్పరివి. నువ్వు రక్షించటానికి నా కంటే దీనుడు ఎవరున్నారయ్యా. త్రిలోకాలలో నువ్వే నాకు దిక్కు. "అన్యధా శరణం నాస్తి త్వమేవ శరణం మమ"

ఇక కాపాడే వారెవ్వరూ లేరని, భగవంతునిపై భారం వేస్తే, ఆయన రక్షగా నిలుస్తాడు అని ఆంతర్యం.

తర్వాత శ్లోకమూ ఆర్తుని రోదనమే –

''ప్రభుత్వం దీనానాం ఖలు పరమ బంధుః పశుపతే –ప్రముఖ్యోహం తేషా మపి కిముత బంధుత్వ మనయోః

త్వయైవ క్షంతవ్యాః శివ మదపరాధాశ్చ సకలాః – ప్రయత్నాత్కర్తవ్యం మద వనమియం బంధు శరణిః"

పశుపతీ !నువ్వు సర్వ సమర్ధుడవు. దీనులకు అత్యంత ఆప్తుడవైన బంధువుడవు. బంధు, దీన జన రక్షకుడవు నువ్వు. దీనులలో ముఖ్యుడను నీకు బంధువుడను సన్నిహితుడను అని నీకు వేరే చెప్పాలా!నాతప్పులన్నీ క్షమించు. దీనికి ప్రయత్నించటం నీ తక్షణ కర్తవ్యమ్. బంధు రక్షణ సంప్రదాయంగా వస్తోందికదా .

పరమేశ్వరుడే ఆర్త త్రాణ పరాయణుడు అని ఆంతర్యం  సంసార తాప పరితప్తుని గూర్చిన శ్లోకాలివి.

2-జిజ్ఞాసువు –జ్ఞానం కావాలని ప్రార్ధించే వాడు జిజ్ఞాసువు

''ఛందశ్శాఖి శిఖాన్వితైః ద్విజ వరై స్సంసేవితే శాశ్వతే –సౌఖ్యాపాదిని ఖేద భేదినిసుధా సారైః ఫలైర్దీపితే

చేతః పక్షి శిఖా మణే,త్యజ వృధాసంచార మన్యైరలం-నిత్యం శంకర పాద పద్మ యుగళీ నీడే విహారం కురు ''

ఓ మనసా !పక్షీంద్రా!ఎందుకు అటూ ఇటూ వృధాగా తిరుగుతావు ?అదుగో శంకరుని పాదపద్మాలు అనే గూడు అక్కడ ఉంది చూడు. దాంట్లో హాయిగా విహరించు. వేదాలు అనే కొమ్మల చివర ఆ గూడు ఉన్నది. దాన్ని బ్రహ్మ విద్యలో శ్రేష్టు లైన యోగీశ్వరులు సేవిస్తూ ఉంటారు. ఈ గూడు ఆషామాషీ ది కాదు శాశ్వత నివాసం. పరమ సుఖమైన మొక్షాన్నిచ్చేది. సంసార దుఖాన్ని పోగొట్టేది. అది అమృతం నిండిన పండ్లతో శోభిస్తుంది. ఇంకెందుకు ఆలస్యం ? శాశ్వతంగా ఆ శంకరుని పాద పద్మాలలో స్వేచ్చగా  విహరించి పరమానంద విభూతి పొందు.

మనసు పక్షిలాగా ఒక చోట కుదురుగా ఉండదు. దానికి శాశ్వతమైన గూడు అవసరం.  జిజ్ఞాసువుకూడా అలాగే శాశ్వతమైన నివాసం కావాలి.  అదే శంకర పాద సన్నిధి అని ఆంతర్యం.

తర్వాత రెండు శ్లోకాలు కూడా జిజ్ఞాసువు నుద్దేశించి చెప్పినవే –

''ఆకీర్ణే  నఖ రాజి కాంతి విభవైరుద్యత్సుధావైభవైః-రాధౌతేపి చ పద్మరాగ లలితే హంస వ్రజై రాశ్రితే

నిత్యం భక్తివధూగణై శ్చరహసి స్వేచ్చావిహారం కురు –స్థిత్వా మానస రాజ హంస, గిరిజా నాధాంఘ్రి సౌధాంతరే ''

ఈ శ్లోకం గూర్చి ఇదివరకేచేప్పుకున్నాం. తర్వాత శ్లోకం –

''శంభు ధ్యాన వసంత సంగిని హ్రుదారా మేఘ జీర్ణ చ్ఛదాః-స్రస్తా భక్తి లతాచ్ఛటా విలసితా పుణ్య ప్రవాళశ్రితాః

దీప్యంతే గుణ కోరకా జపవచః పుష్పాశ్చ సద్వాసనాః-జ్ఞానానంద సుధా మరంద లహరీ సంవిత్ఫలాభ్యునతిః''

శివుని ధ్యానించటం అనేది వసంత ఋతువు. నా హృదయం ఒక పూల తోట. దానిలో శివధ్యానం అనే వసంత ఋతువు ప్రవేశించింది. వెంటనే నాలో ఉన్న పాపాలు అనే ఎండుటాకులన్నీ రాలిపోయాయి. వెనువెంటనే పుణ్యాలు అనే పగడాల లాంటి యెర్రని చిగురుటాకులనే సద్గుణాలు మొలకెత్తాయి. దానితో భక్తి అనే లతలు ఏర్పడి శివుని పైకి ఎగబ్రాకాయి . అవి నవ నవో న్మేషంగా గా ఉన్నాయి. అలా అల్లుకు పోయిన లతలకు శివ ధ్యానమే జపం అయింది. ఆ లతలకు జప వాక్కులు అంటే సోహం, పంచాక్షరి మంత్రం పుష్పాలుగా పూశాయి. ఒక్క సారి శివా అంటే చాలు స్వస్వరూప జ్ఞానం ఏర్పడి వాటి పరిమళాలు అంతటా వ్యాపిస్తాయి. అవే బ్రహ్మానంద పరమైన సంస్కార పరిమళాలు. ఆ పుష్పాలనుండిజ్ఞానానందం అనే అమృతం మకరందంగా ధారా పాతంగా ప్రవహించింది . భక్తిలతకు బ్రహ్మ జ్ఞానం అనే పంట పండింది. ఇదే జ్ఞానానందం అనే సుధా తరంగం . ఇదే కైవల్యం.

3-అర్థార్ధి-ధనంమొదలైన కోరికలు కోరేవాడు అర్థార్ధి.సాధకుడికి ఇవి అక్కరలేదు కావలసింది శాశ్వతమైన ముక్తి బ్రహ్మానందం. దీనికోసం మళ్ళీ మళ్ళీ తపస్సు చేస్తారు. పొందే దాకా వదిలి పెట్టరు వీరు అర్థార్ధులు.

''కరోమి త్వత్పూజాం సపది సుఖదో మే భవ విభో-విధిత్వం, విష్ణుత్వం దిశసి ఖలుతస్యాఃఫలమితి

పునశ్చ త్వాం ద్రష్టుం దివి భువి వహన్ పక్షి మృగతా – మదృష్ట్వా తత్ఖేదం కథ మిహ సహేశంకర విభో ''

శంకర ప్రభూ !నీ పూజ చేస్తున్నా. దానికి ప్రతిఫలంగా బ్రహ్మ పదవో విష్ణు పదవోఇస్తానంటావేమో. అవి నాకు వద్దే వద్దు. నిన్ను పూజించే విష్ణువు సృష్టి కార్యం చేస్తున్నాడు. బ్రహ్మకు నువ్వే వేదాలు ఇచ్చావు. విష్ణువు నీ మూల స్వరూపం తెలుసుకోవటానికి భూమిని త్రవ్వి త్రవ్వి అలసి సొలసి వెనక్కి వచ్చేశాడు పాపం . బ్రహ్మ సృష్టి కార్యం లో మునిగి పోయి, నీ అంతం ఎక్కడుందో తెలుసుకోవటానికి హంసగా మారి యెగిరి యెగిరి తిరిగి తిరిగి ఆయాసం తో దిమ్మ తిరిగి మైండ్ బ్లాకై అబద్ధం చెప్పి శాపానికి గురై పూజకు

అనర్హుడయ్యాడు. కనుక నాస్వామీ !బ్రహ్మత్వం విష్ణుత్వం నాకు వద్దు మహాప్రభో. నీ ఆది, అంతాలు చూడలేని, తెలుసుకోలేని ఆపనికి మాలిన పదవులు నా కెందుకయ్యా-ఏం చేసుకోను నేను ? ఆ దుఖం ఎందుకు ఆ వ్యధ ఎందుకు వృధా ఆయాసం ఎందుకు నాకు ? నీ పూజా ఫలంగా మోక్షం ప్రసాదించు తండ్రీ. చాలు.

శివుని అశాశ్వతమైన కోరికలు కోరరాదు. శాశ్వతమూ నిత్యమూ అయిన మోక్షాన్నే కోరుకోవాలని ఆంతర్యం.

1- జ్ఞాని –బ్రహ్మజ్ఞాని నిశ్చలంగా నిశ్చింతగా, పరమార్ధం లో మునిగి తేలుతూ ఉంటాడు. శివుడు నాలో కొలువై ఉన్నాడు నాకు భయమెందుకు అనుకొంటాడు –ఈ విషయాన్నే –''దీయంత్రేణ వచో ఘటేన కవితా కుల్యోప కుల్యాక్రమై –''శ్లోకం లో విపులంగా చెప్పుకొన్నాం. మరో శ్లోకం –

''కరలగ్న మృగః కరీంద్ర భంగో –ఘున శార్దూల విఖండనోస్త జంతుః

గిరిశో విశదాకృతిశ్చ చేతః –కుహరే పంచ ముఖోస్తి మే కుతో భీః''

చేతిలో జింక గజాసుర వ్యాఘ్రాసుర సంహారి ప్రాణులను తనలో విలీనం చేసుకొనేవాడు భస్మలేపనం తో తెల్లగా ఉన్నవాడు, పర్వత శయనం కలవాడు, అయిదు ముఖాలున్న శివుడు నా మనస్సు అనే గుహలో ఉండగా నాకు భయం ఎందుకు ?

సింహాన్ని కూడా పంచముఖఃలేక పంచాస్య అంటారు. అదీ గుహలోనే ఉంటుంది.దాని చేతిలో వేటాడిన జింక ఉంటుంది. ఏనుగు, పెద్దపులినిఅది చంపుతుంది . సింహం ఉన్న గుహలో ఇక ఏ జంతువూ ధైర్యంగా ప్రవేశించలేదు. పంచముఖుడైన శివుడిని, పంచాస్య అయిన సింహాన్ని కలిపి పోల్చి చెప్పారిక్కడ.

అంతఃకరణ చతుష్టయ సమర్పణ విషయమైన శ్లోకాలు –మనస్సు, బుద్ధి,చిత్తం, అహంకారం అనే నాల్గింటిని అంతఃకరణ చతుష్టయం అంటారు.ఇవి మనలోపల ఉన్నా వాటి చూపు మాత్రం బయటే ఉంటుంది. తాను పరమాత్మకంటే వేరు అనే భావం వలన ఇవి ప్రకోపిస్తాయి. వాటిని అణచి సమర్పణ చేయాలని అంతర్యం.

సంకల్ప, వికల్పాలు చేసేది మనసు. దీని అధిదేవత చంద్రుడు. నిష్కర్షగా తేల్చేది బుద్ధి. దీనిదేవత బ్రహ్మ. నేను అనే భావమే అహంకారం. దేవత రుద్రుడు. జరిగి పోయినవాటిని చింతించేది చిత్తం. వాసుదేవుడు దేవత. భ్రూ మద్యం లో మనసు,కంఠం లో బుద్ధి, హృదయం లో చిత్తం, నాభిలోఅహంకారం ఉంటాయి . వీటిని ఈశ్వరార్పణం చేస్తే జీవి పరమయోగి, సుఖి అవుతాడని శంకర భగవత్పాదులవారి ఆంతర్యం. వీటికి శ్లోకాలు రాశారు శివానంద లహరి లో.

1-మనసు

''గభీరే కాసారే విశతి విజనే ఘోర విపినే –విశాలే శైలే చ భ్రమతి కుసుమార్ధం జడమతిః

సమర్ప్యైకం చేతస్సరసిజ ముమానాథ భవతే –సుఖేనావస్థానం జన ఇహ న జానాతి కిమహో ''

ఉమానాథా!అదొక అగాధమైన సరస్సు. ఒకవైపు నిర్జర కీకారణ్యం. మరో వైపు ఎత్తైన పర్వతం. .ఇటు నుయ్యి అటు గొయ్యి గా ఉంది పరిస్థితి. వాటిలోకి వెళ్లి పూలు కోసి నీకు అర్చన చేయాలని ఉంది. అటూ ఇటూ తెగతిరుగుతున్నాడు ఆరాట పడుతున్నాడు వెర్రివాడు మూర్ఖుడు. జడుడు.తనలోపలే ఒక పుష్పం ఉందని కదలక్కర లేకుండా వెతకక్కర లేకుండా లోపలే హృదయ పుష్పం ఉందని గ్రహించలేక పోతున్నాడు. అది బురదలో పుట్టినా దానికి బురద అంటదు. మనసు కూడా అంతే.సూర్యుని చూసి పద్మం వికశించినట్లు నిన్ను చూస్తె హృదయ పద్మం వికశిస్తుంది. ఆనందానుభవం పొందుతుంది. ఈ హృదయ పద్మాన్ని ఉమానాధునికి కైంకర్యం చేసి ఆనందాన్ని హాయిగా అతి సులభంగా పొందవచ్చు. ఇదంతా చూస్తూఉంటె కస్తూరి మృగం తన నాభి దగ్గరున్న కస్తూరి వాసన గ్రహించకుండా పర్వతాలపై గాలించి అలసి పోయినట్లు గా కనిపిస్తోంది.

అలాగే ''పటుర్వా గేహీవా, యతి రపి జటీవా తదితరో –నరోవా యః కశ్చిన్ భవతు భవ కిం తేన భవతి

యదీయం హృత్పద్మం యది భవదధీనం పశుపతే –తదీయస్త్వం శంభో భవసి భావ భారం చ వహసి ''

బ్రహ్మ చారి గృహస్తు, వానప్రస్తుడు, సన్యాసి ఇంకెవరైనా కావచ్చు. వారు శాస్త్రాలు ఆశ్రమ ధర్మాలు నియమాలు పాటించవచ్చు. పాటించి ఉత్తమ బ్రహ్మ చారి, ఉత్తమ గృహస్తు, ఉత్తమ వానప్రస్తు,ఉత్తమ సన్యాసి అవవచ్చు. దీని వలన వారికి కొంచెం కూడా ప్రయోజనం ఉండదు. వాళ్ళ మనస్సు నీ అధీనమై ఉండాలి. అప్పుడే వాళ్ళు ధన్యులవుతారు. కనుక ఎక్కడ ఏ స్థితిలో ఉన్నా మనసు భగవదర్పితమైతేనే జీవికి సాఫల్యత అని ఆంతర్యం .

మరో శ్లోకం లో –''భ్రుంగీ చ్చానతనోత్కటః కరి మదగ్రాహీ స్ఫురన్మాధవా-హ్లాదోనాద యుతో మహాసిత వపుః పంచేషుణా చాదృతః

సత్పక్షః సుమనో వనేషు స పున సాక్షాన్మదీయేమనో –రాజీవే భ్రమరాధిపో విహరతాం శ్రీశైల వాసీ విభుః

పరమ భక్తుడైన భ్రుంగి కోరగా శ్రీశైలమల్లేశ్వరా నువ్వు ఇష్టంగా తాండవం చేస్తావు. విష్ణువు మోహినీ రూపం ధరించినపుడు, ఆయనపై మోహంపొందావు. ఓంకార నాదాలు ధ్వనించేవాడవు.తెల్లని శరీరం కలిగి మన్మధుని చే ఆరాధింపబడేవాడవు. గజాసుర సంహారివి. దేవతలనేకాక వాసనాత్రయం లేని,సజ్జనులను కూడా రక్షించేవాడవు. అలాంటి శ్రీశైల వాసుడవైన నువ్వు నామనస్సు అనే కమలం లో భ్రమరాంబా దేవితో కలసి ఎప్పుడూ విహరించాలి.

జ్ఞానకమలాన్ని వికసింప జేయాలని ఆంతర్యం.

ఈశ్లోకాన్ని తుమ్మెద పరంగా కూడా అన్వయించవచ్చు. మగతుమ్మెద ఆడ తుమ్మెద నాట్యానికి ఆకర్షితురాలవుతుంది. అది ఏనుగు మదజలాన్ని ఆస్వాదిస్తుంది. మనోహర వైశాఖమాసం లో పుష్పాలు వికసించి ఉంటాయి. ఆతుమ్మెద జంట మకరందాన్ని ఆస్వాదిస్తూ ఆనంద ఝుంకారం చేస్తూ ఎగురుతాయి. తుమ్మెద నల్లగా ఉంటుంది. మన్మధుడు పంచబాణుడు. ఆయన బాణాలు అరవిందం అశోకం, మామిడి పువ్వు, నవమల్లికాపుష్పం, కలువ పూవు .

మనసు కోతి వంటిది. నిలకడ ఉండదు అన్నీ కావాలను కొంటుంది ఎంగిలి చేసి వదిలేస్తుంది. మోహంఎక్కువ అంటూ శంకరులు చెప్పిన శ్లోకం –

''సదా మోహాటవ్యాం చరతి యువతీనాం కుచగిరౌ –నటత్యాశా శాఖా స్వటతిఝడితి స్వైర మభితః

కపాలిన్ భిక్షో మే హృదయ కపి మత్యంత చపలం –దృఢం భక్త్యా బధ్వా శివ భవదధీనం కురు విభో ''

మనసు అనే కోతి అడవుల్లో పర్వతాలలో కుదురు లేకుండా గంతులు వేస్తూ ఉంటుంది. చెట్ల కొమ్మలపై పల్టీలు కొడుతుంది. దాన్ని అదుపు చేసి బంధించటం కష్టం. దానికి మోహం ఎక్కువ. పరుగులు పెడుతూ ఉంటుంది. నా వశం లో లేని నా మనసును నువ్వే భక్తి అనే త్రాడుతో బంధించి నీ స్వాధీనం చేసుకో. నువ్వు భక్తి అనే జ్ఞాన భిక్షను పెట్టే ఆది భిక్షుడవు.

మనసు ఒక ఇల్లు అంటూ –''శివ, తవ పరిచర్యా సన్నిధానాయ గౌర్యా –భవ మమ గుణ ధుర్యాం బుద్ధికన్యాం ప్రదాస్యే

సకల భువన బంధో సచ్చిదానంద సింధో-సదయ హృదయ గేహే సర్వదా సంవస త్వం ''

సకల భువన బంధువైన శివా !నా మనసు ఒక ఇల్లు. నాబుద్ధి ఒక కన్య. ఆకన్య గుణ గరిష్టురాలు.దాన్ని నీకు అర్పించాలని సంకల్పిస్తున్నా. నా కోరిక మన్నించి నామనసు అనే ఇంట్లో పార్వతీ దేవి తో వచ్చి ఉండిపో. నాబుద్ధికన్యను గ్రహించి ఇల్లరికపు అల్లుడిలాగా ఇక్కడే ఉంటే నిన్ను సదా సేవిస్తూ ధన్యుడనవుతాను.

మనసు ఒక మదపు టేనుగు అని –''ధైర్యాంకుశేన నిభ్రుతిం –''అనే శ్లోకంలో వర్ణించారు. దీన్ని ఇదివరకే తెలుసుకొన్నాం. మనసు ఒక గుడారం అంటూ మరోశ్లోకం –

**''ధృతి స్తంభాధారం దృఢగుణ నిబద్ధాంసగమనాం –విచిత్రాంపద్మాఢ్యాం ప్రతి దివస సన్మార్గ ఘటితాం**

**స్మరారే మచ్చేత స్పుట పట కుటీం ప్రాప్య విశదాం – జయ స్వామిన్ శక్త్యా సహ శివ గణైః సేవిత విభో ''**

నా మనసు ఒక గుడారం. దానికి స్తంభాలు ధైర్యం మొదలైనవి. త్రాళ్ళు సత్వ రజస్ తమోగుణాలు. మనస్సనే ఈ గుడారాన్ని ఎక్కడికి పడితే అక్కడికి తీసుకొని వెళ్ళచ్చు. ఈ గుడారం లో మూలాధారం మొదలైన ఆరు చక్రాలు పద్మాలుగా ఉన్నాయి. కుండలినీ శక్తి ఉంది.దీన్ని సాధించి, భేదించి ముందుకు వెళ్ళచ్చు. ఆత్మజ్ఞానం తో ఇందులో హాయిగా జీవించ వచ్చు. నువ్వు కామారివి అంటే మన్మధుడికి శత్రువుకదా.

మనసు ఒక దొంగ అని చెప్పే శ్లోకం –

**''ప్రలోభాద్యై రర్ధాహరణ పరతంత్రో దని గృహే –ప్రవేశోద్యుక్త స్సంభ్రమతి బహుధా తస్కర పతే**

**ఇమాం చేతశ్చోరంకథ మిహ సహేశంకర విభో –తవాధీనం కృత్వా మయి నిరపరాధే కురు కృపాం ''**

నా మనసు ఒక దొంగ. డబ్బు సంపాదించాలనే ఆశ దానికి ఎక్కువ. డబ్బున్న వాళ్ళ ఇళ్ళల్లో ప్రవేశిస్తుంది. నేను వేరు చిత్తం వేరు. .ఇలా నామనసు శరీర సుఖాలకోసం లోభ గుణానికి బానిస అయింది. ఈ దుర్గుణాన్ని ఇక నేను భరించ లేను. నువ్వే స్వాధీనం చేసుకోవాలి. నన్ను నిరపరాధిని చేసి దయ చూపించు మహ ప్రభో.

మనసు ఒక తెల్లకలువ అని చెప్పిన శ్లోకం –

**"ధర్మో మే చతురంఘ్రికః సుచరితః పాపం వినాశం గతం –కామ క్రోధ మదాదయో విగళితాః కాలాస్సుఖా విష్కృతః**

**జ్ఞానానంత్య మహౌషధి స్సుఫలితా కైవల్య నాథే సదా –మాన్యే మానస పుండరీక నగరే రాజావతంసే స్థితే**

ఉత్తమ రాజు పాలనలో ధర్మం నాలుగు పాదాలా వర్ధిల్లు తుంది. కామ క్రోధాది అరిషడ్వర్గాలు నశిస్తాయి రోజులు పక్షాలు నెలలు సంవత్సరాలతో కూడిన కాలం అంతా చక్కగా చల్లగా ప్రకాశిస్తుంది. అనంతమైన జ్ఞానం అనే ఔషధం రాజ్యం లో ఫలిస్తుంది. దాని వలన ప్రజలు విజ్ఞులై సుఖాలనుభవిస్తారు.

అలాగేమనసు ఒక పుండరీకం అంటే తెల్లకలువ. దానిలో తలపై చల్లని చంద్రుని ధరించిన పరమశివుడున్నాడు. అందువల్ల కామక్రోధాదులు నశించి పోయాయి. రాజు అంటే ప్రభువు చంద్రుడు అనే రెండు అర్ధాలున్నాయి. చంద్రుడు మృదుల స్వభావి రాజు కఠినుడు. ఇలాంటి తెల్లకలువ అనే నామనసులో హాయిగా రాజులాగా విహరించు పరమశివా అని అర్ధం.

మనసు ఒక దుర్గం గా భావించి చెప్పిన శ్లోకం –

**''గాంభీర్యం పరిఖా పదం ఘన ధ్రుతిః ప్రాకార ఉద్యద్గుణ-స్తోమ శ్చాప్త బలం ఘనేంద్రియ చయో ద్వారాణి దేహస్తితః**
**విద్యా వస్తుసమృద్ధి రిత్యఖిల సామగ్రీ సామేతే సదా –దుర్గాతిప్రియ దేవ మామక మనో దుర్గే నివాసం కురు''**
నామనసు ఒక దుర్గం. అంటే కోట. అందులో ప్రవేశించటం కష్టం. దుర్గమమైనది దుర్గం –ప్రవేశించటానికి కష్టమైనది అని అర్ధం. దుర్గానికి రక్షణగా చాలా ఉంటాయి. దాని కందకం గాంభీర్యం. ప్రాకారం ధైర్యం. సద్గుణాలే నమ్మదగిన ఆప్తులు. శరీరం లోని నవరంధ్రాలే ఇంద్రియాలు. అందులోని సంపద అంతా విద్య జ్ఞానం మొదలైనవి. కనుక శివుడు ప్రవేశించటానికి కావలసిన సామగ్రి అంతా ఉంది. శివుడు దుర్గా ప్రియుడు. మనసు పరమ శివునికి ఇష్టమైన దుర్గం అని ఆంతర్యం. శివజ్ఞానం ఉంటేనే ప్రవేశానికి అర్హత ఉంటుంది అని అర్ధం.

మనసు ఒక అడవి అని వర్ణించే శ్లోకం –

**''మా గచ్ఛమితస్తతోగిరిశ భో మయ్యేవ వాసం కురు –స్వామిస్ ఆది కిరాత మామక మనః కాంతార సీమాంతరే**
**వర్తంతే బహుశో మృగా మద జుషో మాత్సర్య మోహాదయః –తాస్ హత్వా మృగయా వినోద రుచితా లాభం ఛ సంప్రాప్యసి''**

శివా. నువ్వు ఎక్కడికీ పోవద్దు. నాలోనే ఉండిపో.నామనసు ఒక అరణ్యం అని ముందే చెప్పాను. నువ్వేమో ఆది కిరాతకుడవు. నీకు వేటాడటం చాలా ఇష్టం సరదా కదా. నీకు కావలసినన్ని మృగాలు నాలోనే ఉన్నాయి. హాయిగా వేటాడి అనుభవించు. రా. ఆలస్యం చేయకు. ఇవిగో కామ క్రోధ మద మాత్సర్యాలు అనే మృగాలు. వీటిని వేటాడి నీ వేట తీట తీర్చుకో అనుభవించు, ఆస్వాదించు, వినోదించు, ప్రయోజనం పొందు.

మనసు ను చాతకం, చక్రవాకం,చకోరం హంస లతో కూడా పోల్చి శంకరాచార్య శ్లోకాలు చెప్పారు –

**''హంసః పద్మవనం సమిచ్ఛతి యథా నీలాంబుదం చాతకః –కోకః కోకనది ప్రియం, ప్రతిదినం చంద్రం చకోర స్తదా**
**చేతో వాంఛతి మామకం, పశుపతే, చిన్మార్గ మృగ్యం విభో-గౌరీనాథ,భవత్పాదాబ్జయుగళం కైవల్య సౌఖ్య ప్రదం ''**

హంస నిండుగా పద్మాలున్న కొలను లో విహరించాలని కోరుకొంటుంది. చక్రవాకం సూర్యుడిరాక కోసం ఎదురు చూస్తుంది. చక్రవాకం చంద్రుని  వెన్నెల కోసం నిరీక్షిస్తుంది. చాతక పక్షి నీల మేఘం ఎప్పుడు వర్షిస్తుందా అని అర్రులు చాస్తూ ఎదురు చూస్తుంది. అలాగే నేను జ్ఞానమార్గం చూపించే  గౌరీ నాథుని పాద పద్మాలద్వారా మోక్షం కోసం ఎదురు చూస్తున్నాను.

పై నాలుగు పక్షులు కంటికి కనిపించవు. మనసు కూడా అంతే. ఆ పక్షులకున్న విశిష్ట గుణాలవంటివి మన మనసుకు కూడా ఉన్నాయి. ఈ సుగుణాలతో సాధన సాగించమని ఆంతర్యం.

1-హంస పాలు నీళ్ళను వేరు చేస్తుంది. అంటే పాలను వేరు చేస్తుంది. అంటే గుణాన్ని గ్రహించటం హంస లక్షణం. అలాగే హంస తన జీవితకాలం లో ఒక హంస తోనే జత కడుతుంది. మరో హంస వైపు చూడదు. అలాగే భక్తుడు తన చూపును ఈశ్వరుని వైపే చూడాలని ఆంతర్యం. 2- చాతక పక్షి శరత్కాల నీల మేఘాన్ని తప్ప మరొక దాన్ని యాచించదు. అన్నికాలాలలోవర్షం పడినా చాతకానికి ఆ నీరు అక్కర్లేదు. అలాగే మనం కూడా మోక్షాన్ని ఇచ్చే ఈశ్వరునే యాచించాలని భావం. 3-చకోర పక్షి వెన్నెలలోని అమృతాన్ని ఆస్వాదిస్తుంది. అమృతం చంద్రునిలో మాత్రమే ఉంటుందని దానికి తెలుసు. దీనికోసం నిరంతరం ప్రయత్నిస్తూనే ఉంటుంది. మనం కూడా నిరంతర ప్రయత్నం తో అద్వైతామృతాన్నిపొందాలని సందేశం. - 4- చక్రవాకం పత్నీ వియోగాన్ని పోగొట్టుకోవటానికి సూర్యుని కోసం ఎదురు చూస్తుంది. జీవుడు కూడా పరమాత్మ వైపే దృష్టి సారించాలని సూచన. ఈ నాలుగు పక్షులు తమ గుణాలవలన మానవుని కి గొప్ప ఆధ్యాత్మిక సందేశాన్నిస్తున్నాయని ఆంతర్యం .

మరొక శ్లోకం లో మనసును చాతకం తో పోల్చారు –

**''కారుణ్యామృత వర్షిణం, ఘన విపద్గ్రీష్మ చ్ఛిదాకర్మఠం-విద్యా సస్య ఫలోదయాయ సుమనస్సం సేవ్య మిచ్ఛాకృతిం**
**నృత్యద్భక్త మయూర మద్రినిలయం  సంసజ్జటామండలం –శంభో, వాంఛతి నీలకంధర,సదా త్వాం మే మనశ్చాతకః ''**

ఈ శ్లోకం లో నీలకంఠుడైన శివుడికి, మేఘానికి భేదం లేనట్లుగా చమత్కరించారు శంకరాచార్య

ఆ నీల మేఘం కారుణ్యం అనే అమృతాన్ని వర్షిస్తుంది. గ్రీష్మ తాపాన్ని పోగొడుతుంది. పంటలు బాగా పండుతాయి కనుక రైతులు పూజిస్తారు. వాళ్ళు కోరిన కోరికలను మేఘం తీరుస్తుంది. మేఘాలను చూసి నెమళ్ళు ఆనంద పరవశంతో నాట్యం చేస్తాయి. మేఘం ఎత్తైన కొండల మీద ఉంటుంది. కం అంటే నీరు ధర అంటే ధరించినది అంటే నీటిని కలిగిఉన్న మేఘం అని అర్థం. ఆ నీటితో తన దాహార్తిని తీర్చమని చాతక పక్షి నీల మేఘాన్ని కోరుతోంది

గరళాన్ని మింగటం చేత శివుడి కంఠం నల్లబడింది కనుక నీల కంఠుడు.కంధరం అంటే మెడ కనుక నీల కంధరుడు . ఈయన కరుణ అనే అమృతాన్ని వర్షిస్తాడు. ఆపదలను తొలగించి, జ్ఞానం అనే పంటలు పండిస్తాడు. దేవతలు ఆయనను సేవిస్తారు, ఆనంద పరవశంతో నాట్యం చేస్తారు. కైలాస పర్వత వాసి, జటా జూట ధారి శివుడు. అలాంటి కరుణానిధి అయిన శివుడిని నా మనస్సు అనే చాతకపక్షికోసం కారుణ్యం అనే అమృతాన్ని వర్షించమని ప్రార్ధిస్తోంది అని ఆంతర్యం.

మనసును ఒక పెట్టె గా అభి వర్ణించి మరోశ్లోకం రచించారు –

**''ఆశా పాశ క్లేశ దుర్వాసనాది-భేదో ద్యుక్తైర్దివ్య గంధై రమందై**
**ఆశా శాటీకస్య పాదారవిందం –చేతః పేటీం వాసితాంమే తనోతు ''**

నా మనసు ఒక పెట్టె.దాని నిండా అవిద్య, అస్మితం, రాగం, ద్వేషం అభినివేశం అనే అయిదు క్లేశాలు అనే దుర్వాసనతో ఉంది. ఇవి దుఃఖ హేతువులు. దిక్కులే వస్త్రాలుకల దిగంబరుడైన శివుడిపాద పద్మాలు నా మనస్సు అనే పెట్టెలో ఉంటే ఆ క్లేశ దుర్వాసనలు అన్నీ తొలగి పోతాయి.

అవిద్య అంటే అజ్ఞానం. అస్మితం అంటే సుఖ దుఖాలు నేను అనుభవిస్తున్నాను అనే భావం వలన కలిగే దుఖం. రాగం అంటే ఇష్టమైన దానిపై కోరిక అవి దూరమైతే దుఖం. ద్వేషం అంటే ఇష్టం లేని వస్తువులు దగ్గరైతే కలిగేది. అభినివేశం అంటే తనను తాను ప్రేమించటం మరణాదుల వలన కలిగే దుఖం. ఈ క్లేశాలు నశించాలంటే శివజ్ఞానం ఒక్కటే మార్గం అని ఆంతర్యం.

మనసు ఒక గుర్రం అని ఇంకో శ్లోకం –

''కళ్యాణినం సరస చిత్ర గతిం సవేగం –సర్వేంగితజ్ఞ మనఘుం ధ్రువ లక్షణాఢ్యం

చేత స్తురంగ మధిరుహ్య చరస్మరారే –నేత స్సమస్త జగతాం వృషభాధి రూఢః''

ఈశ్వరా !నామనసు ఒక గుర్రం. దాని నడక చాలా చిత్ర విచిత్రంగా ఉంటుంది. దాని పరుగు వేగం చాలా ఎక్కువ. మనో భావాలను ఇట్టే పసిగట్టే నేర్పు దానికి ఉంది.దోషాలు లేని మాంచి జాతికి చెందిన సాముద్రికలక్షణాలన్నీ కలిగి ఉన్న కల్యాణి జాతి గుర్రం. నువ్వు సర్వ లోకాధినేతవు. వృషభారూఢుడవు.నువ్వే నా మనసనే పంచకల్యాణి గుర్రాన్ని అధిరోహించి తిరగమని వేడు కొంటున్నాను.

గుర్రానికి ఉండే సరస చిత్ర గతి 5 రకాలు -1-అతి వేగం అతి నెమ్మది కాకుండా మధ్యరకం గా పరిగెత్తటం 2-. వేగంగా చాతుర్యంగా పరిగెత్తటం 3-వంకర టికర కాకుండా తిన్ననైన మార్గం లో గమనం 4-పైకి కాళ్ళు కదిలిస్తూ పరిగెత్తటం 5-ఒకే రకమైన వేగం తో ఎంతదూరమైనా పరిగెత్తటం.

ఈ అయిదు రకాల గమనం మన మనసును నడిపే పంచేంద్రియాలకు సంకేతం. రౌతు అంటే గుర్రాన్ని నడిపే వాడు సమర్దుడైతే పొగరుబోతు గుర్రమైనా చెప్పినట్లు దారికొచ్చి మాట వింటుంది. కనుక సర్వ సమర్ధుడైన ఈశ్వరుడే మన మనసనే గుర్రాన్ని ఎక్కితే అది దారికి తప్పకుండా వస్తుందని ఆంతర్యం.

ఇదికాక మనసును చెరువుతో, ఇంటితో కూడా పోల్చారు. ఆశ్లోక వైభవాలను ముందే తెలుసుకొన్నాం.

మనసు అనే మొదటి అంతః కరణ పూర్తయింది. రెండవదైన బుద్ధి గురించి తర్వాత తెలుసుకొందాం.

అన్తఃకరణాలలో రెండవదైన బుద్ధి గురించి శంకర భగవత్పాదులు చెప్పిన శ్లోకాలను తెలుసుకొందాం.

విషయాన్ని నిశ్చయించే మానసిక స్థితి ని బుద్ధి అంటారు. జడ బుద్ధి ఉన్నవాడు పరమేశ్వర చింతనానికి దూరం గా ఉంటాడు అనే భావంగా చెప్పిన శ్లోకం –

''అసారే సంసారే నిజభజన దూరే ''శ్లోకం లో దీని వివరణ ఇదివరకే తెలుసుకొన్నాం. మరో శ్లోకం –

''యథా బుద్ధి శ్శుక్తౌ రజత మితి కాచాశ్మని మణి-ర్జలే పైష్టేక్షీరం భవతి మృగ త్రుష్ణాసు సలిలం

తథా దేవ భ్రాంత్యా భజతి భవదన్యే జడజనో –మహా దేవేశం త్వాం మనసి చ న మత్వా పశుపతే ''

దేవతలే ఆరాధించే పరమ శివా పశుపతీ !మూఢుడు సత్యం కాని దాన్ని సత్యం అని భ్రమ పడుతున్నాడు. తాను పేరు బ్రహ్మం పేరు అనుకొంటున్నాడు. అది నిజం కాదని ఆ వెర్రి మాలోకానికి తెలీదు పాపం. నువ్వు నిత్య సత్య సచ్చిదానంద స్వరూపుడివి. కాని వాడు నిన్ను వదిలేసి చిన్న దేవతలనే నమ్ముతున్నాడు. ఇది ఎలా ఉందీ అంటే ముత్యపు చిప్పను చూసి వెండి అని, గాజు ముక్కను చూసి మణి అని, ఎండమావి ని చూసి నీరు అని భ్రమించటం లాగా ఉంది. కనుక నిన్నే సేవిస్తే ఈ భ్రమ ప్రమాదం వాడికి ఉండదు. ఇతర దేవతలను సేవిస్తే లౌకిక తాత్కాలిక ప్రయోజనాలే నేర వేరుతాయి. నిన్ను సేవిస్తే శాశ్వత ముక్తి లభిస్తుంది. నువ్వుఅవిద్యా నిర్మూలనం చేసి మోక్షం ప్రసాదిస్తావు. జీవుడు మాయావృతుడు. నీవు మాయాతీతుడవు.

అలాగే ''గభీరే కాసారే విశతి విజనే –''శ్లోకం లోనూ ఇదే భావాన్ని వివరించారని తెలుసుకొన్నాం

జడ బుద్ధిని జ్ఞానం లో నిలపాలి అప్పుడే తరుణోపాయం అని చెప్పేశ్లోకం

''మనస్తే పాదాబ్జే నివసతు వచస్తోత్ర ఫణితౌ –కరశ్చాభ్యర్చాయాం శ్రుతి రపి కథాకర్ణన విధౌ

తవ ధ్యానే బుద్ధిః నయన యుగళం మూర్తి విభవే -పరగ్రంథాన్ కైర్వాపరమశివ జానే పరమతః ''

నా మనసు నీ పాద పద్మాల మీద లగ్నమవ్వాలి. తామర పువ్వుకు ఏమీ అంటనట్లు నామనసుకు ఏ మాలిన్యమూ అంటరాదు.శివ జ్ఞానం అనే మకరందాన్ని మాత్రమే ఆస్వాదించాలి. నిన్ను స్తుతించే వేద,ఇతిహాస, పురాణ స్తుతినే వింటూ ఉండాలి. కావ్యాలు, గేయాలు, పద్యాలలో నీ స్తుతే వినిపించాలి చేతులు నిన్నే అర్చించాలి. చెవులు నీ గాథలే వింటూ ఉండాలి. నాబుద్ధి నీధ్యాన లగ్నమవ్వాలి. నాకళ్ళు నీ రూప సౌందర్య దర్శనం తో ధన్యమవాలి. నువ్వే ప్రపంచం,ప్రపంచమే నువ్వు అనే భావన మనసు, బుద్ధి

లో నిండిపోవాలి. నా సర్వేంద్రియాలు నీ చుట్టూనే పరి భ్రమించాలి. ఇలా బుద్ధిని నీకై సర్వ సమర్పణ చేస్తే, సాయుజ్యమే కదా కలిగేది.

1- చిత్తం –"చింతన కత్రుత్వం చిత్తం –"జ్ఞాపకాల పొరలు ఉన్నది చిత్తం.చిత్తం లో పరమేశ్వర పరిమళాలు నింపుకోవాలి అని –

"పాపోత్పాత విమోచనాయ రుచి రైశ్వర్యాయ మృత్యుంజయ –స్తోత్ర ధ్యాన నతి ప్రదక్షిణ సపర్యాలోకనా కర్ణనే

జిహ్వా చిత్త శిరోంఘ్రి హస్త నయన శ్రోత్రై రహం ప్రార్ధితో –మా మా జ్ఞాపయ ముహుర్మామేవ మా మే వచః "

మృత్యుంజయ మూర్తీ శివా !నాఇంద్రియాలన్నీ నిన్నే ప్రార్ధిస్తున్నాయి. ఎందుకంటె తమవలన నేరాలు ఏవైనా జరిగితే అవి పాపాలకు కారణం అవుతాయని. పాపాలు మనోహరమైన ఈశ్వర సంబంధమైన జ్ఞాన సంపదను అనుభవించ కుండా అడ్డుపడతాయి. కనుక పాపాలవల్ల జరిగే ఉత్పాతాలు కలగకుండా ఇంద్రియాలన్నీ నిన్నే సేవిస్తున్నాయి. నాలుక నిన్ను స్తోత్రం చేయటానికి, చిత్తం నీ సంబంధమైన ధ్యానం చేయటానికి చేతులు నిన్ను పూజించటానికి, కళ్ళు నిన్నే దర్శించటానికి, శిరస్సు నీకే నమస్కరించటానికి, పాదాలు నీ చుట్టూ ప్రదక్షిణం చేయటానికి , చెవులు నీకథలే వినటానికి అనుకూలంగా ఉంచమని వేడుకొంటున్నాయి.అందుకని ఓ ప్రభూ నన్ను ఆ ఇంద్రియాలు కోరినట్లు ఆజ్ఞాపించు. నాకు మూగతనం చెవుడు, గుడ్డితనం కుంటితనం రాకుండా చూడు. ఈ ఆవ లక్షణాలు లేకపోతె హాయిగా నాఇంద్రియాలు నీ సేవలో ధన్యమౌతాయి

4-ఆహంకారం -."అహం కర్తా అహంకారః "అని శకరాచార్య నిర్వచనం. నేను చేస్తున్నాను అనే భావమే అహంకారం. ఇది అనర్ధ హేతువు దాన్ని వదిలించుకోవాలి. దీనికోసం

"త్వత్పాదాంబుజ మర్చయామి –"శ్లోకం లో ఈ విషయాన్నే చెప్పారు. దీన్ని మనం తెలుసుకొన్నాం. అలాగే

''మనస్తే పాదాబ్జే –''శ్లోకం లోని భావాలూ గ్రహించాం –

''సా రసనే తే నయనే –తావేవ కరౌ స ఏవ కృతకృత్యః

యా యే యౌయో భర్గం-వద తీక్షతే సదార్చత స్స్మరతి''

శివ నామం ఉచ్చ రించే నాలుకే నాలుక. శివుని దర్శించే నేత్రాలే నేత్రాలు. మహా దేవుని పూజించే చేతులే చేతులు. నిరంతరం సదాశివుని స్మరించేవాడే కృతకృత్యుడు. పోతనగారుకూడా ''కమలాక్షు నర్చించు కరములు కరములు శ్రీనాధు వర్ణించు జిహ్వ జిహ్వ ---''అన్నారు. చివరగా –

''క్రీడార్ధం సృజసి ప్రపంచ మఖిలం క్రీడా మృగా స్తే జనాః –యత్కర్మా చరితం మయా చ భవతః ప్రీత్యై భవత్యేవ తత్

శంభో స్వస్య కుతూహలస్య కరణం మచ్చేస్టితం నిశ్చితం –తస్మాన్మామక రక్షణం పశుపతే కర్తవ్య మేవ త్వయా ''

ప్రపంచాన్ని ఆటగా సృష్టిస్తావు.ఆ ఆటలో మేమందరం క్రీడా మృగాలమే. నువ్వు సృష్టించిన అడవి జంతువును నేను. నీ పెంపుడు జంతువును కూడా. కనుక నేను చేసే పనులన్నీ నీకు ఇష్టంగానే ఉంటాయి. పెంపుడు జంతువంటే యజమానికి వల్లమాలిన అభిమానం కదా. కనుక నన్ను రక్షించటం నీ బాధ్యత, కర్తవ్యమ్ కూడా. కారణం నువ్వు పశుపతివి.

స్థూల సూక్ష్మ కారణ శరీరాల లయం

1- స్థూల శరీరం -పంచ భూతాలూ, అయిదు కర్మేంద్రియాలు, అయిదు జ్ఞానేంద్రియాలు, పంచ ప్రాణాలు, ,నాలుగు అంతః కారణాలు –కలిసిన మొత్తం 24 తత్వాలు కలిస్తే స్థూల శరీరం –ఈ 24 తత్వాలు లయం అయితేనే మోక్షం. అందుకే శంకారాచార్య 24 సార్లు మహేశ్వర పాద పద్మాల స్మరణ చేశారు. ఇలా స్మరణ చేస్తే స్థూల శరీరం పర బ్రహ్మలో లయం అవుతుందని ఆచార్యుల వారి ఆంతర్యం అని గ్రహించాలి.

2- సూక్ష్మ శరీరం –పంచ ప్రాణాలు, పంచ జ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు మనసు , బుద్ధి కలిస్తే సూక్ష్మ శరీరం. ఇవి 17 తత్వాలు. ఇవీ లయం కావాలని 17 సార్లు పశుపతిని స్మరించారు. మనసును 18 వస్తువులతో పోల్చటం ఆ 17 తత్వాల సూక్ష్మదేహం లయం అవటానికే నని ఆంతర్యం.

3- కారణ శరీరం –ఇది ఆకారం లేనిదేకాక పుట్టుక, చావులకు కారణమైనదికూడా.

దీనికోసం "ఆశాపాశ క్లేశ దుర్వాసనాది ---"శ్లోకం చెప్పి మనస్సు అనే పెట్టెలో ఈశ్వర పాద పద్మాలుంటే వాసనా క్షయమై కారణ శరీరం లయమౌతుందని అప్పుడే అద్వైత సిద్ధి కలుగుతుందని ఇది వరకే గ్రహించాం. పాదాలు మనం నిలకడ గా ఉండటానికిఆధారం గా తోడ్పడతాయి. అంఘ్రి అన్నా పాదాలే ఉత్తమ గతి పొందించేవి అని అర్ధం. సన్మార్గం లో సంచరించటానికి సహకరించేవి చరణాలు. దేవతల శక్తులన్నీ భగవంతుని పాదాలలోనే ఉంటాయట.

పాద పద్మాలు అనే మాటకు ఆంతర్యం ఆత్మ,పరమాత్మల జ్ఞానాలే భగవంతుని పాదపద్మాలు. భగవంతుని లీలలు ఒక పాదం అయితే ఆంతరిక అర్ధం మరో పాదం అన్నారు విజ్ఞులు. శివుడు ఒక పాదం అయితే శక్తి మరోపాదం అన్నారు.

శంకరాచార్య పాదాలను భక్తి పూర్వకంగా పాదపద్మాలన్నారు. జీవులను సంసార లంపటం నుంచి తరింపజేసేవి భగత్పాదపద్మాలు.

ఈ విధంగా శివానంద లహరి లో శంకర భాగవత్పాదులవారు సదాశివ పాద పద్మార్చనం, స్మరణం, కీర్తనం,పాద సంసేవనం అందరూ చేసి తరించాలని భావించారు. ఇది శిరోధార్యం మార్గ దర్శకం కైవల్య సాధనం, సంసార తరుణోపాయం.

## శివానందలహరి లో అద్వైత స్థితి

''కిం బ్రూమః తవ సాహసం పశుపతే కస్యాస్తి శంభో –''శ్లోకం లో శివుని అద్వైత స్థితి ని వర్ణించారు శంకరాచార్య. మహా ప్రళయం లో కూడా పరమేశ్వరుడు ఆనంద లహరిలో తేలియాడుతూ,నిశ్చలంగా ఉంటాడు. ఇదే అద్వైత స్థితి. ఇందులో ఆనంద లహరి ఒక గొప్ప అనుభవ స్థితి.

''కిం బ్రూమః తవ సాహసం పశుపతే కస్యాస్తి శంభో, భవ –ద్దైర్యం చేద్రుశ మాత్మన స్థితిరియం చాన్యైః కథం లభ్యతే

భ్రశ్య ద్దేవ గణం త్రసన్ముని గణం నశ్య త్ప్రపంచం లయం –పశ్యన్ నిర్భయ ఏక ఏవ విహరత్యానంద సాంద్రో భావాన్ ''

శంభో పశుపతీ !నీ ధైర్యానికి జోహార్లు. నీ సాహసానికి జోహార్లు. నీ అచంచల ఆత్మ స్థితి బహు ప్రశంశ నీయం. ప్రళయ కాలం లో దేవతలు కూడా స్థాన భ్రంశం చెందుతున్నారు. భయం తో వణికి పోతుంటారు. నీ కళ్ళ యెదుటనే ప్రపంచం నశించి పోతోంది. ఇదంతా చూస్తూ నువ్వు మాత్రం నిశ్చలంగా ఆనంద సముద్ర లహరి లో హాయిగా తేలియాడుతూ ఉంటావు. అని అద్వైతానందాను భూతిని ఆచార్య శంకరులు అద్భుతంగా ఆవిష్కరించారు.

అలాగే ''అంకోలం నిజ బీజ సంతతి –''శ్లోకం లోనూ అద్వైత సిద్ధాంత ప్రదర్శన చేసిన సంగతి తెలుసుకొన్నాం. నదులు సముద్రం లో కలిసి తమ నామ రూపాలు అస్తిత్వాన్ని కోల్పోయి సముద్రమే నన్న భావం గా కలిసిపోతాయి . ఇదే అద్వైత స్థితి లో ఆంతర్యం.

ఈశ్వరుడు మనలోనే ఉంటె ఈశ్వర ప్రార్ధన నిరంతరం చేస్తుంటే జ్ఞాన ప్రాప్తి జరిగి, అరిషడ్వర్గాలు నశించి అద్వైత సిద్ధి లభిస్తుంది అని ఇదివరకటి శ్లోకాలలో తెలుసుకొన్నాం. ఇలాంటి శ్లోకాలు ఎన్ని చెప్పుకొన్నా సంతృప్తి ఉండదు. నిత్య సాధనతో పరమేశ్వర చిత్త లగ్న మానసులమైతే ఆచార్య శంకరులు ప్రవచించిన శివానంద లహరి అనే అద్వైత సిద్ధి లభిస్తుందని గ్రహించాలని మనవి చేస్తూ ''శంకరుల శివానందలహరి ఆంతర్యం ''ధారావాహిక కు ఇంతటితో సమాప్తి పలుకు తున్నాను.

సర్వ వేదాంత సౌరభం

## శంకర దిగ్విజయ యాత్ర

కాశీ రాజు రత్న సింహుడు శ్రీ శంకరాచార్యుల అప్రతిహత విద్యా వైభవ సంపత్తి గుర్తించి, గౌరవించి, కాశీలోనే ఉంటూ తనకు ఆనందాన్ని కలిగించమని ప్రార్ధించాడు. సన్యాసి అలా ఒకే చోట ఉండటం ధర్మం కాదని చెప్పి, ఒకచోటే కాలక్షేపం చేయటానికి తాను పుట్టలేదని తెలియజేసి, అక్కడి నుంచి బయల్దేరారు.ఆనంద గిరి, చిద్విలాసుల కథనం ప్రకారం శంకరులు సామాన్య యతీశ్వరుడిగా కాక, కాశీరాజు ప్రాపకం తో లభించిన అనేక రాజ లాంఛనాలతో పటాతోపంగా దిగ్విజయ యాత్ర ప్రారంభించారు. ద్వారక రాజు సుధన్వుడు శంకరుని గురువుగా స్వీకరించి, సేవ చేయాలనే కోరికతో ఆయన వెంట నడిచాడు. అప్పుడు భగవత్పాదుల వయస్సు 25ఏళ్ళు. కొందరి లెక్కప్రకారం కుమారిల భట్టును కలిసే నాటికి శంకరుల వయసు 15మాత్రమే.

మొదటిసారిగా ప్రయాగ క్షేత్రం చేరి త్రివేణీ సంగమ స్నానాలు చేస్తూ, జిజ్ఞాసులకు బోధ చేస్తూ, ప్రత్యర్ధులను ఓడిస్తూ, మీమాంసా శాస్త్ర దురంధరుడైన కుమారిల భట్టు ఆత్మ పవిత్రత కోసం తుషాగ్నిలో ప్రవేశించ బోతున్నాడని తెలిసి, అంతకు ముందే ఆయనతో సంభాషించాలనే కోరిక ఉండటం చేత శంకరులు రుద్రపురంలో ఉన్న కుమారిలుని చూడటానికి వెళ్ళారు. ఈయన జైన, బౌద్ధ సిద్ధాంతాలను ఆయా గురువులనుంచి రహస్యంగా గ్రహించి, దొరికిపోయి, బహిష్కరింపబడి,క్రోధా వేశాలతో రాజాశ్రయాన్ని పొంది, ఆమతాలను రూపుమాపి, అవసానకాలం లో గురు ద్రోహ మహాపాతకం నివారణకోసం, ప్రాయశ్చిత్తంగా" ఊక కొలిమి"లో ప్రవేశించి చనిపోవాలని భావించాడు. శంకరులు అక్కడికి చేరే సమయానికే ఆయన అగ్ని ప్రవేశం చేసి కొంతవరకు దహింప బడినా, శంకరునితో ఆనందంగా మాట్లాడి, మాహిష్మతి నగరంలో ఉన్న తన శిష్యుడు మండన మిశ్రుని కలిసి ఓడించి శిష్యునిగా గ్రహించమని చెప్పి చనిపోయాడు. కుమారిలభట్టు సుధాన్వాదిఅనేక బౌద్ధరాజులను సంస్కరించి వైదిక మార్గ ప్రవర్తకులను చేసి, వారిద్వారా దేశం లో వైదికాన్ని స్థాపించిన మహాపురుషుడు గా కీర్తి పొందాడు. ఆ కాలం లో ఆయనకు ఎదురు లేదు. కుమారిలుడు కామరూపం అనబడే అస్సాం కు చెందినవాడని కొందరు, తమిళ దేశం వాడని కొందరు అంటారు. అతని ప్రత్యర్ధులైన "జిన విజయ "కర్తలు కుమారిలుడు ఆంధ్రుడే అన్నారు. కానీ ఆయన జీవితమంతా ఉత్తర దేశం లోనే గడిచిపోయింది కనుక అతని ప్రభావం ఆంధ్ర దేశం లో కనిపించలేదు. క్రీ.పూ 494లో శంకరుల 15వ ఏట కుమారిలభట్టు మరణించాడు. "శంకర –కుమారిల సమాగమనం కు చారిత్రక సాక్ష్యాధారాలు దొరకక పోవటం చేత దాన్ని సమ్మ తించటం లో ప్రాముఖ్యం లేదన్నారు ప్రొఫెసర్ సూర్యనారాయణ శాస్త్రి. కుమారిలుడు శంకరులకు చాలా ప్రాచీనుడు కనుక వీళ్ళిద్దరూ కలుసుకోవటం అసంభవం అన్నారు కృష్ణస్వామి మొదలైన ఆధునికులు.

కుమారిల యతి సార్వ భౌముడితో చర్చించే అవకాశం దొరకక పోయినందుకు శంకర యతీంద్రులు, నిరాశ చెంది, కుమారిలుని ముఖ్య శిష్యుడేకాక, బావమరిది కూడా అయిన మండన మిశ్రుని తో వాదించటానికి మాహిష్మతీ నగరం చేరారు. అది మగధ సామ్రాజ్య రాజధాని అని విద్యారణ్యులు చెబితే, హస్తినాపురానికి దగ్గరలో ఉందని ఆనంద గిరి రాశాడు. ఈనగరం నర్మదా నదీ తీరంలో ఉందని రఘువంశం,మాఘకావ్యం అన్నాయని "తెలంగ్" తెలిపాడు. మండన మిశ్రుడు రాజ గురువు అవటం చేత అత్యధిక భోగాభాగ్యాలతో

వర్ధిల్లుతున్నాడు. శిష్యులనేకులున్నారు. వారికి కర్మకాండ బోధిస్తూఉంటె ఇంటి ప్రాంగణం లోని పంజరపు చిలకలు "వేదాలు స్వతః, పరతః ప్రమాణాలే- "స్వతః ప్రమాణం పరతః ప్రమాణం కీరాంగనా యత్ర గిరం గిరంతి "పలుకుతుంటాయి. అంటే సంపూర్ణ వైదిక కర్మభావ వాతావరణాన్ని ఆయన స్వయంగా నిర్మించాడు. "మీమాంసాను క్రమణినిక ",విధి వివేకం "అనే అపూర్వ గ్రంధాలు రాసి మహా ప్రఖ్యాతుడైనాడు. ఇలాంటి బలమైన ప్రత్యర్థితో వాదించిజయించి అద్వైత ప్రతిష్ట చేయాలని శంకరుల కోరిక. ఈ సంఘటన అత్యంత ప్రధానమై శంకరుల జీవితం కొత్తమలుపు తిరిగింది. మండనుని ఓటమితో, ఆనాటి కర్మ వాదులంతా తలవంచి మగధ రాజుతో సహా అనేకమంది రాజులు శంకరులకు అధీనులైనందున , శంకర సంకల్పమైన అద్వైత సిద్ధాంత స్థాపన కార్యక్రమం జయప్రదమైంది. మండన పండితుడే విశ్వరూపాచార్యుడు. శంకర శిష్యుడై సురేశ్వరాచార్యుడు అయ్యాడు.

మండన మిశ్ర, శంకరులు ఏడు రోజులు చర్చోపచర్చలు ఉభయభారతి అధ్యక్షతలో జరిపారు. శంకరుల ప్రశ్నకు సమాధానాలు చెప్పలేక మండనుడు ఉక్కిరి బిక్కిరై భార్య ఉభయభారతి ప్రకటించినట్లుగా ఓటమిని అంగీకరించాడు. శంకర ఉభయభారతి వాదాలు తర్వాత సాగి, ఆధ్యాత్మిక విద్యా స్వరూపుడై, చిద్రూపుడైన అపర శంకరునికి, సర్వ విద్యాపాదపమైన అపర శారద కు జరిగే వాదాలను చూడటానికి దేవ ముని గణం అంతా తిలకించి పులకించింది. చివరికి ఆమెకూడా ఓడిపోయి శంకరుని సత్కారం చేసి భర్త మండనుడి సన్యాస దీక్షకు ఒప్పుకొని శంకర సూటి వాద ఘాతాలకు తీవ్రంగా బాధపడి అపరసరస్వతి ఉభయ భారతి శంకరుల భాగవత్పాదులతో శృంగేరి చేరి శారదామాతగా పూజ లందుకొంటున్నది అని "గురు వంశ కావ్యం "తెలియ ఎసింది.

అమరుక రాజు శరీరంలో పరకాయ ప్రవేశం చేసిన శంకరులు శృంగారాన్ని గ్రహించి, ఉభాయభారతితో వాదించి ఓడించాడు. మండన మిశ్రునికి ఆత్మబోధ చేసి మహావాక్యాలు ఉపదేశించి తురీయాశ్రమమిచ్చి క్రీ.పూ.491లో సురేశ్వరాచార్యుడనే ఆశ్రమనామం అందించారు. వీటితో ఉత్తర భారతం లో శంకరునికి ఎదురు లేకపోయింది పండితపామరులు, రాజులు శిష్యలయ్యారు. అద్వైతామృతసారం గ్రోలారు.ఇతర మతాలను నిరాకరిస్తూ, శంకర ప్రోక్త అద్వైత సిద్ధాంతాన్ని ఆచరిస్తూ జన్మ ధన్యం చేసుకొని ముక్తి పొందారు. ఉభయభారతి కూడా శంకరుని సన్యాసిని గా అనుసరిస్తూ, సంపూర్ణ వైరాగ్యంతో కాలం గడుపుతూ, శృంగేరి మఠ స్థాపన వరకు శంకర భాగవత్పాదులతో పర్యటన చేస్తూ, తీవ్రమైన సాధనాలతో అనేక అనుభూతులు పొంది, అందరికి ఆరాధ్యయై, చివరికి శృంగేరిలో ఒక ఆలయం లో పూజింప బడుతోంది చరిత్ర తెలిపింది.

ఆధారం –శ్రీ అనుభవానంద స్వామి వారి "సర్వ వేదాంత సౌరభం ".

## శ్రీ శంకరుల దేశ పర్యటన

ఆతర్వాత శంకర యతీంద్రులు దేశం నలుమూలలా అద్వైత మతాన్ని స్థాపించటం కోసం శిష్య గణం తో భారత దేశమంతా పర్యటన ప్రారంభించారు. అన్ని రాష్ట్రాలపాలకులు శంకరుని గౌరవంగా ఆహ్వానించి అద్వైత ప్రచారానికి బాగా తోడ్పడుతున్నారు. ముందుగా మాహిష్మతి నుంచి, మహారాష్ట్ర మీదుగా దక్షిణాప్రయాణమయ్యారు. మహారాష్ట్రలో మల్లరులు, కాపాలికులు, భైరవారాధకులైన తాంత్రికులు న్నారు..వీరి మత సిద్ధాంతాలను అనుష్టానవిధానాలను ఖండిస్తూ, వారిఅనుచరులను మార్చి, శిష్యులను చేసుకొని దిగ్విజయ యాత్ర చేశారు. శంకర వాద విధానం లో ఒక సామరస్యం ఉన్నట్లు ఆనందగిరి రాశాడు. ఒక చోటుకు చేరగానే శంకరులు ఆదేశం లోని పండితులను సమావేశానికి ఆహ్వానించి,వారి మతవాదాన్ని దాని సాధనా విధానాన్ని వారితోనే చెప్పించి శ్రద్ధగా వినేవారు. తర్వాత ఆ మత వాదం పై వారితో సాకల్యం గా చర్చించి, ముందుగా అందులో తనకు అంగీకారం అయిన విషయాలను చెప్పి, తర్వాత అంగీకారం కాని విషయాలపై తీవ్రంగా వారితో చర్చించి, తన సిద్ధాంతాన్ని సమర్ధించి, వారి సిద్ధాంతం లోని దోషాలను ఎత్తి చూపటం తో ప్రత్యర్ధులు సులభంగా శంకర భావ ధారకు లొంగి, అనుచరులు శిష్యులవటం ముఖ్య విశేషం.

ఈ ప్రయాణం లో మహారాష్ట్రలో ఒక చోట ఒక కాపాలికుడు కుటిల ప్రయత్నాల చేత చంపాలని భావించాడు. "Man's unhappiness comes of his greatness ''తన ప్రతిష్టవల్లనే మానవుడికి దుఖం కలుగు తుంది అనే మహాకవి కార్లైల్ నానుడి ననుసరించి శంకరుని కీర్తి ప్రతిష్టలు చాలామందికి అసూయకు కారణమయ్యాయి. ఈకాపాలికుడు మూఢంగా తెగించటం చేత అతని పేరు లోకానికి తెలిసింది కానీ, ఇంకా యెంత మంది ఉన్నారో తెలీదు. వీడు అంతా నిద్రించే సమయంలో శంకరుని తల నరకటానికి వచ్చాడు. వాడికి మించిన శక్తి సామర్ధ్యాలున్న పద్మపాదునికి తెలిసి. వచ్చి వాడి చేతిలోకత్తిలాగేసి వాడిని చంపేశాడు. దీనికి భిన్నంగా కాపాలిడు ఒకసారి శంకర సన్నిధానానికి వచ్చి ఒక మహాత్ముని శిరస్సు కాళికా దేవికి అర్పించాలను కొన్నాననీ అమహాత్ముడు శంకరుడే అని, శిరసు ఖండించిన మాత్రం చేత ఆత్మ అవిచ్ఛేద్యం కదా అని ఆయనకే బోధించగా శిష్యులు లేని సమయంలో వచ్చి తల తీసుకోమని శంకరులు చెప్పగా వాడు వచ్చి తల తెగేయ్యటానికి సిద్ధమై పద్మపాడుడిని నిద్రలేపగా, పద్మపాదుడు ఆ కాపాలికుని వధించాడని కథనం.ఈ సంఘటన మన శ్రీశైలం లోనే జరిగిందని పలువురి నమ్మకం.

శ్రీశైలం నుంచి కర్ణాటకలోని గోకర్ణ క్షేత్రం చేరి స్వామిని దర్శించి, శ్రీ వల్లిఅనే చోటుకు శంకరులు వచ్చారు. ఇక్కడ మూఢుడు లాగా ఉండే ఒకడు వచ్చి శిష్యుడయ్యాడు. ఇక్కడ కాదు ప్రయాగలో ప్రభాకరుడు అనే బ్రాహ్మణుడు శంకరుని వద్దకు తనమూఢ కుమారుని తీసుకొనివచ్చాడని వాడిని అనుగ్రహించి కొన్ని ప్రశ్నలు అడిగితె పృధ్వీ ధరుడు అనే ఆ బాలుడు తన నిజతత్వాన్ని తెలుపుతూ అద్వైత ప్రసంగం చేశాడనీ, అందరూ ఆశ్చర్యపోయారనీ, అతడు చెప్పిన శ్లోకాలకే శంకరులు " హస్తామలకం " అనే వ్యాఖ్య రాశారని అతడిని శిష్యుడిని చేసుకోన్నారనీ ఉంది. మొదట్లో ఇతడి పేరు ఉదంకుడు అనీ, కానీ సన్యాసం స్వీకరించి

హస్తామలకాచార్యుడై ప్రసిద్ధి పొందాడని చరిత్ర. ఇతడి తండ్రి ప్రభాకరుడే మీమాంసా చార్యుడైన ప్రభాకర మిశ్ర అన్నారు. కాలం లో చాలా తేడా ఉంది కనుక ఇది నిజం కాదన్నారు శ్రీ అనుభవానందులు.

కాశీలో మణికర్ణికా క్షేత్రం లో శంకరులు ఉండగా అక్కడే ఉంటున్న విశ్వనాథాధ్వరి కొడుకు కలానాథుడు శంకర దర్శనం చేసి, మనోహరమైన తోటక వృత్తాలతో గానం చేసి, శుశ్రూష చేసి శిష్యుడై, సన్యాసం తీసుకొని తోటకాచార్యునిగా పిలువబడ్డాడు. ఇతడి పూర్వనామం గిరిలేక ఆనంద గిరి. ఇతడు శంకర భాష్యపాఠాలకు,ఆలస్యంగా వచ్చినా అతడికోసం ఆగి, వచ్చాకనే చెప్పేవారు. అతడు మందమతి అతడికోసం ఎదురు చూడటం దండగ అని ఇతర శిష్యులు ఫిర్యాదు చేయగా, అతనిపైప్రత్యేక దయ చూపించి అనుగ్రహించగా క్రితం సారి చెప్పిన పాఠాలను తోటక వృత్తం లో శ్లోకాలుగాచేప్పి అందర్నీ విస్మయానంద భరితుల్ని చేశాడు. ఈవిధంగా పద్మపాద సురేశ్వర, హస్తామలక, తోటకాచార్యుడు అనే నలుగురు ముఖ్య శిష్యులు ఏర్పడ్డారు.

తర్వాత దక్షిణాభి ముఖంగా ప్రయాణించి,తుంగభద్రానదీ తీరం చేరి, అక్కడి ప్రకృతి సౌందర్యం, ప్రశాంత వాతావరణానికి సంతోషించి శంకరులు ఆనందంతో అక్కడ శృంగేరి లో ఒక మఠాన్ని స్థాపించి, అందులో శారదా దేవిని ప్రతిష్టించి, వీర సేనమహారాజు సాయంతో దేవాలయం నిర్మించి, అఖండ విద్వత్ వరుడైన సురేశ్వరుని పీఠాధిపతి గా నియోగించారు.

అప్పటికే తాను రాసిన భాష్యాది గ్రంథాలు అందరూ అర్ధం చేసుకోవటానికి కష్టంగా ఉన్నాయని గ్రహించిన శంకరులు వాటికీ వివరాలు అవసరమని భావించారు. ఒక రోజు శిష్యులను పిలిచి, తన సంకల్పం చెప్పి, తన రచనలలో మణిపూస లాంటి" బ్రహ్మ సూత్ర భాష్యం "కు వార్తికం రాయమని సురేశ్వరునికి అప్పగించారు. మిగిలినవారికీ పనులు అప్పగించారు. కానీ సురేశ్వరుడు సమర్దుడుకాదని అతడు కర్మిష్టి అనీ గురువుకు విన్నవించారు. ఏక భావం రానందున పద్మ పాడునికి ఆబధ్యత అప్పగించి, సురేశ్వరునికి బృహదారణ్యకం మొదలైన వాటికి వార్తికాలు రాయమన్నారు.అతడు వాటిని రాసి చూపించి అంగీకారం పొందగా శంకరులు అతడిని ఒక అద్వైత రచన చేయమని ఆదేశించారు. అతి తక్కువకాలం లోనే "నైష్కర్మ సిద్ధి "అనే గ్రంథాన్నిరాసి అద్వైత భావ గరిమతో శంకరుని మనసు దోచుకొన్నాడు.

పూర్వం కాశీలో పద్మపాదుడు ప్రభాకరుని మీమాంసా శాస్త్రంను అధ్యయనం చేసిన వాడు అవటం చేత, దాన్ని అనేకరకాలుగా ఖండిస్తూ భాష్య వివరణం రాశాడు. గుర్వాజ్ఞతోదాన్ని తీసుకొని తన స్వగ్రామం చిదంబరం,అక్కడినుంచి రామేశ్వరం దర్శించాలని బయల్దేరి చిదంబరం లో పిన తండ్రి ఇంట్లో ఉంచి వెళ్ళగా, అతడు ప్రభాకరుని అభిమాని అవటం తో దాన్ని తగలబెట్టాడు అసూయతో. యాత్రనుంచి తిరిగివచ్చి తనగ్రంధం విషయం అడిగితె అకస్మాత్తుగా జరిగిన అగ్ని ప్రమాదం లో దహనం చెందిందని మొసలి కన్నీరు కార్చాడు పినతండ్రి. దుఖభారంతో శృంగేరిలో ఉన్న శంకర గురువును దర్శించి జరిగినది వివరించాడు. శిష్యుని ఓదార్చి పూర్వం ఆగ్రంథాన్ని తనకు చదివి వినిపించాడు కనుక దాన్ని స్మరించి అయిదు పాదాలు

మాత్రమె చెప్పగా పద్మపాదుడు మళ్ళీ రాసి లోకానికి అందించాడు, అది "పంచపాదికా వివరణం "అనే పేరుతొ లోక ప్రసిద్ధమైనా ఇప్పుడు అదీ దొరకక బ్రహ్మ సూత్రాలలో మొదటి సూత్రాచతుష్టయం లో మాత్రమె పద్మపాదుని వివరణ మిగిలి ఉంది. ఇందులో శంకర అధ్యాస భాష్యం చాలా విపులంగా ఉండి,దీనికి అనేక వృత్తులు,టీకలు కలిగి ప్రఖ్యాతి పొందింది. ఇదే శంకర భాష్యానికి మొదటి వివరణ గ్రంధం మాత్రమేకాదు శంకరుని ప్రియశిష్యుడు పద్మపాదాచార్య కృతం కూడా .

## శంకరుల మాతృమూర్తి ఆర్యాంబ మరణం

శంకరులు శృంగేరిలో ఉండగానే తల్లి అవసాన దశ లో ఉన్నదని గ్రహించారు. కానీ బృహత్ శంకర విజయం లో శంకరులు గోవింద భాగవత్పాదులవద్ద తురీయ ఆశ్రమమం తీసుకొని, బదరీ కైలాసాలు దర్శించి మళ్ళీ బదరిని చేరాక తల్లి అనారోగ్యం తెలిసింది అని ఉన్నది. అగ్ని శర్మ అనే బంధువు శంకరుని తల్లి సందేశాన్ని తెలియ జేయగా, చిత్సుఖా చార్యునితో కలిసి శంకరులు స్వగ్రామం కాలడి చేరారు, విద్యారణ్య రచన ప్రకారం శృంగేరి స్థాపన తర్వాతనే తల్లి మరణం జరిగిందని ఉంది. ఇంటికి వెళ్లి తల్లికి సేవలు చేసి, ఆమెనిత్యం నదీ స్నానానికి వెళ్ళలేని స్థితి గమనించి తపోశక్తి తో పూర్ణానది దిశమార్చి తనింటి ముందు ప్రవహించేట్లు చేశారు. అప్పటినుంచి అది "అంబా నది "పేరుతొ పిలువబడింది.అవసాన దశలో తనకు తత్వోపదేశం చేయమని కుమారుని కోరితే, శంకరులు "తత్వ బోధ "అనే గ్రంథం రాసి, బోధించటం మొదలుపెడితే ఆమెకు అర్ధంకాక ఇంకొంచెం సులభంగా చేసి చెప్పమని కోరితే, శ్రీ కృష్ణ పరమైన శ్లోకాలు రాసి వివరించారు. భగవధ్యానం తో తన్మయురాలై ఆర్యాంబ తనువు చాలించింది. పూర్వాశ్రమ బంధువులను పిలిచి, తాను తల్లికి చేసే దహన సంస్కారాలకు ఆహ్వానించగా, వాళ్ళంతా బహిష్కరించారు.శంకరుడు తల్లికిచ్చిన వాగ్దానం నెరవేర్చాలని కృత నిశ్చయంతో ఉంటె, సన్యాసి దహన సంస్కారాలకు అర్హుడు కాదని వారు వాదించి భీష్మించారు. ఈ విధంగా సి.ఎన్. కృష్ణస్వామి అయ్యర్ చెప్పినట్లు "Shankara failed to become a prophet in his own land " స్వస్థలం లో" జగద్గురువు" అని పించుకోలేక పోయిన శంకరులు, తల్లిని స్మశానానికి ఒక్కడే తీసుకు వెళ్ళలేక, తన ఇంటి ఆవరణ లోనే ఒకమూల తల్లిపార్ధివ దేహానికి దహన సంస్కారం చేయాల్సి వచ్చింది. ఉత్తర క్రియలనూ యధావిధిగా నిర్వహించారు. విద్యారణ్య శంకర విజయం ప్రకారం అప్పుడు శంకరులతో పాటు ఒక్కశిష్యుడు కూడా లేడు.వెంట వచ్చిన చిత్సుఖా చార్యుడు ఏమయ్యాడో తెలియదు. గత్యంతరం లేక తల్లి దేహాన్ని ముక్కలు ముక్కలుగా ఖండించి, సమిధలు కూడా లేకపోవటం చేత ఎండిన అరటి ఆకులతో అగ్ని సంస్కారం చేసినట్లు తెలుస్తోంది. అందుకనే బంధువులమీద విపరీతమైన కోపం వచ్చి శపించటం చేత అప్పటినుంచీ దేశం లో శవదహనాలు తమ ఇంటి ప్రాంగణం లోనే నిర్వర్తిస్తున్నారు. శవం పై కత్తితో అక్కడక్కడ గాయాలు చేసి మరీ దహనం చేస్తున్నారని కృష్ణస్వామి అయ్యర్ ఉవాచ . "మాతృమూర్తిపై ఉన్న ప్రేమాతిశయాలతో ఎన్ని ప్రతిబంధాలు ఏర్పడినా, శాస్త్రం నిషేధించినా, ఆప్తులు బహిష్కరించినా, తల్లిప్రేమ ముందు ఇవన్నీ తృణప్రాయంగా భావించి, తల్లి

అంత్యక్రియలు నిర్వహించి తల్లికిచ్చిన మాట నిలబెట్టుకొన్నారు శంకులు. ఆయన సంకల్ప బలం ఎంత అమోఘమో, పట్టుదల ఎలాంటిదో, మనో ధైర్యం ఎంతటి ఉత్కృష్టమైనదో తెలియ జేసే సంఘటన ఇది.అందు చేతనే అతి తక్కువకాలం లో సాధారణ మానవ ప్రజ్ఞకు అందరాని విద్యా వైదుష్యాన్ని సాధించి, పండిత చక్రవర్తులను సునాయాసంగా ఓడించి, రాజాధిరాజుల్ని పాదాక్రాంతుల్ని చేసుకొని, సర్వ శాస్త్రాతీతమై, అనంతమైన అఖండ అద్వైతసిద్ధాంతాన్ని స్థాపించి, తానుకూడా, సామాన్యమానవ ప్రజ్ఞాతీతుడై, అతి దూరుడై, దుర్ఘట సమస్యయై, అతీతుడై, సర్వ ప్రపంచ మానవ కోటికి అలంకారమై శంకర భగవత్పాదులు భాసించారు " అన్న శ్రీ అనుభవానందుల వారి అమృతోపమానమైన వాక్కులు శిరో ధార్యం. ఆయనది ఒక అద్భుత మూర్తిమత్వం, ,అతిమానుషం, దివ్యం.

తల్లి దహన సంస్కారాలు పూర్తి చేసి, శంకరులు మళ్ళీ శృంగేరి చేరారు. పద్మపాదుడు రామేశ్వరయాత్ర పూర్తి చేసుకొని శృంగేరి చేరుకొన్నాడు. శంకరులు దేశ పర్యటన కొనసాగించాలనే సంకల్పంతో తూర్పు తీర దేశాలవైపు బయల్దేరారు. ముందుగా శాక్తేయులకు ఆలవాలమైన కాంచీనగరం చేరారు. కొంతకాలం ఉండి, పరమత సిద్ధాంతాలను ఖండించి, ముఖ్యులను వాదం లో ఓడించి, శిష్యులను చేసుకొని, కామాక్షీ దేవికి ముందుభాగంలో శ్రీ చక్రం స్థాపించి, ఆమెలోని రౌద్రాన్ని తగ్గించి సౌమ్యత్వాన్ని ప్రకటింప జేశారు. ఆమె అనుగ్రహం కోసం తపస్సు చేసి, కృపా సిద్ధిపొంది, హృదయం నిండా అమందానందాన్ని పొందారు. అక్కడినుంచి జంబుకేశ్వరం వెళ్లి, అక్కడి అమ్మవారు అఖిలాండేశ్వరి ఉగ్రరూపాన్ని కూడా సౌమ్యంగా మార్చటానికి శ్రీ చక్రకమలం స్థాపించి ఆమె ఎదురుగా వినాయక విగ్రహం ప్రతిష్టించి జనాలపై పుత్ర వాత్సల్యం కలిగేట్లు చేశారు. అమ్మ అనుగ్రహం పొంది, మధుర వెళ్లి మీనాక్షీ సుందరేశ్వర దర్శనం చేసి, మీనాక్షీదేవిని కొంతకాలం ఉపాసించి అనుగ్రహం సాధించారు. . ఈకాలం లోనే దక్షిణాది రాజుల అండ మెండుగా లభించింది. పరమత ఖండనం చేసి అద్వైత మతస్థాపనాన్ని సుస్థిరం చేసి శృంగేరి పీఠాన్ని సర్వ శక్తి మంతం గావించారు. .

క్రీపూ. 494లో శంకరులు కాలడిలో తల్లి దహన సంస్కారాలుపూర్తిచేసిన సమయం లో నర్మదానదీ తీరంలోని మాంధాత ద్వీపం లో అమరేశ్వరం లో ఉన్న గోవింద భగవత్పాదులు వ్యాధి గ్రస్తులై ఉన్నారని తెలిసి, వెంటనే బయల్దేరి వెళ్లి గురుపాదులను దర్శించి సేవలు చేస్తూ ఉన్నారు శంకరులు. కార్తీక శుద్ధ పౌర్ణమినాడు గోవింద భగవత్పాదులు బ్రహ్మైక్యం చెందారని బృహత్ శంకర విజయం తెలిపింది.

నర్మదా తీరం నుంచి తూర్పున ఉన్న పూరీ జగన్నాధ క్షేత్రం చేరి, కొంతకాలం ఉండి మఠ స్థాపన చేసి" గోవర్ధన మఠం "అని పేరుపెట్టారు. సేతు రామేశ్వరం నుంచి ప్రారంభమైన ఈ తూర్పు దేశ యాత్ర లో ద్రవిడ,పాండ్య, చోళ, ఆంధ్ర రాజ్యాలలో ఉన్న క్షేత్రాలను విద్యాస్థానాలను దర్శిస్తూ, రామేశ్వర మధుర, శ్రీరంగం, కంచి వేంకటాచల, జగన్నాధాది క్షేత్రాలను దర్శించి, ఆయా దేవతల అనుగ్రహం పొంది శంకరులు విదర్భ దేశం ప్రవేశించారు.

విదర్భనుంచి కర్నాటకం వెళ్లి అక్కడి కాపాలిక నాయకుడు శ్రీకచుడు మొదలైనవారిని వాదం లో ఓడించి, భూకైలాసం అనబడే గోకర్ణ క్షేత్రం చేరి, అక్కడినుంచి సౌరాష్ట్ర దేశం వెళ్ళారు. అక్కడి రాజు సుధన్వుడు పూర్వం జైన బౌద్ధమతావలంబి అయినా, కుమారిలభట్టు ప్రభావంతో వైదిక మతావలంబి అయ్యాడని పూర్వమే చెప్పుకొన్నాం. సుధన్వుడిని అద్వైతానికి మార్చి, అతని ప్రోత్సాహంతో శ్రీకృష్ణ ద్వారకలో ఒక మఠం స్థాపించి "శారదా పీఠం"అని పేరుపెట్టారు. రాజు సుధన్వుడు శంకరుల వెంట నడుస్తూ అద్వైత వ్యాప్తికి గొప్ప కృషి చేసి శంకరాభిమానం పొందాడు. ఎందరో రాజులు శంకరులకుసహాయం చేసినా సుధన్వుడి ని మాత్రమె ఆదర్శ ప్రభువు గా గ్రంథాలు పేర్కొన్నాయి. శంకరాచార్యులు కూడా అతడిని అమరుడిని చేయటం ఆరాజు గొప్ప అదృష్టం.

ద్వారకలో శారదా పీఠం నెలకొల్పి, అక్కడి నుంచి మధ్యభారతం లో ఉన్న ఉజ్జయిని చేరి, గంగాతీరం వెంట ప్రయాణించి భట్టభాస్కరాదులను జయించి, కాశ్మీర్ సర్వజ్ఞ పీఠం విషయం విని, దాన్ని అధిష్టించాలని శ్రీ శంకరులు కాశ్మీరం చేరారు. అక్కడున్న ఒక దేవాలయానికి నాలుగు వైపులా నాలుగు ద్వారాలున్నాయి. ఒక్క దక్షిణ ద్వారం మాత్రం సరైన సర్వజ్ఞుడైన పండితుడు లేక మూయబడి ఉంది.ఆ ఆలయం చేరి, పరివేష్టించి, సర్వజ్ఞపీఠాన్ని కాపాడుతున్న పండితులు శంకరుల విద్యా పాటవం పై పలు ప్రశ్నలు సంధించగా, అన్నిటికీ సమాధానాలు సంతృప్తిగా చెప్పి, వారు పూర్తిగా సమర్ధించగా ఆలయ ప్రవేశం చేశారు. కానీ దక్షిణ ద్వారం దగ్గరకురాగానే సరస్వతీ దేవి సాక్షాత్కరించి సర్వజ్ఞత్వమే కాక బ్రహ్మ చర్యం కూడా పీఠాధి రోహణకు ముఖ్యమని, తన పూర్వ కర్మలను ఒకసారి గుర్తుకు తెచ్చుకొని నిరూపించుకోమని కోరింది. తాను అమరుక దేహంలో ప్రవేశించిన విషయం పై అడిగిన విషయంగాతెలుసుకొని, అది జరిగింది అమరుక శరీరంలోనే కానీ శంకర దేహం లో కాదని సమర్ధించుకోగా శారదామాత ఆ సమాధానానికి సంతోషించి సంతృప్తి చెంది శంకరులు సర్వవిధాలా స్సర్వజ్ఞ శారదా పీఠం అది రోహించటానికి పూర్తిగా అర్హుడే అని తీర్పు చెప్పగా, పండితులందరి హర్షధ్వానాలమధ్య శ్రీ శంకర భగవత్పాదులు కాశ్మీర సర్వజ్ఞ శారదా పీఠం అధిష్టించి దక్షిణ భారత దేశానికే కాక యావద్భారతదేశానికీ అపూర్వ గౌరవాన్ని కల్గించారు అని ఆనంద గిరి మొదలైన వారు రాశారు. కానీ ప్రమాణాలు సరిగ్గాలేవు అంటారు శ్రీ అనుభవానందులు.

కాశ్మీర రాజధాని శ్రీనగర్ లో శంకరాచార్యులకు ఒక ప్రాచీన దేవాలయం 100 అడుగుల ఎత్తున ఉన్న కొండపై ఇప్పటికీ ఉన్నది. శంకర సర్వజ్ఞ పీఠాదిరోహణ గాథ విన్న, తెలుసుకొన్న గోపాదిత్యుడు అనే రాజు క్రీ.పూ.36-306మధ్యలో శంకర ఆధ్యాత్మిక జ్ఞాన చేతనత్వం అందరికీ తెలియ జేయటానికి ఆ శంకరాలయం నిర్మించాడని డా.పి.ఘ్వాషాలాల్ తన "ఎ షార్ట్ హిస్టరీ ఆఫ్ కాశ్మీర్ "లో రాశాడు. కాలక్రమం లో ఈ ఆలయం శిథిలమై పోగా, జైన్ ఉల్ అబ్దిన్అనే మహమ్మదీయ రాజు దాన్ని పునరుద్ధరించాడని ఆ ఆలయంలో శాసనాలున్నట్లు 17-7-1949 ది హిందూ పత్రిక ప్రచురించింది.

చేయాల్సిన పని ఇంకా కొంత మిగిలి ఉందని భావించి,దాన్ని సాఫల్యం చేయటానికి నిశ్చయించి, శంకరులు, కాశ్మీర్ నుంచి కామరూప దేశం అని పిలువబడే పూర్తిగా శాక్తేయులతో నిండి ఉన్న అస్సాం వెళ్ళారు . అక్కడ వారి నాయకుడు అభినవ గుప్త అసాధారణ ప్రజ్ఞా పాటవాలు కలవాడు. శంకరుని ముందు వాదం లో నిలవలేక ఓడిపోయి,ఆచారం ప్రకారం మండనుడు మొదలైన ఇతర సిద్ధాంతుల్లాగా శంకరుని అనుసరించి, సన్యాసం తీసుకోక పోయినా, అద్వైతాన్ని అనుసరించక, కుయుక్తి పన్ని శంకరునిపై ప్రయోగం చేసి తీవ్రమూల వ్యాధి పాలు చేసి పాపి అయ్యాడు. ఆవ్యాధితో నిరంతర రక్త స్రావముతో శంకరులు విపరీతమైన బాధ పొందారు. వైద్య చికిత్స చేసినా ఫలితం కనిపించలేదు. పద్మపాదుడు ఆచార్యునిపై ఎవరో విష ప్రయోగం చేశారని అవగాహన చేసుకొని, అది అభినవ గుప్తుడి పరాభవ ప్రతీకారమే అని తెలుసుకొని, ఆతడిపైనే మళ్ళీ ప్రయోగం చేయగా శంకరుని ఆరోగ్యం కుదుటబడి ఆ వ్యాధి అభినవ గుప్తుడిలో ప్రవేశించి ప్రాణం తీసింది.

అస్సాం నుంచి నేపాల దేశం చేరి, అనేక ప్రదేశాలలో పర్యటించి, అక్కడి రాజు వృష సేన వర్మకు అతిధిగా ఉంటూ, అద్వైత మత వ్యాప్తి చేసి, . శంకరానుగ్రహం తో జన్మించిన తనకుమారునికి వృష వర్మ శంకరవర్మ అనే పేరు పెట్టుకొన్నాడు తర్వాత శంకరులు బదరికాశ్రమం చేరారు.నేపాల చరిత్రలో శంకరులు ఆ దేశానికి క్రీ.పూ.488-487లో వచ్చినట్లు లిఖింపబడి ఉంది.

## శ్రీ శంకరుల బ్రహ్మైక్యం

బదరీ క్షేత్రాన్ని చేరిన శంకరులకు అస్సాం లో సంక్రమించిన వ్యాధి పూర్తిగా నివారణ కాక చాలా ఇబ్బంది పడ్డారు. శిష్యులకు భాష్యం బోధించటం నిర్విరామంగా చేస్తూనే ఉన్నారు. తమ చే స్థాపింపబడిన పీఠాలు శృంగేరికి సురేశ్వరాచార్యులను, ద్వారకకు హస్తామలకా చార్యుని, జగన్నాధగోవర్ధన పీఠానికిపద్మపాదా చార్యులను, బదరీ జ్యోతిర్మఠానికి తోటకాచార్యులను నియమించి, వాటి నిర్వహణకు నిబంధనావళి తయారు చేయించారు. విశ్రాంతి తీసుకోవటానికి బదరి నుంచి కేదార క్షేత్రం చేరారు. అక్కడి శీతల బాధ నివారణకోసం ఉష్ణోదక గుండాన్ని నిర్మించారు. తమ 32వ ఏట కలియుగం 2625అంటే క్రీ.పూ.477 శ్రీ రక్తాక్షినామ సంవత్సర వైశాఖ శుద్ధ ఏకాదశి నాడు శ్రీ శంకర భగవత్పాదులు బ్రహ్మైక్యం చెందారు అని మాధవ విద్యారణ్య శంకర విజయం లో ఉన్నది.

కాని "గురువంశ కావ్యం" ప్రకారం శంకరులు బదరికాశ్రమం లో ఉండగానే, దత్తాత్రేయ మహర్షి ఆనందించి శంకరుని దగ్గరకు వచ్చి తన గుహలోనికి తీసుకు వెళ్ళినట్లు మాత్రం ఉంది కానీ శంకర నిర్యాణ విషయం చెప్పబడ లేదు. చిత్సుఖాచార్యుని బృహత్ శంకర విజయం, ఆనందగిరి కృత శంకర విజయం, లలో శంకరులు దేశ పర్యటన పూర్తి చేసి కాంచీపురం వచ్చి అక్కడే సిద్ధిపొందారని ఉన్నది. కంచిలో కామాక్షీ దేవి ప్రతిష్టచేసి, ,ఆనగరం లో పండిత ప్రకాండులు వెంటరాగా, వేద ఘోష మిన్నంటుతుండగా శ్రీ రాజ రాజేశ్వరీ

సన్నిధానం లో శ్రీ సర్వజ్ఞ పీఠంఅధిరోహించారు. ఇదే తర్వాత కామకోటి పీఠం గా ప్రసిద్ధి చెందింది. ఈ కంచికామకోటి పీఠానికి"సర్వజ్ఞాత్ముని "ఆచార్యునిగా నియమించారు. తర్వాత కాలం లో కామాక్షీ అమ్మవారి ఆలయం లో బ్రహ్మనిష్ఠ పూని శంకరులు, బ్రహ్మైక్యం చెందారని బృహత్ శంకర విజయం చెప్పింది. దీనికి ప్రమాణం ఆలయంలోని శంకరుల శిలా విగ్రహం ఉంది అంటారు. ఇది బలీయమైన ఆధారం కాదన్నా రు శ్రీశ్రేష్టులూరి కృష్ణస్వామయ్య తమ "జగద్గురు శంకరాచార్య చరిత్రం "లో. ఇప్పటికీ శంకర నిర్యాణ ప్రదేశం నిర్ధారణకాలేదు జగద్గురువై, ప్రజ్ఞా శక్తియై, జగత్ ఉద్ధరణ చేసిన అద్భుత పవిత్ర మూర్తి శ్రీ శంకర భగవత్పాదులకుఉచితమైన స్మారక చిహ్నాన్ని నిర్మించటం అత్యావశ్యకం అని సుమారు అరవై ఏళ్ళ క్రితం ద్వారకా పీఠాధిపతి దేశం లోని పండితులందరికి శ్రీముఖం పంపారు, అలాగే ఉత్తర ప్రదేశ్ ముఖ్యమంత్రి డా.సంపూర్ణానంద్ చేసిన కృషి కూడా అభినందనీయం "అన్నా రు శ్రీ అనుభవానంద స్వామి.

"The greatest expositor of the Upanishads "ఉపనిషత్తులకు ఉన్నతోన్నత వ్యాఖ్యాత అని పేరుపొందినవారు శంకరులు అన్నాడు డా.ఆర్చి బాల్డ్ ఎడ్వర్డ్ తన "దిఫిలాసఫీ ఆఫ్ ఉపనిషద్స్"లో " అనాదిగా ఉన్న అవిద్యా ప్రాబల్యాన్ని, అహంకారాన్ని రూపుమాపి,అసంఖ్యాక మానవ కోటి నిజతత్వ పరిశీలన తో సర్వ పరిమిత, సంకుచిత్వాదులకు అతీతమైన, "అఖండానంత బ్రహ్మ రూపం తానే "అనే పరమార్ధాన్ని, స్థూలత్వ, పశుత్వాది లక్షణాలను, అగోచరత్వాది సర్వ విలక్షణ సంస్థితి నొందించ టానికి జన్మించి, శ్రమించి, తపించి, సంకల్ప సిద్ధిని సాధించిన జగద్గురువులు శ్రీ ఆది శంకర భాగవత్పాదా చార్యుల సన్మూర్తి స్థూల దేహాన్ని త్యజించినా, అనంత ముముక్షు హృదయాలను వికసింప జేసి, ప్రకాశింప జేసి, ప్రకాశిస్తూనే ఉంటారు. అందు చేత ఆయన మూర్తి నాటికీ నేటికీ నవ యౌవనమై, కుశలమై, తేజో పూర్ణమై,శుద్ధమై, జరామరణ దూరమై, అద్భుతమై వెలుగొందుతూనే ఉన్నది. అలాంటి పరమ పావన మూర్తికి, సర్వ బంధ విచ్చేద కోపాయ ప్రదాతకు, త్రాత కు నమ్ర నమోవాకాలు., శ్రేష్ఠ సాష్టాంగ దండ ప్రణామాలు, సర్వార్పణం "అని పులకిత గాత్రం తో పలికిన శ్రీ అనుభావానంద స్వామికి శత సహస్ర వందనాలు.

"సర్వతంత్ర స్వతంత్రాయ సదాత్మా ద్వైత వేదినే –శ్రీమతే శంకరార్యాయ  వేదాంత గురవే నమః "(విద్యారణ్యులు )

అద్వైత భాస్కరులు ఆది శంకరాచార్య

శ్రీశంకర సాహిత్యం

''శ్రీ శంకరుని గూర్చి ఏం చెప్పగలం?పరమ పావన ఉదకాలై, పర్వతం నుంచి జాలువారే నిత్య స్రవంతులుగా ఉపనిషత్తులకు, మిక్కిలి ప్రశాంత అరణ్య సరోవరమైన భగవద్గీతకు, చివరికి అగాధ కాసారమైన బ్రహ్మసూత్ర భాష్యాలకు, తన కరుణామయ ప్రజ్ఞా సంపదనుంచి వివేక చూడామణిని, కాల మత్సరం అనే మలినం నుంచి కాపాడిన ధర్మపాలకుడు శంకరులు ''అని పొంగిపోయి కీర్తించాడు డా.చార్లెస్ జాన్సన్ తన ''శంకరాచార్య ఆఫ్ ఎస్.ఎస్.ఎస్. శాస్త్రి పుస్తకం లో. వేదాంతార్ధ రస సంరక్షకుడై, భారతీయ తత్వ శాస్త్ర నిర్మాతలలో అతి ముఖ్యుడై, తాను ఆ ఆధ్యాత్మిక ఆనందం లో మునిగి ఉండే సాధరనానుభవజ్ఞుడి లాగా ఉండిపోయే తృప్తి పొందకుండా, ఆ ఆనంద విభూతులను అసాధారణ ప్రజ్ఞతో శ్రుతి,యుక్తి, అనుభవ బద్ధం చేసి, శ్రుతులకు ఆధారాలుగా ఉపనిషత్తుల భాష్యం రాసి, అనుభవ సారంతో భగవద్గీతకు భాష్యాన్ని అందరికి ఉపయోగపడేట్లుగా రచించారు శంకరులు ''అని కొనియాడాడు జి.తిబౌట్.ఆయన మాట ప్రకారం శంకరులు ''Un doubtedly occupies high rank ''నిస్సందేహంగా శంకరులు అత్యున్నతస్థానం ఆక్రమించారు.

''Bewitching and marvelous and simple. It is at once the language of the child, and the philosopher is one ''శంకరులశైలి సమ్మోహనమై అద్భుతమై స్పష్టంగా శిశు భాష లాగా, తత్వ వేత్త భాష తో ఏకమై ఉండటం చేత అత్యంత ప్రశస్తి పొందాయి ఆయన రచనలు ''అన్నాడు సి యెన్ కృష్ణస్వామి అయ్యర్. చిత్త సంస్థితి కి శైలిసే భావిస్తే అది శంకరునిలో పుష్కలం. అత్యున్నత భావాలను అతి సులభభాషలో చెప్పటం లో బహు నేర్పరి ఆయన. ఏ దృష్టి తో చూసినా, ఆయన రచనలు కొద్దిగా చదివినా, ఆయన శ్లోకాలు విన్నా, అది అరుదైన అదృష్టమే ''అంటాడు కృష్ణస్వామి అయ్యర్. ''ఆయన రచనలు కేవలం యుక్తి యుక్తంగా మాత్రమె గాక, ''but rather that of a scientific treatise ''అవి శాస్త్రీయ రచనలు నిగూఢాలు,.కాని ఆయన వివరణం స్పష్టం తేట తెల్లం ""clear and transparent ''అని మెచ్చాడు మాక్డోనాల్డ్ పండితుడు. ''In clearness of vision, singleness f purpose, clarity and depth of the style of expression few if any can rival Shankara, while none has excelled him '' ఆయన భాష్యం ప్రసన్న గంభీరం. విస్పష్ట దృక్పధం లో, ఏకీ కృత సంకల్పం లో, శైలిలో ఉన్న అగాధత్వం,స్పష్టత్వంలలో కొందరు ఆయనతో పోటీ పడవచ్చుకానీ, ఎవ్వరూ ఆయన్ను మించిపోలేరు. ఈరాచనా విధానానికి అనుకూలం గా, ఇతరులు తమ జీవితాలను ప్రారంభించని లేత ప్రాయం లోనే సర్వ సంగ త్యాగం చేసి, ,తన జీవిత కార్యాన్ని ముగించిన ఆ లేత యవ్వన సన్యాసి కి అద్భుత ఆకర్షణ శక్తి ఉన్నది ''అన్నారు ప్రొఫెసర్ సూర్యనారాయణ శాస్త్రి గారు.

శంకరుల రచనలను 1-భాష్యాలు 2-ప్రకరణాలు 3-స్తోత్రాలు గా విభజించవచ్చు. వీటికి కాల నిర్ణయం చేయటం చాలా కష్టం. దీనిపై పండితులు అనేక ఊహాగానాలు చేశారు. దాని ప్రకారం శంకరుల విష్ణు సహస్రనామ భాష్యం అన్నిటికంటే ముందురాశారు. భగవద్గీతా భాష్యం చివరకు రాశారు. కానీ అది ఉచితం కాదు స్తోత్ర రచనలతో ప్రారంభించి, క్రమంగా ప్రకరణ భాష్య రచనలు చేశారు అని భావించటం సరైనది అన్నారు శ్రీ అనుభవానంద స్వామి.

## శ్రీ శంకర భాష్య గ్రంథాలు

''ఈశ కేన కఠప్రశ్న ముండ,మాండుక్య తిత్తిరః-ఐతరేయం చ ఛాందోగ్యం,బృహదారణ్యకం దశః ''అని 10 ముఖ్యమైన ఉపనిషత్తులున్నాయని ముక్తికోపనిషత్ చెప్పింది. ఇవికాక నృసింహ తాపిన్యుప నిషత్తు శ్వేతాశ్వరోపనిషత్తు, సనత్సుజాతీయం, ఆధ్యాత్మ పటలం, హస్తామలకీయం, విష్ణు సహస్రనామం, లలితా త్రిశతి, బ్రహ్మ సూత్ర శారీరకం, భగవద్గీత అనే మొత్తం 19గ్రంథాలకు శంకరులు భాష్యాలు రాశారు. ఇందులో 1-రూఢిగాశంకర రచనలు 2-సంశయాస్పదాలు 3-ఇతరాలు అని ఉన్నాయని ఎస్ కే బెల్వార్కర్ పండితుడు తెలిపాడు. బ్రహ్మ సూత్ర, దశోపనిషత్,గీతా భాష్యాలు శంకరులు రాసినవే అని గట్టిగా భావించాడు. కానీ ఉపనిషత్ భాష్యాల విషయాలపై కొంత సందేహం ఉంది. శంకరులు మొత్తం 108ఉపనిషత్తులకు భాష్యం రాయలేదు. వాటిలో దశోప నిషత్తులకు మాత్రం భాష్యం రాశారు. శ్వేతాశ్వతర, నృసింహ తాపీనులకు రాసి ఉండరని ఆతర్వాత వారు రాసి ఆయనపెరుపెట్టారని ఊహించాడు. మాండూక్యకారికా భాష్యం కూడా శంకర కృతం కాదన్నాడు. కారణం భాష్యరచనంలో తేడా ఉండటం అన్నాడు. కానీ ఇంతమాత్రం చేత ఇవి శంకర రచనలు కాదనటం సముచితం కాదన్నారు శ్రీ అనుభవానందులు. అద్వైతం లో పూర్వ ఆచార్యుల భావాలను శంకరులు ఉపయోగించుకొన్నారు. శంకరులు రాయలేదని 31 గ్రంధాలను బెల్వార్కర్ త్రోసి పుచ్చాడు. సాంఖ్యయోగ సంబంధం వాత్సాయన కామశాస్త్రం, అమరుక శతకం శంకరకృతం కాదంటాడు.

శంకర భాష్య రచనా విధానం తర్వాత తెలుసుకొందాం

ఆధారం –శ్రీ అనుభవానంద స్వామి వారి "సర్వ సిద్ధాంత సౌరభం "

## అద్వైత భాస్కరులు ఆది శంకరాచార్య

శ్రీ శంకర భాష్యాలు –"సూత్రార్ధో వర్ణతో ఏన సద్దైహ్సూత్రాను సారిభిః స్వవచనాని వర్ణ్యతే భాష్యం-భాష్య విదోవిదుః"స్వంతవాక్యాల సూత్రాభి ప్రాయాలను అనుసరించి, సూత్రార్ధాన్ని వర్ణించేది భాష్యం అని భాష్యజ్ఞుల అభిప్రాయం. అంటే గ్రంథం లో ఉన్న భావాన్ని తనమాటలతో వర్ణించి, అందులో స్వంతభావాలను చెప్పటమే భాష్యం. తన ప్రత్యేకభావాలు, అనుభూతి నుంచి వాటి నిరూపణకోసం వేదోక్తులను ఉపయోగించటం కూడా భాష్యమే. రచయిత స్వతంత్ర వ్యక్తిత్వం నిరూపించబడాలి. భాష్య రచనచేసిన భగవత్పాదులకు తత్వ శాస్త్ర వేత్తలలో ఉన్నత స్థానం ఉన్నది. "Philosophers greatness lies in two things, originality of subject matter and the critical method of presentation "విషయ స్వాపేక్షిత్వానికి, ఉక్తి రచనా విధానానికీ తత్వ వేత్తల గొప్పతనం ఇమిడి ఉండినట్లేశంకరులు కొన్ని స్వతంత్ర భావాలు కలిగి ఉండి,వాటిని శాస్త్రాదులలోనూ చూసి, ,ఉప్పొంగి, గురు సాన్నిధ్యం లో తపో కృషి వలన వాటిని స్థిరం చేసుకొని వాటికి అనుగుణంగా బోధించి రచించటం వలన ఆయన ప్రపంచ తత్వ వేత్తలలో అగ్రగణ్యులు అనటం సముచితం "అన్నారు మాహానామ వ్రతబ్రహ్మచారి తమ "కళ్యాణ కల్ప తరు "లో. శ్రుతి ప్రమాణాలను విరివిగా

చూపించటం,తనభావాలను సమర్ధించే పూర్వ గ్రంథ ఆచార్యులకు తన కృతజ్ఞత చెప్పటం వలన తాను వేద తాత్పర్యాన్నే బోధిస్తున్నానని, శంకరులు సప్రమాణంగా చూపించారు ''అని డా. ధ్రుపద్‌ఎస్ దేశాయ్ ''ప్రబుద్ధ భారత''లో రాశాడు. అందుకే అతి తక్కువ కాలం లోనే వేదవేదాంగాధ్యయనం పూర్తి చేసి, తన సంస్కారానికి అనువైన అద్వైతాన్ని వాటిని నుంచి గ్రహించి, గోవింద భగవత్పాద గురువుల సన్నిధానం లో దాన్ని పెంచి పోషించి, అంతగా విజృంభించ గలిగారాయన. అందుకే అద్వైత వాదం వైదికమై, ఉపనిషత్ ప్రబోధకమై ఉంటూ,దాన్ని లోకం లో ప్రసరిప జేసిన శంకరుల వ్యక్తిత్వం ఆయా శాస్త్రాల్ని కప్పి పుచ్చి, తానె దాని కర్త అయినట్లు విపర్యయ జ్ఞానాన్ని, అజాగ్రత్ ప్రజ్ఞులలో కలుగ జేసింది ''అంటారు అనుభవానందులు.

'' ఉపనిషత్తులలో అనేకరీతులుగా ఉన్న విషయాన్ని ''A consistent philosophical system 'ఒక సుస్థిర తత్వ సిద్ధాంతంగా ' నిర్మించటం అంత సులభమైన పనికాదు ''అంటాడు ప్రొఫెసర్ పాల్ దేవ్ సేన్. అయినా జీవులకు హిమాలయమ అనీ, నిత్యాలని పేరుపొందిన భారతీయ ఆధ్యాత్మిక తత్వ సారాలైన ఉపనిషత్తులనే ప్రధానంగాతీసుకొని,వాటికి అనుగుణంగా సమన్వయాలు చేసి,ఒక విశిష్ట సిద్ధాంతాన్ని శంకరాచార్య రూపొందించారు. గౌడ పాదుడు అద్వైత సిద్ధాంత గ్రంథాలు రాసినా, శంకరులే తన సర్వకాల, సర్వావస్థ సర్వ శక్తులను అద్వైత సిద్ధాంత నిర్మాణానికి ఉపయోగించి, పూర్వ విషయాలను అను సంధించి మహోద్భుత సిద్ధాంత నిర్మాణం చేశారు, ''అందుచేతనే ''We must admit without hesitation that Sankara's doctrine faithfully represents the prevailing teachings of the Upanishads ''ఉపనిషత్ బోధలను అనుసరించేశంకర వాదం ఉంది అని నిస్సందేహంగా చెప్పవచ్చు అన్నాడు ప్రముఖ వేదాంతి, పండితుడు డా.జార్జి తిబౌట్. శంకరవాదం అత్యంత మృదువుగా వివిధ సిద్ధాంతాల సమన్వయంగాఉంది అంటూ ''Its fundamental doctrines are manifestly in greater harmony with the essential teachings of Upanishads, than those other systems ''ఇతర సిద్ధాంతాలకంటే ఉపనిషత్తుల ముఖ్య సూత్రాలను, దీని మూల సిద్ధాంతాలు మరింత ఎక్కువగా అనుగుణంగా ఉన్నాయి, శంకర వాద చాతుర్యం అద్భుతమనీ, ''He does more justice to Upanishads ''ఉపనిషత్తులకు అత్యధిక న్యాయం చేకూర్చినవాడుశంకరుడే ''అనీ డా.ఎబి కీత్ పండితుడు –ఏ హిస్టరీ ఆఫ్ సాంస్క్రిట్ లిటరేచర్''లో రాశాడు.

''శంకరుడు దేనికది ప్రత్యేకంగా ఉపనిషత్తులను పరిశీలించి, అక్కడికక్కడే సిద్ధాంత సమన్వయము చేసి, అందులో ఇతర సిద్ధాంత అన్వయం కు కూడా తగినట్లు మంత్రార్థాలను అద్వైతపరంగా ఏకీకృతం చేసినట్లు, పూర్వకాలం లో బాదరాయణ వ్యాసుడు కూడా ఉపనిషత్ వాక్ ఐక్యత ప్రతిపాదన కోసం బ్రహ్మ సూత్ర రచన చేసి ఉంటాడు ''అన్నారు అత్యంత అనుభవంతో శ్రీ అనుభవానందస్వామి..ఇద్దరి గమ్యం ఒక్కటే. శంకర భావ ధారకు వ్యాస తాత్పర్యం విరుద్ధంగా ఉంటె, శంకరులు ఆగ్రంథ ప్రశంస అస్సలు చేసే వారు కాదేమో.

''లఘూని సూచితార్థాని స్వల్పాక్షర ప్రధానిచః  సర్వతః సారభూతాని సూత్రాణ్యా హుర్మనీషిణః''అని భామతిలో చెప్పబడినట్లు స్వల్పాలై, అర్ధ స్ఫూర్తిగా అల్పాక్షర పదాలతో సారభూతాలైన సూత్ర రూపంగా రచించటం చేతనే అవి సామాన్య ప్రజ్ఞకు అతీతంగా ఉన్నాయి.ఈ విధమైన రచనావిధానం ప్రపంచం లో ఒక్క భారత దేశం లో మాత్రమె జన్మించి ప్రావీణ్యత పొందింది ''అని డా.ఎం.వింటర్నిట్జ్ పండితుడు ప్రశంసించాడు. ప్రతి కొత్త మతశాఖ తమ సిద్ధాంతాలకు అనుగుణంగా వ్యాస సూత్రాలకు ఒక కొత్త వ్యాఖ్యానాన్ని ప్రారంభిస్తుంది ''అన్నారు వివేకానంద స్వామి. శంకరాచార్యకాలం లో ''తత్వ విచార'' కర్త ఉమామహేశ్వరుని వాక్యాలను బట్టి 99వ్యాఖ్యానాల ను ఈ వ్యాస సూత్రం లో ఉన్నాయి . అందులో ముఖ్యమైనవి ఉపవర్ష,బోధాయన, భర్తృప్రపంచ, ద్రావిడా చార్య, తంక,గుహదేవ, కపర్ది, భరుచి మొదలైన వారి వ్యాఖ్యానాలు ప్రసిద్ధమైనవి. అందుకే శంకరులు శ్రుతివిరుద్ధమైన కల్పనల నుంచి సూత్రాలను ఉద్ధరించే కార్యక్రమం లో ''భాష్యం ప్రసన్న గంభీరం ''అని వాచస్పతి మిశ్రుడు భామతి లో చెప్పినట్లు శంకరులు సూత్ర భాష్యంరాశారు. శంకరుల సూత్ర భాష్య రచనతో పూర్వ వ్యాఖ్యానాలన్నీ అప్రదానాలై కాలక్రమంలో నశించిపోయాయి. ''సర్వ సూత్ర భాష్య గ్రంధాలకేఅతి ప్రాచీనమై, ''Master piece of Sankaracharya's life''శంకరాచార్య జీవితం లో అది శిరో భూషణమైంది అన్న సోదరి నివేదిత వాక్యం పూజనీయం స్వామి రామతీర్ధ దీన్ని ''The oldest and the best ''సర్వోత్తమ, ప్రాచీన శ్రేష్టం ''అన్నారు. ''His expositions agree in all essentials with the meaning of the Brahma Sutras '' అన్ని ముఖ్య విషయాలలో బ్రహ్మ సూత్రార్థాలకు అనుగుణమైన వివరణం. ఇతర భాష్యాలకంటే శంకర భాష్యమే ''The only true representative of the Sankara's views ''బ్రహ్మసూత్ర కారుడు వ్యాసుని తత్పర్యాలకు సరియైన ప్రతిబింబాలుగా, శంకర భాష్యసూత్రాలు సర్వ ముఖ ప్రశస్తి పొందాయి''అన్నారు స్వామి రామతీర్థ. ''శంకర భాష్యం ఉపనిషత్తులలో బ్రహ్మం అనీ, పరమాత్మ అనీ చెప్పబడే తత్వాన్ని ఖండితంగా సమర్ధించే సనాతన వైదిక మతాన్ని ప్రవచిస్తోంది. ఆయన తాత్విక సిద్ధాంతం భారత దేశం లో పురుడుపోసుకొన్న అనేక సిద్ధాంతాల కంటేఅతి ముఖ్యమైంది. దానిలో ప్రకటింప బడిన '' boldness, depth, subtility of speculation ''ధైర్యం అగాధత్వం సూక్ష్మత్వం ఆలోచనా పటిమ అసాదారణాలు ''అన్నాడు శంకర, రామానుజ భాష్యాలను ఇంగ్లీష్ లోకి అనువదించిన ప్రముఖ సంస్కృత విద్వాంసుడు తిబౌట్ పండితుడు.సూత్రభాష్య ఉపోద్ఘాతం లో అగాధ అధ్యాస భాష్యంచూసి అవాక్కైపోవాల్సిందే అన్నాడు సి. మహాదేవయ్య. ''శంకరుల మేధాశక్తి వ్యాస సూత్రాలలో కాకుండా భాష్యంలోదర్శించవచ్చు '.''ఆయన భాష్యం పూర్వ భాష్యాలను మరుగు పరచి సూక్ష్మ హిందూ చిత్తాలనుకదిలించి ఈనాటికీ ఆశ్చర్య పరుస్తోంది '' ''అన్నాడు ఆచార్య ఎర్నెస్ట్ పి.హార్విట్జ్. నిస్సందేహంగా భాష్య రచనా విధానానికి శంకర భాగవత్పాదులే మిగిలిన వారికి ప్రమాణం అన్నారు శ్రీ అనుభవానందులు.

ఉపనిషత్తులను వ్యాఖ్యానించేటప్పుడు శ్రీ శంకరులు, బాదరాయణ సూత్రాలకు అనుగుణంగా భాష్యం రాయలేదని ప్రొఫెసర్ సురేంద్రనాథ దాస్ గుప్త –ఎ హిస్టరీ ఆఫ్ ఇండియన్ ఫిలాసఫీలో రాశాడు, బాదరాయణుడు అద్వైతి కాదు సగుణ బ్రహ్మవాది అయినా శంకరభాష్యం ''Attained wonderful

celebrity both on account of subtle and deep ideas it contains, and also it contains, and also on account of the association of the illustrious personality of Sankara ''అంటే అందులోని అతి గాఢ,సూక్ష్మ భావజాల ప్రభావం చేత శంకర ప్రఖ్యాత వ్యక్తిత్వ కారణం గా అద్భుత ప్రశస్తి పొందింది అని దాస్ గుప్త అభిప్రాయ పడ్డాడు. ''గ్రంథప్రభావం ఎక్కువగా వ్యక్తి ప్రభావం తాత్కాలికంగా ఉంటుందని అందుకే శంకర వ్యక్త్యాకర్షణ భాష్యం లో ముఖ్యంగా ఉన్నా, అందులోని సారమే సకల జనాలను ఆకర్షించింది. ఉపనిషత్తుల భావ వైవిధ్యాన్ని వ్యాసుడు తొలగించగా, శంకర భాష్యం ఉపనిషత్ ప్రమాణాలై ఉండగా వ్యాసుని భావాలకు విరుద్ధం అనటం తప్పు. ఉపనిషత్ ఆధార సూత్ర గ్రంథాన్ని ఉపనిషద్భాష్య గ్రంథాల ద్వారా రక్షించి, దాని నిర్మల స్థానాన్ని పదిలపరచాడు ''అన్న శ్రీ అనుభావానందుల వాక్యాలు సప్రమాణాలు. అందుకే వివేకానందుడు ''వ్యాస భావాలకు అత్యద్భుత రూపాన్నిచ్చే అసామాన్య ప్రజ్ఞా శక్తి భాష్యకారుడైన శ్రీ శంకరా చార్య మహిమ ''అన్నాడు.

ఈ విధంగా శ్రుతి,యుక్తి ల ననుసరించి ఉపనిషత్ సూత్రాలకు భాష్యం రాసి, అనుభవ భాష్య రచనకోసం ''The most beautiful perhaps the only true philosophical song existing in any known language ''ఏ భాషలోనైనా అత్యంత సుందరమైన బహుశా యదార్ధ తాత్విక గీతం''అని విలియం వాన్ హంవార్ బోల్ట్అని ప్రశంసించిన భగవద్గీతా శాస్త్రాన్ని తీసుకొని శంకరులు భాష్యరచన చేశారు. భగవద్గీత ''is rightly regarded as one of the greatest master piece of Hindu Vedanta ''భారతీయ వేదాంతం లో సర్వోత్తమ శిరో భూషణం ''అన్నాడు దాస్ గుప్తా. ఇందులో కృష్ణ పరమాత్మ స్వానుభవ యుక్తంగా బ్రహ్మ సిద్ధికి ఉపాయాలను ప్రతిపాదించి, దాని ఫలితమైన స్థిత ప్రజ్ఞత్వం మొదలైన సిద్ధి లక్షణాలు బోధించి ''అహం బ్రహ్మాస్మి ''అనే చరమ వృత్తి సూచకంగా ఉన్న అద్వైత అనుభూతికి ముఖ్యమైన ''సగుణ బ్రహ్మైవాహం ''అనే విధంగా తన విరాట్ స్వరూపాన్ని కూడా వ్యక్తపరచి వేదప్రతిపాదితమై,సూత్రాలచేత నిర్ధారితమైన స్థితిని అనుభూతి గా దర్శించటానికి గీతా శాస్త్రాన్ని శంకరులు ఉచితమైనదిగా తోచి, అంతకు ముందు అది ముఖ్యమైనదిగా కాక, ప్రఖ్యాతి పొందక ఏరకమైన భాష్యాలు ఉన్నాయనే ఆధారం లేకపోయినా, శంకరులు దాన్ని గ్రహించి, భాష్యం రాయటం తో అంతకు ముందున్న వాటి కంటే మహా ప్రాముఖ్యం కలిగి, ఆనాటి నుంచి అనేక భాష్య వ్యాఖ్య వివరణలు రాయబడి ప్రపంచ వ్యాప్తి పొంది, అందరి హస్తాలకు ఆభరణమై,సర్వోత్కృష్ట గ్రంథ రాజం గా విరాజిల్లుతోంది. ఇది శంకర హస్త స్పర్శా మహాత్మ్య ఫలితమేమో ?''అని కీర్తించారు శ్రీ అనుభవానందులు. ఈ విధంగా బ్రహ్మ విద్యా శిఖరానికి తీసుకు పోయే ప్రస్థాన త్రయమైన బ్రహ్మ సూత్రా ఉపనిషత్ సూత్రా, గీతా భాష్యాలు మూడింటిని అత్యంత ప్రతిభతో చిత్రించిన శ్రీ శంకర భగవత్పాదులు, తన అద్వైత సిద్ధాంతానికి ఒక అద్భుత రూపాన్ని సృష్టించి, ఆతర్వాత స్వంతరచనలకు శ్రీకారం చుట్టారు.

## శ్రీశంకర ప్రకరణ గ్రంథాలు

''శాస్త్రైక దేశ విషయం, శాస్త్ర కార్యాంతరేస్థితం –ఆహుః ప్రకరణం నామ గ్రంథ భేదం మనీషిణః''-అంటే శాస్త్రం లో చెప్పిన విషయాన్నే కలిగి, ఆశాస్త్రానికి ప్రత్యేకంగా నిర్మించిన గ్రంథమే ప్రకరణం. పూర్వం తన చేత భాష్యగ్రందాలలో ప్రతిపాదింప బడి,లోకం లో స్థిరమైన అద్వైత విషయాలనే ఇంకా సులభంగా అందరికి తెలికగా అర్ధమయ్యేట్లు చెయ్యాలని శ్రీ శంకరులు ఈ ప్రకరణ గ్రంథ రచన చేయాలని సంకల్పించారు. అంతేకాక, భాష్యాలలో తన మనసులోని విషయప్రవచనానికి ఆయా రచనలలోని భావాలు నిరోధిస్తూ, నిరటంకానికి అడ్డుగా ఉన్నాయని తెలుసుకొని ప్రత్యేక రచనలు చేయాలని ఆయనకు అనిపించి ఉండవచ్చు. ప్రకరణ సాహిత్యం లోనూ ఆయన ఆయన మేధాశక్తి అవిచ్చిన్నంగా స్పష్టంగా, అజేయంగా ప్రజ్వరిల్లింది. కనుక అద్వైత జిజ్ఞాసువులకు భాష్య గ్రంథాలకంటే,ప్రకరణాలే ప్రధానంగా, సులభ గ్రాహ్యాలుగా కనిపించి ఆయన ఆలోచనకు అద్దంపట్టాయి.

శంకర కృత ప్రకరణాలు 41-1-ఉపదేశ సాహస్రి 2-వివేక చూడామణి, 3-ప్రపంచ సార, 4-మహావాక్య దర్పణ, 5-అపరోక్షానుభూతి, 6-శత శ్లోకి, 7-ప్రబోధ సుధాకర, 8-వేదాంత సార, 9-వేదాంత డిండిమ,10-సదాచార, 11-వాక్య వృత్తి,12-ఆత్మ బోధ, 13-ఆత్మానాత్మ వివేక 14,ఆత్మ చింతన, 15-హరి మీడేస్తుతి, 16-, విజ్ఞాన నౌక, 17-యోగ తారావళి 18-స్వాత్మానంద ప్రకాశ, 19-జీవన్ముక్తానంద లహరి,20 శివానంద లహరి, 21-సౌందర్య లహరి, 22-ప్రశ్నోత్తర మాల, 23-పంచీకరణ, 24-రాజయోగ, 25-బ్రహ్మ విద్యా విలాస, 26-దశ శ్లోకి, 27-అద్వైతానుభూతి 28- అనాత్మ శ్రీ నిగర్హణ,29-స్వరూపాను సంధాన, 30-ప్రౌఢానుభూతి, 31-బ్రహ్మజ్ఞానావళీ మాల, 32-లఘు వాక్య వృత్తి,33-నిర్వాణ మంజరి, 34-బ్రహ్మాను చింతనం, 35-తత్వోపదేశ,36-మాయా పంచక 37-ఏక శ్లోకి, 38-రామకర్ణామృత, 39-గాయత్రీ భాష్య, 40-సర్వ వేదాంత సిద్ధాంత సార సంగ్రహ, 41దేవ పూజా విధానం.

ఇందులోని శివానంద లహరి సౌందర్యలహరి, హరిమీడే స్తోత్రం లను కొందరు స్తోత్ర గ్రంథాలలో చేర్చారు . ప్రకరణాలలో వివేక చూడామణి, ఉపదేశ సాహస్రి,సర్వవేదాంత సిద్ధాంత సార సంగ్రహం అతి ముఖ్యమైనవి. బెల్వార్కర్ పండితుడు ప్రకరణాల సంఖ్య112అని తేల్చాడు. వీటిలో అపరోక్షనుభూతి ఆత్మబోధ, ఉపదేశి సాహస్రిలోని పద్యభాగం, పంచీకరణ ప్రక్రియ,శతశ్లోకి అనే ఎనిమిదింటిని మాత్రమె శంకర కృతాలన్నాడు .

ఆధారం –శ్రీ అనుభవానంద స్వామి వారి –''సర్వ సిద్ధాంత సౌరభం''

శంకర స్తోత్రాలు

శంకర స్తోత్ర గ్రంథాలలో చాలాభాగం సగుణ బ్రహ్మో పాసన ఉండటంవలన కొందరు ఆయన రాయలేదంటారు. కానీ శంకరులు సూత్ర భాష్య రచనలలో అనేక సందర్భాలలో ఈశ్వరానుగ్రహ ప్రసక్తి ఉన్నది అనీ, అది లేనిదే అపరోక్షానుభూతి దుర్లభమనీ చెప్పారు. స్తోత్రాలలో కొన్ని కొన్ని కవితా ధోరణిలో, ఛందస్సు ప్రధానంగా, చిత్ర ఛందస్సులలోను, అలంకారికంగా కూడా ఉన్నాయి కనుక అవి శంకరులు రాయలేదనే వాదం ఉంది. శాక్త తంత్ర భావాలను ప్రతిపాదించి వర్ణించే, సౌందర్య లహరి, ప్రపంచ సార లలో శృంగారం కూడా ఉండటం తో ఆయన రాయలేదన్నారు. ''though there is a tradition that Shiva was the family deity of Sankara, it is also held he was by birth a Shakta ''శంకరుని కులదైవం శివుడనే వాడుక లోకం లో ఉందికనుక ఆయన జన్మతః శాక్తేయుడు, ''అనే అభిప్రాయం ఉందని రాధాకృష్ణ పండితుడు భావించాడు. వాటిలోని తాంత్రిక భావం అద్వైత వేదాంతం లో ఉత్కృష్ట అనుభూతికి సహకారంగా ఉంది అన్నారు సూర్య నారాయణ శాస్త్రి. తాను స్థాపించిన నాలుగు ఆమ్నాయ పీఠాలలో శంకరులు శ్రీ చక్ర ప్రతిష్ఠ కూడా చేశారు కనుక దేవీ పూజకు ప్రాదాన్యమూ కల్పించారు. అలాగే మధుర కంచి జంబుకేశ్వరం, కాశ్మీర్ మొదలైన చోట్ల దేవీ మూర్తుల్ని ఉపాసించి, ఆ మూర్తుల అనుగ్రహం సాధించారు. కనుక శంకరులు శాక్తేయ సూత్రాలు రాయలేదనటం అసంబద్ధం అన్నారు శ్రీ అనుభవానందులు. అతిగా శృంగారం ఉన్నవి ఆయన రాయలేదనవచ్చు. బెల్వాల్కర్ శంకరులు రాయని 214 ఉంటాయన్నాడు.

శంకర కృతాలుగా408స్తోత్ర రచనలలో 8భాష్యాలు 8ప్రకరణాలు, 8స్తోత్రాలు శంకరులే రాశారని, మిగిలిన 384 లపై సందేహం ఉందన్నాడు బెల్వాల్కర్. ఈ నిర్ణయం అంగీకార యోగ్యం కాదనీ, పూర్తి ఆధారాలు లభించినప్పుడే అవి శంకర రచనలు కావు అని చెప్పాలనీ శ్రీ అనుభవానంద స్వామి ఉవాచ.

సన్యాస ప్రాశస్త్యం

''Frend that is false -which clings to love for selfish sweets of love –But, ,who love these more than the joys of mine –Yea, more than joys of theirs depart to save –Them and all flesh, if utmost love avail ''స్వార్ధ ప్రేమ మాధుర్యం కోసం ప్రేమానుబంధంగా ఉండే ప్రేమ తత్త్వం వాస్తవం కాదు. కానీ నేను, నా సుఖం కంటే వాటిని ప్రేమించి, వారి సుఖాలకోసం వారిపై ప్రేమ చూపించె ప్రేమ ప్రయోజనకరం అయితే, వారినీ సర్వ ప్రాణికోటినీ రక్షించటానికి అన్నీ వదిలి వెళ్ళటం సర్వోత్కృష్ట త్యాగం "అన్నారు స్వామి రామ తీర్ధ తమ "లైట్ ఆఫ్ ఏసియా. ఇలాంటి త్యాగమే చేశాడు భగవాన్ గౌతమ బుద్ధుడు. సంసారం లో ఉన్నవారంతా తరించాలి, సర్వ ప్రాణులు ఆనంద సుఖాలు పొందాలి. ప్రపంచమంతా సమ్యక్ జ్ఞానం పొందాలి "అన్నది భారతీయ ఆర్ష సంస్కృతి. బృహదారణ్యకం లో బ్రహ్మవేత్తలు ఈషణ త్రయాన్ని త్యజించి, సన్యాసం స్వీకరిస్తారు అని చెప్పబడింది. సన్యాసానికి ఇదే పరమోత్కృష్ట ఆదర్శం. ''The renunciation is only a

process of growth preparing for the birth of a fuller life ''సమగ్ర జీవిత ఆవరణానికి సంసిద్ధం చెందించే పరిణామ క్రమమే సన్యాసం అని స్వామి రామతీర్థ వాక్యం. మహాభారతం లో కూడా "త్యేజేదేకం కులస్యార్థే, గ్రామస్యార్థేకులం త్యజేత్ –గ్రామం జానపదస్యార్థే,ఆత్మార్ధం పృధివీ త్యజేత్"అంటే కులం కోసం స్వార్థాన్నీ, గ్రామం కోసం కులాన్నీ, దేశం కోసం గ్రామాన్నీ, ఆత్మానుభూతి కోసం ప్రపంచాన్ని త్యజించాలి భారతం పేర్కొన్నది. "కొద్దిగా నైనా త్యాగ లక్షణం ఉంటేకానీ, సమగ్ర ఉన్నత ఉత్తమ సంస్కృతిఏర్పడదు. త్యాగమంటే నిస్వార్థం. తనలో ఉన్న హేయ గుణాన్ని నిరోధించి, ఉన్నతస్థాయికి తన స్వభావాన్ని అభి వృద్ధి చేసుకోవటమే సన్యాసం అన్నారు అరవింద యోగి. కనుక ప్రపంచం లో త్యాగం లేని ఘట్టం, ప్రదేశం లేదు. త్యాగం సర్వశ్రేష్ఠ ఆదర్శం. తలిదండ్రులిచ్చిన జన్మను సార్ధకం చేసుకొని నాలుగు ఆశ్రమాలలో హాయిగా జీవించి, చివరికి సన్యాసం తీసుకోవాలని శాస్త్రాలన్నీ ఘోషించాయి.సన్యాసం ఆత్మోద్ధరణకు, ఆత్మాదర్శానికి, పవిత్రతకు దేశైక క్షేమానికి ఉద్దేశింపబడింది. "సన్యాసం అనవసరం అనే వారికి మానవ ఉన్నత గమ్యం తెలియదు "అన్నాడు రాధాకృష్ణ న్."ఉత్కృష్ట సన్యాస విధానం ఒక్క భారత దేశం లోనే పుట్టి వికసించి ఫలవంతమైంది "అని వేదాంతం లోతులు తరచిన ప్రొఫెసర్ జి.ఎస్. ఘుర్యే   తన "ఇండియన్ సాధూస్ "లో రాశాడు. Asceticism and monastic organization, are two unique contributions which Indian civilization has made to the common stock of culture ''సన్యాసం, సంప్రదాయం సామాన్య సంస్కృతికి భారతీయ విజ్ఞానం అందించిన అపూర్వ ప్రధానాలు "అన్నాడు ప్రొఫెసర్ ఘుర్యే. "అందుకే నిస్సందేహంగా "The mother of asceticism ''భారతి సన్యాసానికి తల్లి "అనీ అన్నాడాయన. .ఈ సంగీత అమృత ధారను అతి పిన్న వయసులోనే స్వీకరించి రామకృష్ణ పరమహంస శిష్యుడై, వేదాంత సింహమై, ప్రపంచ పర్యటన చేసి, అసంఖ్యాక ముముక్షులోకానికి తరుణోపాయాన్ని ప్రసాదించారు వివేకానంద స్వామి అన్నారు శ్రీ అనుభవానందులు. "కంఠం ఎత్తి పాడు యతివరా –దీరా ఓం తత్సత్ అంటూ –అతిదూరం లో విషయ వాసనలకు అందని చోట ఈ గీతం పుట్టింది –కామ ధన కీర్తి కాంక్షలకు కలత పడని,శాంతిమయ కందరారణ్యం లో ఉద్భవించింది ఈ గీతం –చారుతర సచ్చిదానంద పూరం లో కంఠం విస్పష్టంగా ఎలుగెత్తి పాడు –యతివరా,దీరా ఓం సత్సత్ అంటూ "అని రాసి గానం చేశాడు కానందుడైన వివేకానందుడు .

ఆధారం – శ్రీ అనుభవానంద స్వామి రచించిన –"సర్వ సిద్ధాంత సౌరభం "

## చతురామ్నాయ పీఠాలు

శ్రీ శంకర భగవత్పాదులు స్థాపించిన నాలుగు ఆమ్నాయ పీఠాలలోశృంగేరి పీఠం అతి ప్రాచీనమైనది. క్రీ శ 1331నుంచి -1386వరకు శృంగేరి 12వ పీఠాధ్యక్షులుగా శ్రీ విద్యారణ్యస్వామి ఉన్నారు అంతకు ముందున్న 11 గురి పేర్లు తెలియవు. క్రీశ.773న శ్రీ విశ్వ రూపాచార్య నిర్యాణం చెందాక ఆయనే ఈ పరంపరకు మొదటి పీఠాచార్యుడు అయి ఉంటాడు. ఈయన క్రీ.పూ.27 న శంకరాచార్యస్వామి ఆదేశం పై

మొదటి ఆచార్యుడైనాడు అని శృంగేరి పీఠం తెలియజేసింది. వీరిలెక్క ప్రకారం శంకరులు క్రీ.పూ.11న సిద్ధిపొందారు. కనుక శంకరాచార్య ఉండగానే, శంకరుల 16వ ఏట విశ్వరూపుడు పీఠాధిపతి అయ్యాడు. ఆతర్వాత 16 ఏళ్ళు శంకర భగవత్పాదులు జీవించారు. ఈ లెక్క ప్రకారం విశ్వ రూపుడు క్రీ.పూ.27నుంచి, క్రీశ. 73వరకు పూర్తిగా 300 సంవత్సరాలు జీవించి ఉన్నట్లు తెలుస్తోంది. "ఇదంతా అసంభవం, ఆయన బతికింది కేవలం 80ఏళ్ళు మాత్రమె అనీ కనుక శంకరులు క్రీశ 7 వ శతాబ్ది వాడు" అని పండిట్ ఎన్.భాష్యాచార్య " ది ఏజ్ ఆఫ్ శంకరాచార్య "గ్రంథం లో ఊహించి చెప్పాడు.

శృంగేరి పీఠాన్ని అధిష్టించిన ఆచార్యులలో క్రీ.శ.6 శతాబ్దికి చెందిన9వ పీఠాధిపతి.విద్యాశంకరులు సిద్ధిపొందాక, సుమారు 800ఏళ్ళు పీఠానికి అధ్యక్షులే లేరని, 14వ శతాబ్ది విద్యాతీర్ధ అభిమతం ప్రకారం విద్యారణ్యస్వామి తనగురువైన భారతీ కృష్ణ తీర్ధుని పీఠాదిపతిని చేశాడని శ్రేష్టులూరి క్రిష్ణస్వామయ్య తన జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రం లో రాశాడు. భారతీ కృష్ణ తీర్ధుడు, శంకరానంద విద్యాతీర్ధుల శిష్యుడనీ,విద్యారణ్యుల సోదరుడు అనీ చెప్పాడు. విద్యాతీర్ధుడు కుంభకోణం, కంచి కామకోటి పీఠాల అధ్యక్షుడై, జీర్ణమైన శృంగేరి పీఠాన్ని విద్యారణ్యుని ద్వారా పునరుద్ధరించాడని కొందరంటారు. విద్యారణ్యుడు శృంగేరి స్వామియే అనీ, కామకోటి పీఠానికి తీర్ధ సంప్రదాయం లేదని మరికొందరి వాదం. ఇవన్నీ ఆలోచిస్తే, క్రీ.శ 773నుంచి శృంగేరికి క్రమరీతిలో ఆచార్యులు వారికాలాలు ఉన్నాయికనుక త్రోసిపేయటానికి వీల్లేదు.అన్ని వాదాలకు స్వస్తి చెప్పి, శంకరాచార్యుల వారి తర్వాత ఈ పీఠానికి విశ్వరూపాచార్యుడే అధిపతిఅయి . క్రీ శ.778వరకు నిత్యబోధ ఘనాచార్యుడు అధ్యక్షుడు అయ్యేదాకా కాలక్షేపం చేసి ఉంటాడు అనుకొంటే ఇబ్బంది లేదన్నారు శ్రీ అనుభవానంద స్వామి. ఈ అసంపూర్ణ ఆచార్య పరంపరను సమన్వయపరచి శంకరాచార్య క్రీశ.788లో జన్మించారని మాక్స్ ముల్లర్ చెప్పిన మాట సరైనదే అన్నాడు కృష్ణస్వామి అయ్యర్.

ద్వారకలోని శారదా పీఠం ప్రకారం శంకరాచార్య యుధిష్టిర శకం 2633వైశాఖ శుద్ధపంచమి పునర్వసు నక్షత్రం నాడు జన్మించినట్లు, 2636లో ఉపనయనం,2639లో సన్యాసం, 2640లో గోవింద భగవత్పాదులవద్ద బ్రహ్మోపదేశం, 2638కార్తీక బహుళ త్రయోదశినుంచి , మాఘ శుద్ధ దశమి వరకు ద్వారకా పీఠ స్థాపన 2648 ఫాల్గుణ శుద్ధ నవమి నుంచి శృంగేరి పీఠ ప్రతిష్ట 2649లో మండన మిశ్రునికి సన్యాస మిచ్చి ద్వారక పీఠాధ్యక్షుని చేశారని, 2654లో హస్తామలకుని శృంగేరి పీఠాధిపతిని చేశారనీ, 2655లో పూరీ గోవర్ధన పీఠ స్థాపన చేసి పద్మపాదుని ఆచార్యునిగా చేశారనీ, యుధిష్టిర శకం 2666కార్తీక పౌర్ణమినాడు శంకరులు సిద్ధిపొందారని ఉంది. అంటే క్రీ.పూ.50లొ జన్మించి క్రీపూ 472లో శంకరులు సిద్ధిపొందినట్లు నిర్ణయించారు.

పూరీపీఠ గురుపరంపరను బట్టి యుదిష్టిరశకం 2655వైశాఖ శుద్ధ దశమి నాడు జగన్నాధ పీఠాన్ని స్థాపించి శంకరాచార్య పద్మపాదుని ఆచార్యుని చేశారనీ ఉంది. ఇది గోవర్ధలో పీఠ లెక్కలకు దగ్గరలో ఉంది

బదరికాశ్రమ జ్యోతిర్మఠ పీఠ0చాలాకాలం శిధిలమై ఉండి ఇటీవలే పునరుద్దరింప బడటం వలన అక్కడి గురుపరంపర లభ్యం గా లేదు.

ఈనాలుగే కాక కంచిలోని కామకోటి పీఠం శంకరాచార్య స్థాపితమే అనె అభిప్రాయం ఒకటి ఉన్నది. దీన్ని బట్టి కలియుగ 2593నందన సంవత్సర వైశాఖ శుద్ధపంచమి, పునర్వసు నక్షత్రంలో శంకర జననం అని ఉంది. ”పుణ్యశ్లోక మంజరి “ప్రకారం కలియుగం 2625రక్తాక్షి సంవత్సర అంటే క్రీ.పూ.77 శుద్ధ ఏకాదశి నాడు శంకరులు బ్రహ్మైక్యంచెందారు. కామకోటిలోని “గురు రత్నమాల “కూడా వీటినే సమర్ధించింది.

1- శృంగేరి మఠం క్రీ.పూ.43నుంచి క్రీ.పూ 11వరకు 2-కామకోటి పీఠం క్రీ.పూ.508-509,క్రీపూ 477వరకు, 3-ద్వారక పీఠం-క్రీ.పూ 50నుంచి క్రీ.పూ.473వరకు, 4-గోవర్ధన పీఠం కూడా ఇదే కాలం లో నే ఉన్నది.

ఆధారం –శ్రీ అనుభవానంద స్వామి వారి “సర్వ సిద్ధాంత సారభం ”

## స్త్రీలకు సన్యాసాశ్రమం

ఉపనయన సంస్కారం శూద్రులకు లేదుకనుక వారు సన్యాసానికి అనర్హులు అనే వాదం ఉంది కానీ పూర్వకాలం లో స్త్రీలకూ ఉపనయనం మొదలైన సంస్కారాలు ఉండటం చేత గురుకులం లో ఉంటూ వేదాధ్యయనం చేసి నిష్ణాతులై వేద సభలలో చర్చా గోష్ఠులలో పాల్గొనే వారు. ”పురా కల్పే కుమారీణాంమౌంజీ బంధన మిష్యతే –అధ్యాపనం చ వేదానాం,సావిత్రీ వచనం తథా”అంటే పూర్వం బాలికలు ఉపనయన సంస్కారం పొంది వేదాలు నేర్వటం బోధించటం లో, సావిత్రీ మంత్రాన్ని జపించటం లో అధికారులై ఉన్నారు అని “యమ స్మ్రతి “పేర్కొన్నది “.”యత్తు హారీ నోక్తం ద్వివిధాః స్త్రియో బ్రహ్మవాదిన్యః సద్యో వద్యశ్చ తత్ర బ్రహ్మ వాదినాం ఉపనయన మగ్నీన్ధనం,వేదాధ్యయనం స్వగృహే చ భిక్షా చర్యేతి”.హారీతుని వాక్యం ప్రకారం స్త్రీలు బ్రహ్మవాదినులని, సద్యో వధువులు అని రెండు రకాలు. బ్రహ్మ వాదినులకు ఉపనయనం అగ్నికార్యం వేదాధ్యయనం స్వగృహం లో భిక్షా చర్య కలిగి ఉన్నారని హారీతధర్మ సూత్రం తెలియ జేసింది. అందుకే ఆర్ ఆర్ దివాకర్ “It is now usually admitted that the Upanayana ceremony is Vedic and was common t both boys and girls ‘’ఉపనయనం వైదికమై బాల బాలికలందరికి సామాన్యం గా ఉండేదని, కనుక ప్రస్తుతం అంగీకారమే అని డా.ఆర్ ఆర్ దివాకర్ ప్రబుద్ధ భారత లో రాశాడు. సిజి బిస్వాస్ కూడా ప్రబుద్ధ భారత లో “శాస్త్రాధ్యయనానికి ముందు బాలికలు కూడా ఉపనయనం పొందాలి అనే నియమం కూడా ఉందని రాశాడు.”బ్రహ్మ చర్యేణకన్యా యువానం విందతే పతిం”బ్రహ్మ చర్యాశ్రమం చేత కన్య యువకుడైన భర్త ను పొందుతోంది అని అధర్వణ వేద వాక్యం. బృహద్దేవత సూత్ర ప్రకారం “నైష్టికులై తురీయాశ్రమాన్ని తీసుకొంటే, బ్రహ్మ వాదినులనీ, గృహస్తాశ్రమం

తీసుకొంటే సద్యో వదువులని పిలువబడేవారు. కనుక వేదాలలో స్త్రీలకూ ఉపనయన వేదాధ్యయన యుక్త బ్రహ్మ చర్య, ఆతర్వాత వారి ఇష్టప్రకారం బ్రహ్మవాదినిగా సన్యాసం ఉన్నాయని తాత్పర్యం.

మహా భారతం శాంతి పర్వం లో "భిక్షుకీత్య నేనా స్త్రీణామపిప్రాగ్వివాహాద్వావైధవాచూర్ధ్వం సంనాసాధి కారో స్తీతి దర్శితం –తేన భిక్షా చర్యం మోక్ష శాస్త్ర శ్రావణ మేకాంతేఆత్మా ధ్యానం చ తాభిరతికర్తవ్యంత్రి చ దండాదికంచ "అంటే స్త్రీకి పెళ్ళికాక ముందు,వైధవ్యం కలిగిన తర్వాతకానీ కాని, సన్యాసాశ్రమ అర్హత ఉంది. దీని వల్ల భిక్షాచర్యం, వేదాంత శ్రవణం ఏకాంతవాసం లో ఆత్మ ధ్యానం అర్హతలు లభిస్తాయి. త్రిండడం ధరించి సన్య సించటం కూడా ఉంది."సులభ" అనే భిక్షుణి గురించి పేర్కొన్నది. "అటంత్యా"లో పరివ్రజకత్వాన్ని తెలియజేస్తూ, ''తత్ర తర శ్రుతోమోక్షో కధ్యమాన త్రిదండినః"ఆమెకు త్రిదండ ధారణాదికారం కూడా ఉన్నది అన్నది.ఇది తెలిసి జనకమహారాజు ఆమెను బ్రాహ్మణ బ్రహ్మవాదినిగా భావించి, సత్కరించి, గౌరవించి, ఆతర్వాత ఆమె క్షత్రియ స్త్రీ అని ఆమె వల్లనే తెలుసుకొన్నాడు. కనుక ఆకాలం లో బ్రాహ్మణ క్షత్రియ బ్రహ్మ వాదినులు ఉన్నారని తెలుస్తోంది. ఆర్ ఆర్ దివాకర్"మహాభారత కాలం లో కూడా కురుక్షేత్రం దగ్గర ఒక ఆశ్రమం లో ఒక బ్రాహ్మణ కన్య యోగ శక్తులను పొంది తపస్సిద్ధి సాధించింది "అని రాశాడు ప్రబుద్ధ భారత లో.

వేదాలలో వేదేతర గ్రంథాలలోబ్రహ్మ చారిణి, తాపసి, సిద్ధా అనే పేర్లతో పిలువబడే వారు కనుక పురుషులతోపాటు స్త్రీలు కూడా సరి సమానంగా ఆధ్యాత్మిక సాధన, వేదాధ్యయనం చేసేవారు అన్నాడు దివాకర పండితుడు ''The intellectual eminence of women was proved by her capacity for debates and discussions in the royal courts and in Samitis and Sabhas ''రాజాస్థానాలలో సమితులు పండిత సభలలో ప్రసంగించి చర్చించటం స్త్రీ శక్తి సామర్ధ్యాల మేధా ఔన్నత్యాలను గుర్తించే జరిగి నిరూపితమైంది "అన్నాడు డా కాళిదాస నాగ్ –ప్రబుద్ధ భారతి లో.

ఆరణ్యక, ఉపనినిషత్తులలోఉన్న వైదిక వాఙ్మయం లో బ్రహ్మవాదినులు అని పేరొందిన స్త్రీ ఋషులచే దర్శింప బడిన అనేక వైదిక మంత్రాలను జాగ్రత్త చేయటం చేత, ఆస్త్రీ బ్రహ్మవాదినుల ఆధ్యాత్మిక ఔన్నత్యం ఇనుమడించింది అని కాళిదాస నాగ్ స్పష్టంగా రాశాడు. ఏ.సి బోస్ కూడా "వేదాధ్యయనానికి స్త్రీలకుఅర్హతలెదనటం చరిత్రను దూషించట మే"అన్నాడు.

ఆనాటి బ్రహ్మవాదినులు పొందిన విద్యా వైదుష్యాలు,ప్రతి వాదం చేసే నేర్పు, రచనా కౌశల్యం ఆశ్చర్యం కలిగిస్తాయి. వారిలో ముఖ్యంగా "గోధా ఘోషా విశ్వవారా పాలోపనిషత్ –బ్రహ్మ జాయా జాహుర్నామ గన్తవ్య స్వ సాధితిః-ఇంద్రాణి చేంద్రమాతా చ సరమా రోమ శోర్వరీ, లోపముద్రా చ సద్యశ్చయామీ నారీ చ శాశ్వతీ –శ్రీ ర్లాక్షా సర్వ రాజ్ఞీ వాక్ శ్రద్ధా మేదాచ దక్షిణాః-రాత్రిం సూర్యాచ సావిత్రీ బ్రహ్మవాదిన్య ఈరితాః"అని "బృహద్దేవతః" లో చెప్పబడింది. గోధా, ఘోషా, విశ్వవారా, ఆపాల, ఉపనిషత్, బ్రహ్మపత్నీ, ,అగస్త్య సోదరి, జుహూ, ఇంద్రాణి, ఇంద్రమాతా సరమా, రోమశ, ఊర్వశీ, లోపాముద్రా, సదలయామీ, నారీ, శాశ్వతీ, లాక్షా

సర్వరాజ్నీ వాక్, శ్రద్ధా, మేధా దక్షిణా, రాత్రి, సూర్యా, సావిత్రి మొదలైన వారంతా బ్రహ్మవాదినులే. వీరిలో గోదా తపస్విని యై ఋగ్వేద మంత్రాలను 10,134-7 కర్తిగా స్తుతింపబడింది, ,క్షత్రియ కుమారి ఘోషా బ్రహ్మ చర్యం లో ఉంటూ తనకున్న కష్టు రోగాన్ని కొన్ని మంత్రాలతో నివారించుకొన్నది ఆమంత్రాలే10-39,40-1,117-7 రుక్కులయ్యాయి. అత్రి మహర్షివంశానికి చెందిన విశ్వవార యజ్ఞాలు చేస్తూ, చేయిస్తూ, ఆరు రుక్కులకు 5,28,3కర్తి అయిన మహా మేధావిగా పేర్కొనబడింది ఆత్రి ముని కూతురు ఆపాల అనే బ్రహ్మవాదిని వివాహం చేసుకొని బొల్లి ఉండటం చేత భర్త పరిత్యజిస్తే, జనకరాజు ను ఆశ్రయించి, తపస్సు చేసి, ఇంద్రుని స్తుతించి ఆయన అనుగ్రహం తో బొల్లిని పోగొట్టుకొన్నది. ఆ వ్యాధి నివారక మంత్రాలు 5-28,3-8,30-7వేదం లోకి చేరాయి. యజ్ఞాలు నిర్వహించటం లోనూ ఆమె ప్రతిభ అగణితమే సోమయజ్ఞంచేసి స్త్రీల యజ్ఞాదికారత్వాన్ని సుస్థాపితం చేసింది అగస్త్యముని సోదరి జుహూ బ్రహ్మవాదిని భర్త బృహస్పతి చేత త్యజింపబడి, తన తపో బలం తో మళ్ళీ భర్తను చేరింది. బ్రాహ్మవాదినిగానే జీవితం గడిపింది ఈమె ప్రార్ధనలు 10,11-6 రుక్కులయ్యాయి.

ఇంద్రుని తల్లి అదితి, ఇంద్రుని భార్య శచీ దేవి ఇద్దరూ బ్రహ్మవాదినులే అని ఋగ్వేదం లోని 10,49,153,10-145,2 తెలియ జేస్తున్నాయి. రోమశ కూడా ఋగ్వేద మంత్రాలు 1,125-7కు కర్తి అగస్త్యమహర్షి ధర్మపత్ని లోపాముద్ర చేసిన స్తుతులు రుగ్వేదంలో ప్రఖ్యాతాలైనాయి. అంగిరస మహర్షి కుమార్తె శాశ్వతి కూడా ప్రముఖ ఋగ్వేద 8-1,34మంత్ర కర్తి-,సర్వ రాజ్ఞి బ్రహ్మవాదిని అగ్ని సూత్ర మంత్ర -10,1899నిర్మాత. ఈమె యజ్ఞ యాగాదులకు అధ్యక్షత కూడా వహించేది అంభ్రిణ మహర్షి కుమార్తె వాక్ అనే బ్రహ్మవాదిని ఋగ్వేదం లో జీవ బ్రాహ్మైక్యాన్నిప్రతిపాదించే మంత్రాల నిర్మాత. ఆమె సూక్తాలలో దేవీ సూక్తం ముఖ్యమైనది-10-125,1,4. ఈమె సాక్షాత్తు సరస్వతీ స్వరూపం కనుక వాగ్దేవి అనే పేరుతొ పిలువబడేది ఋగ్వేదం -10-151,1.శ్రద్ధాళువైనఒక బ్రహ్మవాదిని మంత్రాలను దర్శించి శ్రద్ధా అనే పేరువొందింది. ప్రముఖ సన్యాసిని అయిన ఈమె యజ్ఞాలు చేస్తూ చేయిస్తూ ఉండేది.

రాత్రి సూక్తాన్ని రచించిన బ్రహ్మవాదిని రాత్రి అనే పేరుతోనే ప్రసిద్ధమైంది. రుగ్వేదంలో 10-85రుక్కు కు కర్తి సూర్యా. సుకన్య ముసలి వాడిని పెళ్ళాడి బ్రహ్మవాదిని అయి, విరాజిల్లింది. శచీ పౌలోమి ఋగ్వేదం 10-159 మంత్రం కర్తి అయిన బ్రహ్మవాదిని. .బృహదారణ్యక ఉపనిషత్ లో ప్రశస్తి వొందిన మైత్రేయి, కాత్యాయని, గార్గి ఉన్నారు. యాజ్ఞ్య వల్క్య మహర్షి భార్యలైన మైత్రేయి, కాత్యాయని భర్త ఆశ్రమ సంరక్షకులు కూడా. మైత్రేయి శిష్యుల విద్యా విషయాలను పర్యవేక్షిస్తూ భర్తకు శ్రమ తగ్గించేది. గార్గి శ్రేష్ఠ బ్రహ్మవాదిని అని జగద్విదితమే. పడవా పాత్రి దేయం అనే బ్రహ్మవాదిని, శాండిల్యముని పుత్రిక స్వయం ప్రభ గొప్ప తపస్వినులు. దేవశ మహర్షి కుమార్తె సువర్చల శ్వేతకేతుడిని పెళ్ళాడి బ్రహ్మవాదినిగా పేరు వొందింది.

ఈ విధంగా శంకరా చార్యకు పూర్వమే అనేకమంది బ్రహ్మావాదినులు ఉండేవారు. కొన్ని చోట్ల భర్తల పేర్లు ఉన్నప్పటికీ ఆ భర్తలు సన్యసించటం కాని, చనిపోవటం కానీ జరిగి సన్యాసం తీసుకొని ఉంటారు. స్త్రీలకూ ఋషులతో పాటు సర్వాధికారాలు ఉన్నట్లు విదితమౌతోంది. పతంజలి మహర్షి స్త్రీసన్యాసినులకు శ్రమణా,పరివ్రాజితా, తాపసి, కుమారాశ్రమణా అనే పేర్లు పెట్టాడు శంకరానంతరం కూడా స్త్రీలు. సన్యాసాశ్రమాన్ని తీసుకొని, విద్యాధ్యయనం చేసినట్లు చరిత్ర ఉన్నది. జ్ఞాన స్వరూపమైన వేద శాస్త్రాలు 'అభేద దర్శనం జ్ఞానం ''అనే మైత్రేయ ఉపనిషత్ సూక్తి చేత పక్ష పాత దృష్టితో వ్యవహరించకుండా ''వర్ణాశ్రమ మాచార యుతావిమూఢాః-కర్మాను సారేణఫలం లభంతే-వర్నాది ధర్మం హి పరిత్యజంతః స్వానంద తృప్తాః పురుషా భవంతి"అని మైత్రేయ ఉపనిషత్ లో చెప్పినట్లు వర్ణాశ్రమ ఆచారం తో ఉన్న మూఢులు కర్మాను సార ఫలితాలను పొందుతారు వర్ణాదులను త్యజించిన వారు తృప్తులై బ్రహ్మాన్ని పొందుతారు అంటే జ్ఞానాస్వాదనానికి అందరూ అర్హులే అన్నారు శ్రీ అనుభవానంద స్వామి.

ఆధారం –శ్రీఅనుభవానంద స్వామి రచించిన –''సకల సిద్ధాంత సౌరభం ''

**ఆధునిక శాస్త్ర వేత్తలకంటే మన మహర్షులు ముందే దర్శించి చెప్పారా ?**

వస్తువు యొక్క ప్రస్తుత అస్తిత్వం వర్తమానం, అంతకు ముందుది భూతకాలం, తరువాత వచ్చేది భవిష్యత్ కాలం అనీ, ఇవన్నీ ఒక సంఘటన ఆధారంగా మానవ బుద్ధికల్పితాలనీ వైశేషికుల భావం. కాలం లాగానే దిక్కు లేక దేశానికి పరత్వ అపరత్వం, దూరం, దగ్గర లక్షణాలు కనిపిస్తాయి. దేశాన్ని బట్టి వస్తువు స్థాన నిర్దేశం చేస్తూ ముందూ వెనుక పొడుగు పొట్టి పైన కింద అని అనేకరకాలుగా వ్యవహరిస్తాం. దీనివలన దేశం యొక్క ఆస్తికత నిరూపింప బడి, కాలం లాగా నిమిత్త కారణం అవుతోంది. సూర్యోదయ సూర్యాస్తమయాలను బట్టి తూర్పు పడమర దిక్కుల కల్పనా ఏర్పడింది. అలాగే మిగిలిన దిక్కులు కూడా. ఇవి మానవ కల్పితాలు. నిజానికి దేశం ఏకం, నిత్యం. అస్థూలం వ్యాప్తం. కాని నిష్క్రియం. అమూర్తంగా ఉంది అని వైశేషికులు అంటారు. మన పూర్వుల భావాలు మనకు తోచినట్లు, తమ ప్రత్యేకభావాలు కూడా తర్వాత తరాలకు కృత్రిమంగా కనబడ అవచ్చు, తాము ప్రతిభా వంతుల భుజ స్కంధాలపై ఆధారపడి నిలిచి ఉన్నామని ఆధునిక శాస్త్రవేత్తలు గ్రహించారని లింకన్ బార్నెట్ చెప్పాడు.

''our notion of time and space although much more subtle and flexible than they were before the appearance of RelativeTheory, are not very likely yet subtle enough ''అన్నాడు లిమిటేషన్స్ ఆఫ్ సైన్స్ లో జే డబ్ల్యు యెన్ సల్లివాన్. దీనిభావం అయిన్ స్టీన్ సాపేక్ష సిద్ధాంతం చెప్పక

పూర్వం కంటే దేశ, కాలాలకు చెందిన మన భావనలు చాలా సూక్ష్మ తరాలుగా ఉన్నా పూర్తిగా సూక్ష్మాతి సూక్ష్మాలు కావు. ఈ దృష్టి తో చూస్తే న్యూటన్ ఎడ్డింగ్టన్, అయిన్ స్టీన్ మొదలైన సైంటిస్ట్ ల భావాలతో కణాద, గౌతమ సిద్ధాంతాల్ని పోల్చి చూస్తే, ఆధునిక సైంటిస్ట్ ల సిద్ధాంతాలలో కొత్తదనం ఏదీ లేదని తెలుస్తోంది. పైగా లోపాలు బాగా కనిపిస్తాయి. దేశ కాలాల ఏకత్వ సర్వ వ్యాపకత్వాలు, త్రికాలాలు దిక్కులు అన్నీ కల్పితాలే అని కణాదులు చెప్పినట్లే ఈనాటి శాస్త్ర వేత్తలూ చెప్పారు. గ్రహాలూ వాటి సంచారం అంతరించినా, దేశకాలాలు నిత్యాలు నిర్వికారాలు అపరిమితాలు అని వైశేషికులు చెప్పినట్లే ఈ సైంటిస్ట్ లూ చెప్పారు కానీ అయిన్ స్టీన్ చెప్పిన space-time continuum అంటే దేశకాల ప్రవాహ ఐక్యం సిద్ధాంతం ఇంకా పరిపూర్ణం కాలేదు. ఇందులో చాలాసిద్ధాంత రాద్ధాంతాలున్నాయి అనటానికి సల్లివాన్ చెప్పిన మాటలే తార్కాణం.

లింకన్ బార్నెట్ చెప్పిన అనిశ్చయత్వ సిద్ధాంతం అంటే "ప్రిన్సిపుల్ ఆఫ్ అన్ సర్టేనిటి"ని బట్టి ఈశ్వర సృష్టిలో సర్వ ప్రకృతి రహస్య గ్రహణం అనిశ్చయం, అనిర్ధారితం గా ఉంది. అంటే మానవ బుద్ధికి అతీతంగా ఉంది. అందుకే "ఈ విషయం లో గ్రీకు రోమనులకంటే మనం అధిగమించినట్లుకానీ, అత్యున్నత నాగరకదేశాలైన చైనా భారత దేశాలకంటే మనకు ఎక్కువ తెలుసు అనికాని అనుకోవటం అనుమానాస్పదమే అంటే" డౌట్ ఫుల్"అన్నాడు సల్లివాన్ పండితుడు. కనుక మన ప్రాచీన రుషి ప్రోక్త ప్రకృతి రహస్యాల కు మించిన రహస్యాలేవీ ఆధునిక శాస్త్రవేత్తలు గ్రహించ లేదని అర్ధం.

''My religion consists of a humble admiration of the illimitable superior Spirit who reveals Himself in the slight details we are able to perceive with our frail and feeble minds ''అని భారతీయ మహర్షుల భావనకు నమస్సులు అందించాడు సల్లివాన్. "బుద్ధికి అగోచరమైన విశ్వంలో వెలువడిన ఉత్కృష్ట ప్రజ్ఞా శక్తి ని గూర్చి హృదయ పూర్వక భావ విశ్వాసమే ఈశ్వర భావాన్ని కలుగ జేస్తోంది "అని అయిన్ స్టీన్ శాస్త్రవేత్త చెప్పినట్లు, మనప్రాచీన మహర్షులు కార్య రూప ప్రపంచాన్ని వినియోగించుకోవటమే కాకుండా, దానికి కారణమైన అమానుష ప్రజ్ఞా శక్తి రూప సర్వజ్ఞ తత్వమైన పరమేశ్వరునే విశ్వసించా రు. విశ్వ జీవ నిర్మాణం ఎలా జరిగిందో తెలుసుకోవటమే కాక, సృష్టి ప్రయోజన సమస్యా ధ్యాన తత్పరులై, ఈశ్వర సంకల్ప రహస్యాలను గ్రహించే ప్రయత్నం చేసి సాధించి, ఆ అద్వితీయ అలౌకిక మహాతత్వాన్ని పొంది, ఆనందించి, అభ్యుదయ నిశ్రేయస సిద్ధికోసం ప్రపంచ పరిశోధన చేశారు. అదే భారతీయ విజ్ఞాన తత్వ వైభవం. దీన్ని గ్రహించి మన సంస్కృతీ మహాత్మ్యాన్ని దాని సత్సంపదను సద్వినియోగం చేసుకొందాం.

ఆధారం –శ్రీ అనుభవానంద స్వామి వారి –సర్వ సిద్ధాంత సౌరభం

## అయిన్ స్టీన్ దర్శించిన స్పేస్

ఆకాశం అనే గ్రహ అంతరాల ప్రదేశం అంతా కాంతి ప్రసారానికి ఉపయోగపడే ఈథర్ అనే అతి సూక్ష్మ పదార్ధం తో నిండి ఉందని, దానివల్లనే కాంతి సెకనుకు 1,86,284 మైళ్ళ వేగం తో ప్రయణిస్తుందని, కానీ ఆ సూక్ష్మ పదార్ధం సైన్స్ కు అందని అజ్ఞాత విషయమని న్యూటన్ మొదలైన వారు సిద్ధాంతీకరించారు. ఈ ఈథర్ లోనే అసంఖ్యాక నక్షత్ర గోళాలలో భూమి తన చుట్టూ తానూ గంటకు వెయ్యి మైళ్ళ వేగం తో తిరుగుతూ, సూర్యుడిని సెకనుకు 20మైళ్ళ వేగం తో చుట్టి వస్తుంది. భూమి, చంద్రులు ఒకరి చుట్టూ ఒకరు తిరుగుతున్నారు. సూర్యుడు తన గ్రహ కూటమి తో సహా మిల్కీవే లో కనిపిస్తూ, బ్రహ్మ నక్షత్రం" వెగా "చుట్టూ, సెకనుకు 13మైళ్ళ వేగంతో తిరుగుతాడు. ఈ బ్రహ్మ నక్షత్ర కూటం అంతా నక్షత్ర వీధి –పాలపుంత ను సెకనుకు 200మైళ్ళ వేగం తో చుడుతుంది. ఈ నక్షత్ర వీధి అతి దూరంగా ఉన్న మరో నక్షత్ర కూటాన్ని సెకనుకు 100మైళ్ళ వేగం తో చుట్టి వస్తుంది. వీటన్నిటికి మధ్య భాగం లో మానవ దృష్టికి కనిపించని మూల కేంద్రకం ఒకటి ఉంటుందని న్యూటన్ భావించాడు. కానీ ఈ అసంఖ్యాక గోళాలకు ఆధార మైన స్పేస్ అనేది భౌతిక మైన సద్వస్తువు. అది అతి నిశ్చలంగా అచంచలంగా ఉందని, అది ప్రకృతిలో ఈశ్వరుని సర్వ వ్యాపకత్వాన్ని నిరూపించే పదార్ధం అని న్యూటన్ విశ్వసించాడు..

న్యూటన్ తర్వాత కాలం లో ఈథర్ వాదాన్ని శాస్త్ర వేత్తలు త్రోసి పుచ్చారు. కారణం ఏమిటి అంటే ఈథర్ లో భ్రమణం చేసే భూ మండలం నుంచి అనుకూల వ్యతి రేక దిక్కులకు ప్రసరింప చేసిన కాంతి వేగాల్లో తేడాలు కనిపించటమే. కనుక ఈథర్ అనేది పదార్ధ భావం కాదు అని తేల్చారు. ఈథర్ పదార్ధ భావం కాదు అన్న ఈ సిద్ధాంతాన్ని అయిన్ స్టీన్ –భూ భ్రమణం వలన మాత్రమె కాక, సూర్యాది ఇతర గ్రహ భ్రమణ విశేషం వలన కూడా కాంతికి ఎలాంటి అంతరాయం ఏర్పడదు అని తీర్మానించాడు. ఈ సిద్ధాంత ఫలితంగా స్పేస్ కు దిక్కులు కాని అవధులు కాని లేవని, దేశ, కాలాలు ఇంద్ర ధనుసు రంగులు లాగా కల్పితం అన్నాడు. అన్ని వస్తువులకు అవకాశం ఇచ్చేదే స్పేస్అని, ఈ స్పేస్ లో జరిగే కార్య పరంపరను సూచించేదే కాలం. దీని గణనకు సెకను నిమిషం గంట ఏర్పడ్డాయి. అభావం అయిన కాలానికి ఈ సూచనలే ఆధారం వస్తువులునికి తెల్పే స్పేస్ లాగే, వస్తువు యొక్క కార్య సంఘటన క్రమాన్ని మాత్రమె కాలం సూచిస్తుంది. పరాపరాలు ముందు వెనుక రూపం లో దేశ అంటే స్పేస్ కాలాలు ప్రవర్తిస్తాయి. స్పేస్ కు ఒకరకమైన కొలతలు, కాలానికి వేరే రకమైనకొలతలు కావాలి. అంటే అనిర్వచనీయం, సర్వవ్యాపకం అయిన దేశ కాలాలను కృత్రిమమైన కొలతలతో స్థూలం చేస్తున్నా మన్న మాట. ఈ కొలిచే విధానం సూర్య గ్రహ కూటాలకు మాత్రమె సంబంధించినవి. ఇతర చోట్ల ఉపయోగ పడవు. ఆకాశం లో సూర్యుడు 15డిగ్రీలులో ఉంటె గంట అనీ, సూర్యుడిని ఒకసారి భూమి చుట్టివస్తే సంవత్సరం అంటాం. కానీ బుధ గ్రహాన్ని చూస్తె అది సూర్యుడికంటే భూమికి దగ్గరగా ఉండటం వలన 88రోజుల్లో సూర్యుడిని చుట్టి సంవత్సరం పరిమాణాన్ని

తగ్గించింది. తన చుట్టూ తానూ తిరగటానికి 88రోజులు పడుతుదికనుక రోజుకు, సంవత్సరానికి మానం లో తేడా ఉండదు. శుక్రుడికి 225రోజుల సంవత్సరం. కొన్ని వారాల రోజు ఉంటుంది. అంగారక గ్రహం భూమి కంటే దూరంగా ఉంటుంది కనుక అక్కడ సంవత్సరానికి 687రోజులు, రోజుకు 24గంటల 55నిమిషాలు ఉంటాయి. బృహస్పతి జూపిటర్ కు 9గంటల 55నిమిషాలు ఒక రోజు. శనికి 10గంటల 14నిమిషాలు ఒక రోజుకు. ఇలా ఒక్కొక్క గ్రహానికి ఒక్కో కాలమానం ఉంటుంది. మన దేశం లో సూర్యోదయమైతే అమెరికాలో రాత్రి అవుతుంది. దేశాకాలపరిస్థితులను బట్టి మాన విధానం మారుతుంది. ఈకాలమానాలు మనం కల్పించుకొన్నవే కదా. వీటిని కాదంటే, దేశకాలాలు సువిశాలాలు, నిర్వికారాలు,నిరవదికాలు అవుతాయి. ఇదే వాటి సహజ స్వరూపం. ఇక్కడ ముందు వెనకలు, పైనా కిందా లేనేలేవు. మనిషి తన సౌకర్యం కోసం వీటిని కల్పించి, అనుభవిస్తున్నకాలం వర్తమానం అనీ, దానికి ముందుది భూతకాలమని, దాని తర్వాతది భవిష్యత్ కాలం అని భావిస్తున్నాడు. అంటే అఖండ కాలానికి ఖండత్వం కల్పిస్తున్నాడు. అభిన్నమైన దేశం అంటే స్పేస్ లో లోపల బయట అనీ, దూరం,దగ్గర అనీ కల్పించుకొని జీవిస్తున్నాడని అయిన్ స్టీన్ మహాశయుని సిద్ధాంత తాత్పర్యం.

పై విషయాలను మరింత లోతుగా సూక్ష్మంగా ఆలోచిస్తే దేశ, కాలాల మధ్య తేడా తగ్గించి space-time – continuum అంటే దేశకాల ప్రవాహం అనీ, అంతా దేశ కాలనిబద్ధమని, ఈ ద్వయం అభిన్నమని అంటే కాల మానాలు నిజానికి దేశ మానాలే అనీ, అవి పరస్పర అపేక్షికాలని, ఐన్స్టిన్ సిద్ధాంతీ కరించాడు. అంటే ప్రకృతిలో ఈ రెండు ఒక్కటే అని, కనిపించే భిన్నత్వం కల్పితమని ఆయన భావం. ఆయన సిద్ధాంతం ప్రకారం పాంచ భౌతిక వస్తుజాలం అంతా దేశ, కాల బద్ధాలై నాలుగు కాలమానాలు కలిగి ఉంది. అందులో మూడు దేశానికి అన్వయిస్తే, ఒకటి మాత్రం కాలానికి. పొడవు వెడల్పు ఎత్తు అనేవి దేశానికీ, ఎప్పుడు అనే ప్రశ్న కు సమాధానం కాలానికి చెందుతుంది. వ్యక్తికి సంబంధించిన దేహ పరిమాణం దేశానికి, వయస్సు కాలానికి అన్వయిస్తుంది. ఇలాగైనా దేశకాలాలు అభిన్నాలు అని అయిన్ స్టీన్ సిద్ధాంతం. ఆధునికకాలం లో యెంత దూరం అనే ప్రశ్నకు రైలులో కొన్నిగంటలు విమానం లో కొన్ని నిమిషాలే కదా. దేశ మానం లో అంగుళం మొదలైనవి మూడు కొలతలకు అంటే పొడవు వెడల్పు ఎత్తు లకు సరిపోతే, కాలం మాత్రం క్షణాధికానికి అన్వయిస్తోంది. దేశ,కాలాల సంకోచ వ్యాకోచాలు మానవా ధీనాలు కానీ కాలాన్నే వేగ వంతం చేయటం కాని, నెమ్మదిని చేయటం కాని వెనక్కు తిప్పటం కానీ మనకు సాధ్యం కాదు. సర్వ చరాచరాలు పరాధీనం అయి, భూతకాలం నుంచి వర్తమానానికి, దానినుంచి భవిష్యత్తుకు సాగిపోవాల్సిందే కానీ, మార్గాంతరం లేదు. దేశాకాలాలలో కొంచెం తేడా కనిపించినా అవి కల్పితాలే అని భావించి, ఏకం చేసి, కాలాన్ని నాలుగవ మానం గా చేర్చి, సమన్వయ పరచి, విజ్ఞాన లోకానికి నూతన భావ ధారను అయిన్ స్టీన్ కల్పించాడు. హాట్సాఫ్ టు హిం. ఇది కణాదుల వైశేషిక న్యాయానికి దారితీసింది.

ఆధారం –శ్రీ అనుభవానంద స్వామి వారి సర్వ సిద్ధాంత సౌరభం.

## సాంఖ్య సిద్ధాంతం –కపిల మహర్షి

"యావత్ ప్రపంచం లో భారతీయ తత్వ శాస్త్రం తో పోల్చదగినది ఇంకొకటి లేదు"అన్నాడు యువి సోవాని అనే విమర్శక నిపుణుడు. వైజ్ఞానిక అంతరిక్షం లో మన తత్వ శాస్త్రం తేజో విరాజమానమైన సూర్యుడుగా ప్రసిద్ధమైనది సాంఖ్య సిద్ధాంతం. "సాంఖ్యం భారతీయ తత్వ శాస్త్రాలలో అతి ప్రాచీనం "అన్నారు డా.ఎస్ఎస్ సూర్యనారాయణ శాస్త్రి. వెబర్ పండితుడుకూడా "సాంఖ్యం అతి పురాతనమైనది"అని నిర్ధారించాడు. స్వామి వివేకానంద "సాంఖ్యా పేక్ష లేకుండా, ప్రపంచాన్ని సరైన రీతిలో అర్ధం చేసుకోవటం కుదరదు. దీన్ని లౌకిక అలౌకికంగా తెలుసుకోవచ్చు కనుక అనేక దర్శనాలద్వారా సాంఖ్యానికి ప్రాధాన్యత పెరిగింది. వివిధ దర్శనాలకు సాంఖ్య తత్వం ఒక్కటి మాత్రమె సామాన్యంగా ఉన్నది. కనుక యావత్ప్రపంచం సాంఖ్యంను అంతగా గౌరవిస్తోంది . ఇదే అన్ని దేశాల దర్శనాలకు ముఖ్య ఆధారం. ప్రపంచం లో ఎప్పుడు ఎక్కడ తత్వ శాస్త్ర విచారణ జరిగినా అందులో కొంతవరకైనా కపిలమహర్షి సంఖ్య సిద్ధాంతం తప్పక ఉంటుంది "అన్నాడు.

ఇంకాస్త ముందుకు వెళ్లి మాక్స్ ముల్లర్ "పైధాగరస్ భారత దేశానికి వచ్చి సాంఖ్యం నేర్చి, తన గ్రీసు దేశం లో బోధించాడు. తర్వాత ప్లేటో కూడా దీన్నే సూచించాడు. ఆతర్వాత నాస్టిక్ శాఖీయులు సాంఖ్యాన్ని అలెగ్జాండ్రియా కు తీసుకు వెళ్ళారు. అక్కడి నుంచి యూరప్ చేరింది. కనుక ప్రపంచం లో ఎక్కడ ఏ తత్వ శాస్త్ర, ఆధ్యాత్మిక కృషి ఉన్నా, దానికి పరమపిత "కపిలా చార్యుడే ".కనుక ప్రాచీన హిందూ తత్వ శాస్త్రం లో ప్రధాన సిద్ధాంతాలైన వేదాంత, సాంఖ్యాల పరిచయం లేని వాడు తత్వవేత్త కాదు అని పించుకొనే కాలం వచ్చేసింది"అన్నాడు అనుమానం లేకుండా.

సాంఖ్య కర్త కపిల ముని

"సర్వ ప్రపంచ తత్వ శాస్త్రాలకు పునాది అయిన సాంఖ్య శాస్త్ర కర్త ఎవరు ఆయన జీవిత విశేషాలేమిటో తెలుసుకొందాం. అనేక దేశాలలో ఆయా దేశాల తత్వ శాస్త్ర ఆచార్యుల, వ్యాప్తి

చేసిన వారి జీవిత చారిత్రలు స్పష్టంగా ఉన్నాయి. కానీ భారత దేశం లో ఆవివరాలు తెలుసుకోవటం చాలాకష్టం . థేల్స్ ఎవరో, ప్లేట్ ఎవరో ఎప్పుడు ఎక్కడ పుట్టారో , ఏం చేశారో మనకు భావించటానికి అవకాశమున్నది. కానీ కపిల గౌతమ కణాద,బాదరాయణ జైమినుల గురించి మనకు తెలిసింది శూన్యం "అని వాపోయాడు మాక్స్ ముల్లర్ పండితుడు. "సాంఖ్య దర్శన తత్వాభి వృద్ధి చారిత్రం, అభేద్యం అయిన అంధకారం లో మునిగిపోయి,మరుగున పడింది "అని భారతీయ తత్వ శాస్త్ర పరిణామ చరిత్ర రాసిన పిటిశ్రీనివాస అయ్యంగార్ కూడా అభిప్రాయ పడ్డారు.

అయినా "సాంఖ్యస్య వక్తా కపిలః పరమ ఋషిహి,పురాతనః –హిరణ్య గర్భో యోగస్య వక్తా నాన్యః పురాతనః "అనేభారతం లో శాంతిపర్వం లోని మోక్ష ధర్మ ప్రకరణం లో ఉన్నదాన్ని బట్టి, సాంఖ్యకారుడు పరమ రుషి వరేణ్యుడు,అతిప్రాచీనుడు హిరణ్య గర్భుడు అయిన కపిలాచార్యుడే అని పూర్తిగా రూఢి అవుతోంది. వేదాంత సూత్రకర్త వ్యాసుడు స్మృత్యదికరణ లో కాపిల సాంఖ్యాన్నిచర్చించాడు. పద్మపురాణం కూడా కపిలుడే సాంఖ్య కర్త అన్నది. వైశేషిక సాంఖ్య దర్శనా చార్యుల సూత సంహిత లో "కాణాద,కపిలాద్యైస్తు,మునీంద్రై రపి కీర్తితం –మంద బుధ్యను సారేణ కేవలం పరి కీర్తితం "అని ఉండటం విష్ణు సహస్రనామం లో మహర్షి కపిలా చార్యః "అని ఉండటం చేత శంకరాచార్యులు కూడా భాష్యం రాస్తూ "మహర్షి కపిలాచార్య అన్నది ఏకనామం అనీ సాంఖ్య శుద్ధాత్మతత్వ విజ్ఞానాచార్యుడు కపిల ముని అని స్పష్టంగా చెప్పారు . ఆది విద్వాంసుడు మహర్షి చంద్రుడు అయిన కపిలమహర్షి కరుణ తో నిర్మాణ చిత్తాన్ని అధిష్టించి "అసురి "అనే శిష్యుడికి తంత్రాన్ని బోధించాడు అన్నారు శంకరులు. దీనికి వ్యాఖ్యానం రాసిన వాచస్పతి మిశ్రా "పంచమావతారమైన కపిలుడు అసురి కి మొదట సాంఖ్యం బోధించాడనీ, భారతాది ఇతిహాస పురాణాలలో కూడా సాంఖ్య దర్శనా చార్యుడు కపిల మహర్షి యే అని ధృవీకరించాయి"అన్నాడు.

జేమ్స్ జీన్స్ పండితుడు "భౌతిక విజ్ఞానం యదార్ధాన్ని గ్రహింప జాలనిది అవటం వలన మనం ఇంకా పరమార్ధ స్పర్శకు దూరం గానే ఉన్నాం"అనగా, ".ప్రస్తుత భౌతిక జ్ఞాన విశ్వం అగమ్య గోచరం. ప్రకృతి పరిణామ వాదం ఎక్కువైంది. అన్ని చోట్లా అసందర్భాలు,

పరస్పర వ్యతిరేకతలు ఉండటం చేత ఈ విజ్ఞానం సంతృప్తికరం కాదు ''అన్నాడు సల్లినాన్ పండితుడు.మరింత ముందుకు వెళ్లి లింకన్ బార్నెట్ ''ప్రకృతి రహస్యాల తెరలు తొలగించిన కొద్దీ, సంక్షోభం నుంచీ క్రమత్వం ఏర్పడి, నానాత్వం నుంచి ఏకత్వం కలిగి, భావాలన్నీ లయించి మూల సూత్రాలు అధిక తరంగా సులభ మౌతాయి ''అన్నాడు.

ఇంతటి ముఖ్య దర్శనాచార్యుడైన కపిలుడి పుట్టుపూర్వోత్తరాలు తెలియటం లేదని డా.ఎస్ ఎస్ సూర్యనారాయణ శాస్త్రి బాధపడ్డారు. సాంఖ్య ఉపనిషత్ గా ప్రసిద్ధి చెందిన ''శ్వేతాశ్వతర ఉపనిషత్ ''మొదటగా కపిలుని నామం స్మరించినది. సర్వ సృష్టికి కారణమైన బ్రహ్మ సృష్టిలో మొదట పుట్టిన తనకుమారుడైన కపిలునికి సర్వ విజ్ఞానాలు ప్రసాదించాడు అని ఉన్నది. కనుక కపిలుడు బ్రహ్మ మానస పుత్రుడు, సర్వజ్ఞుడు.గౌడ పాదుడుకూడా కపిలముని ని బ్రహ్మమానస పుత్రునిగానే చెప్పాడు. సాంఖ్య కారికా భాష్యం లో గౌడపాదుడు ''ధర్మజ్ఞాన వైరాగ్య ఐశ్వర్యాలు సృష్టి మొదట్లో భగవంతుడైన కపిలాచార్యునికి సహజంగా అలవడినాయి ''అని కీర్తించాడు. కపిలుని తర్వాత ఉద్భవించిన సనక, సనందన,సనాతన, సనత్కుమారులు షోడశ వర్ష శరీర దారులనీ, వారితో పుట్టిన భావాలు ప్రకృతికాలు అని గౌడపాదుడు చెప్పాడు . శ్వేతాశ్వరోపనిషత్ లో ''నిత్యాలకు నిత్యుడు, చేతనాలకు చేతనుడు, అనేకులలో ఏకుడు,సర్వకామ ప్రదాత అయినవాడు ఆత్మ.''సాంఖ్య యోగం తో దీన్ని గ్రహించి, ఆ దేవతను ఎవడు తెలుసుకొంటాడో వాడు అన్ని బంధాలనుంచి విముక్తు డౌతాడు ''అని కపిల ప్రోక్త సాంఖ్యం చెబుతోంది. కనుక'' శ్వేతాశ్వతర ఉపనిషత్ కాలానికే సాంఖ్యం బాగా ప్రాచుర్యం పొందింది''అన్నాడు డా.ఇ.రోయర్.కపిలముని పై మరి కొన్ని విషయాలు మరోసారి తెలుసుకొందాం.

''ప్రపంచ చరిత్రలో మొట్టమొదట మనస్సు యొక్కస్వాతంత్ర్యం, దాని శక్తి సామర్ధ్యాలపై పూర్తి విశ్వాసాన్ని ప్రకటించింది సాంఖ్యమే''అన్నాడు రిచార్డ్ గార్బ్.''ప్రపంచం లో ఇదివరకు ఎన్నడూ లేని ఔక్తిక విధానం అంటే రేషనల్ సిస్టం సాంఖ్యం మాత్రమె ప్రవేశపెట్టింది ''అన్నాడు వివేకానందుడు. ''కపిల సిద్ధాంతానికి చారిత్రిక ప్రాధాన్యం ఉంది. మానవ మనో చరిత్ర లో ఇది అత్యంత అద్భుత విషయం. కారణం –ఆలోచించే ప్రతి మనసులో ప్రపంచ సృష్టి, మానవ ప్రకృతి సంబంధాలు, వాటి భవిష్యత్ నిర్ణయాలు మొదలైన వాటిపై వచ్చే అగోచరమైన సమస్యలకు యుక్తి యుక్తం గా సంతృప్తి కలిగే సమాధానం చెప్పింది సాంఖ్యం ఒక్కటే

"అన్నాడు సాంఖ్య కారిక లో డా.జాన్ డేవిస్."సాంఖ్యం పరిపక్వమైన, మనోధర్మమైన తత్వ శాస్త్రం. ఎందుకంటె భగవంతుని ఆస్తికత ను, యుక్తిమూలం గా నిరూపించటం సాధ్యం కాదని తెలిసి కూడా దాని విషయం లో మౌనం చూపింది అనే సత్యాన్ని బట్టి దర్శనాలు సాంప్రదాయక మతాల నుండియెంత స్వతంత్రంగా వ్యక్తమయ్యాయో తెలుస్తోంది. శుద్ధ తత్వ శాస్త్రం లో సాంఖ్యం ఒక ప్రఖ్యాతమైన ప్రయత్నం అని "శ్రీనివాస అయ్యంగార్, రాధాకృష్ణన్ అభిప్రాయ పడ్డారు. జాన్ డేవిస్ కూడా "కపిలుని సాంఖ్యదర్శనం శుద్ధ తత్వ విషయం లో భారత దేశం వెలువరించిన విషయ సమగ్రత పొందింది "అన్నా డు. మహాభారతం కూడా సాంఖ్యం లాంటి జ్ఞానం లేనే లేదు అన్న ది. "ప్రకృతి తత్వ శాస్త్రాలు వ్యత్యస్తాలై, ఏకత్వ సాధనకు అసాధ్యంగా ఉన్నా, ప్రకృతి శాస్త్ర ఫలితాలకు అన్వయిస్తూ తాత్విక విధానం ఉండాలి "అన్నా డు రాధా కృష్ణ పండితుడు. " మానవ నిత్యానుభూతి, యుక్తియుక్తంగా విచారణ చేయటం సాంఖ్యం నిరూపించింది. ఈమార్గం లో ప్రతివాడూ తన అనుభవం తో ప్రారంభించి, తర్వాత తనకు అందని సర్వాన్నీ బహిర్గతం చేస్తాడు. అనుభవం ఎందుకు అవసరమో, అనుభూతి సాధించటం ఎలాగో, సాంఖ్యం విస్పష్టంగా వివరించింది "అంటాడు రాధాకృష్ణన్. "అధ్యాత్మం కాని యుక్తి విధానం సాంఖ్యం అవలంబించింది. దీని అంకురార్పణ నిత్యానుభవం. అనుభవం యొక్క సరైన నిర్వచనమే సాంఖ్యం తత్త్వం "అని జేఎన్ ముఖర్జీ స్పష్ట పరచాడు. మానవలోకానికి అసాధారణమైన, సాటిలేని తాత్విక సిద్ధాంతాన్ని ప్రసాదించిన ఈ సాంఖ్యం ను తక్కువ చేసి మాట్లాడే వారిపై కోపం తో "భారతీయుల షట్ దర్శనాల శ్రేష్టత్వాన్ని బట్టి వేదాంతాన్ని కొందరు భారతీయ తత్వ వేత్తలు క్రమంగా ఏర్పాటు చేశారు. సాంఖ్యానికి రెండవ స్థానం కల్పించారు. ఈ అప్రదాన్యతకు సాంఖ్యం తన అసమ్మతిని తీవ్రంగా ప్రకటించింది. సాంఖ్యం ఒక అద్భుత తత్వ శాస్త్రాన్ని ప్రబోధించింది. ఇలాంటిదాన్ని వేదాంతానికి రెండవది గా చేయటం దాని సిద్ధాంత జ్ఞాన లోపం, అవగాహనా రాహిత్యం వల్లనే "అంటాడు ముఖర్జీ.

"వ్యాకుల చిత్తులైన, నిరాశాపరుల ఊహలతో, ఊహాతీత తన్మయత్వాన్ని అనుభవించటానికి, విపరీత వ్యామోహం తోకానీ, సాంఖ్యం ఆకర్షింప బడదు. "ప్రపంచం ద్వారా, ప్రపంచం లో, ప్రపంచం కోసం "దృఢమైన, నిశితమైన, నిత్యమైన జీవిత సందేశాన్ని సాంఖ్యం అందిస్తోంది. దాని విశాల భవనం మీద వేదం ఒక ప్రత్యేక గ్రంథం గా కాక, ఒక సాహిత్యమే అయింది అన్నాడు ముఖర్జీ పండితుడు సాంఖ్యం పై ఉన్న అవ్యాజ గౌరవం తో.

"సర్వ సిద్ధాంతాలతో ఖండన మండనాలు పొందిన సాంఖ్యం ఎంతటి ప్రధాన స్థానం ఆక్రమిం చిందో అర్ధమౌతుంది. వేదాంత సూత్రాలు సాంఖ్యం తో ఢీ కొట్టే ప్రయత్నాలు చేశాయి. కొందరు బౌద్ధులు ఖండించారు. "కార్యం, కారణం లో అంతర్గతంగా ఉంటుంది "అన్న సాంఖ్యాన్ని వైశేషికులు ప్రతిఘటించారు. కానీ ఇతర వాదాలచేత సాంఖ్యం "శ్రౌతం "గా పరిగణింప బడి, క్రమంగా పూర్తిగా లయింప బడి, తర్వాత

హైందవ విజ్ఞానం లో సుస్థిరంగా పొదగబడిందని పండితభావం. వేదాంత సూత్రాలు కానివన్నీ తామసికాలు అని పద్మ పురాణం, .వైశేషిక సాంఖ్యాలు మహర్షులచేత రాయబడినా, అవి మందబుద్ధులకోసమే అని సూత సంహిత, అంటూ కీర్తించినా నిందించినా, బౌద్ధానికి ముందున్న పురాణ విజ్ఞానం లో సాంఖ్యం సర్వాదిపత్యం ఉన్న సిద్ధాంతంగా చెలామణి అయింది"అన్నారు శ్రీనివాస అయ్యంగార్, ముఖర్జీ లు. శంకర భగవత్పాదులు కూడా పూర్వోక్త చందం కార్యకార ణాలకు అనన్యత్వ అంగీకారం ఉండటం వలన, ధర్మశాస్త్ర వేత్తలైన దేవలుడు మొదలైన వారిచే అనుసరించబడటం వలన సాంఖ్యం ప్రఖ్యాత మైందికనుక, దాని ఖండనం వేదాంత భాష్యం లో దాని ఘనతను అంగీకరించారు. ఈవిధంగా కపిలముని చెప్పిన సంఖ్య సిద్ధాంత సూత్రాలప్రాధాన్యత అగణితం, అపూర్వం అని అర్ధమౌతోంది.

ఆధారం – శ్రీ అనుభవానంద స్వామి వారి –"సర్వ సిద్ధాంత సౌరభం".

## భారతీయ విజ్ఞానం

"భారత దేశం కేవలం సాధువులు, యోగులు, మహాత్ములు తత్వ వేత్తలను మాత్రమె నిర్మించింది అనటం అసందర్భం. భారతీయజీవనం సర్వతోముఖ శక్తుల్ని ప్రదర్శించింది. గణితం లో సున్నా కున్న ప్రాముఖ్యం అంకెల స్థానాలను బట్టి విలువలేర్పడే పద్ధతి, సాంకేతిక గణిత విధానం మొదలైన అద్భుతాలు హిందూ దేశం లోనే జరిగాయి. దశ సంఖ్యామానం రుగ్వేదకాలం లోనే ఉంది "అని పండిట్ నెహ్రు చెప్పాడు. 19వ శతాబ్ది పారశీక పండితుడు అల్ జహీజ్ "హిందువులు గణిత జ్యోతిష వైద్యాది పలు శాస్త్రాలలో అగ్రగణ్యులు. "అన్నాడు "అనేక విజ్ఞానాలకు ఆటపట్టు అయిన భారత దేశం ప్రస్తుతం ప్రపంచ లో ఎక్కువగా ఉపయోగించే 1,2,3,- - 0 వరకు ఉన్న అంకెల సంస్కృత సంఖ్యారూపాలను నిర్మించింది. గణితమే కాక, న్యూటన్ పుట్టటానికి వేలాది సంవత్సరాలకు పూర్వమే భారతీయులకు గురుత్వ శక్తి తెలుసు "అన్నాడు స్వామి వివకానంద. తత్వవేత్త, రచయిత విల్ డ్యూరాంట్ "సర్వమానవాళికి మాతృ దేశం భారత భూమి యే.అన్ని భాషలకు తల్లి సంస్కృతమే. 'తత్వ శాస్త్రం పుట్టింది కూడా ఇక్కడే "అన్నాడు. "అరబ్బీయుల వలన మన గణితానికి, బుద్ధునిమూలంగా క్రైస్తవ మత ఆదర్శాలకు, గ్రామ పంచాయితీల నుండి స్వరాజ్యం, ప్రజారాజ్యలకు హిందూ మతమే తల్లిఅని చెప్పి . సర్వ జ్ఞాన ప్రదాత్రి అయిన భారతమాత పాద పద్మాలకు విల్ డ్యూరాంట్ ప్రణామం చేశాడు.

" భూగర్భం లో ఉండిపోయిన మొహంజ దారో హరప్పా ల త్రవ్వకాలవలన బయల్పడిన నాగరకతకు కనీసం 5 వేల సంవత్సరాలు. ఢిల్లీ దగ్గర ఉన్న ఇనుపస్తంభం శీతోష్ణాలకు మార్పు చెందకుండా ఇంతకాలం

ఉండటం ఆధునిక సైంటిస్ట్ లకే ఆశ్చర్యం " అన్నాడు నెహ్రు. "తమ కుశాగ్ర బుద్ధిని ఖగోళానికీ అను సంధించి సూర్య చంద్ర గమనాలను. అతి సూక్ష్మంగా పరిశీలించారనీ, వారి చంద్ర కళాపరిణామ గ్రహణం నిర్దుష్టం "అన్నాడు కోల్ బ్రూక్. 9వ శతాబ్ది పర్షియా పండితుడు జాకోబి "అన్ని దేశాల వారి కంటే భారతీయులు ఖగోళ జ్యోతిష శాస్త్రాలలో నిర్దుష్టమైన పాండిత్యం ఉన్న వారు. "అన్నాడు "అందుకే భారతీయులు మాత్రమె, అతి నిర్దుష్టమైన గమన విధానాన్ని గ్రహించారు"అన్నాడు బాలగంగాధర తిలక్. "పతంజలి యోగ శాస్త్రం అధ్యయనం చేస్తే 'భువనజ్ఞానం సూర్యే సంయమాత్ "అంటే సూర్యుని యందు బుద్ధిని సంయమనం చేస్తే, 14లోకాల విజ్ఞానం తెలుస్తుంది "అని పతంజలి భాష్యకర్త వ్యాస దేవుడు పేర్కొన్నాడు. "చంద్రే తారా వ్యూహ జ్ఞానం"అంటే చంద్రుని ఏకాగ్ర బుద్ధితో పరిశీలిస్తే నక్షత్ర మండల జ్ఞానం కలుగుతుంది. "ధ్రువే తద్గతి జ్ఞానం "ధ్రువ నక్షత్ర సంయమనం వలన నక్షత్ర గమన జ్ఞానం కలుగుతుంది అని పతంజలి సూత్రాలలో చెప్పాడు.

సంస్కృతి వ్యక్తీ నిష్టమై వికసించి నాగరకత రూపం లో సంఘం లో వ్యాపిస్తుంది. ఇదివరకే మనం తెలుసుకున్నట్లు రెండురకాల సంస్కృతీ విభాగాలు పూర్తిగా సాంఘికాలై నాగరకత అవుతోంది. నాగరకత కు రెండు విస్పష్ట భావనలున్నాయి అవి కృషి ఫలితంగా ఏర్పడతాయి. కృషి రూపం అంటే వ్యక్తిని సాంఘికం చేయటం. దీనివలన సాంఘిక వాది అవుతాడు మనిషి. కనుక నాగరకత అంటే సాంఘిక వ్యవస్థయే..ఇది జీవిత విదానాన్ని తెలియ జేస్తుంది. ఇతరులతో ఏకత్వాన్ని చేస్తుంది. ఇదే నాగరకత ముఖ్య విధానం అంటాడు దీరేంద్రనాథ రాయ్.

విజ్ఞాన ప్రదాత్రి అయిన భారత దేశం అసమాన సర్వతోముఖ సంస్కృతీ సంపదను పెంపొందించి అనుభవించి, ఆనందించటమేకాక త్యాగం తో విశ్వమానవ కల్యాణాన్నే అపేక్షించే ప్రేమైక స్వరూపిణి, తనను ఆశ్రయించిన వారికీ ఆశ్రయించని వారికీ కూడా విజ్ఞాన భిక్షపెట్టి, ప్రాపంచిక సుఖాలకు అతీతులు గా మానవ జాతిని ఉద్ధరిస్తోంది. "ఈజిప్ట్ దేశం అతి ప్రాచీనకాలం లో తన నిబంధనలు సాంఘిక వ్యవస్థ, కళలను భౌతిక శాస్త్రాన్నీ భారత దేశం నుంచే గ్రహించింది "అని దివ్యజ్ఞాన సమాజ వ్యవస్థాపకురాలు మేడం బ్లావట్స్కీ తన" సీక్రెట్ డాక్ట్రిన్" లో చెప్పింది. గ్రీకు విజ్ఞాని ప్లేటో తనగురువు సోక్రటీస్ చనిపోయాక, హిందూ దేశానికి వచ్చి, తత్వ శాస్త్రం అధ్యయనం చేసినట్లు తెలుస్తోంది.సోక్రటీస్ కాలం లో భారతీయ బ్రాహ్మణ గురు పండితులు ఎథేన్స్ నగరం లో బోధించారు. క్రీ.పూ.550వాడైన పైథాగరస్ కూడా.

"యవన దండ యాత్రలలోనే కాక, వివిధకాలలలోని రాజ్య సామ్రాజ్య విధానాలలో, చక్రవర్తుల విధానాలలో కూడా భారతీయ ఐక్యత మరో రకంగా కనపడింది అన్నాడు సురేంద్రనాథ దాస్. .ఆధ్యాత్మిక తృష్ణ, పారమార్ధిక నియమపాలన, అన్నిటికంటే ముఖ్యం అని పించటం వలన, భారత దేశం అనేకానేక అసంఖ్యాక రాజకీయ పరివర్తనాలను అధిగమించి నిలబడింది "ఆన్నాడు దాస్ . శిశిర్ కుమార్ సేన్ కూడా "భారతీయ

చిత్తానికి పారమార్ధిక దృష్టి మాత్రమె మూల సూత్రం "అన్నాడు. ఇదే భారత దేశ అపూర్వ అసమాన విచిత్ర తత్త్వం.

ఆధారం –శ్రీ అనుభవానంద స్వామి వారి –"సర్వ వేదాంత సౌరభం '

## భారత మాత దివ్య స్వరూపం

భారత మాత పూర్వం ఎలా ఉందో,ఏమి చెప్పిందో గ్రహించటానికి దేశ కాలాలలో చాలాదూరం ప్రయాణం చేస్తే కాని ఆ మాతృ స్వరూపాన్ని సరిగ్గా అర్ధం చేసుకోలేము . చారిత్రిక విధానం లో ఉన్న పాక్షిక దృష్టి కాక, పరిణామాన్ని తటస్థ దృష్టి తో చూసి, ఈ సంస్కృతి వ్యక్తి నిత్య జీవితం,సంఘం, ప్రజాబాహుళ్య0 లో ఎలా ప్రవేశించి మార్పు తెచ్చిందో గ్రహించాలి. అందుకోసం మనం ముందుగా సంస్కృతి అంటే ఏమిటో అర్ధం చేసుకోవాలి .

"ఒక జాతి సంస్కృతి దాని సర్వ సామాన్య వ్యక్తిత్వాన్ని వ్యక్తం చేస్తుంది "అన్నాడు ధీరేంద్ర నాథ్.అంటే జాతికి సంస్కృతి జీవగర్ర అని భావం. ప్రజానీకం యొక్క బాహ్య అభ్యంతర పురోగమనాన్ని కలుగ జేసే సంపూర్ణ నాగర వ్యవస్థలో అప్రత్యక్షంగా, సర్వ వ్యాపకం గా ఉన్న తత్వమే సంస్కృతి అన్నాడాయన., సంస్కృతి కున్న సంబంధం ఏమిటి ?ప్రత్యేకతలతో వేషభాషలలో అనేక మార్పులు కలిగించి, భూసారం పెంచి సస్యశ్యామలం చేసి మానవ జీవితాలలో బాహ్యామైన మార్పులు కలిగించేది సంస్కృతి . దీని వలన భూ గర్భం లో ఉన్న అనేక లోహజాతులు రూపాంతరం చెంది, మానవులకు ఉపయోగకారకాలై మానవ జీవితాన్ని సున్నితం చేస్తుంది. ఈ సంస్కృతీ బలం తో కిందికి ప్రవహించే జలాలు పైకి ఎగసి ప్రజోపకారం గా మారతాయి. అనేక ప్రకృతి శక్తులు మానవాధీనాలై దుఖం తగ్గించి సుఖాన్ని పెంచటానికి తోడ్పడతాయి. దీనినే లౌకిక సంస్కృతీ అంటారు.

సంస్కృతిలో రెండవభాగం ధార్మికం అంటే నైతికం అంటారు. మొదటిదానిలో ప్రకృతి శక్తులు ద్వారా సంపద పెరిగి మనిషి అనుభవించి సుఖిస్తాడు. రెండవ భాగం అతడి స్వేచ్చా విహారానికి కొన్ని అడ్డకట్టలు వేస్తుంది. స్వార్ధాన్ని తగ్గిస్తుంది స్వాతంత్రానికి హద్దులేర్పరుస్తుంది. అనుభవించే అధికారం ఉన్నా వనరులకు ఆటంకం కలిగించరాదని శాసిస్తుంది. ఇతరులను బాధించ రాదని, నివారిస్తుంది. అందరికీ అనుభవించే హక్కు ఉందని బోధిస్తుంది. ప్రకృతి సంపదానుభవం మనిషికి లాగానే ఇతర ప్రాణులకు అధికారం ఉందనే ఎరుకతో మానవ సమాజం జీవిస్తోందని పండిట్ నెహ్రు అన్నాడు. "భారత దేశం ప్రాచీన పురుషుల్ని విస్మరిస్తే, అది భారత భూమిగా ఉండదు. తనకు ఆనందం గర్వకారణం అయినది అంతా అదృశ్యమౌతాయని నెహ్రు పండితుడే విస్పష్టంగా చెప్పాడు. గతాన్ని ద్వేషించకుండా అందులోని మంచిని,

వర్తమాన భావిష్యత్తులకు ఉపయోగ పడేట్లు చేయాలి. ”భూతకాలాన్ని వర్తమానానికి అనుసంధించి, భవిష్యత్తుకు మేళవించి, ఉపయోగ పడని వాటిని వదిలేసి, భావన, ఆచరణ కోసం సచేతనం చేయటమే శ్రేయస్కరం “అన్నాడు నెహ్రు.

“ The philosophy of a country is the cream of its culture and civilization “అంటే దేశ సంస్కృతి,నాగరకతలకు ఆదేశ తత్వ శాస్త్రం వెన్నలాంటిది. అందుకే భారత దేశ ఔన్నత్యం అనాది గురు పరంపరాగత ఆధ్యాత్మిక విద్యా వైభవం మూలంగానే వ్యక్తమౌతాయి. ఆమెకు ఆధ్యాత్మిక విద్యయే జీవ గర్ర. .ఆమహిమ వలన భారత దేశం ఒక్కటే భగవంతుని గ్రహించిందని, దివ్యాతి దివ్య ఆధ్యాత్మిక సంప్రదాయానికి కారకం అనీ, ప్రపంచం లోనే అత్యున్నత ఆధ్యాత్మిక శక్తి అనీ, ప్రపంచానికి హృదయ స్థానమని, మానవ పరిణామానికి అధినేత అనీ, ప్రపంచానికి శిరస్సు అనీ, జగన్మాత అనీ ప్రఖ్యాతి పొంది, పవిత్ర చరిత్రయై భారతి స్వార్ధ పరం కాకుండా ఈశ్వర నిమిత్తంగా లోక సంగ్రహణం కోసం ఉందని, అలౌకిక యశో నిదానంగా ప్రకాశిస్తోందని అవిలినో, లూయిస్ రెనాన్, కెన్నెత్ వాకర్, శిరీష్ కుమార్ మిత్ర, స్వామి రామ తీర్ధ, అరవిందులు, చెప్పిన విలువైన మాటలను మనం మననం చేసుకొంటూ అర్ధం చేసుకోవాలి.

ఆధారం –శ్రీ అనుభవానంద స్వామి వారి –సర్వ సిద్ధాంత సౌరభం

## కణాద వైశేషిక విశేషాలు

ఎంతో ప్రాచీనమైనదైనా కణాద వైశేషిక సూత్రాలకు ప్రాచీన భాష్యం ఒక్కటి కూడా లేకపోవటం దురదృష్టం. ”ఇతి రావణ ప్రణీతే భాష్యే దృశ్యత”అని బ్రహ్మ సూత్ర భాష్యం లో శంకరాచార్యులు చెప్పి ఉండటం చేత వైశేషికానికి” రావణ భాష్యం “ఉండేదని తెలుస్తోంది. వైశేషికానికి “భారద్వాజ వృత్తి “కూడా ఉందని అంటారు. కానీ ఈ రెండూ లభించలేదని రాధాకృష్ణ పండితుడు అన్నాడు. తర్వాత లభించిన భాష్యాలలో “ప్రశస్త పాదాచార్యుడు “రాసిన “పదార్ధ ధర్మ సంగ్రహం “ముఖ్యమైనది అనుకొన్నా “అది సర్వ స్వతంత్రమైనది” అన్నాడు మాక్డోనాల్డ్.కాని అందులో విషయం మాత్రం సక్రమంగా ఉందనీ, కొన్ని ముఖ్యవిషయాలు కలిపితే అది సంపూర్ణ,వినూత్న గ్రంథం అవుతుందని మాక్డొనాల్డ్ ఉవాచ. ”ఈభాష్యం వ్యాఖ్య కాక, వైశేషిక దర్శనం యొక్క సక్రమ సంక్షిప్తరూపం “అన్నారు శ్రీనివాస అయ్యంగార్. ప్రశస్త పాదుని రచన వైశేషికం పై భాష్యం కాక స్వతంత్ర గ్రంథం అన్నాడు రాధాకృష్ణన్ కూడా. ”ప్రశస్త పాదుడు పతంజలి న్యాయ భాష్యకర్త వాత్సాయనుని భావాలను తీసుకొన్నాడు కనుక క్రీ.శ 4వ శతాబ్ది వాడు అయి ఉంటాడు “అన్నాడు రాధాకృష్ణ పండిట్. ”న్యాయ సిద్ధాంత ప్రభావం కణాద సూత్రాల ప్రశస్త పాదుని పదార్ధ ధర్మ సంగ్రహణం లో లేదుకానీ, వైశేషిక భావాల గౌతమ సూత్రాలు, వాత్సాయన భాష్యం తీసుకున్నాడని చెప్పటానికి

ఆధారాలున్నాయి. తర్కభావాలను దిగ్నాగుని నుంచి, తీసుకోన్నాడుకనుక ఆకాలం పై ఆధారపడాలి కనుక క్రీశ 5వ శతాబ్దివాడు ప్రశస్త పాదుడు" అన్నాడు మాక్డోనాల్డ్.కాని ఇది తప్పు, అతడికాలం క్రీశ 1వ శతాబ్దికి తర్వాత మాత్రమె అన్నారు శ్రీనివాస అయ్యంగార్.

పండితలోకం ప్రశస్త పాదుని భాష్యాన్ని" లైట్ తీసుకోక పోయినా", శంకర మిశ్రరాసిన "ఉపస్కార " అనేది వైశేషిక సూత్రా"లకు సరైన మొదటిభాష్యం అన్నాడు మాక్డోనాల్డ్. సాంప్రదాయక నిర్వచనం అంతరించి పోయాక చాలాకాలం తర్వాత క్రీశ 1600లో రాయబడింది కనుక ప్రాధాన్యం పొందలేదు.ప్రశస్త పాద భాష్యానికి న్యాయాచార్యుడు ఉదయనుడు "కిరణావళి"అనే వృత్తి,శ్రీధరాచార్యులు"న్యాయ కండలి"అనే టీకా రాశారు. క్రీశ 1400లో శివాదిత్యుడు రాసిన "సప్త పదార్ధి "కి విశ్వనాథపంచానన భట్టా చార్యుడు "భాషా పరిచ్ఛేదం"అనేకారిక, దీనికి "న్యాయ సిద్ధాంత ముక్తావళి "అనే ప్రశస్త రచన చేశాడు.

"వైశేషిక దర్శన దృక్పధం ఊహకంటే శాస్త్రీయం, సంకలనం కంటే విమర్శారూపం కనుక అరుదైన గొప్ప వైజ్ఞానిక శాస్త్రం "అన్నాడు రాధాకృష్ణన్. "సర్వ ధర్మాలకుఆధారమై, అన్ని కర్మలకు అనుష్టానమై, ఉండే తత్వ శాస్త్రం సర్వ విజ్ఞానానికి వెలుగు బంతి"అని చెప్పిన కౌటిల్యుని మాటను బట్టి న్యాయ వైశేషికాలు మాత్రమె సైన్స్ ను, సామాన్య జ్ఞానాన్ని సమర్ధిస్తూ,పరిశీలంతో ఉన్న తత్వ శాస్త్రాన్ని తెలియజేస్తాయి. కనుక వైశేషికం తత్వ శాస్త్ర రాజం. న్యాయ వైశేషికాలు ఒకదానిభావాలు మరొకటి తీసుకున్నా, న్యాయం పూర్తిగా తర్కాన్నిస్తే, ప్రాకృతిక ప్రపంచానికి ఆధారమైన పరమాణువులు ఉన్నాయనే భౌతిక భావాన్ని తెలియ జేసింది వైశేషికం మాత్రమె అంటాడు సర్వేపల్లి పండితుడు. బాహ్య, అంతర ప్రపంచాలను తీసుకొని న్యాయం, వాద జ్ఞానం ద్వారా, అంతాభ్రాంతి అనే వాదాన్ని ఖండిస్తే, అనుభవ జ్ఞాన మీమాంస ను వైశేషికం సమర్ధించి ప్రత్యక్ష అనుమాన ఆగమాలద్వారా తెలియబడే విషయాలకు అన్వయించే సామాన్య సూత్రాలను ఇది నిర్మించింది. "అన్నాడు రాధా కృష్ణన్. ఫలప్రదమైన సర్వ తత్వ శాస్త్రం కూడా భౌతిక ప్రపంచ నిర్మాణాన్ని గురించి ఆలోచించాలి అని వైశేషికం హెచ్చరించి, పరమావధి అయిన సత్యం లోనేకాక, నానాత్వమైన భౌతికం పై కూడా శ్రద్ధ చూపించింది. అందుకే పరమాణు వస్తుత్వ విచారాన్ని అభి వృద్ధి చేసింది. పదార్ధ పరిశోధనా రహస్యాలను చాటే వైశేషికానికి తర్కం అనే పునాది పైన కాక, సుస్థిర తత్వ శాస్త్రము మిగిలిన వాటిపై ఆధారపడి నిర్మించబడ జాలదు. న్యాయ దర్శనం, తర్కాన్నీ పూరిస్తే, ఈ రెండు దర్శనాలు పరస్పర అపేక్షకాలై సమానమైన తంత్రాలయ్యాయి "అంటాడు పండిత రాధాకృష్ణన్. ఇంతటి సన్నిహిత సంబంధం తో గౌతమ, కణాదులు సోదరులులాగా సోమశర్మ పాదాల వద్ద విద్య నేర్వటం వలన వారి దర్శనాలు కూడా పరస్పర అన్యోన్యతతో కలిసి ఒకటిగా అనిపించటం పెద్దగా ఆశ్చర్యం కలిగించదు.అనటం అత్యంత సముచితం. ఈ సిద్ధాంత ద్వయ సమన్వయ వాక్యమా అన్నట్లు "వ్యావహారికం అనాశ్రిత్య నిర్వాణం నోప

లభ్యతే "అని తంత్ర శాస్త్రం కూడా స్పష్టంగా చెప్పింది. దేన్ని ఎదుర్కోవాలో దేన్ని జయించాలో తెలుసుకొని పోరాడితేకాని విజయశ్రీ లభించదు –"యదేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా,తదేవ వీర్య వత్తరం భవతి "అన్న ఛాందోగ్య ఉపనిషత్ ను అనుసరించి దేన్నీ తెలిసికొని శ్రద్ధా శక్తులతో చేస్తామో ఆకార్యం సంపూర్ణం గా ఫలప్రదమౌతుంది. దీన్ని బట్టి "ప్రపంచ తత్త్వాన్ని విమర్శనా దృష్టితో పరిశీలించి, నానాత్వ, వికార, విభేదన రూప ప్రపంచానికి జంకని వాడే వైశేషికుడు"అనే సామెత లోకంలో వ్యాప్తి చెందింది. "సాధన సముదాయానికి ధీరత్వం, జ్ఞానం ప్రసాదించి, తత్వ శాస్త్రం లో ప్రస్ఫుటంగా, నిరాటంకం గా, చర్చించ బడనట్టి విషయం ఒక్కటి కూడా వైశేషికం లో లేనే లేదు "అన్న మాక్స్ ముల్లర్ పండితుని శేముషీ గరిమకు జోహార్లు

కణాద సిద్ధాంతం లో ఈశ్వర స్థానం ఏమిటి ?అనేదానిపై అభిప్రాయ భేదాలున్నాయి. ఈశ్వరుని గూర్చి ఆయన ప్రస్ఫుటంగా చెప్పలేదనీ, విశ్వ సమస్యా పరిష్కారం లో అదృష్ట సిద్ధాంతం తో తృప్తి పొందాడని, పండిత రాధాకృష్ణన్ భావించాడు. వైశేషిక సూత్రాలలో కొన్ని ఈశ్వర అస్తిత్వం తెలిపేవి ఉన్నాయని అంటారుకాని అది సత్యదూరం అన్నాడు పండితుడు. ఈశ్వరుడినికాని, పరమ సృష్టికర్తను కాని కణాదుడు సూచించ లేదని శ్రీని వాస అయ్యంగార్ కూడా చెప్పాడు. కానీ సృష్టి కారణానికి అధిష్టానం అయిన పరమాణు స్పందనకు, జీవ సంచలనానికీ అదృష్టమే కారణమని వైశేషికం నమ్మింది. కణాదుని అనుచరులు మాత్రం అదృష్ట సిద్ధాంతం అవిస్పస్టం అనాధ్యాత్మికం అని నమ్మి, ఈశ్వర సంకల్పానికి దాన్ని అధీనంగా చేశారు –Made it dependent on God's will.కనుక తర్వాతకాలం లో "ఈశ్వరుడు విశ్వానికి నిమిత్తకారణమనీ, పరమాణువులు ఉపాదానకారణం" అనీ భావించారని రాధాకృష్ణన్ చెప్పాడు.

" భౌతిక ప్రపంచానికి తమ సిద్ధాంతాలు సంబంధించి ఉండటం వలన, దానికి అతీతంగా కణాదుడు మొదట్లో ఈశ్వర ప్రస్తావన చేసి ఉండక పోవచ్చుననీ, అభౌతిక కతృత్వాలను కోరకుండా సూత్ర కర్తలు. భౌతిక విషయాలపైనే దృష్టిపెట్టి ఉంటారనీ, భాష్యకర్తలు దీన్ని లోపంగా భావించి, అవకాశం ఉన్న ప్రతిచోటా ఈశ్వర భావాన్ని చొప్పించి, ఆ లోపాన్ని పూరించారు "అని "అథల్యే "అభిప్రాయ పడ్డాడు. వీటిని బట్టి కణాదుడు నాస్తికుడు కాదు. సృష్టి సిద్ధాంతానికి ఈశ్వరుడు అక్కర్లేదు అనిభావించి ప్రస్తావించలేదు. త్యాజ్యమైన ఈ సృష్టిని అధిగమించటానికి మొదట్లో ప్రకృతి విధానం తీసుకోవటం ముఖ్యావసరమై, సాంఖ్యం కూడా ఈశ్వర విషయం లో మౌనంగా ఉండటం వలన, యోగం వైశేషికాలు పరమాత్మను ఒప్పుకొంటూ, అతడికి విశ్వ కర్తృత్వాన్ని మాత్రం కట్టబెట్టలేదు. దర్శనాలు వచ్చిన క్రమాలను ఆలోచిస్తే, న్యాయ, వైశేషికాలు స్థూలాన్నీ, సాంఖ్య,యోగాలు మానసికాన్ని, మీమాంసా ద్వయం అద్వైతాన్ని నొక్కి చెప్పాయి. కనుక వైశేషిక ప్రతిపాదన అంతా స్థూల విశ్వాన్ని గూర్చి మాత్రమె అని తెలుస్తోంది. ఈ మూల రహస్యాన్ని పాటించకుండా బహుశా శంకరాచార్యులు తమ సూత్ర భాష్యం లో ప్రధానమైన పరమాణు సృష్టి కర్తృత్వాన్ని ఖండించి,

''తదేవ మసారతర తర్క సందృబ్దత్వా దీశ్వర కారణ శ్రుతి విరుద్ధత్వా చ్చ్రుతి ప్రవణై శ్చ శిష్టైర్మన్వాదిరపరీ గృహీతత్వా దత్యంత మేవాన పేక్షా స్మిన్,పరమాణుకారణ వాదేకార్యార్యైహ-శ్రేయో నర్ధి భిరితి ''భావం-నిస్సార మైన మాటలతో కూడినదికనుక,, ఈశ్వర జగత్కారణం చెప్పే శ్రుతులకు విరుద్ధం కనుక, వేదాదులపై ఆదరమున్న మనువు మొదలైనవారు దీన్ని స్వీకరించ లేదు కనుక పరమాణు కారణ వాదం పై శ్రేయస్సు కోరే ఆచార్యులు ఉపేక్ష వహించారు. శిష్టులు గ్రహించకపోయినా, ప్రతిష్ట ప్రాబల్యాలకు లోపం వచ్చేఅవకాశమున్నా, తమ సిద్ధాంతాలను వాటి ప్రతిఫలాన్నీ, తత్వ వేత్తలు మరుగున పడేట్లు చేయక పోవటం చేతనే భారతీయ తత్వ శాస్త్రం లో తాను ఎక్కువగా మెచ్చుకొనే అంశం ''అన్నాడు మాక్స్ ముల్లర్ పండితుడు. ఇతరులచేత నాస్తికం, అవైదికం గా పరిగణింప బడుతున్నా, గౌరవ మర్యాదలు పొందకపోయినా. లక్ష్య పెట్టక తన దారిలో తాను వైశేషికం నడుస్తూ ప్రత్యేకత చాటుతోంది అని శ్రీ అనుభావానంద స్వామి అభిప్రాయం.

''ప్రశస్తమైన ఉపనిషత్ లలో న్యాయ వైశేషికాలు కనిపించవు. పతంజలి, కణాదపేర్లు కూడా కనిపించవు.అయినా సూత్రకర్తలుగా చెప్పబడే తత్వ వేత్తలు భారత తత్వ శాస్త్రం లో ఆదిపురుషులుగా గుర్తింప బడటానికిఅవకాశం లేదు ''అన్న మాక్స్ ముల్లర్ మాటలు గణనీయాలు . ''ఈ సూత్ర కర్తలకుఆధారంగా ఒక భావ ధార ఉండాలి.మీరు చూసిన విన్న దర్శనాలన్నీ ఉపనిషత్ ప్రమాణం పై ఆధార పడి ఉన్నవే ''అన్నాడు వివేకానంద స్వామి. ''ఉపనిషత్కాలం తర్వాత ఒక్కొక్క సిద్ధాంతాన్నీ గ్రహించి, తమ తత్వ విజ్ఞాన పాఠ శాలలలోగురు పరంపరగా బోధిస్తూ అభి వృద్ధి చేయబడుతూ ఉన్న సిద్ధాంతాలకు ఒక ప్రస్ఫుట స్వరూపం ఇచ్చే కాలం వచ్చింది.దర్శనాలకు మూలాధారం ఉపనిషత్తులే''అని బల్లగుద్ది మరీ చెప్పాడు మాక్డోనాల్డ్.

''తద్వచనాదామ్నాయస్య ప్రామాణ్యం''-''తస్మాదాగమికం''-, ''వేదం లింగాచ్చ'',వైదికం చ, బుద్ధిపూర్వా వాక్య కృతిర్వేదే''మొదలైన సూత్రాలు ప్రత్యక్షంగా వేదాన్ని ప్రస్తావించి, ప్రమాణంగా గ్రహించింది కనుక వైశేషికం అవైదికం అనటం అసంబద్ధం అసమంజసం అన్నారు అనుభవానందులు. అన్ని దర్శనాలకు వేదమే ప్రమాణం. ఆయా దర్శనాలు వాటిలో తమకు ఉచితమైన స్వంత సిద్ధాంత ప్రతిపాదనకు ఉపయుక్తాలైన విషయాలను మాత్రమె గ్రహించి, దర్శన నిర్మాణం చేసి భారతీయ తత్వ జ్ఞానాన్ని షట్ దర్శనాలలో సమగ్రత పొందింది ''అని కీర్తించిన మాక్స్ ముల్లర్ పండితుని మాటలను, బట్టి భారతీయ తత్వ శాస్త్ర భావ సంపత్తు ఆకాశాన్ని అంటి,అసమాన యశస్సు ప్రసాదించి అమృతత్వాన్ని ఆర్జించాయి అనటం ఉత్తమోత్తమం అన్నారు శ్రీ అనుభావానంద స్వామీజీ.

పరమాణువు

వైశేషికం లో పరమాణువు, అంటే ఆటం,గురుత్వం అంటే గ్రావిటిఅనే మాటలు బాగా ప్రాధాన్యం వహించాయి. ఇందులోని నిర్వచనాలకు ఇప్పుడు మనం చెప్పుకొనే నిర్వచనాలకు తేడా ఉంది. త్రికాలాభాధ్యమైన వస్తువు ఉంది అని సాంఖ్యం,సర్వ సృష్టికి ఆధారమై నిత్యమైన పరమాణువు ఉందని వైశేషికం, నిత్య శబ్దం నుంచే సృష్టి జరిగిందని మీమాంసకులు చెప్పారు. ప్రాచీన ఋషులకు ద్రవ్యం యొక్క అనశ్వరత్వం తెలియక పోలేదు. కపిల గౌతమ కణాద,పతంజలి జైమిని మొదలైన వారికి పదార్ధం యొక్క నిత్యత్వం తెల్సు అని రామకృష్ణానందులు చెప్పారు . ఆధునిక విజ్ఞాన శాస్త్ర పారిభాషిక పదాలే భారతీయ విజ్ఞాన శాస్త్రం లో ఉండటం చేత, ముఖ్యంగా వైశేషికం పరమాణు సిద్ధాంతం, గురుత్వాన్నీ సూచించి ఉండటం చేత, వాటిని ఈనాటి సైన్స్ కు అన్వయించ కూడదనీ, ,అలా చేస్తే అనేక సమస్యలేర్పడతాయనీ, ప్రాచీనుల దృక్పధం భౌతికమూ అభౌతికమూ కనుక తత్వ విషయం లో సంకలనం చేయటం సర్వ సాధారణం కాదనీ మాక్డోనాల్డ్ అన్నాడు. ఇతడి భావనలో వైశేషికంలోని పరమాణు సిద్ధాంతం సమగ్రం కాకపోవచ్చు. కానీ సైన్స్ ఎప్పటికీ సంపూర్ణం కానేరదు. ప్రాచీన ఆధునిక కాలాలో పరమాణు సిద్ధాంతం ఎప్పుడూ సక్రమంగా నిరూపించ బడలేదన్నాడు రాధాకృష్ణన్. కనుక సమగ్రం కాకపోయినా, ప్రపంచం లో మొట్టమొదట పరమాణు సిద్ధాంతం ప్రతిపాదించిన వాడు మాత్రం కణాద మహర్షియే.లౌకిక అలౌకికాలకు, ప్రాపంచిక, ఆధ్యాత్మికతలకు, భౌతిక విజ్ఞాన ఆధ్యాత్మిక విజ్ఞానానికి కణాద మహర్షి సమన్వయము చేశాడు అన్నది నిర్వివాద విషయం. ”sciece without religion is lame, religion without science is blind ’’అని చెప్పిన ఆధునిక విజ్ఞానఖని ఆల్బర్ట్ అయిన్ స్టీన్ వాక్య రహస్యాన్ని ఆనాడే కాణాద ముని గ్రహించాడు.

## గురుత్వ సిద్ధాంతం

గ్రావిటి అంటే గురుత్వ సిద్ధాంతాన్ని కూడా వైశేషికం లో కణాదముని చెప్పాడు. ఇది కూడా సర్వ ప్రపంచానికి ఆశ్చర్య విషయమే –గురుత్వ ప్రయత్నా సంయోగానాత్ క్షేపణం’,,సంయోగ భావే గురుత్వాత్ పతనం, సంస్కారభావే గురుత్వాత్ పతనం, ,అపాం సంయోగ భావే గురుత్వాత్ పతనం, మొదలైన సూత్రాలలో గురుత్వాకర్షణ చెప్పబడింది. మొదటి సూత్రానికి ఉపస్కార కారుడు ”అత్ర గురుత్వ స్య హస్త లోష్టాది వర్తినో నిమిత్త కారణత్వం ‘’అంటే గురుత్వం హస్తాదికాలలో కలిగి ఉత్ క్షేపణ కార్యానికి –అంటే పైకి వెళ్ళటానికి నిమిత్తమౌతుంది. అలాగే ‘’ప్రతి బంధ భావే గురుత్వా దసమవాయి కారణాత్ పతనం అథ సంయోగ ఫలికా క్రియా జాయతే ‘’అంటే ప్రతిబందికా భావం లో అసమవాయి కారణమైన గురుత్వం వలన పతనం, ఆతర్వాత సంయోగరూప ఫలితం లభిస్తుంది. ”ఫలాదౌ ‘’పడే పండు నే వ్యాఖ్యాత ఉదాహరణగాతీసుకొన్నాడు.దీన్నే న్యూటన్ ఆపిల్ పండు పడటం చూసి గ్రావిటి చెప్పాడు. గురుత్వం పృధివీ జల వృత్తిహ్ ” అని తర్క స సంగ్రహణం కూడా సమర్ధించింది. గురుత్వం అనే శక్తి భూమి నీరు లలో ఉన్నా, ఇంద్రియ గోచరం కాదు. ”సామర్గ్య భావా న్న గురుత్వా దేహ ప్రత్యక్షం ‘’కంటికి కనిపించటానికి సామర్గ్యం లేక పోవటం చేత గురుత్వం అగోచరం ”అని రాస్తూ, గురుత్వం స్పర్శ చేత కనిపిస్తుందని వల్లభా చార్యుడు ఉదాహరించాడని వృత్తి కారుడు చెప్పాడు. కారికా వలీకర్త కూడా ” , గురుత్వం స్యాత్, పృధిర్యాది ద్వయే

తుతత్ '' గురుత్వం అతీంద్రియమై భూమి నీరు లలో ఉందనీ, ''తదేవాసమవాయిస్యాత్ పతనాఖ్యే తు కర్మణి''అంటే అది అసమవాయి కారణంగా ఉంటూ పతన క్రియను కలగ జేస్తోంది అని రాశాడు. ''సంయోగ జన్య క్రియాదిత్యమనుమానే న గురుత్వ సిద్ధిరితిభావః ''అనగా సంయోగం జన్యాన్ని బట్టి, గురుత్వం ఉన్నట్లు సిద్ధమని ముక్తావళి చెప్పింది. కనుక గురుత్వం ఫలాదులలో, భూమిలో ఉన్నది అని భావం. ఇది ఆధునిక గ్రావిటి కి అతి దగ్గరభావమే ''gravitation was kown by the Indians thousands of years before Newton was born ''అని వివేకానందుడు నిర్ద్వంద్వంగా మరీ చెప్పాడు . ''భౌతిక, విజ్ఞాన తత్త్వాలను సమన్వయ పరచి, జిజ్ఞాసువు లందరికీ అతి సూక్ష్మంగా పరిశోధనా విధానాన్ని ప్రసాదించి, ముముక్షువులకు తరుణోపాయాన్ని కటాక్షించిన కణాదమహర్షి మిక్కిలి స్తవనీయుడు, చిరస్మరణీయుడు, ఆమహామహుడికి సర్వ విజ్ఞానలోకం సదా తజ్ఞులై ఉండాలి అన్నారు స్వామి అనుభవానంద స్వామీజీ ''

ఆధారం –శ్రీ అనుభవానంద స్వామి వారి –''సర్వ సిద్ధాంత సౌరభం ''

## మనకు తెలిసీ తెలియని సంగతులు

''బృహత్ శంకర విజయం ''లో గోవిందుడు అనే ఆయన పూర్వాశ్రమం లో చంద్ర శర్మ అనీ అతడే శ్రీ హర్ష విక్రమాదిత్యుని తండ్రి అని ఉన్నది. క్రీ.పూ లో మాళ్వ రాజ్యాన్ని పాలించే బ్రాహ్మణ రాజు తన కూతుర్ని మహా విద్వాంసుడైన చంద్ర వర్మకిచ్చి పెళ్లి చేశాడు. ఈ దంపతులకు శ్రీ హర్ష విక్రమార్కుడు పుట్టాడు. హర్షుడు రాజ్యానికి వచ్చాక తండ్రి చంద్ర వర్మనర్మదా తీరం లోని గౌడ పాదుని ఆశ్రయించి, గోవింద భగవత్పాదుడు అయ్యాడు. ఈయనే మన శంకరాచార్యుల వారి గురువు. గౌడపాదుడు పతంజలి మహర్షి నుంచి వ్యాకరణం,శుక మహర్షి నుంచి బ్రహ్మ విద్య నేర్చాడు. హర్ష విక్రమాదిత్యుడు నేపాల్ ను కూడా పాలించాడు. పార శీకుల్ని ఓడించి పారద్రోలాడు. ఈపారశీకులు'' శకే ''అనే దేశం నుంచి వచ్చారు,ఓడిపోయారుకనుక విక్రముడికి ''శకారి'' బిరుదు వచ్చింది. ఇతడు క్రీపూ.457లో చనిపోయాడు. అప్పటి నుంచి హర్ష శకం ప్రారంభమైంది.

పారమార వంశానికి చెందిన మరో విక్రమార్కుడు ఉజ్జయిని ని పాలించాడు. ఇతడు క్రీ. పూ.57న విక్రమ శకం ప్రారంభించాడు. ఇతడి కొడుకే శాలివాహనుడు. శాలివాహనుడు క్రీ శ 54లో రాజ్యానికి వచ్చి, క్రీ శ.78లో శకులను ఓడించి, శాలివాహన శక కర్త అయ్యాడు. ఇలా మూడు శకాలు ప్రారంభమయ్యాయి.

చంద్ర వర్మ పూర్వాశ్రమం లో గౌడ పాదుని శిష్యుడై, విద్యనేర్చి నాలుగు వర్ణాలలోని నలుగురు కన్యలను పెళ్ళాడి వాళ్ళ వలన వరరుచి, విక్రమాదిత్య, భట్టి, భర్తృహరి అనే కొడుకులకు జన్మ నిచ్చాడు. వరరుచి పాణిని కి సహాధ్యాయి. విక్రమార్కుడు ఉజ్జయిని చక్రవర్తి అవగా, భట్టి మహా కవిగా రాజాస్థానం లో ఉన్నాడు. భర్తృహరి ''వాక్య పదీయం''అనే వ్యాకరణం, శతకాలు రాశాడు.

పతంజలి శాపానికి గురైన గౌడ పాదుదు బ్రహ్మ రాక్షసిగా పుట్టి, సమర్ధుడైన వాడికి తన వ్యాకరణం బోధించి, శాప విమోచనం పొందాడు. గురువు ఆదేశం తో ఉత్తరదేశయాత్ర చేస్తూ,చంద్రవర్మకు వ్యాకరణం బోధించి శాపం పోగొట్టుకొన్నాడు.

చంద్ర వర్మ గోవింద భగవత్పాదుడై,నర్మదా నదీ తీరం లో అమరేశ్వరం (ఓంకార క్షేత్రం )లో శిష్యులకు బోధ చేస్తూ , నర్మదా ద్వీపం అయిన మాంధాత ద్వీపం లో క్రీ.పూ.494న సిద్ధి పొందాడు. అప్పుడు కొడుకు విక్రమాదిత్యుడు ఓంకార నాధ దేవాలయం నిర్మించి, అమరేశ్వర లింగ ప్రతిష్ట చేశాడు. శ్రీ హర్ష విక్రమాదిత్యుడు ఉజ్జయిని చక్రవర్తి అయి, శకులను ఓడించి క్రీపూ 457 శ్రీ హర్ష శకం ప్రారంభించాడు. గుప్త వంశ చక్రవర్తి చంద్ర గుప్తుడు కూడా విక్రమాదిత్య బిరుదు పొంది, పారశీకులను ఓడించి క్రీపూ 270లో మగధ రాజ్యాధిపతి అయ్యాడు. మాళవ దేశ రాజు విక్రమాదిత్యుడు క్రీపూ 57లో పట్టాభి షిక్తుడై, విక్రమార్క శకం ప్రారంభించాడు. ఇలా ముగ్గురు విక్రమాదిత్యులు ఉండటం తో చరిత్రకారులు ఉక్కిరి బిక్కిరి అయ్యారు.

పూర్ణ వర్మ అనే రాజు జావా ద్వీపాన్ని పాలించాడు. మరో పూర్ణ వర్మను చైనాయత్రికుడు హుయాన్ సాంగ్ ప్రస్తావించాడు. ఈకాలం క్రీ శ 540 కనుక శంకరాచార్య ఆ కాలానికి చెంది ఉంటాడు అని తెలంగ్ అనే పండితుడు ఉవాచ. శశాంకుడు అనే రాజు బౌద్ధులకు ప్రాణప్రదమైన బోధి వృక్షాన్ని నరికించేశాడు. అశోక వంశానికి చివరి రాజైన పూర్ణవర్మ వెయ్యి ఆవులపాలతో దానికి అభిషేకం చేసి చిగురింప జేశాడు. ఆ బోధి వృక్షం చుట్టూ 24అడుగుల ఎత్తైన గోడ కట్టించాడని,హుయాన్సాంగ్ వచ్చేనాటికి గోడ శిధిలమై 4అడుగుల ఎత్తు మాత్రమె ఉందని హుయాన్ సాంగ్ రాశాడు.

క్రీ శ 750లో పాటలీపుత్ర నగరం గంగానది వరదలలో మునిగిపోతే, ప్రస్తుతం ఉన్న పాట్నా క్రీశ 1541లో ఉద్ధరింప బడింది. అలాగే "సుఘ్న నగరం "ధానేశ్వరం"దగ్గర యమునా నది ఒడ్డున ఉండేది. ఈ రెండు పట్టణాలను శ్రీ శంకరులు పేర్కన్నారు. వీటన్నిటి వలన తేలిన విషయం –శ్రీ శంకర భగవత్పాదులు పాశ్చాత్యుల లెక్క ప్రకారం క్రీ శ లో పుట్టిన వారు కానే కాదు. క్రీ.పూ. 500ప్రాంతం వారు. ఇంకా ఖచ్చితంగా చెప్పాలంటే క్రీ పూ 509 కి చెందిన వారు.

ఆధారం –శ్రీఅనుభవానంద స్వామి వారి" సర్వ సిద్ధాంత సౌరభం".

## అద్వైతామృతం

శ్రీ పతంజలి గారికి నమస్తే. మీకు, మే కుటుంబానికీ శుభా కాంక్షలు. మానస సంచరరే నా సెల్ ఫోన్ లో ఉదయం అయిదుగంటలకు అలారం గా పెట్టుకోని చాలా ఏళ్ళనుంచి వింటున్నాను. ఆ పాట ఆపాత మధురం. అలౌకికానందం. ఎన్నో పూర్వాపరాలను  పోర్వా స్పృశిస్తూ, విషయాన్ని విన్గాడిస్తూ మనసును నవనీత చోరునిపైనే లగ్న మఎట్లు వివరించారు. నేను ఈమధ్యే బ్రహ్మేన్ద్రుల కీర్తనలు అన్నీ చదివాను. అందులో వారి అద్వైత భావన నన్ను ఆకర్షించిందిఅందుకని  ఒక వ్యాస పరంపర తయారు చేశాను. మీ రచన చూసిన తర్వాత ఇక ఆలస్యం చెయ్యకూడదని ఈ రోజే నెట్ లో దాన్ని ప్రారంభిస్తున్నాను. మీ ఆశీర్వాదం, ప్రోత్సాహం లభిస్తుందని ఆశ. మీరు ఉపయోగించిన సదాశివుల సమాధి చిత్రాన్ని నేను ఉపయోగించుకోవటానికి అనుమతి నివ్వండి. నా శీర్షిక "సదాస్గివ బ్రహ్మేంద్ర కీర్తనలలోఅద్వైతా మృతం" . ఇంకేదో నెట్ లో రాద్దా మనుకుంటున్న సమయం లో మీ కీర్తన పాఠం  నన్ను బాగా ప్రేరేపించింది. మీ అంత గా లోతులు తడమలేనేమో కాని అవసరమైన సమాచారం అందించగలనని భావిస్తున్నాను. ఇప్పుడే శ్రీ కారం చుడుతున్నాను ---దీనికి ఆధారం 'స్వామిని శారదా ప్రియానంద వ్రాసిన "సంగీత వేదాంతం ".-- మీ దుర్గా ప్రసాద్

## శ్రీ సదాశివ బ్రహ్మేంద్ర కీర్తనల లో అద్వైతామృతం ---1

### జీవితం

"భజరే రఘువీరం --మానస భజరే రఘువీరామ్ "--"సర్వం బ్రహ్మ మయం రేరే "---బ్రూహి ముకున్దేతి "---క్రీడతి వనమాలీ "---"పిబరే రామ రసం "--"మానస సంచరరే "మొదలైన భక్తీ కీర్తనలతో భక్తీ,జ్ఞాన, వైరాగ్యాలు అనే త్రివేణీ సంగమాన్ని సృష్టించిన భక్త మహాకవి శ్రీ సదాశివ బ్రహ్మేన్ద్రులు. .ఆ కీర్తనలను తన స్వరమాధుర్యం తో అమృతమయం చేసి గానంతో సకల జనులను భక్తి లహరి లో ముంచి తేల్చిన ప్రముఖ వాగ్గేయకారులు పద్మవిభూషణ్ శ్రీ మంగళం పల్లి బాలమురళీ కృష్ణ. బంగారానికి తావి అద్దారు. వింటుంటే మానసం ఎక్కడికో సంచారానికి వెళ్తుంది. ఎక్కడి కేమిటి ఆ పరబ్రహ్మ సందర్శనకే. బ్రహ్మ పదానికి చేరువ చేస్తుంది. అట్టి మహనీయ కీర్తనలో ఆధ్యాత్మిక భావం అంతరంగాన్ని ప్రక్షాళనం చేసి రసోపై సహ అనిపిస్తూ  అద్వైతామృత వర్షాన్ని కురిపించి తనియిమ్పజేసి, తరింప జేస్తుంది. ఆ మహామహుని దివ్య జీవిత తరంగినిని దర్శించి ధన్యులమవుదాం.

బ్రహ్మేన్ద్రుల అసలు పేరు శివ రాముడు. ఆంధ్రుల ముద్దు బిడ్డ మన సదాశివుడు. తండ్రి మోక్ష సుందర అవధాని. తల్లి పార్వతమ్మ. 18 వ శతాబ్దం లో తమిళనాడు లో కావెరి తీరం లో కుంభకోణం దగ్గర చిన్న గ్రామం లో జన్మించారు. చిన్నతనం నుంచే వైరాగ్యం అలవడింది పిల్లాడు. ఎమైపోతాదేమో నని భయం తో పెళ్లి చేశారు. భార్య పుష్పవతి అయిందని కబురు వచ్చింది తల్లి పిండివంటలు చేస్తోంది. ఇంటికి వచ్చిన బ్రహ్మేన్ద్రుని ఆత్రం చూసి కాసేపు ఆగమనీ, అత్తవారింటికి వాటిని తీసుకు వెళ్లాలనీ చెప్పింది.

అప్పటికప్పుడు ఆయన మనో కవాటం తెరుచుకుంది. విషయవాసనలు వుంటే పడిగాపులు తప్పవు అని జ్ఞానోదయమయింది. ఏదో తెలుసుకోవాలనే కాంక్ష మిన్ను ముట్టింది. పరమశివేంద్ర గురు దర్శనం చేసి, అనుగ్రహం పొందాడు ఆయన ''సదాశివ బ్రహ్మేంద్రుడు ''అనే పేరు పెట్టి, శాస్త్ర బోధ చేశాడు. తర్కం అంతు చూశాడు. అందరిని వాదానికి పిలిచి గెలిచి,ఓడినవారిని హేళన చేశాడు. అతని అతి ప్రవర్తనను, వాచాలత్వాన్ని గ్రహించిన గురువు ''సదాశివా !నీ నోరు ఎప్పుడు మూత పడుతుంది ?అని తీవ్రం గా అన్నాడు. వెంటనే శిష్యుడు ''ఇదిగో ఇప్పుడే ''అనినమస్కారం చేసి బయటకు వెళ్లి పోయాడు. ఇలావైరాగ్యమూ , మౌనము ఆయనకు క్షణాలమీద కలగటం ఆశ్చర్యం. మౌన ముద్రాలన్కృతుడయాడు. . మనస్సును పరబ్రహ్మం పై లగ్నం చేసి, పర్సమహంస లా ఉన్మత్తునిలా సంచరించ సాగాడు. గురువుకు విషయం తెలిసి తన కంటే తన శిష్యుడు ధన్యుడయాడని భావించి పరవశించాడు.

పుదుక్కోట సంస్థానాదీశుడు సదాశివులను దర్శించి మహిమను గుర్తించి ఉపదేశం కోరాడు. ఇసుక మీద మంత్రం రాసి మౌన ఉపదేశం చేశాడు. ఆ పవిత్ర అక్షరాలున్న ఇసుకను, మట్టితో సహా తవ్వించి తన పూజా మందిరం లో భద్రపరచుకున్నాడు రాజు. బ్రహ్మేన్ద్రుల ఆత్మ జ్యోతి ప్రకాశిస్తున్న కొద్దీ ఆయన చేష్టలన్నీ మహిమాన్వితమవుతున్నాయి. ఒక రైతు ధాన్యం నూర్చి రాసిగా పోసిన చోట అసంగతం గా బ్రహ్మేన్ద్రులు వెళ్లి కూర్చుని ధ్యానం లో మగ్నమయారు. రైతు రాత్రి కాపలాకు వచ్చి ఆయన్ను దొంగగా భావించి కొట్టబోతే చెయ్యి అలాగే స్తంభించి పోయిందట. తెల్లవారి సమాధిలోంచి లేచి రైతువంక చూస్తూ,వెళ్ళిపోగానే రైతు చెయ్యి మళ్ళీ స్వాధీనం లోకి వచ్చిందట. ఇంకోసారి ఒక పెళ్ళికూతుర్ని పాము కరిస్తే సదాశివుల అనుగ్రహం తో ఆమె లేచి కూర్చుందట. మరోసారి తన్మయత్వం లో పాడుకుంటూ వెళ్తుంటే, ఒక డేరా లో నిద్రిస్తున్న నవాబుకు నిద్రాభంగమయి, పిచ్చి కోపంతో బ్రహ్మేన్ద్రుల చేతిని కత్తి తో నరికేశాడట. రక్తం ప్రవాహం గా కార్తోంది. నగ్నం గా నడిచి పోతున్న ఆయనకు బాహ్య స్పృహ లేదు. తప్పు తెలుసుకున్న నవాబు పాదాలపై పడి క్షమించమని ప్రార్దిన్చాడట. ''దేనికి క్షమాపణ ?అన్నారట యతీంద్రులు. ''మీరెవరో ఎలీక మీ చేయి నరికాను స్వామీ ''అని ఏడ్చాడట నవాబు. ''నా చేయినా ''అంటూ చేతి వంక చూసుకున్నాడట. చెయ్యి కనిపించలేదు. క్రింద. పడి వుంది. దాన్ని తీసుకొని యద్గాస్తానం లోపెట్టుకోగానే పెటు అతుక్కు పోయిందట. మళ్ళీ పాడుకుంటూ, తనకేమీ తెలియని స్థితిలో వెళ్లిపోయారట బ్రహ్మేన్ద్రులు.

కొడుమూడు అనేఉపనది   ఒడ్డున సమాధి స్థితి లో వుండగా, అకస్మాత్తుగా వరద వచ్చి అంతా ముంచేసింది. అందరు హెచ్చరిస్త్యన్నా, సదాశివులకు ఏమీ పట్ట లేదు. శరేరం వరదలో కొట్టుకు పోయి ఇసుక లో కూరుకు పోయింది. నాలుగు నెలల తర్వాత రైతులు ఇసుక మేట ను తవ్వు తుంటే శరీరం బయట పడింది. జనమంతా ఆశ్చర్య పోయారు. ఆయన సమాధి నుంచి లేచి, మాట్లాడ కుండా వెళ్లి పోయారు. బ్రహ్మేన్ద్రులు చిన్న పిల్లల తో చాలా సరదాగా గడిపే వారట. ఒకసారి పిల్లలంతా ఆయన చుట్టూ చేరి తిరువాలూర్ లో జరిగే సంబరాలు చూపించమని కోరారట. వాళ్ళందర్నీ తన దగ్గర కూర్చో పెట్టుకుని,

తాకుతూ, కళ్ళు మూసుకో మన్నా డట /.కళ్ళు తెరిచేసరికి అందరు తిరువళ్లూర్ లో ఉన్నా రట. ఉత్సవాలు చూపించి ప్రసాదాలు, తినుబండారాలు కొనిచ్చి మళ్ళీ కళ్ళు మూసుకో మన్నా రట. కళ్ళు తెరిచే సరికి వాళ్ల వూరు ''కరూర్ ''లో ఉన్నా రట. ఆయన ఆ గ్రామం లోనే స్థిర పడ్డారు. పిల్ల లంతా పెద్దవాళ్ళకు చెప్పి, తాము తెచ్చినవాన్నే చూపిస్తే అందరు ఆశ్చర్య పోయారట.

జ్యేష్ట శుద్ధ దశమి నాడు తాను దేహ త్యాగం చేస్తానని, కరూర్ లోనే తనను సమాధి చేయమని, కాశీ నుండి ఒక బ్రాహ్మణుడు శివలింగాన్ని తెస్తాదనీ, దాన్ని తన సమాధిపై ప్రతిష్టించమని భక్తులకు ముందే చెప్పి బ్రహ్మైక్యం చెందిన పరమ హంస సదాశివ బ్రహ్మేన్ద్రులు. పుదుక్కోట సంస్తానాదీశులే ఇప్పటికీ సమాధి సంరక్షణ చేస్తూ వుంటారు.

సదాశివెంద్రులు చాలా గ్రంధాలు రాశారు. బ్రహ్మసూత్రాలకు అద్భుత వ్యాఖ్యానం రాశారు. ''ఆత్మ విద్యావిలాసం '','శివ మానసిక పూజ 'వారి ప్రఖ్యాత రచనలు. వీటన్నిటికంటే బాగా ప్రచారం లో వున్నవి వారి కీర్తనలు. అవి ఇరపై నాలుగు మాత్రమే. వాటి లోని భాషా మాధుర్యం, శైలి, భావం, గాంభీర్యం, భక్తి,ఆధ్యాత్మిక సంపద ముగ్ధుల్ని చేస్తాయి. అద్వైతామృత వర్షం కురిపించారు. .ఆత్మ బోధ చేశారు. అర్ధ గాంభీర్యం తో పాటు సంగీతా మాధుర్యం తొణికిసలాడే కీర్తనలు అవి. ''అద్వైతం త్రిషు లోకేషు--నా ద్వైతం గురునా సహ్ ''అన్నది శ్రీ సదాశివుల బ్రాహ్మీ భావం. అలాంటి పరమ గురువు ప్రణామం చేస్తూ, ఆఅద్వైత భావ లహరి లో తరిద్దాం. .ఆరస గుళిక లను ఆస్వాదిద్దాం.

ఇందులోఅయిదు శ్రీరాముని పరంగా, ఎనిమిది కీర్తనలు శ్రీ కృష్ణునిపై, మనసును ఉద్దేశించి ఆత్మబోదగా అయిదు గురువు పరమశివెంద్రులను కీర్తిస్తూ ఒకటి, గంగానది పరంగా ఒకటి మిగిలిన నాలుగు బ్రహ్మానందానుభవం గా రాశారు. ఇవి సోపాన క్రమం లో వుండి మోక్ష సాధనకు మెట్లుగా కనిపిస్తాయి. గురు సాన్నిధ్యం లోనే చిత్త వికారాలు తొలగి మనసు పరిపూర్ణ మవుతుందని చెప్పారు. చివరి కీర్తన గంగామతల్లి పై రాసిన సంగతి చెప్పాను. భారతీయ ఆధ్యాత్మిక భావనకు, అనుభవాలకు తర తరాల సాక్షీభూతం గా నిలిచింది పవిత్ర భాగీరధి. బ్రహానందం,అమ్రుతానందం.ప్రణవమే సర్వార్ధ సాధకంఅన్నా ర బ్రహ్మేన్ద్రులు. అమేయమైన అనుబూతి కలిగించే ఆ కీర్తనా వైభవాన్ని ''రామ రసాయనం ''గా. ''క్రిష్ణామ్రుతం 'గా, ''ఆత్మానందం ''గా, ''బ్రహ్మానుభూతి ''గా వింగడించి తెలుసు కోని, ఆ అమ్రుతానందాన్ని అందుకొందాం. మానసిక పున్డరీకాన్ని శత పత్ర వికసనం చేసు కుందాం. దివ్యానందాన్ని అనుభవిద్దాం. శ్రీ సదా శివ బ్రహ్మేంద్ర పరమహంస పవిత్ర కీర్తనామ్రుతాన్ని తనివి తీర గ్రోలి మోక్షాన్ని పొందుదాం.

## రామరసం

శ్రీరాముని పై రాసిన మొదటి కీర్తన భజరే రఘువీరం. ఆ కీర్తనను పూర్తిగా అందిస్తాను

**పల్లవి —భజరే రఘువీరం, మానస –భజరే రఘు ధీరం**

**అనుపల్లవి –అం బుద డింభ విడంబన గాత్రం —అం బుద వాహన నందన దాత్రం**

**చరణం –01 -కుశిక సుతార్పిత కార్ముక వేదం –వశి హృదయాంబుజ భాస్కర పాదం**

**కుండల మండల మండిత కర్ణం –కుండల మంచక మద్భుత వర్ణం**

**చరణం –02 -దండిత సుంద సుతాదిక వీరం –మండిత మనుకుల మాశ్రయ శౌరిం**

**పరమహంస మఖిలాగమ వేద్యం —పరమ వేద మకుటీ ప్రతి పాద్యం.**

భావం —-మన మనసును ఉద్దేశించి బ్రహ్మేన్ద్రులు ఉపదేశం చేస్తున్నారు. బహు ధీరుడైన రఘు వీరుణ్ణి భాజించమని మనసు బోధ చేస్తున్నారు. నీల మేఘ శకలం (ముక్క )కాంతిని వాదించే శరీర వర్ణం కలవాడు, భక్తుడైన హనుమ కోర్కెలు తీర్చే వాడు, విశ్వామిత్ర గురు అనుగ్రహం తో విలు విద్యను పొంది, భక్తుల హృదయ పద్మాలకు వికాసాన్నిచ్చే సూర్య కిరణం అయిన వాడు, చెవులకు వుండే కుండలాల శోభ చేత కనువిందు చేసే కర్ణాలు (చెవులు )వున్న వాడు, ఆది శేషుని పాన్పుగా చేసుకుని నిద్రించే వాడు, మారీచాది రాక్షసులను సంహరించిన వాడు, మను వంశానికే వన్నె తెచ్చిన వాడు, పరమహంస అయిన వాడూ, వేదాల ద్వారా మాత్రమే తెలుసుకో తగిన వాడు, వేదం ప్రతిపాదించిన వాటిలో మకుటాయమాన (peak )మైన వాడు, అయిన శ్రీ రఘు రాముని భాజించమని హితవు చెప్పాడు

నిరా కారం అయిన బ్రహ్మ బుద్ధి శూక్ష్మం వల్ల,వేదం లో ప్రతి పాదించిన దాన్ని తెలుసుకోవటం వల్లనే తెలియ బడ తాడు. ఆకారం వున్న వాడు గా ఆకారం లేని వాడుగా రెండు రకాలుగా శ్రీరామ పరబ్రహ్మం కని పిస్తాడు. ఆయనను సేవించటం ఉత్తమం. "కుండల మండల మండిత కర్ణం –కుండల మంచక మద్భుత వర్ణం "అనటం లో కుండల మంచక అంటే చుట్లు చుట్లు కోని వున ఆదిశేషుని పడక గా వున్న వాడు అని అంటే అనంత పద్మనాభుడు అని భావం. పదాల పరుగు మనసును శ్రీ రాముని మనోహర రూపం దగ్గరకు చేరుస్తుంది శబ్దాలన్నీ చెవులకు నాద శోభను కలిగిస్తాయి. పద నర్తనం ప్రత్యక్షం గా చూడ గలం. పదం ఎంత సాభిప్రాయం గా ప్రయోగించాడో, అందులోని భావం కూడా అంత లోతుగా వుండటం బ్రహ్మేన్ద్రుల ప్రత్యేకత. .హాయిగా వినచ్చుఅర్ధం తెలియక పోయినా ఆ శబ్దాలు మనసు లో నర్తిస్తాయి. చెవులకు ఇంపు కలిగించే పద శౌరభం లయ తో కూడిన నడక సదాశివుల రచనా వైభవం. మనసు తో రాస్తారు కనుక మహా మహిమాన్వితం గా వుంది కీర్తన. .

## రామ రసాయనం

సదాశివ బ్రహ్మేన్ద్రుల కీర్తనలలో రామ రసాయనం లో మొదటి కీర్తన గురించి తెలుసు కున్నాం.ఇప్పుడు రెండో కీర్తన వివరిస్తాను

**02 -పల్లవి --ప్రతి వారం వారం మానస -భజరే రఘు వీరం**

**చరణం ---కాలామ్భోధర కాంత శరీరం ----కౌశిక శుక శౌనక పరి వారం-||**

**కౌశల్యా దశరధ సుకుమారం --కలి కల్మష భయ గహన కుథారిం ||**

**పరమ హంస హ్రుత్పద్మ విహారం -ప్రతి హత దశముఖ బల విస్తారం ||**

భావం ------నీల మేఘం వంటి శరీరపు రంగు కలవాడు, శుకుడు శౌనకుడు,కౌశికుడు (విశ్వా మిత్రుడు )అనే పరివారం కలవాడు, కౌసల్యా దశరదుల గారాబు పట్టి, కలి చేత కల్మషం (మురికి )అయిన భయం అనే అరణ్యాన్ని చేదించే (నరికే )గొడ్డలి అయిన వాడు, సదా పరమ హంసల హృదయ పద్మ విహారుడు, రావణ, బల దర్పాన్ని నాశనం చేసిన వాడు, అయిన ఆ రాఘువుడిని

భజించు అని మనసుకు సలహా ఇస్తున్నారు బ్రహ్మేన్ద్రులు.

వారం వారం అంటే వారానికో సారి అని కాదు అర్ధం. ప్రతిక్షణం అంటే యెడ తెరిపి లేకుండా. ''పరమహంస హ్రుత్పద్మ విహారం-ప్రతి హత దశముఖ బల విస్తారం 'అనటం లో ఆనందానుభూతి ఉంది. , అధర్మం చేసిన వాడు పదిముఖాలున్న వాడైనా, ఎంత మొనగాడైనా ధర్మం చేతి లో చని పోవాల్సిందే అని సూచన వుంది. రాముడు పరబ్రహ్మ స్వరూపుడే మాయామానుష విగ్రహ రూపం గా అవతరించాడు. యోగుల హృదయాలలో ఎప్పుడూ సంచరిస్తూనే ఉంటాడు. వాళ్ళు కూడా ఆయన దర్శనం తో పులకిస్తూనే వుంటారు. దశేన్ద్రియాలను అదుపు లో ఉంచుకున్న వాడు శ్రీ రామ చంద్రుడు. ఇంద్రియ వ్యామోహం తో చెలరేగిన వాడు రావణాసురుడు. అలాంటి ఇంద్రియ గర్వాన్ని బ్రహ్మాస్త్రం తో నాశనం చేసిన వాడు రాముడు. ఇంద్రియాలు అదుపు లో వుంటే మోక్షం అదుపు తప్పితే వినాశం. అనే గొప్ప సత్యాన్ని అనుకూల మైన పదాలను ఉపయోగించి భావ గర్భితం గా రాశారు సదాశివులు. ఎక్కడా ఒక్క అనవసర పదం వుండదు. ప్రతి మాట లో జరిగిన కధను గుర్తు చేసే పైనం వారిది.

ఇప్పుడు రామ రసాయనం లో మూడవ కీర్తన

**03 -- పల్లవి --చేతః శ్రీ రామం చిన్తయ జీమూత శ్యామం ""**

**చరణాలు ----01 -అంగీకృత తుంబురు సంగీతం -- హనుమద్ గవయ గవాక్ష సమేతం ||**

**02 -నవరత్న స్థాపిత కోటీరం ----నవ తులసీ దళ కల్పిత హారం.**

**03 -పరమ హంస హృద్గోపుర దీపం ---చరణ దళిత ముని తరుణీ శాపం ||**

భావం ----మేఘశ్యామల దేహం కలవాడు, తుమ్బురునిసంగీతానందాన్ని పొందిన వాడు, హనుమ, గవయ గావాక్షులతో నిత్యం సంచరించే వాడు, నవరత్నాలు పొదిగిన జటాజూటం (కోటీరం )వున్న వాడు, తులసి మాలలచే శోభించే వాడు, పరమ హంసల హృదయ దీపం అయిన వాడు, పాద స్పర్శ చేత అహల్యకు శాప విమోచనం చేసిన వాడు అయిన శ్రీ రాముని ధ్యానించమని మనసుకు బోధ చేస్తున్నారు బ్రహ్మేన్ద్రులు. ''నవ రత్న స్థాపిత కోటీరం, --నవ తులసీదల కల్పిత హారం, ''--''పరమ హంస హృద్గోపుర దీపం --చరన దళిత ముని తరుణీ శాపం 'పదాలను అర్ధవంతం గా అవుచిత్యం గా, పొదుపుగా వాడి బంధం

సడలకుండా నిండుదనం చేకూర్చే నేర్పు ప్రతి పాదం లో ప్రస్ఫుటం గా కన్పిస్తుంది. హనుమ ఎంతటి భక్తుడైనా, daggari వాడైనా, నారద, తుంబురుల సంగీతా జ్ఞాన పరీక్షలో తుమ్బురుని సంగీతమే గొప్పదని నిష్కర్ష గా చెప్పాడు శ్రీ రాముడు. సామర్ధ్యమే ముఖ్యం కాని స్వామి భక్తి మాత్రమే కాదని చెప్పే సంఘటన ఇది. అయినా హనుమతో సదా విహరిస్తూనే ఉంటాడు రాముడు. ఆయనా శ్రీ రాముని అనుసరించే ఉంటాడు. ధర్మమేరిగిన మహానుభావులు వారిద్దరూ అని మరో సారి గుర్తు చేస్తున్నారు సదాషేన్ద్రులు.

రామ రసం లో నాల్గవ కీర్తన సౌభాగ్యాన్ని దర్శిద్దాం

04 ----పల్లవి --పిబరే రామ - రసం,రసనే --పిబరే రామ రసం ||

**చరణాలు ---౦౧-దూరీకృత పాతక సంసర్గం ---పూరిత నానావిధ ఫల వర్గం ||**

**02 -జనన మరణ భయ శోక విదూరం--సకల శాస్త్ర నిగమాగమ సారం ||**

**03 -పరిపాలిత సరసిజ గర్భాండం ---పరమ పవిత్రీకృత పాషండం ||**

**04 -వ్రుద్ధ పరమ హంస ఆశ్రమ గీతం -శుక శౌనక కౌశిక ముఖ పీతం |**

భావం ----రుచిని గ్రహించే నాలుక కు రామ రసాయన పానం రుచిని ఎరుక పరుస్తున్నారు బ్రహ్మేన్ద్రులు. "పాపాల పొత్తును నాశనం చేసేది, కర్మ ఫలాలను దూరం చేసేది, జనన, మరణ భయం పోగొట్టేది, శాస్త్ర నిగమ, ఆగమాల సరం అయినది, బ్రహ్మాండాన్ని రక్షించి కాపాడేది, పరమ నాస్తికులను కూడా పవిత్రం చేసేది పరమహంసలైన యోగుల ఆశ్రమాలలో అణు నిత్యం గానం చేయ బడేది, శుక శౌనక, కౌశిక మహర్షులచేత పానం చేయ బడే మధుర రసమే రామ నామం. నాలుకా ! నువ్వు కూడా ఆస్వాదించి తరించు. '

విశేషాలు ---ముఖ అంటే శుకుడు అని అర్ధం. వ్యాసుని కుమారుడే శుకుడు. పరమ వైరాగ్యం తో భాసించే వాడు. పుట్టుక , చావు వల్ల భయం, శోకం కలుగు తాయి. పార్వతీ దేవి గురు స్థానం లోవుంది బోధించినవి'' నిగమాలు''. మహేశ్వరుడు గురువు గా బోధించినవి ఆగమాలు (శాస్త్రాలు).ఈ రెండింటినీ వేదాలు అనటం లోక రీతి. సరసిజ గర్భాండం అంటే హిరణ్య గర్భుడు -అంటే బ్రహ్మాన్డమే. పరమ పవిత్రీకృత పాషండం అన్నారు వాల్మీకి మహర్షిని. అంటే ఆటవికుడు గా వుండి దేవునిపై ధ్యాసే లేకుండా అనేక పాప కార్యాలు చేస్తున్నా, ఉపదేశం పొందినా రామా అనటానికి బదులు తిరగేసి "మారా ''అన్న అజ్ఞాని, వివేకం లేని వాడు. అలాంటి వాడిని ఉద్ధరించి మహర్షి వాల్మీకి గా మార్చిన దయాళువు శ్రీ రాముడు. అతని ఆంతర్యాన్ని గ్రహించి అనుగ్రహించాడు కాని, అతని శబ్దోచ్చారణ చూసి కాదు అని భావం. జన్మతోనే తండ్రిని మించిన జ్ఞానం తో అవధూత అయిన వాడు శుక మహర్షి. కర్మ ద్వారా జ్ఞానం పొందిన వాడు శౌనకుడు. క్షత్రియత్వాన్ని వదిలి తీవ్ర తపస్సు తో బ్రహ్మజ్ఞానం పొంది బ్రహ్మర్షి ఐన వాడు కౌశికుడైన విశ్వా మిత్రుడు. వీరంతా తర తమ భేదాలు లేకుండా రామ పరబ్రహ్మ నామామ్రుతాని కడుపారా గ్రోలారు. రామ

రసాయనాన్ని ఆస్వాదించి ధన్యులయారు. మనమూ, ఆ రామ రసాయనాన్ని జిహ్వాగ్రం తో రుచి చూస్తే, పునరా వృత్తి రహిత బ్రహ్మ పదమే లభిస్తుంది

రామ రసాయనం లో అయిదవాదీ చివరిదీ అయిన కీర్తన గురించి తెలుసు కుందాం

**05 - పల్లవి ---ఖేలతి మమ హృదయే రామ --ఖేలతి మమ హృదయే |**

**చరణాలు ----01 --మోహ మహార్నవ తారక కారీ ---రాగ ద్వేష ముఖాసుర మారీ |||**

**02 -శాంతి విదేహ సుతా సహ చారీ --దహరాయోధ్యా నగర విహారీ |||**

**03 -పరమ హంస సామ్రాజ్యోద్ధారీ --సత్య జ్ఞానా నంద శరీరీ ||**

భావం ---సదాశివ బ్రహ్మేన్ద్రులు తన హృదయం లో ఆనంద తానడవం చేసే శ్రీ రామ పరబ్రహ్మాన్ని తనివి తీరా కీర్తిస్తున్నారు. ''మొహం అనే సముద్రాన్ని దాటి రాగ ద్వేషాలు అనే రాక్షసులనుసంహరిం చే రాముడు --నా హృదయం లో హాయిగా, చిదానందం గా, ఆడుతున్నాడు. దేహభావం నశించటం వల్ల పుట్టిన పరమ శాంతి అనే సహచరిణి తో, లోపల వుండే (దహర )అయోధ్యా నగరం లో శ్రీ రాముడు వున్నాడు. పరమ హంసలైన యోగుల ఆత్మ సామ్రాజ్య ఉద్ధరణ కోసం శ్రీ రాముడు సచ్చిదానంద రోపం లో, నా హృదయం లో ఆడుతూ (ఖేలతి )వున్నాడు.

విశేషాలు ----ఇదే ఆధ్యాత్మ రామాయణ అనుభూతి. ఆత్మా రాముణ్ణి తన హృదయం లో దర్శించుకునే పరమ ఉత్కృష్ట స్థితి. శ్రీ మద్రామాయణ . కధ ఆధ్యాత్మిక మైన సాధన లో అనుభూతికి వస్తుంది. అని బ్రహ్మేన్ద్రులు తెలియ బరుస్తున్నారు. రాముడు రాముడు మాత్రమే కాదు రామ పరబ్రహ్మ మనే భావన. మొదటి కీర్తన లో మనసుకు శ్రీ రామ తత్వాన్ని బోధించారు. మనసులో రామ ముద్ర వేశారు. ఆ ముద్ర స్థిరం గా నిలిచి పోవాలంటే అణు క్షణం రామ నామ స్మరణ చేయాల్సిందే నని రెండవ కీర్తన లో చెపారు. మనసు లో సదా శ్రీరాముని ధ్యానించి, కాయన తత్వాన్ని ఆకళింపు చేసుకొని, ఆరాధించమని మూడో దానిలో బోధించారు. నాల్గవ కీర్తన లో రామ రసాయనం కలి కల్మష నాశనం అని, నిగమాగమ సారం అని, అంతకు మించి ఇంకేమీ లేదని యోగుల హృత్పద్మ నివాసి గా వుండి, ఆనందాన్ని పంచె వాడు రాముడే నని తెలిపారు. అయిదవ కీర్తన లో --ఇవన్నీ ఆచరిస్తే -శ్రీ రాముడు మన హృదయం లోనే నిలిచి వుండి, ఆనంద ఖేలనం చేసి తరింప జేస్తాడు. దేహభావం నశించి, పరమ ఉత్కృష్ట కాంతి భాసించి, దహరా కాశం లో ఆత్మా రాముడు గా వెలుగు లీనుతూ ఆత్మను ఉద్ధరించి, సచ్చిదానంద స్వరూపుడై, ఆనందాన్ని అందిస్తూ, తాను పొందుతూ రమిస్తూ, ,, మోక్షాన్ని కల్గిస్తాడని సోపాన (మెట్లు) ప్రక్రియ గా తెలియ జేశారు సదా శివ బ్రహ్మేన్ద్రులు. అర్ధం కాక పోయినా, ఆ శబ్ద మాధుర్యం, నడక, కూర్పు, ధ్వని , రవళి, దైహిక, మానసిక ఆరోగ్యాన్ని, ఆనందాన్ని అందాన్ని ఇచ్చి శ్రేయో దాయకం అవుతుంది. లలిత మైన పదాలు, చెవులకు ఇంపైన మాటల ధ్వని, మనోహర మైన శైలి భావ గాంభీర్యం, తరచి చూస్తె లోతైన భావం సదాశివుల కీర్తన లలో నిండి వున్నాయి.వింటే చాలు పరమానందం, పరమాద్భుతం.

ఇప్పటి దాకా రామ రసాయనం గ్రోలాం.ఇక క్రిష్ణామ్రుతం ను సేవిద్దాంవచ్చే భాగం నుండి.

## క్రిష్ణామృతం

శ్రీ సదాశివ బ్రహ్మేన్ద్రుల కీర్తన లలో రామ రసాయన పానం ఇంతవరకు చేశాం. ఇక ఇప్పుడు క్రిష్ణామ్రుతాన్ని అందుకుందాం.

ఇందులో మొదటిది "స్మర వారం వారం "పూర్తిగా వివరిస్తాను

**01 -పల్లవి —-స్మర వారం వారం మానస —స్మర నంద కుమారం ||**

**చరణాలు —01 -ఘోష కుటీర పయోఘ్రుత చోరం –గోకుల బృందావన సంచారం ||**

**02 -వేణు రవామ్రుత పాన కఠోరం –విశ్వ స్థితి లయ హేతు విహారం ||**

**03 –పరమ హంస హృత్ పంజర కీరం —పటు తర ధేనుక బక సంహారం||**

భావం —ఓమనసా !నందకుమారుడైన శ్రీ కృష్ణుని నిరంతరం స్మరించు. గోళ్ళ వాళ్ల ఇళ్ళల్లో పాలు, పెరుగు, వెన్న, నెయ్యి దొంగిలిస్తూ, బృందావనం లో సంచరిస్తూ, వేణు గాన లోలుడై ప్రపంచం యొక్క సృష్టి, స్థితి, లయాలకు కారకుడై, పరమ హంస లైన యోగుల హృదయం అనే పంజరం లో చిలుక గా వున్న వాడు,ధేనుక, బకాసురాది రాక్షసులను వధించిన వాడు, అయిన ఆ నందకుమారుడిని ఆనందం గా పదే పదే స్మరించు. అని సదాశివులు ఉపదేశం చేస్తున్నారు.

విశేషం —-ప్రపంచం అంటే అనేకం. పరమాత్మ ఒక్కడే. కనుక అనేకాన్ని వదిలి ఏకమైన పరమాత్మను ధ్యానించాలి. అప్పుడే సుఖం, శాంతి లభిస్తాయి. భగవత్ ధ్యానానికి, ఆయన లీలా స్మరణకు మంచి మార్గం ఇదే. నంద శిశువు (కిశోరం )చేసిన చిలిపి పనులు అమాయకులకు ఆనంద ప్రసాదం. అవే మహా యోగులకు అద్భుత భావ దర్శనాలు. "ఘోష కుటీర పయోఘ్రుత చోరం –గోకుల బృందావన సంచారం "ఇందులో వేదాంత పరమైన అర్ధాన్ని విచారిద్దాం. గోవులు అంటే ఇంద్రియాలు అనే అర్ధం వుంది. వాటి వల్ల కలిగే విషయ జ్ఞానమే పాలు. పాలను చిలికితే వచ్చే వెన్న -లోకానుభవం. వెన్న కరిగితే వచ్చే నెయ్యి –సూక్ష్మవిచక్షణా జ్ఞానం. తనను అనుక్షణం స్మరించే గోపికల విషయ జ్ఞానాన్ని, విచక్షణా జ్ఞాఆన్ని స్వీకరించి, శ్రీ కృష్ణుడు వారికి ఆత్మానందం కలిగిస్తాడు. .

"వేణు రవామ్రుత పాన కఠోరం –విశ్వ స్థితి లయ హేతు విహారం "లోని పరమార్ధమేమిటో తెలుసు కోవాలి. వెదురు ముక్కను ఎండ బెట్టి, లోపల అంతా కాళీ చేసి, ఏడు రంధ్రాలు చేస్తే, వేణువు తయారవు తుంది. దాన్ని పెదవుల తో గాలి పూరించి పలికిస్తే, మధుర సంగీతం వచ్చి హృదయానికి ఆహ్లాదం కలిగిస్తుంది. ఇది మనుషులకూ వర్తిస్తుంది. మనిషి లోని లౌకిక వ్యక్తిత్వాలను భగ్నం చేసుకొని, దర్పం, అహంకారం లను తొలిచి, డొల్ల గా( ఖాళీ )చేస్తే అయిదు జ్ఞానేంద్రియాలు, మనసు, బుద్ధి అనే ఎదింటినీ ఖాళీ

కన్నాలుగా అర్పణ చేస్తే, ఆంటి మహాత్ములను భగ వంతుడు తన మధుర సంగీతం, సందేశం విని పించాతానికి తగిన పరికరం గా గ్రహిస్తాడు. ఇంతటి గహన విషయాన్ని మధు మధుర పదాల మురళీ రవం గా మార్చి మనకు, ఆ మోహన మురళీ కృష్ణుని దివ్య దర్శనం చేయించారు బ్రహ్మేంద్రులు. కృష్ణ అంటే సర్వం కరోతి ఇతి కృష్ణః. అని వుంది. అంటే అన్నీ చేయించేవాడు అని అర్ధం. కృష్ణ అంటే ఆకర్షించే వాడు అనీ అర్ధం. .సర్వజీవ్వులను ఆకర్షించే వాడు, అందరితో పని చేయించే వాడు, ఆ శ్రీ కృష్ణ పర బ్రహ్మమే. అందుకే వారం వారం అంటే ప్రతి క్షణం, నిరంతరం ఆ గోపాల కృష్ణుని నే స్మరించాలి అని బోధ ఇందులో వుంది

ఇప్పుడు రెండవ కీర్తన లోకి వెళ్దాం

**2——-పల్లవి — గాయతి వన మాలీ మధురం –గాయతి వన మాలీ ||**

**చరణాలు —1–పుష్ప సుగంధ సుమలయ సమీరే —ముని జన సేవిత యమునా తీరే ||**

**2—కూజిత శుక పిక ముఖ ఖగ కుంజే —కుటిలాలక బహు నీరద పుంజే ||**

**3—తులసీ దామ విభూషణ హారీ –జలజ భవస్తుత సద్గుణ శౌరీ ||**

**4– పరమ హంస హ్రుదయోత్సావ కారీ –పరి పూరిత మురళీ రవ దారీ ||**

భావం —-వన మాలీ అంటే పుష్ప హారాలు ధరించిన శ్రీ కృష్ణుడు మధుర గానం చేస్తున్నాడు. పూల గంధాలతో వస్తున్నచల్లని గాలితో, ముని జన సమూహం తో, యమునా తీరం లో సేవింప బడుతు, చిలుకలు, గోరు వంకలు మొదలైన పక్షుల కిల కిలారవాలు విని పిస్తుంటే, వంకీలు తిరిగిన ముంగురులు లాగా ప్రేలాడేనల్లని మేఘాలతో, వనమాలీ, యదువంశ విభుడు అయిన శ్రీ కృష్ణ పరమాత్మ, మధుర మనోహరంగా వేణు గానం చేస్తూ, ఉల్లానికి ఉల్లాసం కలిగిస్తున్నాడు.

విశేషం ——యమునా తీరం లో వేణు గానామృతం చేసే ఆ శ్రీ కృష్ణుని దివ్య దర్శాన్ని చిత్రం లో వ్యాపించి నట్లు మన ముందు నిల బెట్టారు బ్రహ్మేంద్రులు. "జలజ భవ స్తుత సద్గుణ షోరి 'ఆయన. అంటే బ్రహ్మ చేత స్తుతింప బడే శ్రీ కృష్ణుడు అని అర్ధం. "యమునా "అనే మాటలో కూడా విశేషార్ధం వుంది. యం అంటే నిగ్రహం. మునులు అందరు ఆత్మ నిగరం కలవాళ్ళు. అందుకే వారు యమునా తీరం లో విహరించటానికి ఇష్ట పడతారు. "జలజ భవ స్తుత "లో ఒక చిన్న కధ దాగి వుంది. పూర్వం ఒక సారి బ్రహ్మ దేవుడికి బాల కృష్ణుని మీద, యాదవుల మీద కోపం వచ్చింది. ఆయన బారి నుంచి వీళ్ళందర్నీ రక్షించటానికి బ్రహ్మకు కనపడ కుండా ఒక ఏడాది పాటు ఒక గుహలో గోవులను, గోపాలురను దాచి రక్షించాడు బాల కృష్ణుడు. చివరికి బ్రహ్మ దేవుడే తప్పు తెలుసుకొని వచ్చి శ్రీ కృష్ణుని పాదాల పై పడి క్షమించమని వేడుతూ సంస్తుతించాడు ఆ బ్రహ్మ ఈ శ్రీ కృష్ణ పర బ్రహ్మాన్ని. ఈ సంఘటనను అంతాఒకే పదం లో ఫ్లాష్-బాక్ గా మన ముందుంచారు సదా శివేన్ద్రులు. శ్రీ కృష్ణుడు ఎవరో కాదు "పరమ హంస హ్రుదయోత్సవ విహారి ".కృష్ణ అనే పేరు వింటేనే పరవశం వస్తుంది. అవ్యక్త మాధుర్యం ఆవహిస్తుంది. అలౌకిక సౌందర్య దర్శనం లభిస్తుంది. అలాంటి పరమ విభూతిని మనకు అందించారు సదాశివులు

– బ్రహ్మేన్ద్రుల కృశా మృతం లో ని మూడవ కీర్తన

**3—పల్లవి — బ్రూహి ముకున్దేతి రసనే –పాహి ముకున్దేతి ||**

**చరణాలు —-01 -కేశవా మాధవ గోవిన్దేతి —క్రిష్ణానంత సదా నందేతి ||**

**02 -రాదా రమణ హరే రామేతి –రాజీ వాక్ష ఘన శ్యామేతి ||**

**03 –గరుడ గమన నందక హస్తేతి –ఖండిత దశ కంధర మస్తేతి ||**

**04 –అక్రూర ప్రియ చక్ర ధరేతి –హంస నిరంజన కంస హరేతి ||**

భావం —- వో నాలుకా! (రసనే ) ముకుందా అని పలుకు. ముకుందా రక్షించు (బ్రూహి )అని కోరు. కేశవా మాధవా, గోవిందా, కృష్ణా, అనంతా,సదానందా, రాదా రమణా, హరే రామా, రాజీ వాక్షా, ఘన శ్యామా, గరుడ గమనా, నందక హస్తా, రావణ సంహారా, అక్రూర వరదా, చక్ర ధారీ, హంసా, నిరంజనా, కంసారీ అని నోరారా పలుకు. అని నాలుకకు ఉపదేశం చేశారు సదాశివులు

విశేషం —-గోవింద నామాలన్నీ ఏర్చి కూర్చిన కీర్తన ఇది. ప్రతి నామ వెనుక ఒక కధ వుందని మనకు తెలుసు. నామ మాహాత్మ్యాన్ని ఇందులో చూపారు పరమ హంస. పరవశించి పలికితే పరమ పదమే లభిస్తుందని తెలియ జేశారు. నాలుక ఏ నామాన్ని పలికితే, మనసు ఆరూపాన్ని తలుచు కుంటుంది. నామానికీ, రూపానికి వున్న సంబంధం, అనుబంధం ఇది. మనసు దేనిని తలిస్తే దాని పై ప్రేమకూడా కలగటం సహజం. ప్రపంచం మీద ప్రేమ తగ్గించుకుని, భగ వంతుని పై ప్రేమ పెంచుకోవ టానికి ఏకైక మార్గం కృష్ణ నామ స్మరణ అన్న సూక్ష్మాన్ని ఈ కీర్తన ద్వారాతెలియ జెప్పారు బ్రహ్మేంద్ర స్వామి.

నాల్గవ కీర్తన లోకి ప్రవేశిద్దాం

4—పల్లవి —భజరే గోపాలం మానస –భజరే గోపాలం ||

చరణాలు —01 –భజ గోపాలం భజిత కుచేలం –త్రిజగన్మూలం దితి సుత కాలమ్ |\

02 –ఆగమ సారం యోగ విచారం –భోగ శరీరం భువనాధారం |\

03 –కదన కఠోరం కలుష విదూరం –మదన కుమారం మధు సంహారం |

04 –నత మందారం నంద కిశోరం –హత చాణూరం హంస విహారం ||

భావం —-గోపాల కృష్ణుని భజించమని మనసుకు చేసే బోధ ఇది. "స్నేహితుడైన కుచేలుని చే సేవింప బడిన వానినీ, మూడు లోకా లకుమూల మైన వాడినీ, దితి కుమారులైన రాక్షసులను సంహరించిన వాడినీ, భాజించవే మనసా !.వేద సారం అయిన వాడినీ, యోగం ద్వారానే విచారించి తెలుసుకో వలసిన వాడినీ, కేవలం భోగం కోసమే అవతారం ఎత్తిన వాడినీ భువనాలకు ఆధారం అయిన వాడినీ, అయిన శ్రీ కృష్ణుని భజించు. శరణు అన వాడికి మందారం, నందబాలం. చానూరాన్తకుడు, హంస లాగా విహరించే గోపాల కృష్ణుని భజించి తరించు.

విశేషం —-కుచేలుడు శ్రీ కృష్ణుని చిన్న నాటి స్నేహితుడు. అతడు శ్రీకృష్ణున్ని శ్రీ కృష్ణుని భక్తునిగా, స్నేహితునిగా భగవంతుని గా సేవించాడు. కృష్ణుడు కుచేలుడిని బాహ్యం గా, అతిథి సత్కారాలు చేసి పూజించాడు. భగవంతునికి భక్తునికి భేదం లేదని తెలియ జేసే సందర్భం ఇది. శ్రీ క్రిష్ణునిది భోగ శరీరం. అంటే ఈ ప్రపంచం లో సంచ రించా టానికి శరీరం. .ఆయనే కల్పించ్చుకున శరీరం. "మదన కుమారం 'అంటే మన్మధుని వంటి కుమారుడు అనీ, మన్మధుని కుమారునిగా పొందిన వాడు అనీ శ్రీ కృష్ణ పరం గా రెండు అర్ధాలు వున్నాయి. "హంస "అనే పదం చాలా విశేష మైనది. విచక్షణా జ్ఞానం తో వ్యవహరించే బుద్ధిని హంస అంటారు. ఈ హంస పై విహరించే వాడే భగ వంతుడు. అందుకే హంస విహారి అయాడు. .పదాలు అన్నీ నాదానుగునం గా నర్తనాను గుణం గా వుండి మనసు ను పరవశింప జేస్తాయి. rhytham మనలను విశేషం గా ఆకర్దిస్తుంది. క్షణం యెడ బాటు కని పించదు. ప్రవాహం లా పదాలు ప్రవహిస్తుంటాయి. శ్రవణ శుభగత్వం అంటే ఇదే.

"భజరే యదు నాదం "అనే అయిదవ కీర్తన లో కి ప్రవేశిద్దాం

5— పల్లవి —భజరే యదునాధం మానస —భజరే యదు నాదం ||

చరణాలు —01 -గోప వధూ పరి రంభన లోలం –గోపా కిశోరక మద్బుత లీలం ||

02 –కపతాన్గీక్రుత మానుష వేషం —కపట నాట్య కృత కుత్చిత వేషం |||\

03 – పరమ హంస ప్రూత్తత్వ స్వరూపం –ప్రణవ పయోధర ప్రణవ స్వ రూపం -||

భావం ——యదు వంశ కిశోరాన్ని (శిశువు )భజించ మని మనసుకు బోధిస్తునాడు. "యదుకుల నాధుడు, గోపికలను, ఆలింగనం చేసుకోవటం లో ఆసక్తుడైన వాడు, బాల క్రిషుడు, అద్బుత లీలలను ప్రదర్సించిన వాడు, లీలా మానుష విగ్రహుడు, నాట కాల లో పాత్ర లాగ క్షుద్ర పాత్రలూ ధరించిన వాడు, పరమ హంస హృదయాలలో ఆత్మ స్వరోపం గా వున్న వాడు ఓంకార స్వరూపుడు, అయిన బాల కృష్ణ భగవానుడిని స్మరించు "

విశేషం —-గోప వధూ అనటం లో త్రిగుణాలతో వున్న జీవు లందరూ స్త్రీ మూర్తులే అన భావం వుంది. స,ర, త అనే మూడు అక్షరాలూ ఈ కారం తో కలిస్తే స్త్రీ అవుతుంది. అంటే కదిలే మూడుగుణా అని అర్ధం. ఈ జీవుల్లో భగవద్ భక్తులైన వాళ్ళు గోప వధువులు( స్త్రీలు ).వారినే భగ వంతుడు ప్రేమతో ఆలింగనం చేసు కుంటాడు. "కపతాన్గీక్రుత వేషం "అంటే ప్రారబ్దం వల్ల కాకుండా లీల కోసం శరీరాన్ని ధరించిన వాడు అని అర్ధం. "కపట నాట్య కృత కుత్చిత వేషం "వేశాడు కృష్ణుడు. అంటే గొల్ల పిల్ల వాడుగా, అల్లరి కన్నయ్య గా, సామాన్య వేషం ధరించాడు. ఇది భగవంతుని కపట నాటకమే ".ప్రణవ పయోధర "శబ్దం లోను లోతైన భావం వుంది. ఓంకారం నిరాకారం గా వుండే పరమాత్మ మాత్రమే కాదు, మనకు కని పించే ప్రపంచం కూడా ఆయనే. .నిశ్చల మైన పరమాత్మ ఆధారం గా చలించే ఈ ప్రపంచం మేఘం వంటిది. అందుకే మేఘాన్ని ప్రణవ పయోధరం అన్నారు బ్రహ్మేన్ద్రులు. పరమాత్మ ప్రణవ స్వరూపం. ఇంకో రహస్యం వుంది

యోగ శాస్త్రం లో "లయ "అనే యోగం లో, లోపల వినపడే పది రకాల నాదాలలో చివరిది మేఘ నాదం. అదే ప్రణవం అని పిలువ బడే ఓంకారం., ఇన్ని యోగ, శాస్త్ర, వేద, ఉపనిషద్ రహస్యాలన్నీ నిక్షిప్తం చేసి రమ్య నాద భరితం గా చేసినకీర్తన ఇది. ఆ నాద బ్రహ్మ కు కై మోడ్చి అంజలి ఘటిద్దాం. .

బ్రహ్మేంద్రులు శ్రీ కృష్ణుని ఉద్దేశించి రాసిన కీర్తన లలో ఆరవ దాన్ని గరించి ముచ్చటించు కుందాం

**06 ----పల్లవి ----క్రీడతి వన మాలీ, గోష్టే --క్రీడతి వనమాలీ ||**

**చరణాలు ---01 ---ప్రహ్లాద పరాశర పరిపాలీ --పవనాత్మజ జామ్బవదను కూలీ ||**

**02 -పద్మా కుఛ - పరిరంభన శాలీ ---పాటు తరశాసిత మాలి సుమాలీ |**

**03 --పరమ హంస వర కుసుమ సుమాలీ --- ప్రణవ పయోరుహ గర్భక పాలీ**

భావం ------తోట మాలి అయిన శ్రీ కృష్ణుడు గోశాలలో ఆడుతున్నాడు. ప్రహ్లాద, పరాశారులను పాలించే వాడు, ఆంజనేయ, జాంబ వంతులకు అణు కూలుడు, శ్రీ లక్ష్మి వక్ష స్థలం లో విహరించే వాడు, మహా బల వంతు లైన మాలి, సుమాలీ అనే రాక్షసులను సంహరించిన వాడు, పరమ హంసల చేత కూర్చినఅందమైన పూల హారం కాంత సీమ లో వున్న వాడు, ఓంకారం అనే తామర పుష్పానికి విత్త నాన్ని కాపాడే వాడు, అయిన్క వన మాలి గోవుల కోష్టం (శాల )లో ఆనందం గా క్రీడిస్తున్నాడు ఆయన్ను భజించి తరించమని చెబుతున్నారు.,

విశేషం -----వనమాలీ అనేది చక్కటి పదం. వనం అంటే కోరిక అనే అర్ధం వుంది కోష్టం అంటే గోవుల శాల. గోవు అంటే ఇంద్రియాలు అనే అర్ధం వుంది. కోరికల మాల ధరించి, ఇంద్రియ విషయాలతో పరిగెత్తే జీవుడు కూడా దేవుడే. ఆ రూపం లో వున్న భగ వంతుడే పరిగెత్తు తున్నాడని భావం. ప్రహ్లాద, పరాశారులు అనటం లోను లోతు వుంది. ప్రహ్లాదుడు మహాభక్తుడు. పరాశరుడు జ్ఞాని. సాకార, నిరాకారా లతో ఇద్దరినీ పాలించేది ఒకే భ్యగా వంతుడు అని నిగూఢ రహశ్యం. పద్మ అనేది సంపద కు చిహ్నం. ప్రాపంచిక, పార మార్ధిక సంపద అంతా లక్ష్మీదేవియే. .ఈ సంపదను అంతా కాపాడేది భగ వంతుడే.

రావణాసురుని తల్లికి తండ్రి సుమాలీ. వాడి తమ్ముడు మాలి. మాల్య వంతుడు అనే ఇంకో తమ్ముడు వున్నాడు. ఈ ముగ్గురు లంకలో ఉంటూ, స్వర్గం మీదికి దండెత్తితే శ్రీ మహా విష్ణువు వాళ్ళతో యుద్ధం చేశాడు. వాళ్ళు తట్టు కో లేక పారి పోయారు. లంకలో తల దాచుకున్నారు. మాల్య వంతుడు చచ్చాడు యుద్ధం లో. మిగిలిన ఇద్దరూ పాతాళం లోకి పారి పోయి దాక్కున్నారు. ఇంత కధను వాళ్ళిద్దరి పేర్లు చెప్పటం తో బయట పెట్టారు సదా శివులు. ఇదివరకటి కీర్తన లో ''ప్రణవ పయోధర ''అని రాస్తే, ఈ కీర్తన లో ''ప్రణవ పయోరుహ ''అన్నారు. ప్రణవం తామర పువ్వు లాంటిది. ప్రపంచ రూపం గా వికశిస్తుంది. మళ్ళీ బీజ రూపం లోకి మూసుకు పోతుంది. బీజ (విత్తనం )రూపం లో ప్రపంచం అవ్యక్త మైన పుడు, దాన్ని రక్షించి వుండేదీ పరమేశ్వరుడే. అందుకే ''ప్రణవ పయోరుహ గర్భక, పాలీ ''అన్నారు. శివేంద్ర యోగి.

గర్భక అంటే విత్తనాన్ని, పాలి అంటే రక్షించే వాడు అని అర్ధం ''.కపాలి ''అని కలిపి చదవ కూడదు. గర్భక, పాలి అని చద వాలి విత్తనం. లో సర్వ వృక్షం దాగి వున్నట్లు చిన్న మాట లో విశ్వ మంత భావాన్ని ఇమిడ్చిన మహా కవి శేఖరులు, పరమ హంస శ్రీ బ్రహ్మేన్ద్రులు. ఇవి ఏదో బుద్ధి తో రాసినది కాదు. ఒక తన్మయా వస్థ లో, సమాధి స్థితి లో రాసిన మహత్తర కీర్తనలు ఇవన్నీ. అందుకే అంత మధురం, అంతటి లోతు.

ఏడవకీర్తన లోకి చేరు కుందాం.

**07 ----పల్లవి ------మానస సంచరరే, బ్రహ్మాని --మానస సంచరరే ||**

**అను పల్లవి -- - --మద శిఖి పించ అలంకృత చికురే ---మహనీయ కపోల విజిత ముకురే ||**

**చరణం --- శ్రీ రమణీ కుఛ దుర్గా విహారే --సేవక జన మందిర మందారే ||**

**పరమ హంస ముఖ చంద్ర చకోరే ---పరి పూరిత మురళీ రవ దారే ||**

భావం ----ఇదీ మానస బోదె. చాలా బాగా ప్రాచుర్యం చెందిన కీర్తన. ''శంకరాభరణం సినిమా లో ఈ కీర్తనను దర్శకుడు విశ్వ నాద్ అద్భుతం గా, రసాత్మకం గా, అత్యంత ఆర్ద్రం గా చిత్రీకరించి షాహ బాష్ అని పించారు. ఆ సన్ని వేశం చూసి ఆనంద బాష్పాలు రాల్చని వారు లేరు

వో మనసా !పరబ్రహ్మం లో సదా సంచరించు. లక్ష్మీ కుఛ విహారి శ్రీమన్నారాయణుని లో సంచరించు. సేవించే భక్త జనులకు మందారం ఆయన. నెమలి పించం తో వున్న ముంగురులు వున్న వాడు, .ఆయన నున్నని చెక్కిలి అద్దాలకంటే దీటైనది. పరమ హంస ముఖ చంద్ర కాంతిని ఆస్వాదించే చకోరం శ్రీ కృష్ణ పరమాత్మ. మురళి ని పూరించి నాద రసాన్ని ప్రవహింప జేస్తాడు. అలాంటి శ్రీ కృష్ణ పరబ్రహ్మం లో సదా సంచరించు అని మనసుకుని కోరారు

విశేషం ----భక్తులకు ఇల్లు భగవానుని లోగిళ్ళు. చంద్రుని కోసం చకోరాలు తపిస్తాయి. చంద్ర కాంతిని ఆస్వాదించి సంతృప్తి చెందు తాయి. అలాగే జ్ఞానుల జ్ఞానం లో పరమాత్మ సంతృప్తి చెందుతాడు. శ్రీ కృష్ణుని దివ్య రూపం కళ్ళ ముందు సక్షాత్కారించేట్లు చేసిన రచన. విన్తునా, ఆ మూర్తిని ఊహించుకున్నా మనసు ఆనంద పులకాన్కితం అవుతుంది. పరబ్రహ్మ సామీప్యం లో వున్న అనుభూతి లభిస్తుంది. అదీ ఈ కీర్తన వైశిష్ట్యం

**క్రిష్ణామృతం లో ఎనిమిదవది, చివరిది అయిన కీర్తన లో కి ప్రవేశిద్దాం రండి**

**08 -----పల్లవి ----భజరే యమునాతీరా విహారం ||భజ మన యదుకుల నంద కిశోరం ||**

**చరణాలు ---01 --పరమానందం పరబ్రహ్మ రూపం --పావన గాత్రం --పుణ్య చరిత్రం ||**

**02 ---నంద కుమారం నవనీత చోరం ---నారద వందిత నారాయణం |**

భావం ----యమునా తీర విహారీ రసమయ మూర్తీ, శ్రీ కృష్ణ మూర్తిని భజించమని మానస బోధ ఈ కీర్తన. ''పరమానంద స్వరూపుడు, పరబ్రహ్మ స్వరూపుడు, శ్రీ కృష్ణ పరమాత్మ. పవిత్ర శరీరుడు. నంద కిశోరుడు పుణ్య చరితుడు. నవనీత చోరుడు,నారదుని చే అను క్షణం కీర్తింప బడే వాడు, నారాయణుడు. భక్తి తో భజించి తరించు.

విశేషం -----శ్రీ కృష్ణుడు యమునా తీరం లో సామాన్యులకు కని పించడు. శరీర మనో, బుద్ధుల్ని అణచు కున్నప్పుడే అంటే సంయమనం చేసిన తర్వాతే భగ వంతుని దర్శనం లభిస్తుందనివూహ చేశారు బ్రహ్మేన్ద్రులు. .ఈ విధం గా శ్రీ కృష్ణ గుణ గానాన్ని, మురళీ రవామ్రుతాన్ని, శ్రీ కృష్ణ పరబ్రహ్మ దివ్య దర్శనాన్ని, కర్ణామృతం గా శ్రీ కృష్ణుని లీలల్ని ప్రదర్శించి కీర్తనల్ తో రసానందాన్ని కలిగించిన మహా పరమ హంస సదాశివ బ్రహ్మేంద్ర యోగి వరేన్యులు.

ఇంతటి తో కర్ణామృతం సమాప్తం. తరువాత ''ఆత్మ బోధ''ను గురించి తెలుసు

కుందాం

## ఆత్మ బోధ

ఇంత వరకు శ్రీ సదాశివ బ్రహ్మేంద్ర కీర్తనల లో రామ రసాయనం, క్రిష్ణామ్రుతం చవి చూశాం. ఇప్పుడు అద్వైత బోధ ను తెలుసు కుందాం. ఇందులో మొదటికీర్తన " 'చింతా నాస్తి కిలా ".ను గురించి తెలుసు కుందాం.

**01 — పల్లవి —చింతా నాస్తి కిలా తేషాం —చింతా నాస్తి కిలా ||**

**చరణాలు —01 -శమ దమ కరుణా సంపూర్ణానాం —సాదు సమాగమ సంకీర్తానాం ||**

**02 —కాలత్రయ జిత కందర్పానాం —ఖండిత సర్వేంద్రియ దర్పానాం ||**

**03 —పరమహంస గురు పద చిత్తానాం –బ్రహ్మేనందామ్రుత మత్తానాం ||**

భావం —ఇది ఆత్మ బోధ లో మొదటి కీర్తన. మానసిక పరిణతి కి మార్గోప దేశం చేశారు బ్రహ్మేన్ద్రులు. "మనో నిగ్రహం, ఇంద్రియ నిగ్రహం వుండి, కరుణా పూర్ణులై, నిరంతరం సత్పురుష సాంగత్యం లో వుండే వారికి, కామాన్ని, ఇంద్రియ దర్పాన్ని అన్ని కాలాల్లోను జయించిన వారికి, పరమ హంసలైన గురు పాదాల మీద ధ్యాస వున్న వారికి, బ్రహ్మేనందం అనే అమృతాన్ని గ్రోలి మత్తెక్కిన వారికి చింత అనేది లేదు -లేదు -లేదు "

విశేషం —లోక విషయాల నుంచే చింతలు వస్తాయి. వీటిని చూసేవి ఇంద్రియాలు., ప్రేమించేది మనసు. వీటి వల్ల స్వార్ధం, ద్వేషం కలుగు తాయి. .ప్రేమ తగ్గి పోతుంది. జితేన్ద్రియులకు,కామాన్ని జయించిన వారికి ప్రాపంచిక, వాంచలు వుండవు. వాటి పై అర్రులు చాచే వారిపై జాలి కలుగు తుందే కాని,

కోపం రాదు. మనసు చంచల మైంది. ఎప్పుడూ స్థిరం గా వుండదు. స్థిర చిత్తం కావాలంటే సజ్జన సాంగత్యం నిరంతరం కావాలి. మహాత్ముడైన గురువు ను చేరి, ఆత్మార్పణ చేసు కుంటే, గురువు అనుగ్రహం తో, చెడు భావనలు దగ్గరకు చేరావు. బ్రహ్మ పదార్ధాన్ని అందుకొని, ఆ ఆనందం లో నిలిచి పోయిన వారికి మనస్సు అంతరిస్తుంది. మనస్సు నాశనం అయితే, చింతలు అసలు ఉండనే వుండవు. .శాస్వతానందానికి ఇదే మార్గం అని సదాశివులు బోధించారు.

ఇప్పుడు రెండో కీర్తన లోకి వెళ్దాం

**02 —పల్లవి —-స్థిరతా నహి నహి రే, మానస —స్థిరతా నహి నహి రే ||**

**చరణాలు —-01 -తాపత్రయ సాగర మగ్నానాం —దర్పాహన్కార విలగ్నానాం ||**

**02 –విషయ పాశ వేష్టిత చిత్తానాం –విపరీత జ్ఞాన విమత్తానాం ||**

**03 –పరమ హంస యోగ విరుద్ధానాం —బహు చంచలతర సుఖ సిద్ధానాం ||**

భావం ——ఈ కీర్తన లో మనసుకు స్థిరత్వం అనేది లేదు అని రూఢిగా తెలియ జేశారు. ఎవరికి లేదు ?అని విచారించారు. ”మనసా !తాపత్రాలలో మునిగిన వారికి, అహంకార దర్పాన్ని పట్టుకొని ప్రేలాడే వారికి, విషయ వాంచలు అనే తాళ్ళతో బద్ధులైన మనసు కల వారికి, చంచల మైన సుఖాల కోసం అర్రులు చాచే వారికి ఎన్నడు మనశ్శాంతి లభించదు ”అని నిర్ద్వందంగా చెప్పారు.

విశేషం —-తాపత్రయాలు మూడు. ఆది దైవిక, ఆది భౌతిక, ఆధ్యాత్మిక బాధలు. ఇతరుల పట్ల ప్రదర్శించేది దర్పం. తనలో వుండేది అహంకారం. ప్రపంచమే నిజం,దేవుడు అబద్ధమనుకునే జ్ఞానమే విపరీత జ్ఞానం. దర్పము, అహంకారము పరమాత్మకుదూరం చేస్తాయి. విషయ వ్యామోహం కూడా పరమాత్మను చేర నివ్వదు. స్థిరత అంటే శాశ్వత మైన దానిలో స్థానం. చలించే విషయాలపై వచ్చే జ్ఞానం కూడా చంచలమైనదే. దాని వల్ల శాంతి, స్థైర్యం లభించవు. కనుక స్థిరమై, శాశ్వతమై, అఖండమై, అక్షరమైన పరబ్రహ్మం లోనే స్థిరత్వం, శాంతి లభిస్తాయని సందేశం.

మూడవ కీర్తన లోకి ప్రవేశిద్దాం

**03 –పల్లవి —-తత్త్వజ్జీవత్వం బ్రహ్మణి–తత్త్వజ్జీవత్వం ||**

**చరణాలు -01 –యద్వాత్తోయే చంద్ర ద్విత్వం —-యద్వాన్ముకురే ప్రతి బిమ్బత్వ ||**

**02 -స్థానౌ యద్వత్ నర రూపత్వం —భాను కరే యద్వత్ తోయత్వం ||**

**03 —శుక్తౌ యద్వత్ రజతమయత్వం —రజ్జౌ యద్వత్ ఫణి దేహత్వం ||**

**04 – పరమ హంస గురునాద్వైత విద్యా —భనితా ధిక్కృత మాయా విద్యా |**

భావం ——ఈకీర్తన లో ఉపనిషత్ రహశ్యం అంతా, గాన రూపం లో వెన్న లా అందించారు. మాయ ఎలా భ్రమింప జేస్తుందో, దాన్ని ఎలా తొలగించుకోవాలో, బహు చక్కగా వివరించారు

బ్రహ్మేన్ద్రులు. "నీటి లో రెండవ చంద్రునిలా, అద్దం లోని ప్రతి బింబం లా, మ్రోడు వారిన చెట్టు లో మానవ రూపం గా, ఎడారిలో ఎండ మావి లా, ముత్యపు చిప్ప లో మెరిసే వెండి లా,త్రాడు లో కనబడే పాము లా,బ్రహ్మం లో జీవత్వం అనేది భ్రమ వల్ల కని పిస్తోంది. పరమహంస వరేన్యులైన గురు అనుగ్రహం వల్ల, అద్వైత విద్య తో అజ్ఞానం అనే మాయ తొలగి, జ్ఞాన ప్రకాశం లభిస్తుంది.

విశేషం —-దీనికి కొంత వివరణ ఇవ్వాలి. నీటి లో చంద్ర బింబం, మరుభూమి లో ఎండ మావి, ముత్యపు చిప్ప లో వెండి కనిపించటం లోక సహజం. కొద్దిగా విచారించి చూస్తే, అసలు రూపం బయట పడుతుంది. అదంతా భ్రమ అని తెలిసి పోతుంది. తర్వాత కూడా అవి కనబడు తున్నా, భ్రాంతి మాత్రం తొలగి పోతుంది చెట్టు లో అందరు మనిషి ని చూడ లేరు. అజ్ఞానం పొరలు తొలగితే భ్రాంతి దూరమవు తుంది. రెండు రకాల భ్రాంతులు. భ్రాంతికి కారణం అజ్ఞానమే. ప్రపంచము, అందు లోని అనుభవాలు రెండు రకాల భ్రాంతులు అసలు సమష్టి వాసనలే మూల అజ్ఞానం అంటారు విజ్ఞులు. వాటి వల్లే మనకు కని పించే ప్రపంచం ఏర్పడింది. అందరికీ చెందిన ఈ ప్రపంచం లో ఎవరి స్వంత వాసనల తో వారు వెలుగు తూంటారు. అందుకే వ్యక్తి గతమైన దుఖాలు, కష్టాలు, అనుభూతులు కలుగు తాయి. గురు ముఖతా అద్వైత విద్య పొందితే భ్రమ నాశనం అవుతుంది. సమష్టిప్రపంచం జనానికి కనిపిస్తున్నా, వ్యక్తిగత భ్రాంతి నశించటం వల్ల, ఆ మహాత్ముడు ప్రపంచాన్ని ఒక ఖేలగా అంటే ఆటగా భావిస్తాడు. ఇదే ఇందులో వున్న పరమార్ధం

శ్రీ సదాశివ బ్రహ్మేంద్ర కీర్తనలలో అద్వైతామృతాం లో ఆత్మ బోధ లో నాల్గవ కీర్తన గురించి తెలుసు కుందాం

**04 ----పల్లవి ----సర్వం బ్రహ్మమయం రే రే --సర్వం బ్రహ్మ మయం ||**

**చరణాలు ---01 - కిం వచనీయం, కిమవచనీయం --కిం రచనీయం, కిమరచనీయం ||**

**02 ---కిం పఠ నీయం కిమ పఠనీయం, --కిం భజనీయం, కిమభజ నీయం ||**

**03 ---కిం బోద్ధవ్యం, కిమబోద్ధవ్యం ---కిం భోక్తవ్యం, కిమభోక్తవ్యం ||**

**04 ---సర్వత్ర సదా హంస ధ్యానం --కర్తవ్యం--భో ముక్తి నిదానం ||**

భావం ------'' వోరీ !సర్వము బ్రహ్మమే. ఇందు లో చెప్ప తగినది, చెప్ప తగనిది ఏమీ లేదు. వ్రాయ తగినది, వ్రాయ తగనిది లేదు. చదవ తగినది, చదవ కూడనిది లేదు. సేవింప తగిన్దీ, సేవింప రానిదీ అంటూ ఏమీ లేదు. నేర్వ వలసిందీ, నేర్వ రానిదీ లేదు. తిన తగింది, తిన రానిది అనే భేదమే లేదు. సర్వ వేళల, సర్వావస్థలలో, ''హంస ''ధ్యానం చేయటమే మన కర్తవ్యం. అదే మోక్షానికి సరైన దారి ''

విశేషం ---భో అంటే అయ్యా అని అర్ధం. ఈ ప్రపంచం అంతా పరమాత్మ స్వరూపమే అయినపుడు దేనిని స్వీకరించాలి, దేన్నీ వదిలేయాలి అన్న సమస్యే లేదు. ''సర్వం ఖల్విదం బ్రహ్మ ''

ఆయిద వ కీర్తనకు దారి తీద్దాం

**o5 --పల్లవి -----బ్రహ్మై వాహం - కిలసద్గురు కృపయా ---బ్రహ్మైవాహం ||**

**చరణాలు**

**-01 ---బ్రహ్మై వాహం కిల, గురు కృపయా--చిన్మయ బోధానంద ఘనం తత్ --శ్రుత్యంతైక నిరూపిత మతులం --సత్య సుఖామ్బుది సమరస మనఘం ||**

**02 ---కర్మాకర్మ వికర్మ విదూరం --నిర్మల సంవి దఖండ మపారం --నిరవధి సత్తాస్పద పద మజరం --నిరుపమ మహిమనినిహిత మనీహం ||**

**03 --ఆశా పాశ వినాశన చతురం --కోశ పంచకాతీత మనంతం --కారణ కారణ మేక మనేకం ----కాలకాల కలి దోష విహీనం ||**

**04 --అప్రమేయ పద మఖిలాధారం --నిష్ప్రపంచ నిజ నిష్క్రియ రూపం ---స్వప్రకాశ శివ మద్వయ మభయం --నిష్ప్రతర్క్య మన పాయ మకాయం |**

భావం -------''సద్గురు కటాక్షం వల్ల నేను సాక్షాత్తు బ్రహ్మమే. గురు కృప చేత చిన్మయ, జ్ఞానానంద ఘన స్వరూప బ్రహ్మమే నేను. ఉపనిషత్ నిరూపించిండీ ఎకమే అయినదీ, సాటి లేనిదీ,పాప రహితమైనదీ, సర్వ వ్యాపక మైనదీ, సత్య,సుఖసముద్రం అయిన బ్రహ్మాను నేనే. సత్కర్మకు, ఆకర్మకు, దుష్కర్మలకు దూరమైన, అఖండ, అపార, నిర్మల, శుద్ధమైన, బ్రహ్మము నేనే. హద్దులు లేని సత్తా కు ఆధారం నేనే. జరాదూరమై, నిరూప మానమై, మహిమాన్వితమై, కామనా రహిత బ్రహ్మాను నేనే. ఆశాపాశాలను చేదించే శక్తి కలిగి, పంచ కోశాలకు అతీత మైన, అనంతమైన బ్రహ్మము నేనే, .కారణాలన్నీ టికి మొదటి కారణమై, ప్రపంచం లోని అనేకం అంతా తానే అయి, నల్లని మృత్యు రూప కలి దోష రహిత బ్రహ్మం నేనే. కొలవటాని వీలు లేని పరమై, సర్వాదారమై, ప్రపంచం లో క్రియా రహిత పదం అయిన బ్రహ్మం నేనే. స్వయం ప్రకాశమై, మంగళ ప్రదమై, అద్వయం, అభయం అయి, తర్కానికి అతీత మై, అపాయం లేని, శరీర రహిత మైన బ్రహ్మం నేనే కదా. సద్గురు కృప వల్ల నేనే బ్రహ్మం కదా ''.

విశేషం ---వేదాలలో ఉపనిషత్ లలోని సారం అంతా ఇందులో ఇమిడ్చారు బ్రహ్మేన్ద్రులు. అన్న మయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞాన మయ, ఆనందమయ, అనేవి పంచ కోశాలు. అవి ఒకదాని కంటే ఒకటి వ్యాపన శక్తి కలవి. ఆనందమయ కోశానికి అవతల వున్న అనంత వస్తువే బ్రహ్మం. ప్రపంచం లోని ప్రతి వస్తువుకి, ప్రాణికి, ఒక కారణం వుంటుంది. కారణానికి వెనుక ఇంకో కారణం వుంటుంది. ఇలా అనంత కారణాలు. ఇన్ని కారణాలకు అసలు కారణం పరమాత్మ. ఆయన ఒక్కడే కారణం. ప్రపంచ వ్యాపిత అంతర్గత పరమాత్మను చూడ గలిగితే, ఇంద్రియాలు మూగ పోయి, ఇంద్రియాలకు కనిపించే ప్రపంచం మాయమవుతుంది

ఆరవ కీర్తన గురించి చర్చిద్దాం

**06 ---పల్లవి -----పూర్ణ బోదోహం,సదానంద--పూర్ణ బోదోహం ||**

**అను పల్లవి ----వర్నాశ్రమాచ్చార కర్మాతి దూరోహం --స్వర్నవదఖిల వికార గతోహం ||**

**చరణాలు ---01 ---ప్రత్యగాత్మాహం ప్రవితత సత్య మనోహం --శ్రుత్యంత శత కోటి ప్రకటిత బ్రహ్మ హం ---నిత్యో హమ మభాయోహమద్వితీయోహం ||**

**02 --సాక్షీ మాత్రోహం,ప్రగలిత పక్ష పాతోహం ---మోక్ష స్వరూపోహమొంకార గంయోహం ---సూక్ష్మోహ మనఘోహ మద్భుతాత్మాహాం ||**

**03 --స్వప్రకాశోహం విభురహం,నిష్ప్రపంచోహం ---అప్రమేయోహమచాలోహమకాలోహం ---నిష్ప్రతర్క్యాఖండైక రసోహం. ||**

**04 --అజ నిర్మమొహం, బుధ జన భజనీయోహం --అజ రోహామమరోహమమ్రుత స్వరూపోహం ---నిజ పూర్ణ మహిమని నిహిత మహితోహం || 05 --నిరవయవోహం, నిరుపమ నిష్కలన్కోహం ---పరమశివేంద్ర శ్రీ గురు సోమ సముదిత ----నిరవధి నిర్వాణ సుఖ సాగరోహం ||**

భావం -----ఆత్మానుభావం పొందిన అనుభవ స్థాయి నుంచి ఉద్భవించిన మధు మధుర గీతం,సంగీతముపనిశద్ ఉపదేశం ఈ కీర్తన

"నేను పూర్ణ జ్ఞాన ఆనంద స్వరూపుడిని. వర్ణాశ్రమ, ఆచార, కర్మ ధర్మాలకు అతీతుడిని. బాంగారం లాగా అనేక మార్పులు పొందే వాణ్ని. అందరిలో వున్న ఆత్మను, నామ రూప జగత్తు లో వ్యాపించిన సత్య స్వరూపున్ని. ఉపనిషత్ చెప్పిన పరబ్రహ్మను. నిత్య, అభయ,అద్వితీయ, బ్రహ్మను. అన్నిటికి సాక్షీ భూతుడను. పక్ష పాత రహితున్ని. ఓంకారంవల్ల చేరదగిన వాడిని. సూక్ష్మమై, పాప రహితమైన అద్భుత ఆత్మను. నేను స్వయం ప్రకాశ కుడిని. అన్ని రూపాలు నేనే. ప్రపంచాతీతుడిని నేను. కొలతలకు అందని వాడిని. సర్వ వ్యాపకుడిని. విభజన, కదలిక లేని వాడిని. తర్కానికి అతీత మైన ఏక రసాన్ని.జన్మ, మమకారం లేకుండా, బుధ జన ఆరాధకుడిని. జనన, మరణాలు లేని అమృత స్వరూపుడిని. నా మహిమ లోనే నిలిచి వుండే మహా మహితాత్ముడిని. అవయవాలు లేని, అనుపమాన మైన, నిష్కలంకున్ని నేను. శ్రీ పరమ శివేంద్ర గురు దేవుల నే, చంద్రుని ద్వారా ఉదయించిన సుఖ సాగ రాన్ని నేను. "

విశేషం ----ఇది ఆత్మను దర్శించే సందర్భం. అంటే ఆత్మ ఆవిష్కారం. ఈ సమయం లోనూ, తన గురు పాదులు శ్రీ పరమ శివెంద్రులను సస్మరించారు. సదాశివ బ్రహ్మేన్ద్రులు. గురు కటాక్షం సంపూర్ణం గా పొందిన వారు కనుక, గురు స్మరణే ముక్తి దాయకం గా భావించారు. ఋణం తీర్చుకునే ప్రయత్నం చేశారు. గురువు చంద్రుడు అయితే గురువు నుండి ఆత్మ జ్ఞానం పొందిన శిష్యుడు చంద్రుని వెన్నెలకు ఉప్పొంగే అనంత సాగరం నిగూఢం కూడా. కొందరు బాహ్య విషయాల వల్ల మహిమలు పొందు తారు. .వీరు సామాన్యులు తన మహిమతో తానే నిలిచే ఆత్మ స్వరూపుడుమహాత్ముడు.

ఇక్కడితో ఆత్మ బోధ పూర్తి అయింది. తర్వాత "బ్రహ్మానందం "అనుభ విద్దాం.

## బ్రహ్మా నందం

శ్రీ సదాశివ బ్రహ్మేంద్ర కీర్తనల లో ఇప్పటి వరకు "రామ రసం ","కృష్ణా మృతం "ఆత్మ బోధ "శీర్షికల లో వున్న కీర్తన లను గురించి తెలుసు కున్నాం. ఇప్పుడు "బ్రహ్మా నందం "లోకి చేరి అందులోని కీర్తన వైభవాలను అర్ధం చేసు కుందాం.

**పల్లవి — —నహిరే నహి శంకా చిత్ –నహిరే నహి శంకా ||**

**చరణాలు ———01 –అజమక్షర మద్వైత మనంతం –ధ్యాయంతి బ్రహ్మ వరం శాంతం ||**

**02 —ఏ త్యజ్ఞాతి బహుకర పరితాపం –ఏ భజన్తి సత్చిత్సుఖ రూపం ||**

**03 —పరమ హంస గురు భనితం గీతం —ఏ పఠంతి నిగమార్ధ సమేతం ||**

భావం ——”ఎవరు అనేక లౌకిక దుఖాలను వాది లేస్తారో, సచ్చిదానంద రూపానీ సేవిద్తారో, పరమ హంస గురువు లైన వారిచే స్తోత్రం చేయబడిన గీతాలను, వేదార్దాల సాయం తో అధ్యయనం చేస్తారో, వారంతా, ఆది అంతం లేని ఏకమైన, పరమ శాంత స్వరూపమైన బ్రహ్మాన్నే ధ్యానిస్తారు, ఇందులో అనుమానం లేదు, శంక కూడా లేదు ”

విశేషాలు —స్థూల సూక్ష్మ శరీరాలను సాధన ద్వారా స్వాదీనక్మ్ చేసు కోవాలి. వాటి దుఖాలను వదిలి నప్పుడు, వాటి లోని సత, చిత్, సుఖం స్పష్టమవుతై. ఆ సుఖం పరమాత్మ స్వ రూపమే కాని వేరే కాదు. పరితాపాలు అనేవి శరీరం నుంచి, మనసు నుంచి, బయటికి తొంగి చూసి పొందేవి. ఇవి స్వతహాగా జీవుడికి వుండవు. మనసు వాటిని వదిలేస్తే, మనసు అనేదే వుండదు. మనసుకు ఆధార మైన పరమ శాంతమైన బ్రహ్మమే దర్శనం అవుతుంది. మోక్షానికి కారణమైన ప్రతిదీ గురు కృప వల్లనే సాధ్యం. ఆ గురువు పరమ గురువు అయి వుండాలి. పరమ హంస లా వుండాలి. అప్పుడే తరుణోపాయం లభిస్తుంది. తాను పరమ హంస కనుక అందరు, పరమ హంస స్థితి ని పొందాలని ప్రతి కీర్తన లోను ఎరుక గా తెలిపారు పరమ హంస అయిన సదాశివ బ్రహ్మేంద్ర యతీశ్వరులు.

రెండవ కీర్తన ——

**o2 —-పల్లవి —-ఖేలతి పిండాండే భగవాన్ –ఖేలతి పిండా స్డే ||**

**చరణాలు —01 —-హంసః సోహం హంస సోహం –హంస సోహం సోహమితి –పరమాత్మాహం పరిపూర్ణోహం —బ్రహ్మివాహం బ్రహ్మేతి ||**

**02 –త్వక్చాక్షు శృతి జిహ్వ ఘ్రానే –పంచ విధ ప్రానోప స్థానే –శబ్ద స్పర్శ రసాదిక మాత్రే —సాత్విక రాజస తామస మిశ్రే ||**

**03 –బుద్ధి మనస్చిట్టా హన్కారే –భూజస తేజో గగన సమీరే –పరమ హంస రూపేన విహార్తా –బ్రహ్మ విష్ణు రుద్రాది క కర్తా ||**

భావం ——”శరీరం లోనే భగవంతుడు ఆడుతున్నాడు. హంసను నేనే. నేనే హంసను. పరమాత్మను. పరిపూర్ణ బ్రహ్మం నేనే. పంచేంద్రియ గోళాలలో, పంచ ప్రాణ స్థానాలలో, శబ్ద, స్పర్శ తన్మాత్రలలో, త్రిగుణాల కలయిక లో, శరీరం లో క్రీడా ఖేలనం చేస్తున్నారు పరమాత్మ.నాలుగు అంతః కరనలలో, పంచ భూతాలలో, పరమ హంస లా విహరిస్తూ, త్రిమూర్తుల సృష్టి కర్త గా శరీరం లో ఆడి, పాడి, రమిస్తున్నాడు ”

విశేషం —ప్రపంచం అనేది దేశ, కాలాలో కదుల్తుంది. ఇది పరమాత్మ పరిపాలన వల్లనే సాధ్యం. ప్రపంచాన్ని చూసే పరికరాలు అన్నీ ఆయన స్వరూపాలే. వేరు కాదు. సృష్టి, స్థితి, లయలుజీవుని అనుభవాలే. వాటిని అనుభవానికి తెచ్చేదీ పరమాత్మ ఏ.

మూడవ కీర్తన లోకి చేరు కుందాం

**03 —పల్లవి —-ఆనంద పూర్ణ బోదోహం—సతత మానంద పూర్ణ బోదోహం ||**

**చరణాలు —-01 —ప్రత్యగద్వైత సారోహం –సకల శ్రుత్యంత తలత్ర విదితోహం,అమ్రుతోహం ||**

**మత్యనంతర భావితోహం –విదిత నిత్య నిష్కల రూప నిర్గుణ పదోహం ||**

**02 —సాక్షి చిన్మాత్ర గాత్రోహం -పరమ మోక్ష సామ్రాజ్యాదిపోహం**

**పక్ష పాతాతి దూరోహం -అనవధిక సుఖ సాగరోహం ||**

**03 —స్వప్రకాశైక సారోహం –సదహమప్రపంచాత్మ భావోహం అభయోహం**

**చిదహమప్రమెయాఅఖ్య మూర్తి రేవాహం |**

భావం ——ఈ కీర్తన కూడా ఆత్మాను భూతి పొందిన ఒక సిద్ధ పురుషుని ఆనంద మయ, చిన్మయ, చిద్రూప అద్భుత వర్ణన. ప్రాపంచిక కొలతలకు పరిమానాలకు అందని ఉన్నతోన్నత, ఉత్తమోత్తమ స్థితి అది. వేదం చదవక్కర లేదు. ఉపనిషత్తులు అధ్యనం చెయ్యక్కర లేదు, శాస్త్రాల సారం పిండ నక్కర లేదు. ఈ కీర్తన చదివినా, విన్నా, అర్ధం చేసు కున్నా అంతా బ్రహ్మ జ్ఞానమే. హాయిగా సంగీతం తో మేళవించి, అన్నీ రంగరించి అందించిన రస గుళిక.

నాక్గవ కీర్తన లోకి చేరుకుందాం

**04 —పల్లవి —-ఆనంద పూర్ణ బోదోహం –సచ్చిదానంద పూర్ణ బోదోహం ||**

**చరణాలు —-01 –సర్వాత్మ చరోహం –పరి నిర్వాన నిర్గుణ నిఖిలాత్మ కోహం –**

**గీర్వాణ వర్యానతోహం –కామ గర్వ నిర్వాపణ ధీరతోహం ||**

**02 –సత్య స్వరూప పరోహం –వర శ్రుత్యంత బోధిత సుఖ సాగరోహం**

**ప్రత్యగాభిన్న పరోహం –శుద్ధ మంతు రహిత మాయా తీతోహం |**

**03 –అవబోధ రస సాగరోహం –వ్యోమ పవనాది పంచాభూతాతి దూరోహం**

**కవి వర సంసేవ్యోహం -ఘోర భవ సింధు తారక పరమసూక్ష్మోహం ||**

**04 –బాధిత గుణ కలనోహం –బుద్ధ శోదిత సమరస పరమాత్మాహం**

**సాధన జాతాతీతోహం –నిరుపాధిక నిస్సీమ భూమానందోహం ||**

**05 –నిరవయవోహం అజోహం –నిరుపమ మహిమని నిహిత మహితోహం**

**నిరవధి సత్త్వఘనోహం –ధీర పరమ శివేంద్ర శ్రీ గురు బోధి తోహం ||**

భావం ——నేను ఎవర్ని ?అన్న దానికి సమాధానమే ఈ కీర్తన. "సచ్చిదానంద పూర్ణ చైతన్యాన్ని నేను. అందరి లోని ఆత్మ మూర్తిని నేను. మోక్ష స్వరూపుడైన నిర్గునున్ని. దేవతలు నన్ను అర్చిస్తారు. కామ గర్వాప హారిని. సత్య సుఖ స్వరూపుడిని. శాస్త్రాల చేత బోధింప బడిన వాడిని. భేదాలు లేని ప్రత్యక రూప మాయా తీతున్ని. జ్ఞానంద స్వరూపున్ని. పంచ భూతాలకు అతీతున్ని. రుషి గణ పూజితున్ని. ఘోర భవ సముద్రాన్ని దాటించే పరమాత్మను. గుణ క్రీడా లో ప్రబోధం చేత శుద్ధీ చేయబడిన సమ రస పరమాత్మను. సాధనాతీత మైన, ఉపాధి పరిధికి అతీత మైన పరమానందాన్ని నేను. అవయవ రహితున్ని. పుట్టుక లేని వాడిని. నిరుపమ మహిమ లో నిలిచి న గొప్పదనాన్ని నేనే. నిరవధిక శుద్ధ సత్యాన్ని. శ్రీ గురు పరమ శివేంద్ర స్వామి చేత బోధితున్ని అయిన వాడిని నేనే "

వేదాలలోనిరుక్కులు చదువుతున్న అనుభూతి లభిస్తుంది ఈ కీర్తనలో అంతా బ్రహ్మ మయమే. నేనే బ్రహ్మని"అహమాత్మా పరబ్రహ్మ "సోహం "బ్రహ్మ ఇవాహం "అనే మహా వాక్య రహస్యాలన్నీ గుది గుచ్చి, హాయిగా పాడుకుంటూ మనసారా అనుభవిస్తూ,ఆనంద పారవశ్యం కలిగించే రచన బ్రహ్మేన్ద్రులది. మాటల లో వర్ణించటం కష్టం. అనుభవించాలి తరించాలి ఆత్మాను భూతి పొందిన మహాత్ముని అనుభవమే ఈ కీర్తన. ఈ అనుభూతికి కారణమయిన శ్రీ గురువు పరమశివేంద్ర స్వామిని రెండో సారి స్మరించి సంప్రదాయాన్ని అవిచ్చిన్నం గా కాపాడారు శిష్యులైన సదా శివ బ్రహ్మేన్ద్రులు

ఇప్పటికి "బ్రహ్మానందం "పూర్తిగా అనుభవిన్చాము.

బ్రహ్మేన్ద్రుల కీర్తనల లో ఇరవై నాల్గవది, చివరిది అయిన ది "గంగా నది పైకీర్తన . ఆ పవిత్ర నదీమ తల్లి పావన తోయాన్ని తాగి మొక్షానందాన్ని పొందుదాం

**24 —పల్లవి —-జయ తుంగ తరంగే గంగే –జయ తుంగ తరంగే ||**

**చరణాలు —01 –కమల భవాండ కరండ పవిత్రే —బహు విధ బంధచ్ఛేద లవిత్రే ||**

**02 –దూరీకృత జన పాప సమూహే –పూరిత కచ్ఛ స గుచ్ఛ గ్రాహే ||**

**03 –పరమ హంస గురు భణిత చరిత్రే –బ్రహ్మ విష్ణు శంకర నుతి పాత్రే ||**

భావం ——-"ఉత్తుంగ తరంగ విరాజిత గంగా మాతా !నీకు జయం. బ్రహ్మాండాన్ని పవిత్రం చేస్తూ, అనేక బంధనాలను విచ్చేదం చేస్తూ, వుండే నీకు జయమగు గాక. ప్రజల పాపాలను ప్రక్షాళన చేస్తూ, తాబెళ్ళను (కచ్ఛప ),మొసళ్ళను (గుచ్ఛ )నిండుగా కలిగిన వో నదీమ తల్లీ నీకు జయం. పరమ హంస పరివ్రాజక గురు పరంపర చేత కీర్తింప బడిన గంగా మాయీ నీకు జయం. త్రిమూర్తుల స్తుతికి పాత్రమైన పవిత్ర గంగా దేవీ !నీకు సర్వదా జయము "

విశేషం —-భారతీయ సాహిత్యం లో గంగానదికి ప్రత్యేక స్థానం వుంది. ఆ నదీమ తల్లి త్రిపద గామి అంటే స్వర్గ మర్త్య, పాతాళాలలో ప్రవహిస్తుంది. భూలోకాన్ని పవిత్రం చేయ టానికి దివి నుండి భువికి దిగిన భాగీరధి ఆమె. ఆమె పవిత్ర తీరాలలో నాగరకత విస్తరించింది. భూములను సస్య శ్యామలం చేసి, బంగారు పంటలు పండించే అమృత జలాలను అందించే నదీ మాత. గంగా స్నానం పవిత్రం. మోక్ష ప్రదం. అంతటి శుద్ధ జలం ప్రపంచం లో లేనే లేదు. ఎన్నో పరీక్షలకు తట్టు కుంది. ఆమె తో సంబంధం లేకుండా రామాయణ, భరత, భాగవత కధ లేదు. ఆ పవిత్ర జలం స్వచ్చం, పవిత్రం, నిర్మలం. గంగా మాయి లేక పోతే భారతీయ లౌకిక, ఆధ్యాత్మిక జీవనమే లేదని అందరి భావన. ఆ గంగా మాతను స్తుతిస్తూ అందుకే సదాశివ బ్రహ్మేన్ద్రులు జయ గానాన్ని వినిపించారు. ఆ జయం ఆమెకే కాదు లోకాలన్నిటికీ. ఇదీ ఉదాత్త భారతీయభావన. జయ మంగళం నిత్య శుభ మంగళం.

" శ్రీ సదాశివ బ్రహ్మేంద్ర కీర్తనల లో అద్వైతా మృతం "అనే ఈ నవరత్నాల వ్యాసపరంపరకు ప్రేరణ, పూర్తి ఆధారం "స్వామిని శారదా ప్రియానంద "గారు రచించిన గ్రంధం "సంగీత వేదాంతం ".ఆ స్వామినికి మనసులో సాష్టాంగ ప్రమాణాలు చేస్తూ నా కృతజ్ఞతలను తెలుపు కుంటున్నాను. ఇందులోని విషయ వివరణ అంతా శారదా ప్రియానంద స్వామినిదే నని సవినయం గామనవి చేస్తున్నాను. నన్ను. ఎంతో ప్రభావితం చేసిన రచన ఇది. దీని ని మీకూ అందించాలనే తపన తో ఈ ప్రయత్నం చేశాను.

సంపూర్ణం